# ఆంధ్రమున ప్రబంధ రూపమునొందిన సంస్కృత నాటకములు

## (Sanskrit Drama in the form of Telugu Prabandhas)

*by*

***Dr. C. Rajeswari,*** *M. A. Ph. D.*

Thesis Submitted to the Bangalore University
For the Award of Ph. D. Degree

శ్రీ

# అంకితము

దివాకరాన్వయ దివ్య దీపమై
మతిగుణ సమితికి మంగళనిధియై
చంద్రవతీ శుభసార్థ కాఖ్యయై
అలరు అమ్మకిది అంకితమిత్తును.

రాజేశ్వరి

కళాప్రపూర్ణ డా. దివాకర్ల వేంకటావధాని,
ఎం. ఏ. (ఆనర్సు) పిహెచ్. డి.

# అభిప్రాయము

చి. సౌ. డా. సి. రాజేశ్వరి రచించిన "ఆంధ్రమున ప్రబంధరూపము నొందిన సంస్కృత నాటకములు" అను సిద్ధాంత వ్యాసము నాద్యంతము చదివి యానందించితిని. ఈ సిద్ధాంత వ్యాసము రెండు భాగములుగా విభజింపబడినది. ప్రథమ భాగమున నాటకోత్పత్తి, ఆంధ్రమున నాటకరచన ఆలస్యముగా జరుగుటకు కారణములు, శ్రవ్య కావ్యములలో నాటకరీతులు మున్నగు విషయ ములు నామె చక్కగా వివరించినది. ఈ భాగము ప్రధానవిషయమున కుపోద్ఘాత ప్రాయ మైనది.

రెండవ భాగమునం దాంధ్రమున శ్రవ్య కావ్యరూపము నొందిన ఆఱు నాటకములకు గూర్చి పరిశీలనము జరుపబడినది. ఇందా సంస్కృత నాటకము లను గూర్చియు వానికి ప్రబంధ రూపములైన ఆంధ్ర కావ్యములను గూర్చియు రచయిత్రి కావించిన సమీక్ష పరిశోధనాత్మకమై ఆమె కుభయభాషలయందును గల పరిచయమును, ఆమె కావించిన పరిశ్రమను చెప్పక చెప్పుచున్నది. ఆంధ్రీకరణ విధానమును, రసపాత్రపోషణాదికమును ఆమె వివరించిన తీరు ప్రశంసాపాత్రముగా నున్నది. మురారి అనర్ఘ రాఘవ మత్యంత ప్రౌఢమైనది. ఆంధ్రీకరణము కూడ ప్రౌఢతలో మూలమున కెందును తీసిపోదు. ప్రబోధ చంద్రోదయము వేదాంతతత్త్వ ప్రతిపాదకమైనట్టిది. అందలి విషయము కూడ సామాన్యులకు సుగమమైనది కాదు. ఈ రెండు గ్రంథములను ఆమె పరిశీ లించిన విధానము ప్రత్యేకముగా గణింపదగి యున్నది. ప్రభావతీ ప్రద్యుమ్న మున రవివర్మ భూపాలుని నాటకము ప్రభావ మున్నదని కొందఱు విమర్శకులు వెల్లడించిన అభిప్రాయము నామె పూర్తిగా నంగీకరించి యుండలేదు. ఆధునికు లైన శ్రీ శిష్టా రామకృష్ణ శాస్త్రిగారు భాసుని సుప్రసిద్ధ నాటకముల ననుసరించి రచించిన కావ్యములను కూడ నామె స్పృశించినది.

ఆమె వచనశైలి సరళమును, సుబోధమును, శక్తిమంతమును, నిర్దుష్ట మునై యలరారుచున్నది. అవసరమైన చోట్లనెల్ల ఆమె సముచితమైన యుదా హరణముల నొసంగినది. ఆమె యింకను పరిశ్రమచేసి సద్విమర్శల ప్రకటించు శక్తి సామర్థ్యమును అవకాశమును భగవంతు డొసంగుగాక యని ఆశీర్వ దించుచున్నాను.

దివాకర్ల వేంకటావధాని

# మనవి

పి హెచ్. డి. పట్టము కొఱకై బెంగుళూరు విశ్వవిద్యాలయమున పరిశోధన జరుపుటకు నా కవకాశ మొసంగిన వారు గురుతుల్యులు డా॥ తంగిరాల వెంకట సుబ్బారావుగారు. సాహిత్య విశారదులు, బహుభాషా కోవిదులునైన డా॥ సుబ్బారావు గారి పర్యవేక్షణమున పరిశోధనము సాగించుట నా అదృష్టము. ఈ విషయమున వారొసంగిన సహకార, ప్రోత్సాహములు చిరస్మరణీయములు.

ఆంధ్ర వాఙ్మయము అనువాదములతోడనే ఆరంభమైనది. ప్రాచీనాంధ్ర కవులు సంస్కృతము నందలి పెక్కు కావ్య విశేషములను తెనుగున కనువదించుటకు యత్నించి కృతార్థులైరి. నాటక మొక విశిష్ట సాహిత్య ప్రక్రియ. సంస్కృత నాటకముల ప్రాశస్త్య మనన్యసాధారణమైనది. వానిలో ప్రసిద్ధములైన కొన్నింటిని తెలుగు కవులు అనుసరించుటలో చూపిన వైలక్షణ్యము ప్రత్యేకముగ గమనించదగిన అంశము.

ఆధునికాంధ్ర విద్వద్వర్యులలో నొకరగు మత్పితృపాదులు డా॥ దివాకర్ల వేంకటావధానిగారు నా పరిశోధనాభిలాష నెఱింగి "ప్రబంధ (కావ్య) రూపము నొందిన సంస్కృత నాటకములు" అను నీ అంశము పరిశోధన కనువుగ నుండునని సూచించిరి. నేను బి. ఏ. లో కూడ సంస్కృతము నైచ్ఛికముగా గ్రహించి యందధికగుణములతో కృతార్థురాలనగుటయే యందుకు కారణము. సంస్కృత నాటకములందు నా కవగతములు కాని భాగములను బోధించి వారీ సిద్ధాంత వ్యాస రచనమున నాకు తగిన సూచన లొసంగియుండిరి. వారికి భక్తితో నా కృతజ్ఞతాంజలులు సమర్పించు చున్నాను.

నేను గావించిన పరిశోధనమునకు ఆర్థిక సాహాయ్యము గావించిన విశ్వవిద్యాలయ సహాయ ఆయోగమునకు (University Grants Commission) నా కృతజ్ఞతలు.

నా పరిశోధన విషయమున కోరినపుడెల్ల తమ అమూల్యములగు అభిప్రాయము లొసంగి తోడ్పడిన డా॥ విష్ణుభట్ల విశ్వనాథ శాస్త్రిగారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

సంస్కృత నాటకములను పూర్తిగా ననువదించుటకో అందలి భాగము లను శ్లోకములను అనువదించుటకో యత్నించిన ఆయా ప్రధాన కావ్యములను గూర్చి నేను విస్తరించి వ్రాసితిని. కొంద ఱాంధ్ర కవులు సమానవస్తుకములైన కావ్యములను వ్రాయునప్పుడు సంస్కృతనాటకము లందలి కొన్ని శ్లోకములను మాత్ర మనుసరించి యుండిరి. అట్టి వానినిగూర్చి సంగ్రహముగా వ్రాసి యుంటిని. క్రీడాభిరామమునకు మూలమైన సంస్కృత ప్రేమాభిరామము లభింపలేదు. అందుచే దానిని మూలముతో పోల్చి పరిశీలించుట కవకాశము లేకపోయినది. పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నమున రవివర్మ భూపాలుని ప్రద్యుమ్నాభ్యుదయ నాటకము నందలి ఛాయలు కొన్ని యున్నవని విమర్శకుల తలంపు. అందుచే నా నాటకమును ప్రభావతీ ప్రద్యుమ్నమును గూడ నిందు సంగ్రహముగా పరిశీలించి యుంటిని. దక్షిణాంధ్ర యుగమునందుండిన వెలగపూడి కృష్ణయ్య యను కవి గౌశికాశాస్త్రము, లానుమద్విజయము అను వానితో పాటు మాలతీ మాధవమును కూడ రచించెనని వాఙ్మయ చరిత్రకారులు చెప్పుచున్నారు. ఈ మాలతీ మాధవమున కవి భవభూతి రచిత నాటకము ననుసరించి యుండెనని యనుమానించుట కవకాశమున్నది. కాని యా గ్రంథము లిఖితప్రతి కూడ నిప్పుడు లభించుటలేదు. అందుచే దానినిగూర్చి యేమి వ్రాయుటకును వీలు కలుగలేదు.

ఈ సిద్ధాంత వ్యాసమునందలి ప్రథమభాగ ముపోద్ఘాతప్రాయమైనది. తెలుగున నాటకము లాలస్యముగా నవతరించుటకు కారణములు మున్నగు విషయములందు వివరించితిని. సంస్కృత నాటకములను వాని ననుసరించి వ్రాయబడిన తెలుగు కావ్యములను పెక్కుమార్లు చదివి మూడేండ్లు శ్రమించి యీ సిద్ధాంత వ్యాసమును రచించితిని. ఇందు గుణలేశమేమైన నున్న నది మా గురువర్యుల ఆశీర్వాదములకు ఫలితము.

రా జే శ్వ రి

# ప్రథమ భాగము

# విషయ సూచిక



# ద్వితీయ భాగము

ఆంధ్రమున ప్రబంధరూపము నొందిన సంస్కృత నాటకములు

# 1. ప్రబంధ నాటకములు-వానియందలి సామ్య భేదములు

ప్రబంధము : ప్రబంధ శబ్దమునకు ప్రకృష్టమైన బంధము (చిక్కని చక్కని కూర్పు) గల రచన యని అర్థము. 'ప్రబధ్యతే ఇతి ప్రబంధః' చక్కగా కూర్పబడునది (రచింపబడునది) కావున ప్రబంధమని కొందఱు దానికి వ్యుత్పత్తి చెప్పియుండిరి (వాచస్పత్యము). సంస్కృతమున నిది కావ్య సామాన్య వాచి. కాళిదాసు మాళవికాగ్నిమిత్ర ప్రస్తావనలో "ప్రథిత యశసాం భాస సౌమిల్లక కవి పుత్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య క్రియాయాం కథం పరిషదో బహుమానః" అని ప్రబంధ శబ్దమును రూపక పరముగా వాడియుండెను. బాణుడు కాదంబరిలో శూద్రకుని గూర్చి వ్రాయుచు నత డొక్కొక్కప్పు డాబద్ధవిదగ్ధ మండలుడై కావ్య ప్రబంధ రచనచే కాలము గడుపుచుండెనని వ్రాసియుండెను (కదాచి దాబద్ధమండలః కావ్య ప్రబంధ రచనేన....దివస మనయత్). ఇచట కావ్య ప్రబంధ శబ్దములు రెండు నొక్కచోటనే వాడబడినవి. అందుచే నవి భిన్నార్థకములనియే యతని యభిప్రాయము. వ్యాఖ్యాత "కావ్యం=పూర్వవ్యావర్ణిత స్వరూపమ్. ప్రబంధాః =కథాః, తేషాం రచనేన=గ్రథనేన" అని కావ్యమనగా పూర్వ వ్యావర్ణిత స్వరూపము (నిపుణకవి కర్మ) అనియు, ప్రబంధమనగా కథ అనియు నర్థము వ్రాసియుండెను. కథ అనగా గద్య కావ్యభేదముగా వాడినట్లు తెలియుచున్నది. అతని తరువాత కాదంబరిని పూర్తిచేసిన అతని కుమారుడు భూషణభట్టు, తన తండ్రి మరణింపగా, నతని వాక్కుతోగూడ విచ్ఛేదమొందిన కథా ప్రబంధమును గాంచి పండితులు పొందిన దుఃఖము నరసి, తాను దానిని పూర్తిచేయుటకు పూనెననియు, కవిత్వ దర్పముచే గాదనియు వ్రాయుచు కాదంబరిని కథా ప్రబంధమని పేర్కొనెను. భామహుడు, దండి, రుద్రటుడు ము॥ నాలంకారికులు ప్రబంధ శబ్దమును కావ్యమను అర్థముననే వాడియుండిరి. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోక తృతీయోద్యోతమున

ప్రసిద్ధేఽపి ప్రబంధానాం నానారస నిబంధనే
ఏకో రసోఽంగీ కర్తవ్య స్తేషా ముత్కర్ష మిచ్ఛతా॥
కారిక 21 ఉద్యో-3

అని తెల్పెను. ఇచట ప్రబంధేషు అనగా మహాకావ్యాదిషు, నాటకాదిషు వా అని వృత్తి తెల్పుచున్నది. ఆనందవర్ధనుడే మరొకచోట 'యథా కాళిదాస ప్రబంధేషు' అని కాళిదాసుని కావ్యములను ప్రబంధములని పేర్కొనెను. భోజుడు చంపూ రామాయణమున

"గద్యానుబంధ రస మిశ్రిత పద్యసూక్తిః
హృద్యాహి వాద్య కలయా కలితేవ గీతిః
తస్మా ద్దధాతు కవిమార్గవిదాం సుఖాయ
చంపూ ప్రబంధ రచనా రసనా మదీయా" బాల. శ్లో. 126

అని చంపూ కావ్యమును ప్రబంధమని నుడివెను. జయదేవ మహాకవి రాగ తాళాది యుతములైన అష్టపదులతో గూడిన గీత గోవిందమును

"శ్రీ వాసుదేవ రతి కేళి కథా సమేత
మేతం కరోతి జయదేవ కవిః ప్రబంధమ్"

అని ప్రబంధముగా నుగ్గడించెను. శారదా తనయుడు నాట్యాది లక్షణములను వివరించుచు, తాను రచించిన భావ ప్రకాశమను శాస్త్రగ్రంథమునకు "అయం ప్రబంధః కథితః శారదాయాః ప్రసాదతః" అని ప్రబంధమను పేరొసంగెను. విద్యానాథుడు "ప్రతాపరుద్రదేవస్య గుణా నాశ్రిత్య నిర్మితః. అలంకార ప్రబంధోయం సంతః కర్ణోత్సవోస్తు వః" (అవతారిక 9వ శ్లో) అని ప్రతాప రుద్రీయము నలంకార ప్రబంధ మనెను. ఆతడు ప్రబంధ పదమును న్యాయ వేదాంతాది శాస్త్ర గ్రంథ పరముగాను, సామాన్య కావ్యపరముగను గూడ వాడియుండెను. నీలకంఠ దీక్షితుడు శివలీలార్ణవమున తమ బంధువైన అప్పయ్య దీక్షితుడు 'ప్రబంధాన్ శతం వ్యధా దప్పయ దీక్షితేంద్రః' అని నూఱు ప్రబంధములను రచించెనని చెప్పియుండెను. ఈ నూటింటిలో కావ్యములు, వ్యాఖ్యలు, శతకములు, అలంకార గ్రంథములు కూడ నున్నవి. ఆనందవర్ధనుడు

"ప్రబంధేచాంగీ రస ఏక ఏవ ఉపనిబధ్యమానోర్థ విశేష లాభం ఛాయాతిశయం పుష్ణాతి....యథా రామాయణే, యథా మహాభారతే" అని రామాయణ మహాభారతములను ప్రబంధములుగా పరిగణించెను. రామాయణ వ్యాఖ్యానమున గోవిందరాజు సీతను ప్రబంధ నాయిక అనియు రాముని ప్రబంధ నాయకుడనియు వ్రాక్కుచ్చెను. మల్లినాథుడు, రఘువంశమునందలి "తం సంతః శ్రోతుమర్హన్తి" అను శ్లోకమునకు వ్యాఖ్య వ్రాయుచు "తం రఘువంశాఖ్య ప్రబంధమ్" అని రఘువంశమును ప్రబంధముగా పేర్కొనెను. క్రీ. శే. 16వ శతాబ్ది యందలి ఉత్ప్రేక్షా వల్లభుడు తన భిక్షాటన కావ్యమును, "తదిహ ప్రబంధే శ్రద్ధా న కస్య యది సూక్తి వినోద శీలః" అని ప్రబంధముగా పేర్కొనెను. మహిష శతకమును రచించిన, వాంఛేశ్వరుడు, "శృత్వైతన్మహిష ప్రబంధమిహ యే భూపా గుణగ్రాహిణః" అని తన శతకము నంతను ప్రబంధ మనుటయే కాక "కంచిత్ప్రశ్వధమంలులాయ విగుణం కర్తుం ప్రబంధాన్ శతమ్" అని అందలి వంద శ్లోకములనుగూడ వంద ప్రబంధములనెను. ఆనందవర్ధనుడు "యథాహ్యమరుకస్య కవేర్ముక్తాః శృంగార రసస్యందినః ప్రబంధాయమానాః ప్రసిద్ధా ఏవ" అని అందలి ముక్తక శ్లోకములను ప్రబంధములని వ్రాక్కుచ్చెను. జైనులును, బౌద్ధులును తాము వ్రాసిన గ్రంథములకు ప్రబంధ నామము లిడియుండిరి. ఇందుకు మేరుతుంగుని ప్రబంధ చింతామణి, రాజశేఖరుని ప్రబంధ కోశము అను జైన గ్రంథములును, కుమారపాల ప్రబంధము, పంచమీ ప్రబంధము అను బౌద్ధ ప్రాకృత గ్రంథములును నిదర్శనములు.

అమర నిఘంటువున ప్రబంధ శబ్దమున కర్థము వివరింపబడియుండలేదు. "ప్రబంధ కల్పనా కథా అనుదానిని ప్రబంధః కల్పనా కథా" అని కొందఱు పొరపాటుగా చదువుచుందురు. "ప్రబంధస్య కల్పనాయ కాదంబర్యాదిరుత్పాద్యత్వాత్" అని క్షీరస్వామి వ్యాఖ్యానమున దానిని వివరించెను. ఇట ప్రబంధ కల్పనా అనునది కథా శబ్ద వివరణము. కల్పిత వస్తువుతోగూడిన కాదంబర్యాది రచనల కది అన్వయించును. శబ్ద స్తోమ మహానిధి యందు "ప్రబంధ కల్పనాం స్తోక సత్యాం ప్రాజ్ఞాః కథాం విదు రిత్యుక్తలక్షణాయామల్పసత్యాయాం బహు మిథ్యా కథాయామ్" అని ప్రబంధ కల్పన అనగా నెక్కువ కల్పనయు, తక్కువ సత్యమును గల కథ అని తెల్పబడినది. అప్పే ఆంగ్ల నిఘంటువున ప్రబంధ శబ్దమునకు "A continued or connected

narrative or discourse, Any literary work or Composition, అనియు, ప్రబంధ కల్పనకు "A feigned story, A work of imagination founded on a substratum of fact" అనియు అర్థము లొసంగబడినవి.

ఈ విధముగ సంస్కృతమున కవులును, పండితులును, వ్యాఖ్యాతలును, నిఘంటు కర్తలును, ప్రబంధ శబ్దమును వివిధ రచనా భేదపరముగ వాడియుండిరి. దీనినిబట్టి ప్రబంధమనగా ఏదైన రచన (Any composition or work) అను అర్థము గ్రహింపవచ్చును. అది మహాకావ్యము కావచ్చును, నాటకము కావచ్చును, కథా కావ్యము కావచ్చును, అలంకార గ్రంథము కావచ్చును, గీత కావ్యము కావచ్చును, శతకము కావచ్చును, ముక్తక శ్లోకము కావచ్చును, పురాణము, ఇతిహాసము లేక వేదాంత మీమాంసాశాస్త్ర గ్రంథము కావచ్చును. కావున ఆ పదము గద్య పద్య మిశ్ర గేయ కావ్యపరముగా వాడబడినదని చెప్పవచ్చును.

ఆంధ్ర కవులలో నాదికవి నన్నయ ప్రబంధ శబ్దమును కావ్యపరముగా వాడినట్లు కనబడదు. ఆదిపర్వ తృతీయాశ్వాసమున నతడు వ్యాసుని భారతమును గూర్చి చెప్పుచు నది సత్యవాక్ప్రబంధ శత సహస్ర శ్లోక సంఖ్యమైనదని చెప్పియుండెను. ఇచట ప్రబంధమనగా కూర్పను అర్థమునే చెప్పవలయును. నన్నెచోడుడు కుమార సంభవమున "విస్తరించెద ప్రబంధము సద్రసబంధురంబుగాన్" (1-48) అని దానిని ప్రబంధమనియే పేర్కొనెను. ఆంధ్ర కవులలో ప్రబంధ శబ్దమును కావ్యపరముగా వాడిన ప్రథము డీతడే. తిక్కన సోమయాజి

కం. "అని రచనా కౌతుకమున మన
మలరగ నీ ప్రబంధ మండలి కధినా
థునిగా నే పురుషుని జే
ర్కొను వాడనో యను తలంపు గూరిన మదితోన్"
విరా. ప. 1.8

అని తాను రచించు పదునేను పర్వములను ప్రబంధమండలి అని పేర్కొనెను. అందలి ఒక్కొక్క పర్వ మొక్కొక్క ప్రబంధమని అతని యభిప్రాయము.

తరువాత వచనమున నతఁడు "ఈదృశంబులగు పుణ్య ప్రబంధంబులు దేవ సన్నిధిం బ్రశంసింపుటయు ఆరాధన విశేషంబగుటం జేసి" (విరా. ప. 81) యని ప్రబంధ శబ్దమును మరల వాడెను. దీనికి పైని గల పద్యమున "పద్యముల గద్యముల రచియించెదం గృతుల్" అని యుండుటచే నిట ప్రబంధ శబ్దమును కృతి (కావ్య) పరముగా గూడ నర్థము చేసికొనవచ్చును. ఈదృశంబులగు పుణ్య ప్రబంధములనగా నిట్టి పవిత్ర కావ్యములని భావము. నిర్వచనోత్తర రామాయణమున, తిక్కన, రాముఁడు కుశలవులు గాన మొనరించుచుండఁగా "మీరెవ్వరి వారలు ప్రబంధ మే మునికృతము" అని అడిగిన సందర్భమునందును (నిర్వ. రా. 10-123) రామాయణమును ప్రబంధమని పేర్కొనియుండును. కేతన దశకుమార చరితమును, చంపూ కావ్యముగా రచింప బూనితినని తెల్పి "తత్ప్రబంధ ముఖ మండనముగా నమ్మహాత్ముని వంశావతార మభివర్ణించెదనని, దానిని ప్రబంధమని పేర్కొనెను. మఱియు, "సరస కవీంద్రుల సత్ప్రబంధము లొప్పఁగొను నను టధిక కీర్తనకు దెరువ"ను సీస పాదమున తిక్కన సరస కవుల ప్రబంధములు గ్రహించునని వ్రాసెను. అతఁడు గ్రహించిన కృతి దశకుమార చరిత మొక్కటే. కావున అతఁడు దానినే సత్ప్రబంధమని చెప్పియుండును. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రయందు దీక్షాప్రకరణము మొదట "బసవ పురాణ ప్రబంధంబు నందు ప్రథిత పురాతన భక్త గణానుకథనంబు లితిహాస ఘటన గూర్చితివి" అనియు—"బసవ పురాణ ప్రబంధమన్ పేర" అనియు బసవపురాణమును ప్రబంధమని వర్ణించినాఁడు. ఆ దీక్షా ప్రకరణమునందే చివర నతఁడు

పండితారాధ్య ప్రబంధ నిస్తార, పండితారాధ్య ప్రబంధ విస్తార
పండితారాధ్య ప్రబంధ శృంగార, పండితారాధ్య ప్రబంధ ప్రపూర

ఇత్యాదిగా పెక్కుసార్లు పండితారాధ్య చరిత్రను ప్రబంధ నామముతో పేర్కొనెను. మఱియు "ఆరూఢ గద్య పద్యాది ప్రబంధ పూరిత సంస్కృత భూయిష్ఠ రచన, మానుగా సర్వసామాన్యంబు గామి" "అనుచో గద్యపద్యాది రచనలను, ప్రబంధములని వ్రాక్రుచ్చి "పటు గద్య పద్య సామ్యముగ కావ్య కళా ప్రౌఢి గల్పింతు ద్విపద కావ్యంబు" నని తన రచన గద్యపద్య ప్రబంధ తుల్యమైనదని సూచించెను. ఎఱ్ఱన నృసింహ పురాణమును 'ప్రబంధ' 'మహా

ప్రబంధ' శబ్దములతో పలుమార్లు పేర్కొనియుండెను. అతనికి ప్రబంధ పర మేశ్వరుడను బిరుదము కూడ కలదు. ఇచ్చట ప్రబంధ శబ్దమునకు సామాన్య ముగా కావ్యమను నర్థమే చెప్పుట యుచితము. పరమేశ్వర శబ్దము ఔత్కృష్ట్య సూచకము. ప్రబంధ పరమేశ్వరుడనగా కావ్యరచనయందు పరమ ప్రవీణుడని భావము. కావ్యాలంకార చూడామణి కర్తయైన విన్నకోట పెద్దన ప్రబంధ శబ్ద మును బహు పర్యాయములు ప్రయోగించియుండెను.

కం. "సుఘటిత పదార్థ భావా
లఘుతర రసవత్ప్రబంధలంపటుఁ బతి భూ
షఘవుడని నుతి యొనర్తురు" 2.141

"పరిణీత రాగ రసములఁ
బరి కల్పిత గాదు సత్ప్రబంధములందున్. (3.91)

"నగర ముఖ్యాద్యష్టదశ వర్ణనల చేత
బరగు నదియును భవ్య ప్రబంధమనగ. (3.91)

గజ హయ రథ సూచితమగు
విజయమ్మున నుబ్బి నడచు విశ్రుత వివిధ
ధ్వజిని వినుతించు టెప్పుడు
భజనీయము సుకవి సత్ప్రబంధములందున్. 3.125

అతడు తృతీయోల్లాసమున నాయికా నాయక లక్షణమును, ప్రబంధ లక్షణోదా హరణములను వివరించియుండెను. తెలుగున ప్రబంధ శబ్దమును వాడిన మొదటి లాక్షణికు డితడే. చతుర్థోల్లాసమున నతడు ముక్తకాది చాటు ప్రబంధములను గూర్చియు, నుదాహరణ ప్రబంధమును గూర్చియు, బిరుదావళీ ముఖ్య పృథుల ప్రబంధములను గూర్చియు చెప్పియుండెను. అతడు ప్రబంధములందుండవలసిన అష్టాదశ వర్ణనములనుగూడ వివరించెను. కేయూరబాహు చరిత్రమున కృతి పతియైన గుండయామాత్యుడు మంచనను కృతి రచింపుమని కోరుచు, నతని కావ్య రచనా దక్షతను ప్రశంసించి, "కర్ణ సౌఖ్యావహమై ప్రబంధ, రచనా శ్రయ మయ్యెడు మార్గ మేర్పడన్"

స్థాయి రసము శృంగారం
బై యలవడఁ గథలు నీతులై యెడనెడ రాఁ
గేయూరబాహు చరితము
సేయుము నీ వట్టి కావ్యశిల్పము మెఱయన్" (1.11)

అని చెప్పినట్లు కాదు. ఇందు ప్రబంధ మార్గము ననుసరించి శృంగారము స్థాయి రసముగా నుండునట్లు రచింపుమని కోరుట గమనింప దగియున్నది. శ్రీనాథుడు శృంగార నైషధమున కావ్యప్రబంధ శబ్దములను రెంటిని వాడెను. కాని తన ఆంధ్రీకరణమును గూర్చి చెప్పినప్పుడు ప్రబంధ శబ్దమునే ఎక్కువగా ప్రయోగించెను. అతడు కృత్యారంభమున,

"నవరస బంధురంబుగా నొక్క ప్రబంధంబు నిర్మింపఁదలచి కౌతూహలాధీన మానసుండనై తన్మహా ప్రబంధ ప్రారంభమునకుం దగిన పుణ్యశ్లోక పురాతన మహారాజ చరిత్రం బెయ్యది యొకో యని వితర్కించు సమయంబున" అని తాను ప్రబంధము వ్రాయ నుత్సహించుచున్నట్లే చెప్పెను. తరువాత మామిడి సింగన్న తన్ను "నాకు నొక్క ప్రబంధము పుణ్యశ్లోక పురాతన రాజర్షి చరితానుబంధ బంధురముగా రచింపు"మని కోరినట్లు వ్రాసియుండెను. షష్ఠ్యంతముల తరువాత 'అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన యమ్మహా ప్రబంధంబునకుఁ గథానాయకుండు' అని ప్రబంధ శబ్దమును వాడెను. గద్యలలో మాత్రము నైషధ కావ్యమనియే చెప్పియుండెను. భీమ ఖండమున బెండపూడి అన్నయ మంత్రి తనతో

"నాకుఁ గృతి సేయు మొక ప్రబంధమ్ము నీవు"

"సప్త సంతానములు నాకు సంభవించె
నొక ప్రబంధంబు వెలితిగా సుకృత గరిమ"

"శ్రీ గోదావరీ ఖండమున్
బరిపాటిన్ రచియింపు మంధ్రజగతీభాషా ప్రబంధంబుగన్"

అని చెప్పినట్లు అతడు వ్రాసియుండెను. కాశీ ఖండమున వేమభూపాలుడు శ్రీనాథుని

తే. గీ. నైషధాది మహా ప్రబంధములు పెక్కు
చెప్పినాడవు మాకు నాశ్రితుడ వనఘ
యిపుడు చెప్పఁ దొడంగిన యీ ప్రబంధ
మంకితము సేయు వీరభద్రయ్య పేం"

అని కోరినట్లు చెప్పబడినది. హర విలాసమున నవచి తిప్పయసెట్టి శ్రీనాధుని శైవ ప్రబంధ మొకటి తన పేర నంకితముఁగ నవధరింపుమని అడిగినట్లున్నది. అన్యస్థలములందు గూడ శ్రీనాధుడు హరవిలాసమును ప్రబంధమనియే పేర్కొనెను. క్రీడాభిరామమున జక్కుల వనిత వీరానీకమును గూర్చి పాడునపుడు 'ద్విపద ప్రబంధమున వీరానీకముంబాడె నొక్కెత ప్రత్యేకముగా గుమారకులు శీత్కారంబునం దూలగన్" అని ద్విపద ప్రబంధము పేర్కొనబడినది. జక్కన తన తాత పెద్దయామాత్యు డాంధ్ర కవిత్వమున తద్జ్ఞులు మెచ్చ ప్రబంధము చెప్ప జాలియుండెనని విక్రమార్క చరితమున చెప్పియుండెను. కృతిపతి తన్ను 'విక్రమార్క భూతలపతి యెక్కుడై నెగడెఁ దచ్చరితంబు ప్రబంధ శయ్యగాఁ దెలుగున చెప్పి యీ కృతిపతిత్వము మా కొడగూర్చు నేర్పునన్' అని కోరిన ట్లాతడు వ్రాసెను. అతడు నన్నయను స్తుతించుచు 'వేయి తెఱంగులం బదియు వేవురు పెద్దలు సత్ప్రబంధముల్ పాయక చెప్పిరి' అని తనకు ముందు పలువురు కవులు సత్ప్రబంధములను రచించిరని విశదీకరించెను. మడికి సింగన తాను కూర్చిన సకల నీతి సమ్మతమను సంకలిత నీతి గ్రంథమును ప్రబంధమనియే పేర్కొనెను. కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో ప్రబంధ లక్షణములను విశదముగా వివరించెను (1.37.38). దూబగుంట నారాయణ కవి పంచతంత్రమున కృతిపతి తన్నొక్క ప్రబంధము రచింపుమని కోరినట్లు వ్రాసెను. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు శృంగార శాకుంతలమును మిశ్ర ప్రబంధమని పేర్కొనుటయే కాక

"శృంగారము ముఖ్యంబగు
నంగియు నంగములు దలప నష్టరసములున్
పొంగమగునేని టంకము
బంగారము తోడియొఱ ప్రబంధము నొందున్" (1.25)

అని ప్రబంధమున శృంగార మంగిరసముగను మిగిలిన వంగరసములుగను నుండుట శోభావహమని సూచించెను. అతడు జైమిని భారతమును పురాణమని యొకచో చెప్పినను తరువాత దానిని ప్రబంధమనియే పేర్కొనెను. నంది మల్లయ ఘంట సింగనలు ప్రబోధ చంద్రోదయమున కృతిపతియైన అనంతుని గంగయకు కొందఱు కవులు సంస్కృతమునందలి ప్రబోధచంద్రోదయ నాటక ప్రశస్తిని వరించి దానిని తెనుగు సేయించి అంకితముగా గ్రహింపు మని కోర నతడు వారిని "ఇట్టి ఘన నాటకము దెనుఁగున ప్రబంధశయ్యకు నొనగూర్పగ నేర్చు సుకవు లుర్విం గలరే" యని ప్రశ్నించెననియు, నంత వారు తమ పేర్లు తెలిపిరనియు వ్రాసియుండిరి. ఆశ్వాసాంత గద్యలందు వారు దానిని మహాకావ్యమని వ్రాసియుండిరి. వరాహ పురాణమను నామమునందే పురాణ శబ్దమున్నను, వారు దానిని పెక్కుచోట్ల ప్రబంధమనియే యుగ్గడించిరి.

ఈ విధముగా ప్రబంధయుగమునకు పూర్వముండిన ఆంధ్ర కవులు పలువురు తమ కావ్యములలో ప్రబంధ శబ్దమును వాడుటయేకాక అందు తమ రచనలను ప్రబంధములనియే పేర్కొనియుండిరి. అందు పురాణేతిహాసములు నిర్వచన ద్విపద కావ్యములు, కథాకావ్యములు మున్నగునవెన్నియోయున్నవి వారందరును ప్రబంధమును కావ్య సామాన్య వాచకముగానే పరిగణించినట్లు కనిపించును. కాని దాని నొక ప్రత్యేక ప్రక్రియగా దలచినట్లు తోపదు. అందు లకు వా రొకే రచనను కావ్యమనియు, మహాకావ్యమనియు, ప్రబంధమనియు, పురాణమనియు వివిధ స్థలములందు పేర్కొనియుండుట నిదర్శనము. నన్నె చోడుడు కుమార సంభవమున

"వనజల కేళీ రవిశశి
తనయోదయ మంత్ర గతి రత క్షితిప రణాం
బునిధి మధు ఋతు పురోద్వా
హ నగ విరహ దూత్య వర్ణ నాష్టాదశమున్" (1.44)

పరిపూర్ణంబై దశ ప్రాణంబుల సప్రాణంబైన నవరస భావభరితంబై రమణీయంబైన దివ్య కథారంభంబున కభిముఖుండవై" అని తన కావ్య మష్టా దశ వర్ణన పరిపూర్ణమును, నవరసభావ భరితమును, షట్త్రింశ దలంకారాలం

కృతమును, రమణీయమును అని సూచించెను. ఈ లక్షణములు సంస్కృత కావ్యమునకును అన్వయించును. విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలో ప్రబంధ లక్షణములుగా చెప్పిన లక్షణములు కావ్య లక్షణములకంటె భిన్నములు కావు. అతడును పుర వారాశ్యాదులగు నష్టాదశ వర్ణనలను పేర్కొనెను. మంచన కేయూర బాహు చరిత్రమును, "కర్ణ సౌఖ్యావహమై ప్రబంధ రచనా శ్రయ మయ్యెడు మార్గ మూతగా స్థాయిరసము శృంగారమై యుండ" రచింపు మని కృతిపతి తన్ను కోరినట్లు చెప్పియుండెను. ఇందలి "స్థాయి రసము శృంగారంబై యలవడ" అను లక్షణము తరువాత ప్రబంధ లక్షణములలో నొకటి యగుట గమనింప దగినది. పిల్లలమఱ్ఱి పిన వీరభద్రుడు శృంగార శాకుంతలమున శృంగార రసాంగిత్వమును, అన్యరసాంగత్వమును ప్రసిద్ధ కథా సాహిత్యమును కూడ సూచించెను. కొఱవి గోపరాజు పుర, మధు, జల, లీలాంబుధి, పరిణయాదులగు నష్టాదశ వర్ణనలను పేర్కొని అవి లక్షణాభిరామము లగుటచే నిరసింపవలదని హెచ్చరించెను. ఈ విధముగా వీరు చెప్పిన లక్షణము లందు తరువాతి ప్రబంధములందలి కొన్ని లక్షణములు బీజప్రాయములుగా కనిపించుచున్నను వారు ప్రబంధమును ప్రత్యేక ప్రక్రియగా నూహించిరని చెప్పుటకు అవకాశము లేదు.

రాయల యుగమున మను వసుచరిత్రాదులు రచింపబడిన పిమ్మట నాంధ్రమున ప్రబంధ శబ్దమునకొక్క ప్రత్యేకార్థ మేర్పడినది. అంతకు పూర్వ ముండిన కవులు తమ కృతులను ప్రబంధములని పేర్కొన్నను ప్రబంధ శబ్ద మును వినగనే తెలుగువారికి మనుచరిత్రాదులే స్ఫురించును. నన్నెచోడుని కుమారసంభవమున కొంచె మించుమించుగా ప్రబంధ లక్షణములన్నియు గోచరించినను అతడు ప్రదర్శించిన భాషా మత వైలక్షణ్యముచేతను అతని కావ్యమును పూర్వ లాక్షణికులు కాని కవులు కాని యుదాహరింపక పోవుట చేతను, దానికి ప్రబంధముగా ప్రచారము కలిగియుండలేదు. శ్రీనాథుని శృంగార నైషధము అచ్చముగా ప్రబంధమే. కాని అది స్వతంత్రమైనది కాక సంస్కృత మహాకావ్యమున కనువాదమగుటచే దానికిని ప్రబంధమను ప్రసిద్ధి కలుగలేదు. పినవీరభద్రుని శృంగార శాకుంతలమునందును ప్రబంధ లక్షణము లన్నియు గన్పట్టుచున్నను అందు కాళిదాసుని శాకుంతల నాటకము నందలి శ్లోకములు పెక్కు అనువదింపబడి యుండుటచే కాబోలు దానికిని ప్రబంధమను

ఖ్యాతి రాలేదు అయ్యును ఇవన్నియు తరువాతి ప్రబంధములకు మార్గదర్శక ములై వానికి సౌష్ఠవోపేతమైన రూపు దిద్దిన వనుటకు మాత్రము సందేహింప నవసరము లేదు.

రాయల యుగమున వెలసిన ప్రబంధములనుబట్టి ప్రబంధ లక్షణములను నిశ్చయింపవచ్చును. అందలి వస్తువు ప్రఖ్యాతమై యుండును. భారత రామాయ ణముల నుండియో పురాణముల నుండియో కథను గ్రహించి దానిని ప్రబంధ కవులు వర్ణనాదులచే పెంపొందింతురు. వా రం దేదో విధమున అష్టాదశ వర్ణన లను చొప్పింతురు. పురాణములందువలె నుపాఖ్యానములను జేర్పక, వస్త్వైక్యము సంఘటించుటకు యత్నింతురు. శృంగార రసము నంగిగా చేసి, మిగిలినవాని నంగములుగ వర్ణింతురు. ధీరోదాత్తుని నాయకునిగ నెన్నుకొందురు. వస్తువు నంతను అయిదారాశ్వాసములుగా విభజింతురు. అచ్చటచ్చట వచనములనుగూడ వ్రాసి కావ్యమును చంపువుగా (గద్యపద్యోభయముగా) చేయుదురు. వారి శైలి ప్రౌఢమును శబ్దాలంకార సహితమునై పండితైకవేద్యముగా నుండును. అవతా రికలలో ఇష్టదేవతా పూర్వకవి స్తుతులును, కుకవి నిందను, కృతిరచనా ప్రస్తా వమును, కృతిపతి వంశ వర్ణనమును, షష్ఠ్యంతములను వ్రాయుదురు. కీ. శే. కందుకూరి వీరేశలింగం పంతులుగారు పురాణములనుండి కథను గైకొని స్వకపోల కల్పనములను విశేషముగా చేర్చి పెంచి చెప్పిన కేవలాంధ్రీ కరణలు కాని రచనలు ప్రబంధములని కవుల చరిత్రలో వివరించిరి. 'పురాణేతి హాసములలోని యుపాఖ్యానమును చేపట్టి స్వకపోల కల్పనలచే దానిని పెంపు చేసి, యష్టాదశ వర్ణన లందందు జొప్పించి రసాభివ్యక్తికిని పాత్ర చిత్రణము నకు నెక్కుడు ప్రాధాన్య మొసంగి శబ్దార్థాలంకార సహితముగా సాగించిన రచనమును ప్రబంధ' మందురని శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారి యభిప్రా యము.[2] "పెద్దనాదులు పురాణములనుండి ఇతివృత్తములను గ్రహించి వర్ణ నాదులచే వానిని బెంచి, ధీరోదాత్త నాయకములును, శృంగారరస ప్రధానము లును పంచషాశ్వాస పరిమితమును ఐన కావ్యములను ఆలంకారికమైన శైలిలో వ్రాయుట కారంభించిరి. వానికే ప్రబంధములని పేరు".[3]

రాయల యుగమున రచింపబడిన ప్రబంధములన్నింట పైని చెప్పబడిన లక్షణములన్నియు గోచరింపక పోవచ్చును. ఉదాహరణమునకు మనుచరిత్రా ముక్తమాల్యాదాదులందు వస్త్వైక్యము కొఱవడియున్నది. అందు ప్రధాన

కథతోపాటు కొన్ని యుపకథలు కూడ వ్రాయబడినవి. కళాపూర్ణోదయము నందలి ఇతివృత్తము ఉత్పాద్యము. అందలి నాయిక వేశ్య. ఆముక్తమాల్యద యందలి ప్రధాన రసము శాంతమో, వీరమో యని విమర్శకుల తలంపు. అట్లే కృష్ణరాయ విజయమున శృంగారము కాక వీరమే ప్రధాన రసముగా కన్పించును. ఈవిధముగా కొన్ని యపవాదములు గోచరించినను ప్రధాన స్వరూప స్వభావములందు ప్రబంధము లన్నింట కొంత సాదృశ్యము తేటతెల్ల మగుచునే యుండును. ఒకవిధముగా నాంధ్ర ప్రబంధములందు సంస్కృతమునందలి మహాకావ్యము, చంపువు, నాటకము, నాటిక మున్నగువాని లక్షణము లన్నియు కనిపించును. "సంస్కృత పురాణేతిహాసములనుండి ప్రసిద్ధ కథావస్తువును, నాటకములనుండి శుభాంతతావస్త్వైక్య, సంభాషణ విధాన పాత్ర పోషణాదులను, నాటికలనుండి కన్యానాయికాత్వ స్త్రీ పాత్ర బాహుళ్యములను, మహాకావ్యముల నుండి రసాలంకార వర్ణనాదులను, ఆఖ్యాయికల నుండి ఆశ్వాస విభాగమును, అవతారికల నుండి యిష్టదేవతా గురుస్తుత్యాద్యంశములను చంపూ కావ్యముల నుండి పద్య గద్యోభయ మయత్వమును, భిన్న వృత్త రచనా విధానమును మాలాకారి భిన్న భిన్న వర్ణ పుష్పములవలె స్వీకరించి యేకత్ర మేళవించి కవులు రూపొందించిన ప్రత్యేక రస నిర్భర రచనయే ప్రబంధము. సమస్త విధ సంస్కృత కావ్య సౌందర్యమును సంతరించుకొనిన సరస సాహిత్య ప్రక్రియ ప్రబంధము. సమస్త లక్షణ లక్షితము, సంగ్రహరూప సంగ్రథితము. ఉపదేశ మనోరంజకత్వములు రెండును దీని ఉద్దేశ ప్రయోజనములు.4

నాటకము

దృశ్య కావ్యములకు రూపకములనునది సామాన్య నామము. నటుల యందు రామాదులైన పాత్రల వేష భాషా చేష్టాదు లారోపింపబడును. కావున దాని కా పేరు కల్గినది. దశ విధ రూపకములు ప్రసిద్ధములు. అందు నాటక మనునది రూపకములకెల్ల ప్రకృతియు, సంపూర్ణ లక్షణమునై యుప్పారును. నాటకము నటనా ప్రధానము. ఈ నటనము అభినయముచే దీపించును. ఈ అభినయము, ఆంగిక, వాచిక, సాత్త్విక, ఆహార్య భేదముచే చతుర్విధము.5 "ఈర్ష్య, భయ, క్రోధ, శోకాదులను, రోమాంచ స్తంభా శ్రు కంపాదులచే తెలుపుట సాత్త్వికము. పతాకా హస్తాదికముచే స్వగత పరగతాభిప్రాయములు తెలుపుట ఆంగికము. కావ్య నాటకాదులను కర్ణోచిత రాగాదులతో విస్పష్టముగ

నుచ్చరించుట వాచికము. నాట్యమునకు తగిన వస్త్రాభరణము నలంకరించు కొనుట ఆహార్యము" (ఆంధ్ర దశరూపకము)

భరతముని నాట్యశాస్త్రమున నాట్యమును నిర్వచించుచు, నాట్యము త్రైలోక్య భావానుకరణమని నుడివెను.[6] దశరూపక కర్త నాట్యము అవస్థానుకరణమని పేర్కొనెను. అనగా కావ్యములందు వర్ణింపబడిన ధీరోదాత్తాది నాయకుల అవస్థల అనుకృతి నాట్యమని భావము. అనుకరణము మానవుని సహజ ప్రవృత్తి. ప్రొ. డోనాల్డు క్లయిట్ స్టువర్ట్స "పిల్లల స్వాభావిక క్రీడయే నాటకము"[7] అని పేర్కొనెను. సాధారణముగ పిల్లలు పెద్దల చేష్టల ననుకరింప యత్నింతురు. తాము కోరినది లభింపనపుడు దాని నెట్లైన సాధింపవలెనను తలంపుతో కపటముగ రోదింతురు. ఇట్టి చేష్టలను చూచి అద్దంతయు వట్టి నాటకము అని పేర్కొందుము. నిత్య జీవితమునందలి యిట్టి స్వాభావికములగు సంఘటనలే అభినయమునకు దారితీసినవి. శ్రీ భోలాశంకర్ వ్యాస్ హిందీ దశరూపక భూమికలో "ఈ అనుకరణము వికసిత మానసిక పరిణామము గల్గ మానవునిలో కాక పశుపక్ష్యాదులలో కూడ కానవచ్చునని తెలిపిరి".[8] పాశ్చాత్యాలంకార శిరోమణి యగు అరిస్టాటిల్ సమస్త కళలు అనుకరణాత్మకములే"[9] అని పేర్కొనెను.

భరతుడు నాటకము లోకవృత్తానుకరణము అని నిర్వచించినంతమాత్రమున నాటకము లోకమును తు.చ. తప్పక అనుసరించునట్టిది యని తలంచుట పొరపాటు. కేవలానుకరణమును భరతుడు ప్రతిపాదింపలేదు. ఈ అనుకరణము అభినయసహితముగ నుండవలెనని అతడాదేశించెను.[10] ఈ అభినయమే నాటకమునకు అలౌకికత్వము నాపాదించును. లోకమున శోక కారణములకు పరిస్థితులు శోకమునే కల్పింప అవి నాటకములందు అనుకరణముచే ఆనందము నుత్పాదించును. ఈ సుఖదుఃఖాది సంఘటనలు చతుర్విధాభినయ సహితములైనందున లౌకిక నాయకాదులనుండి కావ్యస్థిత నాయకాదులను వేరుపఱుచుచున్నవి. నాటకము మిక్కిలి సమర్థుడగు నటునిచే నిర్వహింపబడును. అతడు తాను ధరించిన పాత్రావస్థలతో తాదాత్మ్యము నొంది దానిని రంగస్థలమున ప్రకటితము గావించును. తన యందారోపింపబడిన పాత్రముల కాతడు ప్రతిరూపముగా నిలుచును. ఇట్లు అనుష్ఠానరించెడి అనుకరణమున, పాత్రావస్థలు సాధారణ శబ్ద వాచ్యతను వీడి విభావ శబ్ద వాచ్యత నొందును. నాట్యగతములైన ఈ విభావములన్నింటి

వలనను ఆనందమే కలుగును. Hugo నాటకమును గూర్చి వివరించుచు అది ప్రకృతిని ప్రతిబింబింపజేయు దర్పణము వంటిదని చెప్పెను.[11] Scott James నాటకము జీవితముయొక్క కళాత్మక పునర్నిర్మాణమనెను. ఋగ్వేదమునందు కూడ బ్రహ్మ సృష్టినంతను యథాపూర్వముగ కావించినట్లు పేర్కొనబడినది. అనగా అనుకరణమె అఖిల విశ్వమునందలి లీలామయ చేష్టలకును, అనిర్వచనీయ గతులకును ఆశ్చర్యపూర్వక క్రీడలకును మూల ప్రేరకమని చెప్పవచ్చును.

నాటకమునకు, నాట్యము, దృశ్యము, ప్రేక్ష్యము, ప్రేక్షణీయకము, రూపకము, రూపము అను పలు పర్యాయ పదము లుద్భవించినవి. ఇది ప్రదర్శన ప్రధానము, ప్రేక్షకులకై నిర్దేశింపబడినది. కాన దీనికి దృశ్యము, ప్రేక్ష్యము, ప్రేక్షణీయకము అను పేర్లు కల్గినవి. దీనిని నిపుణుడగు నటుడు నిర్వహించును. ఇట్లు నటునిచే ప్రయుక్తమగునది కాన ఇది నాటకమైనది. నాటకము నాట్యశాస్త్రమున నాట్యమను నర్థముననే వాడబడినది." భరతుడు దశవిధ రూపకములకు రూపక మను పదమునే వాడియుండెను. నాట్యశాస్త్రమునకు అభినవ భారతి వ్యాఖ్యానము వ్రాసిన అభినవగుప్తుడు రూపము, రూపకము అను పదములను ప్రయోగించెను. ధనంజయుడు తన గ్రంథమునకు దశరూపక మను నామ మిడెను. అతడు రూప రూపక పదముల నిట్లు వివరించెను. 'అవస్థానుకరణము నాట్యము. అది దృశ్యమానమగుటచే రూపము, ఆరోపితమగుటచే రూపకము నైనది. అది రసాశ్రయము.' ఇట్లు ధనంజయుడు నిర్వచించిన పిదప రూపకమను పదము వ్యవహారమున స్థిరపడినది. నేడు దృశ్యమానము లగు రచనము లన్నియు నాటక నామముతోడనే వ్యవహృతము లగుచున్నవి. ఇది ఇచట సామాన్య వాచకమే కాని రూపక భేద వాచకము కాదు.

సంగ్రహముగ నాటక లక్షణముల నిట్లు పేర్కొనవచ్చును. సాధారణముగ నాటకారంభమున నాందీ ప్రస్తావనలు కాననగును. నటకులు నాట్యప్రదర్శనము నిర్విఘ్నముగ కొనసాగుటకై నాటకాదియందు చేయు కృత్య విశేషమునకు పూర్వరంగమని పేరు. ఇందిరువది రెండంగములు కలవు. వానిలో ముఖ్యమైనది నాంది. ఇది క్రియా పూర్వకము, వాక్పూర్వకము అని యిరు తెఱగులు. వాక్పూర్వకమైన నాందితోనే నాటక మారంభ మగును. ఇది ఆశీర్నమస్క్రియాత్మకమైన మంగళాచరణ రూపమున నుండును. ఇది ఎనిమిది కాని, పంద్రెండు

కాని, పదునెనిమిది కాని, యిరువదిరెండు కాని పదములతో కూడి యర్థముచే కాని పదముచే కాని కావ్యార్థమును సూచింపవలెను. నాందీరూపమైన పూర్వ రంగ మొనరించి సూత్రధారు డరుగగనే యాకార గుణముల నతని బోలిన యింకొక సూత్రధారుడు ప్రవేశించి నటీనట విదూషక పారిపార్శ్వకులలో నొకరితో సంభాషించుచు, వస్తు పాత్ర కథాబీజ కథాముఖములను సూచించును. ఈ సంభాషణమునకు ప్రస్తావన, ఆముఖము, స్థాపన అను నామములు కలవు. ఇందు నటాదులు చక్కనిపద్యములచే రంగమును రంజింపచేసి యేదైన నొక ఋతువు ననుసరించి గానము చేయదగును. శ్రావ్యము, నటాశ్రయము నగు వాగ్వ్యాపారమునకు భారతియని పేరు. ఇందలి యంగములలో ప్రరోచన యొకటి. ప్రరోచనయనగా ప్రస్తుతార్థ ప్రశంసనాదులచే సామాజికుల నున్ముఖుల కావించుట. దీని నున్ముఖీకరణమనియు చెప్పవచ్చును. ప్రస్తావనాంతమున జరుగు పాత్రప్రవేశ సూచన కథోద్ఘాతము, ప్రవృత్తకము, ప్రయోగాతిశయము అని మూడు విధములు. పాత్ర ప్రవేశ సూచన కావించి, సూత్రధారుడు నిష్క్రమింపగనే కథాప్రారంభ మగును. ధీరోదాత్తుడు ప్రఖ్యాతవంశుడు, కీర్తికాముడు, తేజస్వి, నీతి శాస్త్రజ్ఞుడు, వేద రక్షకుడు నగు రాజర్షికాని, దివ్యుడు కాని నాటకమున నాయకుడుగా నుండదగును. అందలి ఇతివృత్తము ప్రఖ్యాతమై యుండవలయును రసమునకును నాయక ధర్మములకును విరుద్ధము లగు వర్ణనాదులను విడువవలయును. లేదా వాని కన్యథా కల్పనము కావింప వలయును. ఇతివృత్తమున బీజము, బిందువు, పతాక, ప్రకరి, కార్యము అను నైదర్థప్రకృతులును, ఆరంభము, ప్రయత్నము, ప్రాప్త్యాశ, నియత ప్రాప్తి, ఫలాగమము అను పంచకార్యావస్థలును ప్రయోగింపబడవలయును. బీజాదులగు అర్థప్రకృతులైదును క్రమముగా నారంభాదులగు నైదవస్థలతో కలియుటచే, ముఖము, ప్రతిముఖము, గర్భము, అవిమర్శము, ఉపసంహృతి అను పంచ సంధు లేర్పడును. సంధు లైదింటికిని అంగములు కలవు. ఇష్టార్థమును కూర్చుట, గోప్య విషయమును మఱుగుపఱచుట, తెలుపదగినదానిని దెలుపుట, అభిధేయ విషయమున ననురక్తి పుట్టించుట, కథకు చమత్కృతి కలిగించుట, ఇతివృత్తమును చక్కగా పెంచుట అను నాఱును సంధ్యంగ ప్రయోజనములు.

ప్రదర్శనాపేక్షచే నాటక వస్తువును సూచ్యము, దృశ్యము అని రెండు విధముల విభజింపవచ్చును. సంగ్రహముగ సూచింపబడు నీరసము, అనుచి

తము, ఉద్వేగకరము నైన వస్తువు సూచ్యము. మధురోదాత్త రస భావ నిరంతరమై ప్రదర్శింపదగు వస్తువు దృశ్యము (దృశ్యశ్రవ్యము). సూచ్య వస్తువును విష్కంభము, ప్రవేశకము, చూళిక, అంకావతారము, అంకాస్యము అను నైదర్థోపక్షేపకములచే సూచింపవలెను. నాట్య ధర్మాపేక్షచే వస్తువును మరల మూఁడు విధముల విభజింపవచ్చును. రంగస్థలముపై ఎల్లరును వినదగినది నియత శ్రావ్యము ఇది జనాంతికము, అపవారితము, ఆకాశభాషితము అని త్రివిధము. యుద్ధము, దూర ప్రయాణము, దూరాహ్వానము, మరణము, రాజ్య విప్లవము, దేశోపద్రవము, బలాత్కారము, స్నానానులేపనాదులు, వస్త్రధారణాదులు మున్నగువాని నంకమున ప్రదర్శింపరాదు. విష్కంభాదులచే సూచింపవలయును. నాయక వధము సర్వథా త్యాజ్యము. అనగా విష్కంభాదులచే కూడ సూచింపరాదు. (నాయకుని మరల జీవింపజేయు నెడల నాయక వధ చూపవచ్చునని భావప్రకాశము తెల్పుచున్నది.) నైజమును ముఖ్యముగా చెప్పదగినదియు నగు దేవ పితృకార్యాదికమును విడువరాదు.

నాటకమునందలి వస్తువు ఆధికారికము, ప్రాసంగికము అని ద్వివిధము. కావ్యమున ప్రధానమైన వృత్తాంత మాధికారికము, అంగభూతమైన వృత్తాంతము ప్రాసంగికము. కథానాయకుడు, ఫలస్వామియు నగు నధికారిచే ఫలావసానము వఱకు నిర్వహింపబడు నితివృత్త మాధికారికము. అంగభూతమైన వృత్తాంతము ప్రాసంగికము, ప్రాసంగికము, పతాక, ప్రకరి యని రెండు విధములు. రామాయణమున సుగ్రీవాది వృత్తాంతము వలె చాల వఱకు సంబంధించి యుండు నది పతాక యనియు, శబరీ వృత్తాంతమువలె అల్పమైనది ప్రకరి యనియు చెప్పబడును. ప్రకరణ వశమున రాబోవు కథను సూచింపు పతాకవలె నుండు నది పతాకాస్థానకము.

నాటకమున వీర శృంగారములలో నొకటి ప్రధానముగా నుండవలయును. ఇతర రసము లంగములుగా నుండవచ్చును. కొందఱి మతమున కరుణము, అద్భుతము, శాంతము అనునవికూడ ప్రధానములుగా నుండవచ్చును. నిర్వహణ సంధియం దద్భుతమును వర్ణింపవలయును. నాటకము నంకములుగా విభజింపవలయును. అందెదు మొదలు, పది వఱకు నంకము లుండవచ్చును. బహువిధ ప్రయోజనములుగల ప్రధాన రసమున కాధారమై రంగ ప్రవేశమున

ప్రత్యక్షముగ చూపబడు నాయక చరిత మంక మనబడును. అంక మేక దివస వృత్తము, ఆసన్న నాయకము నయి యుండవలెను. అందు మూడు నాలుగు పాత్ర లుండవలయును (అబహుపాత్రమని దశరూపకము). అంకాంతమున సర్వ పాత్రములు నిష్క్రమింపవలయును. రాబోవు కథను సూచించు పతాకా స్థానకములును, అనంతర కార్య సంఘటన కారణమగు బీజ సదృశ బిందువును అంకముల చివర నుండవలయును. ప్రదర్శన యోగ్యత ననుసరించి నాటకా రంభమున కార్యానుగుణముగా, విష్కంభముకాని అంకముకాని రచింపనగును. ప్రవేశకము ద్వితీయాద్యంకముల మొదటనే యుండును. అంకమున అంగిరస పోషణము ముఖ్య కర్తవ్యము. వస్తురసములు పరస్పర విరుద్ధములు గాకుండ నుండవలయును. అనగా ప్రధాన కథ మరుగుపడునట్లు రసమును కాని, రసము మరుగుపడునట్లు సంధ్యంగ వస్త్వలంకారాదులనుగాని వర్ణింపరాదు. రెండును పరస్పర నిర్బాధకములుగా నుండవలయును. నాటకాంతమున సర్వలోక మంగళాకాంక్షియగు భరతవాక్య ముండును. ఇది సాధారణముగా నాటకము నందలి ప్రధాన పాత్రముచే ప్రయోగింపబడును. ఇది నాట్యశాస్త్ర కర్తయైన భరతుని గౌరవార్థము కల్పింపబడినదని చెప్పుదురు.

సంస్కృత నాటకములందలి పాత్రలు ఉత్తమ మధ్యమ నీచ భేదములచే త్రివిధములు. "విద్యావివేక సంపన్నులగు కథానాయకుడు, మంత్రి, పురోహితుడు, మిత్రుడు, ప్రతినాయకుడు మొదలగువారును, నాయికా యోగినీ సహాయినీ మంత్రి పుత్రకాదులును ఉత్తమ పాత్రలగుదురు. విదూషక దాసీ దాస దూతీ దూత భటాదులు తదన్యములగు మధ్యమాధమ పాత్రములగుదురు. ఉత్తమ మధ్యమాధమత్వము లా యా పాత్రముల జాతి గుణ క్రియలను బట్టి నిర్ణయించుకొనదగును." సంస్కృత లాక్షణికులు నాటక నిర్మాణమున పాత్ర లుపయోగించు భాష విషయమున కొన్ని నియమముల నేర్పఱిచిరి. బ్రాహ్మణులును, నాయకులును, రాజులును, శుద్ధ సంస్కృతము నుపయోగింతురు. స్త్రీలును, నీచ జనములును ప్రాకృతము నుపయోగింతురు. మరల నీ ప్రాకృత ప్రయోగ విషయమున కూడ కొంత వేరుపాటు కలదు. కులీనలగు స్త్రీలు గీతములలో మహారాష్ట్రి ప్రాకృతము నుపయోగింతురు. సాధారణ సంభాషణమున వీరును బాలాదులును సేవకులును శౌరసేని నుపయోగింతురు. అంతఃపుర పరిచారకులు మాగధిని, నీచ సేవకులు పైశాచిని వాడుదురు. ఇట్లా యా పాత్రల

యంతరములనుబట్టి సంస్కృత నాటకములలో ప్రయోగము నియమితమై యున్నది.[12]

భరతుడును, ఇతర లాక్షణికులును ఈ భాషా ప్రయోగ విషయమున మఱికొన్ని వివరములను చెప్పియున్నారు. తెనుగున వ్యావహారిక భాషకు స్థిర మైన రూపము నిర్దేశింపబడి యుండని కతమున పలువురు పాత్రము లన్నిటికిని గ్రాంథిక భాషనే వాడయున్నారు,

## నాటక ప్రబంధములకు గల సామ్య వైషమ్యములు

పైని ప్రబంధములయు నాటకములయు లక్షణములు స్థూలముగా నిర్దే శింపబడినవి. ఆ రెండు ప్రక్రియలును భిన్నములైనను, కావ్యశబ్ద వాచ్యములే. అందుచే వానియందు కొంత సామ్యము, కొంత భేదము గోచరించును.

సామ్యములు :-ప్రబంధములందును నాటకము లందును ధీరోదాత్తులే నాయకులుగా నుందురు. రెండింట ప్రఖ్యాత వస్తువే గ్రహింపబడును పురాణేతి హాసముల నుండి కథావస్తువును గ్రహించి, ప్రబంధ నాటక కవు లిరువురును రస నాయకానుగుణముగా దానిని మలచుటకు యత్నింతురు. ప్రబంధములం దైదారాశ్వాసము లుండును. నాటకము లందును అయిదు మొదలు పదివఱకు నంకము లుండవచ్చును. ప్రబంధ నాటకములు రెండింట కవులు రస పాత్ర పోషణమున శ్రద్ధ వహింతురు. నాటకమున పంచ సంధు లుండును. ప్రబంధము లందవి యుండవలెనని లాక్షణికులు స్పష్టముగా చెప్పకపోయినను కార్యైక్య మును సమకూర్చుట కితివృత్తమున వానిని దప్పక పాటింపవలయును. ప్రబంధ నాటకములు రెండింట వస్త్వైక్యము ప్రధానము. రెండింటి కానందమే ప్రధాన ప్రయోజనము. ఉపదేశము కూడ నుండుట బంగారమునకు పరిమళ మబ్బుటవలె నుత్కర్షావహము కాజాలును. నాటకారంభమునందలి నాందివలెనే ప్రబంధారం భము నందలి మంగళ పద్యము లాశీర్నమస్క్రియావస్తు నిర్దేశములలో నన్ని టినో కొన్నిటినో కలిగి యుండును. నాటకములు పద్యగద్య మిశ్రితములై యుండును. ప్రబంధములు కూడ చంపువులే.

భేదములు :-నాటకములు దృశ్యకావ్యములు. అవి రంగమున ప్రదర్శిం చుట కనువుగా రచింపబడ వలయును. ప్రబంధములు శ్రవ్యకావ్యము లగుటచే

చదువుటకును వినుటకును మాత్రమే యోగ్యమలై యుండును. నాటకము లందలి భాగము లంకములుగా విభజింపబడును. ప్రబంధము లాశ్వాసములుగా విభజింపబడును. అంకము లేక దివస వృత్తములై యుండును. ప్రబంధము లందలి యాశ్వాసము లట్లుండవలసిన యక్కఱ లేదు. నాటకములు పాత్రల సంభాషణ రూపమున సాగుచుండును. ప్రబంధములలోగూడ ప్రతిభావంతులైన కవులు కొందఱు రమ్యములైన సంభాషణలు రచింపవచ్చును. కాని అవి ప్రధాన ముగా కథన రూపమున సాగిపోవును. నాటకమున కథా సందర్భమున కను గుణములైన స్వల్పవర్ణనలుమాత్ర ముండును. ప్రబంధములు వర్ణన ప్రధానములు. అందష్టాదశ వర్ణనములుండవలెనని లాక్షణికుల నియమము. నాటకమున మధు రోదాత్త రసబంధురమైన వస్తువే రంగమున ప్రదర్శింపబడును. నీరసములు నుద్వేగకరములు నైన విషయములందు విష్కంభాదులచే సూచ్యమాత్రము లగును. ప్రబంధమున నెట్టి విషయములనైనను చక్కగా వర్ణింపవచ్చును. నాటకములు ప్రధానముగా దృశ్యకావ్యములగుటచే సామాజికు లేకవారశ్రవణ మాత్రమున అవగాహన చేసికొనుట కనువుగా నందలి శైలి వైదర్భీ రీతితో గూడి ప్రసన్నమును సుబోధమునై యుండవలెను. ప్రబంధము అర్థ శబ్దాలం కార బంధురములై అత్యంత ప్రౌఢ శైలితో గూడియుండును. నాటక ప్రబం ధములు రెండింట పద్యగద్యములు రెండు నుండుట సత్యమే యైనను, అందలి వచనములందు చాల వ్యత్యాసము గోచరించును. నాటకమునందలి వచనము సులభమై సంభాషణ కనుకూలముగా నుండును. ప్రబంధ వచనములు దీర్ఘములై యర్థ శబ్దాలంకార పూరితములై యత్యంత ప్రౌఢముగా నుండును. నాటకము లం దనవసర వస్తువివరణ ముండరాదు. సంక్షిప్తత వానికి ప్రాణము. ప్రబం ధములందు కవు లే విషయములనైనను విస్తృతముగా వర్ణింపవచ్చును. నాట కారంభములందు నాందీ ప్రస్తావనలును అంతమున భరత వాక్యము నుండును. ప్రబంధముల మొదట నిష్టదేవతా స్తుతి, కుకవినింద, కృతిపతి వంశ వర్ణనము, షష్ఠ్యంతములు, మున్నగువానితో గూడిన అవతారిక యుండును. వాని చివర భరత వాక్యమునకు బదులు ఫలశ్రుతియో మంగళాశాసనమో యుండును. ప్రబంధముల యాశ్వాసాద్యంతములందు కృతిపతి సంబోధన పద్యము లుండును. నాటకములం దట్టివేవియు నుండవు. వస్తు విస్తరణ విధానమున నాటక ప్రబంధములం దించుక వ్యత్యాసము గోచరించును. నాటక వస్తువున ప్రకాశము, స్వగతము, నియత శ్రావ్యము అను భేదము లుండును.

ప్రబంధములం దంతయు ప్రకాశమే. నాటకములందలి భాష ఉత్తమాధమ పాత్రల యంతరము ననుసరించి భిన్నముగా నుండును. పెక్కు తెలుగు నాటకములలో నిట్టి భేదము గానరాదు. ప్రబంధములలో కవియే కథకుడు కాన భాష అంతయు నొకేమాదిరిగ నుండును. ప్రతిభావంతులైన కవులు కొందరు రసానుకూలమైన శైలిని వాడవచ్చును. కాని అట్టిది క్వాచిత్కముగ మాత్రమే కనిపించును. ప్రబంధరచనలో కంటె నాటక రచనమున శిల్పదృష్టి యెక్కువగా నుండును. అందుచేతనే "నాటకాంతం హి సాహిత్య" మ్మను అభియుక్తోక్తి యేర్పడినది.

ఈ విధముగ నాటక ప్రబంధములు రెండును భిన్న ప్రక్రియలైనను వానియందు కొంత సామ్యము కూడ నుండుటచేతనే కొంద ఱాంధ్ర కవులు సంస్కృత నాటకములను ప్రబంధములుగా అనువదించుటకు అవకాశము కలిగెను.

ఉపయుక్త గ్రంథ నిర్దేశము

1. "ఇట్లు మహాప్రబంధ కల్పనా కుతూహలాయత్తంబగు చిత్తంబుతో"
"కావున ప్రబంధ రచనా ప్రావీణ్యము నీకు సహజ పరిణత సిద్ధంబు"
"ఊర్జిత సంపద నొనరింతు ప్రబంధము సదయ నృసింహావతార సంస్తవ సరణిన్"
"విష్ణు ధర్మ ప్రశంసా పవిత్రమైన అస్మదీయ ప్రబంధ సామగ్రి వలన"
"అమ్మహా ప్రబంధమునకు నస్మత్పితామహ హృదయ గుహా విహార సింహంబగు
శ్రీమ దహోబల నరసింహదేవుం డధీశ్వరుండగుటం జేసి"

2. సాహిత్య సమాలోచనము-పింగళి లక్ష్మీకాంతము, గౌతమ వ్యాసములు పుట ౬౬

3. డా. దివాకర్ల వేంకటావధాని-ఆంధ్ర వాఙ్మయ చరిత్రము పుట 37.

4. డా. పల్లా దుర్గయ్య–ప్రబంధ వాఙ్మయ వికాసము భా. 1. పుట124

5. ఆంగికో వాచికశ్చైవ హ్యాహార్యః సాత్త్వికస్తథా, చత్వారోఽభి నయా హ్యేతే విజ్ఞేయా నాట్య సంశ్రయాః–నాట్యశాస్త్రము 6 అ. 24 శ్లో.

6. త్రైలోక్యస్య సర్వస్య నాట్యమ్ భావానుకీర్తనమ్. నా. శా. 1 అ. 10 శ్లో.

7. Drama could spring from the play of child who imagines for the time-being that he is some one else. The development of dramatic art.

8. చేతనాకి అవికాసిత స్థితిమేభి హమ్ అనుకరణ వృత్తికే చిహ్న పాసక్తే హై. (పుట 1 హిందీదశరూపక్)

9. Imitation so understood is a creative art. It is the expression of the concrete thing under an image which answers to its true idea (Aristotles' Theory of poetry and fine art) Butcher–P. 154.

10. ఏవం బుద్ధ్వా పరమ్ భావమ్ సంస్కృతిం మనసా స్మరన్, వాగంగ గతి లీలాభి శ్చేష్టాభిశ్చ సంస్కరేత్. నా. శా.

11. ఆంధ్ర దశరూపకము. పుట 78.

12. ఆంధ్ర నాటక పితామహుడు. పుట 71.

# 2. నాట్యోత్పత్తి : సంస్కృత నాటక వాఙ్మయ సంగ్రహము

నాట్యోత్పత్తి :-నాట్యము మానవుని పుట్టుకతోడనే ఉద్భవించి అతనితో పాటుగా క్రమ వికాసమును పొంది, సమగ్రరూపము నొందినదని చెప్ప వచ్చును. ఆది మానవుడు ప్రకృతితోడి సాహచర్యమున సృష్టిలోని పలు వింత లను, పశుపక్ష్యాదులు గావించు స్వాభావిక చర్యలను అసక్తితో గమనించి వాని ననుకరించుట కారంభించెను. క్రమముగ నతడు తన జీవితమును సుఖమయ మును ఉన్నతమును గావించుకొను సహజమగు నాకాంక్షతో ప్రకృతితో సంఘ ర్షణ మొనరింపవలసి వచ్చెను. ఒంటరిగా జీవింపజాలక యతడు సంఘజీవనము నందలి సౌకర్యమును గుర్తించి దానిని పెంపొందించుకొనుటకు యత్నింప నందు సుఖదుఃఖాది సంఘటనము లెదురాయెను. కాళిదాసు "ఉత్సవప్రియా హి మానవాః" అని పేర్కొన్నట్లు మానవులు స్వాభావికముగ సంతోషానందముల నాశింతురు. కావున వారు పుత్ర జననాది సంతోషసమయములం దందఱును కలసి వినోదార్థము వారి మానసిక స్థితికి అనుగుణమగు నాటపాటలతో ఆనం దించు చుండిరి. ఇట్లు ఆదిమానవు లొనరించిన సుఖాది భావ వ్యంజనమే నృత్త నృత్య నాట్యాది రూపములకు మూలబీజమని చెప్పవచ్చును.

## నృత్య-నృత్త-నాట్యములు

నృత్త, నృత్య, నాట్య శబ్దములు నేడు సమానార్థకములుగ వాడబడు చున్నను సూక్ష్మ పరిశీలనమున వానియందలి భిన్నతను గుర్తింపవచ్చును. నృత్త, నృత్యములు 'నృత్' ధాతుజన్యములు. నాట్య శబ్దము 'నట్' ధాతు వ్యుత్పన్నము. దశరూపకము పదార్థాభినయమైన నాట్యము మార్గమనియు భావా శ్రయమైన నృత్యము దేశియనియు పేర్కొనినది. నృత్త, నృత్య, నాట్య శబ్దము లను గూర్చి సంగీత రత్నాకరము, ప్రతాపరుద్రీయము, నాట్యశాస్త్రము భిన్న రీతుల విపులీకరించియున్నను, నాట్యము రసాశ్రయ మను విషయమున ఏకాభి

ప్రాయములై యున్నవి. వీబరు నట్, నృత్ ధాతువుయొక్క ప్రాచీన రూపమని నుడివియున్నాడు. ప్రాకృత నిఘంటువులలో కాని, గ్రంథములలో గాని నట్ ధాతురూపమే లేదు. ఈ రెండును సంస్కృతమున నున్నవి. నృత్ ధాతు రూపము ఋగ్వేదమున ప్రయోగింపబడియుండ పాణిని కాలము వఱకును నట్ ధాతువు ప్రయుక్తము కాలేదు. అందుచే నట్ ధాతువు ప్రాచీనతరమైనదని నిశ్చయింప వచ్చును.

నాట్య నృత్తములు రెండును అభినయ పూర్వకములే అయ్యును ఆ అభినయములలో వ్యత్యాసము కలదు. డోంబికాదులగు నృత్త కావ్యములందు నర్తకి రాజు మానసము నాకర్షించుటకు యత్నించుచు కొంత అభినయము గావించును. కాని అందు కటాక్ష భ్రూవిక్షేపాదులగు అంగ విన్యాసములకు మాత్రమే తావు కలదు. అవి రాజునందు కామోద్రేకమును పెంచుటకు ఉప యోగపడును. నాట్యమున నటు డట్లు కాక రామాది పాత్రలు ధరించి వారిచే అనుభవింపబడినట్లు భావముల నభినయించుచు రంగమున ప్రదర్శింపవలెను. నృత్తమందు నర్తకి అన్యుల పాత్ర నిర్వహింపవలసిన అక్కఱ లేదు. ఆమె అంగ విక్షేపములచే రాజు మానసము నాకర్షించుటకే యత్నించును. ఆమెయందు ఆహార్యాభినయ ముండదు. నాట్యమునందలి అభినయము ద్రష్ట యందు రసము నుత్పాదింప నృత్త కావ్యాభినయము భావమును మాత్రము రగులుకొల్పును.

నృత్త, నృత్య, నాట్యముల స్వరూపమును సంక్షిప్తముగ ఇట్లు పేర్కొన వచ్చును. వీనిలో నృత్తము ప్రాథమిక రూపము. ఇది కేవలము అంగ విక్షేప మాత్రకమైన నర్తనము. దీనికి అభినయము కలుపగా భావాశ్రయమైన నృత్య మేర్పడెను. దీని కవస్థానుకరణము పాత్రోచిత సంభాషణము చేర్పగా రసా శ్రయమగు నాట్య మేర్పడెను. నాట్యము ఈ మూటిలో సమగ్ర లక్షణ సంపన్నము. ఇం దంగవిక్షేపము, అభినయము, సంవాదము అను మూడు లక్షణములు కానవచ్చును. ఇదియే నాటకమునకు జీవాతువు.

ప్రప్రథమ భారతీయ లక్షణ గ్రంథమగు భరతుని నాట్యశాస్త్రమున నాట్య కళా ధర్మములు సమగ్రముగ చర్చింపబడినవి. ఇందు భరతుడు నాట్యోత్పత్తిని గూర్చి పేర్కొనుచు నాట్యము బ్రహ్మచే సృజింపబడినదని దానికి దివ్యత్వము నాపాదించెను. ఇందు బ్రహ్మ చతుర్వేద సారమును

గ్రహించి నాట్యమును పంచమ వేదముగ సృజించెనని పేర్కొనబడినది. పిమ్మట ప్రజాపతి నుండి దానిని భరతముని గ్రహించి తన ఐదుగురు శిష్యులతో భావ రాగయుతముగ ప్రజాపతి సమక్షమున ప్రదర్శించెను. ప్రజాపతి సంతోషించి వారికి భరతులని పేరిడి, వారిని స్వాయంభువ మనువు వెంట భూలోకములో ఆవేదము వ్యాప్తి చేయుటకై పంపెను మనువు కోరికపై ఆ భరతులు దేవ దశ సహస్రి అను గ్రంథములను వ్రాసినట్లు శారదా తనయుడు చెప్పుచున్నాడు.[1]

నాట్యమునకు దేవయోనిత్వ మాపాదించుట హైందవుల ధార్మిక దృష్టికి చిహ్నము. ఆధునికులగు విమర్శకులు 'గతాను గతికో లోకః' అని భరతుని మతమునే గ్రుడ్డిగ అనుసరింపక, నాట్యోత్పత్తిని గురించి పర్యాలోచించి కొన్ని నూత్నాంశములను వెల్లడించిరి.

నాట్య శాస్త్రమున చతుర్వేదముల నుండి పాఠ గీత రసాభినయములను గ్రహించి నాట్యము సృజింపబడినట్లు చెప్పబడియుండుటవలన, వేదముల యందు రూపకోత్పత్తికి ఆధారములు గలవని పాశ్చాత్య పండితులు వెల్లడించి యున్నారు. సంస్కృత భాషయందలి ప్రాచీనతమ గ్రంథమైన ఋగ్వేదమున యమ, యమి సంవాదము, ఊర్వశీ పురూరవుల సంవాదము, ఇంద్ర మరుత్సంవాదము మున్నగు కొన్ని సంవాదములు గలవు. ఈ సూక్తములను యజ్ఞకాలమున ఋత్విజులు ఇరుపక్షములుగ నేర్పడి గానము చేసెడివారనియు, ఇవి గద్య పద్యాత్మకములై యుండెడివనియు, ఇట్టివానిని పఠించునెడ స్వరము నందలి ఆరోహణావరోహణములను సూచించు నొకానొక స్థాయిలో నృత్య గీతాదులు ప్రయుక్తము లగుచుండెడివనియు, వానిలోని పద్యభాగముల కంఠస్థములగుటచే మార్పు లేక అటులే యుండ గద్య భాగములు మాత్రము నశించినవనియు ఓల్డెన్‌బర్గ్ పేర్కొనెను. ఋషిగణము ఈ సూక్తములచే దేవతల నాహ్వానించుచు వారి ఆగమనమును అభినయించు చుండెడివారని లెవి పేర్కొనెను. ఈ సూక్తములకు యజ్ఞయాగాదికములకు నెట్టి సంబంధము లేదని సాయనాచార్యుడు నుడివి యున్నాడు. వైదిక వాఙ్మయమున నాటకమును గూర్చి కాని నటులను గూర్చి కాని యేదియు స్పష్టముగ పేర్కొనబడి యుండలేదనియు, వైదిక ధార్మిక విధులయందలి నాటకీయ తత్త్వమునకును, నాటకమునకును, కేవల

బీజప్రాయమైన సంబంధ ముండియుండుననియు డా దాస్‌గుప్తగారు చెప్పి యుండిరి [2]

కొందఱు గ్రీకు నాటకములకు భారతీయ నాటకము అనుకరణము లందురు. కాని ఈ వాదను నిలువజాలదు. గ్రీకు నాటకము క్రీ. పూ. 5 వ శతాబ్దిలో ఉద్భవింప సంస్కృతమున నాటకము క్రీ. పూ. ప్రథమ శతాబ్ది నుండి కనిపించుచున్నది. గ్రీకుల దండయాత్రల ఫలితముగను, వాణిజ్య వ్యాపారముల వలనను, భారతీయ యవన కళా సాహిత్యములకు పరస్పర సంబంధ ముండుట సంభవమే అయినను అది జన్య జనక సంబంధము కాదు. భారతీయ యవన రూపకములలో కొంత సాదృశ్యము కావచ్చుచున్నను, భేదమే యధికమనియు, "సాదృశ్యములు బాహిరములు కాగా భేదములు ఆంత ర్యమునకు సంబంధించినట్టివి" అనియు శ్రీ డా. పోణంగి శ్రీరామ అప్పారావు గారు పేర్కొనిరి. యవనిక అను పదమునకు మూలమైన యవన పదమునుబట్టి చూచినను, అది కేవల గ్రీకు దేశమునే కాక పారశీక దేశమును కూడ సూచించును.

తోలుబొమ్మలాటలలోని సూత్రధారునికిని నాటకములోని సూత్రధారునికిని గల సమ ప్రాధాన్యమును బట్టి కొందఱు తోలుబొమ్మలాటల నుండియే నాట కము ఉద్భవించిన వందురు. ఈ వాదమునకు సూత్రధార పద మొక్కటియే యాధారము. బొమ్మలాట ఒక ప్రత్యేక కళ. అందు సూత్రధారుడు నిర్వ హించు కార్యము వేరు. అతడు సూత్రమును ధరించి సూత్ర సాహాయ్యమున బొమ్మల నాడించుచు ప్రధానత్వము వహించును. నాటక సూత్రధారుడు నాందీ ప్రస్తావనాదికములను ప్రవర్తింపజేయును. కాన కేవల పద సమానత్వమున రెంటికిని సంబంధమును కల్పింపక ఈ రెండు కళలు పరస్పర సాహాయ్య నిరపేక్షముగ అభివృద్ధి నొందినవని తలంచుట సమంజసము.

సాధారణముగ ఏ భాష యందైనను లక్ష్య ముద్భవించిన పిదపనే లక్షణము సమగ్రత్వము నొందును. కాని భారతీయ నాట్య కళా విషయమున ప్రాచీనతమ గ్రంథమగు నాట్య శాస్త్రమున భరతు డేలకో తనకు పూర్వమున్న ఎట్టి రూపకములను గాని, రూపక రచయితలనుగాని పేర్కొనియుండలేదు. ఈకారణముననే రూపకోత్పత్తిని

4)

గుఱించిన పెక్కు వివాదము లుప్పతిల్లుటయు, రూపకావిర్భావమును గూర్చి ఇదమిత్థమని నిర్ణయించి చెప్పుట సాధ్యము కాకుండుటయు సంభవించినది. ఇట్లు రూపకోత్పత్తిని గూర్చి నిర్ణయము గావింప లేకున్నను, సంస్కృతమున నాటక ప్రక్రియ అతి ప్రాచీన కాలమునుండియు ప్రాచుర్యము వహించియుండెననుటలో మాత్రము విప్రతిపత్తి లేదు.

సంస్కృత నాటక రచయితలలో నతి ప్రాచీనుడుగ నెన్నబడుచున్న భాసుడు భరతునికి పూర్వుడని విద్వాంసుల యభిప్రాయము. కాని భాసుని కాలమును గూర్చియు, భరతుని కాలమును గూర్చియు నిర్ణయము గావించుటకు నిశ్చితములగు ఆధారములు లేనందున భరతునికి పూర్వులని నిర్వివాదముగా చెప్పదగు వాల్మీకి, పాణిని, పతంజల్యాదులను బట్టి సంస్కృత నాటక చరిత్ర కొంత తెలిసికొనవలయును.

## రూపక ప్రాచీనత :

ఋగ్వేదమునందలి ఊర్వశీ పురూరవుల సంవాదాదులును అపాలవృషుడు గౌతముడు మున్నగు వారి కథలును శృంగార, వీర, కరుణాది రసములతో గూడి నాటకీయ తత్త్వమును వెల్లడిచేయుచున్నవి. "చిన్న చిన్న సన్నివేశము లను స్వీకరించి వానిలో మానసిక ప్రవృత్తులను వ్యక్తపఱచి, విషయ సూచనము చేయుట ఋగ్వేద సంవాదములలోని నాటక ప్రక్రియ" యని పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు తమ ఊర్వశీ పురూరవ సంవాద వ్యాసమున వెల్లడించియున్నారు.

ఆది కావ్యమగు వాల్మీకి రామాయణమున శ్రీరామ పట్టాభిషేకమును వర్ణించు సందర్భమున "నటులయు, నర్తకులయు, గానము చేసెడి నాయకుల యొక్కయు, కర్ణములకు సుఖము నాపాదించెడి వచనములను ప్రజలు వినుచుండిరి" అని పేర్కొనబడినది. కుశలవుల రామాయణ గానము ప్రసిద్ధము. వీరి మూలముననే నటులకు కుశలవులను నామము వచ్చిన దందురు. ఇట్లు నట నర్తక వర్ణనముతోపాటు వాల్మీకి రామాయణమున నాట్యసమాజములును పేర్కొనబడినవి.

"నా రాజకే జనపదే ప్రభూత నట నర్తకే
ఉత్సవాశ్చ సమాజాశ్చ వర్ధంతే రాష్ట్రవర్ధనః"
(అయో. సర్గ 67 శ్లో. 15)

అంతేగక స్త్రీలే యున్న నాటక సమాజములు కూడ నుండినట్లు "వధూ నాటక సంఘైశ్చ సంయుక్తాం సర్వతః పురమ్" అను బాల కాండము నందలి పంచమ సర్గ శ్లోకము (శ్లో 12) వలన తెలియ వచ్చును.

హరివంశమున కృష్ణుని కుమారుడు రాముని పాత్ర నభినయించినట్లును, ఇతరులు లక్ష్మణ భరత శత్రుఘ్నులయు శాంతా ఋశ్యశృంగులయు వేషములు వేసినట్లును చెప్పబడినది.

క్రీ.పూ. నాల్గవ శతాబ్దిలో పాణిని ప్రపథమముగ నట్ ధాతువును నాట్య పరముగ ప్రయోగించెను. అతడు అష్టాధ్యాయి యందలి "పారాశర్య శిలాలిభ్యాం భిక్షు నట సూత్రయోః" 4-3-110 "కర్మంద కృశాశ్వాదినిః" అను రెండు సూత్రములలో శిలాలి, కృశాశ్వుడు అను నిరువురు నటసూత్రకారులను పేర్కొనెను. అతడు భూత, భవిష్యద్వర్తమాన క్రియలకు కంససంబంధులగు ఉదాహరణముల నిచ్చెను. ఇవి కంసవధ నాటకమునుండి గ్రహింపబడి యుండవచ్చును.[5] దీనినిబట్టి పాణిని కాలమునకు నాట్యకళ పరిణతి నొందినట్లు చెప్పవచ్చును.

పతంజలి కాలమునకు (క్రీ. పూ. 2 వ శ.) నాట్యము సర్వాంగ సంపూర్ణముగ శోభిల్లినది. ఈతడు కంసవధ, బలిబంధనము అను రెండు నాటకములను పేర్కొని యుండెను. ఈతడు అభినయము కావించెడివారికి శిక్షణ నొసంగు గురువులను శౌభికులని పేర్కొ నెను. కైయటుడు శౌభికులను గూర్చి "వారు తమ శిష్యులచే కంసుని అనుకరింప చేసెడివారనియు, ప్రేక్షకులు నటులనే కంస, కృష్ణులుగ భావించెడి వారనియు వివరించెను.[6] పతంజలి ఆనాటి ప్రదర్శనములు మూడు విధములుగ నుండెడివని చెప్పెను. నటులు పాత్రధారణము కావించి అభినయించు రీతి మొదటిది, ఇదియే నాట్యము, రెండవది చిత్ర ప్రదర్శనము. ఇందు రంగులు వేసిన బొమ్మలతో కథను ప్రదర్శించుచుండిరి. దీనిని బొమ్మలాట యనవచ్చును. మూడవది గ్రంథికులు

లేక కథకులు చెప్పునది. అనగా దాసరి బొబ్బిలి యుద్ధము మున్నగువానిని పాడుచు చెప్పుటవంటిది. పతంజలి కాలమునకు నట కుటుంబములు ఏర్పడెనని అనగా కొన్ని కుటుంబములు నటనమును వృత్తిగా స్వీకరించి ప్రదర్శన లిచ్చు చుండెనని పతంజలి వాక్యములనుబట్టి తెలిసికొనవచ్చును. అతడు వ్యంజనములు నట భార్యలవంటివనియు, నటుని భార్యలు రంగస్థలమున మీరెవరి వారలని ప్రశ్నించిన వారికెల్ల నీదాననే అని సమాధాన మిచ్చునట్లు వ్యంజనములు కూడ ఏయే అచ్చ్విధులు విధింపబడుచుండునో వాని నన్నింటిని పొందుచుండుననియు తన భాష్యమున పేర్కొనెను.7

బౌద్ధయుగమున నాటక మున్నత స్థితిలో నుండెనని 'వినయ పిటకము' వలన తెలియును. 'గౌతమ బుద్ధుని కాలమున ఆయన శిష్యులు సౌగంధికా హరణము అను రూపకమును ప్రదర్శించిరి.8 బౌద్ధుల నాటక కళ 'కళ కళ కొఱకే' అను సిద్ధాంతమున కూపిరి పోసినది. ఈ విధముగా సంస్కృత నాటకము వైదిక యుగముననే ప్రభవించి క్రీ.పూ. ప్రథమ శతాబ్ది నాటికి వికాసము నొందినదని భావింపవచ్చును. తరువాత భాసకాళిదాసాదుల చేతులలో నది సమగ్ర పరిణామము గాంచి ప్రశస్తి వహించినది.

సంస్కృత నాటక వాఙ్మయ సంగ్రహము :

అశ్వఘోషుడు—ప్రస్తుతము లభించుచున్న సంస్కృత రూపకములలో అశ్వఘోషునిశారిపుత్ర ప్రకరణము లేక శారద్వతీ పుత్రప్రకరణము మొదటిది: ఇది ల్యూడర్స్ మహాశయుడు 'తుర్ఫన్' నగరమున సంపాదించిన లిఖిత తాళ పత్ర ప్రతులయందలి మూడు బౌద్ధ నాటకములయందొకటి. ఇందలి మిగిలిన రెండు నాటకములను కూడ అశ్వఘోషుడే రచించినట్లు భావింపబడుచున్నది. శారిపుత్ర ప్రకరణము నందు మాత్రము తత్కర్త సువర్ణాక్షి పుత్రుడగు అశ్వఘోషుడని పేర్కొనబడియున్నది. తక్కిన రెండు రూపకముల శిథిల భాగములు మాత్రమే లభించుచున్నవి.

శారిపుత్ర ప్రకరణము తొమ్మిది అంకముల ప్రకరణము. శారిపుత్రునకు మౌద్గల్యాయనునకు బుద్ధుడు దీక్ష నిచ్చుట ఇందలి కథ. ఇందు నాట్య శాస్త్రమునం దుల్లేఖింపబడిన ప్రకరణ లక్షణములన్నియు కన్పట్టును. ఇందు

విదూషక పాత్రము చక్కగా పోషింపబడినది ఈ నాటకమునుబట్టి క్రీ. పూ. ప్రథమ శతాబ్దినాటికే సంస్కృత రూపక లక్షణము సుప్రతిష్ఠితమైన దనుకొన వచ్చును. ఈ ప్రకరణముతోపాటు లభించిన రెండు రూపకముల శేషభాగము లను బట్టి ఒకటి ధృతి, బుద్ధి, కీర్తి, వంటి పాత్రలు కలిగిన అన్యాపదేశ నాటక మనియు, రెండవది మృచ్ఛకటికము వంటిదనియు తలంపబడుచున్నవి.

అశ్వఘోషుడు క్రీ. శ. ప్రథమ శతాబ్దమునందలివాడు. ఇతడు బౌద్ధ తత్త్వవేత్త. చైనీయుల సంప్రదాయము ననుసరించి ఇతడు క్రీ. శ. 70-150 లకు నడుమ పెషావరును పాలించిన కనిష్కునకు మతోపదేష్టయై యుండెడి వాడని తెలియుచున్నది.

భాసుడు : భాసుడు ప్రఖ్యాతి గాంచిన నాటక కర్త. కాళిదాసు ఇతని ప్రథిత యశస్కునిగా సౌమిల్లక కవి పుత్రులతోపాటు పేర్కొనెను. 'భాసోహాసః' అని జయదేవుడు (ప్రసన్న రాఘవ నాటక కర్త) అతని కీర్తిం చెను. సూక్తిముక్తావళిలో రాజశేఖరుడు భాసుని స్వప్నవాసవదత్తము అగ్నిపరీక్ష కెదురైనను చెక్కుచెదరక నిల్చెనని చెప్పెను. భోజుడు శృంగార ప్రకాశమున స్వప్న వాసవదత్త మందలి 5 వ అంకము రసవంతమని పేర్కొనెను. ఇట్లు విఖ్యాతులగు కవులచే ప్రస్తుతింపబడిన భాసుడు నాటకకర్తగ సుపరిచితు డయ్యెను 1912 వ సంవత్సరమున శ్రీ పి. గణపతి శాస్త్రి గారు భాస నాటక చరిత్రము నందలి పదుమూడు నాటకములను ప్రకటించునంత వఱకు ఈతని నాటకము లజ్ఞాతములుగనే యుండిపోయెను. భాసుని నాటకము లివి "1. దూత వాక్యము(వ్యాయోగము) 2. కర్ణభారతము(వ్యాయోగము లేదా ఉత్సృష్టికాంకము) 3. దూతఘటోత్కచము (వ్యాయోగము లేదా ఉత్సృష్టి కాంకము) 4. ఊరు భంగము (ఉత్సృష్టికాంకము) 5. మధ్యమ వ్యాయోగము 6. పంచరాత్రము (సమవాకారము) 7. అభిషేకము (నాటకము) 8. బాలచరితము (నాటకము—నాయిక లేదు) 9. అవి మారకము (నాటకము) 10. ప్రతిమ (నాటకము) 11. ప్రతిజ్ఞా యౌగంధరాయణము (నాటిక) 12. స్వప్న వాసవదత్తము (నాట కము) 13. చారుదత్తము (ప్రకరణము)".[9] బాణుడు హర్షచరితమున భాసుని నాటకములలోని సామాన్య లక్షణముల నిట్లు వివరించెను.

"సూత్రధార కృతారంభై:
నాటకై ర్బహుభూమికై:
సపతాకై ర్యశో లేభే
భాసో దేవకులై రివ"

భాసుని నాటకము లన్నియు "నాద్యంతే తతః ప్రవిశతి సూత్రధారః" అను సూచనతో నారంభమగును. వీని యందు ప్రస్తావనకు బదులుగా స్థాపన కాననగును. ఆరంభశ్లోకమున ముద్రాలంకారమున పాత్రలన్నియు సూచింపబడును. ఇవన్నియు బహు పాత్రకములు. వీనియందు భరత వాక్యము 'రాజసింహః ప్రశాస్తునః' అని ముగియును భాష, శైలి, భావన మున్నగు వానిలో పరిణతి గోచరించును. వీనియం దెచ్చటను కవి నామము పేర్కొనబడలేదు.

భాసుని నాటకములలో మృత్యువు, యుద్ధము మున్నగునవి రంగముపై ప్రదర్శింపబడుట అను నాట్య శాస్త్రమునకు విరుద్ధములగు లక్షణములు కనవచ్చుటచే ఇతడు భరతుని కంటె పూర్వుడని కొందరి మతము. మరికొందరు ఈతడే స్వయముగ నొక నాట్య లక్షణ గ్రంథము రచించెనందురు.

భాసుని రూపకములలో-పంచరాత్రము, దూతవాక్యము, మధ్యమ, వ్యాయోగము, దూత ఘటోత్కచము, కర్ణభారము, ఊరు భంగము, బాలచరితము మున్నగు వానిలో బాలచరిత మొకటే ఐదంకములతో గూడినది. తక్కినవన్నియు ఏకాంకికలు. ఇవన్నియు మహాభారత కథకు సంబంధించినవి. ఇందలి ఊరు భంగము కరుణ రసాత్మకముగా సాగినది. ఈతని ప్రతిమా నాటకము, అభిషేక నాటకము. రామాయణ సంబంధులు. ఇందు ప్రతిమా నాటకము విశిష్టము. ఇందలి దశరథాదుల ప్రతిమా కల్పనము భాసుని అపార శిల్ప నైపుణ్యమున కొక తార్కాణము. ఇది నాటకమునకు నాహౌచిత్యము కలిగించుచు దాని కొక ప్రత్యేకత నాపాదించుచున్నది. దశరథుడు పుత్రకామియై యజ్ఞమొనరించి ఫలము వడయుట అను వృత్తాంతముతో కూడిన యజ్ఞఫలమను నాటకము కూడ భాసకృతమే యని తలంపబడుచున్నది. ప్రతిజ్ఞా యౌగంధరాయణము, స్వప్న వాసవదత్తము అను వాని యందలి వస్తువు బృహత్కథ నుండి గ్రహింపబడినది. అవి మారక చారుదత్తనులు కూడ గుణాఢ్యుని కథ

లోనివే అయ్యును కల్పితములుగనే భాసించును. ఈతని చారుదత్తమే శూద్రకుని మృచ్ఛకటికమున కాధారభూతమైనది.

భాసుని కప్రతిమాన కీర్తి నాపాదించినది స్వప్నవాసవదత్తము. భాసుని నాటక నిర్మాణ కౌశల మిందు పరిణతి చెందిన. భాసుడు నాటక రంగమున అపూర్వ పరిణామములను కొనితెచ్చెను. ఇతడు నేటి ఏకాంకికా నాటకములకు మూలపురుషుడు.[10] ఇతడు స్వతంత్రుడు, ప్రతిభావంతుడు అయిన నాటకకర్త. ఇతడు దాక్షిణాత్యుడు. ఈతని కాలము క్రీ. పూ. 4వ శతాబ్దమని విమర్శకులు నిర్ణయించిరి.

శూద్రకుడు :

మృచ్ఛకటికము సంస్కృతమున మిగుల ప్రసిద్ధినొందిన గొప్ప ప్రకరణము. తత్కర్తయగు శూద్రకుని కాలమే కాక అస్తిత్వము కూడ విచారణీయాంశమైనది. ఈత డొక కాల్పనిక వ్యక్తియనియు ధావక భాసుడను వ్యక్తియే ఈ నాటకమును రచించెననియు ప్రతీతి కలదు. కాళిదాసు మాళవికాగ్నిమిత్రమున పేర్కొనిన సౌమిల్లకుడు కూడ శూద్రక కథనొక దానిని రచించినట్లు ప్రతీతి కలదు. వామనుడు 'శూద్రకాది రచితేషు ప్రబంధేషు' అని అతని మృచ్ఛకటికము నుటంకింపకున్నను అతని నొక గ్రంథకర్తగా పేర్కొనెను.

మృచ్ఛకటికము భాసుని చారుదత్తము ననుసరించినదియే అయ్యు దాని కంటె నిది విశిష్టమైనది. ఇది పది అంకముల ప్రకరణము. ఇతి వృత్తము సాంఘికము. ఇం దుదాత్తపాత్రలు మొదలు పరమనికృష్ట వ్యక్తుల వరకు ప్రవేశమున్నది. ఇందు సంఘమునందలి పలురకముల జనుల జీవితములు, వారి ప్రవృత్తులు న్యాయస్థానములు, వధ్యస్థానములు మున్నగునవన్నియు నిరూపింపబడినవి. ఇందలి నాయకుడు చారుదత్తుడు ధీరశాంతుడు. నాయిక వసంతసేన వేశ్య. ఇందలి 'శకార' రూప కల్పనము నాటకకర్త విచిత్ర కల్పనా పటిమ కద్వితీయమగు తార్కాణము. ఇందు ప్రేమ కథతోబాటు నీతిబోధయు, రాజనీతిజ్ఞతయు, హాస్యరసపోషణమును హృద్యముగ సాగినవి. ఇంతటి ఉత్తమ కవిత్వ సంపద కూడ ప్రాచ్య పాశ్చాత్య విమర్శకులచే ప్రశంసించబడినది.

శూద్రకుడు కుముద్వతీ ప్రకరణమును కూడ రచించినట్లు తెలియుచున్నది. ప్రస్తుత మది ఉపలభ్యము కాదు.

"ఇతడు యాశ్మక దేశ బ్రాహ్మణుడు, వేదాధ్యేత, గణితాది శాస్త్రము లందు పండితుడు. ఇత డుజ్జయిని రాజై యశ్వమేధయాగము చేసి మృచ్ఛకటి కమును పది యంకముల ప్రకరణ రూపకమును వ్రాసెను.11 "మృచ్ఛకటి కము క్రీ. పూ. 2, 3 శతాబ్దములనాటి రచన అనియు మనకు లభించిన ప్రథమ సంస్కృత రూపకమిదియే యనియు" కొందరు విమర్శకుల యభిప్రాయము. కాని మృచ్ఛకటికము క్రీ. శ. 6-7 శతాబ్దముల నాటిదని శ్రీ కర్మాకర్ ప్రభృతులు నిరూపించియున్నారు."

కాళిదాసు:-కాళిదాసు మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము, అభిజ్ఞాన శాకుంతలము అను మూడు రూపకములను రచించెను. మాళవికాగ్నిమిత్ర మీతని ప్రథమ నాటకము. రెండవదియగు విక్రమోర్వశీయము త్రోటకము. (దీనిని ఔత్తరాహులు త్రోటకమనగా దాక్షిణాత్యులు నాటకమనియే భావించిరి.) మూడవదియగు అభిజ్ఞాన శాకుంతలము ప్రాచ్యపాశ్చాత్య విమర్శకులచే సర్వోత్కృష్టమని ముక్తకంఠముగ ప్రశంసింపబడిన నాటకము. కాళిదాసుని విశ్వవిఖ్యాతి కిదియే కారణము. ఈ నాటకమును జర్మను విద్వాంసుడగు 'గెటె' ఇట్లు స్తుతించెను.

"Would'st thou the young year's blossoms and the fruitsof its decline, and all by which the soul is charmed, enraptured, feasted, fed, would'st thou the earth and Heaven itself in one sole name combine? I name thee, O Sakuntala and all at once is said"

కవిగా నాటక కర్తగా కాళిదాసునకు గల ప్రశస్తి అపారము. ఇతని కాలమును గుఱించి వివిధాభిప్రాయములు ప్రచారమునందున్నవి. ఇతడు క్రీ. పూ. ప్రథమ శతాబ్దియందలి వాడనుట బహుజన సమ్మతము.

బాణ ప్రహసన కర్తలు :— శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు చతుర్భాణి యను పేర నాల్గు బాణములను ప్రకటించిరి. వానియందొకటి ఉభయాభిసారిక. దీనిని పాణిని సమకాలికుడైన వరరుచి శృంగార ప్రధానముగ

రచించెను. రెండవది ఈశ్వరదత్త (వీరేశదత్త) విరచితమగు ధూర్తవిట సంవాదము. ఇందు నాంది లేదు. స్థాపన సంగ్రహముగ నున్నది. ఇందు సూత్రధారుడు ప్రవేశించి ఆకాశ భాషితముగ నటితో సంభాషించి వర్షాకాలమును గూర్చి పాడును మూడవది క్రీ. శ. 9 వ శతాబ్ది యందుండిన శ్యామిలక విరచితమైన పాదతాడితకము. నాల్గవది శూద్రకుని రచన పద్మప్రాభృతక మనునది. ఇందలి స్థాపనలో సూత్రధారుడు ప్రవేశించి యైదు పద్యములలో నాశీర్వాద రూపమైన నాందిని, ఋతువర్ణనాదులను గావించును. ఈ భాణములు నాల్గును కూర్పులో సరళమై విశిష్టములై యున్నవి.

క్రీ. శ. 620 ప్రాంతముల వాడైన పల్లవరాజు విక్రమవర్మ మత్తవిలాస మను ప్రహసనమును రచించెను. ఇందు బౌద్ధ కాపాలిక పాశుపతమతముల వారి అసభ్యవర్తనములు ప్రదర్శింపబడినవి. 'భగవదజ్జుక' మను ప్రహసన మొకటి బోధాయనుడు రచించెనని చెప్పబడుచున్నది. దీనిని విక్రమవర్మ రచించినట్లు కొందఱు తలంతురు. సన్నివేశములందలి వైపరీత్యముచే హాస్యము సృష్టింపబడుట ఇందలి విశిష్టత.

శ్రీహర్షుడు : హర్షవర్ధనుడు మొదట స్థానేశ్వరమునను, అటుపై కన్యాకుబ్జమునను ఉండి చిరకాలము పరిపాలనము కావించిన చరిత్రప్రసిద్ధి కెక్కిన రాజు. ఈతని పరిపాలనా కాలము క్రీ. శ. 606-648. గద్య మహాకవియగు బాణభట్టేకాక, మయూరుడు, మతంగుడు, దివాకరుడు, ధావకుడు మున్నగు కవులు కూడ నితని ఆస్థానము నలంకరించి యుండిరి. బాణుడు హర్షచరిత్ర మును ఆఖ్యాయికా రూపమున రచించెను. చైనా యాత్రికుడగు హ్యూయన్‌త్సాం గీతనిచే ఆదరింపబడి ఇతని రాజ్య వైభవమును వర్ణించెను.

హర్షుడు నాగానందము, ప్రియదర్శిక, రత్నావళి యను మూడు రూపకములను రచించెను. అందు నాగానంద మైదంకముల నాటకము. మిగిలిన రెండును నాటికలు. వీనికి బృహత్కథా, కథా సరిత్సాగరములు మూలములు. నాగానందము జీమూతవాహనునికథ ఇతివృత్తముగా కలది. ఇందు కవి హృద్యమగు నుపదేశము నందించెను. ఇందు శృంగారము అంగముగను శాంతము అంగి రసముగను పోషింపబడినవి. రత్నావళీ ప్రియదర్శికల యందలి కథలు వత్సరాజగు ఉదయనుని శృంగార విలాసమునకు సంబంధించినవి. వీనిలో భాస,

కాళిదాసుల నాటక ప్రభావము గోచరించును. రత్నావళి నాటికాలక్షణములకు నిర్దుష్టోదాహరణముగ స్వీకరింప బడినది. ఇందు శ్రీహర్షుని పరిణతమైన కవిత గోచరించునని పండితాభిప్రాయము. ప్రముఖులగు అలంకారికు లందఱును ఈతని రూపకత్రయము నుండి శ్లోకములను రసాలంకారగుణాదుల కుదాహరించుట ఈతని కవితా మహత్త్వమును చెప్పక చెప్పుచున్నది.

విశాఖదత్తుడు : విశాఖదత్తుడు ముద్రారాక్షస నాటక కర్త. ఇందలి కథ బృహత్కథా మూలకము. ఈ నాటకము చరిత్రాత్మక నాటకములయం దగ్రగణ్యమైనది. చాణక్యుడు ముద్రసాహాయ్యమున రాక్షస మంత్రిని జయించుట ఇందలి ప్రధాన కథ. ఇది బహుపాత్ర ప్రయుక్తము. ఇందు స్త్రీ పాత్రములు లేకుండుట విశేషము. శృంగార నిరపేక్షముగను, రసవత్తరముగను కథను నడుపు చాతుర్యము విశాఖదత్తునిదే యని చెప్పవచ్చును. చాణక్య రాక్షస మంత్రుల అమోఘ రాజకీయ పరిజ్ఞానము, ఒకరినొకరు మోసగించుకొనుటకై వారు వేసెడి ఎత్తులు మున్నగునవి మిగుల ఆశ్చర్యావహములుగ గోచరించును. కాళిదాసాదుల నాటకములను ఎక్కువగా 'Poetic Dramas' అనుటకు వీలున్నది. "ఇక ముద్రారాక్షస మొక్కటియే సంస్కృతము నందు సిసలైన నాటకము అని కొందరు పేర్కొందురు."[13] విశాఖదత్తుడు ముద్రారాక్షసమునే కాక దేవీ చంద్రగుప్తమను నాటకమునుకూడ రచించినట్లు తెలియుచున్నది. ఇందు ప్రభువగు చంద్రగుప్తుని ప్రతిభ కీర్తింపబడినది. విశాఖదత్తుడు 10వ శతాబ్దికి పూర్వుడని విమర్శకుల తలంపు. నాటకప్రస్తావననుబట్టి ఇతడు సామంత వటేశదత్తుని పౌత్రుడనియు మహారాజగు పృధుపాలుని పుత్రుడనియు వ్యక్తమగుచున్నది.

భట్టనారాయణుడు : వేణీ సంహారము వీర రస ప్రధానమైన సుప్రసిద్ధ నాటకము. ఇందాఱంకములున్నవి. ఇది లక్షణబద్ధమైన రచన. భీముడు దుర్యోధనుని తొడలు విఱిచి రక్తసిక్తములగు చేతులతో ద్రౌపది శిరోజములను ముడి వేయుట యను భారత కథ ఇందలి ప్రధానాంశము.

భట్టనారాయణుడు క్రీ. శ. 671 వ ప్రాంతమున వంగదేశమును పరిపాలించిన ఆది శూరుడు లేక ఆది సేనుడు పిలువ నంపగా కన్యాకుబ్జము నుండి ఆ దేశమునకు వెడలెనని వంగ సంప్రదాయము వలన తెలియనగును. ఇందీతని కవితాశిల్పము, నాటక రచనా శిల్పము రెండును స్పష్టముగా గోచరించును.

దిజ్ఞాగుడు : ధీరనాగుడను నామాంతరము గల ఈ కవి రచించిన కుంద మాల ఆరంకముల నాటకము. దీనికి రామాయణము నందలి ఉత్తరకాండ కథ మూలము. రాముడు కుందమాలను చూచి దాని నల్లినది సీతయే అని విశ్వసించు ప్రసక్తి ఇందుండుట వలన దీనికి కుందమాల అను నామమేర్పడినది. కాళిదాసు మేఘసందేశమున పేర్కొనిన 'దిఙ్నాగానాం పథి పరిహరన్ స్థూలహస్తావలేపాన్' అను వాక్యములను బట్టి ఆ దిజ్ఞాగు డితడే అనియు, ఇతడు కాళిదాసునకు సమ కాలికుడనియు విమర్శకుల యభిప్రాయము. ఈ నాటకమే భవభూతి నుత్తర రామచరిత నాటకరచనమునకు పురికొల్పి యుండును.

భవభూతి : భవభూతి మహావీర చరితము, ఉత్తరరామ చరితము, మాలతీ మాధవము అను మూడు రూపకములను రచించెను. ఇందు మొదటి రెంటియందలి ఇతివృత్తము రామాయణ కథకు సంబంధించినది. మూడవది ఉత్పాద్యము. ఈ కథ బృహత్కథయం దున్నట్లు తలంపబడుచున్నది. మాలతీ మాధవమునందు సాధారణ శృంగారవృత్తమే నిరూపింపబడినను ఇది కవియొక్క స్వకపోల కల్పనా చాతురిని సూచించును. ఇది ప్రకరణము. ఇం దానాటి సాంఘిక జీవనము కూడ ప్రతిబింబిత మొనరింపబడి చదువరుల కాహ్లాదము కూర్చును. మహావీర చరితము వీరరస ప్రధాన నాటకములయం దగ్రగణ్యము. ఇందు ప్రధాన కథకు భవభూతి యొనరించిన మార్పులు ఆకర్ష కరములై యుండును. ఉత్తర రామ చరితము భవభూతి కెనలేని కీర్తి నాపా దించిన నాటకము. ఇతడు 'ఏకో రసః కరుణ ఏవ' అని చెప్పియు అత్యంత విషాద భరితమగు కథ నానందరూపముగ మలచుటకు యత్నించెను. ఈ నాట కము నాద్యంతము పరికించిన ఇందు విప్రలంభ మంగమనియు కరుణమే ప్రధాన రసమనియు స్ఫుటముగా తెలియవచ్చునని కీ.శే. మల్లాది సూర్యనారా శాస్త్రి గారు సంస్కృత వాఙ్మయ చరిత్ర యందు చెప్పి యుండిరి.

భవభూతి క్రీ.శ. ఎనిమిదవ శతాబ్ది పూర్వ భాగము నందుండిన ప్రఖ్యాత నాటకకర్త. ఈతడును, వాక్పతిరాజును క్రీ.శ. 830 ప్రాంతమున కన్యాకుబ్జము నేలిన యశోవర్మ ఆస్థానమునం దున్నట్లు రాజతరంగిణి వలన తెలియ వచ్చును.

మురారి: బాల వాల్మీకి బిరుదాంకితుడైన మురారికృతమైన అనర్ఘరాఘవము పూర్వరామాయణ వృత్తాంతముతో కూడిన నాటకములలో శ్రేష్ఠమైనది. తాను భవభూతి కంటె మిన్నగా రచింపవలెనను తలంపుతో నితడు తన ప్రతిభ నంతటిని ఇందు వ్యక్తము కావించి యున్నాడు. ఈతని వైదుష్యము శబ్ద పరిజ్ఞానము అపారమైనవి. తక్కిన నాటకముల వలె గాక పటిష్ఠమై వ్యాకరణ సిద్ధమైన రీతిలో వ్రాయుట ఈతని ప్రత్యేకత. కావుననే 'మురారేః తృతీయః పంథాః' అను సూక్తి ఏర్పడినది. వీరరస ప్రధానమైన ఈ నాటకము కథా పాత్ర రసౌచిత్యముల దృష్టితో కాక భాషా దృష్టితోడనే ఉన్నతమైనదిగా భావింపబడుచున్నది.

"యే శబ్దశాస్త్ర నిష్ణాతా యే శీలిత నిఘంటవః
తేషా మేవాధికారో స్తి మురారికృత నాటకే"

యను చాటువు దీని విద్వద్రంజకత్వమును వెల్లడి చేయుచున్నది. ఇది శ్రవ్య నాటకముగ పరిగణింపబడుచున్నది.

ఈ నాటకమున మాహిష్మతీ నగరము ప్రత్యేకముగ వర్ణింపబడుటచే అది ఈతని నివాస స్థలమనియు, దానిని పరిపాలించిన అనంగుడను రాజుచే నితడాదరింపబడెననియు భావింపబడుచున్నది. ఇతడు క్రీ. శ. 9 వ శతాబ్ది పూర్వభాగమునం దుండినట్లు చెప్పవచ్చును.

రాజశేఖరుడు : ఇతడు బాలరామాయణము, బాలభారతము, కర్పూర మంజరి, విద్ధసాలభంజిక యను నాల్గు రూపకములను రచించిన ప్రసిద్ధాలంకారికుడు. ఇతని బాలరామాయణము పది యంకముల మహా నాటకము. ఇందు రామాయణ కథ యంతయు సంగ్రహముగ తెల్పబడినది. ఇందలి నాయకుడు రాముడే అయ్యును ఇందు రావణ పాత్రమున కధిక ప్రాముఖ్య మీయబడినది. బాలభారతము కూడ సంపూర్ణ భారత కథతో కూడిన నాటకమై యుండనోపును. కాని అందలి రెండంకములు మాత్రమే లభించుచున్నవి. కర్పూర మంజరి ప్రాకృతమున రచింపబడిన సట్టకము. ఇందంకములు జవనికాంతరములని పేర్కొనబడినవి. శృంగార ప్రధానమైన ఈ రూపకమున చండపాలుడను రాజు కుంతలరాజ పుత్రియైన కర్పూర మంజరిని పెండ్లాడుట వర్ణింపబడినది. విద్ధసాల

భంజిక నాటిక. ఇందు నాల్గంకము లున్నవి. ఇందలి కథానాయకుడు త్రిలింగ దేశాధిపతియగు కర్పూర వర్షుడు. ఇతడు మృగాంక లేఖ, కువలయమాల అను సుందరులను వివాహమాడుట ఇందలి కథ. ఈతని కవిత్వము రసవంతము మృదులము నైనది. విద్ధసాలభంజిక యందు సమగ్ర నాటికా లక్షణములు గోచరించును.

జయదేవుడు : ప్రసన్నరాఘవ నాటకమును వ్రాసిన జయదేవుడు గీత గోవింద కర్తయగు జయదేవునికంటె భిన్నుడు. మురారి అనర్ఘరాఘవము తరువాత అంతటి విఖ్యాతి గాంచిన దీ ప్రసన్న రాఘవము. ఈతనికి పిల్లమురారి యను ప్రశస్తి కలుగుటకు ఈతడు శైలిలో మురారి ననుకరించుటయే కారణము. ప్రౌఢమైన రచనతో గూడిన ఈ నాటకమునం దేడంకము లున్నవి. జయదేవుడు క్రీ.శ. 12వ శతాబ్ది యందలివాడు రసమయములగు పద్యములను రచించుటలో కల నైపుణ్యము వలన ఇతనికి పీయూషవర్షుడను బిరుదము కలిగినది. ఈతని చంద్రాలోకమను అలంకార గ్రంథము అప్పయ దీక్షితుని కువలయానందమునకు మూలభూతమైనది.

కృష్ణమిశ్రుడు : సంస్కృతనాటకములయం దొక వినూత్న ప్రయోగము కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయము. ఇది సాంకేతిక రూపకము. అశ్వఘోషుడు కూడ నిట్టి నాటకము నొకదానిని రచించియున్నను అది అనుపలభ్యము. కావున అట్టి రకమునకు చెందిన వానిలో నిదియే ప్రథమమని చెప్పవచ్చును. ఇది ఆఱంకముల నాటకము. అద్వైత మందటికిని సుబోధకము గావించుటకై సరళమగు శైలిలో రచింపబడిన దృశ్యకావ్యమిది. ఇందు దృశ్యత్వ మంతగా శోభింపకున్నను కవి కల్పనా చాతుర్యము ప్రశస్తమై తత్ప్రఖ్యాతి నినుమడింప చేసినది.

కృష్ణమిశ్రుడు క్రీ.శ. 11 శతాబ్దియందలివాడు. ఇతని నాటకము ననుకరించుచు వెలసిన అనంతరూపకములలో వేదాంత దేశికుని సంకల్ప సూర్యోదయము పేర్కొనదగినది.

పైని పేర్కొనబడిన నాటకములు సుప్రసిద్ధములైనవి. ఇవికాక సంస్కృతమున నింకను పెక్కు రూపకములు కలవు. ఏమైనను భాస కాళిదాసాదులతో నారంభింపబడి భవభూతి కాలమువరకును సముజ్జ్వలముగా సాగిన సంస్కృత

నాటక వాఙ్మయము తదనంతరము క్షీణదశనొంది 12వ శతాబ్ది నాటికి నామ మాత్రశేషమైనదని చెప్పవచ్చును.

ఉపయుక్త గ్రంథ నిర్దేశము.

1. విజ్ఞాన సర్వస్వము సం. 6. విశ్వసాహితి పేజి 235.

2. It seems therefore, that even if the elements of Drama were present in vedic times there is no proof that drama in however rudimentary form was actually known. The Actor is not mentioned, nor does any dramatic terminalogy occur. There may have been mere connection between the dramatic religious ceremonies and the drama in embryo. History of sanskrit literature, by S.N Das Gupta and S.K. De 1947. Vol No. 8.46.47. pages.

3. భారతి జూన్ 1944.

4. 'నట నర్తక సంఘానాం గాయకానాం చ గాయతామ్
యతః కర్ణ సుఖావాచః శుశ్రావ జనతాతతః'

వాల్మీకి రామాయణము

5. A గచ్ఛ హన్యతే కంసః B కిం గతేన హతః కంసః
C కచ్ఛధానిష్యతే కంసః అ. 3, 1 పా. సూ. 26.

6. కంసాద్యనుకారిణాం నటానాం వ్యాఖ్యానోపాధ్యాయాః
కంసానుకారీ నటః

సామాజికై: కంస బుద్ధ్యా గృహీతః కంసో భాష్యే వివక్షితః
అ. 3. 1 పా. 26 సూ.

7. వ్యంజనాని పునర్నట భార్యావద్భవంతి, తద్యథా నటానాంస్త్రియో రంగ గతాయో యః పృచ్ఛతి కస్య యూయం కస్యయూయ మితి తంతంతవతవేత్యాహుః ఏవం వ్యంజనాన్యపి యస్యయ స్యాచః కార్య ముచ్యతే తంతం భజంతే. అధ్యా. 6. సూ 1.

8. విజ్ఞాన సర్వస్వము. విశ్వసాహితి పేజి 235.

9. పోణంగి శ్రీరామ అప్పారావు. నాట్యశాస్త్రము పుట 555.

10. పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి — ఛానమహాకవి. తిమ్మరాజు గారి అభినందన సంపుటి పుట 27.

11. శిష్టా రామకృష్ణ శాస్త్రి Andhra Dramatic Art, Page 149.

12. నాట్యశాస్త్రము-పుట 556.

13. పోణంగి శ్రీరామ అప్పారావు. నాట్యశాస్త్రము పుట 557.

# 3. కావ్యములందు నాటకమునకు గల విశిష్టత

## నాటక వి ట

అపారమగు కావ్య సంసారమును సృజించు కవిని అపర ప్రజాపతి యనవచ్చును. ఇతడు కల్పించు పలు విధములైన కావ్య కళా శిల్పములలో నాటకము ఉత్తమముగా భావింపబడుచున్నది. భరతుని దృష్టిలో కావ్యమనగా నాటకాదియే. అతడు కావ్యమును దృశ్యకావ్యపరముగనే నిర్వచించుటను[1]బట్టి రూపకమునకు అధిక ప్రాముఖ్యము నొసగెననుట స్పష్టము.

శ్రవ్య కావ్యము అను పదమును బట్టి అది వినుటకును చదువుటకును యోగ్యమగునది అని తెలియవచ్చును. పఠన పాఠనయోగ్యమగు కావ్యమునకు దృశ్యత్వము-అనగా ప్రదర్శనానుకూల్యము, చేర్పబడుటచే అది రంగస్థలమున ప్రదర్శింపబడుట కనుకూలమై సామాజికులకు చర్మచక్షుర్గోచరమై, శ్రవ్య కావ్యముల కంటె భిన్నమగుచు సాహిత్యమున ప్రత్యేకస్థాన మాక్రమించు కొన్నది. పూర్వ లాక్షణికులలో పలువురు నాటకము ప్రదర్శన యోగ్యమగుటను బట్టియే అది శ్రేష్ఠమగుచున్నదని స్పష్టము గావించిరి. వామనుడు తన కావ్యాలంకార సూత్రవృత్తిలో ప్రబంధములన్నింటిలో దశరూపకము శ్రేష్ఠమనియు, అది చిత్రపటము వలె దర్శనీయ మగుట వలన సర్వ విషయములను సమగ్ర రూపమున ప్రదర్శించుటకు సమర్థమగుచున్నదనియు తెల్పియుండెను.[2] 2. "చిత్రపటము దృశ్యమైనది." అట్లే దశరూపకము దృశ్యమానమైనప్పుడే సమగ్రము కాగలదు. ఈ విశిష్టత వలననే దశరూపకమునకు ప్రబంధములందు అగ్రస్థానము లభించెను. కావుననే 1. దశరూపకము ప్రబంధములలో ఉత్తమ మైనదనియు 2. దృశ్యమానమగుటచేత విశేష సమగ్రమైనదనియు 3. ఈ దశరూపకము నుండియే కథా-ఆఖ్యాయికా-మహాకావ్యము లుద్భవించెననియు వామనుడు పేర్కొనెను."[3] భట్టతౌతుడు కావ్య కౌతుకమునందు ప్రయోగమును పొందని కావ్యము ఆస్వాద్యమానము కాదని చెప్పెను. భట్టతౌతుని శిష్యుడగు

అభినవగుప్తుడు తన గురువు చెప్పిన దానిని సమర్థించుచు "దృశ్యమానమగుట చేతనే కావ్యము రసవత్తరమగుచున్నదని చెప్పెను."4 ఇట్లు లాక్షణికులు నాటకము ప్రదర్శన ప్రధాన మగుటవలననే రమ్యమగుచున్నదని స్పష్టము చేసిరి.

శ్రవ్య కావ్యము మనోనయన గోచరము. ఇందు కవి హృదయస్థిత భావములను తన శబ్ద ఘటనా చాతుర్యమున వ్యక్తమొనరించును. సహృదయుడగు పాఠకుడు ఈ శబ్ద సాహాయ్యమునకు తన భావనా పటిమను జతచేసి కావ్యము నందలి సన్నివేశములను లేక నాయకాదులను, మనమున ప్రత్యక్షము గావించుకొని వానితో తాదాత్మ్యము నొంది రసానందము ననుభవించును. వాక్యపదీయకారుడగు భర్తృహరి కవి యొనరించు వర్ణనా వైదగ్ధ్యమున నాయకాదులగు కంసాదులు సహృదయుని బుద్ధికి ప్రత్యక్షము లగుదురని పేర్కొనెను.

"శబ్దోపహిత రూపాం స్తాన్ బుద్ధే ర్విషయతాం గతాన్
ప్రత్యక్షా నివ కంసాదీన్ సాధనత్వేన మన్యతే"

ఇట్లు శ్రవ్య కావ్యము నందలి రామణీయకము ననుభవింప గల సహృదయత సంస్కార విశేషమున మాత్రము లభించును లోకము నందలి జనులెల్లరికి నట్టి సంస్కారముండుటకు అవకాశము లేదు. కావ్యము నందలి శబ్దజాల మవగత మగుటకు పాండిత్య మవసరము. అది లేకున్న సంపూర్ణముగా కావ్యానందము ననుభవించుట దుర్లభము. కావున శ్రవ్య కావ్యము కావ్య ప్రధాన ప్రయోజనములైన రసానందోపదేశములను కొందఱు జనులకు మాత్రమే అందింప గలదని తలంపవచ్చును.

దృశ్యకావ్యము ప్రవీణుడగు నటునిచే రంగముపై ప్రయోగింప బడును. అతడు పాత్రోచిత వేషభాషాదులను పాత్ర స్వభావమును, తనయం దారోపించుకొని భావోచిత నటనము కావించును. ఇట్టి అభినయ చాతుర్యమున నటులు. నాయకాదుల వలె గోచరించి సామాజికుల కనుల ముందు ప్రత్యక్షమగుదురు. ఇట్టి అభినయమునకు తోడుగ రంగాలంకరణము, నృత్యగాన విశేషాదులు అల్పబుద్ధులగు వారికి గూడ అమితాకర్షకరములగును. భాషా పరిజ్ఞానము తగినంత లేకున్న శ్రవ్యకావ్యము దరికైన పోజాలము. భాష రాదని దృశ్యమును జూచుటకు వెనుదీయ నక్కఱలేదు. నటులు గావించు అభినయ సాహాయ్యమున దానిని అవగతము గావించుకొనుటకు యత్నించి సాఫల్యము పొందవచ్చును.

ప్రదర్శింపబడు నాటకము పాండితీ ధనులకే కాక పామరులకును పరిణత బుద్ధులకే కాక పరిమిత జ్ఞానులకును గూడ ఆనందప్రదాయక మగుననుటలో సందేహము లేదు.

నాటకము బహు కళా నిలయము. ఇది రుచిరతరములగు లలిత కళ లన్నింటితో గూడి రమ్యతర మగుచున్నది. ఇది పద్యగద్యాత్మకమై యుండును. ఒకచో గానము కూడ అవశ్యకమగును. కాన ఇందు కవితా సంగీత కళలు ప్రాధాన్యము వహించును. నేపథ్య రచనమునకు చిత్రలేఖన శిల్పకళ లుపయోగ పడును. ఇది ఆద్యంతము అభినయ పూర్వకమగుట వలన నాట్య మిం దంత ర్భాగమై యుండును. ఇట్లు నాటకము ఒకే సమయమున సామాజికులకు లలిత కళ లన్నింటి సమాహార రూపమును చూపి యానందము కలిగించుచున్నది. అందుచేతనే దానిని (Composite art) సమాహార కళ అని పేర్కొందురు. నాటకము ఆద్యంతము కేవలము పద్యమయముగనో, గద్యమయముగనో యుండక పద్యగద్యములతో కూడి యుండుట, సంభాషణ ప్రధానమై యుం డుట, ఎడనెడ గేయములతో గూడి యుండుట మున్నగు లక్షణములచే వైవి ధ్యము కలిగి విసువు కలిగింపక విముఖులగు వారిని గూడ సుముఖులుగ చేసి విశ్వశ్రేయోదాయకమగు ఉపదేశము నందించును.

నాటకము జనులందరి కొఱకు నిర్దేశింపబడిన కళ. నాట్యము 'త్రైలో క్యస్య సర్వస్య నాట్యం భావాను కీర్తనమ్'' అని భరతుడు నాట్యమును గూర్చి ప్రస్తావించెను. "ఇందు ధర్మము, క్రీడ, శమము, హాస్యము, యుద్ధము, వధ మున్నగు త్రిలోకము లందలి జనుల సర్వ భావములు అనుకృతములగునని పేర్కొనెను.''5 ఇది సార్వజనికము. కావున దేశ కాల వయస్తారతమ్యము లేక యెల్లరకును దృశ్యమానమై మిక్కిలి ప్రీతికరమగుచున్నది. నాటకము సామూహికోద్యోగమున నొనగూడుచున్నది. శుక్లయజుర్వేదము వాజసనేయ సంహిత ముప్పదవ అధ్యాయము నందలి ఒక వాక్యము నాటక పరిపూర్తను సిద్ధింప చేయు సహయోగత్వము నిట్లు సూచించు చున్నది. 26 నాటకము నందలి నృత్యగానాదికమునకును వినోదమునకును, శృంగారాది రస నిర్వహణమునకును పలువురు సహకరించి నాటక సమగ్రత్వమును సాధింతురు. శ్రవ్యకావ్యమట్లు కాక, ఒక్క కవిచే మాత్రము నిర్వహింపబడును. అతడు లోకహితము నొక అంశముగా గుర్తించినను, భావ తీవ్రత అతిశయించినపుడు దానిని ప్రకటించు టయే ప్రధానముగ తలచును. కావున కవి మనోగతాభిప్రాయములు రుచింపని

పఠిత కావ్యములందలి అలౌకిక రసానుభూతి నందుకొనజాలడు. నాటక కవియును భావప్రకటనము కావించును కాని ఆ భావములను పాత్రల నోటనే ప్రకటింప వలయును. నాటకమునకు నిపుణుడగు కవి, గుణగ్రాహిణియగు పరిషత్తు, ఆహ్లాదకరమగు నితివృత్తము దక్షులగు నటులు — ముఖ్యాంశములు" అని శ్రీహర్షుడు రత్నావళీ నాటికా ప్రస్తావనమున పేర్కొనెను.

"శ్రీహర్షో నిపుణః కవిః పరిషద ప్యేషా గుణగ్రాహిణీ
లోకే హారి చ వత్సరాజచరితం నాట్యే చ దక్షా వయం
వస్త్వేకైక మపీహ వాంఛిత ఫల ప్రాప్తేః పదం కింపునః
ర్మద్భాగ్యోపచయా దయం సముచితః సర్వో గుణానాం గణః

ఇట్లు నాటకమున కవితోపాటు మిగిలిన అంశములు అత్యంత ప్రాధాన్యము వహించుచున్నవి. కవి నిపుణుడైనను హృద్యమగు వస్తువు లభింపవలెను. కవి నిపుణుడై అత్యుత్తమమగు వస్తువు నందించినను ప్రదర్శించుటకు కుశలులగు నటులు కావలెను. ఇవి అన్నియు నున్నను ప్రదర్శనము నందలి గుణము నభినందించుచు సామాజిక గుణము లేకున్న ప్రయత్నమంతయు వ్యర్థమగును. ఇట్లు నాటకము పలు అంశములను దృష్టిలో నిడుకొని రచింపబడుచుండును కావున బహుజన ప్రియమై యలరుటలో నచ్చెరువు లేదు.

లోకమున 'నాటకాంతం హి సాహిత్యమ్' 'నాటకాంతం హి కవిత్వమ్' అను అభియుక్తోక్తు లున్నవి. సాహిత్యజ్ఞానము నభిలషించు వ్యక్తి. సత్కావ్య పఠనము గావించి, గ్రహణజ్ఞానము పరిపక్వమైన పిమ్మట నాటక పఠనమున కుపక్రమింప వలెను. నాటకము పఠించి అందలి రసము నాస్వాదింప జాలుటతో అతని సాహిత్య కృషి సఫలమగును. నాటక రచనము గావింపగోరు వ్యక్తి పెక్కు రచనలు గావించి రచనా దక్షత పడసిన తరువాతనే నాటిక రచన కుపక్రమింపవలెను. అనగా ఉత్తమ నాటకమును గ్రహించుటకును అధిక కౌశల ముండవలెను. నాటక రచనా విధానము శ్రవ్య కావ్యము కన్న మిక్కిలి క్లిష్టతరమైనదిగా కనిపించును. నాటక కవి ప్రఖ్యాతములగు రామాయణ మహాభారతాదులనుండి వస్తువు గ్రహించును. కాని అందలి ఘట్టము లన్నియు ప్రదర్శన యోగ్యములుగా నుండని కతమున నాటకోచితములగు అంశములనే గ్రహించి వాని నాద్యంతము రస సమంచితముగ నిర్వహింపవలెను.

దృశ్య సూచ్య విచారము నిశితముగా కావించి వస్త్వైక్యమును ఘటింప యత్నింప వలెను. శ్రవ్య కావ్యములలో కూడ వస్త్వైక్యమును పాటింప వలయును. కాని అందు దృశ్య సూచ్య విచార ముండదు. పురాణాదులలో ప్రధాన కథతోపాటు నీతి ధర్మ తత్త్వ బోధకములగు నుపాఖ్యానములు కూడ గోచరించును.

నాటకము సంభాషణాత్మకముగ సాగునట్టిది. కాన దానికి సంక్షిప్తత ప్రాణము వంటిదనియు, శ్రవ్యకావ్య కవి వలె నాటక కవికి వర్ణన విషయమున స్వేచ్ఛ యుండదనియు మనము గుర్తించి యున్నాము. కాన నాటక కవి అనావశ్యక వర్ణనములను పరిహరింపవలయును. ఒకచో తన భావ తీవ్రత నణచుకొనలేక అనవసర వర్ణనము నారంభించిన అది ప్రదర్శనానుకూల్యమును గోలుపోయి అతని ప్రతిభకు లోప మొదవించును. నాటకము పరిమిత సమయమున పరిమిత రంగముపై ప్రదర్శింపబడవలయును. ఇది అతి దీర్ఘమైన ఎడ సామాజికులకు విసువు కలిగించును. అట్టి నాటక ప్రదర్శనము నెడ నటులును వైముఖ్యము ప్రదర్శించుట కవకాశము కలదు. కావున అర్థోపక్షేపకములను ఘటించుట అత్యంతావశ్యకము. భరతుడు నాటకమున అసభ్యములును జుగుప్సావహములు నగు అంశములు వర్ణనీయములు కావనియు, అది కుటుంబ సభ్యులందఱితో కూడి చూచుటకు తగినదిగా నుండవలెననియు వివరించెను.[7]

నాటకము ప్రతిభాసంపన్నుడు కవియొక్క కథా సంవిధానమును, పాత్ర పోషణౌచిత్యమును అభిలషించునదియే కాని అతని ప్రౌఢ శబ్ద ఘటనా సామర్థ్యము నంతగా కోరదు! ఏలయన ఇది ప్రదర్శన ప్రధానమైనట్టిది. ప్రదర్శనము చూచు సామాజికుల కందఱికిని సుబోధముగ నుండవలెను. కాళిదాసాదుల నాటకములు సర్వ సామాజిక మనోరంజకములై యలరుట కందలి సులభ సుందరమైన వైదర్భీ రీతియు నొక కారణము. ప్రౌఢ సమాస నిర్భరములైన అనర్ఘరాఘవాదులు శ్రవ్య నాటకములుగ మాత్రమే పరిగణింపబడుచున్నవి. లలితమైన శైలి నాటకమును రమ్యమొనరించు అంశములలో నొకటి. "సులభమైన భాష వ్రాయుట సులభము కాదు. భాష ప్రౌఢ మనిపించుకొనుటకై దుర్బోధములైన పదములతో కర్కశమైన ఒక శైలిని నడపవచ్చును. లలిత సులభమైన శైలి కవికి సహజముగ నుండవలసినదే కాని ప్రయత్న సాధ్యము కాదు. అతిశయోక్తులతో మెరపించుట తేలిక. స్వభావోక్తులతో మెప్పించుట కష్టము. వాక్కునకు నిసర్గమైన ప్రసన్నతా గుణము కల కవియే నాటక రచనమున

కుపక్రమించుట మంచిది.'' తెలుగున ఇట్టి శైలిలో నాటకములు వ్రాసినవారు శ్రీ తిరుపతి వేంకట కవులు.

నాటకము పరాశ్రయ కవితా గుణముచే నొప్పు ప్రకృష్ట కళాఖండము. కావ్యములందును, కథాఖ్యాయికాదుల యందును పాత్రల శీలస్వభావములను, తదితర వర్ణనాదులను కవి స్వయముగ నిర్వహించును. కాని రూపక కవి కట్టి అవకాశము లేదు. అతడు పాత్రలకు వాని స్వభావానుగుణములగు ప్రవర్తనముల నాపాదింపవలెను గాని ఆత్మ స్వభావము నారోపింపలేడు. వీలైనపట్ల పాత్రల ద్వారముననే అతడు స్వీయాభిప్రాయములను వెల్లడింపవలెను.

నాటక కవి ఇతివృత్తమున వ్యంగ్యముగా ధర్మోపదేశము కావించు నావశ్యకత ఎంతేని కలదు. నాటక ప్రదర్శనమునకు కేవలము సంస్కారులు, పండితులు మాత్రమే కాక పామరులు, నిరక్షరాస్యులు కూడ నరుదెంతురు. అట్టి వారు లోకవృత్తానుకరణమైన నాటకమున ధర్మమునకు గ్లాని సంభవించిన తాము ను ధర్మ విముఖులై అధర్మ మార్గము నవలంబించుట కవకాశము కలదు. కావున నాటక మెల్లప్పుడును ఉదాత్త వస్తుకమై యుండవలెను. అనుదాత్త వస్తువు ఆదర్శప్రాయముగ నుండకుండుటయే కాక కావ్య పరమార్థమునకు భంగము నాపాదించును.

ఇట్లు నాటకము సర్వాంగ సుందరమై సర్వశ్రేష్ఠముగ నెన్నబడుచున్నను అందుండి ప్రదర్శనానుకూల్యమును తొలగించిన అది శ్రవ్యకావ్యముకంటె ఉత్తమము కాకుండుటయే కాక దాని కీడు కూడ కాజాలదు. శ్రవ్య కావ్యము స్వయంసంపూర్ణము. అందలి కావ్యత్వము అన్యనిరపేక్షము. నాటక మెల్లప్పుడు ఇతర కళలసాయ మర్థించుచు ఆ కళల సహయోజనము లేకున్న రాణింపదు. ప్రదర్శన యోగ్యములు కాని నాటకములు ప్రచారము పొందజాలవు. శ్రవ్యకావ్య కవి వర్ణించు అతి లోకోత్తరాంశములను దృశ్యకావ్య కవి రంగమున ప్రదర్శింప లేడు. సహృదయుడు విద్వాంసుడు నగు పాఠకుడే శ్రవ్య కావ్య పఠనమున కుద్యమించును ఈతడు రసజ్ఞుడు. కవి వలె సరస హృదయుడు. కవి తానొక కల్పనామయ జగమున విహరించుచు అద్భుత పాత్రాదికములను సృజించి, వర్ణనా వైదగ్ధ్యమున వానిని కావ్యమున ప్రదర్శించును. కావ్యమును పఠించు భావుకుడు కవి భావనా ప్రపంచమున తాను ప్రవేశించి అందలి పాత్రాదికములను ప్రత్యక్ష

ములుగ భావించి, అనిర్వచనీయానందము ననుభవించును. నాటికమున అభి నయ సూచన లెన్ని కావించినను నాటక కర్త శ్రవ్య కార్యకర్తవలె పాత్రల మూర్తులను శీలములను, సన్నివేశ సామగ్ర్యమును సంపూర్ణముగ చిత్రింప లేడు. పూర్వాంధ్ర కవులు తమ కావ్యములందు, సూక్ష్మాతిసూక్ష్మ విషయము లను కూడ సమగ్రముగ వర్ణించి సర్వ ప్రపంచమును సకల మానవావస్థా ప్రవృత్తులను ప్రత్యక్షము చేయగల్గిరి.

ద్రౌపదిని వెంబడించు కీచకుని కనుగొనిన భీముని చిత్తోద్రేకమును తిక్కన రసోచిత శబ్దజాలముచే నిట్లు వర్ణించెను.

చ. "కనుగొని కోప వేగమున, కన్నుల నిప్పులురాల నంగముల్
కనలగ సాంద్ర ఘర్మ సలిలంబులు గ్రమ్మ నితాంతదంత పీ
డన రట దాస్య రంగ వికట భ్రుకుటీ చటుల ప్రవృత్తన
ర్తన ఘటనా ప్రకార భయద స్ఫురణా పరిణద్ధ మూర్తియై.
(విరాట. 2.133)

ఇచట భీముని హావ భావములు చక్కగా వర్ణింపబడి అతనిమూర్తిని పఠితల యెదుట నిల్పుచున్నవి. ఇట్టి పరిస్ఫుట భావములను రంగస్థలముపై అభినయించి సామాజికుల కటి స్ఫూర్తి కలిగింపవలెనన్న నటుడపార మైన నటనా సామర్థ్యము కలిగియుండవలెను.

పోతన భాగవతమున శ్రీమన్నారాయణుడు గజేంద్రుని మొర విని ఆపన్నప్రసన్నుడై అతనిని రక్షింప నరుదెంచిన సన్నివేశమును చక్కని చిత్రము వలె చూపించి యున్నాడు.

సిరికిం జెప్పడు, శంఖచక్రయుగముం జేదోయి సంధింపడే
పరివారంబును జీర డభ్రగపతిం బన్నింప డాకర్ణికాం
తర ధమ్మిల్లము చక్కనొత్తడు వివాద ప్రోత్థిత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడడు గజ ప్రాణావనోత్సాహియై"

అతని సంభ్రమము గనిన లక్ష్మీదేవి హృదయ మిట్లు తడఁబడుచున్నది.

అడిగెదనని కడువడిఁజను
నడిగినఁదను మగుడ నుడుగఁడని నడ యుడుగున్
వెడవెడ చిడిముడి తడఁబడ
నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్

అప్పటి ఆందోళనకు తగిన వర్ణనములతో కూడిన శబ్దములను ప్రయోగించిన కవిప్రతిభ కిది తార్కాణము. తెనుగు భాష తెలియని వానికైనను, పద్యమునందలి 'డ' కార పునరావృత్తిచే నం దేదో ఆందోళన యున్నదని వ్యక్తమగును. ఇట్టి కమనీయ భావరూప స్ఫూర్తిని దృశ్యకావ్యము లం దభినయముచే నుత్పాదించుట కష్టసాధ్యము.

పై విధముగ రూపకమును కేవల పఠనీయముగా (శ్రవ్యముగా) బరికించిన అది మిక్కిలి అసమగ్రముగ గోచరించును. శ్రవ్యము దానికి గల స్వాతంత్ర్య లక్షణముచే దృశ్యకావ్యముకన్న మిన్నయని భావింపదగి యున్నను, నాటకము రంగస్థలమున ప్రదర్శిత మగుట, నటుల ఆకార చేష్టాదులు, అభినయ సంగీతములు రంగస్థల వాతావరణము మున్నగు వానిచే అందఱిని అలౌకికజగమున ప్రవేశపెట్టి శ్రవ్యకావ్యము కన్న ఆధిక్యమును సాధించును.

## నాటక ప్రయోజనము

భరతముని నాట్యశాస్త్రమున నాట్యోత్పత్తికి కారణముల నిట్లు వివరించెను

త్రేతాయుగమున వైవస్వత మన్వంతరారంభమున యుగసంధిలో, జంబూద్వీపవాసులు గ్రామ్య ప్రవృత్తికి లోబడి, అధర్మ వర్తనులై చరించుచుండ ఇంద్రుడు లోకపాలురతో గూడి బ్రహ్మకడ కేగి ప్రజలను స్వధర్మనిరతులుగ కావించు దృశ్యము, శ్రవ్యమునగు క్రీడనీయకము నొకదానిని సృజింపుమని ప్రార్థించెను.[9]

దానికి బ్రహ్మ యొడఁబడి, సమాధిగతుడై నాల్గు వేదములను స్మరించి ఋగ్వేదము నుండి పాఠ్యమును, సామవేదము నుండి గీతమును, యజుర్వేదము నుండి అభినయమును అథర్వ వేదము నుండి రసమును గ్రహించి పంచమ వేదముగ నాట్యమును సృజించి,[10] ఈ నాట్యము ధర్మార్థ ప్రతిపాదకము, ఉపదేశ సహితము భావిజన మార్గదర్శకము, సర్వశాస్త్రార్థ సంపన్నము, సర్వశిల్ప ప్రవర్తకము,[11] అగునని నాట్యతత్త్వమును వారికి తెలిపెను. ఇంద్రాదులు నాటకము సార్వవర్ణికమగునట్లు కోరుట గమనింపదగియున్నది.[12] వారు నాట్యము సర్వవర్ణముల వారికి నాస్వాద్యయోగ్యముగ నుండవలెనని ఆశించిరి. ఇది నాట్యోత్పత్తి గాథ. ఈ గాథను చారిత్రక దృష్టితో కాంచిన డా॥ దశరథ ఓఝా తమ 'హిందీ నాటక్ ఉద్భవ్-ఔర్ వికాస్' అను గ్రంథమున నాట్యము వర్ణ వర్గ విభేదములను భావి భారతీయులందరిని ఒకే కడ సమావేశపఱిచి సమైక్యము గావించుటకు తోడ్పడిన కళ యని పేర్కొనెను. భరతుడు అనాదిగ ప్రచలితమై వచ్చుచున్న ఆర్య-అనార్య విభేదమును బాపి ఏకత్వము సాధింప నెంచి నాట్య శాస్త్రమును రచించినట్లుగా భావింపవచ్చును. ఇంద్రాదులు క్రీడనీయకము నాశించుటయు బ్రహ్మ "వినోద జననం లోకే నాట్య మేతద్ భవిష్యతి" అని పేర్కొనుటయు నాట్యముయొక్క వినోద ప్రాధాన్యమును స్పష్టము చేయుచున్నవి. దశరూపక కర్తయగు ధనంజయుడు ఆనందమే రూపక ప్రధాన ప్రయోజనమని నుడివెను.[13] సంస్కృత నాటకములందు విషాద రూపకము లుద్భవింప కుండుటకు నాటకముల వినోద ప్రాధాన్యముకూడ నొక కారణము. నాటక ప్రదర్శనము గాంచు జనులు ప్రదర్శనము ముగిసిన పిదప నైరాశ్యము నొందరాదను తలపుతో పూర్వులు నాటకముల నన్నింటిని సుఖాంతముల గావించిరి. అత్యంత విషాద రూపమున వెలయవలసిన ఉత్తర రామ చరితమును గూడ భవభూతి శ్రమపడి సుఖాంతముగా మలచెను. పూర్వ లాక్షణికులు 'మంగళాంతాని, మంగళ మధ్యాని, మంగళాదీని కావ్యాని' యని కావ్యము మంగళమయమై యుండవలెనని నిర్దేశించిరి. నాటకము సర్వమానవాభ్యుదయము చేకూర్పవలెననుటయే దీని ముఖ్యోద్దేశము. పాణిని మహాభాష్యమున కానవచ్చు 'కంస వధ' 'బలిబంధనము' విషాదాంతములుగ పేర్కొనబడుచున్నను అవి వధాంతములేకాని విషాదాంతములుకావని డా. దివాకర్ల వెంకటావధానిగారి యభిప్రాయము. ఏలన కంసుడు మున్నగువారు ఉదాత్తగుణోపేతులు కారు. ఇట్టివారి

వధ ధర్మమునకు లభించు విజయముచే, సామాజికులకు సంతసము నాపాదించు నదియే కాని విచారము కలిగింప చేయునది కాదు.

నాటకము వినోదమును కలిగించుచునే హితమును ఉపదేశమును సమకూర్చును. అది దుఃఖార్తులకు ధర్మోపదేశమును శ్రమార్తులకు వినోదమును, తపస్వులకు శమమును ఒసగుచు, ఆయా కాలములందు విశ్రాంతి జనకమై విలసిల్లును[14] నాట్యము నానాభావోప సంపన్నము, నానావస్థాంతరాత్మకము, సప్తద్వీపానుకరణమునై యుండునట్లు నిర్మించితిననియు, నాట్యమునందేది గోచరింపదో అది జ్ఞానము కాదనియు, శిల్పము కాదనియు, విద్యగాని కళగాని కర్మముగాని యోగము గాని, కాదనియు భరతుడు నుడివెను.[15] భరతు డిట్లు పేర్కొనుటను బట్టి నాట్యముయొక్క సర్వతోముఖ ప్రయోజనత్వము వెల్లడియగుచున్నది.

భరతునిచే ప్రతిపాదింపబడిన నాట్య శాస్త్రము భాసాది మహానాటక కర్తల నవనవ ప్రజ్ఞాపాటవమున పరిపుష్టమగు దీప్తి నొందినది. కాళిదాసు నాటకము మానవులకే కాక, దేవతలకును చాక్షుష క్రతువని పేర్కొనెను. ఇందు విభిన్న రసములు, వివిధ మానవ స్వభావములు చిత్రీకరింపబడుననియు, నాట్యము భిన్నరుచులు కలిగిన మానవులందరికిని ఆనంద ప్రదమగు ఏకైక సాధనమనియు అతడు వివరించెను.

నాటకము జ్ఞానము నొసంగెడు పాఠశాల వంటిది. ఇందు కేవలము కథాసౌందర్యమొక్కటే కాక, కవిత్వము, నృత్యము, సంగీతము, శిల్పము మున్నగు ఇతర కళలు గూడ నుండును. అది కాలమున కరగిపోయిన ప్రాచీన సభ్యతా సంస్కారములను ఆనాటి వాతావరణమును, వేషభాషాదులను, సామాజికులకు ప్రత్యక్షము కావించి, వర్తమానసమస్యల కొక మార్గదర్శకమై నిలుచును. మమ్మటుడు పేర్కొనిన కాంతాసమ్మితమైన ఉపదేశము[16] నాటకమున సులభముగ సాధింపబడుచున్నది. సరళ సంభాషణలు, పాత్రోచిత వేషములను ధరించిన నటుల అభినయము అను వానిచే నది కాంతయొక్క ఉపదేశము వలె పతితను స్వధర్మ నిరతుని గావింప జాలును. ఇట్లు ఉపదేశయుక్తమైనదగుటవలననే జైన బౌద్ధ, మతానుయాయులు కూడ ధర్మప్రచార సాధనముగ నాటకము నుపయోగించుకొనుట సంభవించినది.

నాటకము సుఖాంతమే అయినను, అందు కథామధ్యమున కరుణ రస ప్రపూరములగు సన్నివేశములు మానవులు పొందు దుఃఖమును కూడ సూచించి అట్టి దుఃఖమునకు మనుజుడు వివశుడు కారాదనియు, అట్టివి జీవనమున సహజములనియు, వాని నెదుర్కొని వారు సుఖమును బడయవలెననియు హెచ్చరించును.

భరతుడు రూపకము రసప్రధానమనియు 'విభావానుభావ సంయోగము వలన రస నిష్పత్తి కలుగుననియు' నుడివెను. నాటకము నందలి రసమును ఎవ్వరెట్లు అనుభవింతురను విషయమున అభిప్రాయభేదములున్నవి. ఆనంద వర్ధనుని అభివ్యక్తి వాదము వీనిలో విశిష్టమై యొప్పుచున్నది. అతడు వేదాంత తత్త్వజ్ఞులు కూడ నంగీకరించిన 'వాసనయే' రసాస్వాదమునకు ముఖ్య సాధన మని వివరించెను. అభివ్యక్తి యనగా ఉన్నదే వెలువడుట. సహృదయులందు వాసనారూపమున నున్న రత్యాగి భావములను విభావాదులు వ్యక్తము చేయు ననియు, అట్లు వ్యక్తములైన స్థాయి భావములే రసములగుననియు అతడు వివరించెను. సవాసనులైన సామాజికులే రసాస్వాదము గావింపగలరని అతని అభిప్రాయము.[17] ఇట్టి రసానుభూతి నాటకమున సంభవమైనంతగా ఇతర కావ్య రూపములందు కాదనుటకు విప్రతిపత్తి యుండదు. నాటక ప్రదర్శనమున సామాజికుడు ప్రత్యక్షములై గోచరించు పాత్రాదికములతో త్వరితముగ తాదా త్మ్యము నొంది అఖండానందము ననుభవించును. అతడు కనులతో దృశ్య మును తిలకించును. శ్రవణములతో భాషణముల నాలకించును, అతని మనస్సు వినెడి కనెడి సంఘటనములచే ప్రభావితమగును.

కేవలము సుఖాంతములగు నాటకములే కాక విషాదాంత నాటకములు కూడ ఆనందప్రదములే అని అరిస్టోటిల్ నుడివెను.[18] పాశ్చాత్య సాహిత్యమున మోదాంత విషాదాంతనాటకములు రెండును మిగుల ప్రచారము నొందుచున్నవి. మనము కరుణరసాత్మకములగు నాటకములను గూడ చూడ నువ్విళ్ళూరుదుము. అట్టి నాటకములను చూచునపుడు కనులవెంట కారెడి నీరు ఆనందబాష్పము లేయని చెప్పవచ్చును. ఇట్టి నాటకములు చూచునపుడు హృదయము కరిగి కనుల వెంట నీరై ప్రవహించును. విషాద నాటకములు నిజముగ విషాదమునే కలిగించిన మనము వానిని తలంపనైన తలంపము. లోకమున సహజములగు సుఖ దుఃఖాదులు కావ్యమున వర్ణితములైనపుడు అలౌకిక విభావములై ఆనం

దమునే కలిగించును. కావ్యశిల్ప మేదైనను అలౌకిక మగుటచే అందలి సుఖ దుఃఖాదులు రెంటి వలనను ఆనంద మే సమకూరును.

ఇట్టి రస నిర్భరమగు దృశ్య కావ్యమును చూచునపుడు సామాజికుడు సుఖదుఃఖాది నైజభావములను సంపూర్ణముగ మఱచి బ్రహ్మానందము నొందును లౌకిక ప్రవృత్తిని వీడుట వలన రాగద్వేష మాలిన్య రాహిత్యమును బడయును ఆతడిట్టి ఆనంద నిమగ్నత్వమున తాను చూచు విషయముతో నేకీభావము నొందును. ఇట్టి రసానుభూతి నొందిన మనస్సు శాశ్వతమగు నిట్టి ఆనందము నకై పదేపదే ఉవ్విళ్ళూరును. శాశ్వతమగు నిట్టి ఆనందమును బడయగోరుటయే ముముక్షుత్వము. ఇట్లు నాటకము లౌకిక ప్రయోజనమునకేకాక పారలౌకికా నందమునకు కూడ బాట వేయుచున్నది.

ఉపయుక్త గ్రంథ నిర్దేశము ;

1. మృదు లలిత పదాఢ్యం గూఢ శబ్దార్థహీనం
జనపద సుఖ బోధ్యం యుక్తి మత్ నృత్య యోజ్యం
బహుకృత రస మార్గం సంధి సంధాన యుక్తం
స భవతి శుభకావ్యం నాటకం ప్రేక్షకాణామ్.

1. అధ్యా. 16 శ్లో

2. సందర్భేషు దశరూపకం
శ్రేయః, తద్ధి చిత్రం చిత్రపటవ
ద్విశేష సాకల్యాత్ తతోన్యభేదక్లప్తి :

ప్ర. అధి. 3వ అధ్యా. 30-32.

3. శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావు. తెలుగు నాటక వికాసము, పుట 27.

4. "కావ్యం తావ న్ముఖ్యతో దశరూపాత్మకమేవ. తత్రహి ఉచితైర్భాషా వృత్తికాకు నైపథ్య ప్రభృతిభిః పూర్యతే రసవత్తా"
అభినవ భారతి. 1. భా. పుట 291.

5. క్వచి ద్ధర్మః క్వచి త్క్రీడా క్వచి దర్థః క్వచి చ్ఛమః
క్వచి ద్ధాస్యం, క్వచి ద్యుద్ధం క్వచి త్కామః, క్వచిద్వధః
ధర్మో ధర్మ ప్రవృత్తానాం కామః కామోపసేవినాం
నాట్యవేదము, నాట్యఫలము - 86 శ్లో. అధ్యా. 5.

6. నృత్తాయ సూతం గీతాయ శైలూషం, ధర్మాయ సభాచరం మొద. 11.

7. ఏవంవిధం భవే ద్యద్యత్తత్తదంగే న కారయేత్
పితాపుత్ర స్నుషా శ్వశ్రూ దృశ్యం యస్మాత్తు నాటకమ్
తస్మా దేతాని సర్వాణి వర్జనీయాని యత్నతః
నా. శా. 22 అ. 298, 299 శ్లో.

8. నానార్థ శబ్ద తౌర్త్యేన పరాంచోయే రసామృతాత్
విద్వాంస స్తే కవీంద్రాణా మర్హంతి న పునః కథామ్.
నాట్యదర్పణము. 1. వివే, 6వ శ్లో. 23 పుట.

9. మహేంద్ర ప్రముఖై ర్దేవై రుక్తః కిల పితామహః
క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రవ్యం చ యద్భవేత్.

10. జగ్రాహ పాఠ్యమ్ ఋగ్వేదా త్సామేభ్యో గీత మేవ చ
యజుర్వేదా దభినయాన్ రసా నాథర్వణాదపి
నా. శా. అధ్యా 1. శ్లో. 17.

11. ధర్మ్య మర్థం యశస్యం చ, సోపదేశం ససంగ్రహమ్
భవిష్యతశ్చ లోకస్య సర్వకర్మానుదర్శకమ్.
నాట్యాఖ్యం పంచమం వేదం సేతిహాసం కరో మ్యహమ్," (నా.శా.)

12. న వేద వ్యవహారో ఽయం సంశ్రయః శూద్రజాతిషు
తస్మాత్సృజాపరం వేదం పంచమం సార్వవర్ణికమ్. (నాట్యశాస్త్రము)

13. ఆనంద నిష్యందిషు రూపకేషు వ్యుత్పత్తిమాత్రం ఫల మల్పబుద్ధిః
యో పీతిహాసాదివ దాహ సాధు స్తస్మై నమః స్వాదు
పరాఙ్ముఖాయ. దశరూపకము. ప్ర 1. శ్లో 6.

14. హితోపదేశ జననం ధృతి క్రీడా సుఖాదికృత్
ఏతద్రసేషు, భావేషు, సర్వకర్మ క్రియా స్వథ
సర్వోపదేశ జననం నాట్యం లోకే భవిష్యతి
దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినామ్
విశ్రాంతి జననం కాలే నాట్య మేత ద్భవిష్యతి
ధర్మ్యం యశస్య మాయుష్యం హితం బుద్ధి వివర్ధనమ్
లోకోపదేశ జననం నాట్య మేతద్ భవిష్యతి నా.శా. అధ్యా. 1.

15 న తత్ జ్ఞానం న త చ్ఛిల్పం న సా విద్యా న సా కళా
న స యోగో న తత్కర్మ నాట్యేఽస్మి న్యన్న దృశ్యతే
సర్వ శాస్త్రాణి శిల్పాని కర్మాణి వివిధాని చ
సప్త ద్వీపానుకరణం నాట్య మేత ద్భవిష్యతి నా.శా. అధ్యా. 1.

16. కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే

17. సవాసనానాం సభ్యానాం రసస్యాస్వాదనం భవేత్
నిర్వాసనాస్తు రంగాంతః కాష్ఠ కుడ్యాశ్మ సన్నిభాః

18. Tragedy excites the emotions of pity and fear and by the act of excitation affords a pleasurable relief.
S. H. Butcher. Translation of Aristotle's the **P**oetics.
Page 245.

# 4. ఆంధ్ర వాఙ్మయమునందలి అనువాద పద్ధతులు

ఆంధ్ర వాఙ్మయమున నన్నయ ఆదికవిగా పరిగణింప బడుచున్నాడు. అతనికి పూర్వము కూడ కొన్ని కావ్యములును, పాల్కురికి సోమనాధుడు పండితారాధ్య చరిత్రమున పేర్కొన్న పదముల వంటి రచనలును ఉండెనని ఊహించుట కవకాశమున్నది. కాని అవి ఏవియు ఇప్పుడు లభించుట లేదు. కాగా ప్రాఙ్నన్నయ యుగమున మనకు గోచరించు వాఙ్మయమంతయు శాసనాత్మకమైనట్టిదే. ఈ శాసనములలో కొన్ని గద్యమయములు, మఱికొన్ని పద్యమయములు, కొన్ని గద్యపద్యోభయ రూపములనై యున్నవి. ఇవి ప్రాయికముగా రాజులు, ధనవంతులు, మంత్రులు మున్నగు వారు బ్రాహ్మణులకు దైవములకు, దేవాలయములకు నిచ్చిన దానములను సూచించునవి అగుటచే విషయ ప్రాధాన్యము కలవే కాని సాహిత్య వాచ్యములు కాజాలవు. అందుచేత ఆంధ్రమున మొట్టమొదట ఉదాత్తమైన కథతో గూడి, లాక్షణికమైన భాషలో వ్రాయబడిన నన్నయ భారతమే ఆది కావ్యముగను, నన్నయయే ఆదికవిగను భావింపబడుట సంభవించినది.

ఆంధ్ర వాఙ్మయమునందలి ప్రథమ యుగము ప్రాఙ్నన్నయ యుగము. రెండవ యుగమును పురాణ యుగమనియేకాక కొందఱు భాషాంతరీకరణ యుగమనియు పేర్కొనుచున్నారు. అందు కపుడు వెలువడిన కావ్యములలో పెక్కు సంస్కృతము నుండి అనువదింపబడినవగుటయే కారణము. అపుడే కాక ప్రబంధ యుగారంభము వఱకును అనగా మూడవదియైన శ్రీనాథ యుగమునందు కూడ అనువాదములే ఎక్కువ కనబడుచున్నవి. తరువాత సైతమనువాదము లసలు లేకపోలేదు. కాని వాని సంఖ్య తక్కువ. ఆధునిక యుగమున మాత్రము నాటక వాఙ్మయము మరల అనువాదముల తోడనే ఆరంభమైనది.

ఆంధ్రమునందలి అనువాదములను కథానువాదములు, భావానువాదములు, పదానువాదములు అని స్థూలముగ మూడు విధములుగ విభజింప

వచ్చును. కథానువాదములనగా మూలమునందలి కథను మాత్రము మార్చకుండ అందలి భాగములను కొన్నిచోట్ల యథాతథముగ ననువదించియు, కొన్నిచోట పెంచియు, కొన్నిచోట్ల సంక్షేపించియు, కొన్నిచోట్ల ఔచిత్యపోషణకై ఇంచుక మార్చియు, కావించిన రచనలు. ఈ కథానువాద పద్ధతికి కవిత్రయము వారి ఆంధ్ర భారతమే సముచితమైన ఉదాహరణము. భావానువాదములనగా మూలమునందలి కథను, భావములను కూడ సన్నిహితముగ అనుసరించుచు, క్వాచిత్కముగ మాత్రము స్వల్పములైన మార్పులు కావించుచు వ్రాయబడిన రచనలు. శ్రీనాథుని నైషధాంధ్రీకరణ మిందులకు నిదర్శనము. పదానువాదములనగా మూలమునందలి కథను భావములను పదములను కూడ విడువకుండ, అతి సన్నిహితముగ అనుసరించు రచనలు. ఆధునికాంధ్ర యుగమునందలి నాటకానువాదములు ఈ పద్ధతికి నిదర్శనములు. ఈ మూడు పద్ధతులలో కథానువాద విధానమున కవుల స్వాతంత్ర్య మధికముగా గోచరించును. భావానువాద విధానమున మూలానుసరణ మెక్కువ; స్వాతంత్ర్యము తక్కువ. పదానువాద విధానమున స్వాతంత్ర్య ముండనే యుండదు. ఉన్నను మిక్కిలి అరుదు. త్రివిధమైన ఈ విభజనము స్థూలముగా చేయబడినదగుటచే వీనిలో నొకదానియం దింకొకదాని లక్షణములు కూడ కొన్నియెడల కనబడవచ్చును.

రాజరాజు నన్నయను వ్యాస రచిత భారతమును తెనుగున రచింపుమని కోరుచు

క. జననుత కృష్ణ ద్వైపా
యనముని వృషభాభిహిత మహాభారత బ
ద్ధ నిరూపితార్థ మేర్పడ తె
నుగున రచియింపు మధిక ధీయుక్తి మెయిన్.

(ఆ. ప. 1-16)

అని తెల్పి యుండెను. నన్నయ "బుద్ధి బాహు విక్రమమున దుర్గమార్థ జల గౌరవ భారత భారతీ సముద్రము దఱియంగ నీదను విధాతృనకైనను నేర బోలునే" (ఆ. ప. 1-19). "అయినను దేవా, నీ యనుమతంబున, విద్వజ్జనం

బుల యనుగ్రహంబునం జేసి నా నేర్చువిధంబున నిక్కావ్యంబు రచియించెద నని" (ఆ.ప. 1-20) భారతము రచించుట కారంభించెను. రాజరాజు నన్నయను కృష్ణద్వైపాయన ముని వృషభాభిహిత మహాభారతబద్ధ నిరూపితార్థ మేర్పడు నట్లుగా భారతమును రచింపుమని కోరియుండెనే కాని యథామూలముగా అను వాదము చేయుమని కోరియుండలేదు. నన్నయయు, ఇక్కావ్యంబు రచించెద నని పల్కుటలో సంస్కృతమున ఇతిహాసమైన ఆ మహాగ్రంథమును కావ్య ముగా రచింపబూనినట్లు గోచరించుచున్నది. తిక్కన కూడ భారతమును అను వదించెదనని చెప్పక 'అమ్మహాకావ్యంబు నర్థంబు సంగతంబు చేసెద'నని తెల్పి యుండెను. అంతమున నాతడు 'వ్యాసమునీంద్రు సార కరుణాతిశయంబున భారతార్థముద్భాసితమైన యట్టి నుతభాగ్యునకున్ సకలాగమార్థ సంవాసన మావహిల్లు జనపంక్తులు కీర్తన సేయ" (స్వర్గా. ప. 98)నని వ్రాసిన పద్యమును బట్టి సంస్కృత భారతమునందలి యర్థము వ్యాసుని దయవలన నెవరి కుద్భాసిత మగునో వారికి సకలాగమార్థ సంస్కారము కలుగుననియు వారిని జనులు కీర్తింతురనియు తెలియుచున్నది. తరువాత ఎఱ్ఱాప్రెగ్గడ నన్నయ తిక్కనలను "వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లగ జేసినట్టి యజ్ఞాసన కల్పు" లని ప్రశం సించెనే కాని భారతమును అనువదించి యుండిరని చెప్పలేదు. అరణ్యపర్వ శేషాంతమున నతడు 'నన్నయ భట్ట మహాకవీంద్రు సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁజెందుటయు" (అ. ప. 469) "తత్కవితా రీతియుఁ గొంత దోప తద్రచనయ కా (అ.ప. 470) నారణ్య పర్వశేషమును పూరించి"నట్లు తెల్పి యుండెను. దీనిని బట్టి అతడు నన్నయ మార్గమునే అనుసరించెననుట స్పష్టము. ఇట్లు కవిత్రయము వారు వ్యాస రచిత భారతార్థమును వెల్లడించుటకు యత్నిం చిరే కాని, దానిని యథాతథముగా అనువదించుటకు పూని యుండలేదు. మఱియు సంస్కృత భారతము సకలాగమతత్త్వసార సాగరమని చెప్పదగిన మహేతి హాసము. దానిని కవిత్రయము వారు కేవలేతిహాసముగా కాక, ఇతిహాస కావ్య ముగా రూపొందించినట్లు తెలియవచ్చును. వ్యాసునిది పౌరాణికనైతిక దృష్టి. అత డవకాశము లభించినపుడెల్ల ధర్మనీతి తత్త్వములను ప్రపంచించుటకు యత్నించెను. కవిత్రయము వారికి కూడ అట్టి దృష్టి కొంత లేకపోలేదు. కాని వారు దానికి కావ్యత్వ దృష్టినికూడ జత చేసిరి. ఈ దృష్టి భేదమే ఆంధ్ర మహా భారతము కేవలానువాదముగా కాక ఒక స్వతంత్ర మహాకావ్యముగ ప్రతిభా సించుటకు కారణమైనది.

నన్నయ భారతాంధ్రీకరణమునం దవలంబించిన పద్ధతినే తిక్కనయు, ఎఱ్ఱనయు కూడ నవలంబించిరి. వారే యననేల? మారన భాస్కరాదులు, కేతన కూడ కొంచెమించుమించుగా ఆ పద్ధతినే ఒజ్జబంతిగా గ్రహించిరని చెప్ప వచ్చును. కవిత్రయము వారి అనువాదమును పరిశీలింప నం దీక్రింది రీతులు కనిపించును. వానిని వివరించుచు స్పష్టతకై ఒందు రెండుదాహరణములు మాత్ర మొసంగెదను.

1. మూలమునందున్న కొన్ని భాగములను కవిత్రయము వారు పూర్తిగా విడిచి వైచిరి. అందు కవి అనౌచిత్యమయములుగా గోచరించుటయో, తత్త్వ విషయ ప్రచురములై యుండుటయో, ప్రధాన కథతో సన్నిహిత సంబంధము లేని వగుటయో కారణమై యుండును. సంస్కృత భారతమున మూడవ అధ్యాయములో ధౌమ్యుని శిష్యులైన ఉపమన్యువు, అరుణి, వేదుడు అను వారి వృత్తాంతములు చెప్పబడినవి. ఇందలి వేదునే నన్నయ పైలుడని పేర్కొనెను. ఉదంకు డితని శిష్యుడు. అతడే జనమేజయునకు సర్పయాగ బుద్ధి పుట్టించి యుండెను. ఈ విధముగా నతనికి భారత కథతో కొంత సంబంధమున్నది కావున నతని వృత్తాంతము నందు చెప్పవచ్చును. అతడు గురువు నొద్ద విద్య నభ్యసించుటకు కాని, అతని సహపాఠుల వృత్తాంతమునకు కాని భారత కథతో సంబంధము లేదు. అందుచేతనే నన్నయ వారి వృత్తాంతమును పూర్తిగా విడిచి వైచెను. సంస్కృత భారతమున దుష్యంతుడు శకుంతలను తిరస్కరించు సందర్భమున మేనక నిరనుక్రోశ అనియు, బంధకి అనియు విశ్వామిత్రుడు నిరనుక్రోశుడనియు, కామపరాయణుడనియు మేనకా విశ్వామిత్రులను కూడ దూషించినట్లున్నది. ఇట్లు దుష్యంతుడు వారిని దూషించుట అతని శీలమునకు భంగము నాపాదించునని తలంచి నన్నయ ఆ దూషణ భాగమును విడిచి వైచెను. పాండవ, సభావైభవము నారసి ఈర్ష్యాళువై దుర్యోధనుడు కృశించి యుండెను. శకుని యాతని కడకేగి అతిడట్లు కృశించుటకు కారణమేమని అడిగెను. దుర్యోధనుడు పాండవులసంపద తన కసమ్మతమై యుండెనని తెల్పి దానిని హరించు విధమేదియో యెఱింగింపుమని అడిగెను. శకుని అంత నాతనికి "నీవు పాండవులను గూర్చి ఈర్ష్య వహించుట యుక్తము కాదు. వారు పైతృకమైన భాగమును పొంది పరాక్రమముచే నభివృద్ధి నొందుచున్నారు. నీవును వీరులైన సోదరులయు, ద్రోణాదులయు సాహాయ్యముచే భూమిని జయించి

వైభవము నొందు" మని ధర్మానుగతమైన నీతి నుపదేశించినట్లు మూలమం దున్నది. ఇట్లు నీతినుపదేశించుట శకుని సహజస్వభావమునకు విరుద్ధము కావున నన్నయ దానిని విడిచి వైచెను.

అరణ్యపర్వమున పయోష్ణీ సరః ప్రభావమును తెల్పు సందర్భమున రోమశుడు ధర్మరాజునకు సుకన్య వృత్తాంతము నెఱింగించెను. అచ్చట విహరించుచున్న సుకన్య సౌందర్యమును చూచి చ్యవనుడు ప్రీతుడై ఆమెను పల్కరించెననియు, ఆమె వినిపించుకొనలేదనియు మూలమున చెప్పబడినది. ఈ విషయము చ్యవనుని శీలమునకు భంగము కల్గించునను కారణముచే నన్నయ చ్యవనుడు సుకన్యను చూచి ప్రీతుడైన విధమును విడిచివైచెను. ఇట్లే మూలమున కొన్ని కథలు రెండుచోట్ల పునరుక్తములైనపుడు నన్నయ వానిని జతచేసి ఉచితమైన విధమున ఒకేచోట చెప్పియుండెను. ఇందుకు పరీక్షిజ్జరత్కార్వాదుల వృత్తాంతములు నిదర్శనములు.

తిక్కన ఉద్యోగ పర్వమున సనత్సుజాతీయమును పూర్తిగా విడిచి వైచెను. విదురు డెన్ని నీతులు చెప్పినను ధృతరాష్ట్రుని మనస్సు ప్రశాంతము కాలేదు. అత డింకను నీత్యాధ్యాత్మిక విషయములు తెల్పుమని అడుగగా విదురుడు "వానిని చెప్పుటకు సనత్సుజాతుడు తగినవాడు. నీ వాతనిని స్మరించి నచో నతడు వచ్చి నీకు తగిన ప్రబోధము కావించు" నని చెప్పెను. ధృతరాష్ట్రుడు సనత్సుజాతుని స్మరించెను. అతడు వచ్చి ధర్మతత్త్వ విషయములతో గూడి భగవద్గీతవలె మిక్కిలి దీర్ఘమైన సనత్సుజాతీయమును చెప్పెను. తిక్కన దానినంతను విడిచి సనత్సుజాతుడు వచ్చి ధృతరాష్ట్రునికి ఆధ్యాత్మిక విషయములను బోధించెనని ఒక్క వాక్యమును మాత్రము వ్రాసియుండెను.

సనత్సుజాతుడు అన్ని విషయములు బోధించిన పిమ్మటకూడ ధృతరాష్ట్రుని మనస్సున ఎట్టి పరివర్తనము కలిగియుండలేదు. అతడు చెప్పిన దంతయు నిష్ఫలమయ్యెను. మహర్షి ప్రబోధము వ్యర్థమయ్యెనని చెప్పుట కిష్టము లేకయో, ముందు సంగ్రహముగా నైనను తాత్త్విక విషయమైన భగవద్గీతను చెప్పుచున్నాను కదా యని తలంచియో తిక్కన ఆ ఘట్టమును ఊరక సూచించి విడిచి వైచెను,

సంస్కృత భారతమున ఆశ్రమవాస పర్వము నందలి పుత్ర దర్శన పర్వములో ధృతరాష్ట్రుడు మరణించిన పుత్రులను దర్శించినట్లున్నది. జనమేజయు డది విశ్వసింపక మరణించిన తన తండ్రిని తనకు చూపుమని వ్యాసుని వేడుకొనెను. అప్పుడు వ్యాసు డతనికి పరీక్షిత్తునేకాక శమీకాదులను కూడ చూపి యుండెను. జనమేజయుడు మొదట వ్యాసుని మహత్త్వమును శంకించుట అతని శీలమునకు భంగకరముగా నుండుననియు, మృతులైన వారిని చూపుట అసహజముగా నుండుననియు తిక్కన ఆ భాగమును విడిచిపైచెను.

ఎఱ్ఱన హరివంశమున హంసడిభకోపాఖ్యానము కానరాదు. అతడు దానిని ఉద్దేశపూర్వకముగ విడిచి పైచెనో లేక అతడు అనువదించిన మూలములో అది లేకుండెనో చెప్పజాలము. నాచన సోమనాథుడు తన ఉత్తర హరివంశమున ఈ హంస డిభకోపాఖ్యానమును చాల సుందరముగ వర్ణించెను. "హంస డిభకోపాఖ్యానము ఈ గ్రంథములోని కథల కెల్ల హృద్యతమమై విరాజిల్లునట్టిది."1

2. కొన్ని భాగములను పూర్తిగ విడచినట్లే, నన్నయాదులు మూలమున అతి విస్తృతముగా నున్న కొన్ని భాగములను సంక్షేప మొనర్చిరి. సంస్కృతమున ఆదిపర్వము నందలి ఎనుబది నాల్గవ అధ్యాయమున అష్టకాదులు యయాతిని పెక్కు ప్రశ్న లడిగినట్లను, యయాతి వాని కన్నింటికి సమాధానములు చెప్పినట్లును వర్ణింపబడినది. నన్నయ అష్టకాదుల ప్రశ్నలన్నింటిని విడిచి సమాధానములను మాత్రమే యయాతిచే చెప్పించి "యయాతి అష్టకాదులడిగిన వానికెల్ల సంక్షేప రూపమున చెప్పుటయు" అని తాను బుద్ధిపూర్వకముగ అచ్చట సంక్షేపము కావించినట్లు సూచించెను. ధర్మరాజు జూదమాడు సందర్భమున ఒక్కొక్క వస్తువునే ఒడ్డి దానిని వర్ణించి "తేనదీవ్యామ్యహంత్వయా" అని పల్కుచుండుటయు, శకుని "జితమిత్యేవ" అని తాను జయించితినని పల్కుటయు పలుమార్లు కాననగును. (సభా. 61 అధ్యా.) నన్నయ ధర్మరాజొడ్డిన వస్తువుల నన్నింటిని వచనమున ఒక్కచోటనే వర్ణించి "ఒక్కొక్క ఒడ్డుననే ఒడ్డియోటువడె" నని మూలమునందలి పునరుక్తిని తగ్గించెను. అరణ్యపర్వమునందు అష్టావక్రుడు జనకు డడిగిన ప్రశ్నల కన్నిటికిని సమాధానము చెప్పినట్లున్నది. (133 అధ్యా.) నన్నయ వాని నన్నింటిని విడిచి "జనకభూపాలుని సంప్రశ్నములకెల్ల నేర్పడ ఉత్తరంబిచ్చి" అని మాత్రము చెప్పి అచ్చట మూల భాగము సంక్షేపించెను.

తిక్కన భీష్మపర్వమున ఉపనిషత్సారభూతమైన భగవద్గీతను చాలవ ఱకు సంక్షేపించెను. భగవద్గీతకుగల ప్రాధాన్యము తిక్కనకు తెలియకపోలేదు. దానిని యథాతథముగ అనువదించు సామర్థ్యము కూడ అతనికి లేకపోలేదు. కాని కావ్యకళా దృష్టితో చూచిన ఆ సందర్భమున అంత సుదీర్ఘమయిన భగవద్గీత వంటి వేదాంతచర్చ అనుచితమును, కథాగతికి భంగకరమును అగునని తలం చుటచే అతడందలి సారవంతములైన శ్లోకములను మాత్రము అనువదించుచు సంక్షేపరచన కావించెను. మొదట నాత డర్జునుని విషాదయోగమును వివరించి, విశ్వరూప సందర్శన యోగము వరకు గల భాగమును చాల సంగ్రహముగ చెప్పివైచెను. తరువాత విశ్వరూప సందర్శనమును కూడ సంగ్రహముగ అను వదించి 'మత్కర్మపరుండును, మద్భక్తుడునునైన వానికి నన్నుఁ బడయవచ్చు' నని తెల్పి(భీ 1.221) మిగిలిన ఏడధ్యాయముల భాగమును ఒక్క పద్యములో ఈ విధముగ సంగ్రహించెను.

> "అతడు మఱియును బ్రహ్మవిద్యాన్వయమునఁ
> దనకు సందిగ్ధమైనట్టి దాని నెల్ల
> నడుగగా నమ్మహాత్ముఁ డత్యంత కరుణఁ
> దెలియఁజెప్పుచు హృదయ సంచలత మాన్చె"
>
> (భీ. 1.222)

ఈ విధముగా తిక్కన ఏడువందల శ్లోకములతో కూడిన భగవద్గీత నంశను ఏబది గద్యపద్యములలో సంగ్రహించి చెప్పియుండెను.

కామ్యక వనమున పాండవులను చూడ నరిగినపుడు కృష్ణుడు ధర్మరాజు ధార్మికత్వమును ప్రశంసించి ద్రౌపది కుమారుల క్షేమవార్త నెఱింగించుచు ఆమె నూఱడించు భాగము పండ్రెండు శ్లోకములలో చెప్పబడియున్నది. అందు భావముల పునరుక్తి కన్పించును. ఎఱ్ఱన ఆ పునరుక్తుల నన్నింటిని తగ్గించి అందలి సారాంశమును ఈ క్రింది సీసముగా సంగ్రహించెను.

> సీ. "నీ పుత్రులేవురు నీరజలోచన! యదు
> కుమారులు దారు ముదము తోడ
> ననుపమ స్నేహ సమాహిత హృదయులై
> కరిహయ రోహణ పరతఁదగిలి

యాడుచు వివిధ శస్త్రాస్త్ర ప్రయోగముల్
గఱచుచు నొండెల్ల మఱచియున్న
వారు ప్రద్యుమ్నుండు వారికి దివ్యాస్త్ర
జాతంబులెల్లను బ్రీతి నొసగె
ఆ. దన్వి! యా సుభద్ర తన పుత్రుకంటె నీ,
తనయులందుఁ గూర్మిఁ దనరఁజేయు
నూఱడిల్లు మింక నుజ్జ్వలోన్నతులఁ
బెంపారఁ గాల మనతి దూరమయ్యె"

(అర. 4.162)

రామోపాఖ్యానమున త్రిజటాస్వప్న వృత్తాంతము తరువాత మూలమందు సీతారావణ సంవాదము విస్తృతముగా వర్ణింపబడినది. అందు రావణుడు తన యొక్కయు సోదరుల యొక్కయు మహత్త్వైశ్వర్యములను వివరముగా తెల్పి తనయందు ప్రేమ నిల్పుమని సీతను కోరియుండెను. మఱియు నందు సీత రావణుని ప్రత్యాఖ్యానము చేయుట మూడు నాలుగు సార్లు వివరింపబడినది. ఎఱ్ఱన ఈ భాగము నంతను సంగ్రహించి రావణుడు చెప్పిన దంతయు ఒక్క మారే తెల్పినట్లును సీత అతడు చెప్పినదానిని తృణ మంతరముగ నుంచి ఖండించినట్లును రచించెను.

8 తమ రచనకు కావ్యతాశోభ కల్గించుటకై కవిత్రయము వారు మూలమున లేకున్నను తాము కల్పించి వ్రాసిన వర్ణనాదులు కొన్ని కలవు. ఉదంకుడు మూలమున అనంత వాసుకులను స్తుతించినట్లు లేకున్నను, వారును సర్పరాజులగుటచే అతడు వారిని కూడ స్తుతించినట్లు వేఱు వేఱు పద్యములు రచించెను. అతడు ఆది పర్వము ఎనిమిదవ ఆశ్వాసమున ఖాండవ ప్రస్థమును వర్ణించిన ప్రౌఢములును, ఆలంకారికరచనా శోభితములును నైన పద్యము లమూలకములైనవి. తరువాత ప్రబంధములలో నారంభమున కనవచ్చు పురవర్ణన పద్యముల కవి ఆదర్శములైనవని భావింపవచ్చును. ఆరణ్యపర్వమున అర్జునుడు శివుని స్తుతించు సందర్భమున నన్నయ వ్రాసిన దండకము అతడు కల్పించి వ్రాసినట్టిదే. ఇట్లే ఆత డాయా సందర్భముల కనుగుణముగా రచించిన అమూలకములైన భావములతో కూడిన పద్యము లనేకము లున్నవి.

తిక్కన సందర్భానుగుణముగ అమూలకములైన వర్ణనాదులతో పెంచిన ఘట్టములు భారతమున చాల కలవు విరాటపర్వమునందు కీచకుడు ద్రౌపదిని వలచిన వృత్తాంతము, ఉద్యోగ పర్వము నందలి సంజయ, శ్రీకృష్ణుల రాయ బారపు ఘట్టములు అందు ముఖ్యములైనవి. కీచకుడు ద్రౌపదిని వలచిన ఘట్ట మున తిక్కన కాముకుల మనోవృత్తికి ఉచితములగు భావములను వర్ణనములను పెంచి ఆ భాగము నొక స్వతంత్ర ప్రబంధమా అను నట్లొనరించెను. ఉద్యాన వనమున విహరించు సందర్భమున కీచకుడు నిగుడు మనోరథంబులను భావ రతంబులను శిశిరోపచారంబులను ప్రొద్దు గడపి కడగానక తల్లడ మందిన విధమును తిక్కన విపులముగా వర్ణించెను. ఇచ్చటి భావములు పెక్కు మూల మున కానరావు. ఈ పద్యములే తరువాత ప్రబంధములందు చంద్రమన్మథాద్యు పాలంభములకు, శీతలోపచారాదులకు మేలుబంతులైనవని చెప్పవచ్చును. ఈ సందర్భమున తిక్కన కావించిన సూర్యోదయాస్తమయ వర్ణనాదులు కూడ నిట్టివే. సంజయ శ్రీకృష్ణుల రాయబారములు వర్ణించు సందర్భములందు తిక్కన తన రాజకీయ వేత్తృతను, సంభాషణ చాతుర్యమును ప్రదర్శించుచు అమూలక భావములనెన్నింటినో వ్యక్తము గావించెను. ద్రుపద పురోహిత, సంజయ, కృష్ణుల రాయబారముల యెట్ల నతడు పునరుక్తులు దొరకుండ రాయబారములు నడుపు వ్యక్తుల బుద్ధి కౌశలము ప్రదర్శిత మగునట్లు సంభాషణములను తీర్చి దిద్దెను.

ఎఱ్ఱన, రామలక్ష్మణులు పంపాసరోవరమును సందర్శించినపుడు ఆ సర స్సును "కమనీయ కమలినీ కల్హార దళ కేసరాన్విత జలముల అర్ఘ్యవిధియు" అను సీస పద్యమున పంపా సరస్సున అతిథేయుడైన గృహస్థుని ధర్మము లన్నియు ఆరోపించి సుందరముగా వర్ణించెను. అట్లే మోషయాత్రా సందర్భమున అతడు కావించిన గోకదంబ వర్ణనము సూక్ష్మాంగ వివరణ సహితమై అతడు తానెచ్చటనో చూచిన గోకదంబమును దృష్టియందుంచుకొని చేసిన వర్ణనము వలె నున్నది.

4. కవిత్రయము వారు ఔచిత్యానుగుణముగ మూలమునం దత్యల్పముగ నున్నపట్లు విస్తృతీకరించి తమ కావ్యములకు శోభ కలిగించిన కొన్ని సన్నివేశములు కన్పించును. నన్నయ పెక్కు చోట్ల మూలము నందలి ఒక పదమునో కొన్ని పదములనో

ఆధారముగా గ్రహించి అందలి భావములను విపులీకరించి మనోహరములైన పద్యముల నెన్నింటినో రచించెను. దేవయాని పుత్రులను కాంచిన పిమ్మట శర్మిష్ఠ "ఋతుకాలశ్చ సంప్రాప్తో న చ మే స్తి పతిర్వ్రతః" అని శోకించి నట్లు మూలమునందున్నది. నన్నయ ఆ ఋతుకాల సంప్రాప్తిని ఆమె శోకమును "అసదృశ యౌవనంబిది అనన్య ధనంబగు నాకు" అను పద్యమున చాల సుందరముగ వర్ణించెను. అర్జునుడు ద్వాదశ మాసిక వ్రతము సల్పు సందర్భ మున పెక్కు గిరి నగర నదీక్షేత్రములను సందర్శించెనని తెల్పి మూలము అతడు గోదావరిలో కూడ స్నానము చేసెనని చిన్నవాక్యమున సూచింపియున్నది. నన్నయ దానిని పురస్కరించుకొని "దక్షిణ గంగనాఁ దద్దయు నొప్పిన గోదా వరియు" అను సీసమున వేగి దేశమును తనివి తీర వర్ణించి తన దేశాభిమాన మును ప్రకటించెను. సభాపర్వమున శిశుపాలుడు కోపముతో సభ వీడి వెడలి నపుడు ధర్మరాజు అతని వెంట చని "వేదతత్త్వేన కృష్ణంహి భీష్మ శ్చేదిపతే భృశ" మ్మని భీష్ముడు కృష్ణుని తత్త్వమును బాగుగా ఎఱుగునని తెల్పి అతని ప్రసన్నుని కావింప యత్నించెను. నన్నయ అచట "ఆదిజుఁడైన బ్రహ్మ ఉదయంబున కాస్పదమైన వాడు" అను పద్యమున కృష్ణుని మహత్త్వమును, గుణగణములను లెస్సగా వర్ణించెను. ఇంకను మూలమున అలంకార రహితములై, విషయమును మాత్రము తెల్పు శ్లోకములను, అలంకార హృద్యములుగా అనువ దించి పౌరాణికమైన సరళ శైలికి కావ్యోచిత ప్రౌఢి కలిగించిన సందర్భము లనే కము లున్నవి. "ఉదయాద్రి దరీముఖమున నుదితుండగు పూర్ణహిమ మయూ ఖుడు పోలెన్" "నీరజ మిత్రు డేం ధరణీ గతుడయ్యెడు నాకొ యంచు విస్మేర మనస్కులై జనులు మెచ్చి నిజద్యుతి చూచుచుండగా నారదు డేగుదెంచె" "ఉరుతర సార్ద్ర పయోరాశి హస్తియూథాగస్స్యూచేఁ బీతమయ్యె మఱియు" మున్నగునవి ఇందులకు నిదర్శనములు. ఇట్లే నన్నయ పెక్కు సందర్భము లందు నీతి బోధకములైన అర్థాంతర న్యాసములను కూడ కల్పించి వ్రాసెను. వ్యక్తులను వర్ణించునపుడును, వారిని తొలుదొల్త ప్రవేశపెట్టునపుడును నన్నయ మూలములోని పెక్కు విశేషణములను చేర్చి వారి స్వరూపములను ముందే పఠితలకు ప్రత్యక్షము చేసియుండెను.

తిక్కన మూలమునందలి అల్పమైన సూచనలను గ్రహించి అందలి భావ ములను పెంచి రచించిన ఘట్టము లనేకము లున్నవి. మూలమున పాండవులు

అజ్ఞాత వాసము నెట్లు గడిపిరో తెల్పుమని జనమేజయుడు వైశంపాయనుని "కథం విరాట నగరే మమ పూర్వపితామహాః అజ్ఞాతవాస మషితాః దుర్యోధన భయార్దితాః" అని అడిగెను. ఈ శ్లోకమున ఒట్టి సంప్రశ్నమే తప్ప విశేష మేమియు లేదు. తిక్కన ఆశ్లోకమును

చ. మహిత సముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యు లంగనా
సహితముగాగ నేమి గతి సమ్యగుపాయ నిగూఢ వృత్తిమై
నహితుల కప్రభేద్యముగ నా పదుమూడగు నేడు మత్పితా
మహులు చరించి రంతయు నుగ్రమంబున నాకెఱుగంగఁజెప్పుమా
(వి. 1,44)

అని యనువదించెను. ఇందాతడు వాడిన విశేషణములు జనమేజయుని మనస్సున కల్గిన సందేహమును చక్కగా వెల్లడించు చున్నవి. ఇట్లే శాంతి పర్వము నందలి చిరకారి కథలో తిక్కన మూలమునందలి సూచనను గ్రహించి జననీ మహత్త్వమును వివరముగా తెల్పియుండెను.

ఎఱ్ఱన మూలము నందలి భావమును పెంచి వ్రాసిన పట్టులు పెక్కు కలవు. కామ్యక వనమందలి పాండవులను దర్శించుటకు శ్రీకృష్ణుడు వెళ్ళినపుడు మూలమున "రథిక వరుడైన దేవకీపుత్రుడు శైబ్య సుగ్రీవ యుక్తమైన రథముపై సత్యభామతో కూడ శచీ సహితుడైన ఇంద్రుని వలె కురుసత్తములను చూచు కోరికతో వచ్చెను" అని కలదు. ఎఱ్ఱన ఈ భావమును

సీ. శైబ్య సుగ్రీవాది జవనాశ్వయుక్తమై
యాబద్ధ నూత్నరత్నాంశు పటల
భాసితంబై చారుపతగ పతాకా వి
భూషిత గగనమై పొలుపు మిగులు
దివ్య రథంబున దేవకీ సుతుడు ప్రి
యంబున సత్యభామాన్వితముగఁ
దరళ సౌదామినీ దామ సముజ్జ్వల
ధారాధరోత్సంగ తలమునందు

ఆ. శచియుఁ దాను వెలుగు శతముఖుండునుబోలె,
నరుగుదెంచె ఘనరథాంగనేమి
విపుల ఘోషతాండవిత బర్హి శబ్దశ
బ్దాయమానవన విభాగుడగుచు. (అర. ప. 4. 151)

అని మూలమును పెంచి రమ్యముగ వర్ణించెను. రథమునకు ఎఱ్ఱన వాడిన విశే షణములును, తరళ సౌదామినీ దామేత్యా ద్యుపమానమును, రథనేమి శబ్దము విని నెమిళ్ళు నర్తించుచు కేకలిడుటయు అమూలకములైనట్టివే. హనుమదాది వానరులు మధువనమున విహరించి సుగ్రీవుని దర్శనమునకు వచ్చిన సందర్భ మున వ్యాసుడు.

"హనుమత్ప్రముఖాశ్చాపి విశ్రాంతా స్తే ప్లవంగమాః
అభిజగ్ము ర్హరీంద్రం తం రామలక్ష్మణ సన్నిధౌ" అను శ్లోకమును రచించెను. ఎఱ్ఱన దానిని

ఉ. తేనెలు గ్రోలి గ్రోలి కడుఁదియ్యని కమ్మని పండు లింపుసొం
పానగ నానియాని పరపందిన నీడలు మెచ్చి మెచ్చి మం
దానిల శైత్య సౌరభ సమగ్రతకుం గడుఁ జొక్కి చొక్కియు
ద్యానమునందు మారుత సుత ప్రముఖుల్ విహరించి తృప్తులై
(అర. 7. 11)

అవి పెంపు చేసి వానరుల మధువన విహార క్రమమును విశదముగా వర్ణించెను.

5. కవిత్రయము వారు సంస్కృతమున కూడ మహాపండితులగుటచే భారతమునందలి కొన్ని ఘట్టములలో తాము చదివిన పూర్వ సంస్కృత గ్రంథ ములందలి హృద్యములైన భావములను యథోచితముగా చొప్పించి యుండిరి. నన్నయ శకుంతలోపాఖ్యానమును, శిశుపాలవధ ఘట్టమును, ఎఱ్ఱన రామోపా ఖ్యానమును పరిశీలించిన ఈ విషయము తేటతెల్లమగును. నన్నయ శకుంతలో పాఖ్యానమున కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలములోని భావములను, కిరాతార్జునీయ

ఘట్టమున భారవి కావ్యము నందలి భావములను, నలచరిత్ర సందర్భమున నైషధీయ చరిత్రము నందలి భావములను అచ్చటచ్చట వ్యక్తము గావించెను. అవి ఉద్దేశ పూర్వకములైన అనుకరణములు కాక యాదృచ్ఛికములైనను కావచ్చును. అట్లే కన్నడ పంపభారతము నందలి భావములేకాక పదబంధాదులు కూడ నన్నయ రచనలో చొచ్చినవని విమర్శకుల యభిప్రాయము.

ఎఱ్ఱన అరణ్య పర్వము నందలి రామోపాఖ్యానమును భారతము నందలి రామోపాఖ్యానము ననుసరించియే వ్రాసియున్నను వాల్మీకి రామాయణము నందలి భావములను కూడ కొన్ని చోట్ల ప్రవేశపెట్టియుండక పోలేదు. సీత అగ్ని ప్రవేశము వ్యాస భారతమున లేకున్నను ఎఱ్ఱన సీత "జననాయక యే ననలంబుఁజొచ్చి వెడలెద" (అర. 7. 161) నన్నట్లు రచించుట వాల్మీకి రామాయణ కథానుసరణమే. అట్లే వ్యాస భారతమున లేకున్నను ఎఱ్ఱన ఇంద్రజిత్తు 'నికుంభిళయాగము' చేసినట్లున్న రామాయణ వృత్తాంతము తెలుగు భారతమున సూచించెను.

౬. కవిత్రయము వారు మూలము నందలి భావములు అనుచితములని తోచినపుడు వాని నన్యథాకరించి ఔచిత్యమును పోషించిన ఘట్టములు కూడ అచ్చటచ్చట కానవచ్చును. ఇట్లు చేయుటకు వ్యాసుని కాలమునకును వారి కాలమునకును, వ్యాసుని భారతరచనా దృష్టికిని వారి రచనా దృష్టికిని గల భేదమే కారణము. ఇట్టివానికి పెక్కుదాహరణము లీయవచ్చును. ఉదంకుడు నాగ కులమును తనకు వశము చేయుమని దివ్యపురుషుని ప్రార్థించినపుడు అతడు 'ఏతమశ్వ మపానే ధమస్వ' అని చెప్పినట్లు సంస్కృతమునందున్నది. ఇది అశ్లీలముగను, అనుచితముగను తోచుటచే నన్నయ అపానమును కర్ణముగా మార్చి ఈ అశ్వకర్ణాధ్మానంబు చేయుమని దివ్యపురుషుం డాదేశించినట్లు వ్రాసెను. అరణ్యపర్వమున ఇంద్ర సురభి సంవాదమున, సురభి జనులు బలముగల ఎద్దులతో బలహీనములైన వానిని పూన్చి కృష్యాది కర్మము లొనరించుచు దుర్బలములైన తన అపత్యములకు బాధ కల్గించుచున్నారని దుఃఖింప నింద్రుడు బాగుగా వర్షము కురియించి కర్షకుల కార్యములకు విఘ్నములు కలిగించినట్లు మూల భారతమునందున్నది. ఇంద్రుడు దుర్బలములైన ఎద్దులకు బలము కల్గింపవలెను కాని తాత్కాలికముగ వర్షము కురియించి కర్షకుల కార్యములకు విఘ్నములు కల్గించుట వలన లాభము

లేదని నన్నయ ఇంద్రుడు వర్షముచే తృణవర్ధనము కావించి బలహీనములైన ఎద్దులకు బలము కలిగించెనని మార్చి వ్రాసి ఔచిత్యమును పోషించెను.

తిక్కన విరాటపర్వమున అర్జునుడు విరటుని కొల్వున కరిగి "నాకు సంగీత నాట్యములందు నేర్పు కలదు. వాని నంతఃపురకన్యలకు నేర్పెదను. నన్ను అంతఃపురమున నుంచుకొన వలసిన" దని కోరెను. విరటు డందు కంగీకరించెను. కాని బృహన్నల నిజముగా నపుంసకుడగునో కాదో అను సందేహము కల్గుటచే అతడు కొందఱు స్త్రీలను పంపి అతనిని పరీక్షింపచేసి సత్యము నెఱింగి అతని నంతఃపురమున నియోగించినట్లు సంస్కృత భారతమునం దున్నది. నపుంసకత్వమును పరీక్షించుటకై స్త్రీలను పంపుట అనుచితముగా తోచుటచే తిక్కన ఆ భాగమును తొలగించి "నైపుణంబున నుచితంబు మైనరసి పొచ్చెంబు లేమి తదీయ సేవ గైకొనుటకు నిశ్చయించె" నని ఔచిత్య శోభిత ముగ మార్చెను. కీచకునిచే పరాభవింపబడిన ద్రౌపది తన పరాభవమును భీమునికి తెలియించుకొనుటకై వంట ఇంటి కరిగెను. భీముడు నిద్రించుచుండెను. ద్రౌపది అతనిని చూచి "భీమసేనా లెమ్ము. చచ్చినవానివలె నిట్లు నిద్రించితి వేమి ?" అని లేపినట్లు మూలము నందున్నది. ఏభార్య కాని భర్త నిట్లనుట ఉచితము కాదు. ద్రౌపది వంటి ఉదాత్త చరిత అట్లనుట మఱియు నుచితము కాదు. అందుచే తిక్కన "చచ్చినట్లు పరుంటివేమి ?" అను విషయమును తొల గించి "నన్ను పరాభవించి సదనంబునకుంజని" ఇత్యాది పద్యము నౌచిత్యవంత ముగ రచించెను.

ఎఱ్ఱన ధూమ్రాక్షుడు హనుమంతునితో కావించిన యుద్ధము ఇంద్రుడు ప్రహ్లాదునితో చేసిన దాని వలెనున్నదని మూలమందుండగా ప్రహ్లాదుడు రాక్షసు డయ్యును, మహాభక్తుడగుటచేతను, ఇంద్ర ప్రహ్లాదుల యుద్ధమంత ప్రసిద్ధము కాకపోవుట చేతను "ప్రథనమయ్యిద్దరకపు డుగ్రభంగి నమరపతికి వృత్రునకుం బోలె ప్రకటమయ్యె" అని వీరుల యుద్ధము ఇంద్రవృత్రాసురుల యుద్ధము వోలె నుండెనని వర్ణించెను. వర్షఋతువర్ణన సందర్భమున నల్లని మేఘములు గంభీర ఘోష మొనరించుచు ఆకాశమును, దిక్కులను కప్పుచు రాత్రింబవళ్ళెడతెగక వర్షించెనను అర్థముకల మూలశ్లోకమునకు ఎఱ్ఱన, మేఘములకును ఏనుగులకును పోలిక సంఘటించి ఉత్ప్రేక్షాలంకారముతో కూడిన 'దానాంభః పటలంబునన్' అను శార్దూలమును వ్రాసి మూలశ్లోకమున కెంతో వన్నె కల్పించెను.

7. కవిత్రయమువా రించుక మార్పులతో మూలమునకు మెఱుగు పెట్టిన భాగములును కొన్ని కలవు. సభా పర్వమున "అల్పోపిహ్యారి రత్యంతం వర్ధమాన పరాక్రమః వల్మీకో మూలజఇవ గ్రసతే వృక్ష మంతికాత్" అని నారదుడు ధర్మజునితో చెప్పిన శ్లోకమును, నన్నయ "అల్పుడయ్యు మనుజుడతిపరాక్రమమున పేర్మి తరతరంబ పెరుగుచున్నవాడు, మ్రాని మొదలి వల్మీక మామ్రాని చెఱచునట్లు కడగి చెఱచుఁబగర" అని అనువదించెను. మూలమున శత్రువు అల్పుడయ్యు వర్ధమాన పరాక్రముడై ఏమి చేయునో చెప్పబడి యుండలేదు. నన్నయ 'కడగి చెఱచుఁబగర' అని వ్రాసి ఆ లోపమును పూరించి మూలమునకు మెఱుగు పెట్టెను.

తిక్కన భగవద్గీతయందలి చరమ శ్లోకమైన "సర్వధర్మాన్ పరిత్యజ్య" అను శ్లోకము ననువదించుచు, "క్రందుకొను సర్వధర్మ వికల్పములను నెడల విడిచి దృఢంబుగ నే నొకండ శరణముగ నాశ్రయింపుము" అని అనువదించెన్మ సర్వధర్మాన్ అను మూలమునందలి సమాసమును "క్రందుకొను సర్వధర. వికల్పములను" అని అనువదించుట మూలమునకు శోభ కల్గించు చున్నది.

రావణుడు అశోక వనమందలి సీత కడ కేగినపుడు మూలమున "విచిత్ర మాల్య ముకుటో వసంత ఇవ మూర్తిమాన్, సకల్ప వృక్ష సదృశో యత్నాదపి విభూషితః శ్మశాన చైత్య ద్రుమవత్ భూషితోఽపి భయంకరః' అను వర్ణన మున్నది. పై వర్ణనమున వసంత సామ్యము ఎఱ్ఱన విడిచిపైచి ఎఱ్ఱన కల్పవృక్ష సదృశః అను సమాసమును 'సంచార శీలమైన కల్పపాదపంబు వోలె' అని సూక్తి వైచిత్రితో అనువదించి మూలమునకు వన్నె కలిగించెను. 'శ్మశాన చైత్య ద్రుమవత్' అను దానిని ఎఱ్ఱన పితృవనంబునందలి వట భూరుహంబని వర్ణించి, మూలమున లేని వట వృక్షమును పేర్కొనుటచే రావణుని విస్తృతోన్నత మైన రూపమును ప్రత్యక్షమొనరించెను. ఇట్టి వానిని కవిత్రయము వారు మూల భావములకు కావించిన వ్యాస హృదయావిష్కారకములైన వివరణములని చెప్పవచ్చును.

8. మూలమును మార్చియో, పెంచియో కవిత్రయము వారు కొన్ని సన్నివేశములందు తమ నాటి సాంఘిక పరిస్థితులను ప్రకటించి యుండిరి.

అరణ్యపర్వమున పాండవులు బాణపాతితములైన మృగాదులను ముందు బ్రాహ్మణులకు నివేదించి తరువాత తాము తినిరని వ్యాసుడు వ్రాసి యుండెను. నన్నయ తన కాలమున బ్రాహ్మణులకు మాంస భోజనము నిషిద్ధమైపోవుటచే ఆ విషయమును విడిచివైచెను.

తిక్కన ఉత్తరాభిమన్యుల వివాహమును వర్ణించునపుడు మూలమున లేని వైదిక లౌకికాచారములను వివరించి తన నాటి ఉన్నత వంశస్థుల కుటుంబము లోని వివాహములను స్ఫురింప చేసెను. రాయబారపు ఘట్టములందు మనుమసిద్ధి రాజ్యము నిలుపుటకై యాతడు గణపతి దేవుని దర్శించి నిర్వహించిన రాయ బారము నందలి అనుభవము స్పష్టపడును.

ఎఱ్ఱన హరివంశ పూర్వభాగమున పల్లీజీవితము నద్భుతముగ వర్ణించెను. మూలమున గూడ ఇట్టి వర్ణనము కొంత ఉన్నమాట వాస్తవమే అయ్యెను ఎఱ్ఱన తన నాటి గోకులములయు, గ్రామములయు పరిస్థితులను దృష్టిలో నుంచుకొని యా వర్ణనమును సహజముగను సుందరముగను తీర్చిదిద్దెను. నన్నయ అర్జునుని తీర్థయాత్రా సందర్భమున వేంగీ దేశమును వర్ణించుట అతని దేశాభిమానమును వ్యక్తము చేయుచున్నది.

౭. కవిత్రయమువారు సంస్కృత భారతమునందలి శ్లోకములను యథాతథముగ అనువదించిన పట్లనేకములున్నవి. ఇట్టి అనుసరణము పద్య భాగములందు కంటె గద్యమున ఎక్కువగా గోచరించును.

సభాపర్వమున "అగ్నిహోత్రఫలా వేదా దత్త భుక్త ఫలం ధనం, రతి పుత్ర ఫలాదారాః శీల వృత్త ఫలం శ్రుతం'' అను శ్లోకమును నన్నయ "దార సంగ్రహంబు ధరణీశ ! రతిపుత్ర ఫలము, శీల వృత్తఫలము శ్రుతము, దత్త భుక్త ఫలము ధనము, వేదము లగ్నిహోత్ర ఫలములనియు నొగి నెఱుంగు" అని మూలానుసరణముగ అనువదించెను. ఇట్లు అతడు మూలము నతిసన్నిహితముగ అనువదించిన భాగము లనేకములున్నవి. నన్నయ ఆది సభాపర్వముల కంటె అరణ్య పర్వమున మూలము నెక్కువ దగ్గరగా అనుసరించినట్లు కానవగును. ఆ పర్వమునందలి వస్తువు కల్పనల కెక్కువ తావిచ్చునది కాకుండుటయే దీనికి కారణమై యుండును.

తిక్కనయు వ్యాసుని భావములు గ్రహించి వానిని పరమ విధేయతతో అనువదించిన భాగములు అనేకములు కన్పించును. ఉత్తరుడు బృహన్నలను సారథిగా గ్రహించి కౌరవ సేనలతో పోరాటమున కరిగినపుడు ఉత్తర కౌరవ వీరుల తలపాగాలను బొమ్మ పొత్తికలకై తెమ్మని వేడి యుండెను. అపుడు బృహన్నల "యద్యుత్తరోఽయం సంగ్రామే విజేష్యతి మహారథాన్ తథా హరిష్యే వాసాంసి, దివ్యాని రుచిరాణిచ" అని చెప్పినట్లు వ్యాస భారతమునందున్నది. "యది ఉత్తరః విజేష్యతి" అను మాటలలో ఉత్తరుడు కురువీరులను జయింప జాలడను ధ్వని ఉన్నది. తిక్కన దానిని గ్రహించి "అనుడు బృహన్నల యిట్లను, జననాయక నందనుండు జయలక్ష్మిం జేకొనునదె, చీరలు తెచ్చుట పనియే అటు చూడు మెల్లభంగులఁ దెత్తున్" అను పద్యమున ఆ ధ్వని విస్పష్టమగునట్లు చక్కగ అనువదించెను. భగవద్గీతయందలి "ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః" అను ప్రథమ శ్లోకమును తిక్కన 'మానుగ ధర్మక్షేత్రంబైన కురుక్షేత్రమున మహాహవమునకున్, బూని మన బలము పాండవ సేనయు నటు పన్ని ఏమి చేసెం జెపుమా' అని మూలానుసారముగ వర్ణించెను.

ఎఱ్ఱన యక్ష ప్రశ్నలకు ధర్మరాజు సమాధానములిచ్చిన సందర్భమున మూలమును సన్నిహితముగ ననుసరించి అనువాదము సాగించెను. రామోపాఖ్యానమున కుంభకర్ణ విభీషణుల తపస్సును వర్ణించుచు వ్యాసుడు "అథశ్చాయీ కుంభకర్ణో యతాహారో యతవ్రతః విభీషణః శీర్ణపర్ణ మేక మభ్యవహారయన్, ఉపవాసరతి ర్ధీమాన్ సదా జప్యపరాయణా" అని వ్రాసి యుండెను. ఎఱ్ఱన ఈ సందర్భమున రచించిన "నియతాహారుడు నిర్జితేంద్రియుడునై........వ్రతంబుల్ చరించె నధికేచ్ఛన్ కుంభకర్ణుండు" ఇత్యాది పద్యము మూలమును సన్నిహితముగా అనుసరించుచున్నది.

### కేతన — మారన :

తిక్కనకు మిత్రుడైన కేతన సంస్కృతమున దండి రచించిన దశకుమార చరితమను గద్యకావ్యమును చంపూ కావ్యముగ నాంధ్రీకరించెను. మూలము ననుసరించుచు అందు సంక్షేప విక్షేప విస్తరణము లొనరించుట యందును స్వతంత్రకల్పనము లను గావించు సందర్భములందును ఇతడు తిక్కననే అనుసరించెను.

మూలమున కుసుమపుర వర్ణనము, వసుమతీదేవి వర్ణనము, మణి కర్ణిక వర్ణనము, కందుక నృత్య వర్ణనము, గోమిని వర్ణనము, ధర్మ వర్ణనము విస్తృతముగ నున్నవి. కేతన వానిని సంక్షేపించెను.

"ఇట్లే మూలమున లేని విషయములను కేతన పెంచి వ్రాసిన పట్లును గలవు. మూలమున నవంతి సుందరికి విరహ వేదన నుపశమింపజేయుటకు శీతల క్రియలు జరిపినట్లు చెప్పబడినదే కాని ఎట్లు జరుపబడినవో వర్ణితము కాలేదు. కాని ఆమె ప్రముఖ కథానాయకుని భార్య కావున వానిని వివరముగా వర్ణించినాడు కేతన (ద. కు. 124. 131) ఇట్లే సూచనమాత్రములుగా నున్న అపహారవర్మ కథలోని సూర్యోదయ (ద. కు. 5. 123, 6. 64.) సూర్యాస్తమయములను (ద. కు. 6. 68) ఉపహార వర్మ కథలోని చంద్రోదయ వర్ణనమును (ద. కు. 7. 90. 91) కేతన చక్కగా వర్ణించెను.[2] ఇట్లే తన కాలపు పరిస్థితులను గూర్చి కూడ రెండు మూడు చోట్ల మూలమున లేని విషయములను కల్పించి వ్రాసినాడు. పుష్పోద్భవుడు ఆడు వేషమును ధరించి, దారువర్మను జంపుటకు పోయినపుడు మూలమున నాతడు కేవలము ఆడు వేషము ధరించినట్లు మాత్రమున్నది. కాని కేతన అతడు ధరించిన వివిధాభరణములను పేర్కొని తన కాలపు జనులు ధరించు చుండిన ఆభరణములను వ్యక్తపఱచినాడు అపహారవర్మ కథలోని ద్యూత వర్ణనమును, ప్రమతి కథలోని కోడిపోరు వర్ణనమును, సాంఘిక పరిస్థితుల ననుసరించి మూలముకన్న విస్తృతము కావింపబడినవి.

"కేతన మూల కథను తన రచనా సంవిధానమున కనుకూలముగ మలచుకొనెను. మూలమునందలి ద్వితీయోచ్ఛ్వాసము వఱకునున్న కథా భాగము నతడు మార్చెను. ద్వితీయోచ్ఛ్వాసమును పంచమాశ్వాసముగ జేసి - యష్టమోచ్ఛ్వాసము నేకాదశాశ్వాసముగా జేసి, ద్వాదశాశ్వాసముతో గావ్యము పూర్తి గావించెను. మూలమునందలి అపహారవర్మాది కథలను వరుసగా గైకొనక తన రచనా సంవిధానమునకు సరిపడునట్లు కూర్చుకొనెను. మాతృకయందలి నవమోచ్ఛ్వాసము దండికృతము కాదని పండిత జనశ్రుతి కలదు. దాని ననుసరించి కేతన యందలి కథాభాగమును గ్రహింపలేదు. పంచమోచ్ఛ్వాసమునందలి యవంతీసుందరీ పరిణయగాథను రాజవాహన చరితగా చేసి దానితో కేతన కావ్యారంభము గావించినాడు".

మూలకథకు ఔచిత్యమును గూర్చుటకై ఈతడు గావించిన మార్పులలో మచ్చున కొక ఉదాహరణము.

సఖే శరీర కార్శ్యకారిణా తపసాఽలమ్. వసుమతీ గర్భ స్సకల రిపుకుల మర్దనో రాజనందనో నూనం.

"ఆయాసంబుగఁ దపములు
నేయంగా నేల శత్రు జిద్బాహుడు, దీ
ర్ఘాయుష్మంతుడు పుట్టెను
ధీయుతుడగు సుతుడు వసుమతీ గర్భమునన్ (2.59)

కేతన దశకుమార చరితమునేకాక యాజ్ఞవల్క్యస్మృతికి, విజ్ఞానేశ్వరుడు రచించిన మితాక్షర వ్యాఖ్యను విజ్ఞానేశ్వర మను పేర ననువాదము కావించెను. విజ్ఞానేశ్వరము శాస్త్ర గ్రంథమగుటచే కేతన యందు దశకుమార చరితమున కంటెను మూలమును మిక్కిలి సన్నిహితముగా ననుసరించెను. అయ్యును అచ్చటచ్చట కొన్ని చేర్పులు మార్పులు కానవచ్చుచునే యున్నవి. ఇందాతడు ఆచారకాండ కెక్కువ ప్రాధాన్యమిచ్చి దంతధావన, భోజన, బ్రహ్మచర్య, గృహస్థ విధులను విస్తరించి వ్రాసి యుండెను. అందు జాతి వివేక ప్రకరణము, భక్ష్యా భక్ష్య ప్రకరణము మున్నగు వానిని వదలివైచెను. మూలమున ఆచార కాండ అంతమునను వ్యవహార కాండ ప్రారంభమునను గల రాజ ధర్మములన్నింటి నొక్కచో చేర్చి వ్యవహార కాండ ప్రారంభమున చొప్పించి యున్నాడు. వ్యవహార కాండ యందలి వేతనాదాన దండ పారుష్య ప్రకరణము లను తగ్గించి యున్నాడు.

తిక్కన శిష్యుడైన మారన సంస్కృత మార్కండేయ పురాణమును తెలుగు చేసి యుండెను. ఇది తెనుగునందలి ప్రథమ పురాణానువాదము.

"ఇమ్మార్కండేయ పురా
ణమ్మఖిలహితమ్ముగాగ నా నేర్చుగతిన్
నెమ్మి విరచించెదం బ
ద్యమ్ముల గద్యముల భవదుదాత్తానుమతిన్"

అనుటచేత "ఆంధ్రావళి మోదముం బొరయ పద్యముల గద్యములన్ రచి యించెదన్ గృతు"లని తిక్కన పలికినట్లే మారనయు, 'అఖిల హితమ్ము'గా రచియింప నిశ్చయించుకొని తిక్కనను అనుసరించినట్లు స్పష్టపడిచెను. ఇతని అనువాదమున మూలమునందలి శాస్త్ర తత్త్వాది విషయములను, దేవతాస్తవాదు లను సంక్షేపించిన చోట్లును, రసభావ పోషణమున కనువగు చోట్ల విస్తరణము గావించి స్వతంత్ర ప్రతిభను ప్రదర్శించిన ఘట్టములును కలవు. మారన సాధారణముగ కథా విషయముననే ప్రాధాన్యమొసగెను.

నన్నెచోడుడు, పండితారాధ్యుడు, పాల్కురికి సోమనాథుడు అను శివకవులు, అనువాదముల జోలికి పోక స్వతంత్ర గ్రంథములనే రచించి యుండిరి. అందుకు వారి మత ప్రచారాసక్తియే కారణము. వారు స్వమత ప్రచా రమున కనువగు వస్తువులనే గ్రహించిరి. సోమనాథుడు సామాన్య ప్రజలకు కూడ శైవమతమునం దభినివేశము కల్పించుటకై తెలుగు నందలి ఛందము లలోని కెల్ల అత్యంత సులభమైన ద్విపదచ్ఛందమును గ్రహించెను. నన్నెచోడుని కుమార సంభవము పేరు వినగానే అతడు కాళిదాసుని కుమార సంభవమును అనువదించెనేమో అను భావ ముదయించుట సహజము. అత డట్లు కావించి యుండలేదు. కాని కాళిదాసు కుమారసంభవమును చదివి భావచ్ఛాయలను గ్రహించెననుటకు మాత్రము తార్కాణములు కలవు. ఇందుకు మన్మథ దహనమునకు ముందు ప్రవర్తిల్లిన వసంత వర్ణనము ఉదాహరణము.

పురాణ యుగము నందలి కవులలో కవిత్రయము వారి తరువాత అంత వాడుగా ప్రసిద్ధి నొందిన నాచన సోమనాథుని ఉత్తర హరివంశ రచనా విధా నము కొంత విలక్షణమై కన్పించును. అతడు సంస్కృత మూలము ననుసరిం చియే ఉత్తర హరివంశమును రచింప బూనినను, కవిత్రయము వారి వలె వస్తు సంవిధానమును యథాతథముగ అనుసరించి యుండలేదు. అతడు మూల మును చదివి, అందు తనకు నచ్చినవియు, రసవంతము లని తోచినవియునగు ఉదంతములను గ్రహించి వానిని స్వప్రతిభోచితముగ పెంచి స్వతంత్రమార్గ మున రచించెను. ఆ కథల క్రమము నందు కూడ నతడు కొంత మార్పు చేసెను. "నాచన సోమనాథుని హరివంశమునకును ముద్రితమైన హరివంశ మునకును మిక్కిలి భేదమున్నది. అందలి కథలు పెక్కు లిందు చేరనేలేదు.

ఉన్న కథలు కూడ వెనుక ముందులుగా నున్నవి. సంస్కృతమునందలి హరివంశమున హంస డిభక కథ గ్రంథాంతము నందున్నది. తెనుగునం దది చతుర్థాశ్వాసమున నున్నది. హంస డిభక కథకు మిక్కిలి పూర్వ మందున్న బాణాసుర కథ తెల్గున కడపటిదిగా నున్నది. మూలము నుండి కొన్ని కథలను మాత్రమే గైకొని సోమనాధుడు తర్వాతి ప్రబంధరచనకు మార్గదర్శకు డైనాడు."[4] ఇట్లు నాచన సోమన తనకు నచ్చిన కొన్ని కథలను మాత్రమే గ్రహించి వ్రాయుటచే అతడు పూర్తిగ వదలివైచిన భాగములు సంస్కృత హరివంశమున పెక్కులుండును. మూలము ననుసరించినంతవఱ కతడు కవిత్రయము వారి కంటె కూడ నెక్కువ స్వాతంత్ర్యము నవలంబించెను. అతనికి నవీన గుణ సనాధుడని బిరుదు వచ్చుటకు శైలీభేదముతోపాటు మూల మును యథాక్రమముగా కాక, అందలి కొన్ని కొన్ని ఘట్టములను మాత్రమే గ్రహించి వ్రాయుట కూడ నొక కారణము.

తెలుగునందలి రామాయణములలో మొదటిది రంగనాథ రామాయణము. ఇందు కవి "ఆదికవీశ్వరుండైన వాల్మీకియు పుణ్యులందరు మెచ్చజెప్పిన తెలు గున శ్రీరామచరిత మొప్పజెప్పెద కథాభ్యుదయ మెట్లనిన" అని మొదట ప్రతిన చేసెను. అయినను అతడు కేవలము వాల్మీకి రామాయణము నందలి కథా వస్తువునే గ్రహింపక కొన్ని క్రొత్తకథల నందు చొప్పించెను. "ఈ రామా యణమునకు విశిష్టత నాపాదించిన అంశమా మూల భిన్నకల్పనలే. ఆ గాథలు రామ కథా ప్రస్తావము గల పద్మపురాణాదులలో గాని, నవవిధ రామాయణ ములలో గాని యుండిన నుండవచ్చును. కవి ఆ పురాణముల నన్నింటిని వెదకి గాలించి ఏర్చి ఇందు కూర్చెనని చెప్పుట కష్టము. ఆ కథలన్నియు ఏమార్గ మునవో ఏనాడో ఆంధ్ర ప్రజల చెవులబడి వారి నోట పదములుగా పాటలుగా కీర్తనలుగా నలిగి సంఘమున వేరు నాటుకొనిపోయి యుండును. ఆ పద కవిత్వఖని నుండియే ఈ కవీశ్వరుడు కొన్ని జాతి రత్నములను తీసి సానల దీర్చి, తన రామాయణ మహామాలలో కూర్చి యుండును. అట్లు గాక దీక్ష కొలకు యథా వాల్మీకముగానే కవి దీనిని తెనిగించి యుండునేని పరిచిత వస్తు రహితమైన ఆ రచన దేశీయుల కాశాభంగము కలిగించెడిది. కవి తాను చేసిన ప్రతినకు భిన్నముగా ప్రతి కాండము నందును ఏదో ఒక అవాల్మీకాంశము గ్రహించుచునే కథ నడిపెను. వాటిలో పెక్కులు కావ్యమునకు గుణ సంపాద కములును తద్విశిష్టతకు హేతుభూతములునైనవి."[5] అవాల్మీకములైన గాథలలో

అరణ్య కాండము నందలి జంబుకుమారుని కథ, యుద్ధకాండము నందలి సులోచనా వృత్తాంతము ముఖ్యములైనవి. వాల్మీకి తన రామాయణమున శ్రీరాము నుత్తమ పురుషునిగా చిత్రించెనే కాని పురుషోత్తమునిగా చిత్రించి యుండలేదు. రంగనాథ రామాణమునం దట్లుగాక కవి రాముని వైకుంఠధాము డనియే పలుసార్లు పేర్కొనుచుండును. ఈ విధముగా రంగనాథ రామాయణము పరిశీలించు వారి కది అనువాద గ్రంథముగా కాక స్వతంత్ర రచన వలెనే కన్పించును.

ఆంధ్రమున చంపువుగా రచింపబడి లభ్యమగుచున్న మొదటి రామాయణము భాస్కర రామాయణము దీనికి భాస్కర రామాయణ మను పేరున్నను ఇది ఏక కర్తృకము కాదు. హుళక్కి భాస్కరుడును. అతని పుత్రుడు మల్లికార్జున భట్టును, శిష్యుడు కుమార రుద్రదేవుడును. మిత్రుడు అయ్యలార్యుడును కలసి ఆ రామాయణమును పూర్తిచేసిరి. మంత్రి భాస్కరుడు వ్రాసిన రామాయణము కాని ఎఱ్ఱన రచించిన రామాయణము కాని లభించుట లేదు. భాస్కరాదులు వాల్మీకి రామాయణము నందలి కథనే అనుసరించుచు అందలి శ్లోకములనే తెనిగించుచు తమ రామాయణ రచన సాగించినను అందును కొంత స్వాతంత్ర్యము లేకపోలేదు. బాల కాండమున ఋశ్యశృంగుడు తన్ను వలపింప వచ్చిన వేశ్యలు తనకు మోదకములు పెట్టినపుడు అవి తినుచు "ఈ పండ్లే చెట్టునందు లభించున" వని ప్రశ్నించినట్లు మూలము నందున్నది. మల్లికార్జునభట్టు మఱికొంత పెంచి వేశ్యల గానమునకు ముగ్ధుడై "ఈ మధుర స్వర వేదం బేమన్నదు వినము. మీకు నేముని చెప్పెను ?" అని అడిగినట్లు వ్రాసెను. కుమార రుద్రదేవు డయోధ్యాకాండమును చాల సంగ్రహించినట్లు కన్పించును. భరత శత్రుఘ్నులు మేనమామ ఇంటికి వెళ్ళిన సమయమున దశరథుడు రామ పట్టాభిషేకమునకు చేసిన ప్రయత్నమంతయు రెండు వందల శ్లోకములలో నుండగా కుమార రుద్రదేవుడు దానిని తొమ్మిది పద్యములందును ఒక వచనమునందును సంగ్రహించెను. మంథర తొల్లి కౌసల్యా తనయుని చేత తనకైన చరణ తాడన భంగంబు వైరముగా గొని రామునిపై పగ పూనుటయు, గంగాతీరమున లక్ష్మణుడును గుహుడును సంభాషించు కొనునప్పుడు లక్ష్మణుడు తాను పదునాల్గేడులు నిద్ర మాని రాముని సేవ చేయుదునని ప్రతిజ్ఞ పూనుటయు, వాల్మీకి రామాయణమున కానరావు. భాస్కరు దరణ్యకాండమున లక్ష్మణుడు జంబుకుమారుని చంపిన కథ వాల్మీకి రామాయణమున లేకున్నను

క్రొత్తగ కల్పించెను. దీని నాతడు రంగనాథ రామాయణము నుండి గ్రహించి యుండును. అత డా యా సందర్భములందు ప్రసన్న రాఘవాది గ్రంథము లందలి శ్లోకముల ననువదించి ఉచితస్థలములందు గూర్చెను. 'సౌమిత్రే! నను సేవ్యతాం తరుతలమ్ చండాంశు రుజ్జృంభతే' అను జయదేవుని ప్రసన్న రాఘవము నందలి శ్లోక భావము భాస్కర రామాయణమున కనవచ్చును. కాని అది అందు కిష్కింధాకాండ సందర్భము నందుండ భాస్కరుడు అరణ్యకాండ మున చొప్పించెను. భాస్కర రామాయణమున కూడ రాముడు వాల్మీకి రామా యణము నందువలె ఆదర్శపురుషుడుగనే కన్పించును. అయ్యలార్యుడు యుద్ధ కాండము నందలి ఉత్తర భాగమును భాస్కరుని కవితా శైలిని పుణికి పుచ్చు కొన్నట్లు రచించెను. పై మూవురి వలెనే ఇతడును కొన్ని మార్పులు చేర్పులు కావించెను. కొన్ని శ్లోకములను యథాతథముగా అనువదించెను. "దేశే దేశే కళత్రాణి దేశే దేశే చ బాంధవాః తం తు దేశం న పశ్యామి యత్ర భ్రాతా సహోదరః" అను శ్లోకము నాతడు

"ఎలనాగలు చుట్టంబులు గలుగుదు రెచ్చోటనైన గరమరుదారన్
దలప సహోదరు నెలమిం గలుగగ నెచ్చోటఁ బడయగాఁ బరమానే"

అని అనువదించెను. ఇది మూలమును చక్కగ అనుసరించు చున్నది. ఈ విధ ముగ భాస్కర రామాయణ కర్తలు కూడ కవిత్రయము వారి వలెనే మూలము నొకచో విస్తరించియు, మఱియొకచో సంగ్రహించియు, ఒకచో నూత్న వర్ణనములను చేర్చియు, ఇంకొకచోట అన్యథాకరించియు తమ అనువాదమును సాగించిరి. మొత్తము మీద ఈ యుగము నందలి అనువాద విధానమంతయు కొంచె మించు మించుగ కవిత్రయము వారి పద్ధతినే సాగినదని చెప్పవచ్చును.

శ్రీనాథునిది భావానువాద పద్ధతియని ఎఱింగి యున్నాము. శ్రీనాథుడు నైషధాంధ్రీకరణమున "పంచనళి" యందలి శ్లోకములవంటి శ్లోకములను కొన్నిటిని విడిచిపైచినను, మొత్తము మీద మూల కావ్యమునందలి భావముల నన్నింటిని వ్యక్తీకరించుటకు యత్నించెను.

శృంగార నైషధము చివర నతడు తన ఆంధ్రీకరణమును గూర్చి "అశేష మనీషి హృదయంగమంబుగ శబ్దం బనుసరించియు, అభిప్రాయంబు గురించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, అలంకారంబు భూషించియు, ఔచిత్యం బాదరించియు, అనౌచిత్యంబు పరిహరించియు"

మాతృకానుసారముగ తా ననువాదము సాగించినట్లు చెప్పియుండెను. ఈ లక్షణములన్నియు అతని అనువాదమున కన్పించును. అతడు కొన్నిచోట్ల మూలమునందలి పునరుక్తులను పరిహరించి, దీర్ఘవర్ణనములను సంగ్రహించెను. అనౌచిత్యమును పరిహరించుటకై స్వతంత్రించి కొన్ని మార్పులు కావించెను. మూల శ్లోక భావము తెలుగు పద్యమునకు సరిపోనపుడు సందర్భానుగుణముగ మిగిలిన భాగమును తాను కల్పించెను. మూలమునందలి రస భావ శబ్దాలంకారములను పెక్కుచోట్ల అనుసరించెను. మొత్తము మీద ఇతని ఈ అనువాదమున మూలానుసరణ మధికముగ కన్పించును. హంస దమయంతికి నలుని వర్ణించుచు చెప్పిన సందర్భమున నలుని గుణరూపాదులను విని శచీ పార్వతీ లక్ష్మీ సరస్వతులు కూడ వికారమునకు గురియైరని వర్ణించు మూలశ్లోకములను శ్రీనాథుడు స్పృశింపక ఔచిత్యమును పోషించెను.

"సువర్ణశైలా దవతీర్య తూర్ణం
స్వర్వాహినీ వారికణావకీర్ణైః
తం వీజయామః స్మర కేళి కాలే
పక్షైః నృపం చామర బద్ధ సఖ్యైః"

ఈ శ్లోకము హంస దమయంతితో చెప్పినట్టిది. స్మరకేళికాలమున తాము రెక్కలతో నలునికి వీచుచుందుమని హంస చెప్పుట, అందును దమయంతితో చెప్పుట ఉచితముగా లేదు. అందుచే శ్రీనాథుడు స్మరకేళికాలే అను పదమును తొలగించి 'కనక శైలంబు డిగ్గి ఆకాశ సింధుసలిలముల దోగి మిగులంగ చల్లనైన చారుహాటకమయ గరుచ్చామరముల వీతు మతనికి వైశాఖ వేళలందు' అని రచించి ఔచిత్యమును పోషించెను.

సంస్కృత హర్ష నైషధారంభమున గల నల కీర్తి తేజోవర్ణనాత్మకములైన శ్లోకములలో మొదటి రెంటి యందును అర్థము కొంచెమించుమించుగా సమానమే. అందుచే శ్రీనాథుడు పునరుక్తిని పరిహరించుటకై రెంటిని కలిపి 'తపనీయ దండైక ధవళాతపత్రితోద్దండ తేజః కీర్తి మండలుం' డని సీస పద్య ప్రథమ పాదముగా అనువదించెను. అట్లే నలుని ముఖమును వర్ణించు శ్లోకములందలి పునరుక్తిని తొలగించి ఆతడొకే పద్యమున అందలి భావమును వ్యక్తము చేసెను నలు డశ్వము నెక్కి పరివారముతో కూడ ఉపవన విహారము కావించిన విషయము మూలమున పెక్కు శ్లోకములలో వర్ణితమై

యున్నది. శ్రీనాధుడు వాని సారాంశము రెండు వచనము లందు సంగ్రహించెను. అట్లే దమయంతి విరహమును వర్ణించు సందర్భమునందలి చంద్రమన్మథాద్యుపాలంభముల నీతడు చాలవరకు సంగ్రహించెను.

మూలమునందలి సమాసములను శబ్దములను యథాతథములుగా అతడు గ్రహించిన చోట్లు పెక్కు గలవు మూలకవి మహాపండితుడగుటచే వ్యాకరణ విశేషములతో కూడిన కొన్ని విలక్షణ భావములను, సమాసములను ప్రకటించి యుండెను. శ్రీనాధుడు అట్టి చోట్ల మూలమున కే విధముగను దీసిపోని యట్లు ఆ ప్రయోగములను చక్కగా అనుసరించి తన పాండితీ శౌండీర్యమును ప్రకటించి యుండెను. ఒక్కొక్కప్పుడు మూలమునందలి ప్రయోగము లతి సుందరములై యుండుటచే వానినొక పద్యమున నిముడ్చుట కష్టముగా తోచినపుడు అతడు పునరుక్తి దోషమునకైన నంగీకరించి రెండు పద్యములు వ్రాసిన చోట్లును గలవు. 'కమలేందీవర షండ మండిత' 'మృదు రీతిం బ్రతి వాసరంబు' అను పద్యములు రెండును 'గమికర్మీకృత నైకనీవృతా' 'సదసత్ సంచయ గోచరోదరీ' అను అందమైన సమాసములను విడిచి పెట్టలేక వ్రాసినట్టివే "నలిన సంభవపు వాహనము వారువంబులు" తల్లి మదేక పుత్రక" వంటి సీసములలో ఆతడు మూలభావమును వ్యక్తీకరించి దానితో సమాన రామణీయకము గల సొంత కల్పన కావించెను. ఇట్లే అతడు సొంత కల్పనలు కావించిన సీస పద్యములు మఱికొన్ని కలవు.

శ్రీనాధుడు కథావిధానము నంతగా మార్చి యుండలేదు. స్వయంవర సందర్భమున భీమరాజు విష్ణువును ప్రార్థింపగా నతని ఆదేశమున సరస్వతి స్వయంవర మండపమునకు అరుదెంచి వచ్చిన రాజులను దమయంతికి వర్ణించి చెప్పినట్లు మూలము నందున్నది. శ్రీనాధుడు విష్ణు ప్రార్థనమును తొలగించి భీమరాజు స్వయముగా ప్రార్థింపగా సరస్వతి వచ్చి దమయంతికి రాజుల గుణగణము లెఱిగించెనని వ్రాసి యుండెను. దమయంతీ వివాహానంతరము సోదరులు దమయంతికి సుగంధ ద్రవ్యములును అమూల్యాభరణములును, పసుపునకై నూఱు గ్రామములను ఒసంగినట్లు తెల్పు పద్యములు శ్రీనాధుడు కల్పించి వ్రాసినట్టివి. స్వయంవరానంతరము ఇంద్రాదులు నలదమయంతులకు వరము లిచ్చిన పిమ్మట సరస్వతి నలునికి చింతామణీ మంత్రము నుపదేశించినట్లు మూలమునందున్నది. ఇచ్చట శ్రీనాధుడు చింతామణీ దివ్యమంత్ర మూర్తియైన సరస్వతిని దలంచినచో సారస్వత సిద్ధి కలుగుననియు, ప్రాతః

కాలమున నలదమయంతీ కర్కోటక ఋతుపర్ణులను దలంచు వారికి కల్మష ములు తొలగుననియు రెండు పద్యములలో చెప్పి, మూడవ దానిలో కలియుగ మున కాశ్మీర దేశమందు శారదా పీఠమున మా మల్లదేవీ శ్రీహీరులకు శ్రీహర్షుడను కుమారుడు పుట్టుననియు అతడు విద్వత్కవి అగుననియు, అతడు వ్రాయు కావ్యముచే నలునికి గొప్ప కీర్తి కలుగుననియు తెల్పియుండెను. నైషధ కావ్యమునం దేతద్రచనకు సంబంధించిన మూడవ పద్యము నందలి కల్పన చమత్కార శోభితమై శ్రీనాథునికి మూల కర్తయెడ గల గౌరవమును ప్రకటించుచున్నది. ఈ విధముగా శ్రీనాథుని నైషధాంధ్రీకరణము మూల మును సన్నిహితముగా అనుసరించుచునే తెలుగున దానికంటెను రసవత్తరమను ప్రశస్తిని సంపాదించినది.

శ్రీనాథుని గాథాసప్తశతి అనువాద మిప్పు డనుపలబ్ధము. ఇందలి పద్య ములు మూడు నాలుగు మాత్రము లభ్యములైనవి

"వారణసేయ దావిగొనవా - నవ వారిజమందు దేటి క్రొ
వ్వారుచునుంట నీ వెఱుగవా - ప్రియ వాతెఱగంటి గంటి కె
వ్వారికిఁ గెంపురాదు - తగవా మగవారల దూఱ నీ విభుం
డారసి నీ నిజం బెఱుగు నంతకు నంతకు నోర్వ నెచ్చెలీ"

"ఇందు 'తగవా మగవారల దూర? నీ విభుండారసి నీ నిజం బెఱుగునంతకు నంతకు నోర్వ "మనుట శ్రీనాథుని స్వతంత్ర కల్పనము."శ శ్రీనాథుని కాశీఖండము స్కాంద పురాణాంతర్గతమైన ఒక ఖండమునకు స్వతంత్రానువాదము. మూలము కావ్యము కాక పురాణమగుటచే శ్రీనాథు డాంధ్రీకరణమున ఎక్కువ స్వాతంత్ర్యము వహించి తన రచనకు కావ్యత్వ మాపాదించుటకై ప్రయత్నించి యున్నాడు. అతడు సందర్భానుసారముగ ఇతర గ్రంథముల యందలి శ్లోకములను కూడ అనువదించి అందు ప్రవేశపెట్టి యున్నాడు. దీనికి ముఖ్యమైన ఉదాహరణము వింధ్య గర్వసంస్తంభన వృత్తాంతము నందలి సూర్యవర్ణనము. ఇచట శ్రీనాథుడు మయూరుని సూర్య శతకమునందలి శ్లోకములకు సీసములతో స్వతంత్రమైన ఆంధ్రీకరణమును సాగించెను.

"శాతః శ్యామాలతాయాః పరశు రివ" అను శ్లోక పాదార్థమునకు "చిఱుసాన పట్టించి చికిలి చేయించిన గండ్ర గొడ్డలి నిశాగహనలతకు" అను

ఆంధ్రీకరణమును చూచినచో ఇందు శ్రీనాథు డవలంబించిన అనువాదము తేటతెల్లమగును.

భీమఖండము కూడ స్కాంద పురాణాంతర్గతమైన ఒక ఖండమున కనువాదమే. దీని మూలము విషయమున పండితులలో పెక్కు వాదోపవాదములున్నవి. శ్రీనాథుని భీమఖండమే సంస్కృతీకరింపబడి స్కాంద పురాణమున చేర్చబడినదని కొందఱి యభిప్రాయము. దీనిని బట్టి చూడ కాశీఖండానువాదము కంటె నిందలి యనువాదము ఎక్కువ మూలానుసారియని చెప్పవచ్చును.

హర విలాసమున శ్రీనాథుడు గిరిజా కల్యాణము నొక విలాసముగ వర్ణించెను. ఇది కాళిదాసుని కుమారసంభవము నందలి గిరిజాకల్యాణము వరకును గల భాగమునకు సంగ్రహానువాదము. శ్రీనాథు డిందు మూలము నందలి వర్ణనములను చాల తగ్గించి కథాభాగమునకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చి నాడు. అనువాద మున్నచోట మూలానువాదములను పోల్చి చూచినచో నత డిందు కూడ నైషధానువాద విధానమునే అవలంబించినట్లు తోచును.

"మనీషితాః సంతి గృహేషు దేవతాః
తపః క్వ వత్సే ! క్వ చ తావకం వపుః
పదం సహేత భ్రమరస్య పేలవం
శిరీషపుష్పం న పునః పతత్రిణః".

అను శ్లోకమునకు

"ఇక్కడ లేరె వేల్పులు సమీప్సితదాతలు ముద్దుగూన! నీ
వెక్కడ ఘోర వీర తప మెక్కడ, ఈపటు సాహసిక్యముల్
తక్కు, శిరీష పుష్పమవధాన పరత్వమునన్ మధు వ్రతం
బెక్కిన నోర్చునో విహగమెక్కిన నోర్చునొ నిశ్చయింపుమా."

అను పద్యము శ్రీనాథుని ఆంధ్రీకరణము. ఇది మూలానుసారియై మూలము నందలి భావమును చక్కగా వ్యక్తము చేయుచున్నది. ముద్దుగూన అను విశేషణము పార్వతి తను మార్దవమును ఘోర వీర అను విశేషణము తపస్సు యొక్క క్లేశమును లెస్సగా ప్రకటించుచున్నవి. మన్మథుడు ఇంద్రుడు కబురంపగా అతని కడ కరుదెంచిన విషయమును కాళిదాసు 'అథ సలలిత

యువతి భ్రూలతాచారుశృంగం' అను శ్లోకమున వర్ణించెను. శ్రీనాథుడు దీనికి "కాంతాజనంబుల కటివంక బొమలతో ప్రతివచ్చు పుష్పచాపంబుతోడ" ఇత్యాదిగా గల సీస పద్యమును రచించి యుండెను. శ్రీనాథు డిందు మూల భావమును మిక్కిలి పెంచి మన్మథుని వలరాజని పేర్కొని యుండుటచే అతని చాపచ్ఛత్ర కేతనాదులను రాజ చిహ్నములుగా వర్ణించి మూలమునకు మెఱుగు పెట్టెను. శ్రీనాథుని ఈ పద్యమునకును ఉత్తర హరివంశము నందలి నాచన సోమనాథుని

'మకరందమాని మైమఱచిన గొనయంబు
పెడ మ్రోయ గడివోని వింటి తోడ'.

ద్వి 2.194

అను సీసమునకును చాల సాదృశ్యమున్నది. శ్రీ నాథుడు ఆ సీసమునందలి భావమును కాళిదాసుని శ్లోకమునందలి భావమును జతచేసి చక్కని పద్యమును వ్రాసెను. ఈ విధముగా శ్రీనాథుడు కుమారసంభవము నందలి శ్లోకములను చాల వఱకు సంగ్రహించియు, కొన్ని చోట్ల పెంచియు ఆ గిరిజా కల్యాణమును రచించెను. హరవిలాసమునం దతడు కిరాతార్జునీయ వృత్తాంతమును వ్రాసెను కాని ఏకారణము చేతనో భారవి కిరాతార్జునీయము నందలి భావములను ఎక్కువగా అనుసరించి యుండలేదు

బమ్మెర పోతరాజు భక్తిరస సముద్రమని చెప్పదగిన భాగవతమును తెనిగించెను. అతని ఆంధ్రీకరణము కొన్నిచోట్ల కవిత్రయము వారి ఆంధ్రీకరణమును, కొన్ని చోట్ల శ్రీనాథుని ఆంధ్రీకరణమును పోలి యుండును. అతడు సహజముగా భక్తుడగుటచే భక్తి రస ప్రసక్తి వచ్చిన చోట్ల మూలము నందలి భావములకు తన సొంత భావములను కూడ జత చేసి ఎంతో పెంపు కావించెను. అందుచేతనే మూల భాగవతము కంటె ఆంధ్రీకరణము కొంచె మించుమించుగా రెండింతలైనది. కొన్ని చోట్ల నాతడు శ్రీధర వ్యాఖ్యానమును కూడ యథాతథముగ అనుసరించిన చోట్ల అతడు శ్రీనాథుని పద్ధతినే అవలంబించెను. మొత్తము మీద ఈతని అనువాదమున పెంపకము హెచ్చు.

ప్రబంధ యుగమునకు పూర్వము నివసించిన కవులలో కొందఱు సంస్కృత నాటకములను ప్రబంధరూపమున నాంధ్రీకరించి యుండిరి. వారి మూలానుసరణ పద్ధతులు ముందు ప్రకరణములో వివరింపబడును. ఇక ఆంధ్ర మున నాటక వాఙ్మయము పందొమ్మిదవ శతాబ్ది ఉత్తర భాగమున వెలువడినది. అంతకు ముందు యక్షగానాదులు కొన్ని కానబడును. కాని వానికిని సంస్కృత నాటకములకును ఎక్కువ సాదృశ్యము లేదు. నాటక వాఙ్మయము వెలువడిన అరంభదినములలో పలువురు తెలుగు కవులు సంస్కృత నాటకములను అనువదించుటకే పూని యుండిరి. ఈ నాటక కర్తల యనువాదము పదానువాదము. వీరి అంధ్రీకరణమునందు స్వతంత్రత చాల తక్కువ. మూలమునందలి గద్య పద్య భాగములను వీరు యథాతథముగ అనువదించిరి. గణ యతి ప్రాసల కొఱకు వాడబడిన పదములలో కొన్ని మార్పు చేర్పులు కూడ కానవగును. కాని మొత్తము మీద వారు మూలమును యథాతథముగా అనువదించుటకే యత్నించి యుండిరి. కవిత్రయము వారి అనువాదమున కథానుసరణమే ఎక్కువగా కన్పించును. శ్రీనాథుని అనుసరణమున కథా భావముల రెండింటి అనువాదము కన్పించును. ఈ నాటకాంధ్రీకర్తల అనువాదమున కథ భావములు పదములు కూడ సన్నిహితముగా అనుసరింపబడును. ఇందు ప్రతి శబ్దము, ప్రతి అర్థమును కూడ అపరిహార్యములే. "శ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులు గారు తమ నరకాసుర విజయవ్యాయోగానువాదమున

"పద్యమునకు బద్యంబును గద్యమునకు గద్యమును దగం జేయబడెన్
హృద్యంబగు నీ కృతియం దాద్యక్కృతిం గాంచినట్టు లర్థులు పొగడన్."

అని సంస్కృత రూపకాంధ్రీకరణములో పద్యమునకు పద్యము గద్యమునకు గద్యము వరుసగా వ్రాయుట అను సంప్రదాయము నేర్పఱిచినారు.[7]

మొత్తము మీద 'అంధ్రమునందలి అనువాద విధానమును పరిశీలించు నపుడు కథానువాద మతి స్వతంత్రముగను, భావానువాదము ఎడనెడ స్వతంత్ర మయ్యు మూలానుగుణముగను, పదానువాదము మూలాతివిధేయముగను తోచును. ఈ మూడు పద్ధతులలో భావానువాదము ప్రశస్తము. ఇది కథానువాదము వలె అతి స్వతంత్రమును పదానువాదము వలె అతి విధేయమును కాని మధ్యస్థ స్థితి.

మంచన, పినవీరభద్రుడు మున్నగువారు సంస్కృత నాటకములను తెలుగున ప్రబంధములుగా వ్రాయుచు ననుసరించిన అనువాద విధానము ముందు వివరింపబడును.

## ఉపయుక్త గ్రంథ నిర్దేశము :

1. వే. ప్రభాకరశాస్త్రి. ఉత్తరహరి. పీఠిక
2. కేతన పుట 44. శివకుమార్
3. ఆంధ్ర సాహిత్య సంగ్రహ చరిత్ర. వారణాసి వెంకటేశ్వర్లు పుట 198
4. వేటూరి ప్రభాకర శాస్త్రి. ఉ. హరివంశ పీఠిక పుట 8.
5. పింగళి లక్ష్మీకాంతము. ఆంధ్ర సాహిత్య చరిత్ర పుట 171-74.
6. డా. కొర్లపాటి శ్రీరామమూర్తి. శ్రీనాధుడు. పుటలు 444-447.
7. పోణంగి శ్రీరామ అప్పారావు. నాటక వికాసము. పుట 198.

# 5. (అ) ఆంధ్రమున నాటకము లాలస్యముగ వెలువడుటకు కారణములు

సంస్కృతము నందలి పురాణేతిహాస శాస్త్ర కావ్యాదులను వలె ప్రాచీనాంధ్ర కవులు అందలి నాటక ప్రక్రియను తెనుగున నెలకొల్పక యుండుట అచ్చెరువు కలిగించును. పూర్వాంధ్ర కవులు లోకోత్తరమని ప్రసిద్ధి వడసిన నాటక ప్రాశస్త్యమును గుఱించి ఎఱుంగనివారు కాదు. తాము తలచుకొన్న సంస్కృత నాటకానుసరణమునకే కాక స్వతంత్రాంధ్ర నాటక రచనమునకు కూడ సమర్థులే. వారు దృశ్య కావ్య ప్రక్రియపట్ల దృష్టి నిడనేలేదని చెప్పుటకును వీలులేదు. ఏలన ఆంధ్ర వాఙ్మయమున నన్నయ కాలము నుండియు నాటకమును గూర్చిన ప్రస్తావనలు, సూచనలు కనవచ్చుచున్నవి. ఆనాటి కవులు కొందఱు నాటకానుసరణమునకుకూడ నుపక్రమించిరి. కాని పురాణ కావ్యాంధ్రీకరణమునకును నాటకానుసరణమునకును చాల వ్యత్యాస మున్నది. కవిత్రయము వారును శ్రీనాధాదులును మూలమునకు వన్నెచిన్నెలు దిద్ది దానిని యథోచిత రీతిని మెఱుగులు దిద్దుచు నాంధ్రీకరించిరే కాని ఆ కావ్యముల ఆకృతిని మార్చుటకు యత్నించలేదు. నాటక పరివర్తకులు మాత్రము మూలస్వరూపమును పూర్తిగ మార్చి వానిని తెనుగున ప్రబంధ రూపమున సంతరించిరి.

ఇట్టి నాటకానుసరణమును ప్రారంభించిన వాడు మంచన. ఇతడు క్రీ. శ. 13వ శతాబ్దము నందలి వాడు. ఇతడు సంస్కృతమున రాజశేఖర కవి విరచితమగు విద్ధసాల భంజికా నాటికను కొంతమేర కనుసరించి దానిని కేయూర బాహు చరిత్రమను పేర ప్రబంధముగా రచించెను. అటుపై శ్రీనాధ కర్తృకముగా నెన్నబడుచున్న క్రీడాభిరామను కూడ సంస్కృతము నందలి ప్రేమాభిరామమను వీథి రూపకమునకు చంపూ కావ్యరూపమగు తెనుగుసేత. ఈ క్రీడాభిరామమున వీథి నాటక లక్షణములు కనవచ్చుటచే ఇది ఆంధ్ర నాటక పరిణామ చరిత్రలోని ఒక దశను సూచించునని కొందఱియభిప్రాయము.

అటుపై పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలము నందలి నాటకక్రమమునకు పెక్కు స్వకపోల కల్పనలను చేర్చి దానికి మహాభారతము నందలి శకుంతలోపాఖ్యానమును కూడ జతచేసి శృంగార శాకుంతలమను ప్రబంధమును రచించెను. తరువాత ఆంధ్రమున తొలి జంట కవులుగా ప్రసిద్ధి చెందిన నంది మల్లయ ఘంట సింగనలు, సంస్కృతము నందు కృష్ణమిశ్రుడు వేదాంత ప్రధానముగా రచించిన ప్రబోధ చంద్రోదయ నాటకము నదేపేరుతో మూలమునకు సన్నిహితముగ శ్రవ్యకావ్య రూపమున ననువదించిరి. పిమ్మట పదునాఱవ శతాబ్దము నందలి బొడ్డుచెర్ల చిన తిమ్మయ జయదేవ కవి ప్రణీతమైన ప్రసన్న రాఘవ నాటకమును ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధమను పేర చంపూ కావ్యముగ రచించెను. నామమునకు తగినట్లు ఈ కావ్యమున నాట్య ప్రబంధ లక్షణములు రెండును కన్పట్టును. శ్రవ్యమున వలె కవి వచనములు, సంధి వచనములు, వర్ణనాదులు మాత్రమే కాక నాటకమున వలె అంక విభజనము, నాందీ ప్రస్తావనలు, ప్రవేశక, విష్కంభకాదులు ఇందు కనవచ్చును. మూలము నత్యంత సన్నిహితముగ ననుసరించిన ఆంధ్రీకరణమగుటయే కాక తొలుదొల్త నాటక లక్షణములను కొన్నిటిని ప్రస్తుతీకరించిన ఘనత కూడ దీనికి దక్కినది. తదుపరి బిజ్జుల తిమ్మభూపాలుడు మురారికృతమగు అనర్ఘ రాఘవ నాటకమును అనర్ఘ రాఘవ మను పేరుతోడనే ప్రబంధ రూపమున సంతరించెను. ఈ ప్రాచీన కవులను చూచి కొంద ఱాధునికాంధ్ర కవులు కూడ సంస్కృత నాటకములను ప్రబంధ రూపమున తీర్చిదిద్దిరి. వారిలో శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి మున్నగు వారు పేర్కొనదగిన వారు.

ఇట్లు పూర్వాంధ్ర కవులు కొందఱు సంస్కృత నాటకానుసరణమునకు పూనుకొనియు తత్స్వరూపమును మార్చగా మఱికొందఱు కవులు స్వభాష యందు కాక సంస్కృతమునందే రూపకములను రచించిరి అట్టి వారిలో రావిపాటి త్రిపురాంతకుడు ప్రథముడు. ఇతడు క్రీ. శ. 14వ శతాబ్దికి చెందిన వాడు. ఇతడు క్రీడాభిరామమునకు మాతృకయైన ప్రేమాభిరామమను వీథీ రూపకమును రచించెను. అటుపై భాస్కరుని ఉన్మత్తరాఘవమును, విశ్వనాథుని సౌగంధికాపహరణమును, వామన భట్ట బాణుని పార్వతీ పరిణయమును, కృష్ణదేవరాయల జాంబవతీ పరిణయమును పేర్కొనదగినవి.

ఆధునిక కాలమున తెలుగు వారు రచించిన సంస్కృత నాటకములలో పరవస్తు వేంకట రంగాడార్యుల వారి మంజుల నైషధము. శ్రీ విశ్వనాథ వారి అమృత శర్మిష్ఠ గుప్తపాశుపతములు పేర్కొన దగినవి.

ఇట్లు ప్రాచీనాంధ్ర వాఙ్మయమున ఏర్పడిన నాటకాభావము ఆధునిక యుగారంభము (1860) వఱకు కొనసాగినది. ఈ అభావమున కేవియో కొన్ని కారణము లుండి తీరును. వానిని గమనింతము.

1. ఆనాటి మత సాంఘిక పరిస్థితులు :

ఆంధ్రమున కాదికవియగు నన్నయ స్వతంత్ర కావ్య రచనా సమర్థుడయ్యును, మహాభారతాంధ్రీకరణమునకు పూనుకొనుటకు ఆనాటి మత సాంఘిక పరిస్థితులు కూడ కారణమని చెప్పవచ్చును. రాజరాజ నరేంద్రుడు తన కాలము నాటికి బౌద్ధ జైన మతములు ప్రబలమగుట గాంచి వైదిక మతమును ఉద్ధరింప నెంచి సంస్కృత భాషాపరిచయములేని సామాన్య జనులకు కూడ వైదిక మత మహత్త్వము నెఱింగించుటకై పంచమ వేదమగు మహాభారతము నందలి అర్థము వెల్లడియగునట్లుగ దాని నాంధ్రీకరింపుమని నన్నయను కోరెను. నన్నయ భారతమును రచించుచు, మూలమున లేకున్నను పెక్కుచోట్ల వేదచోదిత విధులను, వేద విప్రులను ప్రశంసించుచు తెల్పిన విశేషములును, ఆతడు ఆశ్వాసాంత గద్యలలో రాజరాజును వర్ణించుచో వాడిన విశేషణములును, ఆతని మానసమున వైదికమతోద్ధరణ భావము కూడ జాగరితమై యుండెనని వ్యక్తము చేయుచున్నవి. ఆతని రచన యందలి కొన్ని భాగములు, అందును అమూలకములైనట్టివి, భారత రచనమునకును వైదిక మతోద్ధరణ సంకల్పమునకును సంబంధమున్నదని రుజువు చేయుచున్నవి. నన్నెచోడుడు, మల్లికార్జున పండితారాధ్యుడు, పాల్కురికి సోమనాథుడు వెలయించిన స్వతంత్ర కావ్యములు, వారికి గల శైవ మతాభిమానమును సూచించు చున్నవి. నానాటికి అధికతరమగుచున్న శైవ వైష్ణవ మత దురభిమానమును బాపి ఆ రెండు మతముల వారికి సామరస్యము కల్పింప యత్నించిన వారిలో తిక్కన అగ్రగణ్యుడు. ఇతడు సర్వ ధర్మ తత్త్వ నిధానమగు మహాభారతము నాంధ్రీకరించుటకు పూనుకొని 'శివాయ విష్ణురూపాయ, శివరూపాయ విష్ణవే' అని కేవల సిద్ధాంత రూపమున నిలిచిన భావమును కార్య రూపము నొందింప సమకట్టెను. వీరశైవ మతాభిమానులైన కవులు తన్మత ప్రచారమునకు దోహదము కలిగించు

రచనలు కావింప, విశిష్టాద్వైత మతానుసారులైన కవులు ఆ మతమునకు ప్రచారము కావించు రచనలు వెలువరింప దొడంగిరి. తిక్కన తాతయగు భాస్కరుడు శ్రీమన్నారాయణుని అవతారమైన శ్రీరాముని చరిత్రమును రచించె నని చెప్పుట నిజమే అయినచో ఇదియును అప్పటి శైవమత ప్రచారమునకు ప్రతియోగముగ రచింపబడినట్టిదే అని భావింపవచ్చును. ఎఱ్ఱన అరణ్యపర్వ శేషమును పూరించి అసంపూర్ణమైన ఆంధ్ర మహాభారతమును పూర్తిచేసెను. ఇట్లు నన్నయ కాలమునుండి ఎఱ్ఱన యుగము వఱకును కొనసాగిన వాఙ్మయ ముపై ఆనాటి మత పరిస్థితుల ప్రభావము కనిపించును. శ్రీనాథుడు అంతవఱకు కొనసాగుచుంటిన మార్గము నటుంచి కావ్యాంధ్రీకరణము నారంభించి ఒక నవీన ప్రక్రియకు నాంది పలికెను. క్రీడాభిరామమున నతడు వీథీ రూపక మార్గము ననుసరించినను శ్రవ్య కావ్య సరణియిందే మక్కువ చూపెను. అనంతర కవులును అధిక స్వాతంత్ర్యమును ప్రకటించుటకు వెనుకాడి గతాను గతికముగనే రచనములను సాగించుట కుద్యమించిరి ఎట్టికవియైనను తన కావ్య చాతుర్యమునకు తగిన కీర్తి ప్రతిష్ఠలను, సమ్మాన్యతను అభిలషించుట సహజము. ఆనాడు మిగుల ఆదరము వడయుచున్న ప్రక్రియను మాని నాటక రచనమును చేపట్టిన నది తమ కీర్తికి లాఘవము నాపాదించునేమో యను భావము వారి నట్టి రచనములపట్ల విముఖులను గావించి యుండును. కావుననే మంచన మున్నగు కవులు సంస్కృత నాటకము నదే రూపమున ఆంధ్రీకరింపక చంపూ కావ్యములుగ మలచి యుండిరి.

## నాటకముల శృంగార ప్రాధాన్యము :

ప్రాచీనాంధ్ర కవులు, ధర్మనీతి తత్త్వములను ప్రపంచించుటయే తమ ప్రధాన లక్ష్యముగా గ్రహించి పురాణేతిహాసాదుల రచనమును చేపట్టిరనియు, అందువలన శృంగార రస ప్రధానములగు సంస్కృత నాటకములఎడ దృష్టిని సారింపలేదనియు విమర్శకుల యభిప్రాయము.[1] కాని అటుపై వెలసిన కావ్య ప్రబంధములు శృంగార రస ప్రధానములే అగుటచే తత్కర్తలు నాటకముల నేల స్పృశింప లేదనెడు ప్రశ్న కపుడు సమాధానము చెప్పవలసి యుండును. అపుడు నాటక రచనము నందలి భాషా ప్రయోగ, శైలీ స్వభావాదులకు సంబంధించిన కట్టుబాట్లు వారు వానిని యథాతథముగా నాంధ్రీకరించుటకు ఆటంకములై యుండునని చెప్పవచ్చును. ఆచార్య పింగళి లక్ష్మీకాంతము

గారు పేర్కొనినట్లు 'వర్ణనమే కవిత్వము'. ఇట్టి వర్ణనమున కంతగా ప్రాముఖ్యమునీయని నాటక రచనము పట్ల ప్రబంధ కవులు ఉపేక్ష వహించి యుండవచ్చును.

## కవుల రాజాశ్రితత్వము :

ప్రాచీన కవులందఱును ఇంచుమించు రాజులనో ఉన్నత పదవులందుండిన అధికారులనో ఆశ్రయించిన వారు. కవి తా నాశ్రయించిన వ్యక్తికి గల అభిలాషను గూడ గుర్తించి రచన కావించు ఆవశ్యకత ఎంతైన నుండును. వారి ఇష్టమునకు భిన్నముగ వ్యవహరించిన అతని కవితను వారాదరింపరు. ఆనాటి రాజులును రాజోద్యోగులును, పురాణ కావ్య, ప్రబంధ శ్రవణ మాత్రముననే తృప్తి నొంది అట్టి రచనముల కావించుటకే కవులను ప్రోత్సహించిరి.

## నాటక లక్షణములను తెల్పు గ్రంథముల అభావము :

పూర్వము ఆంధ్రమున నాటక ప్రదర్శనములు లేవనుటకు నాటక లక్షణములను తెల్పు గ్రంథ మాంధ్రమున వెలువడకుండుట యొక నిదర్శనము. విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణి యందును, భట్టుమూర్తి కావ్యాలంకార సంగ్రహము నందును నాటక లక్షణములను వివరించి యుండ లేదు. సంస్కృత ప్రతాపరుద్రీయమునే అనుసరించిన భట్టుమూర్తి అందలి నాటక ప్రకరణమును గ్రహింపక వదలివైచెను. సాధారణముగ లక్ష్యము లుద్భవించిన వెనుకనే లక్షణ గ్రంథము లుద్భవించును. ఆనాడు నాటక రచనము కాని ప్రయోగము కాని లేకుండుట వలననే లక్షణ గ్రంథములు పుట్టి యుండక పోవచ్చును. క్రీ. శ. 16వ శతాబ్దము నందలి చిత్రకవి పెద్దన మాత్రము లక్షణసార సంగ్రహమున నాటక లక్షణములను తెల్పియుండెను. ఈతడు సంస్కృత లక్షణములను యథాతథముగ అనుసరించి యుండును. ఇంకను 'ఒక్క తెనుగుననే కాక, ఉత్తర దక్షిణ దేశ భాషలగు తమిళ, మలయాళ, కన్నడములందు గూడ, నాటకములు స్వతంత్రములు కాని, భాషాంతరీకరణములు కాని 1850 వఱకును రచింపబడలేదనియు, నాటక ప్రదర్శనములు కూడ లేవనియు నాయా భాషల యందలి పండితు లేకగ్రీవముగ చెప్పుచున్నారు.[2]

క్రీడాభిరామ కావ్యాంతమున

నటులది దోర సముద్రము
విటులది యోర్గల్లు, కవిది వినుకొండ, మహా
పుట భేదన మీ త్రితయము,
నిటఁ గూర్చెను బ్రహ్మరసికులెల్లను మెచ్చన్.

1.293

అను భరత వాక్యమును బట్టి క్రీడాభిరామమును దోరసముద్రము నుండి వచ్చిన నటులు, ఓరుగల్లు నగరమున ప్రయోగించినట్లు తెలియనగును. క్రీడాభిరామము సంస్కృత ప్రేమాభిరామమునకు అనుసరణము కావున పై విషయము సంస్కృత రూపకమునకు సంబంధించినదే అని కొందఱు పండితు లూహించు చున్నారు. ఇది తెలుగునకు సంబంధించినదే ఆయినచో, ఈ ప్రదర్శనము, రసికులును, పండితవర్యులును అగు కొలది మందికి మాత్రమే పరిమితమై యుండుననియు, ఇట్టి రచనలు అటుపై రాకుండుటచే, ఆనాటి పండితులు సంస్కృతమునందలి రూపకములతోడనే తృప్తినొంది, తెనుగునం దట్టివానిఎడ ఆసక్తి చూపలేదనియు భావింపవచ్చును. పై పద్యము వలన ఆనాటి నటులు ఒక ప్రాంతమునుండి మఱియొక ప్రాంతమునకేగి ప్రదర్శనముల నొసంగెడు ఆచార ముండెడిదని తెలియనగును. కాని వారు ప్రదర్శించిన నాటకములెట్టివో తెలియదు

## నాటకములు ప్రదర్శన ప్రధానములగుట :

నాటకము ప్రదర్శన యోగ్యమైనప్పుడే సంపూర్ణతను పొందును. అది ప్రదర్శనయోగ్యము కావలెనన్న గంగపరికరముల సాహాయ్యమవసరము. పూర్వము ఆంధ్రదేశమున నాటక ప్రదర్శనావశ్యకములైన నాటక శాలలు, రంగ పరికరాదులు మున్నగునవి యుండెననుటకు నిదర్శనములులేవు. రాజరాజ నరేంద్రుడు మహాభారతావతారికలో

చం. విమలమతిం బురాణములు వింటి ననేకము లర్థధర్మ శా
స్త్రముల తెఱం గెఱింగితి, నుదాత్త రసాన్విత కావ్యనాటక
క్రమములు పెక్కు చూచితి"నని పల్కి యుండెను.

12)

పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్ననమున

ఉ. ఆ వనజాక్ష నందనుడు నంతట నాంది తగం బఠించి, యిం
పావహిలం బ్రరోచనయు నాముఖముం దనరార నొప్పు ప్ర
స్తావనతో ముఖాదులగు సంధులు సాంగతఁ బెంపుమీఱ గం
గావతరాది నాటకములాడె ననేకము లద్భుతంబుగన్. 4.99

అని నాట్య ప్రయోగమును గూర్చి వివరించెను. ఇవన్నియు సంస్కృత నాటక ప్రదర్శనములై యుండనోపును. ఆనాటి ప్రదర్శనములు పండితులకును, సంస్కారులకును పరిమితములై సాగుచుండి యుండును. వారందఱును సంస్కృత నాటక ప్రయోగములతోడనే సంతృప్తినొంది యుందురు. కావున వారు ఆంధ్ర నాటక రచనము పట్ల కాని, ప్రయోగముపట్ల కాని శ్రద్ధవహించి యుండకపోవచ్చును. ఇంకను ఊరూర రంగస్థలములు నిర్మాణము కావించి సంస్కృత నాటక ప్రదర్శనములు జరుపబడినను సామాన్యజనుల కందు ఔత్సుక్యముండదు. వారికి వినోదమును కల్గింప దేశి నాట్యవిధానము లుండనే యున్నవి. ఇక సంస్కృత నాటకములైనను కాళిదాసాదుల నాటకములవంటి కొన్ని ప్రసిద్ధ నాటకములు తప్ప తక్కినవన్నియు శ్రవ్యప్రాయములే. ఆ నాటకములు కూడ 10వ శతాబ్దము తరువాత పెక్కుసార్లు ప్రదర్శింపబడిన వనుటకు ప్రమాణములులేవు. కావున ఆనాటి రంగ పరికరాదుల అభావము కూడ నాటక రచన నరికట్టినదని చెప్పవచ్చును.

నటులకు సంఘమున గౌరవము లేకుండుట :

సాధారణముగ నటన ఆంగిక, సాత్త్విక, ఆహార్యాభినయాదులచే శోభించును. ఒక పాత్రను ధరించెడు నటి లేక నటుడు ఆ పాత్రకు తగిన వేషభాషలను ధరించి తగిన హావభావములను ప్రదర్శింపవలెను. నలుగురి ఎదుటను ఇట్టి అభినయము కావించుటకు నటులు కొంత స్వేచ్ఛా ప్రవృత్తిని పూనవలయును. బహిరంగముగ నటులు గావించెడి ఆంగికాది వ్యాపారము లను గాంచి ఆనాటి పెద్దలు వారిని సంఘ బాహ్యులుగ పరిగణించుచుండిరి. భావోచిత నటనమును నిర్వహించుటకు సంస్కారవంతులైన విద్యాధికులెవ్వ రును ముందుకు వచ్చియుండరు. సంస్కృత నాటక ప్రయోగము క్షీణించిన తరువాత కేవల పామర జనాదరణ పాత్రములగు వీథీ నర్తకుల యొక్కయు వీథీ గాయకుల యొక్కయు సంఖ్య అధికమగుచువచ్చెను. వారు తమకు

తోచిన విధమున నర్తనములు సలిపి సామాన్య జనముల నాకర్షింపగల్గినను ఉన్నత సమాజమున వారు గౌరవాదరములను పొందజాలకపోయిరి. కావున నాటకాభ్యుదయమున కిదియు కొంత నిరోధకమై యుండును.

పూర్వాంధ్ర వాఙ్మయమున నాటకము లుద్భవింపక యుండుటకు గల కారణములను పలువురు విద్వాంసు లిట్లు వివరించియున్నారు.

1. ఆంధ్రులకు పద్యకావ్యములపై నున్నంత ఆదరము వచనకావ్యములపై లేదు. తిక్కనకు సమకాలికుడైన కేతన సంస్కృతమునందు దండి విరచితమైన దశకుమార చరిత్రమును గద్య కావ్యమును చంపూ కావ్యముగ రచించెను. 'బాణుని కాదంబరిని కూడ కేతన కాలములోనే ఇంకొక కేతన పద్య ప్రబంధముగా రచించినట్లు సంకలన గ్రంథములలో నున్నది. ఈ కేతన కొట్టరువు కేతనయే అని పలువురి యభిప్రాయము. ఒకే శతాబ్దిలో ఆ రెండు గద్యకృతులను ఇరువురు కవులు చంపూ కావ్యములుగా పరివర్తన చేయుట చూడగా ఆ కాలమువారికి పద్యప్రబంధముపై గల ఆదరము కేవల గద్య కృతులమీద లేకుండెనని తలపవలసివచ్చును. గద్య పద్యాత్మకములైన చంపువులు ఉభయతారకములగు నన్న నిబ్బరముచేతనో, గద్యము పద్యమువలె ధారణయోగ్యము కీర్తికారణము కాదనెడి భావముచేతనో పూర్వకవులు ప్రత్యేక గద్యరచనల నాదరింపరైరి. [3] పై అభిప్రాయము ననుసరించి గద్యముపై పూర్వకవుల కాదరభావము లేకుండుట కూడ నాటకాభావమున కొక కారణమని చెప్పవచ్చును.

'నాటకమునకు సహాయకారి అయినది గద్యము. అట్టి గద్యము ప్రత్యేక కావ్యరచనముగా వికాసము చెందకుండుటయే మార్గనాటకాభావమునకు కారణము. గద్య రచనా కాలము ప్రారంభము కాకముందే నాటక రచనము ప్రారంభము కాలేదని విచారించుట వ్యర్థ ప్రయాస' అని డా. ఐ. పాండురంగారావుగారి యభిప్రాయము.

2. "సంస్కృత నాటకములలో సంస్కృత ప్రాకృతములకు రెంటికిని విరివియైన యుపయోగము కలదు. సంస్కృతమువలెనే ప్రాకృతము కూడ పూర్వ వైయాకరణులచే నిబద్ధమై నియమితమై యుండుటచే నది సంస్కృతముతో పాటు స్వతంత్రమై కావ్యములందు నిరాక్షేపముగ నుపయోగింపబడుచు, నొక ప్రత్యేక భాషగ పరిగణింపబడుచున్నది. అంతేకాక సంస్కృత లాక్షణికులు

నాటకనిర్మాణమున పాత్రలుపయోగించు భాష విషయమున కొన్ని నియమముల నేర్పఱిచిరి. బ్రాహ్మణులును, నాయకులును, రాజులును శుద్ధ సంస్కృతము నుపయోగింతురు. స్త్రీలును, నీచ జనులును ప్రాకృతము నుపయోగింతురు. మరల నీ ప్రాకృతప్రయోగ విషయమున గొంత వేఱుపాటు కలదు. కులీనులగు స్త్రీలు గీతములలో మహారాష్ట్రీప్రాకృతము నుపయోగింతురు. సాధారణ సంభాషణమున వీరును బాలాదులును, సేవకులును శౌరసేని నుపయోగింతురు. అంతఃపుర పరిచారకులు మాగధిని, నీచసేవకులు పైశాచిని వాడుదురు. ఇట్లా యా పాత్రల యంతరములను బట్టి సంస్కృత నాటకములలో భాషా ప్రయోగము నియమితమైయున్నది. సర్వ సాహిత్య మార్గములందును సంస్కృత ఫక్కినే యనుకరించు నలవాటుకల తెనుగు వారి కీ నిబంధనము కొంత యాటంకము కలిగించినది. ఏలయన సంస్కృత ప్రాకృతములవలె దెలుగున గ్రాంథిక గ్రామ్యభాషలు రెండును వ్యాకరణ పరిసంస్కృతములై యుండలేదు. తెలుగున గ్రామ్యమునకు స్థిరమైన యాకృతి లేదు. కాగా సంస్కృత నాటక కర్తలు ప్రాకృతమును తద్భేదములను నుపయోగించిన చోటులలో తెలుగువారెట్టి భాషా విశేషము నుపయోగింపవలెనో స్పష్టపడియుండదు. పోనీ లాక్షణికులుచెప్పిన యా ఒక్క నిబంధనము నుల్లంఘించి సర్వపాత్రలకు నొకే భాష నుపయోగించి నాటకరచనకు గడంగుటకుఁ బూర్వాంధ్రకవుల కంత నిరంకుశత్వము స్వాతంత్ర్యమును లేకపోయెను. దీనికి ఫలితమే తెలుగున నాటకములు తరుణములో వెలువడకుండుట'' 5 అని డా. దివాకర్ల వెంకటావధాని గారి యభిప్రాయము.

'తెలుగున గ్రామ్యభాష లాక్షణికనిషిద్ధము. కావున చేయునదిలేక ఆంధ్ర కవులు రూపకానువాదమును వదలిరి' 6 అని శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారు వివరించిరి.

4. 'ముఖ్యముగా నా దృష్టికి తోచిన కారణమేమన, మన వాఙ్మయములో సంస్కృతమునందు గాని మరి యే హైందవ భాషయందు గాని పొడసూపని ప్రబంధస్వరూప ముత్పత్తియగుటయే యని చెప్పదగియున్నది. నాటకముల యొక్కయు కావ్యములయొక్కయు లక్షణములు సామాన్యముగ నుండుటచే, వేఱుగ నాటకములు వ్రాయు నవసరము లేకపోయినది. మన ప్రబంధములు గీర్వాణ నాటకములవలె నయిదాఱాశ్వాసములతో పూర్తిచెంది కథయంతయు నాటక నిరాణ

పరిమాణములను మించకయుండును. అనగా ఆంధ్ర ప్రబంధములు సంస్కృత నాటక నిర్మాణక్రమమును సూచించుచున్నవి. కావున విద్యాభిమానులగువారికి నాటకములకు బదులుగ ప్రబంధములు చేకూర్పబడినవి.' అని శ్రీ వేమవరపు అచ్యుతరావు గారు తెల్పిరి.

'తెలుగు ప్రబంధము ఒక వింత శిల్పనిర్మాణము. సంస్కృతమున కావ్యచిత్కములగు చంపువులు దక్క, గద్యకావ్యములు వేఱు, పద్యకావ్యములు వేఱు, కథనాత్మకములగు శ్రవ్యకావ్యములు వేఱు, సంవాదాత్మకములగు దృశ్య కావ్యములు వేఱు. ఇక తెలుగు ప్రబంధమో, గద్య పద్య కథన, సంవాదాత్మకమయి, సమస్త కావ్యభేదములు ఏకత్ర రాశీభూతములయి వెలసిన సంపూర్ణ మూర్తి. ఇట్టి పై లక్షణ్యముకలిగిన సమగ్ర సారస్వతమూర్తి ఏదేశభాషలలోను లేదు. మనలో ప్రత్యేక గద్యకావ్యములు లేవనెడి లోటు, నాటకములు లేవనెడి లోపము ఈ ప్రబంధమే తీర్చినది. మఱియు వర్ణనాత్మకమైన భావుకత్వము ఇముడ్చుకొన్నదియు నీ ప్రబంధమే. ఇది కవితాశక్తుల నన్నింటి నొఱసి చూచు స్థానమని పూర్వుల యభిప్రాయము. " The parts lose their individuality in the finished whole (Moulton). ఇతర కవులకంటె ప్రబంధకర్తలే పెద్దలని మనవారు కొనియాడుటయు అందుచేతనే. పాశ్చాత్యాధునిక విమర్శకులు కొందఱు కవితాశక్తి సంపూర్ణవ్యక్తికి ప్రబంధమువలె ఏకావ్యభేదమును జాలదని దానిని నిర్వహించినవాడే మహాకవియని ఒక కళా సిద్ధాంతమును ప్రతిపాదించిరి. అట్టి ప్రబంధము ప్రదర్శన సౌకర్యములేని నాటకముకంటె వాఙ్మయమున చిరస్థాయిగా నుండునను ఆశచే ప్రబోధ చంద్రోదయమువంటి నాటకములు తెనుగున ప్రబంధములై యుండవచ్చును." ౪ అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారు వచించిరి.

౫. "విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో శ్రవ్య కావ్యములనే ప్రశంసించెను. అందుచే మనవారు శ్రవ్యకావ్యరచనము మాత్రమే సప్తసంతానములలో చేరినదనియు, ఆముష్మికాభ్యుదయ ప్రదమనియు దృశ్యకావ్య మట్టిది కాదనియు తలంచిరని ఒకరహస్యము వెలువడుచున్నది" అని శ్రీ వేదం వెంకటరాయశాస్త్రి గారి యభిప్రాయము. ౫

౬. "తెలుగుభాష యందు కావ్యములు వెలయించినవారికి సంస్కృత భాషా పరిజ్ఞానము కొఱవడినదనుట పొరపాటు. కాని తెలుగునందలి రూపక

రచనము నిన్న మొన్నటివఱకు యక్షగానముల అంతస్తునుదాటి పెరుగకుండుట తెలుగువారి అధైర్యమును, చాదస్తమును, సోమరితనమును తెలుపు" నని రాళ్ళపల్లి వారనిరి. [10]

7. డా॥ ఏ. బి. కీత్ మహమ్మదీయుల పరిపాలనము ప్రాచీన నాటక కళా విధానముపై అత్యంతప్రభావమును చూపెననియు, రాజులు తమ సింహాసనములు కోలుపోగా నాటక ప్రదర్శనములును, భారతీయ సంస్కృతిని ప్రతిబింబింపచేయు నాటకరచనములును సన్నగిల్లెననియు పేర్కొనెను.

"Doubtless the Mohomedan conquest seriously affected the vogue of the classical drama, which was obnoxious to Mohomedan fanaticism as being closely identified both with the national religion and the national spirit of India. The kings who had been the main support of the actors and poets alike, disappeared from their thrones or suffered graverevers in fortune. The tradition of dramatic performances gradually vanished. Other causes contributed to this end, the divorce between the language of the state and that of the people, steadily increasing with the passage of time made the sanskrit drama - more and more remote to the public and the Mohomedans made it lose its position as the expıession of the official and court life of the highest circles".

ఇది సంస్కృత నాటకములకు సంబంధించిన అభిప్రాయమేయైనను తెలుగునకు కూడ కొంతవఱ కన్వయించును." క్రీ. శ. 10వ శతాబ్దమునుండి దేశభాషల ప్రాచుర్య మధికము కాసాగినది. సంస్కృత భాషా ప్రాబల్యము క్షీణించిన తరువాత నాయకరాజులు చెల్లాచెదరై అస్తవ్యస్తముగ సాగుచుండిన దేశీయ నాటకము నుద్ధరింపబూనిరి. వీరి యాశ్రయమున యక్షగానమను దేశీయ దృశ్యకావ్యప్రక్రియ మహోన్నతస్థితి నొందినది. వీరు మాతృభాషపై అభిమానమువహించి తాము పెక్కు దృశ్యకావ్యములను రచించుటయేకాక తమ ఆశ్రితులచేత కూడ అట్టి రూపకములను వెలయింపజేసిరి. వీనికి రాజపోషణ సమాదరణము లభించుటచే విద్వత్కవులుకూడ ముందుకువచ్చి ఇట్టి రూపకములను రచించిరి. ఆ కాలమున నృత్యగీతాది వినోదములకై ఏర్పాటు గావింపబడిన సరస్వతీ మహలు నేటికిని ఆ రాజుల కళాభిరుచిని వేనోళ్ళ చాటుచున్నది.

సామాన్యజనులలో సాంఘిక ప్రయోజనమును సులభముగ సాధించుటకు దేశీయరూపకములే అత్యుత్తమ సాధనములు. పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రమువలన, మత ప్రచారకులు సంఘ సంస్కర్తలు కూడ ప్రజలలో దేశీయరూపక ప్రదర్శనముల మూలముననే తమ మత వ్యాప్తి ప్రచారములను కావించుచుండిరని తెలియనగును. పైని సూచింపబడిన కారణములచే పూర్వాంధ్ర కవులు 'కావ్యేషు నాటకం రమ్య'మ్మను విషయము నెఱిగినవారును, దృశ్య కావ్య నిర్మాణ దక్షులును అయ్యు నాటక రచనయెడ నుపేక్షవహించిరి. అందుచే 19వ శతాబ్ది మధ్యభాగమువఱకును తెలుగున నాటకప్రక్రియ వెలువడుట కవకాశము లేకపోయెను. దక్షిణాంధ్రయుగమున యక్షగానములు విరివిగా వెలువడినను స్వరూపస్వభావములందు వానికిని సంస్కృత నాటకములకును సంబంధ సాదృశ్యములు లేవు. అవే తెలుగున తరువాత నాటకములుగా పరిణమించె ననుట కవకాశము లేదు. తెనుగున నాటక రచనకు ఆంగ్ల విద్యాభ్యాసము, పార్శీ హిందీ నాటకప్రదర్శనములు అనునవి దోహదమొసంగినవనుట బహు విమర్శకసమ్మతమైన విషయము.

## ఆ. ఆధునికాంధ్ర నాటక వికాసము

ఆంధ్రమున రూపకాభావమును తొలగించి తెలుగు నాటకరచనకు నాందీ పూజ కావించినవారు శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి గారు. వీరు సంస్కృతమునందలి వేణీ సంహారమను నాటకము నాంధ్రీకరించిరి. కాని ఇది ముద్రింపబడలేదు. శాస్త్రిగారు మంజరీ మధుకరీయమను స్వతంత్రనాటకమును కూడ క్రీ. శ. 1860 ప్రాంతమున రచించియుండిరి. కాని అది 1908 వఱకును ముద్రితము కాలేదు. తెలుగు నాటక రచనమును అధునాతన కాలమువఱకు అరికట్టుటకు సంస్కృతనాటకములందలి పాత్రోచితభాషయు నొక కారణమని ఎఱింగియున్నాము. శ్రీ శాస్త్రిగారు ఈ విషయము నాలోచించి "1. వసంత తిలక, వల్లవీ వల్లవోల్లాస శృంగార రంగాదిభాణంబులు రూపక విశేషంబులయ్యును, ప్రాకృత మిశ్రంబులుకాక సంస్కృతభాషయందు సవిశేషంబుగ చూపట్టుచున్నవి. 2. మిశ్రంబులందు గ్రథితంబగు ప్రాకృతంబును ఛాయవీడి సకలజనంబుల కానందవిధాయకంబుగా నేరమి సంభవించుచున్నది. 3. ఆ మిశ్ర రూపకంబులయందును ఒక్కొక్క చక్కం బ్రాకృత వ్యవహారయోగ్యంబులైన

పాత్రంబులను సంస్కృతం బాశ్రయించి వచించుట కలదు. అందుచే ప్రాకృత భాషలేమి అత్యంత నిషేధాపాదకంబు కాదని తలంచి సంచితోత్సాహుండై సంస్కృతాంధ్ర మిశ్రంబుగా ప్రాచీనానుశాసనోక్త లక్షణ లక్షితంబగునట్లు"[12] తమ రూపకమును రచించియున్నారు. వీరు ఆంధ్ర నాటకకర్తలే కాక సంస్కృతరూపక కర్తలుకూడను. వీరు శృంగార సుధార్ణవము (భాణము) కమలానందము (భాణము) రామచంద్ర విజయము (వ్యాయోగము) అను వానిని సంస్కృతమున రచించిరి. ఉన్మత్త రాఘవము, ముద్రా రాక్షసము, శాకుంతలము, ఉత్తర రామచరిత్ర మున్నగు నాటకముల నాంధ్రీకరించిరి.

కోరాడ రామచంద్రశాస్త్రి గారి తరువాత ఆంధ్ర నాటకరచన కావించిన రెండవవారు శ్రీ కొక్కొండ వెంకట రత్నం పంతులుగారు. వీరి నరకాసుర విజయ వ్యాయోగానువాదము ముద్రణభాగ్యము పొందిన తొలిరూప కాంధ్రీకరణము. ఇది 1872లో ప్రకటితమైనది. వీరు ధనంజయ విజయ వ్యాయోగమును, ప్రసన్న రాఘవ నాటకమునుకూడ నాంధ్రీకరించిరి.

కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలానువాదమునకు పూనుకొనినవారిలో ప్రథములు శ్రీమాన్ పరవస్తు వెంకట రంగాచార్యులుగారు. వీరు ఆంధ్రమున నాటక రచన కావించినవారిలో మూడవవారు. వీరు తమ ఆంధ్రీకరణము నందలి మొదటి రెండంకములను మాత్రము 1875లో 'సకలవిద్యాభివర్ధిని' అని తాము ప్రకటించుచుండిన మాసపత్రికలో వెలువరించిరి. తరువాత ఏ కారణమువలననో అది అసంపూర్ణముగనే ఉండిపోయినది. శ్రీ ఆచార్యులవారు సంస్కృత భాగమును తత్సమయుక్తమగు తెలుగులోనికిని ప్రాకృతభాగమును కేవల దేశ్యాంధ్రము (అచ్చతెనుగు) లోనికిని పరివర్తించి యున్నారు. [13]

ఆంధ్ర నాటక కర్తలలో నాల్గవవారు శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు. వీరు ఉత్తర రామచరితము, మృచ్ఛకటికము మున్నగు నాటకముల నాంధ్రీకరించుటయే కాక ప్రప్రథమముగ ఆంగ్ల నాటకానువాదమునకును, తొలి తెలుగు సాంఘిక నాటకరచనమునకును కూడ పూనియుండిరి. వీరి ఆంగ్లానువాదము సీజరు చరిత్రము. సాంఘిక నాటకము నందకరాజ్యము.

పైని పేర్కొనబడిన నలుగురు నాటకకర్తలును నాల్గువిధములగు రచనా ప్రక్రియలను నెలకొల్పిరి. అందొకటి సంస్కృతనాటకముల ఆంధ్రీకరణ రెండవది స్వతంత్రనాటకరచన. మూడవది ఆంగ్లనాటకానువాదము. నాల్గవది

సాంఘిక రూపకముల రచన. ఈ రచనా విధానములను తరువాతి నాటకకర్త లాదర్శప్రాయముగ గ్రహించియుండిరి. పైని పేర్కొనబడిన రచనములేవియు ప్రదర్శన భాగ్యమును పొందలేదు.

కందుకూరివారి వ్యవహార ధర్మబోధిని ప్రదర్శన భాగ్యము పొందిన ప్రథమ నాటకము. దీనితో తెలుగు నాటక సాహిత్యమునందలి రెండవ దశ ఆరంభమైనది. ఈ నాటకమును వీరి మిత్రులు కొందఱును, విద్యార్థులును చేరి 1880 వ సంవత్సరమున శ్రీ విజయనగర మహారాజుగారి బాలికా పాఠశాలలో ప్రయోగించిరి. ఈ ప్రదర్శనము విజయవంతమగుటతో పంతులుగారికిని వారి మిత్రులకును ఒక నాటక సమాజమును స్థాపింపవలెనను తలంపు కలిగినది. ఇదే సమయమున ధార్వాడ నాటక సమాజమువారు తెలుగు దేశమునకు వచ్చుట సంభవించెను. వీరు 1880, 81 సంవత్సరములలో తెలుగు జిల్లాలలో పలు చోట్ల నాటక ప్రదర్శనము లొసంగిరి. వారు రాజమహేంద్రవరమున ప్రదర్శన లొసంగిన తరువాత, పంతులుగారిలో ఉత్సాహము అతిశయించినది. వారు ఒక నాటక సమాజమును స్థాపించి, అందు శ్రీహర్షుని, రత్నావళిని, షేక్స్పియరు మహాకవి రచించిన 'Commedy of Esrors, ను చమత్కార రత్నావళి యను పేరను అనువదించి వానిని ప్రదర్శింపచేసిరి. ఇట్లు పంతులుగారి వ్యవహార బోధిని అంతకుముందే ప్రదర్శితమైనను ధార్వాడ నాటక సమాజమువారి రాకయే ఔత్సాహిక నాటకప్రదర్శనములను, తన్నిమిత్తమైన నాటక రచనమును ప్రోత్స హించినదని చెప్పవలెను.

పంతులుగారు మొత్తము పదునాఱు నాటకములను రచించిరి. వానిలో బ్రహ్మ వివాహము అనునది మొదటిది. వీరు బ్రహ్మ వివాహము, వ్యవహార ధర్మ బోధిని అను రెండు హాస్యయుతములైన రచనలను 'హాస్య సంజీవని' పత్రికలో ప్రకటించిరి. వీరు మరి రెండు ప్రహసనప్రాయములైన రచనములను కూడ కావించిరి. వీరు రత్నావళి, అభిజ్ఞాన శాకుంతలము, మాళవికాగ్ని మిత్రము, ప్రబోధ చంద్రోదయము అను నాల్గు సంస్కృత నాటకముల ననువదించిరి. పంతులుగారి రచనము లన్నింటిలో సుప్రసిద్ధమైనది అభిజ్ఞాన శాకుంతలము. ఇందలి సంభాషణములు సరసములును, పద్యములు మనోహరములునై యున్నవి. దీనిని పంతులుగారు 1875 లో అనువదించుట కారంభించి 1883 నాటికి పూర్తి గావించిరి.

పంతులుగారి సమకాలికులైన శ్రీ కొండుభట్ల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 1881 లో ధార్వాడ నాటక సమాజమువారు గుంటూరులో నాటక ప్రదర్శనముల నొసంగియుండుట గాంచి తామును తెలుగున నాటక రచన కావింప మొదలిడిరి. వారు కొందఱు విద్యార్థులను, నాటకమునందు ప్రీతి గలవారిని చేర్చి 'హిందూ నాటక సమాజ'మను నొక సమాజమును స్థాపించి ప్రదర్శనయోగ్యములైన అనేక నాటకములను రచించిరి. వీరికడ విద్య నభ్యసించిన శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారు వీరినిగూర్చి తమ స్వీయచరిత్రలో "శాస్త్రిగారు కొన్ని నాటకములు తెలుగున వచన శైలిని వ్రాసి వానిని ప్రదర్శించవలెనని కుతూహలపడుచు అందుకు నాటకపాత్రలుగ మార్పతలచినవారిలో నన్నుగూడ చేర్చి ప్రోత్సహించిరి" 14 అని వ్రాసిరి. శ్రీ సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ముప్పది ఒక్క నాటకములను రచించిరి. వీరు రచించిన నాటకముల పేర్లనుబట్టి నేడు తెలుగు దేశమున ప్రసిద్ధి వహించియున్న పెక్కు నాటకముల ఇతివృత్తములను సుబ్రహ్మణ్య శాస్త్రిగారు ప్రప్రథమముగా ఆనాడే వెలుగులోనికి తెచ్చి నాటకీకరించి యుండిరని స్పష్టమగుచున్నది. వీరు రచించిన నాటకములలో చెన్నపురిలోని దీనపోషక సభ వారికొఱకు వ్రాసిన వస్త్రాపహరణ మొక్కటియే ముద్రితమైనది.

శ్రీ వడ్డాది సుబ్బారాయుడుగారు నాటకకర్తలలో భూమికాధారణముకూడ చేసినవారిలో ప్రథములు. వీరి 'వేణీ సంహారము' రాజమహేంద్రవరములో ప్రథమముగా 1883 లో ప్రదర్శితమైనది. ఈ ప్రదర్శనము విజయము పొందుటతో సుబ్బారాయుడుగారు హిందూ నాటకోజ్జీవక సమాజమును స్థాపించిరి. 15 వీరు విక్రమోర్వశీయము, ప్రబోధ చంద్రోదయము, చండ కౌశికము, అభిజ్ఞాన శాకుంతలము, మల్లికామారుత ప్రకరణము, కుందమాల, మున్నగు నాటకములనుకూడ నాంధ్రీకరించిరి.

తెలుగు నాటకకర్తలలో హిందూస్తానీ నాటకములను ప్రథమముగా వ్రాసిన ఘనత శ్రీ నాదెళ్ళ పురుషోత్తమ కవిగారికి దక్కినది. ధార్వాడ నాటక సమాజము వారి ప్రభావమున ఊరూర వెలసిన నాటకసమాజములలో బందరులోని 'నేషనల్ థియాట్రికల్ సొసైటి' ఒకటి. ఈ సంఘమువారు హిందూస్తానీ నాటకములను ప్రదర్శింపవలెనను కోర్కెతో పురుషోత్తమ కవిగారిని హిందీ నాటక రచనమునకు ప్రోత్సహించిరి. కవిగారు 1884 మొదలు 86 లోపున 32 హిందూ

స్తానీ నాటకములను రచించిరి. వీరు వ్రాసిన ప్రథమ తెలుగు నాటకము 'హరిశ్చంద్ర నాటకము'. ఇది పాత్రోచిత ప్రసంగవచన సమన్వితమని పేర్కొనబడినది. వీరు వ్రాసిన రెండవ నాటకము చంద్రహాస చరిత్రము.

రాజమహేంద్రవరమున హిందూ నాటక సమాజ స్థాపకులగు ఇమ్మానేని హనుమంతరావు నాయుడుగారు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిని ప్రోత్సహించి వారిచే పెక్కు నాటకములను రచింపచేసిరి. వీరు 1889లో గయోపాఖ్యానము, పారిజాతాపహరణము, ప్రసన్నయాదవము, కీచక వధ మున్నగు నాటకములను రచించిరి.

తెలుగు నాటక సాహిత్యము నందొక నూతన శకము నారంభించినవారు ఆంధ్ర నాటక పితామహులని ప్రసిద్ధివడసిన శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు. వీరు 1886 ప్రాంతమున 'బళ్ళారి సరసవినోదినీ సభ'ను స్థాపించిరి. వీరు సారంగధర, చిత్రనళీయము, చంద్రహాస వంటి ప్రసిద్ధ నాటకములను రచించి సమాజమువారిచే ప్రదర్శింపచేసిరి. వీరు కొంతవఱకు ఆంగ్లనాటకముల ననుసరించి మధ్య పద్య గద్యములతో సంభాషణములతో పార్శీమెట్లతో కూర్చిన పాటలతో మనోరంజకముగ నాటకరచనము కావించిరి. వీరు తెలుగు నందేకాక కన్నడమునందును నాటక రచనము కావించి తమ సమాజముచే ప్రదర్శింపచేసిరి. వీరు విషాద సారంగధర, చంద్రహాస వంటి విషాదాంత నాటకములను కూడ రచించి నూత్నప్రయోగము కావించిరి. తెలుగు నాటకములలో పాటలను ప్రవేశపెట్టిన ప్రథమ నాటకకర్తలు వీరే అని చెప్పవచ్చును. వీరి సమకాలికులు శ్రీ కోలాచలం శ్రీనివాసరావుగారు. వీరు బళ్ళారిలోని 'సుమనోరమ సభ'కు అధ్యక్షులుగా నుండిరి. ఆంధ్రమున చారిత్రక నాటకములను వ్రాయ నారంభించినవారు వీరే. వీరి చారిత్రక నాటకములు రామరాజు, చాంద్ బీబీ, ప్రతాపాక్బరీయము అనునవి ప్రసిద్ధములు. వీరు మొత్తము ముప్పది నాటకముల వఱకును రచించిరి. వీరు 'ప్రపంచ నాటక చరిత' (The Dramatic History of th World) అను సుప్రసిద్ధ పరిశోధన గ్రంథమును ఆంగ్లమున రచించిరి.

ధర్మవరమువారి తరువాత నాటక రచనలో ఎక్కువ కృషి చేసినవారు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు, పానుగంటి లక్ష్మీనరసింహముగారు. వేదము వేంకటరాయశాస్త్రిగారు చరిత్రాత్మకమును, అత్యంతప్రసిద్ధమునైన తమ ప్రతాపరుద్రీయములో తురక పాత్రలచేత తెలుగు-హిందూస్తానీ కలసిన భాషను మాట

లాడించి పాత్రోచిత భాషావిషయము నందొక క్రొత్తప్రయోగమును చేసిరి. వీరు మొత్తము పది రూపకములను రచించిరి. వీరి తొలి నాటకము నాగానంద నాటకాంధ్రీకరణము. "వీరు సంస్కృతరూపక మర్యాద ననుసరించి సంస్కృత భాష యుండుచోట్ల సలక్షణ గ్రాంథిక భాషను, ప్రాకృత భాషాభేదము లుండు చోట్ల గ్రామ్యభేదములను వాడియుండిరి. దీనినే వీరు పాత్రోచిత భాషా ప్రయోగ మనినారు.[16] వీరు 1899 వ సంవత్సరమున నెల్లూరులో "ఆంధ్ర భాషాభిమాని సమాజమును" స్థాపించిరి. వీరు నటులకు శిక్షణము నొసంగి ప్రదర్శనములను జరిపించెడివారు.

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు సుమారు నలుపది నాటకములకు పైగా రచించిరి. వీరి పాదుకా పట్టాభిషేకము, రాధాకృష్ణ, కంఠాభరణము మొదలైన నాటకము లతి ప్రసిద్ధములు.

నాటక రచనము నందొక క్రొత్త చైతన్యమును కొని తెచ్చినవారు శ్రీ గురజాడ అప్పారావుగారు. వీరు వ్రాసిన నాటకము కన్యాశుల్కము. వీరు దానిని పూర్తిగా వ్యావహారిక భాషలో రచించిరి. 1897 లో వీరు రచించిన యీ నాటకమును ఆనంద గజపతులవారి ఆధ్వర్యమున విజయనగరములో జగన్నాథ విలాసినీ నాటక సమాజమువారు ప్రదర్శించిరి. పంతులుగా రీ నాటకమును 1904 లో తిరుగవ్రాసిరి. వీరు కొండుభట్టీయమను మఱొక నాటకమును కూడ వ్రాయ యత్నించిరి. కాని అది అసంపూర్ణముగనే ఉండిపోయెను. ఇరువదవ శతాబ్దియం దతి ప్రసిద్ధిగాంచిన నాటక కర్తలలో శ్రీ తిరుపతి వేంకట కవులు ముఖ్యులు. వీరి పాండవోద్యోగ విజయ నాటకము లత్యంత ప్రచారము నొందినవి.

ఇట్లు ఆంధ్రదేశమున 1860 ప్రాంతమునం దారంభమైన నాటక రచన 1880 సంవత్సరమునాటికి కందుకూరివారి నాటక రచన, ప్రదర్శనములతో ఒక స్థిరత్వమును సంపాదించుకొని ధర్మవరము, కోలాచలము వారివలన నొక వినూత్న పరిణామము పొందజాలినది. తరువాత గురజాడవారి నాటక రచనము దేశమున భాషా సంస్కరణములు రెండింట నొక సంచలనము కావించినది. పిమ్మట నాంధ్రమున పలువురు నాటకములను రచించి ఆంధ్ర నాటక వాఙ్మయ మును సంపన్నము కావించిరి.

ఉపయుక్త గ్రంథ నిర్దేశము :

1. డా॥ దివాకర్ల వెంకటావధాని. ఆంధ్ర నాటక పితామహుడు పుట 6.
2. శిష్టా రామకృష్ణశాస్త్రి. Andhra Dramatic Art పుట 16.
3. డా॥ పింగళి లక్ష్మీకాంతం. ఆంధ్ర సాహిత్య చరిత్ర పుట 243.
4. ఆంధ్ర హిందీ రూపక్ పరిశోధనా వ్యాసము.
5. డా॥ దివాకర్ల వెంకటావధాని. ఆంధ్ర నాటక పితామహుడు పుట 7.
6. కొందరు తంజావూరు కవులు - పండితులు - కురుగంటివారి గ్రంథమునకు రాయప్రోలువారి పీఠిక.
7. విజయనగర ఆంధ్ర సాహిత్య చరిత్ర. భా. పుటలు 168-169.
8. ఆంధ్ర సాహిత్య చరిత్ర. పుట 509.
9. గ్రామ్య భాషాప్రయోగ నిబంధనము. పుటలు 54-55.
10. నాటకోపన్యాసములు. పుటలు 38-39.
11. A. B. Keith - Sanskrit Drama. P. 371.
12. డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు. నాటక వికాసము పుట 195.
13. పోణంగి. నాటక వికాసము పుట 200.
14. యండమూరి సత్యనారాయణరావు. ఉషఃకిరణాలు పుట 259.
15. పోణంగి శ్రీరామ అప్పారావు. నాటక వికాసము పుట 212.
16. ,, నాటక వికాసము పుట 251.

# 6. శ్రవ్య కావ్యములు - నాటకీయ

సంస్కృతము నందలి నాటిక వాఙ్మయము విస్తృతమైనది. అందలి దృశ్యకావ్యములు కొన్ని (ఉత్తరరామ చరితము, అనర్ఘ రాఘవము, ప్రబోధ చంద్రోదయము మున్నగునవి) శ్రవ్య కావ్యములవలె వర్ణనా బాహుళ్యము తోడను, ఓజోభరితమై ప్రౌఢమైన శైలితోడను కూడియున్నవి. ఇవి ప్రదర్శ నానుకూలము లైనట్టివి కావు. అట్లే కొన్ని శ్రవ్య కావ్యములందు కూడ సంభా షణ ప్రాచుర్యము, పాత్రల మనస్తత్త్వ చేష్టాది వర్ణనము కన్పట్టును. ఇట్టివి ప్రదర్శనయోగ్యములు కాకపోయినను, ఇందలి నాటకీయ లక్షణములు సహృదయుల హృదయముల నాకర్షించుచుండును.

కావ్యకర్తలు పలువురు ప్రతిభావంతులయ్యును, వారి రచనా విధానమున కొంత తారతమ్యము కనిపించును. కొందఱి రచన వర్ణన ప్రధానమును, కొందఱి రచన సంవాద ప్రధానమును నై యుండును. కవిత్రయమువారి రచనా పద్ధతులను పరిశీలించునపుడు, విమర్శకులు నన్నయది కథనశైలి యనియు, తిక్కనది సంవాదశైలి అనియు, ఎఱ్ఱనది వర్ణనశైలి అనియు చెప్పుచుందురు. ఇది ప్రాధాన్యవివక్షచే చేయబడిన విభజనము. నన్నయ రచనలో వర్ణన సంభా షణ శైలులును, తిక్కన రచనలో కథన వర్ణనశైలులును ఎఱ్ఱన రచనలో కథన సంభాషణ శైలులును, ఎడనెడ కనవచ్చుచునే యుండును. సంభాషణ శైలి ప్రాధాన్యము వహించు తిక్కన వంటివారి రచనలో నాటకీయత హెచ్చుగా గోచరించును. నాటకము సంభాషణరూపముగ నుండును. అందలి కథ యంతయు సంవాదాత్మకమై యుండును. వర్ణనాత్మకములగు కావ్యములలో కూడ కొన్ని ఘట్టములు సరస సంభాషణాత్మకములై రమ్యముగ నుండును. ఆదిపర్వ ద్వితీయాశ్వాసమునందలి గరుడోపాఖ్యానమున కద్రూవినతలు విహా రమున కరిగి, సముద్రతీరమున నడయాడుచున్న యశ్వమును చూచిరి. అపుడు కద్రువ వినతనుచూచి "చూడవె! యల్ల యతి ధవళంబైన యశ్వంబునందు సంపూర్ణ చంద్రునందు నల్లయుం బోలె ప్రదేశంబునందు నల్లయై యున్నది" అని పలికెను. అంత వినత నవ్వి "నీవే కన్నులం జూచితే యక్క! యెక్క డిది నల్ల! ఈ యశ్వరాజు మూర్తి మహాపురుష కీర్తియుం బోలె నతి నిర్మలంబై

యొప్పుచున్నయది" (2.30) అని కద్రువ చెప్పినదానిని ఖండించెను. ఇచ్చటి సంభాషణ విధానము రమ్యముగ నున్నది. ఆదిపర్వ షష్ఠాశ్వాసమున బకున కాహారముగా పోవుటనుగూర్చి బ్రాహ్మణ కుటుంబము విచారించు వృత్తాంత మున్నది. ఈ ఘట్టమున తల్లిదండ్రులును కూతురును బకున కాహారముగా నేను బోయెద, నేను బోయెదనని చెప్పుచు నితరులను వారించుచుందురు. వారేడ్చు చుండగా కన్నీళ్ళు తుడుచుచు,

తే. బాలకుం డొక కొండొక కోల చేత
బట్టికొని యేన రక్కసు గిట్టిచంపి
చులుక వత్తు మీ రేడ్వంగా వలవ దనుచుఁ
గలయ నూరార్చెఁ దన తొక్కుఁ బలుకు లొప్ప. 6.263.

అని నన్నయ రచించెను. ఈ సన్నివేశము, కరుణరసమయమైన సంభాషణము లతో కూడి నాటకోచితముగ నున్నది. తిక్కన పాత్రల సంభాషణము ద్వారము ననే కథను నడిపించిన పట్లనేకములున్నవి. ఉద్యోగ పర్వమున ద్రుపద పురోహిత, సంజయ, శ్రీకృష్ణులు మువ్వురును రాయబారములను నడపిరి. ఈ రాయబారములు మూడును సరసములు, భావగంభీరములునైన సంభాషణముతో కూడియున్నవి. విరాటపర్వమున పాండవులు విరాటునకు తమ్మెఱింగించుకొనిన సన్నివేశము చదువుచున్నప్పుడు పాఠకు లాదృశ్యమును రంగముపై చూచు నట్లు భావింతురు. అందు కచ్చట జరిగిన చుఱుకైన సంభాషణమే కారణము. ఇట్లే నన్నెచోడుని కుమార సంభవము నందలి పార్వతీ కపట బ్రహ్మచారుల సంభాషణమును, నాచన సోమనాథుని ఉత్తర హరివంశము నందలి ఊర్వశీ నరకుల సంభాషణమును, మను చరిత్ర యందలి వరూధినీ ప్రవరాఖ్యుల సంభాషణమును, ఆముక్తమాల్యద యందలి చండాల బ్రహ్మరాక్షస సంవాద మును నాటక భాగములవలె గోచరించును. పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నమును పలువురు విమర్శకులు ప్రబంధ రూపముననున్న నాటకమే అని చెప్పుదురు. అందుల కాతడు ఆ ప్రబంధమున సంభాషణ శైలి నవలంబించుటయే కారణము.

నాటక కర్తలు తాము గ్రహించిన కథను నాటకానుగుణముగా మలచు కొనుటకు అందు కొంత మార్పును కావింతురు. నాటకారంభముకూడ విలక్షణముగ నుండును. అట్లే శ్రవ్యకావ్య కవులుకూడ కొందఱు తమ కావ్యము

లందలి కథలను ఉన్నవానిని ఉన్నట్లుగా కాక నాటకములందువలె కొంత మార్పు చేయుచుందురు. వసు చరిత్రము నందలి కథ నిజమునకు గిరికా జనన వృత్తాంతముతో నారంభింపబడవలయును. కాని రామరాజభూషణు డట్లు చేయక శాకుంతలము నందలి పద్ధతి ననుసరించి గిరికా జనన వృత్తాంతమును మంజువాణిచే చెప్పించెను. ఈ కథాకథన పద్ధతి నాటకోచితమై, కథకు కొంత నూతనత్వము నాపాదించుచున్నది.

నాటకములందు పంచ సంధులుండవలెనని లక్షణము తెల్పుచున్నది. పంచకార్యావస్థలయు, పంచార్థప్రకృతులయు కలయికచే నీ సంధు లేర్పడును. శ్రవ్యకావ్య వస్తు సంవిధానమునకూడ ఈ పంచసంధుల ఆవశ్యకత యున్నది. కాని నాటకముల విషయముననే వీనిని నొక్కిచెప్పుదురు. శ్రవ్యకావ్య కథలు కూడ ఈ సంధులను చక్కగా ప్రదర్శించిన సన్నివేశములు పెక్కులున్నవి. నన్నయ నలోపాఖ్యానమును ప్రధానముగా అయిదు భాగములుగా విభజింప వచ్చును. అది హంస దౌత్యము, నలదౌత్య స్వయంవరములు, ద్యూతము, వనగమనము, పునస్సమాగమ రాజ్య సంపాదనములు. దమయంతీ బద్ధచేతస్కుడైన నలునితో నారంభించు కథ అతడు వనగమనానంతరము, దమయంతీ పునస్సమాగమము నొంది మరల రాజ్యసంపాదనము చేయుటతో ముగియుచున్నది. ఈ కథ వస్త్వైక్యముతోడను వివిధ సంధులతోడనుగూడి ఆ మహాకవి నిర్మాణ శిల్పమును చక్కగ వ్యక్తము చేయుచున్నది.

నాటకములయం దంకవిభజనముండును. కొన్ని నాటనములలో దృశ్య విభాగముకూడ కనవచ్చును. సాధారణముగ ఈ దృశ్య విభజనము దేశకాలము లందలి మార్పులను సూచించుచుండును. కొన్ని శ్రవ్యకావ్యములలోకూడ ఇట్టి విభజనము గోచరించును. నన్నయ కథ ఒక రంగమునుండి ఇంకొక రంగమునకు మాఱుటను 'అట' 'ఇట' 'అంత' 'ఇక్కడ' అను పదములతో సూచించును. నిద్రించుచున్న దమయంతిని నలుడు విడిచి వెళ్ళినపిమ్మట దమయంతి మేల్కాంచి అతనిని కానక పెక్కిడుమలు పడి, తుదకు చేదిపురము చొచ్చెను. ఇంతవఱకును దమయంతి చరిత్రము చెప్పబడినది. నన్నయ తరువాత నలుని చరిత్రము చెప్ప మొదలిడి "అట నలుండు దమయంతిని బాసి, దారుణారణ్యంబులో నరుగువాడు ముందట" అని రంగము మార్పు సూచించెను. నలుని కథ కొంతవఱకు చెప్పి, మరల దమయంతీ వృత్తాంతము చెప్పగోరి 'ఇట్లయోధ్యా

పురంబున బాహుక నామంబుతో నలుఁడుండె. అంత నిట విదర్భేశ్వరుఁడు' 2 ఇత్యాదిగా ఆ మార్పును సూచించెను.

దృశ్య కావ్యములయందు పాత్రల కభినయము నిర్దేశింపబడును. శ్రవ్య కావ్యములయం దీ నిర్దేశము లేకున్నను కొందఱు కవులు కావ్యములయందలి పాత్రలు సంభాషించు నపుడు కాని, ఇతర కార్యముల నానరించు నపుడు కాని వారి హావ భావ చేష్టావర్ణనము కూడ కావింతురు. ఆవర్ణనము దృశ్యకావ్యము నందు నటుడు చేయవలసిన అభినయమునకు దగ్గఱగా ఉండును. రాయబారము నకు పోవు కృష్ణునితో ద్రౌపది తన యభిప్రాయమును చెప్పునపుడు తిక్కన ఆమె ఆ మాట లూరక చెప్పెనని వ్రాయక

ఉ. ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెండ్రుకల్
దాపల చేతఁబూని యసితచ్ఛవిఁబొల్చు మహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁబొంగు విషాదరోషముల్
గావఁగ లేక బాష్పములు గ్రమ్మఁగ దిగ్గన లేచి యార్తయై.

ఉద్యో. 3. 114

గోవిందు ముందటం బెట్టి యిట్లనియె' అని వ్రాసెను. ఈ పద్యము చదువునపుడు వెండ్రుకలు చేత పూని విషాదరోషములచే బాష్పములు జార దిగ్గున లేచి యార్తయై పల్కుచున్న ద్రౌపది మూర్తి పఠితల ఎదుట సాక్షాత్క రించి తీరును. తిక్కన ఇట్టి వర్ణనము లెన్నియో చేయుచుండును. అవన్నియు అభినయాత్మకములును, నాటకోచితములునై, ఆయా సన్నివేశముల సౌందర్యము నినుమడింప జేయును. భీముడు వంటలవాని వేషమున విరటుని కొల్వున కేగ విరటు డాతని రూపు చూచి "నీవు రాజ్య మేలఁదగిన వాడవుగా కన్పట్టు చున్నావు. నీకు తగిన యానాసనాతపత్రాదుల నిచ్చెదను. గజవ్రజములను పరికింపుము" అని పల్కెను. అప్పుడు తిక్కన

కం. అనుటయు మోఱకు చందం
బున మోమడ్డము గదల్చి భూవిభుఁడు సభా
జనులు విన ననిలసుతుఁడి
ట్లనియెం బ్రస్ఫుట నిరర్గళాలాపములన్

విరా. 1. 221

14)

అని వ్రాసి భీముడు మోఱకు చందంబున మో మడ్డముగా కదలించి రాజుతో మాటలాడెనని అప్పటి అతని అభినయమును సూచించెను.

నాటకకవులు పాత్రల మనఃప్రవృత్తి ప్రదర్శనమున నెక్కువ శ్రద్ధ వహింతురు. ప్రతిభావంతులైన నాటక కర్తలు వ్రాయు నాటకములలో నాయా పాత్రల మనఃప్రవృత్తులు విశదముగా చిత్రీకరింపబడి నాటక మహత్త్వమును పెక్కు విధముల పెంపొందించును. శ్రవ్యకావ్యములందు కూడ కొందఱు కవులట్టి మనఃప్రవృత్తిని నేర్పుతో చిత్రింతురు.

అజ్ఞాత వాసమునకు పూర్వము పాండవులు తమ తమ ఆయుధములను, ఒక శమీ వృక్షముపై పెట్టిరి. ధర్మరాజు చెట్టెక్కి వాని నొక్క పెద్ద కొమ్మకు వ్రేలగట్టి తదీయాధి దైవతములతో

క. నరునకు నాకుందక్కఁగ
నొరులకు మీరూపు చూప కున్నది విషవి
స్ఫురిత భుజగభంగి భయం
కర మూర్తులు తాల్చియుండఁగా వలయుఁజుఁడీ

విరా. 1—178

కౌరవులనిన మిక్కిలి క్రుద్ధ చిత్తుడైన భీముడెప్పుడైన ఆగ్రహపరవశుడై వచ్చినచో "మీరెమ్మెయి నేని వంచన వహించి తొలంగ వలెనని ప్రార్థించుచున్నాను. ఈ విషమ వర్షమున మీరాతని నేమరకుండ నుండవలయును" అని చెప్పెను. తరువాత "వృక్షంబు డిగ్గి దానికిం బ్రదక్షిణంబు వచ్చి ప్రణమిల్లి భీమసేను దెస మరలి చూచి సాంత్వనవచన సమేతంబుగా నతనిం గౌఁగిటం జేర్చి యనునయించెను". (విరా.11—1781) ధర్మరాజు భీమసేనుని దెస మరలి చూచుటకును, సాంత్వన వచనములతో నతని కౌగిటచేర్చి అనునయించుటకును, అతని అప్పటి మనఃప్రవృత్తియే కారణము. పైనాతడు ఆయుధ దైవతములతో భీమునికి వశముగాక వంచింపుడని చెప్పి వచ్చెను. ఆ విషయ మాతని మనస్సున మెదలుచుండెను. అందుచేతనే అతడు భీముని అనునయించి తన చిత్తమున నూఱటపొందెను. ఇట్టి మనఃప్రవృత్తి నిరూపణము నాటకోచితమై కావ్యకవుల విశిష్ట ప్రతిభా సంపదకు తార్కాణమై యుండును.

నాటకమునందు అంకారంభముననే అన్ని పాత్రలు ప్రవేశింపవు. నడుమ నడుమ కొన్నిపాత్రలు ప్రవేశించి కొన్ని విషయములను వివరించి నాటక కథకు

తోడ్పడుచుండును. ఇట్లు నడుమ ప్రవేశించు పాత్రలను నాటక కవులు, అంతకు ముందు మాటాడుచుండు పాత్రల సంభాషణలలో సూచించు చుందురు. తరువాత ఆ పాత్ర ప్రవేశించును. ఇట్టి నాటకోచితమైన పాత్ర ప్రవేశ సూచన కొన్ని శ్రవ్య కావ్యములలో కూడ కన్పించును.

భట్టుమూర్తి వసుచరిత్రమున ఇట్టి పాత్ర ప్రవేశ సూచనము కావించెను. విదూషకుడు మిత్రుడైన వసురాజుతో చెప్పి, యతి వేషము ధరించి గిరికయు, ఆమె చెలికత్తెలు ఉన్న చోటికి వచ్చెను. అంతకు ముందు "గంధ గజయాన గీత ప్రబంధ కలన, నలరి యతి లియ్యమై వచ్చునరిది, మగువలార, కను గొంటిరే" (2.81) అని ఒక చెలికత్తె పలికెను. ఇచట యతి శబ్దము శ్లిష్టమైనది. 'సంగీత చ్ఛందశ్శాస్త్రములకు చెందిన యతి' యని ఒక అర్థము. 'సన్యాసి' యని రెండవ అర్థము. 'యతి లియ్యమై వచ్చునరిది' అని చెప్పుటలో మాయా యత్యాగమనము సూచింపబడినది. అట్లే విదూషకుడు గిరికాదులతో సమయానుకూలముగ సంభాషించి మంత్రబలముచే రాజును రప్పించెదనని పల్కి దెసలాకర్ణించి 'మజ్ఝా' అని పల్కెను. ఆ సంభాషణమంతయు లతల చాటున నుండి వినుచు

మ. "ఇది సంధింపఁగ వేళయంచు వసురాజేంద్రుండు నీరంధ్ర నీ
రద వార ప్రతి సీర వెల్వడిన తారా భర్త లీలన్ లతా
చ్ఛద సంఛాదికఁబాసి"

3—45

వారి ఎదుట నిల్చెను. ఇచ్చట రాజ ప్రవేశము సరిగా నాటకమున పాత్ర ప్రవేశించు నట్లున్నది.

కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారు శ్రీమద్రామాయణ కల్పవృక్ష బాలకాండమున విశ్వామిత్రుడు తపస్సుచేయుచుండగా 'వసంత నవశోభ వచ్చె నప్సరస వోలె' [8] అని వ్రాసిరి. ఇచ్చట వసంతాగమనము వలె ముందు రాబోవు మేనక యను నచ్చర అగమనము కూడ చక్కగ సూచింపబడినది.

శృంగార రసప్రధానములైన నాటకములందు విదూషకు లుందురు. వీరు నాయకునకు వయస్యులు. సాధారణముగ హాస్య ప్రియులును, కుక్షింభరులునై

నాయికా నాయకులకు సమాగమము సమకూర్చుటకై మిక్కిలి తోడ్పడుచుందురు. నాయక సహాయులలో వీరు ప్రముఖులు. నాటకములందలి ఈ విదూషకులను చూచి కొందఱు శ్రవ్య కావ్యకర్తలు కూడ తమ కావ్యములందు విదూషకులను ప్రవేశ పెట్టిరి.

వసు చరిత్రలో, మాయా యతి వేషమున గిరికాదులయొద్దకు పోయి రాజు వారి ఎదుట నిల్చి నవకాశము కల్పించిన వాడు నర్మసచివుడే. అట్లే విజయవిలాసమున చేమకూర వేంకటకవి అర్జునునకు సాహాయ్యకారిగా విశారదుడను నర్మసచివుని ప్రవేశ పెట్టినాడు. విదూషక లక్షణములన్నియు వీరిలో పూర్తిగా కన్పింపకున్నను వీరు నర్మసచివులై నాయికా నాయక సమాగమమున కెక్కువగా తోడ్పడిరని చెప్పుటకు సంశయింప నక్కఱలేదు.

నాటకోచితములైన, వేషములు వేయుట తెరలు కట్టుట మున్నగు ఆహార్య, నేపథ్యాదిక విషయములను కూడ కొందఱు శ్రవ్యకావ్యకవులు సూచించుచుందురు. విరాటరాజు కొలువున సేవకులుగా నుండిన పాండవులు అజ్ఞాతవాస కాలము పూర్తి కాగనే విరాటునకు తమ్మెఱిగించుకొన నిశ్చయించినవారై "కృతస్నానులై తెలుపులగు చీరలును, పూతలఁబువ్వుల నొప్పి, రాజతన యానుగుణోజ్జ్వల మాననీయ వేషము లలవడఁ గూడుకొని నగరి కరి గిరి" (విరా. 5.315) తరువాత ధర్మరాజు సింహాసనము నందును, భీమాదులు తమ కుచితములైన ఆసనములందును కూర్చుండి యున్న సమయమున విరాటు డచ్చటి కరుదెంచి,

కం. "ఇది ఏమి కంక! నీవు
నన్మద వృత్తిని శంకదక్క మాగద్దియపైఁ
బదిలమ్మగఁ గూర్చుండితి
వదియునుగా కిపుడు డిగ వహంకారమునన్"

5—318

అని గర్జించి పల్కెను. అపు డర్జునుడు విరాటునకు ధర్మరాజాదుల నెఱింగించెను. ఈ సన్నివేశమున పాండవులు వేషములు వేసికొని సింహాసనములపై కూర్చుండుట మున్నగు నంశములు నాటకోచితములు. వసుచరిత్రమున భట్టుమూర్తి 'కనకవల్లిమతల్లికల పెంపు జడ గుంపు పుష్ప పరాగ సంభూతి

కాఁగ’, (2.79) అను సీసమున నర్మసచివుడు యతి వేషము నెట్లు వేసికొనెనో వర్ణించియుండెను. అత డావేషము తోడనే వచ్చి గిరికాదులతో సంభాషించి యుండెను. ఈ వేష ధారణము నాటకములందలి వేష ధారణమును స్మృతికి తెచ్చుచున్నది. కొంత సేపైన తరువాత ఆ నర్మసచివుడు వేషమంతయు తీసి వైచి రాజు గిరికాదులతో మాటాడు చోటికి వచ్చెను. అపుడు చెలికత్తెలు అతని రూపురేఖలు గాంచి పూర్వపు యతియే యని గుర్తించి విస్మయ మొందిరి. మఱియు భట్టుమూర్తి “తదీయ ఘటనా వైభవాభంగ రంగ ప్రదేశంబునకుం బూర్వరంగంబు రసోత్తరఁబగుట యెఱింగితివి కదా” (8.62) అను చోట రంగ పూర్వరంగ పద ప్రయోగములను వాడి తాను ప్రదర్శించిన నాటకోచిత రచనా విధానమును సూచించి యుండెను. చతుర్థాశ్వాసమున మంజువాణి వసు రాజు భవనము నందలి గంధతైల భాజన భవన ప్రదీపికల చాటున దాఁగుటయు, తరువాత నృపుని మంచము నందలి యంత్రపు బొమ్మలలో నొక బొమ్మగా మాఱి పకపక నవ్వుచు రాజు కంఠమున మాలవైచుటయు, అనంతరము తన సహజరూపము ధరించుటయు నాటకోచిత సన్నివేశములను తలపించుచున్నవి.

నాటకమునందు Dramatic irony అనబడు నొకానొక నాటకీయ చమత్కారము ప్రవేశ పెట్టబడుచుండును. రంగమునం దిరువురు పాత్రలు ప్రసంగించుచుందురు. అందులో ఒకరెవరో రెండవ వారికి తెలియదు. మొదటి పాత్ర తన్ను గూర్చి రెండర్థములు స్ఫురించునట్లు మాటాడుచుండును. సామాజికు లాతదెవ్వరో ఎఱుఁగుదురు. అందుచే నచ్చటి సంభాషణము హృద్యమై వారి కెంతో ఆనందము కలిగించుచుండును. శాకుంతలమున రాజు శకుంతలాదులకు తన్ను గూర్చి చెప్పుచు “యః పౌరవేణ రాజ్ఞా ధర్మాధికారే నియుక్తః సోఽహ మాశ్రమిణా మవిఘ్నక్రియోపలంభాయ, ధర్మారణ్య మాయాతః” అని చెప్పెను. ఈ చెప్పుటవలన అతడు దుష్యంతుడని ఎదుటివారు నిశ్చయించుటకవకాశము లేదు. అతడు దుష్యంతుడు కావచ్చును. దుష్యంతునిచే ధర్మాధికారమున నియోగింపబడిన ఇంకొకడు కావచ్చును. కాని సామాజికుల కాతడు దుష్యంతుడని స్పష్టముగా తెలియును. ఇట్టి హృద్య సన్నివేశములు సంస్కృత నాటకములందు పెక్కు గోచరించును. శ్రవ్య కావ్యకర్తలు కూడ నిట్టి చమత్కారములను ప్రయోగించి నాటకీయతను కల్పింతురు. సన్యాసి వేషమునందున్న అర్జునుని సుభద్ర “ఇంద్ర ప్రస్థ పురవరంబు చూచితిరా పాండుసుతు లందు సుఖముగ నున్నారా?...... అమ్మహావీరు డర్జునుడు జితారి తీర్థగమనోత్సుకుండయ్యెఁ గ్రమ్మరి వచ్చెనే,

ఎఱుగుదురేని నాకెఱుఁగఁజెప్పు" డని అడిగినట్లు నన్నయ రచించెను. (ఆది. ఆశ్వా. 8) సుభద్ర కాసన్యాసి అర్జునుఁడే యని తెలియదు. పాఠకు లెఱుఁగుదురు. సరిగా నీసందర్భముననే చేమకూర వేంకటకవి విజయ విలాసమున ప్రదర్శించిన చమత్కారమింకను రసవంతమై యున్నది. వసుచరిత్రమున యతి వేషధారియైన నర్మసచివుడు గిరికాదులకు తన్ను గూర్చి ఎఱింగించు నపుడు రెండు విధములైన భావములు స్ఫురించునట్లు ప్రసంగించెను. గిరికాదు లాతని యతియేయని భావించిరి. పాఠకుల కాతడు యతి కాదనియు నర్మసచివుడే అనియు స్పష్టముగ తెలియును.

నాటకములందు కొన్ని చోట్ల దీర్ఘములైన ఆత్మ గతములుండును. ఇవి పాత్రల మనఃప్రవృత్తులను కథాసంవిధానమును ఎఱుంగుటకు నెన్నో విధముల తోడ్పడుచుండును. శ్రవ్య కావ్యకర్తలు కూడ సందర్భోచితముగ నిట్టి ఆత్మగత ములను రచింతురు. మనుచరిత్రమున వరూధిని ప్రవరాఖ్యుని చూచిన సందర్భ మున "ఎక్కడివాడొ యక్ష తనయేందు జయంత వసంత కంతులన్ జక్కఁద నంబునన్ గెలువఁజాలెడు వాఁడు" (2—35) ఇత్యాదిగా పెక్కు భావములు ప్రకటించెను. పెద్దన యిచ్చట "ఇట్లతని రూపరేఖావిలాసంబులకుఁ జొక్కియ క్కమలపత్రేక్షణ యాత్మగతంబున" (2—34) అను వచనమువ్రాసి ఆ భావము లాత్మగతములని సూచించెను.

నాటకములందు ఆయా కథా సందర్భములకు తగిన రీతి రసస్ఫూర్తి కనుగుణమగు భావములు కల్పింపబడును. శ్రవ్యకావ్యకర్తలు ఆయా రసములను వర్ణించునపుడు కొన్నిచోట్ల భావప్రతిధ్వను లనదగు శబ్దములను వాడుచుందురు. అట్టి శబ్ద ప్రయోగము పాఠకుల కచ్చటి రస భావములను చక్కఁగ వ్యక్తము చేసి దృశ్యమును సాక్షాత్కరింపజేయును. భీముడు కీచకుని గాంచినపుడు,

చ. కనుఁగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల నంగము
ల్గనలఁగ సాంద్ర ఘర్మ సలిలంబులుగ్రమ్మ నితాంత దంతపీ
డన రట దాస్య రంగ వికట భ్రుకుటీ చటుల ప్రవృత్తన
ర్తన ఘటనా ప్రకార భయద స్ఫురణా పరిణద్ధ మూర్తియై
3—188

ఇత్యాదిగా తిక్కన వ్రాసిన పద్యము అప్పటి భీముని రౌద్ర స్వరూపమును కన్నులకు గట్టుచున్నది.

ఇట్లే కవులు కావ్యములందు లోక వృత్తములకు ప్రతిబింబము లనదగిన సన్నివేశములను సంభాషణములను కల్పించి నాటకీయత స్ఫురింప చేయు చుందురు. కీచకునిచే పరాభవింపబడిన పిమ్మట ద్రౌపది తన భంగపాటు భీముని కెఱింగించుటకై మహానసశాల కరిగెను. భీముడు నిద్రించుచుండెను. ద్రౌపది ఆతని సంబోధించి పాణిస్పర్శ కావించెను. భీముడు మేల్కొని 'ఎవరని' అడిగెను ద్రౌపది నేనని సమాధాన మిచ్చెను. భీముడు కంఠస్వరముచే నామె ద్రౌపది యని ఎఱింగెను. ఎవరైన వచ్చి తలుపు చప్పుడు చేసినపుడు లోని వారెవ్వరని అడుగ వచ్చిన వారు నేనని చెప్పుట పరిపాటి. తిక్కన ఆ క్రమము నిచ్చట అవలంబించి స్వల్పమైన దయ్యును సహజమైన సన్నివేశమును కల్పించెను.

కావ్యముల కాత్మ ధ్వని యని విద్వదంగీకృతమైన విషయము. నాటకము లలో ధ్వనిమంతములైన సన్నివేశములు పెక్కులుండును. శ్రవ్య కావ్యకర్తలు కూడ అట్టి సన్నివేశముల నెన్నింటినో కల్పించి తమ కావ్యములకు నాటకోచిత మగు రామణీయకము నాపాదింతురు.

కీచకుడు వెనువెంట వచ్చుచుండగా ద్రౌపది విరాటుడు సభ తీర్చి యున్న స్థలమున కరిగెను. భీముడు కీచకుని సంహరించుటకై చేరువ నున్న ఉన్నత వృక్షంబు నిరీక్షించి ధర్మతనయుం గనుగొనిన నతడు తన నయనాకా రంబున వారించి

మ. "వలలుం డెక్కడఁ జూచె నొండెడ ననేవృక్షామ్రజముల్ పుట్టవే"

విరాట 2. 139

ఇత్యాది నిగూఢ భాషణమున అతని కోపమును చల్లార్చెను. తరువాత నతనికిని ద్రౌపదికిని జరిగిన సంభాషణము నాటకోచితముగ వ్యంగ్యమై యున్నది. (2. 150-158) కీచకుడు ద్రౌపది చెప్పినప్రకారము నర్తనశాల కరిగి శయ్యపై పరుండిన భీముని ద్రౌపదియే యని భావించి ప్రేమపూరిత సంభాషణము కావించెను. భీము డాతనితో,

క. నాయొడలు చేర్చినప్పుడు, నీయొడ లెట్లగునొ దాని నీవెఱిఁగెదు.

క. నను ముట్టి నీవు వెండియు, వనితల సంగతికిఁబోవు వాఁడవె యైనం

దను వేఁబడసిన ఫలమే కనియెద విదె చిత్తభవ వికారములెల్లన్.

2. 338-339.

అని ఉచిత నిగూఢ భాషణము లాచరించి ద్రౌపది కానందము కలుగచేసెను. ఈ భాషణము ధ్వనిపూరితమై యుండుట ద్రౌపదికేకాక పతితలకును పరమానందము కలుగజేయును.

నాటకములందలి శైలి సులభమై యుండవలెను. కాళిదాసుని నాటకముల కంత ప్రశస్తి కలుగుటకు అతడవలంబించిన వైదర్భీశైలి యొక కారణము. శ్రవ్య కావ్యకర్తలు ప్రౌఢమైన రచన గావించి తమ పాండితీ ప్రకర్షను వెల్లడి చేయుటకు యత్నించినను సంభాషణ సందర్భములందు సహజము సర్వసుబోధము నగు లలిత రచన కావింతురు.

ఈ విధముగ శ్రవ్య కావ్యకర్తలు తమ కావ్యములలో నాటకీయత ననేక విధముల ప్రదర్శింప యత్నింతురు. అట్టి సన్నివేశములు వారి కావ్యములందలి ప్రౌఢవర్ణనభూయిష్ఠములైన ఇతర భాగములకంటె రసవత్తరములై యుండును. శ్రవ్యకావ్యములలో దృశ్యకావ్యరీతులు ఎంత ఉత్కర్ష నాపాదించునో దృశ్య కావ్యములలో శ్రవ్యకావ్యరీతు లంత అపకర్ష నాపాదించును. అందుచే దృశ్య కావ్యకర్తలు రచనావిషయమునం దత్యంత జాగరూకత వహింపవలెను.

ఉపయుక్త గ్రంథ నిర్దేశము :


1. ఆంధ్ర మహాభారతము. అరణ్య. 2–123.
2. ఆంధ్ర మహాభారతము. అరణ్య. 2–188.
3. శ్రీమద్రామాయణ కల్పవృక్షము. బాల. 181.

# కేయూరబాహు చరితము : —

## విద్ధసాలభంజిక

(ప్రతులు.

తెలుగు- కే. బా. చ. గడియారము రామకృష్ణశర్మ పీఠిక. ఆం.ప్ర.సా. 1966. సంస్కృ. వి. సా. భం. చౌకాంబా ముద్రణాలయము.

కేయూరబాహు చరితమునకు మూడు ముద్రిత ప్రతులు. మొదటిది 1902 లో సరస్వతీ పత్రికానుబంధముగ కీ. శే. కొచ్చెర్లకోట వెంకట కృష్ణారావు గారు ప్రకటించినట్టిది. రెండవది 1960 లో తిమ్మావఝ్ఝల కోదండ రామయ్యగారు పరిష్కరింపగా సారస్వత కుటీరమువారు ప్రకటించినది. మూడవది సాహిత్య ఎకాడమివారు ప్రకటించినది. వ్రాత ప్రతి యొకటి మద్రాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నందున్నది.)

సంస్కృతనాటకము ననుసరించి ప్రబంధము వ్రాయ గడంగిన ప్రథమాంధ్ర కవి మంచన. ఈతని కేయూర బాహుచరితము రాజశేఖరుని విద్ధసాలభంజికా నాటిక ననుసరించుచున్నది. ఈ అనుసరణ మేవిధముగా నున్నదో తెలిసికొనుటకు ముందు మూల నాటికను గూర్చి కొంత పరిశీలింప వలయును.

**మూలకవి — కాలాదులు :—**

రాజశేఖరుడు పెక్కితర సంస్కృత నాటక కర్తలవలె గాక తన రూపకములలో స్వవిషయములను గూడ ప్రస్తావించి యున్నాడు. ఈతడు మహారాష్ట్రి యాయావర బ్రాహ్మణుడు. ఈతని తండ్రి దుహికుడు లేక దుర్దుకుడు ! తల్లి శీలవతి. ఈతని తాత అకాలజలదుడు మహారాష్ట్రి చూడామణి యను ప్రసిద్ధి నొందెను. ఈతడు చాహమాన వంశస్థురాలైన క్షత్రియ కన్య అవంతి సుందరిని పరిణయమాడెను.[2] ఈతడుకూడ క్షత్రియుడే అని కొందఱు విమర్శకులు భావించిరి.[3] కాని రాజశేఖరుని తండ్రి మహామంత్రి పదవిని నిర్వహించి యుండుట, కవి తాను రాజగురువనని చెప్పుకొని యుండుట ఆనాడు మంత్రులు

గను, రాజగురువులుగను బ్రాహ్మణులే యుండుట మున్నగు అంశములు ఈతడు బ్రాహ్మణుడని రుజువు చేయుచున్నవి.[4]

రాజశేఖరుడు కర్పూర మంజరి, బాలరామాయణము, విద్ధసాలభంజిక, బాల భారతము అను నాల్గు రూపకములను రచించెను. అందు కర్పూరమంజరి ప్రాకృత భాషలో రచింపబడిన సట్టకము. దీని నీతడు తన భార్య కోరికపై రచించెను. ఇదియే ఈతని ప్రథమ నాటక రచనముగా భావింప బడుచున్నది. ఇక రెండవది బాలరామాయణము. ఇది మహానాటకము. మూడవదగు విద్ధసాల భంజిక నాటిక. నాల్గవదగు బాల భారతము అసంపూర్ణ నాటకము. ఈతడు రచించిన 'కావ్యమీమాంస' కావ్యలక్షణములను వివరించు గ్రంథము. ఇందలి ప్రథమాధికరణము మాత్రమే లభించుచున్నది. ఈతడు 'భువనకోశము' 'హర విజయము' అను గ్రంథములను కూడ రచించినట్లు తెలియుచున్నది. ఇందలి కొన్ని శ్లోకములు సుభాషిత రత్నావళీ, సదుక్తి కర్ణామృతములలో సంగ్రహింప బడినవి. రాజశేఖరుడు తాను వాల్మీకి, భవభూతి, భర్తృమేంఠ కవుల యవ తార రూపమైనట్లు చెప్పుకొనెను.[5] ఈతనికి 'బాలకవి', 'కవిరాజ' బిరుదములు కలవు.

రాజశేఖరుడు క్రీ. శ. 893 నుండి 907 వఱకు కన్యాకుబ్జము నేలు చుండిన మహేంద్ర పాలునికి గురువుగా నుండెను.[6] బాలరామాయణ నాటక మీతని కోరికపై రచింపబడెను. ఈ కవి మహేంద్ర పాలుని కుమారుడైన మహీపాలుని [917] ఆస్థానమునందు కూడ నుండినట్లు బాల భారత ప్రస్తావన తెలుపుచున్నది. బాలభారతము అసంపూర్ణమై యుండుటవలన ఈ నాటకము నీతడు అంతిమ కాలమున రచించి యుండవచ్చునని భావింపనగును. ఇక విద్ధ సాల భంజిక ప్రస్తావన యందు ఈ నాటిక శ్రీయువరాజ దేవుని పరిషదాజ్ఞ వలన ప్రయుక్తమైనట్లు పేర్కొనబడినది.[7] ఈ యువరాజ దేవుడు క్రీ.శ. 914 ప్రాంతమున త్రిపురిని పాలించిన కేయూరవర్ష యువరాజ దేవుడు. ఈతడు కలచురి వంశరాజు. కావున రాజశేఖరుడు పైని పేర్కొన బడిన ప్రతీహార రాజుల ఆశ్రయమునే కాక నడుమ కొంతకాలము కలచురిరాజు ప్రాపకమును కూడ పొందియున్నట్లు తెలియనగుచున్నది. పై అంశములవలన రాజశేఖ రుడు క్రీ. శ. పదియవ శతాబ్ది పూర్వ భాగము నందలి వాడని చెప్ప వచ్చును.

నాటిక యందలి కథ :—

ప్రథమాంకము :

మహారాజ విద్యాధర మల్లుడు త్రిలింగాధిపతి. కేయూరవర్ష బిరుదాంచితుడు. ఈతని రాణి మదనవతి. మంత్రి భాగురాయణుడు. ప్రియవయస్యుడు చారాయణుడు.

మహారాజ్ఞి మదనవతికి మేనమామయగు లాటభూపతి చంద్రవర్మకు పుత్ర సంతానములేదు. అతడు తన కుమార్తె యగు మృగాంకావళిని మృగాంకవర్మయని పురుషవేషమునఁ బెంచెను. ఈ విషయమును చారుల వలన తెలిసికొనిన భాగురాయణు డొక రహస్య కార్య ప్రయోజనార్థమై మృగాంకవర్మను బిలిపించి మహారాజ్ఞికడ నుంచెను.

మంత్రి నిర్మింపజేసిన సుషిర స్తంభ సంచార యుక్తమగు శయనమందిరమున నిదురించుచున్న రాజున కొకనాడు ప్రత్యూషమున ఒక వింత యనుభూతి కలిగెను. అసమాన లావణ్యరాశియగు కన్య ఒకతె అతని కడకేతించి "ఓం నమో మన్మథాయ" యనుచు కంఠహారమునుదీసి అతనిమెడలో వైచెను. రాజామెను పట్టుకొన బోవునంతలో ఆమె అదృశ్యురాలాయెను. రాజు తాను గాంచినది స్వప్నమా లేక సత్యమా యని వితర్కించుచు, తాను గాంచిన ఆ లావణ్యరాశినే తలపోయుచుండెను. రాజునకీ చింతను మాన్పి కొంత ఉపశమనము కలిగించు నుద్దేశముతో చారాయణు డాతని కేళీకైలాసమను స్ఫటిక శిలామందిరమునకు గొనిపోయెను. ఆ మందిరమున సాల భంజికా రూపమున వెలసిన స్వప్నసుందరిని గాంచి రాజు ఆనందించి తన కంఠమునందున్న హారముతో నామె నలంకరించెను. ఆ మందిరమున దృశ్యాదృశ్యయై యున్న ఆ సుందరిని గాంచుచుండినంత అపరాహ్ణకాలమైనది. మాధ్యాహ్నిక సంధ్యాదికములను నిర్వర్తించుకొనుటకై రాజును చారాయణుడును దేవి మందిరమున కరిగిరి.

ద్వితీయాంకము :—

కుంతలాధీశ్వరుడగు చండ మహాసేనుడు రాజ్యభ్రష్టుడై, తన పుత్రి కువలయమాలను మదనవతికడ నుంచెను. రాణి మృగాంకవర్మకు కువలయమాల నిచ్చి వివాహము గావింప వలెనని తలంచెను.

మదనవతి మహారాజునకు ప్రియసఖుడైన చారాయణుని పరిహసింప నెంచి అతనికి అబద్ధపు పెండ్లిని జరిపించెను. రాణి వినోదమునకు అడ్డురాక రాజు మిన్నకుండెను. చారాయణుడు తనకు కలిగిన అవమానమునకు క్రుద్ధుడాయెను. మహారాజు చారాయణుని అనునయించుటకై వనమున కరిగెను. వారిరువురును అటనున్న రత్నావతియను చవికెను బ్రవేశించిరి. అచట రాజు నయనానందకరముగా కందుకకేళి సల్పుచున్న స్వప్న సుందరిని గాంచెను. కాని ఆమె ననుసరింపబోవ ఆమె అదృశ్యయైనది. రాజామె విహరించిన తావులందు మసలి తన తాపభరమును దీర్చుకొన దలంచెను. అంత అతని కట నొక తాళవృంతము కనవచ్చినది. అందు అనురాగ పూర్ణములగు పదములు వ్రాయబడినవి. రాజు వానినిగూర్చి తలపోయుచుండ నేపథ్యము నందుండి కొన్ని మధురాలాపములు వినవచ్చినవి. వాని వలన రాజు 'మృగాంకావళి యను కన్య తనపై అనురాగము నిలిపియున్న' దను విషయమును గ్రహించెను.

తృతీయాంకము :—

మృగాంకావళిని పరిణయమాడినవిభుడు సార్వభౌముడు కాగలడనిఎఱింగిన వాడగుట వలననే, భాగురాయణు డామె సందర్శనమును మహారాజునకు కలుగజేయుట కొక ఉపాయము నాలోచించెను. అతడు వివేకవతియగు విచక్షణయను దానిని బిలిచి ఆమెకు 'మృగాంకవర్మయే మృగాంకావళి' అని తెలిపి, తన తంత్రమును వివరించెను. ఆప్రకారము, సంచారయుక్తములగు కంబముల యందు చలించుటద్వారా మృగాంకావళి రాజు శయనాగారము ప్రవేశించుటకును, పిదప నామె అతనికి దృశ్యాదృశ్యరూపమున కనవచ్చి దిగ్భ్రమము కలిగించుటకును, మృగాంకావళికి విచక్షణ సాయము గావించినది. భాగురాయణుడు తలంచిన విధముగా మహారాజునకును మృగాంకావళికిని పరస్పరము అనురాగ ముదయించినది.

అళీక వివాహము వలన కుపితుడైన చారాయణుడు, దేవికి ఆప్త సఖియగు మేఖలకు తగిన పరాభవ మొనరించి ప్రతీకార మొనరించెను. తన ఇష్టసఖికి జరిగిన అవమానమునకు రాజు కూడ విదూషకునికి సహకరించి యుండునని ఎంచి దేవి అతనిపై అలుక పూనినది.

విరహతాపమున వేగురాజు తన మిత్రునితో వనమున కరిగెను. అచట నాతనికిని తన ప్రేయసి ప్రత్యక్ష దర్శన భాగ్యము కలిగినది. వారిరువురును

పరస్పరము తమకుగల అనురాగమును ప్రకటించుకొని సమాగమ సుఖము ననుభవించుచుండగా, రాణి ఉద్యానవనమున కేతెంచు చున్నదని తెలుపు విష యము విని వారొకరినొకరు వీడిరి.

చతుర్థాంకము :—

రాజుపై అలుక పూనిన రాణి రాజును పరిహసింప నెంచినది. తాను మృగాంకవర్మగా భావించుచున్న మృగాంకావళితో రాజునకు పరిణయము గావించి అతనిని గేలిచేయ వలెనని ఆమె తలంపు. ఈ వివాహమునకు రాజును ఒప్పించి మృగాంకావళికిని రాజునకును పరిణయము జరిగించినది. రాణి రాజును గేలి చేయునంతలో లాటదేశపు దూతతెచ్చిన సందేశమువలన చండవర్మకు పుత్ర సంతానము కలిగినదనియు, మృగాంకవర్మ పురుషవేషము ధరించిన మృగాంకా వళి యనియు ఆమెకు తెలియవచ్చెను. మృగాంకావళికి మహారాజుతో వివాహము జరిగింప వలసినదిగా చండవర్మ కోరెను. సందేశమక్కఱలేకయే ఆకార్యము నెఱవేఱినదని రాణి దూతకుతెలిపెను. తాను నవ్వులాటకు గా తలపెట్టిన కార్యము సత్యమై పరిణమించి నందుకు రాణి వాపోయినది. అటుపై ఆమె మృగాంకావళిని చేరదీసి గారవించుటయే కాక కువలయమాలను గూడ తన సవతిగా సంతోషముగా గ్రహించెను. తన వ్యూహము సఫలమైనందులకు భాగురాయణుడు సంతసించెను. అంతలో సేనాపతియగు శ్రీవత్సుడు దిగ్విజ యము చేసివచ్చినట్లు వార్త తెలియవచ్చినది. సార్వభౌముడైన విద్యాధరమల్లుడు మంత్రి రాజనీతిని కొనియాడెను.

ప్రబంధకథ :

ప్రథమాశ్వాసము :— కళింగ దేశము నందలి త్రిపురీ నగరమును పాలించు రాజు కేయూరబాహుడు. అతని దేవేరి రత్నసుందరి అసమాన లావణ్యవతి. రాజు రత్నసుందరీ వ్యామోహమున రాజ్యకార్యములను విస్మరించెను. అతని మంత్రి భాగురాయణుడు అపర యుగంధరుడు. అతడు రాజు నుద్ధరించుటకు తగిన ఉపాయము నాలోచించుచుండెను.

భాగురాయణుడు చారుల వలన లాటభూపతికి పుత్ర సంతానము లేద నియు, అతడు తన పుత్రిక మృగాంకావళినే రహస్యముగా పుత్త్రవేషమున మృగాంకవర్మగా పెంచుచున్నాడనియు నెఱిఁగెను. ఆమెను పెండ్లాడినవాడు సార్వభౌముడు కాగలడని దైవజ్ఞుల నిర్ణయము.

ద్వితీయాశ్వాసము :

లాటదేశపురాణి రత్నసుందరికి పినతల్లి. ఈ చుట్టఱికమును పురస్కరించుకొని, మంత్రి భాగురాయణు డొక వ్యూహము రచించి, పురుషవేషమున నున్న మృగాంకావళిని త్రిపురికి రప్పించి ఆమెకు తన నివాస భవనమున విడిది నేర్పాటు చేసెను. అటుపై వివేకవతియగు కళావతియను నొకతెను మృగాంకావళికి ఆమె గుట్టెఱిగి ఆత్మకార్యసిద్ధికి తోడ్పడునట్టి చెలికత్తెగా నియమించెను. పిదప నతడు రాజునకై సుషిరకుడ్య స్తంభయంత్రంబగు నొక శయన మందిరమును నిర్మింపజేసెను.

చారాయణుడు రాణికి ప్రియ సఖియగు మేఖలకు పురుష వేషముననున్న ఒక దాసితో వివాహముగావించి దానిని పరాభవించెను. తన ఆప్తసఖికి అవమానము జరిగినందులకు రాణి మిగుల ఆగ్రహించెను. చారాయణుని తప్పును ధరాతలేశ్వరుని తప్పుగా భావించి ఆమె అతనిపై అలుక పూనెను.

తృతీయాశ్వాసము :—

రత్నసుందరి రాజుపై కినుకవలన అతని శయ్యాగృహమున కేగుట మానెను. ఈ విషయమును కళావతి వలన ఎఱింగిన భాగురాయణుడు తన వ్యూహము కార్యరూపము ధరించుట కది తగిన సమయమని ఎంచెను. అతడు సుషిరకుడ్యములందు సంచరించుటద్వారా మృగాంకావళీ సందర్శనమును రాజునకు కలుగజేయ వలసినదిగా కళావతికి బోధించెను.

చతుర్థాశ్వాసము :—

భాగురాయణు డాదేశించినవిధమున కళావతి మృగాంకావళిని యంత్ర మార్గము ద్వారా రాజ శయనాగారమునకు గొనిపోయెను. ఆమె అట నిదురించు చున్న రాజును మృగాంకావళికి జూపి అతనికి కంఠహారము నర్పించి పూజింపుమని చెప్పెను. రాజు మేల్కాంచి కరగ్రహణమున కర్థించెనేని తాను రత్నసుందరికి వెఱచుదాన నని పల్కి తప్పించుకొన వలసినదిగా నామె మృంగాకావళికి బోధించెను.

మృగాంకావళి రాజును సమీపించి అతని చెలువము చూచి పరవశురాలై అతనికి కంఠహారము నర్పించెను. రాజు నిద్ర తొరంగినవాడై తన ఎదుట

నిల్చిన అద్భుత సౌందర్యరాశిని జూచి ముగ్ధుడాయెను. అతడు పట్టుకొనబోవు నంతలో మృగాంకావళి కంబముజొచ్చి నిష్క్రమించెను. రాజు తాను గాంచినది యథార్థమగునా కాదా యను సందేహమును బొందియు ఆ సుందరిపై మనసు నిలిపెను.

విరహవేదనా భరితమానసుడైన రాజు కడకు భాగురాయణుని పనుపున కళావతి ఏతెంచినది. ఆమె రాజునకు అతని కంఠమునందలి హారము తాను స్వయముగా గ్రుచ్చినదని యెంఱిగించి అతనికి మృగాంకావళి యొక్క రహస్య మును, ఆమె రాజుపై అనురాగము నిలుపుటను, భాగురాయణుని వ్యూహమును తెలిపెను. ఆ కన్యకారత్నమును తాను పెండ్లాడుట ఎట్లు సమకూడునో కదా యని రాజు తలపోయుచుండెను.

చారాయణుడు మేఖల నవమానింపగా రాజు మిన్నకుండెను గాన, అందు లకు ప్రతిక్రియగా రాజును మోసగించుట కర్తవ్యమని కళావతి దేవేరికి నచ్చ జెప్పెను. కళావతి మాటలు నమ్మి దేవేరి తాను తమ్ముడని భావించుచున్న మృగాంకావళిని రాజునకిచ్చి వివాహము చేసి అతనిని పరిహసింప సమకట్టెను. వివాహ మంగళము ముగిసినది. అంత లాటదేశపురాణి హారలతాదేవి రత్న సుందరికి వ్రాసి పంపిన జాబువలన దేవేరికి తానే మోసపోయినట్లు తెలియ వచ్చెను. ఆమె తాను రాజు నవమానింపదలచి నందులకు పశ్చాత్తప్త చిత్తయై మృగాంకావళిని గారవమున చేరదీసెను. భాగురాయణుడు తనవ్యూహము ఫల వంతమైనందులకు సంతసించెను.

లబ్ధ మనోరథుడగు కేయూర విభుడు చతురుపాయములచే పుడమి నేలి సార్వభౌమత్వము నొందెను.

కేయూరబాహు చరితము నామౌచిత్యము :—

"నాటికా సట్టకాదులకు నాయిక వలనంబేరు" అని ఆంధ్ర సాహిత్య దర్పణము చెప్పుచున్నది.[8] 'విద్ధసాల భంజిక' యనగా 'చెక్కబడినటువంటి బొమ్మ' యని అర్థము. ఈ సాలభంజిక నాయికారూపమున వెలసినది. రాజశేఖ రుడు నాటికకు విద్ధసాలభంజికా పరముగ నాయిక కన్వయించుచున్న ఈ నామ మును ఎన్నిక చేసెను.

సుషిర స్తంభ సంచార యుక్తమగు రాజశయన మందిరమున మృగాంకా వళి ప్రవేశించి, అతడు మేల్కొని తన్ను కనుగొనినంతలో నదృశ్యయైనది.

రాజునకు అది కలయా లేక నిజమా అను సందేహము కలిగినది. అతడు తాను గాంచిన సుందరినే తలంచుచు కేళీ కైలాసమను విలాసమందిరమును ప్రవేశించెను. అచట నొక రూప చిత్రము గాంచి "యాదృశ శ్చిత్రకర స్తాదృశీ చిత్రకర్మ రూప శోభా, యాదృశః కవి స్తాదృశీ కావ్యబంధ చ్ఛాయేతి" అని విజ్ఞులు నుడివినట్లు ఆ చిత్రమునందలి సుందరి ఎవ్వతెయో స్వయముగా నారూపమును చిత్రించి యుండునని భావించెను. పిదప అచటి కంబములందు అవిష్కృతమైన విద్ధసాల భంజికను గాంచి అది తన నేత్రచకోర చంద్రికయగు ఆ రూపమే యని ఎంచెను.

"సాదుగ్ధ ముగ్ధ మధుర చ్ఛవి రంగ యష్టి
స్తే లోచనే తరుణ కైతక పత్ర దీర్ఘే
కంబోర్విడంబనకరశ్చ స ఏవ కంఠః
సై వేయ మిందు వదనా మదనాయుధం వా

[1-

పిదప

"న స్వప్నానుభవస్య కశ్చిదపరః సబ్రహ్మచారీ మమ
స్యాత్సంకల్ప కృత శ్చికా స్తి మనసః కస్యైవ రేఖాక్రమః
తన్మన్యే క్వచిద స్త్యసౌ కువలయ చ్ఛాయా ముషా చక్షుషా
యత్సాదృశ్య పరిగ్రహా దిహ దృశౌ దీర్ఘే సమావాసితే.

[1-39]

తాను స్వప్నమునందు గాంచిన కన్యక ఎచటనో ఉండియే తీరునని అతడు నిశ్చయించుకొనెను. విద్ధసాలభంజికా రూపము ఆ కన్యకా మూర్తియే అని విశ్వసించి తన కంఠమునందలి హారముండుటకు తగిన స్థలము ఆమె కంఠమే అని దానితో నలంకరించెను. విద్ధసాల భంజికను గాంచునంతవఱకు నాతని మనమున గకావికలై యున్న అనురాగము ఇపుడు స్థిరరూపము దాల్చినది. ప్రణయము ప్రరూఢమైనది. ఈ హారమును సాలభంజిక కర్పించెడి ఘట్టము భావి కథార్థమును గూడ సూచించుచున్నది. ఇట్టి వస్తుధ్వనిని గూర్చుచుండుట వలననే నాటిక విద్ధసాల భంజికానామము వహించినది. ఈ ఘట్టము నాటికయందు మిక్కిలి చిన్నదయ్యును చమత్కార వంతమైనది. భాసుని స్వప్నవాసదత్తముతో సరితూగలేకపోయినను, దానిననుకరించుచు రాజశేఖరుడు నూత్న విధానమున గావించిన కల్పనము

రమ్యముగానున్నది. ఇట్టి సాలభంజికా కల్పనమును గావించిన నాటక కర్త ఇతడే అని చెప్పవచ్చును.

మంచన తనకృతియందు విద్ధసాలభంజికా ప్రసక్తిని వదలివైచెను. అంతే కాక కావ్యమునం దాద్యంతము నాయికకు ప్రవేశమే లేదు. మంచన నాయక పాత్రమునే ప్రధానముగా గ్రహించి ఆతని చరితమునే కావ్యమున నధికముగా వర్ణించెను. అతడు దేవీవ్యామోహమున రాజకార్యవిముఖుడు కాగా, ఆతని మంత్రి భాగురాయణు డాతనిని సార్వభౌముని గావించుటకు గావించిన యత్నము, తుద కాతని మంత్రము సఫలమగుటచే కేయూర విభుడు సార్వభౌముడగుట, ఆతని పాలనమున ప్రజలు సుఖశాంతులతో నానందించుట మొదలైన అంశములందు ప్రాధాన్యము వహించుచున్నవి. కావున మంచన కావ్యమున కుచితరీతిగా 'కేయూరబాహు చరిత' మను నామకరణ మొనరించెను.

నాటికా పరిశీలనము :—

విద్ధసాల భంజిక నాల్గంకముల నాటిక. నాటికాలక్షణములు ఆంధ్ర ప్రతాప రుద్ర యశోభూషణము నందిట్లు వివరింప బడినవి. "ఇందు కల్పిత కథ. స్త్రీ పాత్ర లెక్కువ. నాలుగంకములు. ధీరలలితుడగు నృపాలుడు నాయ కుడు. సంగీత శిక్షణమున వ్యాపృతురాలు, లేక రాణి బంధు వర్గమునకు చెంది నది యగు కన్య నాయిక. ఈమె రాజవంశసంభూతయు, నవ్యానురాగ విలసి తయు నగునది. ఇందు నాయకుడు పెద్దభార్య వలసి (దేవి) భీతితో వ్యాకులు డగుచునే ఈ నాయికయందను రక్తుడగును. ఈ నాయికా నాయక సమాగ మము ప్రౌఢయు, అభిమానాతిశయము గలదియు, రాజవంశజయునగు పట్ట మహిషి అనుగ్రహాధీనమై యుండి, కడకు సంఘటిత మగును. వృత్తి కైశికి. ముఖ ప్రతిముఖ గర్భ నిర్వహణ సంధులు ప్రయుక్తములగును. ఉదా. రత్నా వళీ, విద్ధసాల భంజికలు"[9] లక్షణ కర్తలచే నాటికా లక్షణములకు విద్ధసాల భంజిక ఉదాహరణముగా గ్రహింప బడినందున ఇది సర్వ లక్షణ సంయుత మైన రచన మనుటలో సందేహము లేదు.

కథా కల్పనా చాతుర్యము :—

విద్ధసాల భంజిక రాజశేఖరుని కథా కల్పనా చాతుర్యమును చక్కగా విశదము చేయుచున్నది. ఇత డొక సామాన్యశృంగార కథకు పెక్కు వినూ

త్కాంశములను చేర్చి దానిని మిగుల అస్వాద్యమానము గావించెను. ఈ కథ యందుగల సుషిర స్తంభ సంచార శయన మందిరము, అందు మీటల ప్రయోగ ముచే ద్వారములు తెఱచుకొనుట, వాని ద్వారా నాయిక, నాయకుని కడ కేతెంచి అతనికి భ్రాంతి కల్గించుట మున్నగు విశేషములు నాయకునికే కాక ప్రేక్షకులకు కూడ నద్భుతావహములై తోచును. ఇందలి నాయికా పాత్రము విలక్షణమైనది. ఈమె పురుషవేష ధారిణి. కాని ఆమె ముగ్ధతా సౌందర్యములు నాటకమునం దాద్యంతము రసవత్తరముగా అభివర్ణింపబడినవి. ఆమెచుట్టును అల్లబడిన నాటికయందు ఆమెకుగల ప్రత్యక్షప్రవేశ మతిస్వల్పము. శృంగార భరితముగ సాగిన ఈ కథలో నాయికా నాయకులకు సమాగమావకాశము ఒక్క తృతీ యాంకమున మాత్రమే కల్పింపబడినది. అంతకు ముందు అయోగ శృంగారము చక్కగా వర్ణింపబడినది.

ఈ నాటికయందు ప్రధాన పాత్రలతో పాటు మేఖల, విచక్షణ, కువ లయమాల మున్నగు అన్య పాత్రలుకూడ కథాగమనమునకు తోడ్పడుచు, రాజ శేఖరుని పాత్ర నిర్మాణ కౌశలమును వివరించుచున్నవి. నాటికాపాత్రలకు నామములిడుటయందు కూడ నీతడు చక్కని అభిరుచిని వ్యక్తము చేసెను. మృగాంకావళి యను కథా నాయిక నామము శశాంకావళిని తోపజేయుచు ప్రకాశమానమగు నామె సౌందర్యమునకు చిహ్నముగానున్నది. కువలయమాలా నామము కూడ నట్టిదే. ఇక చారాయణుని అబద్ధపు పెండ్లి కుమార్తె నామము 'అంబరమాల' అని యుండుట ఆ సందర్భమున సార్థకముగుచున్నది.

రాజశేఖరుడు సన్నివేశ కల్పనమున సిద్ధహస్తుడు. ఈ సన్నివేశములు ప్రేక్షకుని హృదయము నాకట్టుకొని అతనిలో ముందేమి జరుగునో యను ఉత్సుకతను కలిగించును.

భాగురాయణుని తంత్రము తృతీయాంకము వఱకు అజ్ఞాతముగా నుంచ బడినది. అతడు సుషిర స్తంభ సంచారయుక్తమగు కేళీకైలాస మందిరమును నిర్మింప జేయుటకును, పురుష వేషమునందున్న మృగాంకావళిని మహారాజ సందర్శనార్థమై రప్పించుటకును గల కారణములు ఈ తృతీయాంకము వరకును గుప్తములుగా నుండుట వలన ప్రథమాంక ద్వితీయాంకములు పఠించు నపుడు లేక ప్రదర్శింపబడునపుడు పాఠకులకు (సామాజికులకు) ఉత్కంఠ ఏర్ప డును. దేవి చారాయణుని పరిహసింప గడంగుట. చారాయణుడు మేఖలను

పరాభవించుట, తిరిగి దేవి రాజును గేలి చేయ తలంచుట మున్నగు అంశములు హాస్యమునకు నెలవులగుచున్నవి. దేవి చారాయణుని, చారాయణుడు మేఖలను పరిహాసించెడు ఘట్టములు ప్రత్యక్షముగ కథా నిర్వహణమునకు తోడ్పడ కుండినను, అందలి క్రియా ప్రతిక్రియాది సంబంధముచే కథకు మిక్కిలి సొంపు కూర్చుచున్నవి. దేవి తన్ను పరాభవించినదని తలచి చారాయణుడు ఆమె అనుంగు సఖి మేఖలతో మేలమాడెను. ఇష్టసఖి కవమానమగుట ఓర్వని రాణి పతాకా సన్నివేశమున రాజునే గేలిచేయ దలంచినది. సరసము విరసమగునను సామెతననుసరించి, పరసమునకై దేవి ప్రారంభించిన వినోదము తుద కామెకు సపతులను తెచ్చి పెట్టినది. ఇట్టి నాటిక యందలి సన్నివేశ కల్పనమునందలి చమత్కారము దృశ్యము నత్యంత రమ్య మొనర్చి ఒక వినూత్నతను సంతరించుచున్నది.

రాజశేఖరుని శైలి :—

ఈ నాటికా ప్రస్తావనాంతము నందుగల ఈ క్రింది శ్లోకము రాజశేఖరుని కవితాశక్తిని తేటతెల్లము గావించుచున్నది.

"పాతుం శ్రోత్ర రసాయనం రచయితుం వాచః సతాం సమ్మతా
వ్యుత్పత్తిం పరమా మవాప్తు మవధిం లబ్ధుం రసస్రోతసః
భోక్తుం స్వాదుఫలం చ జీవితతరో ర్య ద్యస్తి తే కౌతుకం
తద్ భ్రాతః శ్రుణు రాజశేఖర కవేః సూక్తీః సుధా స్యందినీః
[1—7]

రాజశేఖరుని కవనము శ్రవణ రసాయనమై సజ్జన సమ్మతములగు వచనములతో నొప్పును. రసతరంగిణి ఆవలి ఒడ్డునకు చేరుటకును భవతరుసార సత్ఫలము నాస్వాదించుటకును ఈతని సుధామధురోక్తులను వినియే తీరవలెను.

ఇతని కవనము శ్రవణ రసాయన మనుట సత్యము. ఇతడు పద ధ్వనితోడనే అర్థ ధ్వనినికూడ గావించి మురిపించును.

"అమంద మణి నూపుర క్వణన చారు చారిక్రమం
ఝణ జ్ఝణితి మేఖలం స్ఖలిత తార హారచ్ఛటమ్
ఇదం తరల కంకణావలి విశేష వాచాలితం
మనో హరతి సుభ్రువః కిమపి కందుక క్రీడితమ్" [2—6]

ఇందలి లలిత పద విన్యాస మెలజవ్వని చేయు కందుక క్రీడను మనో హరముగ చిత్రించుచున్నది.

సజ్జన సమ్మతములైన వాక్కులకు ఈ నాటిక నెలవు.

కథమివ జీవితః కృకలాసాచ్చిరః సువర్ణం ప్రాప్యతే 11, పుట
శుద్ధాహి బుద్ధిః కిల కామధేనుః [1—8]
నఖలు అనుత్పీడితః సహకార పృష్ఠ గ్రంథిః రస సర్వస్వం ముంచతి
నహి స్నేహో యుక్తాయుక్తమనురుణద్ధి
యాదృశ శ్చిత్రకర స్తాదృశీ చిత్రకర్మరూపశోభా, యాదృశః కవి స్తాదృశీ కావ్యబంధచ్ఛాయేతి. ఇట్టి సుభాషితములనే కాక రాజశేఖరుడు ప్రసక్తానుప్రసక్తముగ పెక్కు సామెతలను గూడ నుపయోగించెను. ఇవి ప్రథమాంకమునం దధికముగ గోచరించును.

గండస్యోపరి స్ఫుటికోద్భేదః
నటే దృష్టే ముండితే ఉపవిష్టః పతిర్ముండిత ఇతి
వరం తత్కాలోపనత స్తిత్తిరః నపునర్దివసాంతరితో మయూరః
ఏష స్వప్నః బ్దై ర్మోదకై ర్గ్రామ ముపనిమంత్రయసే
యేన పునః శ్యాలభార్యా అర్ధ భార్యేతి భణితా

ఈ లోకోక్తులలో పెక్కింటిని విదూషకునిచే పల్కించుట, అవి సందర్భ సహితములై యుండుట, మున్నగు అంశములు ఆయా సంభాషణముల కొక అందమును కల్పించుచున్నవి.

రాజశేఖరుడు నాటికయందు వర్ణనా వైదగ్ధ్యమును పలు విధముల చూపి సహృదయులను రసతరంగిణియం దోలలాడించెను. ఈ నాటిక యందు ప్రభాత, సంధ్యా, వసంత, చంద్రికాది వర్ణనములు గావింపబడినవి. వర్ణనములను లలితముగను సహజముగను గావించి ప్రకృతిని సందర్భానుగుణముగా చిత్రించుటయం దీతడు నేర్పరి. భావములను చక్కగావ్యక్తీకరింపగల సామర్థ్య మితనికి గలదు.

ఇతనికి వివిధ దేశ స్త్రీలతో గల పరిచయము నీ క్రింది శ్లోకము తెల్పుచున్నది.

లంకా తోరణమాలికా తరలినో మానౌషధం సింహలీ
సంఘానాం ద్రవిడీ నాం మన్మథ మహాలాస్యైక నర్తాపకః

కర్ణాటీ కురలాలితాండవ కరో లాటీనాం లీలాగురుః
ఉన్మత్తీ మహరాష్ట్రీ వర్ధితమనా శ్చైత్రానిలో వర్ధతే.
ప్రాకృతమునకు ఛాయ [1—29]

రాజశేఖరుడు ప్రధానముగా శృంగార ప్రియుడైన కవి. ఈ శృంగార ప్రియత్వము నతడు నాటిక యందలి నాందీశ్లోకమందు కూడ ప్రదర్శించెను.

"కుల గురు రబలానాం కేలి దీక్షా ప్రదానే
పరమ సుహృ దనంగో రోహిణీ వల్లభస్య
అపి కుసుమ పృషత్కై ర్దేవదేవస్య జేతా
జయతి సురతలీలానాటికా సూత్రధారః [1—1]

ఇందు మన్మథస్తుతి కలదు. ఈ మన్మథ స్తుతితో పాటు రెండవనాందీ శ్లోకమున నతడు వామలోచనలను గూడ చమత్కార పూర్వకముగ స్తుతించెను. ఈ స్తుతి వలన నాటిక శృంగార ప్రధానమైనదని తెలియనగుచున్నది. ఈ శృంగార ప్రీతి చేతనే రాజశేఖరుడు తద్రసమును చిప్పిలజేయు శ్లోకములను పెక్కింటిని రచించి యున్నాడు. మచ్చునకు నాయికా సౌందర్యమును వర్ణించెడు నీ క్రింది శ్లోకమును గమనింతము.

మాత్రానర్తిత మందన భ్రు వదనం కించిత్ప్రగల్భే దృశౌ
స్తోకోద్భేద నివేశిత స్తన మురో మధ్యం దరిద్రాతి చ
అస్యా యజ్జఘనం ఘనం చ కలయా ప్రత్యంగ మేణీదృశః
సత్యంకార ఇవ స్మరైకసుహృదా తద్ యౌవనే నార్పితః
[1—40]

మన్మథుని అనుంగు నెచ్చెలియగు జవ్వనము కూర్చిన అంగములు ఆమెవి. నాయిక అంగముల పొందికను ఆమె యౌవనమును వర్ణించుటకీ ఒక్క పంక్తియే చాలును. ఇట్టి అపూర్వమైన భావుకత పెక్కు శ్లోకములందు గోచరించును.

రాజశేఖరునకు కవిగా భావుకుడుగా రసగ్రహణ పారీణుడుగా ఉన్నంత కీర్తి నాటక నిర్మాతగా లభింపలేదు. రూపక వస్తు కల్పనము నందితడు స్వతంత్రతను చూపింపక పోవుటయే దీనికిముఖ్య కారణము. విద్ధసాలభంజికా నాటకము కథా పాత్రాదులలో భాసుని స్వప్నవాసవదత్తమునకు నీరసమగు అనుకరణముగా గోచరించును. ఉదయనునిలోని ఉదాత్తత, వాసవద త్తలోని

స్వచ్ఛందత, యౌగంధరాయణునిలోని గాంభీర్యము, రాజనీతి చతురత క్రమముగా నాటికయందలి విద్యాధరమల్ల, మదనవతీ, భాగురాయణులలో లోపించినవి. కాని విదూషకుడు విద్ధసాలభంజికలో వన్నె కెక్కినాడని చెప్పకతప్పదు. ఇందలి విదూషకుడు సరళముగ సంభాషించును. లోకజ్ఞత చూపును. విద్ధసాలభంజికా నాటికలోని వస్తువునందు కొంత అసహజత్వము కలదు. రాణికి తెలియకుండనే మృగాంకావళి తన పురుషవేషమును గాపాడుకొనుట, రాజు వివరములరయకుండనే పెండ్లికి ఒప్పుకొనుట మున్నగు అంశము లిందుకు ఉదాహరణములు.

ఇది రంగస్థలప్రయోగోచితమగు రూపకమగునా కాదాయను సంశయము కూడ కలుగును. ఏలన ఇందలికొన్ని సన్నివేశములు వర్ణనమయములై యుండగా, మఱికొన్ని ప్రదర్శనమున రాణింపనివిగా నున్నవి. ఇది శ్రవ్య నాటికగా మనసును ఆకట్టునంతగా దృశ్యముగా ఆకర్షింపదు దీనిని చదువునపుడు

"అహో గాహస్యమ్। అహో శిఖరిణీపాదః। అహో సూక్తి యుక్తా వాచః అహో హృద్యా వైదర్భీ రీతిః। మాధుర్యం పర్యాప్తమ్। అహో నిష్ప్రమాద ప్రసాదః।" అని కొనియాడక తప్పదు.

మంచన కాలము :—

మంచన కేయూరబాహు చరిత్రము నందెచటను స్వవిషయములను ప్రస్తావించియుండలేదు. అవతారికలో

కం. "తన యిష్టసఖుని విద్వ
జ్జన మాన్యుని నుభయ కావ్యసరణిజ్ఞుని మం
చన నామధేయు నన్నం
గనుగొని యిట్లనియె వినయ గౌరవమెసగన్"

[1—7]

అని వ్రాసికొనుటవలన ఈతడు కృతిపతికి ఇష్ట సఖుడనియు, విద్వజ్జన మాన్యుడనియు, ఉభయ కావ్య సరణిజ్ఞుడనియు తెలియవచ్చును. ఆశ్వాసాంత గద్యలయందు కూడ అతడు "ఇది సకలసుకవిజనవిధేయ మంచన నామధేయ" అని క్లుప్తముగా తన నామమును మాత్రమే పేర్కొనెను.

మంచన కేయూరబాహు చరిత్రమును నండూరి గుండయామాత్యునకు అంకితమిచ్చెను. ఈతడు కృతిలక్ష్మికి ముఖతిలకంబుగా కృతిపతి వంశ క్రమమును వివరించియున్నాడు. దానినిబట్టి గుండయ పూర్వీకులు వెలనాటి చోడ రాజులకడ మంత్రులుగను, సేనాపతులుగను ఉండినట్లు తెలియనగును. వెలనాటి చోడులలో చివరి రాజగు పృథ్వీశ మహారాజుకడ గుండయ మంత్రి తాతయగు కేతన క్రీ. శ. 1132 - 1206 ప్రాంతమున సచివుడై యుండెను.[10] వెలనాటి రాజుల ప్రాభవము క్షీణించినప్పటికిని నండూరి వంశ విభవము క్షీణింపలేదు. గుండయ కాలము వఱకును అది కొనసాగినది. గుండయ మంత్రి చిన్నన్నయైన కేతన "విఖ్యాత కవిత్వ సంపద బొగడ్తకు నెక్కి యశేష ఖాండవ వ్రాత హితాత్ముడై గణక వర్గ కళా మహిమన్" ప్రగల్భుడైన వాడని కీర్తింప బడినాడు. ఇతని కవిత్వసంపద యెట్టిదో తెలియరాదు.

గుండయమంత్రి ధనదుపుర వాసి. గుంటూరు మండలములోని చందవోలునే ధనదుపుర మనుచుండిరనియు, అదే రేపల్లె తాలూకాలో నున్నదనియు తలంపు.[11] కృతిపతి చందవోలు నివాసి కనుక మంచనయు అచటనే యుండెడివాడని ఊహింపవచ్చును. ఇక మంచన పూర్వకవి స్తుతిలో నన్నయ తరువాత తిక్కనను ఒక్కని మాత్రమే పేర్కొనెను. తిక్కన క్రీ. శ. 1210 - 1290 నడుమ నుండెడివాడు. మంచన తిక్కనకు తన బాల్యమున సమకాలికుడై యుండును. వీనిని బట్టి మంచన కాలము క్రీ. శ. 1300 ప్రాంతమై యుండునని చెప్పవచ్చును.

కృతిపతి అభిలాష —

గుండయ మహావైభవోపేతమగు జీవనము గడపెడివాడు. ఇతడు విప్రగణములకు పెక్కు అగ్రహారముల నిచ్చెను. పెక్కు మంది వటువులకు పెండ్లిండ్లు చేయించెను. కాశీశ్వరుని తిరునాళ్ళలో ఏటేట అర్థులకు కోరినంత అర్థము నిచ్చెడివాడు. రత్న చయంబులను వెదచల్లెడువాడు. కుటుంబములతో కవి జనులను బ్రోచెడువాడు.

ఇతడు 'శాస్త్ర పురాణాగమ దుగ్ధాబ్ధి మందరాచలపతి'. 'గణకత్వ విద్యనట్లనె సర్వ విద్యలయందు చతురుడు' [1-46] 'కవి గాయక పోషకుడు [౬-344] 'భ్రాజిత మృదు మధుర కావ్య పరిణతుడు'. [౬-346] ఈతడిట్లు పరమ సంస్కారి యగుట వలననే

క॥ "సొమ్మలలో ముప్పొర్చుజ
గమ్మెల్లను సోదు ముట్టగా జేయును శ్లా
ఘ్యమ్మగు వస్తువు నగుటను
గమ్మని కనకంబు గాదె కవిత దలంపన్"12

అని కవిత యొక్క ప్రశస్తి నెఱింగి, జగతిపై శాశ్వతమై నిలుచునట్టి ఒక కృతిని అంకితము గైకొనదలచెను. నిరంతర సరస కవితా గోష్ఠీ నిష్ఠుండగు నాతడు ఒకనాటి చిత్రకథా శ్రవణ ప్రసంగంబున తనకు ఇష్టసఖుడైన మంచన కవితో,

ఉ. "కావున నాకు నొక్క కృతి గైకొన నిష్టము నీవు ప్రజ్ఞసం
భావిత కావ్యదక్షుడవు భవ్యమతిం ద్విజదేవ నిర్మితం
బై విలసిల్లు తంత్రము ప్రియంబున జూచిన నందుగర్త సౌ
ఖ్యావహమై ప్రబంధ రచనాశ్రయ మయ్యెడు మార్గ మూతగన్"
[1-10]

అని తన అభీష్టమును వెల్లడించెను. గుండయ, మంచన కృతిని కర్త సౌఖ్యావహ మగునట్లును, ప్రబంధరచనాశ్రయ మయ్యెడు మార్గమునను రచింపు మనుటలో చక్కని అభిరుచిని వ్యక్త మొనరించెను. ఇంకను ప్రత్యేకముగా ఆ ప్రబంధమున

క. స్థాయి రసము శృంగారం। బై యెడవడ గథలు నీతులై యెదనెడరా
గేయూరబాహు చరితము। సేయుము నీ వట్టి కావ్య శిల్పము మెఱయన్13
[1-11]

అని శృంగారమును ప్రధాన రసముగ వెలయించి, సరసమగు కావ్య శిల్పమును ప్రకటించుచు కాంతాసమ్మితముగ నందు పెక్కు నీతి కథలనుకూడ చేర్చి కేయూరబాహు చరిత్రమును రచింపుమనెను.

రాజశేఖరుని విద్ధసాలభంజికా నాటిక గుండయామాత్యుని కాలమున కర్పూర వర్షుని చరితముగాగాని కేయూరబాహుని చరితముగా గాని ప్రసిద్ధమై యుండును. ఈ నాటికలో విద్యాధరమల్లుడు త్రిలింగాధిపతిగా పేర్కొనబడుట కూడ, గుండయ మంత్రి హృదయమందలి దేశాభిమానమును ప్రేరేచి కేయూర బాహుని చరితమును కృతిసేయించుటకు పురికొల్పియుండును. ఈ నాటికలో గల వినూత్న కల్పనములు కూడ గుండయ సరస హృదయము నాకర్షించి

యుండును. పురాణాదుల అనువాదము సాగుచున్న ఆ కాలములో ఇట్టి నాటి కానుసరణమును గావించి ఒక నవ్యతను వెలయింపజేయు నుద్దేశము కూడ నాతని కుండియుండును. ఇక విద్ధసాలభంజిక రాజనీతిని గూడ ప్రధానాంశముగా కలిగియున్న కథ. గుండయ కూడ ప్రెగడయై రాజనీతి చతురుడై యున్నందున ఆ కథ యెడ ప్రీతి వహించి యుండును.

కృత్యారంభము:—

గుండయామాత్యుని అభ్యర్థనము విని, ఆతడొసంగిన అంబరాభరణాది వివిధ పదార్థ సహితంబైన తాంబూలము పుచ్చుకొని మంచన సవినయముగా నిట్లు పలికెను.

ఉ. బాలరసాల పుష్పనవ పల్లవ కోమల కావ్య కన్యకన్
గూళల కిచ్చి యప్పడుపు గూడు భుజించుట కంటె సత్కవుల్
హాళికులైన నేమి మఱియంతకు నాయతి లేనినాడు గౌ
ద్దాలికులైన నేమి నిజ దార సుతోదర పోషణార్థమై (1—13)

ఇది పోతన భాగవతము నందలి పద్యముగా మిగుల ప్రసిద్ధమైనది. కాని పోతన కాలమునకు, అనగా సుమారు రెండు శతాబ్దములకు పూర్వమే, మంచన దీనిని రచించెను. అతడును పోతన వలె 'బాలరసాల పుష్పనవపల్లవ కోమలమైన' కావ్య కన్యకను (తగనివారికి) కూళల కిచ్చుట కంగీకరింప లేదు.

క. "అని తగని వాని దెస నా
మన మెప్పుడు రోయుగాన మతిమజ్జనవ
ర్జనలకు మిగిలిన సుగుణుని
నిను బొంది మదీయ కవిత నెగడుం బుడమిన్" (14.)

అనుచు తనకృతి గుండయ ప్రెగ్గడ వంటి సజ్జనుని చేరుచున్నందులకు మిగుల సంతసించి, కృతిపతి కోరిన విధముగా కృతిని సంతరించుటకు పూనెను. "బాలరసాలపుష్ప" అను పద్యమునందలి భావము తన మనోవృత్తికి సరిపోవుటచే పోతన యించుక మార్చి యాపద్యమును గ్రహించియుండును.

మంచన కృత్యారంభమును ముచ్చటగ మూడు పద్యములతో ముగించెను. మొదటి రెండు పద్యములలో కృతిపతికి మంగళాశంసనము గావించెను. ఇక రెండవ పద్యమున గణక శిఖర రత్నమైన (4 – 212) కృతి పతిని మురిపించు విధమున

చ. "కరిముఖు, డశ్వినుల్, శ్రుతులు, కంజసముద్భవు మోము, లంబికే
శ్వరు మొగముల్, తదాత్మజుని వక్త్రము, లాది మునీంద్ర మండలం,
బురగ పతుల్, గ్రహంబులు, పయోరుహ నాభుడు, తారకంబులున్,
బొరిబొరి నెల్ల సంపదలు పోలము గుండని కిచ్చుఁ గావుతన్ (1–2)

అని, సంఖ్యాక్రమమును బాటించుచు తన కావ్యశిల్పమును మెఱయింప మొదలిడెను. ఈ పద్యమున గజాననుడొకడు, అశ్వినీ దేవతలిరువురు, వేదములు మూడు, (త్రయి) బ్రహ్మ చతుర్ముఖములు, పంచాననేశ్వరుడు, ఆఱువక్త్రముల కుమారస్వామి, సప్తర్షిమండలము అష్టనాగములు, నవగ్రహంబులు, పయోరుహ నాభుడనుటచే అతని దశావతారములు, అనంతములైన తారకములు, ఇట్లు ప్రథమ సంఖ్య మొదలుకొని అనంతము వఱకు పేర్కొనెను.

మంచన గుండయామాత్యుడు అభిలషించిన విధమున తన కావ్యమున అవాంతరములైన నీతి కథలను జొప్పించి యుండుటచే కృత్యాదియందలి మూడవ పద్యమున పూర్వకవి స్తుతిచేయుచు వాల్మీకి, వ్యాస, కాళిదాసులను, నన్నయ తిక్కనలను స్తుతించు సందర్భమున ఉద్ధవ, చాణక్య, యుగంధరాది నీతి విద్యా కోవిదులనుకూడ స్తుతించి ఔచిత్యమును బ్రకటించెను. ఈ మూడు పద్యముల తరువాత కృతిపతి ప్రశంస, సప్తసంతాన ప్రశస్తి, కృతిపతి అభిలాష మన్నగు అంశములు వివరింపబడినవి. అటుపై మంచన కృతిపతి వంశక్రమమును ముప్పదిరెండు గద్య పద్యములలో వివరించెను. ఒక షష్ఠ్యంతమును చెప్పి కథారంభమున కుపక్రమించెను.

తెనుగున కావ్యాశ్వాసాద్యంతములను విభక్తులతో ముగించు సంప్రదాయ మొకటికలదు. సాధారణముగ కవులందఱును ఆశ్వాసాద్యంతములందొకే విభక్తి నుపయోగింతురు. మంచన అట్లుగాక ప్రథమాశ్వాసాంత, ద్వితీయాశ్వాసాద్యంత, తృతీయాశ్వాసాది పద్యములను ద్వితీయావిభక్తియందును, తృతీయాశ్వాసాంత, చతుర్థాశ్వాసాది పద్యములను ప్రథమా విభక్తియందును, చతుర్థాశ్వాసాంతమును సంబుద్ధియందును రచించి ఒక ప్రత్యేకతను చూపెను.

ఈ విభక్త్యంత సంప్రదాయము తెనుగున నన్నెచోడునితో ప్రారంభమైనది.[14] పాల్కురికి సోమనాథుడు సంస్కృతాంధ్రములు రెండింట బసవోదాహరణము లను రచించి నన్నెచోడు డారంభించిన పద్ధతి కొక పరిణతస్వరూపము నొసంగెను.

ప్రబంధరచనాశ్రయమయ్యెడు మార్గము :

కర్ణ సౌఖ్యావహమైన ప్రబంధ రచనాశ్రయమగు మార్గము నూతగా గ్రహించి శృంగారరసమును అంగిరసముగా, శిల్పము మెఱయ కేయూరబాహు చరిత్రమును రచింపుమని గుండయ కోరుటలో ఒక ప్రత్యేకత గోచరించుచున్నది. మంచన కాలము నాటికే నన్నెచోడుడు ప్రబంధ రచనా విధానము నొకదాని నారంభించి యున్నాడు. నన్నెచోడుని కుమార సంభవము అష్టాదశవర్ణనములతో కూడి నవరస భరితముగ సాగినది. ఈత డారంభించిన కృత్యాది, షష్ఠ్యంత రచన, ఆశ్వాసాద్యంతములను విభక్త్యంతములుగా రచించుట, వర్ణన పద్ధతులు, తెనుగు నుడికారము మున్నగు పద్ధతులను మంచన కూడ స్వీకరించెను. నన్నెచోడుడు[15] సరస బంధురమగు ప్రబంధము అని ప్రబంధ శబ్దమును ప్రథమముగా నుపయోగింపగా మంచన తన కావ్యమునందలి రసమును గూర్చియు, శిల్పమును గూర్చియు కూడ ప్రస్తావించి యుండెను. ఈతడు పేర్కొనిన స్థాయి రసము శృంగారమై యుండుట తరువాతి ప్రబంధములలో ప్రధాన లక్షణమగుట గమనింప దగిన అంశము. "ప్రబంధములలో రసభేద మును బట్టి శృంగార ప్రబంధ మనబడు శాఖ యొకటి కలదు. ఈ శృంగార ప్రబంధమును గూర్చి కూడ మనకు పురాణ యుగకవులే తెలిపి యున్నారు. ఇట్లు తెలిపిన వారు ముఖ్యులు మువ్వురు. ప్రబంధమునకు శృంగారము ప్రధాన రసముగా నుండవలెనని వీరు తమ కృతులలో కంఠోక్తిగా నుద్ఘోషించిరి. కావ్య శాఖకు కవిత్రయమువలె శృంగార ప్రబంధ శాఖకు మంచన, శ్రీనాథ, జక్కనలు కవిత్రయము వంటివారు"[16] శ్రీనాథ, జక్కనలు మంచనకు తరువాతి వారు. కావున శృంగార ప్రబంధ శాఖకు నాందీ వాక్యమును పలికినవాడు మంచనయే అని చెప్ప నగును.

మంచన తన కావ్య ప్రథమాశ్వాసాంతగద్యమున "కేయూర బాహు చరిత్రంబను మహాప్రబంధమునందు" అని తన కావ్యమును ప్రబంధముగా పేర్కొనెను. కాని ద్వితీయ తృతీయ చతుర్థాశ్వాసాంత గద్యలందు కేవలము

'కేయూర బాహు చరిత్రంబు' నందు అని మాత్రమే వ్రాసెను. ఇచటి ప్రబంధ శబ్దమును కావ్య సామాన్య వాచకముగనే గ్రహింపదగును. మంచన కేయూర బాహు చరితమునందు పెక్కు నీతికథలను చేర్చియుండుటచే ఈ కావ్యమును కొందఱు కథాకావ్యమనియు, ఇందు రాజనీతికి సంబంధించిన యంశముండుట వలన మఱికొందరు రాజనీతి కావ్యమనియు భావించుచున్నారు. ఈ గ్రంథమును "ఆంధ్ర భోజుని నీతి భూషణము, శివదేవయ్య పురుషార్థ సారము, ప్రతాప రుద్రుని నీతి సారము, కర్తృత్వము తెలియని కామందక పంచతంత్రములు, బద్దెన నీతి సారము" మున్నగు కావ్యములతో జతచేసిరి.[17] మడికి సింగన సకల నీతి సమ్మతమున ఇందలి పద్యముల నుదాహరించుట వలన ఈ కావ్యము నీతి పరముగ నెంత విశిష్టమైనదో తెలియనగును.

ఇట్లు మంచన కావ్య మేవిధముగ పరిగణింపబడినను ఇందలి ప్రధానకథ ప్రబంధోచితమైనది. అవాంతర కథల వలన వస్త్వైక్యమునకు కొంత భంగము కలుగక పోలేదు కాని అవియన్నియు నాయా సందర్భములందు ప్రధానకథతో సంబద్ధములై యున్నవి. రాజు రత్నసుందరీ వ్యామోహమున రాజ కార్య విముఖుడగుటను చూచి "ఈ కొఱగాని చందముల నీ నరనాథుని బాప నేక్రియం జేకుఱు నాకుపాయ" మని భాగురాయణుడు చింతించుటతో ముఖసంధి ఏర్పడి, రాజశయనాగారమున మృగాంకావళి ప్రవేశించి అతని కంఠము నందు హారము వైచి, ఆతడు చూచునంతలో "రత్న సుందరి కోడుదు రాజ" అని అదృశ్య మగుటతో కథను ముందుకు జరిపినది. కళావతి వలన తనకు హారము నర్పించిన కన్య మృగాంకావళి యని ఎఱింగి రాజు 'ఆమె నెమకూడునుపాయమెట్టిదో' అని విచారించుట లోని గర్భసంధి, రాణి రాజును మోసగింప బోయి ఆతనికి నిజము గనే మృగాంకావళినిచ్చి వివాహము చేయుటతో నిర్వహణము పొందినది. ముఖ సంధిలోని భాగురాయణ తంత్రము నిర్వహణము నందు రాజునకు పరిణయమును, సార్వభౌమత్వమును సిద్ధింపజేసినది.

మంచన సందర్భోచితముగ తన కావ్యమునందు పెక్కు వర్ణనములను గావించెను. ఇవన్నియు అర్థాలంకారములతో గూడి కవి భావుకతను నిరూపించు చున్నవి. ఇతనికి శబ్దాలంకారములపై మక్కువ తక్కువ. కాని ఒకానొకచో నవి స్వతస్సిద్ధముగ ప్రవేశించును. ఇతడు తన కావ్యమును ప్రబంధోచితరీతిలో నగర వర్ణనముతో నారంభించెను. ఈతడు వర్ణించిన నగరము త్రిపురి. ఇది
[illegible]

పంద్రెండు పద్యములతో సాగినది. ఆపురి నతడు చక్కని ఉత్ప్రేక్షతో నిట్లు వర్ణించెను.

మ. నవ ముక్తా ఫలరాసులన్ రుచిర నానా సన్మణి శ్రేణిప
క్తి వితానంబున్ హేమ వాలుకల నక్షిప్రీతి సంధించుచున్,
భువన స్తుత్యములై పురాంగణము లొప్పం జూడగాఁ గుంభసం
భవ పీతాంబునిధి స్థలాభినవ విస్ఫారంబులై యెప్పుడున్.
(1 — 51)

ఆపురి క్రొత్త ముత్తెపు రాసుల తోడను, కాంతిమంతములైన మణుల సమూహములతోడను, బంగారపు కుడ్యములతోడను కూడి కుంభసంభవునిచే నీరంతయు త్రాగి వేయబడగా మిగిలిన సముద్రస్థలమువలె నొప్పుచుండినదట. ఇట్లే మంచన ఆపుర మందలి పరిఘను, సాలములను, దేవగృహములను, తురగములను, మదగజములను, చాతుర్వర్ణ్యమును, రమ్య హర్మ్యములను, సుందరీమణులను, తెమ్మెరలను, వనములను హృద్యముగా వర్ణించెను.

మంచన చతుర్థాశ్వాసమున కావ్యవర్ణనములను బెక్కింటిని కూర్చెను. ఇందు నాయికా నాయక సౌందర్యవర్ణనము నందలి నాయికా సౌందర్య వర్ణనము తరువాతి ప్రబంధములకు మార్గదర్శక మగుచున్నది. ఈ వర్ణనము నాయకునిచే ఐదుపద్యములలోను, అటుపై కళావతిచే ఎనిమిదిపద్యములలోను గావింపబడినది. ఇవన్నియు సరసములు.

సీ. వాలుగన్నులఁ జారు వదనంబు నుత్పల
వనజ కాంతుల నుద్ది వైచికొనగ
మెఱుగు దంతములు వాతెఱయును మౌక్తిక
చూతపల్లవముల సూడుపట్ట
భుజములు మృదు హస్తములును లేదూండ్లను
జెందొవ రేకుల సిగ్గు పఱుప
జనుదోయి నలకలు జక్కవ కవ పొందుఁ
దుమ్మెద చాయల దొద్ద గొనగ
గీ. నలిక మర చందురుని తోడఁ జెలిమి సేయ
దియ్యపలుకులు దేనెలు వియ్యమంద
నడపు లంచలఁ గొంచెదనంబు సేయ
గమల గంధి మనోహరాకార మలరె. (4 — 137)

ప్రకృతి యందు గల స్నిగ్ధవస్తు సమాహార రూపమే నాయిక. మంచన గావించిన ప్రత్యూష. సూర్యోదయాది వర్ణనములు తెలుగు నుడికారమున కాట పట్టులు

చ. జలజవనంబు కూర్మి చెలి, జక్కవ దోయి ముదంబు, నిక్కుచు
క్కులపయి దాడికాడు, త్రిజగంబుల మ్రొక్కుల యిక్క, వేదము
ల్మొలిచిన పాదు, యోగులకు మోక్షము వాకిలి, ప్రాణికోటికి
న్వెలు గన నొప్పు నవ్వెలుగు వేగమ తూర్పునఁ దోచె నత్తఱిన్
(4 — 27)

మంచన గూర్చిన తెలుగు పదముల చంపకమాల ఇది. ఇందు సూర్యునకు వేయబడిన విశేషణములు సాభిప్రాయములై యున్నవి. కావ్యమందలి ప్రాసాద సౌరభ్యము హృద్యము. ఆరామ విహార మలయ మారుతోద్యాన వన వర్ణములు సుందరములు. ఈ కవి వసంత వర్ణనమును ఆఱు పద్యముల యందును, నొక వచనమునందును గావించెను. ఇవి ఆతని భావుకతను చక్కగా సూచించుచున్నవి.

మ. “కలయంబూచి వెలుంగు కింశుకము లంగార ప్రతానంబు కో
మల సాంద్రాంకుర భాసి చూతలతికల్ మంటల్ నభోవీథి న
గ్గలమై క్రాలుచు దూలుచుం దిరుగు భృంగ శ్రేణి ధూమంబుగాఁ
బొలిచెం బుష్పశర ప్రతాప దహనంబో నాగ నిత్తోటదాన్.
(4-53)

నాయకునికి విరహోద్దీపనమే ఇట వసంతముయొక్క ప్రయోజనము. ఇది సంపూర్ణముగ నెఱవేరినది.

నాయిక విరహమును వర్ణించునప్పటి మధుర శైలి గమనింపదగి యున్నది.

శా. వాడెన్ మోము, రసాల బాల లతికావాసంతికల్ సూడగా
వోడెం గన్నులు, వెచ్చగా దొడగె నిట్టూర్పుల్తనూ వల్లికం
గూడెం దాపము, పీడుకోలు వడసెం గోష్ఠీ విహారంబు, మా
టాడెం దాలిమి, మేను డస్సెఁ గడు నయ్యంభోజ పత్రాక్షికిన్.
(4-153)

ఈ కావ్యమున నాయిక ప్రణయలేఖ, వనవిహారము, చంద్ర చంద్రికా వర్ణనములు, నాయిక మూర్ఛ, ఉపచారాదులు ఉచితముగ వర్ణింపబడినవి. చంద్ర మన్మథా ద్యుపాలంభనమునకు బదులు తత్ప్రార్థనము గావింపబడినది. వ్యంగ్యమగు ఈ క్రింది వర్ణనము చూడుడు.

చం. అలరుల సెజ్జ యింతయును నంగజు దిద్దిన యంపపోవు కో
మల దళ వీజనంబు లవి మంద మరు జ్జనకంబు లీ లతా
నిలయము కాముకావకట నిల్తురె యిచ్చట డాగఁబోయి యిం
దలవరి యుంట డాగిరను తద్వచనంబులు నిక్కువంబుగన్.

(164 పు.)

ఇచట వనశోభను నిందించుటలో లలిత సుకుమారమైన ధ్వని. అందుండుట డాగబోయియుం దలపరి యుంట డాగుట వంటిదను జాతీయ చమత్కార వైభవము, పాఠకుల మనముల నలరింపక మానవు. అటుపై మూడు పద్యముల లోను, ఒక వచనమునను సాగిన వివాహ వర్ణనము రమ్యముగ నున్నది. తరువాత నాయికా నాయకుల అభిమత క్రీడాదుల వర్ణనముకూడ ప్రబంధోచిత రీతిలో సాగినది.

మంచన ప్రబంధము నీతి కథా యుక్తమైనది గావున దానిని నీత్యుపదేశ పూర్వకముగా నుపసంహరించెను. ఇతడు కావ్యాంతమున సప్తవ్యసనములవలన తొల్లి ధర్మరాజాదులకు కలిగిన ఇడుమలను బేర్కొని వానిని త్యజింప వలసినదిగా నీతిని బోధించెను. చివరికి ఫలశ్రుతి చెప్పెను. ఇతడు తన ప్రబంధమున గావించినవర్ణనములొండు రెండు తప్ప అన్నియును స్వతంత్రములే.

సంకలన గ్రంథమగు 'ప్రబంధ మణి భూషణమున' ఉదాహరింపబడిన ఈ క్రింది పద్యములు మంచన ప్రబంధ కవితా చాతురికి నిదర్శనములు.

1. ప్రబంధమణి భూషణము [61] అనిశము మీదటన్ మెలగు కే బా. 1-54
2. ప్రబంధమణి భూషణము. [156] అత్రి సమానులు కే బా.చ. 1-57
3. ప్రబంధమణి భూషణము. [119] తలముగ నెల్లప్రొద్దును కే.బా.చ. 1-60
4. ప్రబంధమణి భూషణము [690] అలీలావతితోడ కే బా చ. 1-68
5. ప్రబంధమణి భూషణము. [682] నిడుపులుగాని అల్కలను కే.బా.చ. 1-69
6. ప్రబంధమణి భూషణము. [823] లెక్కింపజులకనై కే.బా.చ. 4-26

7. ప్రబంధమణి భూషణము. [396] మెలపున దాటి కే.బా.చ. 4-83
8. ప్రబంధమణి భూషణము. [39 ] ఇంచుకనాపయింబోలసె కే.బా.చ,4-85
9. ప్రబంధమణి భూషణము. [149] మృదు వేదికంట కే.బా.చ. 4-49

**అనువాద పద్ధతి :**

కేయూర బాహు చరితమునం దెచటను మంచన తాను విద్ధసాల భంజికా నాటిక ననుసరించినట్లు పేర్కొనలేదు. కాని ఈ కావ్యమునందలి కథయందును, ఎడనెడ కొన్ని భావములయందును సంస్కృత నాటికా సామ్యము స్పష్టముగా గోచరించుచున్నది.

సమకాలికానువాద విధానములలో మంచన అనువాదము ప్రత్యేక మైనట్టిది. అందలి విశేషములు క్రింద నొసంగబడుచున్నవి.

1. పురాణములును, ఇతిహాసములును అనువదింపబడుచుండిన కాలములో మంచన సంస్కృత నాటికపై దృష్టినిడుట.

2. ధర్మ తత్త్వాదుల నుపదేశించు పురాణ వాఙ్మయ వస్తువును గ్రహించుటకు బదులు శృంగారేతి వృత్తమును స్వీకరించుట. అందు నీతికథలను కూడ చొప్పించి దాని నుపదేశాత్మక మొనరించుట.

3. తాను గ్రహించిన మూలము స్వరూపమును మార్చుట.

4. ఒక నూతనమగు కావ్యప్రక్రియకు దోహదమొనరించి, తదితరులకు మార్గ దర్శకుడగుట.

5. అనువాదమునందు అధిక స్వాతంత్ర్యము ప్రదర్శించుట.

కేయూర బాహు చరితము వాఙ్మయము నందలి మూడు కావ్యప్రక్రియల తనయందిముడ్చుకొన్నది. ఇదియొక స్వతంత్రకథా కావ్యము, నీతి బోధాత్మక మగు కావ్యము, ఒక ప్రబంధము. ఇట్టి వైలక్షణ్యము అంతకు ముందుండిన ఆంధ్ర వాఙ్మయము నందు కనరాదు.

కేయూర బాహు చరితము నాల్గాశ్వాసముల ప్రబంధము. నాటిక యందును నాలుగంకములే కలవు. ఇందలి ప్రథమ చతుర్థాశ్వాసములందు మాత్రమే ప్రధాన కథకు ప్రాముఖ్యము కలదు. తక్కిన రెండాశ్వాసముల

యందును ప్రధాన కథలో ననుసంధింపబడిన అవాంతర కథలు గలవు. ఈ కావ్యమునందు మొత్తము 769 గద్యపద్యములున్నవి. ఇందు అఱువది పద్యములు అవతారిక. 482 గద్యపద్యములు నీతి కథలకు ప్రత్యేకింప బడినవి. ఇక మిగిలిన 227 గద్యపద్యములు మాత్రమే ప్రధానకథకు సంబంధించినవి. కావ్యము నందలి ప్రధాన కథను మాత్రమే గ్రహించిన ఇది రసవత్తరమగు నొక చిన్న కావ్యముగ భాసించును. కావ్యరసమునకు భంగము కలుగనీయక అందు సందర్భానుగుణముగ నీతి కథలను చొప్పించుటలో కవి చూపించిన శిల్పమే ఈ ప్రబంధమునకు చిరకీర్తి నార్జించినది.

మంచనకు మూలనాటికను పదమునకు పదముగ అనుసరించు తలంపు లేదు. ఆత డందలి కథను మాత్రము ఆధారముగ గ్రహించి తద్విస్తరణము నందు మిక్కిలి స్వాతంత్ర్యమును ప్రకటించెను. నాటిక యందుండి గ్రహించిన భావములనుకూడ ఎచటను యథాతథముగ అనుసరింపలేదు. అతడు మూలకథకు ఒకచో నూత్నాంశములను చేర్చును. కొన్నిపట్ల మూలము నన్యథాకరించును. ఇంకొకచో సంగ్రహించును. మఱియొకచో కొన్ని అంశములను తొలగించును.

(i) కథకు చేర్చిన నూత్నాంశములు

1. రాజగు కేయూర బాహుడు రత్నసుందరీ సౌందర్యలోలుడై రాజ్య తంత్రములను విస్మరింపగా, మంత్రి ఆతనిని కర్తవ్యోన్ముఖుని గావించుటకై ఉపాయము నాలోచించుట.

2. మతిమంతుడను చారుడేతెంచి భాగురాయణునకు లాట దేశవిశేషంబు లెఱింగించుచు, మహారాష్ట్రాధిపుడగు పరిఘ బాహువు లాటభూపతిపై దండెత్తనున్నాడని తెలుపుట. ఈ మతిమంతుడు నాటికలో లేడు.

3. సోమదత్తుని పాత్ర మూలమున లేదు. ఇతడు భాగురాయణుని మేనల్లుడు. భాగురాయణుడు సోమదత్తునితో లాట భూపతి చేయు కార్యగుప్తిని తెలుపగా, అందులకు సోమదదత్తుడు మహారాజు సార్వభౌమత్వము నొంద మృగాంకావళిని గొని తెచ్చుటకై భాగురాయణునకు తగిన ఉపాయమును తెలుపుట.

4. మేఖలకును చారాయణునకును కలహమేర్పడుట.

5. కళావతి భాగురాయణునిచే నుపదిష్టయై, చారాయణునితో చెలిమి చేసి, అతనికి మేఖలను పరిభవించు నుపాయమును తెలుపుట.

6. చారాయణుడు మేఖలను పరిభవింప నామెకు అలీక వివాహము జరిపించుట.

7. భాగురాయణుని పనుపున కళావతి రాజు కడకేతెంచి చతురముగ భాషించుచు, ప్రసంగ వశమున రాజునకు భాగురాయణుని వ్యూహమును తెలుపుట.

## (ii) విస్తరణము

మంచన కొన్ని కథాంశములను కావ్యానుకూలముగ విస్తరించెను. ఈ కథాంశములు నాటికయందు సూచ్యప్రాయములుగ నున్నవి.

1. మూలమున లాటభూపతి మృగాంకావళిని పురుష వేషమున పెంచిన విషయమును చారుల వలన భాగురాయణు డెఱింగినట్లు

"నిష్పుత్రేణైక పుత్రః కథిత మపి తథా — మంత్రిణే తస్య చారైః"
(1 — 9)

అని ఒక శ్లోకమున సూచింప బడినది. కావ్యమున మంచన మతిమంతుడను ఒక చారుని కల్పించి, చార విషయమునందు మూలమున లేని పరిఘ బాహుని దండయాత్ర విషయమును కూడ చేర్చి, దానిని మూడు పద్యములయందును, రెండు వచనములలోను, ఒక రసవద్ఘట్టముగా మలచెను.

2. నాటకమునందు మృగాంకావళి రాజునకు కంఠహారము వైచుట కేవలము సూచ్యము. అది రాజు సంభాషణము వలన తెలియ నగును. కావ్యము నందావిషయము వివరింపబడినది. ఇట మృగాంకావళి రాజును చూచి అతని సౌందర్యమును భావించుట కూడ నాల్గు పద్యములలో వర్ణింపబడినది. (చతు. 5 — 10) రాజు మేల్కాంచగా నాయిక 'తాను రత్నసుందరికి వెఱచుచున్న దానవని పల్కుట' కూడ నమూలకము.

3. నాటికయందలి చతుర్థాంకమున, విదూషకుని సంభాషణము ద్వారా మృగాంకావళి పాణిగ్రహణ పూర్వకముగా రాజునకు ఆత్మార్పణముగావించు కొనుటకై త్వరపడుచున్నదని విచక్షణ చెప్పినట్లు సూచింపబడినది. కావ్యమున

కళావతి రాజుకడ కేతెంచి మృగాంకావళిని గూర్చి తెలిపి, ఆమె సౌందర్యమును, రాజుపై ఆమె నిలిపిన అనురాగమును, విరహాదులను గూర్చి వివరముగ నతనికి విన్నవించును.

## (iii) నామాదుల అన్యథాకరణము

మంచన కథాంశమునే కాక, మూలమునందలి కొన్ని పాత్రల నామములను, వారి సంబంధ బాంధవ్యములను, అందలి దేశ రాజధానుల నామములను గూడ మార్చెను. ఈతడు గావించిన ఈ మార్పులు కొన్ని కావ్యమునకు ఔచిత్య సౌందర్యముల నాపాదింపగా, కొన్ని మూలమునకు మెఱుగులు దిద్దుచున్నవి. ముఖ్యముగా ఈ మార్పులను మంచన కావ్యమునకు ఒక నూతనత్వము నాపాదించుటకే కావించినట్లు తోచును.

1. నాటిక యందు రాణి పేరు మదనవతి. కావ్యము నందామె రత్నసుందరి. అందు మృగాంకావళి చెలికత్తె విచక్షణ. ఇందు ఆమె పేరు కళావతి. లాటాధిపుడగు చంద్రవర్మ ఇచట స్వల్పభేదముతో చండవర్మగా మారెను. అతని భార్య సుధామాదేవి, ఇందు హారలతాదేవి. నాటికా నాయకుడగు విద్యాధర మల్లుని బిరుద నామమగు 'కేయూరవర్షుడు' అను దానిని గ్రహించి మంచన దానిని కొంత భేదముతో కావ్య నాయకుని నామముగా (కేయూర బాహుడు) సంతరించెను.[18]

2. నాటిక యందు రాణికి మేనమామ యని పేర్కొనబడిన లాటాధిపుడు కావ్యమునందు రాణికి పినతల్లి భర్త. "కథానాయకునకు పెండ్లిచేయింపబోవు కన్యక రాణికి మేనమామ కుమార్తెగా నుండుట కంటె పినతల్లి బిడ్డయై యుండుటయే ఉచితముగానున్నది." అను శ్రీ గడియారము రామకృష్ణశర్మ గారి అభిప్రాయము సరియైనది.[19]

3. మూలమున కేయూర వర్షుడు త్రిలింగాధిపతి.[20] కావ్యము నందీతడు కళింగదేశమునందలి త్రిపురిని రాజధానిగా నేలుచుండెడివాడు. త్రిలింగమను పదము తెలుగు దేశమునకు పర్యాయముగా వాడబడును. అట్టి త్రిలింగ శబ్దమును, సంస్కృతకవి వాడియుండగా తెలుగు కవి దానిని తొలగించుటకు కారణమేమి యని విమర్శకులు బలువిధముల పరిశీలించిరి. శ్రీ గడియారము వారిట్లనిరి. "మంచన కథానాయకుని మూలము నందున్నట్లు త్రిలింగాధిపతిని

చేయక కళింగాధిపతిగా మార్చు నవసరము కానరాదు. ఆంధ్రదేశ భాగమగు కళింగ ప్రాంతమునందు త్రిపురి అను నగరమున్నదేమో తెలినచో అది మంచన జన్మస్థానము గాని, ఆతని పూర్వుల నివాసముగాని అయి యుండవచ్చునా ? అని అనుమానించుట కవకాశము కలదు."21 ఈ విషయమున సమగ్ర చర్చ జరిపిన శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు "విద్ధసాల భంజికలోని త్రిలింగము, త్రికళింగమనుటకు వ్రాత పొరపాటుగా నుండునని నాకు తోచుచున్నది. కాలచుర్యులు మహీపాలుని కాలమున కళింగముపై దాడివచ్చి జయించిరని రాజశేఖరుని బాలరామాయణమున కలదు. జయించి యుండిన ఎడల త్రిపురిని కళింగ మందు కవి చేర్చుటలో ఆశ్చర్యము లేదు. త్రిపురి, కలచురి, కేయూర వర్ష యువరాజ పదములు ఇవన్నియు నుండుటచేత నీరాజు కాలచుర్యుడే. కవి తన ప్రభువునే భంగ్యంతరమున త్రికళింగాధిపతిగా, సార్వభౌమునిగా వర్ణించి నాడు. ...... మంచన నాటికి అతనికి దొరకిన మూలమిట్లే యుండెనేమో. లేనిచో తెలుగు వాడెట్లు మార్చును ? త్రిలింగమును పాఠము మంచనకు దొరికి యుండిన యెడల కథను ఇంకను చక్కగా మార్చి యుండెడివాడేమో!"22 అని తెలిపిరి. విద్ధసాల భంజికలో రాజు విద్యాధర మల్లుడనియు, రాజధాని ఉజ్జయిని అనియు నుండగా మంచన రాజు కేయూర బాహుడనియు, రాజధాని త్రిపురీ నగరమనియు మార్చి యున్నాడు. ఈ మార్పు మంచన ఎంతో దూరదృష్టితో చేసినది. రాజశేఖరకవి విద్ధసాలభంజికను, కాలచురి వంశజుడును, యువ రాజును త్రిపురీనగరము రాజధానిగా గలవాడు నగు కేయూర వర్షుని కోరిక ననుసరించి రచియించెను. మంచన దీనిని గ్రహించి ఏ రాజు కొఱకు ఈ నాటిక రచింపబడినదో ఆ రాజు నామమును శాశ్వతము చేయదలచి యిట్లొనర్చెను.23

4. నాటికయందు మృగాంకావళి తన రహస్యమును గాపాడుకొనుచు దేవి సంరక్షణము నందుండును. ఇది అసహజముగా నున్నది. కావున మంచన కావ్యమునందు మృగాంకావళి, తన రహస్యము నెఱింగిన భాగురాయణుని కడ నుండినట్లుగా మార్చి ఔచిత్యమును పోషించెను.

5. నాటికయందు విచక్షణ మృగాంకావళిని రాజ శయనాగారమునకు కొని పోయి, అందు మన్మథుడు వసించుచున్నాడని ఆమెకు తెలిపి, ఆతనికి కంఠహారము నర్పింప వలసినదిగా బోధించును. ప్రబంధమున నాయిక అతడు

రాజని కళావతి వలన నెఱింగి ఆతనికి హారమువైచి ఆతని అందమును కనుగొని ముగ్ధురాలగును.

6. మూలమున చారాయణుడు తనకు దేవి గావించిన అవమానమునకు ప్రతీకారముగ మేఖల నవమానించును. కావ్యమున చారాయణుడే ముందు మేఖలను పరిహసించును. ఇది మూలమునకు మెఱుగులు దిద్దుచున్నదని చెప్ప నగును. ఏలన, దేవేరి తన ఔన్నత్యమును వీడి పరిహాసార్థ మొక బ్రాహ్మణుని వంచించుట యుక్తముగా లేదు. కావ్యమునందు వలె, సహజ హాస్యప్రియుడు, వినోదకుశలుడు నగు చారాయణుడు ఆరంభమున మేఖల నవమానించుట ఉచిత ముగనున్నది. ఈతడిట్లొనరించుటకు మేఖలతోడి కలహము మఱింత తోడ్పడినది. ఆమెను పరిహసించు విధానముకూడ మార్పుబడి ఔచిత్యవంతముగ నొప్పుచున్నది.

7. నాటికలో రాణియే రాజును గెలిచేయుటకు తగు నుపాయము నన్వే షించును. కావ్యమునందా ఉపాయము కళావతిచే దేవికి బోధింపబడినది.

8. కావ్యమునందు మృగాంకావళి వ్రాసిన మదన లేఖను జదివిన కళావతి దీనిని రాజునకు విన్నవించును. నాటికలో ఆలేఖను కొన్ని భాగములుగా రాజు ఒక్కొక్క పర్యాయము కాంచును. తుదికది ఆతనికి కానుకగా నీయబడును.

9. మూలమున తమకు పుత్రు డుదయించినట్లు తెలుపుచు రాణికి వ్రాయ బడిన లేఖను లాటాధిపుడే పంపును. కావ్యమునందా సందేశమును ఆతని రాణి యగు హారలతాదేవి పంపును.

సంగ్రహీకరణము

మూలమున రాజు నాయికను కలలో కాంచినది మొదలుగా ఆమె లావణ్యమును పలు మారులు స్మరించుట, పెక్కుభంగుల ఆమె సౌందర్యమును భావించుట, దేవి మహారాజునకు వివాహము గావించు నప్పటి సన్నాహ సంరంభ ములు మున్నగు కొన్నిఘట్టములను మంచన తన కావ్యము నందు సంగ్రహించి యున్నాడు.

తొలగించుట

మంచన నాటికయందలి పెక్కు కథాంశములను తొలగించెను. ఈత డందలి కొన్ని రమణీయములగు అంశములను కూడ తొలగించెనని చెప్పవచ్చును.

1. నాటికా నామమునకు ఉపస్కారకమైన విద్ధసాలభంజికా వృత్తాంతము నితడు తొలగించెను. అందుచేతనే కావ్యనామమును కూడ మార్చెను. ఇక కావ్యమునందు నాయిక దృశ్యాదృశ్యముగ నాయకునకు పలుమార్లు గోచరించుట కూడ మూలమున లేదు.

2. నాటిక యందు ప్రథమాంకారంభము నందొక విష్కంభమును, ద్వితీయ, తృతీయ, చతుర్థాంకములందు ప్రవేశకములును గలవు. మంచన ఈ అర్థోపక్షేపకములను వివరించుట కెట్టి యత్నమును చేయలేదు. ప్రథమాంక విష్కంభము నందు హరదాసునిచే సూచింపబడిన "సుషిర స్తంభ సంచార యుక్తిశయనాగార నిర్మాణము", తృతీయాంక ప్రవేశకమున విచక్షణచే పలుకబడిన భాగురాయణ వ్యూహము మాత్రము కావ్యమునందు పేర్కొనబడినవి. ఈ అర్థోపక్షేపకములందుగల పాత్రలు గూడ విచక్షణా విదూషకులు తప్ప తక్కిన వన్నియు కావ్యమున తొలగింపబడినవి. (విచక్షణ కళావతి అను పేరుతో గలదు)

3. విదూషకునికి అళీక వివాహము జరుగు ఘట్టము మృదు హాస్యమునకు నెలవైనట్టిది. దీనిని మంచన తొలగించెను.

4. మూలము నందు విద్యాధర మల్లుడు పెక్కు స్త్రీలపై నొకే సమయమున అనురాగము కలిగి యుండుట వర్ణింపబడినది. ఈ అంశమును మంచన తొలగించెను. అందు రాజు ప్రథమమున కుంతల రాజపుత్రియగు కువలయమాలను నర్మదా నదీతీరమున గాంచి మోహించును. తదనంతరము ఆమె యందు అనురాగమునిలుపుచునే మృగాంకావళి నభిలషించును. ఇట్లు వీరిరువురిపైనే కాక దేవేరిపై కూడ తనకు ప్రేమయున్నదని వెల్లడించును.

"నో మాలతీదామ విమర్ద యోగ్యం
న ప్రేమ నవ్యం సహతేఽ న్తరాయమ్
మ్లానాపి మోచ్యా నహి కేసరస్రగ్
దేవీ నఖండప్రణయా కథంచిత్ (3—5)

నాయకుడు తన మనమున, నాయికపై అభినవరాగ ముద్భవించి యుండినను దేవిపై కూడ అనురాగము కలదని చెప్పుట కంటె, కావ్యమునందు వలె "దేవి ఆగ్రహమునే అనుగ్రహముగా తలచి నాయికాధ్యాసమున బడుట" ఉచితముగా నున్నది. కువలయ మాలావృత్తాంత మిందు పరిహరింపబడినది.

భావానువాదము:

మంచన మూల భావానువాద విషయమున కొన్నిచోట్ల ఆయా భావములను విస్తరించియు, కొన్నిచోట్ల అన్యథాకరించియు, కొన్నియెడల మూల భావమును ఛాయా మాత్రముగ గొని దానిని విస్తరించియు స్వతంత్రత ప్రకటించెను. ఈ స్వాతంత్ర్యము ఈతని కావ్య నిర్మాణ దక్షత్వమును, తచ్ఛిల్పమును విశదముగ వ్యక్తము చేయుచున్నది.

విస్తరణము

1. మంచన మూలశ్లోకమును అనువదించుపట్ల ఒకచో ఆశ్లోకము నందలి ఒకటి రెండు వాక్యములను మాత్రమే గ్రహించి వానియందలి భావమును విస్తరించును.

లాటేంద్ర శ్చంద్రవర్మా నరపతి తిలకః కల్పితా తేన పుత్రీ
నిష్పుత్రే తైక పుత్రః కథిత మపి తథా మంత్రిణే తస్య దారైః
తస్మాత్ పుత్రావకల్పాచ్ఛలత ఇహ మహారాజ సందర్శనార్థం
తేనాద్యానాయితాసౌ నిరుపధి దధతా సాధు షాడ్గుణ్య చక్షుః (1—9)

సీ. సచివ భూషణ ! లాటజనపతి యొక కూతుఁ
త్రిభువన సౌందర్య విభవ లక్ష్మి
యగు దాని గని తన యన్వయంబునఁ బూర్వు
లేక సంతతు లగు టెఱిఁగి తనకు
బుత్రుడంతకు మున్న పుట్టమి నీ బిడ్డ
నింతిగాఁ గెలని వారెఱిఁగి రేని
నిటమీద గద్దియ కెవ్వరు దిక్కలే
రని చుల్కఁగాఁ జూతురని తలంచి

గీ. తాను దేవియు దాదియు దక్కఁబుట్టి
నంత నుండియు నిక్కార్య మన్యు లెఱుగ
కుండ సుతుడని త్రోయించె యుక్తి పేర్మిఁ
బెనుప బెరిగి యక్కన్య జవ్వనము చెంది. 74. ప్ర

ఈ అనుసరణమున పై శ్లోకమునందలి "లాటేంద్ర శ్చంద్రవర్మా, కల్పితా తేన పుత్రీ నిష్పుత్రే తైక పుత్రః" అను వాక్యము యొక్క భావము

మాత్రమే గ్రహింపబడి ఆఖ్యానపద్ధతిలో విస్తరింపబడినది. ఇచట లాటజనపతి యొక్క కుమార్తె పరిచయము కావింప బడుచున్నది. ఈ పరిచయమునందు ఆమె సౌందర్యము త్రిభువనము లందును సాటి లేదని చెప్పుట, మున్ముందు నాయకున కామెపై కలుగు అనురాగమునకు సూచక మగుచున్నది. ఇట 'గద్దియ కెవ్వరు దిక్కు లేరని' అను జాతీయముపయోగించి చక్కని అర్థస్ఫూర్తిని సాధించినాడు మంచన.

2. మంచన ఎడనెడ మూలభావమును మార్చి దానిని స్వతంత్రముగ పెంచును.

ద్విత్రై ర్వ్యోమ్ని పురాణ మౌక్తిక మణిచ్ఛాయైః స్థితం తారకై
ర్జ్యోత్స్నా పాన భరాలసేన వపుషా సుప్తాశ్చకోరాంగనాః
యాతో ఽస్తాచల మస్తముద్రసమధు చ్ఛత్రచ్ఛవి శ్చంద్రమాః
ప్రాచీ బాల బిడాల లోచన రుచాం జాతాచ పాత్రం కకుప్ (1—11)

సీ. లెక్కింపఁ జులుకనై చుక్క లాకసమునఁ
బ్రాత ముత్తియముల పగిదినుండ
నొదవెడు కెంజాయ నుదయాచలముమీద
మాణిక్య వేదితో మచ్చరింప
నాకాశనది క్రేవ నమ్మృత భానుడు మేని
మించు గోల్పడి ముదియంచఁ బోల
జలిగాలి సోకునఁ దెలిసి కొండొక వడి
కవలెల్ల జక్కవకవల బెరయ (4—26)

పైశ్లోకమునందు మంచన కేవలము మొదటి పాదమును మూడవ పాదమును మాత్రము గ్రహించెను. ఈ గ్రహించిన వాక్యార్థమును కూడ మార్చి ప్రత్యూష వేళను ఒక సీస పద్యమున వర్ణించెను. "ద్విత్రైః తారకైః స్థితాం వ్యోమ్ని" అను భావమును 'లెక్కింప చులుకనై చుక్కలాకసమున' అని మార్చెను. ఇట ద్విత్రైః అను సంకెకు బదులు లెక్కింప జులుకనై అను పదము లుపయోగింపబడినవి. చంద్రుడు కాంతిని గోల్పోయి ఉద్రసమధు చ్ఛత్రచ్ఛవియై అస్తాచలమును జేరెనని మూలమున నుండ మంచన చంద్రుడు మేని మించును గోల్పోయి ఆకాశనదిక్రేవముది యంచనుబోలెనని ఉపమానమును

మార్చి చెప్పెను. ముదియంచ యను నుపమానమున కుచితముగా నుండుటకై ఆకాశమునందు సదీత్వము నారోపించెను.

3. కారుభిః కారితం తేన కృత్రిమం స్వప్న హేతవే
సుషిర స్తంభ సంచారం నృపతే ర్వాసమందిరమ్ (1-13)

దీనిని మంచన

అంతటిలోన నొక్క మత మాత్మదలంచి యపూర్వశిల్పధీ
మంతులఁ జేయబంచె నసమానముగా నొక హర్మ్య రత్న మ
భ్యంతర మందిరంబునకు నావల దవ్వుల భాగురాయణుం
డెంతయుఁ గ్రొత్త లాగుగ మహీతలభ ర్తకుఁ బవ్వళింపగన్ (1-79)

అది సుషిర స్తంభకుడ్య యంత్రంబగు గృహం బవ్విధంబు
రాజు మొదలగు వారెవ్వరెఱుంగ రక్కాలంబున కాయతం
బైన జగతీనాథుం డభినవంబును మనోహరంబును
నగుట నంద నిద్రించుచుండు. (2-80)

అని పెంచి వ్రాసెను. "కృత్రిమం" అనగా సహజమైనదని అర్థము. మంచన దానికి బదులు అసమానముగా, వింతలాగున అను పదములను జేర్చెను. మఱియు దాని నభ్యంతర మందిరమునకు నవ్వల దూరముగా నిర్మింపజేసెనని అమూలకమైన కల్పన జేసెను. "సుషిర స్తంభ సంచారం" అనగా రంధ్ర యుక్తములైన స్తంభముల కారణమున వాయుధ్వన్యాదుల సంచారము కలదని యర్థము. మంచన దానిని సుషిర స్తంభకుడ్య యంత్రమని అనువదించెను. సంచారమను మూలమునందలి పదమును విడిచి యతడు కుడ్య యంత్ర పదములను జేర్చెను. 'స్వప్న హేతవే'అను మాటనతడు పెంచి పైవచనము వ్రాసెను.

4. *a.* నిః సూనునా ప్రాక్ పరికల్పితా భూ న్మయా మృగాంకావలి రేకపుత్రః
పుత్రావకల్ప చ్ఛలతోథ సేయ మానాయితోవః సచివోత్తమేన [4-19]

*b.* జాతః సంప్రతి మే కులైకతిలకః పుత్ర స్తదేషా త్వయా
భవ్యా కాంతిమతీ కలాసు కుశలా కేళిప్రియా నీతిభూః
దైవజ్ఞోదిత చక్రవర్తి గృహిణీభావా మృగాంకావళీ
దేయా కస్యచి దింద సుందర యశః పూతస్య పృథ్వీపతేః [4-20]

19)

సీ. స్వస్తి సమస్త సంపత్సముపేతసు
ధామ మహాదేవి తన తనయకు
స్వస్తి సమస్త ప్రశస్తి సమేత యై
పరగిన రత్నసుందరికిఁ బ్రీతి
జెప్పు నీ కిపు డొక చిట్టి తమ్ముడు గల్గె
మున్ను నీపురమున నున్న యామృ
గాంక వర్మడు చెలియలు గాని నీకుఁద
మ్ముడు గాడు మగపేరు మ్రోయఁజేసి

గీ. పెనిచితిమి మేము సుతుడు లేకునికి తొల్లి
నిప్పు డక్కన్యఁదగుపతి కిమ్ము నీవ
దాని బొందిన భూపతి ధరణి సార్వ
భౌముడగు నిది మునివర భాషితంబు. [4-191]

మంచన పై మూల శ్లోకములు రెండింటికిని ఒక సీస పద్యమును రచించెను. ఇందు పై స్వస్తి వాక్యము అమూలకము. ఇక 'జాతః సంప్రతి మే కులైక తిలకః' అను భావమునకు తెలుగు పలుకుబడి నుపయోగించి 'నీ కిపు డొక చిట్టి తమ్ముడు గల్గె' నని మార్చెను. ప్రథమ శ్లోకము నందుగల 'నిః సూనునా ప్రాక్ పరికల్పితా భూ న్మయా మృగాంకావళి రేకపుత్రః' అను వాక్యమును విస్తరించి "మున్ను నీపురముననున్న ఆ మృగాంకవర్మడు చెలియలుగాని నీకు దమ్ముడు గాడు, మగ పేరు మ్రోయజేసి పెనుచితిమి" అని మార్చెను. 'చక్రవర్తి గృహిణీ భావా మృగాంకావలీ' అను వాక్యమును కూడ మార్చుచు 'దాని బొందిన భూపతి ధరణి సార్వభౌముడగు' నని వ్రాసెను. అతడు పుత్రమిషమున మీ సచివోత్తమునిచే తెప్పింపబడెనను నర్థముగల మొదటి శ్లోకమునందలి రెండవ పాదమును, భవ్యా, కాంతిమతి, కలాకుశల, నీతిజ్ఞ అను మృగాంకావళిని వర్ణించు నట్టియు, ఇందు సుందర యశః పూతుడని వరుడగు రాజును వర్ణించు నట్టియు రెండవ శ్లోకము నందలి రెండు నాల్గు పాదములను మంచన విడిచివైచెను.

మూలమునకు మెఱుగు పెట్టుట :—

మంచన కొన్ని ఎడల మూల భావమునంతటిని గ్రహించి ఆ భావము నుద్దీపింప జేయుచు దానిని అలంకార యుక్తముగను, తెనుగు నుడికారపు సొంపు తోడను తీర్చిదిద్దును.

(1) స్వప్నః కిమేష కిము సంవిదియం తు సాక్షాత్
జ్ఞానం కిమేత దుభయాత్మక మస్యదేవ
యద్దృశ్యతే నఖలు సా తరలాయతాక్షీ
కంఠ ప్రదేశ మధిరోహతి చైష హారః [1-21]

చం. కల యగు నొక్కొ యిండె కలగాదిది నిక్కము యొక్కొ నిక్కముం
గలయును బొత్తునం గలయ గ్రాగిన చంద మొకో నిజంబుగా
గల యగు నేని నున్న దిదె కంఠము హారము నిక్కమైన న
క్కలికి వెడంద వాలు దెలిగన్నుల సుందరి యేది ముందఱన్.

[4-41]

మూలము నందలి 'కిమేత దుభయాత్మక మన్యదేవ' అనుదానిని మంచన 'నిక్కముం గలయును బొత్తునం గలయగ్రాగిన చందమొకో' అని తెనుగు నుడికారముతో తీర్చిదిద్దెను. 'తరలాయతాక్షీ' అను విశేషణమును 'వెడంద వాలు తెలిగన్నుల సుందరి' అని ప్రబంధోచితముగ వ్యాఖ్యానించెను.

(2) సురత భర భిన్న పన్నగ విలాసినీ పాన కేలి జర్ఘరితః
పునరపి విరహ శ్వాసై ర్మలయ మరున్మాంసలో భవతి [1-23]

చం. సరస రతి శ్రమాన్విత భుజంగమ నూతన పాన కేళి జ
ర్ఝరితములైన యమ్మలయ శైల సముద్భవ గంధ వాహముల్
విరహి జనాననాబ్జముల వెల్వడు తోరపుటూర్పు గాడ్పులన్
బొరి బొరి నంత నంత దము బొందగ దట్టము లయ్యె గ్రమ్మఱన్

[4-50]

ఇందులోని భావమంతయు మూలానుగుణముగనే యున్నది. కాని మంచన పదములను విస్తరించి భావమును సుస్పష్టము కావించెను. 'పన్నగ విలాసినీ' అను దాని యందలి విలాసినీ పదమును దొలగించెను.

అన్యథాకరణము :—

మంచన ఒకానొకచో మూల శ్లోకమునందలి పెక్కు పదములను తొలగించి, తదర్థమును అన్యథా వివరించుచుండును.

1. హారోయం కేరల స్త్రీ విహసిత శుచిభిః పంక్తిభి ర్మౌక్తికానాం
సద్యః షాణ్మాసికానాం మమ మదిర దృశా దత్త చంద్రోదయ శ్రీః
సోత్కంఠం కంఠదేశాజ్ఝటితి కుచతటాదోంనమో మన్మథాయే
త్యస్తో యన్మధ్యరత్నం ఘుగయతి కకుభః కౌంకుమీభిః
ప్రభాభిః [1-17]

మ. అసదృశ తార మౌక్తిక సమంచిత నాయకరత్నమై సమం
జస రుచి పుంజమై తన కుచంబులమీద వెలుంగు హారముం
బిసరుహ హస్త పుచ్చుకొని పెట్టె ప్రియంబున జేరి 'తే నమః
ప్రసవశరాసనాయ' యని పల్కుచు భూపతి కంధరంబునన్ [16.చ]

పై శ్లోకమునందలి "పంక్తిభి ర్మౌక్తికానాం, కౌంకు మీభిః ప్రభాభిః, ఘురయతి కకుభః" అను పదముల నన్నింటిని విడిచి కవి అసదృశతార మౌక్తిక సమంచిత నాయకరత్నమై సమంజసరుచి పుంజమై అని మాత్రము వ్రాసి మూల భావమును మార్చెను.

మూలమున నాయిక సోత్కంఠముగా కుచంబులపై వెలుగు హారమును దీసి రాజు కంఠమున వైచెను. అనువాదమున నాయికఉత్కంఠ లోపించినది. మూలమునందలి 'మదిర దృశ' అనువాదమున 'బిసరుహ హస్త' గా మాఱినది వేయుట హస్తములతో కావున కవిహస్తములకు ప్రాధాన్య మొసంగెను.

2. జానే స్వప్నవిధౌ మమాద్య చులుకోత్సేక్యం పురస్తాదభూత్
ప్రత్యూషే పరివేష మండల మివ జ్యోత్స్నా సపత్నం మహః
తస్యాంతర్నఖ నిస్తుషీకృత శరచ్చంద్ర ప్రభై రంగకైః
దృష్టా కా ప్యబలా బలాత్కృతవతీ సామన్మథం మన్మథమ్ [1-15]

చం. ప్రకటిత దేహ దీప్తులు విభాసిత భూషణ దత్త దీధితి
ప్రకరము మీదగ న్నెగసి పార్శ్వములం బ్రసరించి చుట్టుఁ బ
ర్వికొనగ వెల్గుచుండు పరివేషములోపల నొప్పు చంద్రరే
ఖకు సరియైన లాటనృపకన్యక గాంచె విభుండు బ్రాంతితోన్ [4-12]

ఇందు మూలశ్లోక భావమంతయు గాక రెండు వాక్యముల అర్థము మాత్రమే గ్రహింపబడినది. సంస్కృతమున "పరివేష మండల మివ జ్యోత్స్నా

సపత్నం మహః” అని యున్న దానిని వెల్గుచుండు పరివేషములోపల నొప్పు అనియు ‘నఖనిస్తుషీకృత శరచ్చంద్ర ప్రభై రంగకైః’ అను భావమును చంద్ర రేఖకు సరియైన అనియు సంగ్రహించెను. పరివేషమేర్పడుటకు కారణమును మొదటి రెండు పాదములలో సొంతముగా కల్పించి వివరించెను.

మంచన రాజశేఖరుని విద్ధసాల భంజికా నాటిక యందలి భావములతో పాటు, రాజశేఖరునిదని క్షేమేంద్రుడు ఔచిత్య విచార చర్చలో నుదాహరించిన క్రింది శ్లోకమును గూడ ఛాయామాత్రముగ ననువదించెను.

“కర్ణాటీ దశనాంకితః శిత మహారాష్ట్రీ కటాక్షాహతః
ప్రౌఢాంధ్రీ స్తనపీడితః ప్రణయినీ భ్రూభంగ విత్రాసితః
లాటీ బాహువిచేష్టితశ్చ మలయస్త్రీ తర్జనీ తర్జితః
సోయం సంప్రతి రాజశేఖరకవిః వారాణసీం వాంఛతి”

గౌళీ నిర్జర రాజనందనుని, బంగాళీ ముఖాబ్జార్కు, నం
ధ్రీ లీలాంగజు, ఘూర్జరీ రతికళా దీక్షా సముద్భాసితున్,
జోళీ లోల విలోచనోత్పల సుధాంశుం, గుంతలీ భద్రు, నే
పాళీ నూతన కూచిమారు గుకురీ ప్రత్యగ్ర పాంచాలునిన్ [1-77]

పై శ్లోకము రాజశేఖరుని వర్ణించునట్టిది. దానిని మంచన ప్రథమా శ్వాసాంతమున కృతిపతిని వర్ణించు పద్యముగా వ్రాసెను.

రసపోషణము :-

మంచన తన కావ్యమునందు ప్రధాన రసము శృంగారము అని పేర్కొని దానిని మిగుల సామర్థ్యముతో పోషించెను. మూల నాటికలో శృంగారమునకు అద్భుతహాస్యములు అంగరసములు. అందు ప్రథమాంకమునందంతటను, ద్వితీయ, చతుర్థాంకములలోను అద్భుతము పోషింపబడినది. ద్వితీయ తృతీయాంకముల యందు హాస్యము కలదు. మంచన ఈ కథలో హాస్యమును తొలగించెను. చతుర్థా శ్వాసమున రాజు స్వప్నమునకు చివర రాణి మృగాంకవర్మ పురుషుడు కాదని ఎఱుగుటలో అద్భుతము గోచరింపను.

“పూర్వం నారీ భవేద్రక్తా పుమాన్ పశ్చా త్తదింగితైః
తతస్సంభోగలీలేతి స్వభావ సుభగా స్థితిః”

అని రుద్రటుడు శృంగార లక్షణమును వివరించెను. మొదట నాయిక నాయకుని జూచి అనురక్తురాలుగావలెను. పిమ్మట దాని ఇంగితములచే నాయకుఁ డనురక్తుడు గావలెను. పిమ్మట వారి సంభోగలీల. ఇది స్వభావ సుందర మగు విధమని ఆతడు చెప్పెను. అట్లే ఈ కావ్యమునందు నాయిక నాయకుని గాంచిన ప్రథమ వీక్షణముననే ఆతని ఎడ అనురక్తురాలాయెను. ఆమెకు చక్షుః ప్రీతి కల్గినది.

చ. "వినుకలి మున్ను గీల్కొనిన వేడుక చూపుల కర్థి చేయగా
గనుగొని యన్నరేంద్రవరకన్యక నిద్రితుడైన భూపతిం
గనుగవ తెప్ప వెట్టని వికాసము నెక్కుడు వేడ్కతోడనె
మ్మనమున జోద్యముం బొదల మన్మథు డుద్ధతిఁజాప మెక్కిడన్ [4-4]

ఇట్లు మన్మథుడు చాప మెక్కిడగా ఆమె తన వాలుగన్నులతో జనవల్లభు మేని చెల్వమును గ్రోలినది. ఆతని సౌందర్యమును మనమార భావించినది. ఆమెకు పూర్ణలలాట సముల్లాస వదనంబు నాననాంబుజముతో నంటజేయు సంకల్పము కలిగినది.

నాయికా నాయకుల ప్రథమ సమాగమమును కవి చమత్కారముగ నిట్లు వర్ణించును.

క. "నిగుడుచు మగుడుచు నుండెడు
మగువ మెఱుగు జూపు గములు మగుడక పదిలం
బుగ నందు విభుని చూడ్కుల
తగులున నొండొరుల మీద దలముగఁ బర్వెన్. [1-14]

ఇట్లు వారిచూపు లొండొరులపై క్షణకాలము నిల్చినవి. ఆ ప్రథమ వీక్షణము వారిరువురి యందు స్థిరమగు అనురాగమును నెలకొల్పినది. నాటిక యందు ఈ చమత్కారము లోపించినది. ఆ నాయకుడు ఎల్లప్పుడును అభినవ రాగ మభిలషించువాడు. మృగాంకావళిని స్వప్నమునందు కనుగొనక పూర్వము కువలయమాల అను కన్యపై అనురాగమును నిల్పియున్నట్లు విదూషకుని మాటల వలన తెలియనగును. ఆమె కన్న నధిక సౌందర్యవతియగు మృగాంకావళిని చూచి నంతనే అత డా విషయమున కంతగా ప్రాధాన్యము నీయడు. కావున అందు నాయకుడు నాయికపై నిల్పిన ప్రేమ గాఢమని తోపదు. మంచన

కావ్యమునం దీ కువలయమాలా వృత్తమును తొలగించెను. ఇందును నాయకుడు రసికుడే. ఆతని రసికత్వమును మంచన ఇట్లు సమర్థించెను.

క. 'ఏ రసమున నెవ్వఁడు ప్రియు
డారసమున యందు దేల్చి యభినవ రుచి వి
స్తారము పుట్టించిన మును
జేరిన దెస విడిచి మనము సేరు నవలకున్' [2-35]

రాజు మొదట దేవేరి రత్నసుందరీ వ్యామోహమున రాజ కార్యములను పైతము మఱచెను. కాని నవయౌవనవతియు, లావణ్య రాశియునగు నాయికా దర్శనము అతనిలో అభినవరుచి విస్తారమును కల్గించి అంతవఱకు దేవేరిని తలచుచుండిన ఆతని మనమును నాయికపై మఱలించినది.

ఈ శృంగారము అయోగ విప్రలంభములచే వన్నెకెక్కినది. మూలమున నాయికానాయకుల పరిణయమునకు పూర్వము వారి సమాగమమునకు అవకాశము కల్పింపబడినది. మంచన సంభోగ పర్యంతము మరల పునస్సమాగమమును ఘటింపలేదు. ప్రథమ సందర్శనమున ప్రేయసీ ప్రియుల యందు నెలకొనిన రతి పరస్పర దర్శన స్పర్శనాభిలాషచే వియోగమున స్ఫూర్తి చెంది సంభోగమున రాణించినది. ఈ విరహమున కుద్దీపనముగా వసంతుడు చెలరేగెను. నాయకుడు

మ. తన కంఠంబున గాంత మున్నిడిన ముక్తాహారముం బుచ్చిచే
త నమర్చుం, గడు బ్రీతి గన్గొను, గరద్వంద్వంబునం జేర్చు, మో
మున నొత్తుం, బలుమాఱు డెందమున మోపుం, గ్రమ్మఱం గంధరం
బున బూనుం, బరిరంభబుద్ధి మెయిగప్పుం ధైర్యగస్వస్తికన్ [4-55]

ఇట్లు పరిపరి విధముల మదన వికారములకు లోనాయెను. నాయికయు చిత్తజ తాపమున కోర్వలేక తన అనురాగమును దెల్పుకొనుచు నాయకుని కొక లేఖ వ్రాసినది. చెలితో చెప్పుకొనుటకు బిడియపడి ఆమె చూచునట్లుగా తానే మఱి పడవైచినట్లు ఆ లేఖను జాఱవిడిచినది. ఆమె

ఉ. విరహజ వేదనాభరము వెమ్మగ డెందము మీద గన్నునీ
రురువుగ నుండె ముద్దియ మహోగ్ర మనోభవ వహ్నియంగముల్
దరికొని కాల్ప నందు సకలంబును నార్పగ లావు లేమి జీ
వరమణుడద్ది నుండెడు నివాసము సేరియు నార్చుకై వడిన్. [4-51]

ఇట్లు కృశత్వము జెందినదియై కేళీవిలాసముల నుజ్జగించినది. నిశాసమయ మున నలుదిక్కుల పర్విన పండు వెన్నెలల వెలుంగు నోర్వజాలక మూర్ఛ నొందినది.

కం. సుందరికిడ్డ కుచాంతర
చందన మొప్పారె దాప సంతాపితమై
కందర్ప వహ్ని నెరిసిన
డెందంబున నీరు కెవడికిఁ బట్టగుచున్ [4-158]

ఈ విధముగా చెలులామెకు చేయు శైత్యోపచారములు సంతాపము నధి కము చేసి నిరుపయోగము లయ్యెను. ఆమె చంద్రుని, కాముని వేడికొనుటచే ఫలితము లేదని వగచినది. ఇట్లు శృంగారము నాయికా నాయకు లిరువురి యెడను సమానమగుటచే వారి సమాగమమున రమణీయమైనది. వారిరువురును పరిణయానంతరము,

సీ. కర్పూర కస్తూరికా పరిమళకరం
డము లట్టి రత్న హర్మ్యములయందు
గోకిల కీరాది కోలాహలంబున
విలసిల్లు నుద్యాన తలము లందు
మత్త కేకుల కెల్ల నృత్తరంగములైన
రమణీయ కేళి శైలములయందు
బరిమళ కదళికా ప్రాప్త లతాశ్రేణి
నమరు దీర్ఘికల తీరములయందు

గీ. నాడు నాటికి వేడ్కలు నాటుకొనగ
సారెసారెకు నింపు లింపారుచుండ
నంత కంతకు నాదట లగ్గలింప
నంగజ క్రీడ దేలుదు రభిమతముగ [4-201]

ఇట్లు మంచన శృంగారమును బోషించుటలో, తదనుభావ విభావము లను కల్పించుటలో తదనంతర ప్రబంధ కవులతో సరిసమానమగు చాతుర్య మును చూపెను. కావ్యము నందు నీతి కథలకు ప్రాధాన్య మీదలచుటచే దీనిని సంగ్రహ మొనరించెను.

మంచన కావ్యమునందు చేర్చిన ఇతర కథలు :—

కృతిపతి కోరికపై మంచన తన కావ్యమునందు ఇరువది రెండు నీతికథ లను చొప్పించెను. ఈ కథలన్నియును కావ్యమునందు ఉప పాత్రలైన సోమ దత్తుడు, సుమతి, మకరందిక, సుకుమారిక, నారాయణుడు ప్రసక్తానుప్రసక్త ముగ చెప్పినటువంటివి.

| కథ | ఆశ్వాసము | నీతి |
|---|---|---|
| 1. వైశ్య బాలిక కథ | II | మతిగల వారికి అసాధ్యము లేదు. |
| 2. దక్షుని కథ | ,, | సమయస్ఫూర్తి లేనిచో ప్రమాదము వచ్చును. |
| 3. బ్రాహ్మణుని కథ | ,, | విద్యయున్నను మతిలేనిచో ఆపద వచ్చును. |
| 4. వేశ్య కథ | II | నీతి మంతుల స్వార్థము పరార్థముగ నుండును. |
| 5. శశకపింజలముల కథ | ,, | క్షుద్ర కలహము ప్రజకు నష్టము గూర్చును. |
| 6. తొండలపోరు కథ | ,, | అల్పుల కలహ మితరులకు ముప్పు కూర్చును. |
| 7. తేనె చుక్క కథ | ,, | అకారణ కలహము అనర్థము గూర్చును. |
| 8. అహి భేకముల కథ | ,, | బలవంతునితో చెలిమి చేయరాదు. |
| 9. కాక హంసముల కథ | III | దుర్జన మైత్రి ఆపద గూర్చును. |
| 10. గరుడ కచ్ఛపముల కథ | ,, | ఐకమత్యమున ఆపదలు తొలగును. |
| 11. నీటి కాకుల కథ | ,, | దుర్జనులు మేలు మఱచెదరు. |
| 12. పులికి మేలు చేసిన పిట్ట కథ | ,, | తులువలకు మేలు చేయరాదు. |
| 13. పేరాసగల నక్క కథ | ,, | అతిలోభము మృత్యుకారణమగును. |
| 14. నారికేళ బకముల కథ | ,, | అతివ్యయము ఆపదలకు మూలము. |
| 15. ధనగుప్తుని కథ | ,, | లోభము నష్టము కలిగించును. |
| 16. వింత పతివ్రత కథ | ,, | అతినిష్ఠ ధూర్తలక్షణము. |
| 17. గిజిగాని కథ | ,, | అవివేకులకు హితము చెప్పరాదు. |

| కథ | ఆశ్వాసము | నీతి |
|---|---|---|
| 18. కోతి కథ | III | మతిహీనుని నమ్ముట మంచిదికాదు. |
| 19. దొంగ కథ | ,, | మతిమంతుని పగయు మేలుసేయును. |
| 20. చిలుక కథ | IV | ఉపాయముచే అపాయము తీరును. |
| 21. యక్షుని కథ | ,, | మొగమోటము ముప్పు కలిగించును. |
| 22. అహిమూషికముల కథ | ,, | శత్రుని మోసగించుట తప్పుకాదు. |

పైకథలలో కొన్నింటిని మంచన స్వయముగ కల్పించెను. మఱి కొన్నిం టిని పంచతంత్ర హితోపదేశములనుండి గ్రహించెను. ఇందు శశకపింజముల కథ [పంచ. కథా2. కాకోలూకీయమ్] ధనగుప్తుని కథ [కథా 21. పంచ. మిత్రభేదః] కోతికథ, దొంగ కథ [కథా 22. పంచ మిత్రభేదః] పంచతంత్ర కథా ప్రణాళిక ననుసరించుచున్నవి. ఇక గిజిగాని కథ [కథా 22. పం. మిత్ర భేదః కథా 1. హితో.విగ్ర] పేరాసగల నక్క కథ [కథా 3. మిత్రసంప్రాప్తి. పం. కథా 4 మిత్రలాభః హితోప] హితోపదేశమునందలి కథాప్రణాళిక ననుస రించుచున్నవి. ఈ కథలు పంచ తంత్రమునందు గూడ కలవు.

పంచతంత్రమునందలి శశకపింజలముల కథను మంచన సంగ్రహము గను, సరళముగను, స్వతంత్రముగను అనుసరించెను. ఈ అనువాదమును బరిశీ లించిన ఈతని స్వాతంత్ర్యము తెలియనగును.

> "కిం త్వహం వృద్ధో దూరా ద్వయయో ర్భాషాంతరం సమ్య
> జ్ఞ్న శృణోమి. ఏవం జ్ఞాత్వా మమ సమీపవర్తినౌ భూత్వా
> మమాగ్రే న్యాయం వదతమ్."

గీ. ముదిసినారము కానము మున్నుపోలె
శ్రవణములు దూరమును విను శక్తిలేదు.
కదియఁబనుదెంచి చెప్పుఁడు కార్యమనుడు
నవియుఁదేకువ మాలి డాయంగ నడవ [2-93]

పై అనువాదము విస్తరింపబడినది. మున్నుపోలె కానకుండుట, 'అనియు దేకువ మాలి డాయంగ నడవ' మూలాతిశాయి భాగములు. ఇట్లే మూలమున ఏడు వాక్యములలో ఉన్న కోతి కథకు పెక్కు మార్పులు చేసి మంచన కథనాత్మకముగ 14 గద్యపద్యములలో విస్తరించెను.

మంచన ఏ కథను హితోపదేశ పంచతంత్రములనుండి యథా తథముగ గ్రహించియుండలేదు.

కర్తవ్యస్సంచయో నిత్యం కర్తవ్యో నాతిసంచయః
పశ్య సంచయ శీలోఽసౌ ధనుషా జంబుకో హతః
[శ్లో 175 మిత్రలాభః]

క. తగు కొలదిగాని లోభము
మిగులఁగఁజేయంగ రాదు మిక్కిలి యగులో
భ గుణంబు కతనఁగాదే
మృగ ధూర్తుఁడొకండు తొల్లి మృత్యువుచెందెన్ [3-139]

మూలమున అతిసంచయము కర్తవ్యము కాదని చెప్పఁబడగా మంచన దానినిభంగ్యంతరముగా అతిలోభము కూడదని చెప్పెను. ఇచట మూలమునందలి 'ధనుషా' శబ్దము పరిహరింపబడినది. మూలమునం దీ మృగధూర్తుని కథ ఎనిమిది గద్యపద్యములలో నున్నది. మంచన దానిని ఆఱుపద్యములలో రచించెను.

మంచన హితోపదేశము నందలి సూచీముఖము కథ ననుసరించుటలో కూడ పెక్కు మార్పులను గావించెను. ఈ కథ మూలమున ఏడు గద్యపద్యములలో నుండగా, మంచన దానిని విస్తరించి ఇరువది గద్యపద్యములలో రమణీయముగ వర్ణించి భావానువాదమున యథాక్రమముగా స్వాతంత్ర్యము ప్రకటించెను.

విద్వానే వోపదేష్టవ్యో నా విద్వాంస్తు కదాచన
వానరా నుపదిశ్యాథః స్థానభ్రష్టా యయుః ఖగాః [6.విగ్ర.]

కం. అపగత వివేకులకు హిత
ముపదేశించుటయు వారి నొందుటయును నీ
తిపరుల కొప్పదు విహగము
కపి సహవాసమునఁబడిన కాఱియ వచ్చున్ [3-264]

ఇందు మూల భావము ప్రకారాంతరముగ చెప్పబడినది. ఖగము వానరుల కుపదేశించి స్థాన భ్రష్టత్వము నొందినదని యూలమునందు చెప్పబడగా, దానిని మంచన విహగము కపి సహవాసమున బడిన కాఱియ వచ్చునని ఆ భావమును మఱియొక విధమున మార్చి చెప్పెను. అదే కథలో ఆరంభమున గల

"అథ నీల పటలై రావృతే నభఃస్థలే ధారాసారై ర్మహతీ వృష్టి
ర్బభూవ"

అను వాక్యమును ఈ క్రింది విధముగ అనుసరించెను.

కం. మిన్నెల్ల నీల మేఘ
చ్ఛన్నంబై యుక్క వాన సాంద్ర జలంబై
మున్ను గురిసి తుది నీదయు
సన్నపుఁ జినుకులును విపినచర బాధలుగాన్ [3-267]

మూలమున 'మహతీ వృష్టిః బభూవ' అని మాత్రమే యున్న దానిని మంచన విస్తరించి 'వాన తుది నీదయును సన్నపుఁజినుకులును' గలిగినవని సహజముగ వర్ణించెను.

మంచన గ్రహించిన హితోపదేశ పంచతంత్ర కథలు గాక తక్కిన కథలు మంచన కాలము నాటికి ప్రచారములో నుండినవి గావచ్చును. ఈ నీతికథ లన్నియును విషయ వైవిధ్యముతో గూడి లోకజ్ఞతకు పట్టుగొమ్మలై యున్నవి. శ్రీ గడియారమువా రభిప్రాయపడినట్లు ఇతివృత్తముతో బొత్తుగా సంబంధము లేని పిట్ట కథలను చేర్చుట వలన ప్రధాన కథా వేగము దెబ్బతినిన" దనుట సరికాదు. ఈ నీతి కథలను సందర్భోచితముగ గుదిగ్రుచ్చుటయే మంచన ప్రత్యే కత. ఈ కథలు కావ్యమునందలి పాత్రల ప్రవర్తనమునకు అనుకూలములై ఆయాపాత్రలు ఆచరింప దగిన కర్తవ్యమును బోధించుచున్నవి. కావున కేవలము అనవసరములు కావు.

మంచన కావ్యమునందలి ఈ కథలు అచిరకాలములోనే వ్యాప్తి నొంది నవి. క్రీ. శ. 1420 ప్రాంతము వాడైన మడికిసింగన సకల నీతిసమ్మతమున కేయూరబాహు చరితము నందలి నాల్గు పద్యములను ఉదాహరించియున్నాడు:[24]

| | సకల నీతి సమ్మతము | | కేయూరబాహు చరితము | |
|---|---|---|---|---|
| 1. | 504 | ,, | 2-86 | నైజగుణంబులు దనమది |
| 2. | 130 | ,, | 3-168 | వ్యవసాయము కొలదియు |
| 3. | 786 | ,, | 3-232 | పొడమదు చేయని కార్యః |
| 4. | 149 | ,, | 4-204 | స్వామియు మంత్రియు |

మంచన తా నే కథను చెప్పదలచు కొన్నను ఆరంభమననే అందలి నీతిని కథా ప్రధానాంశమును స్పష్టము చేయును. ఇట్టి స్పష్టత్వము ఆతడొనరించు నుపదేశమునకు స్ఫూర్తి నొసంగుచున్నది.

విద్యాన్వితుడయ్యును మతిలేని వాడైన గార్గ్యుని కథ మొదట,

కం. మతిలేని వాడు విద్యా
న్వితు డయ్యును మేలు వడయనేరడు విద్యా
న్వితుడయ్యు తొల్లి గార్గ్యుడు
హతుడయ్యెంగాదె విమతియై యొక పులిచేన్ [2-26]

నీటి కాకుల కథ మొదట

కం. క్రూరులగు జనులు ప్రత్యప
కారంబులు నేయజాలకయ సుజనులపై
నారోపింతురు తప్పులు
కారండ చయమ్మువలన గాకులువోలెన్ [3-79]

అనియును కథార్థమును సరళముగ బోధించుటకు ప్రాతిపదికను వేసెను. ఈ సరళత్వము నీతిని హృదయాంతర్గత మొనరించుచున్నది. మంచన కేయూర బాహు చరితము, నీతి శాస్త్రములు, శతకములు వెలువడుచుండిన దినములలో రచింపబడినది. "మంచన నీతులను క్రోడీకరిస్తే మకుటం ఉండదుగాని ఒక శతకంలో భాగాలు లాగ కనబడతాయి."[26]

మంచన శైలి, భాషాదులు :—

మంచన శైలిలో క్లిష్టాన్వయముకాని, ప్రౌఢ సమాస సంఘటనము కాని కానరాదు. అది ధారాశుద్ధికి నెలవు. ఈతని కావ్యము నిజముగ బాల రసాల పుష్పనవపల్లవ కోమలము.

మంచన ఉభయ కావ్యసరణిజ్ఞుడు. ఈతడొనరించు సంస్కృత పద ప్రయోగము మాధుర్యమును చిందించును. అవతారిక యందే ఈ మాధుర్యము ఆవిష్కరింపబడినది.

శా. ప్రాగ్దేశాపర దక్షిణోత్తర దిశాభాగ ప్రసిద్ధక్ష మా
భుగ్దర్పాంతకు డెలె గొంక విభుడీ భూచక్ర మక్రూరతన్
వాగ్దేవీ స్తన హార నిర్మల యశో వాల్లభ్య సంసిద్ధితో
దిగ్దంతి శ్రవణానిలజ్వల దట త్తీవ్ర ప్రతాపాఢ్యుడై. [1-20]

ఇచట ప్రాస ద్విత్వాక్షర యుక్తమయ్యును పద్యగమనము నాటింకపఱుప కుండుటయే కాక అర్థవ్యక్తికి కూడ పుష్టి చేకూర్చుచున్నది.

శా. లీలా నిర్జిత సర్వజంతువన వోలిన్ బేరుకొన్నట్టి శా
ర్దూలం బొక్క జరన్మృగంబు నొకచో దుర్దాంతమై ప్రేసి త
త్కీలాలం బది మున్ను గ్రోలి యుదరోద్దీవ్యద్బుభుక్షానల
జ్వాలల్ తన్నలపంగ దల్చె శితమాంసం బొంది భక్షింపగన్ [3-114]

ఈ పద్యపు ఎత్తుగడ రమణీయముగ నున్నది. ప్రారంభమునందలి శార్దూల ప్రాభవము తరువాత దాని దైన్యస్థితికి దోహదము గావించుచున్నది. మంచన ఆశ్వాసాంతములందుగూడ నిట్టి ప్రౌఢతను బ్రకటించెను. ఇట్లు సంస్కృత భాషా పాటవమును చూపగల వాడయ్యును మంచనకు తెలుగు పదములపైనే మక్కువ ఎక్కువ. ఈతడు కావ్యమునందు పలుతావుల తేట తెనుగు పదములతో కూర్చిన పద్యములు, ప్రసాద గుణ బంధురములును శ్రవణసుభగములునయి యింపు నింపుచున్నవి.

సీ. మిన్నక యొకనిపైఁ గన్నులు వొలయించి
యరగంట నొకని నెయ్యమునఁ జూచి
చెన్నార నొకనిపైఁ జిఱునవ్వు చిలికించి
యలరుచు నొకనిపైఁబలుకు వైచి
యొకని నీ విట రాక యోర్వ రమ్మని పుచ్చి
యొకనిఁ గూటంబున నోరఁజేర్చి
యొకనికిఁ గూరిమి ప్రకటించి నమ్మించి
పాటించి యొకనికి బాసచేసి

గీ. తన్నుఁదారందఱును జాలఁదగిలి యిచ్చుఁ
దమక తక్కినయది యని తలచుకొనగ
నెవ్వరికిఁ దాను గూర్పక యెల్లభంగి
ధనమునక కూర్చునది వారవనిత యనగ [2-58]

ఇచట వారవనిత చతురత్వము తెలుగు పదములతో వర్ణింపబడినది. అట్లే ఈ క్రింది చంద్రోదయ వర్ణనమున మంచన శయ్యా సౌభాగ్యము వ్యక్తమగుచున్నది.

ఉ. చుక్కల రాణి వాసములు చుట్టును గొల్వఁ గెలంకు లెల్లఁబే
రెక్కిన జోదు పూవిలుతు నిష్టుడు వెన్నెల పుల్గు లాశ్రితుల్
జక్కవదోయి తామరలు శత్రులుగా విహరించు రాజు మి
న్నెక్కె మనోజ తాప భరమెక్కె వియోగుల కెల్ల నత్తఱిన్. [4-155]

ఇచట భావము రమణీయము. దానికి తెలుగుతనము అలంకారము. చంద్రునికి చుక్కలేరాణివాసమై అతనిచుట్టుచేరి కొలుచుచున్నవి. ఇక త్రిజగముల ప్రసిద్ధి పొందిన జోదు మన్మథునికతడు సఖుడు. చకోరము లాతనికి ఆశ్రితులు. ఇట్టి విభవము అతనిది. సుకుమారములును స్నిగ్ధములును అయిన జక్కవ దోయియు, తామరలును ఆతనికి శత్రువులనుటలోనే ఆతని స్వభావము చమత్కారముగ చెప్పబడినది. ఇట్టి చంద్రుడు మిన్నెక్కగనే వియోగుల తాప భారము గూడ నధిక మగుట సరసమై ఒప్పుచున్నది.

మంచన శైలి కథనాత్మకము. ఆతడు ప్రధానకథను, ఉపకథలను, అతి సరళముగను, పరస్పరసంబద్ధములుగను రచింపజాలెను. అతడు ప్రతి సూక్ష్మాంశమును గూడ వివరించి దాని కొక చక్కని ఆకృతిని గల్పించెను.

మ. బలవద్దైన్యము వక్త్రి గహ్వరముగా బలోచ్చట్ల గొన్నట్టియ
ప్పులు మై చారలు గాగ బాలరుదితంబు ల్రొమ్మగుటల్గాగ దు
ర్నిలయారణ్యములో భయప్రకరమూర్తి క్రూరమై యుండగాఁ
దలమే వెల్వడఁజేయ లావు కలిమిన్ దారిద్ర్య శార్దూలమున్. [3-306]

ఇచట దారిద్ర్యము యొక్క భయంకర స్వరూపము శార్దూల సామ్యముచే నిరూపితమైనది.

మంచన సందర్భశుద్ధి కేయూరబాహు చరిత కావ్యమునకు వన్నె కలుగజేయుచున్నది. ఈతని కాల్పనిక శక్తి, భావుకత్వము ఇత్యాదు లపారములని ఇందీతడు కల్పించిన వివిధ కథలవలనను, మూలమునకు బహుముఖములుగ నొనరించిన మార్పులవలనను తేటపడుచున్నది. కాని ఈతడీ శక్తిని దుర్వినియోగ మొనరింపలేదు. ప్రధానకథను అనవసరములగు దీర్ఘ వర్ణనములతోఁ బెంచలేదు. ఇతనికి వచన రచనపై మక్కువలేదు. కేయూర బాహు చరిత్రమునందు కేవలము చతుర్థాశ్వాసమున మాత్రమే గద్యభాగములు కొంత ప్రాధాన్యము వహించినవి. ఈ భాగములైనను సంగ్రహములును, విషయానుగుణములునై

యున్నవి. వసంత వర్ణన సందర్భమునందలి గద్య మొకటి మాత్రము వర్ణనాత్మకమై యున్నది.[26] [4-51]

మంచనకు వివిధ చ్ఛందముల నుపయోగించుటలో ప్రత్యేకమగు శ్రద్ధ లేదు. అతడు కందములను రసస్యందములుగ రచించును. ఈతని నీతులు పెక్కు కందములందే కలవు. సీసములను ప్రత్యేకములగు కొన్ని సందర్భములందు మాత్రమేవాడును. ఆశ్వాసాంతములలో మాలినీవృత్తమును ఉపయోగించెను. ఇతనికి శబ్దాడంబరముపై ప్రీతిలేదు. కాని ధారాప్రవాహమున కొన్ని లయాన్వితతరంగము లుప్పతిలుచుండును.

మ. లలనారోహణ వాద్యమాన బహుడోలా ఘంటికానాదముం,
గలధౌతోజ్జ్వల పంజరా కలిత శౌక శ్లోకికారావ సం
కులముం, జంచదమంద షట్పద పదీ కోలాహలంబుల్ కడున్
దలమై మర్దళ దుందుభి ప్రభృతి వాద్యస్ఫూర్తి తోచుం బురిన్. [1-59]

మంచన రచన సలక్షణమైనది. మంచన "పీనుగు అనుటకు బదులుగా వినుగు అను పదమును,

అని పక్షిహితము సెప్పిన
విని వెంగలియైన క్రోతి పీ డిరవున నా
లును దాకు నుండి నన్నొక
వినుగుంగాఁ దలచి కాదె ప్రేలదొడంగెన్. [3-277]

అను సందర్భమున నుపయోగించెనని శ్రీ బులుసు వెంకటరమణయ్యగారు నుడివిరి. పండితారాధ్యుని శివతత్త్వసారమున ఇట్టి ప్రయోగము కలదు.[28] వినుగు పదమునకు లుబ్ధుడు, లుబ్ధకుడు అను నర్థములు కూడ గలవు.

కేయూర బాహు చరితము ప్రాచీనములగు తెలుగు నానుడులకు, జాతీయములకు పెన్నిధి.

1. నిన్నరాతిరి పెండిలి నేడినేమి వచ్చె దీనికి (2-121)
2. జగంబున నోదల బండ్లు బండ్ల నోదలుఁ జనుదెంచునంట (2-103)
3. నోరం గొలందులు (4-51)
4. నాపాలిటి దయ్యము (4-91)
5. ముసలికి సంతసములు కొఱతయే (4-178)

6. కడుపు చల్లగ (1-36)
7. గద్దియ కెవ్వరు దిక్కులేదని (1-1.74)
8. ఒక నాటన్ ప్రాణంబు సనునె నననినమాత్రన్ (3-143)
9. మందునకైన మత్స్యంబు లేకుండ (3-161)
10. ముక్కున నీరెత్తుట (3-201)
11. ఈ జరభి మూడు జగంబులు మ్రింగుచుండె (3-228)
12. మెచ్చునకు ధైర్యంబు తెచ్చుకొని (4-196)
13. తలనెక్కించు కొన (4-95)

సోడుముట్ట (1-.0) — తియ్యమెక్క (3-343) బేలం పెట్టుదు (4-133) ముండ పులుగులకట మోసపుచ్చె (3-74)

మంచన నన్నెచోడుడు మాత్రమే వాడిన 'తాడిడి ఫలంబు గొనుట' అను ప్రయోగమును 'తాడిడిపండు దిన్నక్రియ' [4-145] యనియు, నోర గొలదుల్ అను ప్రయోగమును నోరంగొలందులు కూయ [4-501] అనియు ప్రయోగించెనని శ్రీ తిమ్మావఝ్ఝల కోదండ రామయ్యగారి అభిప్రాయము.[27]

వీరు మంచన నన్నెచోడుని పద్యరచనా విధానమును గూడ అనుసరించె నని చెప్పుచు వీరిరువురి పద్యములయందుగు గల భావ సామ్యమును జూపిరి.

నన్నెచోడుడు కుమారసంభవమున ఉమా మహేశ్వరుల ప్రణయ విహార మును వర్ణించుచు వ్రాసిన,

సీ. 'కలహంస కలరవాకలిత నిర్ఝరముల
సారసారావాబ్జషండములను,
రోలంబ రుతిలతాందోలంబులను శుక
మంజుల స్వన పుష్పమండపముల,
కలకంఠరణిత మాకంద వనములం బా
రావత ధ్వని మందిర స్థలముల,
గేకికలధ్వానగిరి కందరంబుల,
లావుక నినద లీలా తలముల,

నప్పటప్పటి కనురాగ మగ్గలింపఁ,
గామరస మంతకంతకు గడలుఁ కొనగ,
నలి రమించిరి కైలాస నగము మీదఁ
బరమ సుఖలీల నాజగత్పతియు సతియు. [1—78]

అను పద్యమును మంచన అనుకరించుననుటకు ఈ క్రింది నాయికా నాయక ప్రణయ లీలా వర్ణనము నిదర్శనము.

సీ. కర్పూర కస్తూరికా పరిమళకరం
డము లట్టి రత్న హర్మ్యములయందు
గోకిల కీరాది కోలాహలంబుల
విలసిల్లు నుద్యాన తలములందు
మత్తకేకుల కెల్ల నృత్తరంగములైన
రమణీయ కేళి శైలములయందుఁ
బరిమళ కదళికా ప్రాప్తలతా శ్రేణి
నమరు దీర్ఘికల తీరములయందు
గీ. నాడు నాటికి వేడ్కలు నాటుకొనగ
సారెసారెకు నింపు లింపారుచుండ
నంతకంతకు నాదట లగ్గలింప
నంగజక్రీడఁదేలుదు రభిమతముగ (4—201)

అట్లే కుమారసంభవమునందు గల "దుగ్ధాంబునిధి నిట్టదోచెనో యని శేషుబాన్పుగా హరి నీటఁ బవ్వళింప" అను పద్యమునందలి జ్యోత్స్నా వర్ణనమును మంచన "అంజనగిరి తన యద్రిబోలుదు నీల కంఠుండు తోరణకట్టఁ బనుప" అను చంద్రికావర్ణనమునం దనుకరించెను.

ఇక మంచన ప్రబంధశైలి ప్రబంధ కవితా పితామహుడగు అల్లసాని పెద్దన కవితకే ఒఱవడి దిద్దినది.

ఉ. ఎవ్వరి దాన వీవు హరిణేక్షణ యెయ్యది నీకుఁబేరు ని
న్నెవ్వతె దెచ్చె? చెప్పు మిది యేర్పడ బంటుగ నన్ను నేలుమం
చవ్వసుధేశ్వరుం డతివ హస్తము పట్టినఁబట్టి ధైర్యమున్
ద్రవ్వెడు కన్నులం గొని యదల్చి వదల్చెఁ గరంబు చయ్యనన్ (4—21)

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ ? యొంటి చరించె దోటలే
కివ్వనభూమి ? భూసురుడ నేఁ బ్రవరాఖ్యుడఁ ద్రోవ తప్పితిన్ (2–39)

అను ప్రవరుని ప్రశ్నయు, ఇంకొక చోటగల

ఎక్కడివాడొ యక్షతనయేందు జయంత వసంతకంతులన్
జక్కదనంబునం గెలువఁజాలెడి వాడు మహీసురాన్వయం
బెక్కడ, ఈతనూవిభవ మెక్కడ, యేలని బంటుగా మరుం
డక్కఁ గొనంగ రాదె యకటా నను వీడు పరిగ్రహించినన్' (2–35)

అను వరూధిని స్వగతమును అందుకు దృష్టాంతములు. మంచనను జక్కన, పిల్లలమఱ్ఱి పినవీరన, రామరాజభూషణుడు మున్నగు తరువాతి కవు లనుకరించిన విధానమును శ్రీరామకృష్ణ శర్మగారు వివరించిరి.[29]

ఉపయుక్త గ్రంథ నిర్దేశము :

1. యాయావరేణదౌహికినా కవి రాజశేఖరేణ (వి.సా.భం.)

2. చాఉహాణ కుల మౌలి ఆలి ఆ
రా అనేహర క ఇంద గోహిణీ
భత్తుణో కిది మఐంతి సుందరి
సా పఉంజ ఇదుమేద మిచ్ఛది (క.మం. జవనికాంతరం)

3. He was of a Maharastra Kshatriya family of yayavaras - (Keith Sanskrit Drama, Page 231.)

4 మల్లాది సంస్కృతి వాఙ్మయ చరిత్ర — పుట 412

5. బభూవ వాల్మీకి భవః కవిః పురా తతః ప్రపేదే భువి భర్తృమేంఠతామ్
స్థితః పునర్యో భవభూతి రేఖయా స వర్తతే సంప్రతి రాజశేఖరః
(బా.రా. 1–6)

6. రఘుకుల తిలకో మహేంద్రపాలః సకల కలా నిలయః స యస్య
శిష్యః (వి.సా.భం.)

7. తన్మన్యే తదభిసయే శ్రీ యువరాజ దేవస్య పరిషదాజ్ఞా
[వి.సా.భం. 1 అం]

8. వేదము వేంకటరాయ శాస్త్రి, ఆం. సా. ద : పుట 174

9. ఆంధ్రప్రతాప రుద్రయశోభూషణము, నాటక ప్రకరణము పుట 25

10,11. ఆరుద్ర : సమగ్రాంధ్ర సాహిత్యం, సంపుటి 2, పుట 190

12. ఈ పద్యము సాహిత్య అకాడమి వారి ముద్రణమున 2 వ పుట అడుగున ఈయబడినది. ఇట్లు ముద్రించుట సరిగాదనియు ఈ పద్యము తాంజావూరి వారి తాళపత్ర ప్రతి అవతారికలో నీయబడిన దనియు, శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు తెలిపిరి.

భారతి, ఆగష్టు 1967, పుట 54

13. 'నీ వాంధ్ర భాష శిల్పము మెఱయన్' అని పాఠాంతరము కలదు.

14. నిడుదవోలు, భారతి, ఆగష్టు, 1967. పుట 58.

15. నన్నెచోడుడు తిక్కనకుఁ బూర్వుడైనను, పూర్వకవులెవ్వరును ఆతనినిగాని పాల్కురికి సోమనాథుని గాని స్తుతించి యుండలేదు. అందుకు వారవలంబించిన మతమును భాషా స్వాతంత్ర్యమును కారణములై యుండును. అందుచేతనే మంచన ఆతని రచన చూచి యుండినను ఆతనిని పూర్వకవి స్తుతిలో పేర్కొని యుండకపోవచ్చును.

16. పల్లా దుర్గయ్య, ప్రబంధ వాఙ్మయ వికాసము, పుట 66. ఆంధ్ర రచయితల సహకార సంఘము, ఏప్రిల్ 1973.

17. నిడుదవోలు, కేయూరబాహు చరిత్రము. భారతి. ఏప్రిల్ 1973.

18. 'స్వస్తి శ్రీమత్త్రిపుర్యాం తుహినకర సుతా వీచి వాచాలితాయాం దేవం కేయూర వర్షం వినయనత శిరాః సర్వ సేనాధినాథః (4–22) పుట 19.

19. పీఠిక, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి, 1963.

20. 'జయతు జయతు త్రిలింగాధిపో దేవః' 4- పుట 113.

21. గడియారము రామకృష్ణ శర్మ, కేయూరబాహు చరిత్ర, పీఠిక, పుట 14. (ఎ.పి. సాహిత్య అకాడమి)

22. వేదము వేంకట రాయశాస్త్రి, కేయూరబాహు చరిత్ర. ఉపోద్ఘాతము, పుట 31.

23. నిడుదవోలు వేంకట రావు, భారతి. (ఆగష్టు) 1967, పుట 57–58.

24. నిడుదవోలు వేంకట రావు, సకలనీతి సమ్మతము, పీఠిక, పుట 11.

25. ఆరుద్ర స.ఆం.సా. సంపుటము 2, పుట 198.

26. చ.ఆ.ప 51.

27. భారతి, ఏప్రిల్ 1961 – కే.బా.చ. వ్యాసము

28. మల్లికార్జున పండితారాధ్యుడు, శివతత్త్వ సారము

29. శ్రీ గడియారము రామకృష్ణ శర్మ. కే.బా.చ. పీఠిక, పుటలు 30–32.

# 2. క్రీడాభిరామము

## (సంస్కృత మూలము - ప్రేమాభిరామము)

శృంగార శ్రీనాథము— వేటూరి ప్రభాకరశాస్త్రి
ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్ (లిమిటెడ్) 1923.

సాహిత్య వివేచన - (1974) Dr. M· Subba Reddy,
University Book Centre, Prakasam Road,
TIRUPATI.

శ్రీనాథకవి— చిలుకూరి వీరభద్రరావు - ఆర్యపుస్తకాలయము (1930)
రాజమహేంద్రవరము.

శ్రీనాథుడు— డా. కొర్లపాటి శ్రీరామమూర్తి (1971)
కళాభారతి, గుంటూరు.

శ్రీనాథుని తోడ్పాటుతో వినుకొండ వల్లభరాయడు రచించిన క్రీడాభిరామమను కావ్యమునకు మూలము సంస్కృతమున రావిపాటి త్రిపురాంతకుడు రచించిన ప్రేమాభిరామమను వీథీ రూపకము. ఆ రూపక మిపుడు లభ్యమానము కాదు. ప్రేమాభిరామము ననుసరించుచున్న క్రీడాభిరామమును బట్టియు, త్రిపురాంతకుడు రచించిన ఇతర గ్రంథములను బట్టియు ఆతని కాలాదుల నెఱుంగ వచ్చును.

### త్రిపురాంతకుడు - కాలాదులు :

రావిపాటి త్రిపురాంతకుడు దృశ్య కావ్యరచనకు కడంగిన తెలుగు కవులలో ప్రథముడు. ఈతడు ప్రేమాభిరామమను వీథీ రూపకమునే కాక ఆంధ్రమున మదన విజయము, అంబికా శతకము, త్రిపురాంతకోదాహరణము, తారావళి యను గ్రంథములనుకూడ రచించెను. వీనిలో ఒక్క త్రిపురాంతకోదాహరణము మాత్రము ప్రచురితమై లభించుచున్నది. తక్కిన గ్రంథములలోని కొన్ని భాగములు మాత్రమే ఉపలభ్యములగుచున్నవి. త్రిపురాంతకుడు ఆంధ్ర కవీశ్వరు

ఇలో నిరుపమానుడని ప్రభాకరశాస్త్రి గారి యభిప్రాయము.[1] ఈతని నామమును బట్టియు, త్రిపురాంతక మహాదేవుని గూర్చి చెప్పిన ఉదాహరణమును బట్టియు ఇతడు శ్రీశైలము యొక్క తూర్పు ద్వారమునందుగల త్రిపురాంతకపుర నివాసి యని చెప్పవచ్చును.

త్రిపురాంతకుడు వ్రాసిన మదన విజయము రతిశాస్త్రమని దాని పేరు వలన తెలియవచ్చును. దీనిని శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రొక పర్యాయము చూచి యుండిరట. ఇది అభినవ కామశాస్త్రమువలె ఒప్పుచున్నదనియు. ఇందు సంజ్ఞాభియోగిక భార్యాధికార పారదారిక వైశికాది ప్రకరణము లెనిమిది యున్న వనియు వారు తెల్పిరి. ఆ గ్రంథమును తిరిగి చూతమనుకొన్న ఆ గ్రంథస్వాములు వారికి దానిని మరల చూపలేదట; వారందలి రెండు పద్యము లను మాత్రము తమ త్రిపురాంతకోదాహరణ పీఠికలో నొసంగి యున్నారు.

కం. సతి గుణవతి యగునేనియుఁ
బతి కది రత్నంబు, ప్రాణ బంధువ, యమృతం,
బతివయ దుర్గుణి యగునేఁ
బతి కెడపని చిచ్చు కాలుపక యది కాల్చున్

మ. గుణమున్ సుందర రూపమున్ విభవముం గూటంబు సౌభాగ్య ల
క్షణముం జారు చరిత్రమున్, వినయమున్, జాతుర్యమున్ ధర్మ భూ
షణముం గల్గి పతివ్రతా మహిమ మించన్ గల్గనేఁ దత్సతీ
మణి చింతామణి దానిఁ దాల్పఁ గలుగన్ మర్త్యుండె ధన్యుం డిలన్.

త్రిపురాంతకుని అంబికా శతకము నందలి నూఱు పద్యములలో ఏడు పద్యములును, చంద్ర తారావళి యందలి నాల్గు పద్యములును ప్రబంధ రత్నావళిలో నొసంగబడినవి. అంబికా శతకము నందలి పద్యములలో భక్తిరసముతో శృంగారము కూడ మేళవింపబడినది. ఇందు పార్వతీ పరమేశ్వరుల శృంగార లీలా విలాసాదులు లలితముగ వర్ణింపబడినవి. ఈతని చంద్ర తారావళి ఇరువది ఏడు పద్యముల కృతి. ఇందు "చంద్రా! రోహిణీ వల్లభా!" యను మకుట ముండును.

త్రిపురాంతకుడు ప్రధానముగా శృంగార ప్రియుడైన కవి. ఇతడు మదన విజయమను రతిశాస్త్రమును వ్రాయుట, ప్రేమాభిరామమను శృంగారరసాత్మక

మగు వీథిని నిర్మించుట, అంబికా శతకమున భక్తి తత్త్వముతో శృంగారమును మేళవించుట ఈ విషయమును రుజువు చేయుచున్నవి. ఇంకను శృంగార కవి యని గణన కెక్కిన వాడును, కొక్కోక కవి బిరుదాంకితుడునైన ఎఱ్ఱన కొక్కోక మను రతిశాస్త్రమును వ్రాసి యందలి పూర్వ కవిస్తుతిలో

గీ. ముని సనత్కుమారు, ధనద తనూభవు,
నాశ్వినుల, జయంతు నభినుతింతుఁ
బృథివి రావిపాటి త్రిపురాంతకాది శృం
గార కవులనెల్ల గారవించి.

అని త్రిపురాంతకుని శృంగార కవులలో నొకనిగా చేర్చెను.

రావిపాటి త్రిపురాంతకుడు క్రీడాభిరామము నందలి ప్రస్తావన యందలి పూర్వకవి స్తుతిలో

ఉ. నన్నయ భట్ట తిక్కకవి నాయకులన్న, హుళక్కి భాస్కరుం
డన్నను, జిమ్మపూడి యమరాధిపుడన్నను, సత్కవీశ్వరుల్
నెన్నుదుటం గరాంజులులు నింతురు జేయని. రావిపాటి తి
ప్పన్నయు నంత వాడ తగునా యిటు దోసపు మాటలాడగన్.

అని సంస్తుతింపబడెను. పై పద్యము వలన త్రిపురాంతకుడు నన్నయ తిక్కనలతో సరితూగు ఉత్తమ కవి యని తెలియవచ్చు చున్నది. ఈ స్తుతి ననుసరించి ఈతడు హుళక్కి భాస్కరునకు తరువాతివాడు కావలెను. హుళక్కి భాస్కరుడు రామాయణమున అరణ్యకాండమును యుద్ధకాండము నందలి పూర్వ భాగమును రచించెను. ఈతని కాలము పదునాల్గవ శతాబ్ది యందలి ఆరంభము. అతని అనంతరము వెలసిన తిప్పన పదునాల్గవ శాతాబ్ది మధ్య భాగమునందుండి యుండును.

త్రిపురాంతకుని కాలమును గూర్చి సహేతుకముగ చర్చించిన విమర్శకులు ఇతడు కాకతి రెండవ ప్రతాప రుద్రదేవుని కాలమునందలి వాడని నిశ్చయించిరి. ఈ ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1295 వ సంవత్సరము మొదలు 1326 వఱకు రాజ్యము చేసి యుండెను [2] ప్రేమాభిరామము నందలి కథకు రంగము ఏకశిలా నగరము. త్రిపురాంతకుడు ఆనాటి ఓరుగల్లు నగరము ప్రత్యక్షముగ చూచి గ్రంథమున వర్ణించి యుండును.

క్రీడాభిరామము నందు "ప్రతాపరుద్రుని సామ్రాజ్యకాలములో నుండిన ఓరుగల్లు వైభవము లేదు. ప్రతాపరుద్రుని కాలమునాటి దనిపించు ఓరుగల్లు వినోదములతోపాటు ఇతర విశేషములును కలవు. క్రీడాభిరామము నందున్న విషయమిది. ప్రేమాభిరామమునం దుండదగిన విషయమది. సాధారణముగ నీ స్థితి సామ్రాజ్య వైభవకాలమున కాక సామ్రాజ్య పతన కాలమున నుండుట సహజము. అంతే కాదు, ప్రతాప రుద్రమహారాజు బ్రతికి యుండగా నాతని కాలమున ఓరుగల్లు ఆస్థితిలో నున్నదని వ్రాయుట సంభవము కాదు. ప్రతాపరుద్రుని యనంతరమే త్రిపురాంతకు డట్లు వ్రాయుట సంభవము. అందుకు త్రిపురాంతకుడంతకుముందు ఓరుగల్లుచూచి యుండవచ్చును. తరువాతనైనను చూచి వాడలవరుసను మఱి కొవెలల కోవను వర్ణింప వచ్చును. ఈ విషయమును త్రిపురాంతకుని ప్రేమాభిరామము లభించిన నింతకంటె నిదమిత్థముగ జెప్పవచ్చును."[8] అని కొందఱు విమర్శకు లభిప్రాయ పడుచున్నారు. కాని కావ్యమున వ్యభిచారము వర్ణింపబడినంత మాత్రమున ఇది సామ్రాజ్య పతన కాలమున రచింపబడినదనుకొనుట పొరపాటు. రావిపాటి త్రిపురాంతకుడు ప్రతాప రుద్రుని ఆస్థానము నందలివాడు కాక క్రీ. శ. 1380 వ సంవత్సరము ప్రాంతము నందలి వాడని కొందఱందురు. వారి వాదమునకు అప్పకవి అప్పకవీయమున అనుస్వార సంబంధ యతికి లక్ష్యముగా నొసంగిన తిప్పకవి చాటుధార ఉపబలకముగ నున్నది. ఆ చాటుధార ఇది.

మ. సరిబేసైరిపుడేల భాస్కరులు భాషానాథ! పుత్రా! వసుం
ధర నందొక్కడు మంత్రియయ్యె, వినుకొండ న్రామయామాత్య భా
స్కరుడో ?యౌ. నయితే సహస్రకరశాఖల్లే వవే యున్న వే
తిరమై దానము సేయుచో రిపుల హేతి న్వ్రేయుచో వ్రాయుచోన్
[8—60]

పై పద్యమున వినుకొండ యందు మంత్రియు, దండనాధుడును అయిన రామయామాత్యుని ఔదార్య వీరత్వాది ప్రశంస చమత్కారముగ చెప్పబడినది. ఇందలి రామయామాత్య భాస్కరుడను పదము రాయనామాత్య భాస్కరుడనుటకు బదులు వ్రాయబడి యుండుననియు రాయన భాస్కరుడను మంత్రి క్రీ. శ. 1362 ప్రాంతము నందు వినుకొండ యందు మంత్రిగా నుండెననియు క్రీ. శ. 1300 సంవత్సరము ప్రాంతమున జన్మించిన రావిపాటి తిప్పకవి తన చరమ వయస్సున నీ రాయని భాస్కరుని 'సరి బేసైరను' పద్యమున

వర్ణించి యుండుననియు శేషయ్యగారు కవి కాలమును సమన్వయించిరి.[4] ప్రతాపరుద్రుడు పరిపాలించు నాటికి త్రిపురాంతకునకు కనీసము పాతికేండ్లుండునని, అతడు ప్రేమాభిరామమున కాకతిరాజ్య వైభవమును కన్నులకు కట్టినట్లు వర్ణించి యుండునని ఆరుద్ర గారూహించిరి. తిప్పకవి చాటుధార యందలి పద్యము సంభాషణాత్మకముగ నాటక రీతిలో సాగి కవియొక్క నాటకాభిమానమును తెల్పుచున్నదనియు వారనిరి.

### వినుకొండ వల్లభరాయడు :

ఇతడు త్రిపురాంతకునకును, చందమాంబకును పుత్రుడు. వీరు నియోగి బ్రాహ్మణులు. వీరిది కామకాయనస విశ్వామిత్ర గోత్రము. అశ్వలాయన శాఖ, త్రిపురాంతకుడు. భైరవోపాసకుడు. భైరవుని సాక్షాత్కారము నొంది తత్కృప వలన సిద్ధ సారస్వత శ్రీయుతుడాయెను. ఇతడు ఋగ్వేదమును పఠించినట్టి వాడు. తన్ను గూర్చి కృతి ప్రస్తావము నందిట్లు తెలుపుకొనెను.

సీ. మూడు గ్రామ గ్రాసములతోడఁ గూడంగ
మోపూరు పాలించె మున్కినాట,
నాశ్వలాయన శాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించెఁ
బ్రత్యక్ష మొనరించి భైరవ స్వామిచే
సిద్ధ సారస్వత శ్రీ వరించె
గామకాయనస విశ్వామిత్ర గోత్రంబు
వంశ గోత్రంబుగా వార్తకెక్కె

గీ. నెవ్వడా త్రిపురాంత కాధీశ్వరునకు
రాయ నవరత్న భాండార రక్షకునకుఁ
బ్రియ తనూజుండు, చందమాంబిక సుతుండు
మనుజమాత్రుండె వల్లభామాత్యవరుడు ? 1 – 227.

వల్లభరాయడు ముల్కి నాటి యందలి మోపూరును పాలించెను.[6] ఈతని తండ్రి రాయనవరత్న భండార రక్షకుడు. అంతేకాక శ్రుత పర్వత (వినుకొండ) దుర్గ మహా ప్రధాన రాద్గంధగజంబు (1 – 20). ఇతని పూర్వులు కర్ణాట ప్రభువులను సేవించినట్టి వారు. తిప్పయ వల్లభుని ముత్తాతయగు చంద్రమంత్రి

సంగమ వంశమునకు మూల పురుషుడగు పెద బుక్కరాయల కడ మంత్రి. ఈతని పెద తండ్రియగు లింగనయు [7] తండ్రియగు తిప్పనయు [8] హరిహర రాయలను సేవించినట్టి వారు. ఈ హరిహరరాయలు రెండవ హరిహరరాయలు. వల్లభుని తండ్రియగు తిప్పన మొదటి దేవరాయల కాలము వఱకును ఉండి యుండును. మొదటి దేవరాయలకు మనుమడైనను ప్రౌఢ దేవరాయలు ఆతని వెనువెంటనే సామ్రాజ్య సింహాసనము నధిష్ఠించెను. తిప్పన కుమారుడగు వల్లభరాయడు ప్రౌఢ దేవరాయలకు సమకాలికుడై యుండును. ఈ విషయము రెండు వంశక్రమములను పోల్చి చూచిన స్పష్టమగును.

వినుకొండ వారి వంశము



## సంగమ వంశము

బుక్కరాయలు

సంగమ రాయలు

| | | | | |
|---|---|---|---|---|
| మొదటి హరిహరరాయలు [1336 - 1338] | కంప రాయలు | మొదటి బుక్కరాయలు [1343 - 1379] | మారప్ప | ముద్దప్ప |




ఇట్లు ప్రౌఢ దేవరాయల కాలము నందున్న వల్లభ రాయడు శ్రీనాథునకు సమకాలికుడు. శ్రీనాథుడు గౌడ డిండిమభట్టు నోడించి కవిసార్వభౌమ బిరుదము నందుకొన్నది ప్రౌఢ దేవరాయల ఆస్థానముననే. ఈ విషయమును ఈ క్రింది వాక్యములు కూడ నిరూపించును.

"శ్రీమన్నిడు మామిడి శ్రీశైలమణి ఖచిత కనక సూర్య సింహాసనము నధిష్ఠించిన గురు పరంపరలో 12 వ వారగు చంద్ర భూషణ దేవ ఒడయరు 1437 నుండి 1450 వఱకు నీ సూర్యసింహాసన మధిష్ఠించిరి. వీరు విజయ నగర సామ్రాజ్యాధిపతి యగు ప్రౌఢదేవరాయల గురువు"[9] [1423 - 1446]. శ్రీనాధుడు ప్రౌఢదేవరాయల ఆస్థానమున డిండిముని ఓడించిన సందర్భమున మాధ్యస్థ్యము వహించిన వారీ చంద్రభూషణ ఒడయరే. శ్రీనాధుడు 'చంద్ర భూష క్రియాశక్తి రాయల యొద్ద పాదు కొల్పితి సార్వభౌమ బిరుద' మని చెప్పుకొనినాడు. విజయనగరమున కేగుచు దారిలో వినుకొండ యందో, మోపూరునందో బస చేసి వల్లభరాయని పరిచయమును బడసి యుండును. శ్రీనాధుడు విజయనగరమున కేగిన కాలము 1428 - 38 ప్రాంతము.[10] అంతకు ముందు రచింపబడిన క్రీడాభిరామము క్రీ.శ. 1430 సం॥ ప్రాంతమున రచింప బడియుండును.

క్రీడాభిరామము నందు గల ప్రశంస వల్లభామాత్యుని పాండితీ వైభ వాదికములను తెల్పును. ఇతడు చాటు కవిత్వమును చెప్పుటలో నిపుణుడు. ఈ విషయమును ఇందలి రెండు పద్యము లుగ్గడించు చున్నవి.

క. హాటక గర్భ వధూటీ
వీటీ కర్పూర శకల విస్ఫురత సౌర
భ్యాటోప చాటు కవితా
పాటవ మరు దవని వల్లభన్నకు నమరున్ 1 – 24

క. అమృత రస మథన సంభవ
ఘుమ ఘుమిత పయఃపయోధి కోలాహలమున్
భ్రమియించుఁ దిప్ప సచివో
త్తము వల్లభవిభుని చాటు ధారా ఫణితుల్.

ఈతని కవితా వైభవము

క. భిల్లావతార మధుభి
ద్భల్ల భుజాస్ఫాల్యమాన పటు చాప జ్యా
వల్లీ మతల్లి చెల్లెలు
వల్లభరాయ ప్రధాన వాగ్వైభవముల్. 1-27

అని ప్రశంసింపబడినది. 'ప్రత్యక్షమంది భైరవస్వామిచే సిద్ధ సారస్వతశ్రీ వరించె' అని చెప్పబడుటవలన ఇతడు భైరవస్వామిపై స్తుతులను, పద్యములను వ్రాసియుండ నోపునని భావింపవచ్చును." ఇతడు కవీంద్రకాంక్షిత త్రిదశ మహీరుహమను ప్రసిద్ధిని గాంచినట్టివాడు.

**క్రీడాభిరామ కర్తృత్వము :**

క్రీడాభిరామమునందలి ప్రస్తావనయందును, ఆశ్వాసాంత గద్యయందును ఏతద్గ్రంథము వినుకొండ వల్లభరాయ విరచితమని స్పష్టముగ పేర్కొనబడినది.

'వ. ఆ మంత్రిశేఖరుడు రావిపాటి త్రిపురాంతక దేవుండను కవీశ్వరుం డొనరించిన ప్రేమాభిరామ నాటకంబు ననుసరించి క్రీడాభిరామంబను రూపకంబు తెనుంగు బాస రచియించినవాడు'[38] అని ప్రస్తావనలోను,

'ఇది శ్రీ మన్మహామంత్రిశేఖర వినుకొండ తిప్పయామాత్య నందన, చందమాంబాగర్భ పుణ్యోదయ, సుకవి జనవిధేయ, వల్లభరాయ ప్రణీతంబైన క్రీడాభిరామంబను వీథి నాటకంబున సర్వంబు నేకాశ్వాసంబు' అని ఆశ్వాసాంతమునను వ్రాయబడినది.

క్రీడాభిరామమును వినుకొండ వల్లభరాయడు కాక శ్రీనాథుడు రచించి దానికి వల్లభుని పేరిడెననియు, వల్లభునికి గ్రంథరచనమున శ్రీనాథుడు మిక్కిలి తోడ్పడి యుండుననియు, వల్లభుడే దానిని రచించెననియు అభిప్రాయములు కలవు. పై అభిప్రాయము లేర్పడుటకు శ్రీనాథుడొక వీథి నాటకమును రచించెనని లోకమున ప్రచారముండుట కూడ ఒక కారణము. శ్రీనాథుని వీథి యనబడునట్టిది ఏ రూపక లక్షణములును లేని చాటు పద్యముల సంకలనము. ఇందు శ్రీనాథుడు వివిధ సుందరాంగుల వర్ణనములను బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణముల వరుసలో కావించెను. ఈ చాటు పద్యములతో క్రీడాభిరామము నందుగల కందుక కేళి-(82) 2. కుసుమంబద్దిన...(86) మీన విలోచనంబులు...(104) అను పద్యములు గలవు. కాని వీనికి క్రీడాభిరామమున గల స్థానౌచిత్య మిందులేదు.

క్రీడాభిరామమునందలి 'కందుక కేళి' 'కుసుమంబద్దిన' అను రెండు పద్యములను అప్పకవి శ్రీనాథుని వీథి నాటకములోనివని ఉదాహరించెను. ఈ

వీథిని గురించి ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారిట్లు వ్రాసిరి. "ఈ శతాబ్ది ఆరంభములో శ్రీనాథుని వీథి నాటకము పేర ఒక పద్య సంపుటి ఎవరిచేతనో ప్రచురింపబడినది. అందులో శ్రీనాథుడు చెప్పిన నానా చాటు పద్యములు కలవు. అవేకాక లక్షణ గ్రంథములలో శ్రీనాథుని వీథి నాటకమునుండి యని ఉదాహరింప బడిన పద్యములు మఱికొన్ని కలవు. ఆ లక్షణ గ్రంథ పద్యములను బట్టి శ్రీనాథునిపేర నెగడుచున్న వీథి నాటక మనునది పైని పేర్కొనబడిన పద్య సంపుటియే కాబోలునని లోకము సమాధాన పడినది. కొంత కాలమునకు ఆ భ్రమ తీరినది. ఎట్లనగా శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయమునుండి క్రీడాభిరామమును సంపాదించి ప్రకటించిరి. దానిలో వీథి నాటక పద్య సంపుటిలోగల పద్యములు కొన్ని కానవచ్చుటచే యథార్థమైన వీథి నాటకము రామకృష్ణకవిగారు ప్రకటించిన క్రీడాభిరామమే అనియు, తత్పూర్వము ఆ పేరుతో ప్రచారముననున్న చాటు పద్య సంపుటికి 'వీథి' నాటకమను పేరు కల్పితమనియు తెల్లమయ్యెను.' వీథి' అనగా దశవిధ రూపకములలో ఒకటికదా ! రూపక లక్షణమేదియు లేని ఆ పద్య సంపుటి వీథి నాటక మెట్లగునని పండితులకైనను సందేహము కలుగలేదు. ఈ గ్రంథము లభించిన పిమ్మట శ్రీనాథునిదని లక్షణ గ్రంథములలో ఉదాహరింపబడిన వీథి నాటకమనెడి గ్రంథము ఈ క్రీడాభిరామమే యని లోకము సంతసించినది. కావున లక్షణ గ్రంథకర్తలు పేర్కొన్న శ్రీనాథుని వీథి నాటకము ఈ క్రీడాభిరామమే."[12]

ఈ క్రీడాభిరామమున పద సంవిధానము, అన్వయక్రమము, కారక ప్రయోగవైచిత్రి, పద్యోపక్రమ నిర్వాహములు. ప్రతిపదము శ్రీనాథుని పేరుగ్గడించుచున్నవనుచు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు క్రీడాభిరామము శ్రీనాథ కృషియేయని పెక్కు ఉదాహరణములను చూపి సమర్థించిరి. ఈ సందర్భమున వారి వచనములను యథాతథముగా గ్రహించుట యుచితము.

"వల్లభరాయని కృతిగా గ్రంథమున నున్నను శ్రీనాథుడే దీనిని రచించెనని పెక్కు కారణములచే నేను నిశ్చయించుచున్నాడను. ఇంతకు ముందా కారణముల జాలగా నేను శృంగార శ్రీనాథమున జెప్పి యుంటిని. అయినను నిక్కడ మరల మఱింత ప్రబలముగా జెప్పుచున్నాడను. సులక్షణసారము, అప్పకవీయము, లక్షణ దీపిక, సర్వలక్షణ సార సంగ్రహము మొదలగు లక్షణ

గ్రంథములందు శ్రీనాథుని వీథి నాటకములోనివిగా నుదాహృతము లయిన పద్యము లీ క్రీడాభిరామమున కలవు. శ్రీనాథుడే ఈ గ్రంథమును రచించి వల్లభరాయని పేరు పెట్టగా. గ్రంథమున పేఱువేరున్నను, రంగనాథ రామాయణాదుల వలె నీ గ్రంథము కూడ కర్తయగు శ్రీనాథుని పేరనే లోకమున ప్రచారము గాంచి యుండుటచే అప్పకవ్యాదు లట్లు చెప్పియుండ వలెను. అప్పకవ్యాదు లుదహరించిన పద్యములు క్రీడాభిరామమున వానుపూర్వితో నున్నవి. ప్రక్షిప్తములన గుదురదు. వల్లభరాయడును శ్రీనాథుడును సమకాలము వారు గాకపోవుదురేని, శ్రీనాథు డాతని పేర గ్రంథము రచించుట యసంభవ మగును. అట్టి చిక్కు లేదు. శ్రీనాథుడును వల్లభరాయడును సమకాలము వారు. వల్లభరాయని పెద తండ్రియగు లింగన మంత్రి విద్యానగరపు హరిహర రాయల మంత్రి. రెండవ మూడవ హరిహర రాయంద్రు క్రీ. శ. 1402, 1412 వఱకు నుండిరి. లింగ మంత్రి వారిలో నెవరి యొద్ద మంత్రియయి యుండినను వల్లభరాయడు మన శ్రీనాథుని సమకాలము వాడే యగును. అందును నీ క్రీడాభిరామమును కాశీఖండ రచనానంతరమే రచించెనని నే దలంచుచున్నాడను గాన శ్రీనాథుడును వల్లభరాయడును, సమకాలము వా రగుదురనుటకు సంశయింప బని లేదు."

"మరియు నీ గ్రంథమున వల్లభరాయని వాగ్వైభవ దాతృత్వాది వర్ణనము మితిమీఱి యున్నది. గ్రంథకర్తయే తానగుచో వల్లభరాయడట్లు కంద పద్యాష్టకమును రచించుకొని యుండడు. ఆ పద్యములు భీమఖండాదులలోని కృత్యవతరణికా పద్యముల పోలిక గలిగి యున్నవి. అందు కడపటి పద్యము.

క. ఉపమించెద ధారాధర
తపనజ రైరాజ రాజ ధారానగరా
ధిప ధారాధర వాహుల
త్రిపురాంతక వల్లభుని వితీర్ణి ప్రౌఢిన్

అని యున్నది. మరియు గృత్యవసాన పద్యమున గాల భైరవుడు కవీంద్ర కాంక్షిత త్రిదశ మహీరుహమగు వల్లభరాయనికి సమగ్ర వైభ వాభ్యుదయములు కృప సేయునని యాశీర్వచన మున్నది. సూత్ర ధారోక్తిగాను, భరతోక్తిగాను నయినను గ్రంథకర్త యగువాడిట్లు చెప్పుకొనుట సరసముగాదు. ఇదితానే తమ్ము కొనితానే కతాయున్నని యనుకొన్నట్లున్నది. కవీంద్రకాంక్షిత త్రిదశ మహీరుహము

గావున వల్లభ రాయడు విశేష ధనమొసగి కవియశః కాంక్షియై యేతత్కృత కర్తృత్వమును దనపై వేయించుకొన్నాడని తలచుట ప్రమాణదూరముగాదు. అట్టి సంప్రదాయము గూడ నా కాలమున హెచ్చుగా గలదు.

"శ్రీనాథుడు తన గ్రంథములలో గొన్ని పద్యములను, ఐద్య భాగములను, భావములను మార్పుచేయక యొక తీరుననే కూర్చుకొనుచు వచ్చినాడు. స్వరచనమే యగుటచే సరిపడిన పట్టులందు ముందు రచించిన గ్రంథములలోని కూర్పులకు జేర్చుకొనుట దోషము గాదుగదా! తిక్కనాదులు గూడ నిట్లుచేసిరి. ఎన్నటికిని గూడ క్రీడాభిరామము శ్రీనాథకృతము గాదను వాదము పుట్టకుండుటకో యనునట్లు శ్రీనాథ కవి యనేక స్థలముల నిందు దనతక్కిన గ్రంథముల రచనములను జేర్చెను. ఆ పోలిక లీ గ్రంథము శ్రీనాథకృతమేయని చెప్పక చెప్పుచున్నవి. ఇతర కవి కృతులందలి సరస సంవిధానములనుగాజేయు దొంగ కవులును గొందఱుందురు. వల్లభరాయ డట్టివాడై శ్రీనాథ రచనముల గొన్నింటిని గాజేసి యుండరాదాయనరాదు. గ్రంథ మామూలాగ్రము శ్రీనాథ రచనముగానే కన్పట్టుచున్నది."[13]

ఇట్లు ప్రభాకరశాస్త్రిగారు క్రీడాభిరామ కర్త శ్రీనాథుడే యని నొక్కి వక్కాణింపగా "శైలి విషయమున సామ్యమును జూపి శ్రీనాథునకు గర్తృత్వమారోపింతమన్నచో నక్కాలపు గావ్యములెల్ల నించుమించుగా సమాన పాటవమును, కవితా ధాటియును, నిరంకుశ భావములను గలిగియున్నవి. పినవీరభద్రుడు, శివలీలా విలాసము వ్రాసిన కొమ్మన, ఎఱకుర్తి రామరాజు, తులసి బసువన, అంగర నృసింహకవి మున్నగువారు రచించిన కావ్యములలో బిగువును, ధారాపాతమును సమానముగ నున్న" వని[14] శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగా రభిప్రాయ పడుచున్నారు.

క్రీడాభిరామము వల్లభరాయకృతమే అనియు, కాగా తద్రచనమునందు గ్రంథకర్తకు శ్రీనాథుడు కొంత తోడ్పడి యుండుననియు భావించు వారిలో శ్రీ బండారు తమ్మయ్యగారి యభిప్రాయమిట్లున్నది.

"వల్లభరాయని కాలమున విజయనగర సామ్రాజ్యమును ప్రౌఢదేవరాయలు (క్రీ. శ. 1423–1446) పరిపాలించుచుండెను. అతని యాస్థానముననే గౌడడిండిమభట్టారకుడు అరుణగిరి నాథ నామాంకితుడు కవిసార్వభౌమే

త్యాది బిరుదములతో యశోడిండిమమును మ్రోగించుచుండెను. శ్రీనాధునకు యశోభిలాష మపారము. అప్పుడాతడు రాజమహేంద్రవరమున వేమ వీరభద్రా రెడ్ల యాస్థాన మలంకరించి యుండెను. విద్యావాదమున డిండిమ భట్టారకుని జయించి యాతని కంచు ఢక్కను బగుల గొట్టించిన గాని శ్రీనాధునకు నిద్ర పట్టకుండెను. అందుచేత నాతడు జైత్రయాత్రోన్ముఖుడై పలుపాట్లుపడి, ప్రౌఢ దేవరాయల యాస్థానమున ప్రవేశమును గలిగించుకొని డిండిమ భట్టునోడించి రాజుచే గనకాభిషేక సత్కారాదుల నొంది స్వదేశమునకు మరలివచ్చి కవి సార్వభౌముడయి విరాజిల్లెను. ఈ విజయనగర ప్రయాణ సందర్భముననే యాతడు ప్రౌఢ దేవరాయ సంస్థాన ప్రవేశమునకు గావించిన ప్రయత్నములలో మార్గమధ్యమున వినుకొండలో గాని, మోపూరులో గాని యా ప్రాంతదేశమునకు రాయల ప్రతినిధిగా, భాండాగారాధ్యక్షుడుగా నున్న వల్లభరాయని సందర్శించి యుండును. శ్రీనాధుని యుద్యమమునకు హర్షించి వల్లభరాయ డటి కొనసాగుటకయి తన మిత్రులగు సంస్థానోద్యోగులు కొందఱకు సిఫారసు చేసి యుండును. ఆ సమాగమ సమయముననే శ్రీనాధుడు వల్లభరాయుని వలన నాతని క్రీడాభిరామ రచనోద్యమమును విని యాతని యాదరానురోధమున దానుగూడ నందు దోడ్పడి యుండును. చరచర పరుగులు వారు కవితాధారగల శ్రీనాధుని కిట్టిపని కెంతయో సేపు పట్టదు. కావున వల్లభ రాయనితో నున్న యా కొలది దినములలోనే శ్రీనాథు డీకృతి రచనమున దనచేయివేసి యుండును. స్వతంత్రముగ గాని, యనువాద రూపకముగ గాని, యొకరూపకరచనము గావించు సంకల్పము శ్రీనాధుని కుండియుండదు. పైని చెప్పిన కారణములచే నీ కృతి రచనా సంకల్ప మసలు వల్లభరాయనిదే యని మనము సులభముగా దెలిసికొనగలము.

“అవతారికా భాగము—[వల్లభ రాయ స్తుతి సంయుతము] తద్వంశ వర్ణనాదికము, గ్రంథాంతమందలి యాశీర్వాదపద్యము కేవలము శ్రీనాధ కృతములే యని మనము భావింపదగును. ఇక కథా భాగము నందును శ్రీనాధుని సిద్ధహస్తము స్వల్పముగగాక, వల్లభరాయ రచన కొంతయున్నను, దానిని గుర్తింపరాకుండ గ్రమ్మివైచునంత యెక్కువగ నెలకొనినట్లు కానవగును. శ్రీనాధుని యితర కృతులయందలి పద్యపాదములు, అతని రచనలతో ప్రత్యక్ష సామ్యము గల సంవాదములు, పదప్రయోగములు నిందు నెక్కుడుగ నెక్కొని యున్నవి.

కాశీఖండ రచనమును శ్రీనాథుడు విజయనగరాస్థానమున గనగాభిషేక మొంది రాజమహేంద్రవరమునకు మరలి వచ్చిన యనంతరమే క్రీ. శ. 1440 ప్రాంతమున గావించి యున్నాడు. కావున భీమఖండ కాశీఖండ రచనముల నడుమ కాలమున విజయనగర ప్రయాణ సందర్భముననే శ్రీనాథుడు వల్లభ రాయని సందర్శించి క్రీ. శ. 14౨౭ వ సంవత్సరము ప్రాంతమున నాతనికి గ్రంథ రచనమున సాయపడెనని నిర్ణయింపనగును."15

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి గారి యభిప్రాయము :

"శ్రీనాథుడు కొండవీటిలో చిరకాలము వసించియుండి, నైషధాంధ్రీకరణము మూలమున తన యశః ప్రశస్తులను గుంటూరు, నెల్లూరు మండలము లంతటను వెల్లివిరియజేసి యున్నాడు. కొండవీటికి వినుకొండ నలువది మైళ్ళ దూరమందుండిన పట్టణము. కావున శ్రీనాథుని రచనా పద్ధతి వల్లభ రాయని మనము నాకర్షించి యాతని ప్రోత్సాహముతో దన రచన సాగింప సమకట్టి యుండ శ్రీనాథుడు కృత్యాద్యంత పద్యములను గూర్చియున్నాడు. రచనలలో గాన వచ్చెడి వ్యత్యాసమే యీ విషయమును స్పష్టము చేయుచున్నది ఈ క్రీడాభిరామమందలి మొదటి పద్యము - 'గణన కెక్కిన దశరూపకముల యందు' ఇత్యాది పద్యము వల్లభామాత్యునిది. దానితరువాతి 'అఖిల ప్రపంచంబు నన్యథా కల్పించె' నిత్యాది సీసము మొదలగు ౬౨ వ పద్యము తుదివఱకు, ప్రేమాభిరామ ప్రశంసయను వచనము దాక గల వంశావతార వర్ణనాత్మక విషయమంతయు శ్రీనాథ విరచితమేకాని వల్లభామాత్యుని రచితము గాదు. నడుమ గూర్చిన 'కందుకకేళి సల్పెడి ప్రకారమునన్' "కుసుమం బద్దిన చీరకొంగు వొలయన్" ఇత్యాది పద్యములు రెండును శ్రీనాథుని చాటువులు. అతని వీథి నాటకములోని విందు జేరినవి. శాలివాహన సప్తశతి శ్లోకములకు శ్రీనాథుని యనువాద రూపమయిన పద్యములు 'శీతకాలంబు కిడిమాడ సేయు గుడుసు' 'పటుఝుంఝూ పవనోత్కృణాలయములో', 'మాఘమాసంబు పులివలె మలయుచుండ' ఇత్యాది పద్యములు మూడును శ్రీనాథునివే కాని వల్లభరాయనివి గావు. ఇట్లే తుదిని భరత వాక్యమనదగిన 'ముదమున ముల్కినాటి పురమోహన శైల" ఇత్యాది పద్యమును శ్రీనాథునిదే. ఈ పద్యములు గాక తక్కిన గద్యపద్యము లన్నియు వల్లభామాత్య విరచితములే.

క్రీడాభిరామము కృత్యాద్యంతములందు శ్రీనాధుని రచన ప్రవేశించుట సంభావ్యమైన విషయమే. ఏమన, నీ ఘట్టమున గవి తన ఘనతను దా నుగ్గడించు కొనవలయును. అది యన్య కర్తృకమైనచో దానిలో నౌచిత్య మధికము కావున, వల్లభరాయనికడకు గార్యార్థి యైవచ్చిన శ్రీనాధుడా పని చేసి యుండ వచ్చునని మనమూహింపవచ్చును. శ్రీనాధుడు ప్రౌఢదేవరాయని యాస్థానములో గౌడ డిండిమ భట్టారకుని వాగ్వాదమునం దోడించి, కవిసార్వభౌమ బిరుదము నార్జింప బోవునా డీ వల్లభామాత్యుని తోడ్పాటు నర్థించి యుండును. వల్లభామాత్యుని ముత్తాత విజయనగరాధీశుడైన పెద బుక్కరాయలకు మంత్రిగను, ఈతని తాత లేక తండ్రియగు తిప్పామాత్యుడు హరిహరరాయల సువర్ణ భాండాగారాధ్యక్షుడుగను నుండిన కతమున, వల్లభామాత్యునకు గూడ విజయనగర సామ్రాజ్యముతో సన్నిహిత సంబంధమేర్పడి యుండును. అచట సభా ప్రవేశమునకు దనకు సాయపడుటకై శ్రీనాధుడు వల్లభామాత్యుని దర్శింపగా నాతడు శ్రీనాధుని కృత్యాది పద్యములు రచింపుమని కోరియుండును. తన్మూలముగ నీ 32 శ్రీనాధ గద్య పద్యములు కృత్యాదిని, మదమున ముల్కినాటి పుర ఇత్యాది పద్యము తుదిని చేరినవని మన మూహచేయవచ్చును. నడుమ నవతరించిన అయిదు పద్యములు శ్రీనాధుని యనుమతితోడనో లేకయో వచ్చి చేరినవనుట నిశ్చయము.

ఏ ప్రభువు నాస్థానిలోనైన ప్రవేశము నార్జించుటకు ముందు తత్సంబద్ధులతో సారస్వత సంబంధము నేర్పఱుచుకొనుట శ్రీనాధునకొక పరిపాటియై నట్లులు గన్పట్టును. ఆక్రమముననే విజయనగర సామ్రాజ్య సంబద్ధుడైన వల్లభామాత్యునితో నిట్టి సారస్వత బాంధవ్యమేర్పడి యుండునని నా యూహ. పెద్ద కోమటి వేముని యాస్థానిలో విద్యాధికారి కాదలచిననాడు తన్మంత్రియగు మామిడి సింగన తోడను, వీరభద్రారెడ్డి యాస్థానిలో విద్వాంసుడు కాదలచిననాడు తన్మంత్రియగు బెండపూడి అన్నామాత్యుని తోడను సారస్వత సంబంధ మేర్పఱుచుకొనుటయు, తన్మూలమున దనయాశయమును సఫలము గావించుకొనుటయు దీనికి సమర్థకములు."16

### శ్రీ వేకుమళ్ళ అచ్యుతరావుగారి యభిప్రాయము :

"వల్లభామాత్యుడు క్రీడాభిరామమను వీధి నాటకము నాంధ్రమున రచించెను. ఆ గ్రంథమందలి ప్రస్తావన పద్యముల వలన దత్కవి గొప్ప పండితు

డనియు, చక్కని కవిత్వము చెప్పగలవాడనియు తెలియవచ్చుచున్నది. ఇంతే కాక ఋగ్వేదము కరతలామలకముగ పఠించి భైరవస్వామి కృపచే సారస్వత సిద్ధి యనగా గ్రంథ కర్తృత్వ సంపత్తిని బొందెను.

ఈ గ్రంథము రూపకముగాని కేవలము ప్రబంధముగాదు. రూపకలక్షణములు సంపూర్ణముగా దీనియందు గాన్పించకపోయినను ఇది వీథి నాటకముగా గ్రంథకర్తచే బరిగణింపబడినది.

ఇది హాస్యరస ప్రధానమైన క్షుద్ర కావ్యముగాని, యున్నతాదర్శముగల యుత్తమ కావ్యము గాదు.

హాస్యరస ప్రధానమైన క్షుద్ర నాటకముగా దీని నుపలక్షించిన యెడల మహాకవి శ్రీనాథుడుగాక, శ్రీనాథుని భాషా వేషము గొంతవఱకు ధరింపగల మఱియొక కవి రచించియుండునని మనకు తోచును......

శ్రీనాథుని భాషా ప్రయోగము లీ గ్రంథమున బుష్కలముగా గాన్పించుచున్నవి గాన నీ గ్రంథము శ్రీనాథకృతమని కొందఱిచే దలంపబడుచున్నదనుట వాస్తవము. కొన్ని పద్యములలో శ్రీనాథుని శైలీధోరణియు ద్యోతకమే. అయిన నాకారణమున శ్రీనాథుడే యీ గ్రంథమును వ్రాసెనని చెప్పుట మాత్రము సాహసము. శ్రీనాథుని బహుముఖ ప్రఖ్యాత మహితశయ్యా విశేషములు పండిత కవులను పండితంమన్యమాన కవులను నేకరీతిగా ననుకరణోత్సాహ పూరితులజేసె ననుటకు పిన వీరన, పెద్దనాది సుప్రసిద్ధ మహాకవులే ప్రబల సాక్షులు. అట్లుండ సమకాలికుడు, బహుశః సహచరుడునగు వల్లభామాత్యుడు కవియశోవాంఛ కలవాడు గాన శ్రీనాథుని వాగ్లహరీ తరంగముల మధుర మధు రసమును గడుపార గ్రోలి తన కావ్యమున నచ్చటచ్చట తదున్మదనసీధువును వెలిగ్రక్కుట యసంభవమా ? బహుళ వ్యాప్తినొందిన శ్రీనాథుని జాతి వార్తారస స్ఫూర్తి యచ్చటచ్చట గ్రంథము నలంకరించుటచేతనే యా కాలపు నాటకప్రేక్షకులను హాస్య రస నిమగ్నులనుగా జేయగలిగి యుండెనని యూహించుట యథార్థమునకు దూరము కాదు.

పై యంశములను సావధానముగా నరసిన, వల్లభామాత్యుని కర్తృత్వము స్థాపించుటకు ప్రబల సాక్ష్యము గాన్పించుచున్నది. లాక్షణికుల యుదాహృతి వల్లభామాత్యునికి గూడ సాయమిచ్చుచున్నది. శైలి విషయములు

శ్రీనాథుని కర్తృత్వమునకు న్యూనత గలిగించెడు విధముగా దోపించుచున్నవి. గ్రంథమందు విస్పష్టముగా వల్లభుని కర్తృత్వ ముద్ఘోషితమై యున్నది. కావున నీ గ్రంథము వల్లభరాయని కృతమే యని యంగీకరించుట యెక్కువ న్యాయ మని యూహించుచున్నాను. వల్లభరాయడీ గ్రంథమును దెనిగించి, తన స్నేహితుడును కవి సార్వభౌముడు నగు శ్రీనాథునిచే గొంత సాయము బొంది యుండవచ్చును గాని శ్రీనాథుడే యీ గ్రంథము నా మూలాగ్రముగా రచించెనని చెప్పుట మాత్రము కేవలమతిశయోక్తియనియు, నన్యాయమనియు దలంప సాహసించుచున్నాను."17

## శ్రీ ఆరుద్ర గారి యభిప్రాయము :

"విజయనగరానికి వెళ్ళేదారిలో శ్రీనాథుడు వినుకొండలోనో మోపూరు లోనో ఒక పెద్ద మజిలీ చేశాడు. బహుశా ఈ రెండు గ్రామాలలోనూ కొన్నాళ్ళ పాటు ఉండి ఉంటాడు. దానికి పెద్ద కారణముంది. తాను వెళ్ళుతున్నది పెద్ద రాజ్యానికి. అక్కడి వాళ్ళంతా తనకు కొత్త. ఫలించే పరిచయాలు చేసుకుంటే తప్ప రాజదర్శనం జరగదు. తన ప్రతిభను పాండిత్యాన్ని గుర్తించి సరైన వాళ్ళకు పరిచయం చేయదగిన స్నేహితుణ్ణి సంపాదించాలి. ఆ మిత్రుడు విజయ నగర సామ్రాజ్యంలో మంచి పలుకుబడి కలవాడై వుండాలి. తన రచనలోని సొగసులు కనిపెట్టడానికి తెలుగుకవిత్వం తెలిసినవాడై వుండాలి. అటువంటి వ్యక్తి ఆ రోజుల్లో లేకపోలేదు. అతడు వినుకొండ వల్లభరాయడు.

ఈ వల్లభరాయడు క్రీడాభిరామం అనే రూపకాన్ని వ్రాస్తున్నాడు. ఇది రావిపాటి తిప్పన్న సంస్కృతంలో వ్రాసిన ప్రేమాభిరామం అనే నాటకానికి అనుసరణ. సరిగ్గా యీ రూపక రచన జరుగుతున్నప్పుడే శ్రీనాథుడు వల్లభ రాయణ్ణి కలుసుకున్నాడు కాబోలు. వల్లభరాయడు వ్రాసిన ప్రతి పద్యాన్నీ అతడు సంస్కరించినట్టు కనబడుతుంది. తన పద్యాల నెన్నిటినో ఇందులో కలిపాడు. రూపకానికి ప్రస్తావనగా కృతికర్త వంశవర్ణన పూర్తిగా శ్రీనాథుడే చేశాడు. రావిపాటి తిప్పన వ్రాసిన ప్రేమాభిరామంలో ఏ ఇతివృత్తం ఉందో కాని శ్రీనాథుడు తన సిద్ధహస్తంవేసి పూర్తి చేసిన క్రీడాభిరామంలో తాను విన్నవీ, కన్నవీ, అనుభవించినవీ, ఆనందించినవీ అన్నీ ఓరుగల్లు నగరంలో కేంద్రీకరించాడు. క్రీడాభిరామానికి ఓరుగల్లు కథారంగం. ఈ తెనుగు నగరంలో ఒకనాడు సంచరించిన ఇద్దరు మిత్రుల అనుభవాలే ఈ రూపకంగా రూపొందిం

జాడూ. శ్రీనాథుడు కాక ఇంకెవరు ఈ రచనలలో చేయి వేసినా ఈ వీధి ఇంత సుకవ్వుండీగా, పసందుగా వుండేదికాదు.' 13

క్రీడాభిరామము వినుకొండ వల్లభరాయకృతమే అని సిద్ధాంతించుచు శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, శ్రీ ఏ. వి. సింగరాచార్య గారు తమ అభిప్రాయముల నిట్లు తెల్పిరి.

శ్రీ కుందూరి ఈశ్వరదత్తు గారి యభిప్రాయము :

'క్రీడాభిరామకృతిలో హరచూడాహరిణాంక వక్రత' యను శ్రీనాథ కృత భీమేశ్వర పురాణమునందలి పద్యములో స్ఫురించు వక్రోక్తి మృగ్యము. కావ్య నిర్మాణమునకు బీజమైన కవి వ్యాపార కౌశలము, వైదగ్ధ్యభంగి భణితి ఈ కావ్యమునందు గగన కుసుమములు. శయ్యా గంధమే కాని, శయ్యా సౌభాగ్యము శూన్యము. ఇట్టి క్షుద్ర కావ్యమునకు కొంతవఱకైనను శ్రీనాథ హస్తావలంబనము గలదనుట యెంతమాత్రము ధర్మము కాదు.

వల్లభరాయుడు ప్రేమాభిరామమును పద్యప్రబంధముగ నెట్లు రచించెనో యట్లే మరింగంటి సింగరాచార్యుడను ప్రసిద్ధ కవి యొకడు ద్విపద కావ్యముగా నొనర్చెను. ఈ విషయము శ్రీ శాస్త్రిలవారే చెప్పియున్నారు. ఈ సింగరాచార్యుడు వైష్ణవ బ్రాహ్మణుడు. దేవరకొండ నివాసి. సీతాకల్యాణమును, దశరథరాజ నందన చరితను వ్రాసి యున్నాడు వీని వ్రాత ప్రతులు ఆంధ్ర లిఖిత పుస్తక భాండాగార మందున్నవి. దశరథరాజనందన చరిత్ర వ్రాత ప్రతులు ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యాలయమునను గలవు. శ్రీ శాస్త్రిగా రుదాహరించిన పద్యము సీతాకల్యాణములోనిది. సింగరాచార్యుడు ఏకైక దిన ప్రబంధ రచనా ధురీణుడు. ఆంధ్ర భాషా నిరోష్ఠ్యాది వింశతి ప్రబంధ నిర్మాణుడు. ఈతని గూర్చి శ్రీ వీరేశలింగం గారు ఆంధ్రకవుల చరిత్రము—మూడవ భాగము (పు 432)లో కొంత వ్రాసియున్నారు. ఇట్టి మహాకవి ప్రేమాభిరామమును దన పరియాటవయేటనే ద్విపదగా నొనర్చెనని వ్రాసికొనుటలో నితని నిరుపమాన పాండిత్య ప్రకర్షమును, ప్రేమాభిరామ గ్రంథ ప్రాశస్త్యమును వెల్లడింపబడెననుటలో నాశ్చర్యము లేదు.

సంస్కృత ప్రేమాభిరామముగాని ద్విపద క్రీడాభిరామము గాని బయలు పడునంతవఱకు, క్రీడాభిరామ కర్తృత్వ వాగ్వివాదము నేల విడిచి సాముచేయుట వంటిది. ఎవ రెంతవఱకు సంస్కృత కావ్యము

ననుసరించిరో మాతృకను బరిశోధించి చెప్పవలెను వల్లభరాడు శ్రీనాధుని కావ్యము లందలి పద్య, పద్యచరణ, భావములను సహ్హించెనో లేక శ్రీనాధుడే మాతృక నెఱింగి యుండిగాని, వల్లభరాయ కృత క్రీడాభిరామమును చూచి యుండిగాని, తన కావ్యముల నట్టి సంకలనము నొనర్చి యుండెనో నిర్ణయించుట కష్టము. ఈ రెండు కృతులు ఆంధ్రుల యదృష్ట వశమున లభించునంత దనుక, నిట్టి వాదములు నెలకొల్పి విమర్శనములు పెంపొందించుట విద్వన్మణుల ధర్మముకాదు. క్రీడాభిరామమును "శ్రీనాధుని వీధి నాటకము (ప్రబంధము), వల్లభరాయ కృతిగా విరచితము" అనియు, ఆచ్ఛాదన పత్రముపై 'శ్రీనాధుని క్రీడాభిరామమనియు' శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి కుమారులు ఆనందమూర్తి గారు తృతీయ ముద్రణమును వెల్వరించిరి. శ్రీనాధుని కృతమేయను నిర్వచనము వివాదాస్పదమై యుండగా అట్టి ప్రచురణము సంభావ్యము కాదు. శృంగార వర్ణనము లతివేగముగ కాముక క్రీడలు వర్ణించునవిగా సంస్కృత సాహితీ సాంయాత్రికులైన మహాకవులు భాణములను, ప్రహసనములను, గీర్వాణభాషలో వ్రాసియున్నారు. అట్టి కావ్యములు దేశ భాషలలో రచింపబడక పోవుటచే, పండితులకే కాని పామరుల పాల బడకుండెను. త్రిపురాంతకుని ప్రేమాభిరామ మట్టిది. దీని పుత్రికయైన క్రీడాభిరామము దానిని బోలినదే. శ్రీ ప్రభాకరశాస్త్రి గారు వ్రాసినట్లు ఇది యొక చెడ్డ పుస్తకము. ఇట్టి గ్రంథమును సంస్కృత సాహిత్య సమరాంగణ సవ్యసాచి యగు శ్రీనాధుడాంధ్ర భాషాకృతిగా వెలయించి, దానికి వల్లభరాయని పేరిడెనట యతని ప్రౌఢ సాహిత్యమునకు, పౌరుష ప్రభావమునకు, ఆజిహ్మ స్వాతంత్రమునకు వెలిగాక మరియొండుగాదు. క్రీడాభిరామములోని శృంగార మంతయు శృంగారకవియగు త్రిపురాంతకుని కృతమేయైయుండును. ఇయ్యది ఆమూలాగ్రముగ వల్లభరాయ కృతమేయై యుండును."[19]

## శ్రీ బి. వి. సింగరాచార్యగారి యభిప్రాయము :

కొన్ని భావాలు, పద బంధాలు, పద్యపాదాలు భావవిన్యాసాలు కొన్ని పద్యాలుకూడా భిన్న కవులలో కనిపించడం మన తెలుగు కవితకు క్రొత్తకాదు. స్వతంత్ర కావ్య పద్ధతికి ఒగవడి పెట్టిన ఆంధ్రకవితాపితామహుడే శ్రీనాధాది తత్పూర్వ కవుల పదబంధాలను భావాలను పద్య విన్యాసాలను విశేషంగా మను చరిత్రలో వాడుకొన్నాడు. శ్రీనాధకవిసార్వభౌముడు కూడా తత్పూర్వ కవుల,

ముఖ్యంగా సంస్కృత కవుల, భావాలను పద బంధాలను, పద్య పాదాలను విశేషంగా వాడుకొన్నాడు. ఇది పండితులందరికీ సుపరిచితం. మరి ఇదే కారణంతో మరేసాక్ష్యం లేకుండా క్రీడాభిరామం శ్రీనాథ రచన అని నిర్ణయం చేస్తాం అనడం సాహసం. శ్రీనాథుడు తన కావ్యాలలో ఎక్కడా వాడని తత్సమ దేశ్యపదాలు, పదబంధాలు, నుడికారపు పొందుపులు, క్రీడాభిరామంలో విశేషంగా కన్పిస్తున్నాయి. ఇవి శబ్ద రత్నాకరంలోకి ఎక్కలేదు. క్రీడాభిరామ కర్తకు పూర్వులెవరూ ఈ ప్రయోగాలు చేసి వుండక పోవడమూ, బహుజనపల్లి సీతారామాచార్యులవారు ఆ నిఘంటువు సంకలనంచేసే నాటికి క్రీడాభిరామం బయట పడక పోవటమూ ఇందుకు కారణాలు. ఆ శబ్దాలను ఏరి పెట్టుకున్నాను. నిజానికి ఇది శ్రీనాథ కర్తృకం కాదనడానికి ఈ ఒక్క సాక్ష్యం చాలు."[20]

వారి యభిప్రాయము నందలి సారాంశమిది.

1. క్రీడాభిరామకర్త వల్లభామాత్యుడు. అంతకు పూర్వకవు లెవరును వాడని తెలుగు పలుకుబడులతో తన తరువాతి కవులను ప్రభావితులను చేసిన పదభావ విన్యాసాలతో అతి స్వతంత్ర పద్ధతిలో ప్రేమాభిరామ రూపకమును తెనిగించిన ప్రౌఢ కవి.

2. శ్రీనాథుని పద్య పాద భావ బంధాలు అనేకము క్రీడాభిరామములో హాస్యానుకరణ (Parody) రచనా విధానములో వచ్చిచేరినవి.

3. శ్రీనాథ కవిసార్వభౌమునికి సమకాలికుడై, ఆయన కన్న చిన్నవాడైన వల్లభరాయడు శ్రీనాథ సాహిత్య స్వభావాలకు మనోజ్ఞవ్యంగ్యానురూపచిత్రము (Caricature) గా క్రీడాభిరామ నాయకుడైన గోవిందశర్మ పాత్రను మలచినాడు.

4. శ్రీనాథ ప్రయోగాలు కావని చెప్పదగినవి పుష్కలముగా కనిపించుచున్న ఈ కావ్యము శ్రీనాథకృతమనుట పొసగని మాట.

5. క్రీడాభిరామము తెలుగు సాహిత్యములో అద్వితీయమైన విలక్షణ ప్రౌఢ శృంగార కావ్యము (పుట 521)

పైని క్రీడాభిరామ కర్తృత్వ విషయమై వివిధ పండితులు వెల్లడించిన అభిప్రాయములు తెల్పబడినవి. ఈ గ్రంథము వల్లభామాత్యకృతమే యని పలువు రంగీకరించియున్నారు. క్రీడాభిరామము వల్లభామాత్య కృతమే యను

టకు ప్రబల గ్రంథస్థ ప్రమాణమున్నది. కాని వల్లభామాత్యుడు రచింపగా శ్రీనాధుడాతని రచనమును సంస్కరించియు, స్వయముగ కొంత రచించియు, తన పద్యములను కొన్నిటినందు చేర్చియు ఆతనికి కావ్య రచనమునం దాద్యంతము మిక్కిలిగ తోడ్పడెననుట సమంజసము. ఈ క్రింది అంశములు గమనింపదగినవి.

1. క్రీడాభిరామము రూపకానువాదము. అ ప్రథమాంధ్ర రూపకానువాదము ప్రసిద్ధము కాదు. కావ్యానువాదమును చేపట్టి అందు అరితేరి ప్రసిద్ధిగాంచిన శ్రీనాధుడు రూపకానువాదమునకు స్వయముగ పూనుకొనడు సంస్కృత ప్రేమాభిరామమును తెనుగు చేయవలెనను తలంపు వల్లభామాత్యునిదే. దానికి రెండు కారణములు కలవు.

1. త్రిపురాంతకునితో ఆతనికి గల సాన్నిహిత్యము. ప్రేమాభిరామకర్త యగు త్రిపురాంతక నివాసి. త్రిపురాంతక మహాదేవర భక్తుడు. ఆతడు రచించిన త్రిపురాంత కోదాహరణములో త్రిపురాంతక దేవుడు గంధవతీ తీర వాసుదని చెప్పబడియున్నది.

ఉ. ఆఱడియాన నీరస ధరాధిప లోకము లిండ్లు వాకిటన్
దూఱుట మాని శ్రీనగము తూరుపు వాకిలిఁజొచ్చి పాపముల్
నీఱుగఁజేసి గంధవతి నీటను గ్రుంకి మనంబులోని చి
చ్చాఱగఁజేయుటొప్పు త్రిపురాంతక దేవునకై నమస్కృతుల్.

'త్రిపురాంతకములోని క్రీ. శ. 1252 – 1253 సంవత్సరము నందలి కాకతి గణపతి దేవుని శాసనములో త్రిపురాంతక దేవర గంధవతీసలిల క్రీడా రసికుడని చెప్పబడినది. త్రిపురాంతకమునకు తూర్పున ప్రవహించు గుండేఱు లేక గుండ్లేఱు గంధవతీ నామముతో వెలయు చుండును." 21

వల్లభామాత్యుని తండ్రి పేరు త్రిపురారి. ఇతడును త్రిపురాంతక మహాదేవర పాద భక్తుడు. వినుకొండ దుర్గాధ్యక్షుడు. ఇతడిట్లు కీర్తింపబడెను.

ఉ. గంధవతీ ప్రతీర పుర ఘస్మర పాదబిస ప్రసూన పు
ష్పంధయ చక్రవర్తి, శ్రుత పర్వత దుర్గ మహాప్రధాన రా
ద్గంధ గజంబు తిప్పన......(20 క్రీడా)

త్రిపురాంతక కవి వల్లభామాత్యుని తండ్రియగు త్రిపురారి కాలము నాటికి మదన విజయము, అంబికా శతకము ప్రేమాభిరామము మున్నగు కృతులురచించి ప్రసిద్ధుడైయుండును. స్వయముగ కవియైన వల్లభునికి తిప్పన కవీంద్రునిపై అభిమాన మేర్పడి యుండును. ఆ అభిమానమున అతడు ప్రేమాభిరామమును తెనుగు చేయుటకు పూనుకొని యుండును. వల్లభామాత్యుడు అధికారము నెఱపిన మోపూరు భైరవస్వామి వెలసిన క్షేత్రము. అట ఏటేట ఉత్సవములు జరుగు చుండెడివి. అందు పెక్కు నాటకములు ప్రయోగింపబడెడివి. రసికుడును, ఉత్సాహవంతుడును, కవిత్వము చెప్పగలవాడును నైన వల్లభుడు, అట్టి ఉత్సవములలో ప్రదర్శింప జేయుటకై క్రీడాభిరామ రచనమునకు పూనుకొని యుండును.

2. ఇందలి శైలి శ్రీనాధుని శయ్యా సౌభాగ్యమును వుణికి పుచ్చుకొన్నది. శ్రీనాధుని అనుకరింపబూనిన వల్లభామాత్యుడే ఈ గ్రంథము నాద్యంతమిట్లు రచించెననుట పొసగదు. ఏలన అనుకరణమున మూల కవిత్వపు ఛాయ గోచరింప గలదే కాని, అది యధాతథముగనట్లే యుండదు ఇంకను కవి ఒకానొక సందర్భము నందైనను తన స్వాతంత్ర్యమును ప్రకటించును. శ్రీనాధుని శయ్యా సౌభాగ్యము సులభముగ మఱియొకనికి అబ్బునటువంటిదికాదు. కావున క్రీడాభిరామ రచనలో ప్రత్యక్షముగను, పరోక్షముగను కూడ శ్రీనాధుని ప్రవేశమున్నది. ఇందు శ్రీనాధుడు కవికి స్వయముగ రచించి ఇచ్చిన పద్యములు కొన్ని, చేర్చిన పద్యములు కొన్ని, వల్లభామాత్యుడు రచింపగా వ్రాసినట్లే యుంచి సరిదిద్దినవి కొన్ని-ఇట్టి వాని యందే శ్రీనాధుని కవితా ముద్ర కొంత లోపించిన లోపించి యుండును.

3. క్రీడాభిరామము ఆంధ్రము నందలి ఇతర కావ్యములకంటె విలక్షణమైనది. ఇందు పెక్కు చాటువులు వచ్చి చేరినవి. మఱికొన్ని చాటువులవలె లోకమున వ్యాప్తములైనవి. ఈ కావ్యమున కనవచ్చు కొన్ని ప్రత్యేక పదబంధముల కిదియు నొక కారణమై యుండును. ఇందు కథతో సంబంధములేని పద్యములు కూడ కానవచ్చును.

4. వల్లభామాత్యుడు కవిగా ఇంతకు మున్ను కొన్ని చాటువులను మాత్రము చెప్పెను. గ్రంథ రచనకాతని కిదియే మొదలు. ఇంకను ఆతని వంశమునందితడే ప్రథమ కవి. ఈ కవిత్వము అతనికి వంశ పారంపర్య లబ్ధము కాదు. కావుననే

తాను రచించిన క్రీడాభిరామమును చిత్తగింప వలసినదిగా శ్రీనాథుని కర ముల కందించినాడు. అంత దానిని శ్రీనాథుడు సంపూర్ణ స్వాతంత్ర్యముతో తీర్చి దిద్ది సమగ్ర రూపమును కల్పించి యిచ్చెను. అసంఖ్యాకములగు చాటువులను చెప్పిన శ్రీనాథున కిది యొక లెక్కలోనిది కాదు. కావుననే అతడు ఆశుధారగా పెక్కు పద్యములనుచెప్పి ఇందు చేర్చెను. శ్రీనాథుడు ఆశించినది వల్లభా మాత్యుని సాయమే కాని రూపక కర్తృత్వము కాదు. అతడు ఏతత్కృతికి వల్లభామాత్యునే కర్తగా నిర్ణయించెను.

క్రీడాభిరామము నందలి శ్రీనాథ కవిత :

1. క్రీడాభిరామము నందలి కృత్యాద్యంత పద్యములు శ్రీనాథకృతములే యని శ్రీ ప్రభాకరశాస్త్రి గారితోపాటు శ్రీ బండారు తమ్మయ్య గారు, శ్రీ చిలు కూరి పాపయ్యశాస్త్రి గారు (వీరి మతమున క్రీడాభిరామము నందలి మొదటి పద్యము వల్లభామాత్యునిది. ఆటుపై 32వ పద్యము తుదవరకు గల వల్లభా మాత్యుని వంశవర్ణనాత్మక విషయమంతయు శ్రీనాథ విరచితము. ఇటులనే భరత వాక్యమనదగిన 'ముదమున నుల్కినాటి పుర మోహనశైల" ఇత్యాది పద్యము రచించినది శ్రీనాథుడే) అంగీకరించిరి. కాని వీరి అభిప్రాయమును చేకుమళ్ళ అచ్యుతరావు గారిట్లు విమర్శించిరి.

"వల్లభామాత్యుడే యీ గ్రంథమును వ్రాసిన ఎడల నిట్లు తన్ను దా బొగడికొని యుండునా యని యాక్షేపింపబడినది. ఈ యాక్షేపణకు రెండు సమాధానములు 1. ఈ గ్రంథము వీథి నాటకముగా నుండునట్లు వ్రాయబడినది. క్రియా ఫలితములో ప్రత్యేకనాటకము కాక ప్రత్యేక ప్రబంధము కాక యుభయ లక్షణ మిశ్రితమైన యొక సంకర గ్రంథమైనను, ఆంధ్ర భాష యందలి నాటక రచనములలో నిదియే కేవలము ప్రథమ ప్రయత్నముగాన అందలి నాటకలక్షణ లోపములు తద్వస్తు నిర్దేశమునకు గొఱంత కలిగింప గూడదు. కాన కృతికర్త స్తవము నాటక ప్రస్తావనయందు సూత్రధారుడు చెప్పినటులుగా నూహింపవలసి యున్నది. సూత్రధారుని ద్వారా యెంతెంత విపులముగాను, విపరీతముగాను నాటక కర్తలు తమ్ము తాము గొండాడుకొని యుండిరో మన సంస్కృతనాటక ముల జదివిన దెల్లమగును. ఈ వల్లభరాయని కాలముతోనే యోగానంద ప్రహసనకర్తయగు అరుణగిరి నాథుడు తన్నుదానెంత పొగడుకొనెనోచూడుడు.

కాబట్టి యాత్మ స్తవ మనుచితమని కర్తృత్వము వల్లభామాత్యుని నుండి తప్పించుట యసంగతము.

"వల్లభామాత్యుడే యీ గ్రంథమును రచించి యుండని యెడల సూత్రధారు డతని కవితాస్వారస్యమును, భాషా వైదుష్యమును గుఱించి కడుంగడు నుత్ప్రేక్షించి సంస్తవించుట యసందర్భముగాను, ననమంజసముగాను నుండును ఈ గ్రంథమును వల్లభామాత్యుడే ప్రత్యేకముగా రచించెనని విస్పష్టముగా సూత్రధారుడు ప్రేక్షకులకు చెప్పుచున్నాడు. కనుక ఈతని కవిత్వమును గుఱించియు, వాక్ప్రౌఢిమను గుఱించియు సవిశేషముగ నుగ్గడింప వలసి వచ్చినది. ఇట్టి ముఖ్య విషయమును శ్రీ ప్రభాకరశాస్త్రి గారు పరిసించిరని తెల్పుటకు విచారముగా నున్నది.

ఇట్లే భరత వాక్యమును గుఱించి,

"ఈ వీథి నాటకమునకు భరతవాక్యమని చెప్పదగిన కృత్యంత పద్యములో 'మోపూరి భైరవస్వామి యీ కవీంద్ర కాంక్షిత త్రిదశమహీరుహమైన వల్లభరాయని బ్రోచు గాత'మని చెప్పబడినది. ఈ పద్యమును వల్లభరాయడే వ్రాసిన యెడల తమ్ముకొని తానే శతాయువనుకొన్నట్లుండునని శ్రీ ప్రభాకర శాస్త్రి గారాక్షేపించిరి. అయితే వల్లభరాయ డా పద్యమును వ్రాయని యెడల శ్రీనాధుడు వ్రాసెనని చెప్పుటకు హేతువున్నదాయని విచారింప దగినది. ఏ నాటకమందైనను భరత వాక్యమందు కృతిభర్తను గుఱించి వ్రాయుట శాస్త్ర సమ్మతము గాని, సంప్రదాయ ప్రసిద్ధముగాని యై యుండెనా యను విషయమును గుఱించి యాలోచించుటకు శ్రీ శాస్త్రిగారే ముఖ్యార్హులు. ఈ విషయమును గుఱించి నే ననేక పండితుల యభిప్రాయములను గనుగొంటిని. ఎవ్వరైనను ఇది శాస్త్ర సమ్మతము గాదనియు ఆచరణలోనైనను లేదనియు జెప్పినవారే. అట్లయినచో మహాపండితుడగు శ్రీనాధుడీ యశాస్త్రీయమైన వ్రాత వ్రాసి యుండెనా యని సంశయింప వలసి యున్నది. అశాస్త్రీయమైన పని చేయుటకు శ్రీనాధుడు తగి యుండెనా, వల్లభరాయడు తగియుండెనా యను విషయము పండితులచే చర్చనీయము."[22]

శ్రీ అచ్యుతరావు గారు నడిపినట్లు వీధి నాటక లక్షణములను ప్రబంధ లక్షణములను రెంటిని సంతరించుకొనిన క్రీడాభిరామమున సూత్రధారోక్తిగా కృతికర్త ప్రశంస యుండుట యుచితమే కాని ఈ కావ్యమునకు సూత్రధార

పదవిని శ్రీనాథుడే నిర్వహించెను. అతడు వల్లభుడు రచించిన కావ్య భాగమును చూచెను. కవిని గూర్చి ప్రశంసాపూర్వకములగు పద్యములతో కూడిన కృత్యాదిని తాను రచించెను. భరత వాక్యమున కృతిభర్తను గుణించి వ్రాయుట శాస్త్ర సమ్మతము కాదని వారు తెల్పిరి. ఈ కావ్యమునకు కృతి భర్త యను వారెవ్వరును లేరు. శ్రీనాథుడు వల్లభరాయనికే కృతి కర్తృత్వము నారోపించెను. అంతే. కృత్యాది కృత్యంత పద్యములు శ్రీనాథ కృతములనుటకు సందేహింప బని లేదు.

2. శ్రీనాథుడు నూనూగు మీసాల నూత్నయౌవనమున శాలివాహన గాథా సప్తశతిని అనువదించినట్లు చెప్పుకొనెను. ఈ గాథలు ప్రాకృతమున హాలునిచే రచింపబడెను. ఈ అను వాదము నష్టమైనది. మూలప్రాకృతమున గ్రంథము సవ్యాఖ్యానము లభించుచున్నది. క్రీడాభిరామము నందుగల ఈ క్రింది పద్యములు గాథాసప్తశతి యందలి గాథలకు అనువాదములై యొప్పుచున్నవి. వాని ప్రాకృత మూలము సంస్కృతచ్ఛాయ, అనువాదము ఇట్లున్నవి.

1. మూల గాథ

విక్కిణఇ మాహమాస మ్మి తామరో పా ఇడింప ఇవేణ
ణిద్ధూమ ముమ్మురవ్విఅ సామలి యథణో పిడిచ్ఛన్తో.

ఛాయ

విక్రీణీతే మాఘ మాసే పామరః ప్రాకరణం బలీవర్దేన
నిర్ధూమముర్మురనిభౌ శ్యామల్యాః స్తనౌ పశ్యన్ (3-38)

మాఘ మాసంబు పులి వలె మలయు చుండ
బచ్చడం బమ్మ కొన్నాడు పసరమునకు
ముదిత చన్నులు పొగలేని మురుమరములు
చలికి నోరగోయ కేలుండు పెరికుండు ? (క్రీడా. 262)

2. మూల గాథ

ఝుంఝుూవా ఉత్తణి ఏ – ఘరమ్మి రో ఊణ ణీ సహాణి సణ్ణమ్
దావే ఇవగ ఆవఇఅం – విజ్జుజ్జో ఓ జలహరాణం

ఛాయ :

ఝంఝా వాతోత్తృణితే – గృహేరుదిత్వా నిస్పృహ నిషణ్ణామ్

దర్శయ తీవ గతపతికాం - విద్యుదుద్ద్యోతో జలధరాణామ్ (4-15)

అను.

పటు ఝంఝా పవనోత్తృణాలయములో భద్రంబునం బట్టి కం
కటిపై ముచ్చు ముడింగి నిర్భర వియోగ గ్లాని శోషించి యె
క్కటి నిద్రించుచున్న పాంథ వనితన్ గర్జావచః ప్రౌఢిమన్
తటిదుద్యోతము చూపు నట్టనడురే ధారాధర శ్రేణికిన్ (క్రీ. 60)

ఇందు శ్రీనాథుని అనువాద పద్ధతి ద్యోతకమగుచున్నది. "మూలమున నిర్ధూమముర్మర నిభౌ శ్యామల్యాః స్తనౌ పశ్యన్' అని యున్న దానికి ''ముదిత చన్నులు పొగలేని ముర్మురములు, చలికి నారగోయ కేలుండు పైరికుండు" అనునది శ్రీనాథుని స్వేచ్ఛానువాదము. రెండవ దానిలో 'రుదిత్వా, నిస్సహాని షణ్ణామ్' అను పదములను 'భద్రంబునం బట్టి కంకటిపై ముచ్చుముడింగి నిర్భర వియోగ గ్లాని శోషించి యెక్కటి నిద్రించుచున్న' అనునది శ్రీనాథుని విపులీకరణము. సప్తశతి ననువదించెనను విషయము ప్రఖ్యాతము. కనుక క్రీడాభిరామము నందలి పై రెండు పద్యములు శ్రీనాథునివే.

శ్రీనాథుడు 'పలనాటి వీర చరిత్ర' ను ద్విపద ప్రబంధముగా రచించెను. క్రీడాభిరామమున ద్విపద పలనాటి వీరగాథ ప్రశంస గలదు. ఈ క్రింది పద్యమున

మ. ద్రుత తాళంబున వీర గుంఫితక ధుం ధుం కిటాత్కార సం
గతి వాయింపుచు, నాంతరాళిక యతి గ్రామాభిరామంబుగా
యతి గూడన్ ద్విపద ప్రబంధమున వీరానీకముం బాడెనొ
క్కతె ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబునం దూలగన్
(116)

అట్టి అభినయమే కాక తత్కథా విశేషము కూడ మిక్కుటముగకలదు. శ్రీనాథుడు తనకు ఆ గాథ యందుగల ఆదరమున దానినిట చేర్చి యుండును,

8. శ్రీ బి. వి. సింగరాచార్యగారు, క్రీడాభిరామము నందుగల కొన్ని విశిష్ట పదములను సేకరించి అవి శ్రీనాథుని ఇతర గ్రంథము లందెచటను కానరా వనియు, క్రీడాభిరామము, శ్రీనాథ కర్తృకము కాదనుట కిది యొక ప్రబల సాక్ష్యమనియు నుడివియున్నారు ఆ పదములివి. ములికినాడు (11-102) నంది

(45) రై రాజు (17) మాచకమ్మ (214) జఱిగొన్న (42) లుంగ (42) ఇరుచంబడు (45) తోపురెంటము (46) ద్రమాగిలి (51) వఁతీరు (52) ధర్మ దార (54) తేపాడి (54) త్రస్తరించు (62) పదనిచ్చి (68) కటకాయడు (61) పటితాళించు (65) సజ్జికము (80) నిర్యాసము (81) అప్పసము (86) నోవు (88) దిచ్చరించు (95) బలితము (101) విజ్జోడుపడు (101) మొర వంక(101)గనప (112)ఆలువరి (115) జనపవెద్దలు (112) త్రిక్కటి(225) గవడవేరు(128) పుట్టబ్రాప (129) జనంగము (131)రంపిల్లు(147) బాడుశేడు (159) బరిపోతు ( 68) ఎఱుంగవయ్యేదవె (180) పుల్లసిలిన (208) నల్ల (226) ఆస్కందము (281) రోవట్టు (24) పైరికుడు (262) దొరసెము (288) సాధారణముగా కవి అనువాడు కావ్యమునందలి సందర్భమునకు అనుకూలమగు పదజాలమును ప్రయోగించునే కాని తనకు తెలిసిన పదముల నన్నింటిని సందర్భహీనముగా చొప్పించడు. పై నుదాహరించిన పదములలో 'ములికినాడు' ఇత్యాదులు శ్రీనాధుడు ఇతర గ్రంథములందు ప్రయోగించుటకు అవకాశము లేక పోయి యుండవచ్చును. మఱియు శ్రీనాధుడు తన గ్రంథములలో వాడినపదములు పెక్కు క్రీడాభిరామముననే కాక యితరకవుల గ్రంథములందును కనవచ్చుచున్నవి కదా ? అంత మాత్రముచే ఆ గ్రంథము లన్నియు తత్కృతములేయనుట యుక్తముగా నుండునా ? అందుచే పై పదములను శ్రీనాధుడితర గ్రంథములందు వాడి యుండమియే యాతనికి క్రీడాభిరామముతో సంబంధము లేదనుటకు ప్రబల కారణము గాజాలదు.

క్రీడాభిరామమున శ్రీనాధుని పదములే కాక పద్య భావ సామ్యములు కూడ పెక్కు కనవచ్చును.

తే. గార్గ్య సిద్ధాంత మత ముషః కాల కలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు
వ్యాస మతము మనః ప్రసాదాతిశయము
విప్రజన వాక్య మరయంగ విష్ణు మతము [16]

తే. గార్గ్య సిద్ధాంత మత ముషః కాల కలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు
విప్రజన వాక్య మరయంగ విష్ణు మతము
సర్వ సిద్ధాంత మభిజిత్తు సమ్మతంబు.

అని భీమఖండమున వ్యాసాదిమహర్షుల దక్షిణ కాశీనగర ప్రవేశ సందర్భమున శుభ మహూర్తములను గూర్చి చెప్పిన పద్యమునందలి మూడు పాదములు క్రీడాభిరామమున చేరినవి. ఇట్లు శ్రీనాథుని పద్యమే కొలది మార్పులతో క్రీడాభిరామమున ప్రయుక్తమయ్యెను ఇట దానిని ప్రయోగించిన సందర్భము వేరుగానున్నది. భీమఖండమున పుర ప్రవేశమును గావింపదలచినది వ్యాసాది మహర్షులు; ఇట ధూర్తవిటులు. అచట దక్షిణకాశి, భీమేశ్వరస్వామి దర్శనము లక్ష్యములు. ఇట లక్ష్యము వేశ్యా సంగమము. అందుచే వల్లభరాయడు శ్రీనాథుని పై పద్యమును వ్యంగ్యానుకరణముగా రచించి యుండుననియు అంతటి పవిత్ర సన్నివేశమున చెప్పిన పద్యమును శ్రీనాథు డిటువంటిసందర్భమున మరల వాడి పరిహాస భాజనము గావించు నని తలంచుట భావ్యము కాదనియు సింగరాచార్య గారి యభిప్రాయము.'[28]

ఇట శ్రీనాథుడు ప్రధానముగా ప్రస్తావింప దలచినది శుభముహూర్తము లను గుఱించి కావున ఇట్టి సందర్భమునకు తగియున్న భీమఖండము నందలి పూర్వోక్త పద్యమును ఇట ప్రవేశపెట్టుటలో నాశ్చర్యము లేదు. అట్లే 'అచ్చ వెన్నెల చాయ సవఘళింపగఁజాలు సిద్దంపు వెలిపట్టు చేల గట్టి' అనునది శృంగార నైషధమున సరస్వతీదేవి నలునికి చింతామణీ మంత్రముపదేశించి ఆ మంత్ర సిద్ధుడు తన్ను తలచుకొన్నప్పుడు తా నతని కేవిధముగా దర్శన మిచ్చునో వివరించు ఘట్టములోనిది. ఈ పవిత్ర వర్ణనము అక్కల ఆరాధనలో నాట్య మొనరించు ఒక బాలికను గూర్చి

'సిద్దంపు వెలిపట్టు చేల తూలిన యప్డు
తొడల మించులు వెలి దొంగలింప' [187]

అని అసభ్యముగ వర్ణించు పట్ల కనిపించుచున్నది.

గన్నేరు పూఁజాయ గను పట్టు జిలుగైన
సలిల కాషాయ వస్త్రంబు గట్టి శృం.నై. (8. 118)

అను పూజాగృహమునకు వెడలు నిషధేశుని వర్ణన వేశ్యాసంగమార్థియై వెడలు గోవింద శర్మను

గన్నేరు బూఁజాయ కరనొప్పు నీర్కావి
మడుగు దోవతి పింజె విడిచి కట్టి (ప. 42)

అని వర్ణించు చోట గోచరించు చున్నది.

గొజ్జంగి పూసీరు కులికి మేదించిన
గంగమట్టి లలాటకమునఁ దీర్చి

అని కాశీఖండమున (3-119) లో విష్ణు సారూప్య మొందిన భక్తుని వర్ణన లోని పాదము,

'గొజ్జంగి పూసీరు కులికి మేదించిన
కమ్మ కస్తురి మేనఁగలయ నలది'

అని పై గోవింద శర్మను వర్ణించు చోటనే ప్రయోగింపబడినది. అట్లే

కసటువోఁ దెలినీటఁగడిగి యీటార్చిన
సలిల కాషాయ వల్కలము గట్టి (హర.వి. 7. 111)

అని అర్జునుడుమాధ్యాహ్నిక శివార్చనకై సన్నద్ధ దగుచున్న సందర్భములోని పదబంధములు

కసటు వోవగఁ దోమి కడిగి బోరగిలంగఁ
బెట్టిన తామ్రపు బిందె వోలె' (80)

అని సుసర భేత్తను మందు వాడిన వెంటనే తరుణీ మర్మాంగ శోభను వెల్లడించుటకు వాడబడినది. ఇట్లు శ్రీనాధుడు ఉత్తమమగు స్థానములలో వాడిన పద బంధాలను తద్వ్యతిరేక సందర్భములలో వల్లభుడు వాడె"నని శ్రీ సింగరాచార్య గారు వ్రాసి యుండిరి. [24]

ఈ వాదము నిలువదు. ఆంధ్ర వాఙ్మయమున సమకాలిక కవిని భక్తి పూర్వకముగ అనుకరించి అతనిపై గల గౌరవభావమును వెల్లడించుకొను ఆచారమే తప్ప హాస్యానుగతముగ వ్యంగ్యముగ అనుకరించు సంప్రదాయము లేదు. ఆనాటి కవులలో హాస్య దృష్టియే ఎక్కువగా లేదని చెప్పవచ్చును. శ్రీనాధుడు ఉదాత్తములయిన పూర్వోక్త పద్య భాగముల నిందు చొప్పించె ననుటకు మరియే కారణమును లేదు. ఈ గ్రంథ స్వభావమే అట్టిది. శ్రీనాధుడు

రచించిన ఇతర కావ్యము లన్నియు నుదాత్తములై ఒప్పుచున్నవి. ఇక క్రీడాభి రామ మనుదాత్త కావ్యమే అయినను దానికి తోడ్పడుచున్న శ్రీనాథుడు అందలి సందర్భములకు తగినట్లు పై పద్య భాగములను కూర్చి యుండును.

శ్రీనాథుని ఇతర గ్రంథములలోని పద బంధములను ఈ కావ్యమున కన వచ్చునట్టి వానిని శ్రీ వేటూరి వారు సమగ్రముగ ఉదాహరించి యున్నారు.[25]

శా. ప్రాలేయాహిత సంప్రదీప్త కిరణ ప్రక్రీడ దర్కోపల
జ్వాలాజాల జటాల జాంగల తటీ వాచాల కోయష్టియై. (హర.7-100)

శా. ప్రాలెన్ దిక్కులు భాను భావ్యతికర ప్రక్రీడ దర్కోపల
జ్వాలా జాల జటాల జాంగల తటీ వాచాలకోయష్టులై (క్రీ. 153)

శ్రీనాథుడు 'పాణింధమం' అను పదమును పెక్కు మార్లుపయోగించును.

1. కల మధుర వీణాక్వాణపాణింధమంబై భీ.ఖం, 2. 110
2. గంధసార తుషార పాణింధమంబు ,, 1. 58
3. ప్రవాహధారా గంధ పాణింధమంబైన కా.ఖం. 2. 44
4. నీహార క్షీరధారా శ్రేణీ పాణింధమంబైన ,, 3. 113
5. నిశ్వాసాగ్ని పాణింధ మంబేలా శృం.నై 2. 32
6. కోదండ నారాచ ధారా పాణింధమంబు ,, 8. 57

క్రీడాభిరామమున కూడ వీణాక్వాణ పాణింధమంబైన — (100) అను ప్రయోగము కలదు.

శ్రీనాథునికి వ్యామగ్రాహ్యపయోధర అను సమాస ప్రయోగమున ప్రీతి మెండు.

1. వ్యామగ్రాహ్య కుచంబులంటి యిదెనా ప్రాణంబు రక్షింపెదన్. (శి.మా. 3—87)
2. వ్యామ గ్రాహ్యపయోధరల్ హ.వి. 5. 23
3. వ్యామ గ్రాహ్యస్తనులగు భామలు శృం.నై. 8. 93
4. వ్యామగ్రాహ్య నితంబబింబ కుచహారాభీల భద్రాకృతుల్ క్రీ.రా.209

కోయిలలు కొసరి కూయుట శ్రీనాథునకు కడు నింపు గూర్చు వర్ణనము.

1. కోకిలము పంచమ శ్రుతి గొసరినట్లు క్రీ.రా. 101
2. కొసరి వసంత కాలమున కోయిల క్రోల్చినభంగి. కా.ఖం.5. 177

3. కొసరెను దుద్యాన పుంస్కోకిలములు   హ.వి. 7. 135

4. కోయిల పంచమ స్వరము క్రోల్చినభంగి   క్రీ.రా. 177

5. కోకిలం బెప్డు కూయునో కొసరియనుచు.   శృం.నై.4. 20

క్రీడాభిరామము నందలి ఈ క్రింది పద్యములలో స్పష్టమగు శ్రీనాథ కవితా శైలి ద్యోతక మగుచున్నది.

శా. పంచారించిన నీ పయోధరము లాస్ఫాలింతునో లేత బొ
మ్మంచుం గెంజిగురాకు మోవి జిసి ధాత్వర్థం బనుష్ఠింతునో
పంచాస్త్రోపనిష ద్రహస్య పరమ బ్రహ్మ స్వరూపంబు నీ
కాంచీదామ పదంబు ముట్టుదునో యోకర్ణాట తాటంకినీ. (క్రీ - 90)

జిసిధాత్వర్థ పద ప్రయోగమున శ్రీనాథునికి అభిరుచి మెండు. ఈత డీ పదమును నైషధమున "జిసిధాత్వర్థమను గ్రహింపగదవే నీరేజపత్రేక్షణా" అని వాడియున్నాడు.

సారాంశ మేమనగా క్రీడాభిరామమును వినుకొండ వల్లభామాత్యుడు వ్రాయ సంకల్పించి దానినొక రీతిలో వ్రాసి యుండగా శ్రీనాథుడు దానియందలి ప్రతి పదమును పద్యమును తీర్చిదిద్దుటయే కాక దాని కొక సమగ్ర రూపమును కల్పించి సంస్కరించెను. ఇందలి వస్తువు అల్పమైన దయ్యును శ్రీనాథుని ప్రవేశముచే మహనీయ కావ్యత్వమును సంతరించుకొని చిరకీర్తిని బడయుచున్నది. శ్రీకృష్ణదేవరాయాదులు ఈ గ్రంథమును చక్కగా చదువుకొని ఇందలి మేలి పలుకుబళ్ళను తమ గ్రంథములలో సమకూర్చుకొనిరి.

క్రీడాభిరామము నందు తెలుగు భాష ఉన్నతిని తెల్పుచున్న ఈ క్రింది పద్యమును

ఆ. జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశ భాషలందుఁ దెనుగు లెస్స
జగతిఁ దల్లి కంటె సౌభాగ్య సంపద
మెచ్చుటాడు బిడ్డ మేలుగాదె   (87)

కృష్ణదేవరాయలు అముక్త మాల్యదలో

ఎల్లనృపులు గొలువ నెఱుగవే బాసాడి
దేశ భాషలందు తెలుఁగు లెస్స   (1—14)

అని అనుకరించెను.

ఇక ముద్దరాజు రామన్న (క్రీ.శ. 1580 - 1660) కాకునూరి అప్పకవి (క్రీ.శ. 1656), గణపవరపు వేంకటకవి (క్రీ.శ. 1676), కూచిమంచి తిమ్మకవి (క్రీ.శ. 1676) మొదలైన లాక్షణికులకు క్రీడాభిరామము నందలి పెక్కు పద్యములు లక్ష్యములై యుప్పినవి.

## క్రీడాభిరామ వైలక్షణ్యము

ఆంధ్ర సాహిత్యమున క్రీడాభిరామమను నీ కావ్యమొక ప్రత్యేక స్థానము నాక్రమించు చున్నది. అనుదాత్త వస్తుకమయ్యును ఇందలి మహోన్నత కావ్యత్వము అజరామరమై నిల్చునట్టిది. ఇక ఈ క్రింది రెండు అంశములును ఈ కావ్యము యొక్క వైలక్షణ్యమును తెల్పుచున్నవి.

1. క్రీడాభిరామము సంస్కృత రూపకమునకు శ్రవ్య రూపమగు అనుకరణమే అయ్యును అది మూల వీథి నాటక లక్షణములను కూడ సంతరించుకొని ఆంధ్ర రూపక పరిణామ క్రమమునందలి ప్రప్రథమ దశను నిరూపించుచున్నది.

2. ఇందు సమకాలిక సాంఘిక ప్రజాజీవితము కనులకు కట్టునట్లుగా చిత్రింపబడినది.

### క్రీడాభిరామము నందలి కథ :

కాసల్నాటి ద్విజశ్రేష్ఠుడగు గోవింద మంచన శర్మ, ఏకశిలా నగరము నందార్య వాటమున వసించు కామమంజరి యను పునర్భువు నందు బద్ధానురాగుండై యుండి కార్యాంతర వ్యాసంగంబున దేశాంతరము వెడలి ఆమెకు విరహ వ్యథను కలిగించెను. ఆ సంచారమున గోవింద మంచన శర్మ టిట్టిభ సెట్టి యను వైశ్య యువకునితో కలిసి తిరిగి ఓరుగల్లు పుర ప్రవేశము గావించెను. ప్రత్యూష సమయమున పురమున కేతెంచిన వారిరువురును నగరము నందలి పెక్కు వింతలను, వినోదములను, విశేషములను కాంచుచు రాత్రికి గంతవ్యమును చేరి అట కామోత్సవమునకు కడంగిరి. ఏకశిలా నగర వాసియైన మంచన శర్మ, తన మిత్రుడగు టిట్టిభ సెట్టికి ఆ పురము నందు వారు చూచిన విశేషములను గూర్చి వివరించి చెప్పుట ఇందలి ప్రధాన కథ. ఇందు ప్రసక్తానుప్రసక్తముగ ఓరుగంటిలోని ప్రజా జీవితమును గూర్చి కూడ తెలుపబడినది.

## క్రీడాభిరామము - నామౌచిత్యము

మూలనామము ప్రేమాభిరామము. ప్రేమాభిరామమనగా ప్రేమచే మనోహరమై యొప్పు గ్రంథము. 'ప్రేమ' యను శబ్దము ఉదాత్తమగు నర్థమునందుపయోగింపబడును. కాని ఈ వీథి యందు అభివర్ణితములైనవి కాముక కాముకీ శృంగార చేష్టలు. ఇట్టి ధూర్త ప్రకృతికములగు చేష్టలు 'ప్రేమ' యను పదమున కర్థములు కావు. క్రీడ యనగా విహారము. స్వైర వర్తనులగు కాముకీ కాముకులు గావించు విలాస చేష్టలను 'క్రీడ' లనుట యుచితము. వారి మనఃస్థితికిని, యౌవనాదులకును అనురూపములగు ఈ క్రీడలు సరసులకు అభిరామములై యుండును. కావుననే కర్త దీనికి క్రీడాభిరామమను నామమిడెను.

శ్రవ్యకావ్య సరణి :

క్రీడాభిరామము సంస్కృత రూపకమును ప్రబోధ చంద్రోదయాదుల వలె ప్రబంధ రూపమున అనుసరించు చున్నది. కాని ఇందు నాటక లక్షణములు కూడ గోచరించు చుండుటను బట్టి ఇది యొక విధముగా దృశ్య కావ్య లక్షణములను సంతరించుకొన్న శ్రవ్య కావ్యమని చెప్పవచ్చును.

క్రీడాభిరామ కర్త ఏతత్కావ్యమును వీథి నాటకమనియే వ్యవహరించి యున్నాడు. ఈ కావ్యము

తే. 'గణన కెక్కిన దశ రూపకముల యందు
వీథి రస భావ భావనా వీథి లెస్స'

అని రూపక భేదమగు వీథి ప్రశంసతో నారంభమగు చున్నది. తరువాత మూల నాటక ప్రశంసను గావించు సందర్భమున

తే. అతడెంతటి వాడు? ప్రేమాభిరామ
మనగ నెంతటి యది? దాని ననుసరించి
వీథి యను రూపకము మది వెఱపు లేక
తిప్పవిభు వల్లభుండెట్లు తెనుగు చేసె? (84)

అనుచు తిప్పవిభు వల్లభుండు వీధి రూపకమును తెనుగున రచించినట్లు చెప్ప బడినది. ఇక ఆశ్వాసాంత గద్య యందు కూడ ఇది వీథి నాటకముగానే పేర్కొన బడినది. "వల్లభరాయ ప్రణీతంబైన క్రీడాభిరామంబును వీథి నాటకంబున

సర్వంబు నేకాశ్వాసము" అని వ్రాయ బడినది. ఇచట నాటకము, ఆశ్వాసము అను శబ్దములకు వైరుద్ధ్యము కన్పట్టును. ఇచట నున్న ఆశ్వాసము అను పదము అంకమనుటకు బదులుగా వ్రాయబడి యుండును. లేదా ఈ కావ్యము నందు గోచరించు శ్రవ్య కావ్యసరణి ఇట్లు వ్రాయుటకు దోహదము కావించియుండును. ఏమైనను కృతి కర్త మాత్రము దీనిని నాటకముగనే పరిగణించెను. పైగా ప్రయుక్తమైనట్లు కూడ

క. నటులది దోర సముద్రము
విటులది యోర్గల్లు కవిది వినుకొండ మహా
పుట భేదన మీ త్రితయము
నిటఁగూర్చెను బ్రహ్మరసికు లెల్లను మెచ్చన్

అని భరతోక్తిగా చెప్పబడిన పద్యము వలన తెలియ వచ్చును. దోరసముద్రము నుండి, మోపూరు భైరవుని తిరునాళ్లలో ఏదైన ఒక నాటకము ప్రదర్శించుటకు నటులేతెంచి యుందురు. వారిచే వల్లభుడును శ్రీనాథుడును ఈ వీధిని ఆడించి యుందురు.[26] ఆనాడు ఆంధ్రమున నాటక రచనము చేయు నాచారము లేదు. క్రీడాభిరామమునకు మున్ను మంచన విద్ధసాలభంజికను కేయూరబాహు చరిత్ర మను పేర ఆంధ్రమున అనుసరించెను. కాని అతడందు మిక్కిలి స్వాతంత్ర్యముతో పలుమార్పులు గావించి దానిని ప్రబంధ రూపము నొందించెను. కావుననే క్రీడాభిరామము నందు కూడ నాటక లక్షణములైన ఉక్తిప్రత్యుక్తులు, ఆకాశ భాషితాదులు మున్నగునవి కవి వచనములతో ననుసంధింపబడి చంపూ కావ్య పద్ధతిని సంతరించకొన్నవి. నటులు దీనిని ప్రదర్శించినపు డిది నాటకమువలె నుండి యున్నను, ఆ నాటకము గ్రంథస్థమగు సరికి శ్రవ్య కావ్యసరణి దాల్చినది.

క్రీడాభిరామము నందు శ్రవ్య కావ్య సరణి స్పష్టముగ గోచరించును. ఇది కావ్యములకు సాధారణమగు కృతికర్త వంశావతార వర్ణనముతో కూడిన కృత్యవతరణికతో నారంభమైనది. ఇందలి ప్రస్తావనను సూత్రధారు డొక్కడే నిర్వహించును. ఇక మంచన పాత్ర ప్రవేశము

సీ. గన్నేరుఁ బూఁజాయ కరమొప్ప సిరాకువి
మడుగు దోవతి పింజె విడిచి కట్టి

గొజ్జంగి పూనీరు గులికి మేదించిన
గంగమట్టి లలాటకమునఁ దీర్చి...

అని ప్రబంధానుగుణముగ చెప్పబడినది.

ఇక వచనములు "అని పరిక్రమించి, వెలిపాలెంబు కట్టకడపట గటకార కుటీర వాటిక ప్రవేశించి (67) యనుచు నవ్వాడ గడచి యట యుత్తరంబు సనునప్పుడు, ముందట నొక యింటి మఱుంగున మచ్చెకంటిం బొడగని (107) అనుచు తద్గృహంబు నిర్గమించి, పూర్వానుభూతయగు గాంధర్వి గృహంబు రోయువాడు ... సత్కారంబులం బొంది సుఖాసీనుండై (198) ఇట్లు తట్టు వాఱి, పొట్టేళ్ళు నాస్కందం బుడిగిమంద నిశ్వాసోచ్ఛ్వాసంబులై డిల్లపడి మూర్ఛిల్లిన (231) మున్నగునవియు, బ్రాహ్మణుడు పూట కూటింటి భోజన వివరములు తెల్పిన పిదప గల "సంకృతి పూతి మాష కులసాగర శారద పూర్ణిమా కురంగాంకుడు ..., ఇంకొక మారువత్తమని యేగిరి కార్యభరంబు పెంపునన్ (171) అను పద్యమును, నాగరికుని నాగస్వరమును వర్ణించు

తే. వెడలి, పశ్చిమ దిశ నాల్గు గడియలంత
ప్రొద్దుగలుగంగ నడు వీథిఁ బోయిపోయి
కేళి సఖుడును దానాలకించి చనియె
నాగసారముల మ్రోత నన్నాగరికుడు (219)

అను పద్యమును, గద్యములును, కవిచే ఆఖ్యాతము లైనట్టివి. మొత్తము మీద క్రీడాభిరామమున ఉక్తిప్రత్యుక్తులు, ఆకాశ భాషితాదులు మున్నగు సవన్నియు సంధి వచనములచే అనుసంధింప బడినవని చెప్పవచ్చును.

మంచన పలనాటి వీరపురుష పరమదైవత శివలింగ భవన వాటిని వీక్షించెను. తదనంతరము గల పద్యములలో (116—124) మంచన టిట్టిభు నకు తన్నిర్దేశ పూర్వకమగు వర్ణనము కావించినట్లు లేదు. ఇందు

తే. అనిన టిట్టిభు డౌనంచు నసుచరింప
నాలువరి క్రింద త్రోవగా నరిగి యరిగి
విప్రు డీక్షించెఁ బలనాటి వీరపురుష
పరమదైవత శివలింగ భవన వాటి (115)

అను పద్యమునకు తరువాత నుండవలసిన

తే. కోల దాపున ద్రిక్కటి గూడియున్న
గచ్చు చేసిన చిత్రపు గద్దెపలక
వ్రాసినా రదె చూడరా వైశ్యరాజ!
శీల బ్రహ్మాది వీర నాసీర చరిత [125]

అనునది పలనాటి వీరచరితమంతయు చెప్పబడిన పిమ్మట గలదు. మిత్రులిరువురును ఏకవీరాగార గోష్ఠంబు కనుగొనిరి. మంచన ఏకవీరాదేవిని సంస్తుతించెను. [127-28] కాని ఇట దీని కనుబంధముగా నుండవలసిన అయ్యవసరంబున నేకవీరాంబకు బ్రణమిల్లి యటచనునపుడు [185] అను వచనము, వక్తృ వివక్షలేని మాహురమ్మ మహిమ [129] వర్ణన ఏకవీర ఎదుట పరశురాముని గాథలు పాడు బవనీడు [130] మాలెతమడ్వానద్ధ ఘంటా వాద్యముల కనుగుణముగా ఏకవీర కీర్తనము గావించుట [131, 32] కావు పూబోడి కైసేత [136] మున్నగు వాని యనంతర మున్నది.

"వీథి ఏక ద్విపాత్ర ప్రయోజ్యమై యుండవలెను. తక్కిన వారెవ్వరును రంగస్థలము మీఁదకి వచ్చినను, ప్రత్యక్షముగా మాటాడనక్కఱలేదు. అందు చేత క్రీడాభిరామము ద్విపాత్ర హార్యమగుచున్నది" అని విమర్శకులు భావించిరి.[27] కాని ఇందు కొన్ని పాత్రలు ప్రత్యక్షముగ సంభాషించినట్లు గలదు. మంచన కర్ణాటక భామతో గావించిన సంవాదమిట్లున్నది.

......మంచన నామధేయంబునుంజెప్పి – నమస్కరించి యిట్లనియె

శా. పంచారించిన నీ పయోధరము లాస్ఫాలింతునో [90]

క. వ్రాలని నీ చన్నులతో...... [91]

శా. చాటు ప్రౌఢి బిసాళి మాడెదవు కాసల్నాటి బాపండవో
ఘాటీ హాటక నిష్కముల్ వెలిగ జంఝూటంబు చాలించుక
ర్ణాట స్త్రీలు కటారి కత్తియ బటే రాపాదగా బట్టగాఁ
డా టాలీద గుణింప రాదు పెఱచోటం బోలెఁ బైపాటునన్ [92]

తే. దిట్ట బాపండు నడు వీథిఁదెగడి పలికె
గూట మీక్షింప దెమ్మ కిరాట! నేడు

పన్నిదము పీని మెడ సున్న జన్నిదములు
సవరగా గ్రుత్తు గ్రొత్త పుంజాలదండ [93]

అనుటయు విప్రుండిట్లనియె......ఇట కర్ణాటి భాషణము స్పష్టము,

ఇక మంచన టిట్టిభులు పూటకూటింటికై వెదకుచు ఒక భూసురుని గని వంటకంబుల వృత్తాంతం బడిగిన నతండు [163]

క. ఆహార విహారములకొ
యాహారంబునకునో, విహారంబునకో
బేహారము, మీకోసం
దేహారంభంబు మాకుఁ దెలియగవలయున్ [164]

ఇత్యాదిగా వారితో సంభాషించుచు. అట్లే మంచన మాచల్దేవుల సరస సంభాషణము [183-189] మదన రేఖాముకుర వీక్షణోత్సవ సమయమున కామమంజరీమంచనల సంభాషణము గమనింప దగినవి.

గ్రంథాంతమున గల సాయంకాలాంధకార తారకోదయాది వర్ణనలు కవి వచనములుగనే యున్నవి [278] ఆ పిదప మంచన పొందిన కామమంజరీ సందర్శనోత్కంఠా పూరితమైన విరహము కవి వచనమే (27). ఇట్లు క్రీడాభి రామమునందు శ్రవ్యకావ్యసరణి సుస్పష్టమగుచున్నది.

## వీథి నాటక లక్షణములు

"వీథి యందు ఒకే పాత్ర కాని ఇరువురు పాత్రలు కాని ఉండును. ఆకాశ భాషితములుండును. శృంగారము అధికముగాను తక్కిన రసములు అల్పము గాను సూచితములగుచుండును. ఇందలి వృత్తి కైశికి. నాయకుడు ఉత్తమ, మధ్యమ, అధమ పాత్రలలో ఎవరైనను కావచ్చును. నాయిక నాయకోచిత యైనది కావలయును. ఇందు ఒకే అంకముండును. ఇతివృత్తము సంక్షిప్త మును, ఏక దివస ప్రయోజ్యమును కావలయును. సాంగములైన ముఖ నిర్వహణ సంధులు రెండే ఇందుండును. లాస్యాంగము లుండిన నుండవచ్చును. వీథి త్రయోదశాంగ సహితము కావలయును. ఇది సమగ్ర వీథి నిర్వచనము."[27]

వీథి కల్పితేతివృత్తముతో గూడి యుండును. శృంగార మిందు పోషింప బడినను తదాభాసమే కాని రస స్ఫూర్తి యుండదు. ఇక ఈ లక్షణములు క్రీడాభిరామమున కెంతవఱకు అన్వయించునో గమనింప వలెను.

1. వీథి యందు ఒక పాత్ర కాని ఇరువురు కాని ఉందురనుట : క్రీడాభి రామమున మంచన, టిట్టిభ శర్మ లిరువురే ప్రధాన పాత్రలు. తక్కిన పాత్రల ప్రవేశము, సంభాషణము ఇందున్నను వారు రంగమున ప్రత్యక్షముగ గోచరింపరు. ఈ పాత్రల వాచి కాంగికాద్యభినయములను ప్రధాన పాత్రలే ఆయా సందర్భమున కనుగుణముగ అనుకరించి అభినయింతురని, సంగీత నాటక సాహిత్యములు మూడింటి యందనుభవము గల శ్రీ బాలాంత్రపు రజనీకాంత రావు గారు ఊహించిరి. కావున క్రీడాభిరామమున మంచన టిట్టిభు లిరువురే పాత్రలు.

2. ఆకాశ భాషితములు : ఇవి ఆయా సందర్భానుగుణముగ నుపయోగింపబడినవి. "అని యనంతరం బాకాశంబునం జెవిపెట్టి, శ్రుతినభినయించి గోవిందుఁడు" (54) ఆంధ్రోర్వీశు మోసాలపై గడియారమ్మున ఘంటా నాదమును వినుట ఇందుల కొక యుదాహరణము.

3. శృంగారాధిక్యము : క్రీడాభిరామ కావ్యారంభమునందే "గణన కెక్కిన దశరూపకముఁ యందు వీథి రసభావ భావనావీథి లెస్స" యని పేర్కొనబడుట గమనింప దగినది. ఈ గ్రంథారంభము నుండి తుదివఱకును ఈ రసము అధికముగనే పోషింపబడినది. కాని శృంగార మంతయు పరకీయా రతికి సంబంధించినది. కనుక ఇందు ఆభాస మేర్పడినది. పై క్రీడాభిరామము నందలి పద్యమున "వివిధ రస భావ భావనా వీథి లెస్స" అని మానవల్లి వారి పాఠాంతరము కూడ కలదు. ఇందు శృంగారముతోపాటు అన్యరసములు కూడ సందర్భానుగుణముగ పోషింపబడినవి.

హాస్యము :

వీథి నాటకమున హాస్యము అభిరామమై భాసించును. ఈ హాస్యము చమత్కారముగ వ్యంగ్యముగ పోషింపబడినది. క్రీడాభిరామమున నిట్టి చమత్కారము పలుతావుల కనవచ్చును. మంచన కర్ణాటభామతో కావించిన సరస సంభాషణము, (90—98) మంచన పలనాటి వీర పురుషుల వీరావేశమును అపహేళనము చేయుచు చెప్పిన పద్యములు (119, 123, 124) ఆనాటి శిష్టుల ఆచారములను వ్యంగ్యముగ పరిహసించు (168, 169) పద్యములు, శ్రీకాకుళపు తిరునాళ్ళ వర్ణింపబడు పద్యములలో అపహసింపబడిన విశృంఖల వ్యభిచారము

(208–214) పోరాడి పోరాడి మూర్ఛిల్లిన మేషకంఠీరవముల స్తుతి (282) మున్నగునవి ట్టివి. కోడిపందెములను గాంచుచు పోటు గంట్ల కొప్పు రుధిరంబులం దొప్ప దోగి మూర్ఛాంధకారంబున మునుంగు వానిని చూచి

తే. హా ఖగేంద్రంబులార ! కయ్యమున సిల్గి
పోవు చున్నారె దేవతా భువనమునకు
మీరు రంభా తిలోత్తమా మేనకాది
భోగ కార్యార్థమై కోడి పుంజులార !

అను పద్యమున వీర మరణము నొందిన స్వర్గము కలుగునను లోక నీతిని వ్యంగ్యముగ కోడిపుంజుల కాపాదించి కవి వీరముతోపాటు హాస్యమును కూడ సాధించెను.

పలనాటి వీరగాథాభినయమున వీరమును (117), మైలార వీర భటుల పటు సాహస కృత్యములు వివరింపబడినపుడు బీభత్సమును (142), ఆయా సందర్భములం దల్పముగ గోచరించును. ఇందలి ఆభాసాత్మకమగు శృంగారమునకు వ్యంగ్యమగు హాస్యము అంగమని చెప్పనగును.

నాయకుడు :

ఇందలి నాయకుడు భూసుర తిలకుడగు గోవింద మంచన శర్మ. ఇతడు రతిప్రియుడయ్యును నైష్ఠికుడు. మధ్యముడని చెప్పవచ్చును. మాచల్దేవి మంచనను కుశల ప్రశ్నములడిగి 'విచ్చేసి కూర్చుండు' దనగా మంచన తాను సంధ్య వార్చ పోవలయుననును. (189)

నాయిక :

ఇందలి నాయిక కామమంజరి. ఈమె పునర్భువు. నాయకోచితగనే ఒప్పుచున్నది.

అంకము :

ఇందు అంకమునకు బదులు 'ఆశ్వాస' మనుపదము ప్రయుక్తమైనది. ఇందు ప్రస్తావనను సూత్రధారుడొక్కడే నిర్వహించెను. ప్రస్తావనానంతరము కథోద్ఘాతము ద్వారా పాత్ర ప్రవేశమగును. అంకాంతమున భరతోక్తిగా రెండు పద్యములున్నవి.

ఇతివృత్తము :

వీథి యనునది ఉదాత్త వస్తువు నంగీకరింపదు. కనుక కవి తదనుగుణ మగు వస్తువునే ఎన్నుకొనును. ఇందు సంఘము నందలి యొక తరగతి ప్రజల జీవనము, వేశ్యల వృత్తులు అభివర్ణింపబడినవి. ఇందలి వృత్తము ఏకదివస ప్రయోజ్యము. కథ ప్రత్యూష సమయమున మంచన మిత్రుని చూచి "సుప్రభాతంబు ! సుఖ నిద్రయయ్యెనే ? శీతం బుపద్రంబు సేయదుగదా యీ పుష్య మాఘంబులందు" (44) అని శీతోపద్రవ ప్రస్తావన చేయుటతో నారంభమగును. మిత్రులిరువురు ఏకశిలానగరమును ప్రవేశించి అచట వీథులందు పర్యటించి ఆనాటి రాత్రికి ఒక సంకేత స్థానమును చేరుదురు. తన అనుంగు చెలికాడగు టిట్టిభునకు తమ్మడి సాని కూతును కూర్చి మంచన తాను కామమంజరీ సమాగమము నొందును. పిదప ఆ జార దంపతులు చిక్కని వెన్నెలలు కురియించుచు మన్మథోద్దీపమునుగావించు నిండుచందురునకు గొజ్జంగి నీటితో అర్ఘ్యమిచ్చి పచ్చకప్పురముతో పూజించి మ్రొక్కుదురు. ఇంతటితో కథ ముగియును. కథ శీతోపద్రవముతో నారంభమై మన్మథోద్దీపనముతో ముగియుటచే సంక్షిప్తమయ్యు చక్కని సారస్యముతో కూడి యున్నది.

పై ఇతివృత్తము ఒకనాటి సాంఘిక జీవితమును చారిత్రకముగా నెఱుంగుటకు తోడ్పడుచున్నను ఇదంతయు యథాతథ సత్యము కాదు. కనుక ఇతివృత్తము కొంత కవి కల్పితము.

సంధులు :

సూత్రధారుని ప్రస్తావనా వాక్యములలో కథా బీజ ముపలక్షిత మగును. మంచన తన మిత్రుడగు టిట్టిభునితో ఆంధ్ర నగర యాత్రోన్ముఖు డగుటలో ముఖసంధియు, మిత్రులిరువురును పట్టణమంతయు తిరిగి ప్రేయసుల కూడ నేగుటలో నిర్వహణ సంధియు కానవచ్చుచున్నవి.

లాస్యాంగములు :

ఇందు ఆయా వనితల విలాసగమనాదులు వర్ణితములైన సందర్భములందు లాస్యచ్ఛాయలు గోచరించును.

వృత్తి :

నాట్యపరమగు నీ వృత్తి శృంగార రస ప్రాధాన్యమగుటచే క్రీడాభిరామమున కైశికి యనదగును. ఇందు ఆయా రసభావాదులను బట్టి సందర్భానుగుణమగు శైలి గోచరించును.

అంగములు :

వీథి త్రయోదశాంగ సహితము. అవి ఉద్ఘాత్యకము, అవలగితము, ప్రపంచము, త్రిగతము, ఛలము, వాక్కేళి, అధిబలము, గండము, అవస్యందితము, నాళిక, అసత్ప్రలాపము, వ్యాహారము, మృదవము అనునవి.

సూత్రధారుని వాక్యమును గాని దాని యర్థమును గాని కొని పాత్ర ప్రవేశించుట కథోద్ఘాతమనంబడును. (సా.ద. పుట 140)

క్రీడాభిరామమున నేపథ్యమునందు

"గతిరసికుండ ! షట్చరణ ! గానకళా కమనీయ ! యో మధు
వ్రత ! వికచారవింద వన వాటిక నేమిటికిం బరిత్యజిం
చితి ? వటవీ ప్రదేశమునఁ జెట్టులఁ జేమల నేమి గల్గునన్
రతి నిటు సంచరించెదవు ? ప్రాబడి పోయెనె నీ వివేకమున్ (39)

చేరవచ్చి వచ్చి దూరంబుగాఁ బోదు
డాయవత్తు దవ్వు పోయి పోయి
మాటలింక నేల మా పాలిటికి నీవు
మాయలేడి వైతి మంచి రాజ ! (40)

ఇందు విరిసిన అరవిందమును మఱచిపోయి అడవి చెట్లలో పరిభ్రమించు మధుపము అన్యాపదేశముగ దూషింపబడినది. ఈ మధుప వృత్తి కావ్యనాయకుడైన మంచన శర్మకు నిర్దిష్టము. ఈ వాక్యముల ననుసరించి నాయకు డేతెంచును.

అవలగితము :

ఎందు ఒక ప్రయోగమున సమావేశనము చేత వేఱు కార్యము సాధింపబడునో దానిని బుధులు అవలగిత మందురు. (సా.ద. 298, పుట 141) పైని పేర్కొనబడిన సూత్రధారుని వాక్యములలో "వికచారవిందవనవాటిక నేమిటి

కింబరిత్యజించితి" వన్న పదము కామమంజరి ప్రియుడైన నాయకుడు మంచన శర్మ ఆమెను వదలి దేశాంతరగతుడగుట, ఆతనిపై మోహము మాయలేడి వలె ఆమెను భ్రమపెట్టుట మున్నగు కథాంశములను తోపింమను.

3. మిథ్యా రూపమయిన పరస్పర వాక్యము. హాస్యకారి ప్రపంచ మన బడును. మంచన ప్రస్థాన కాలోచితములగు శుభశకునములను గూర్చి ప్రస్తావించి తమకు శుభము కల్గునని హాస్య పూర్వకముగ పల్కుట. (క్రీ. 52)

4. శ్రుతి సామ్యము చేత అనేకార్థములను యోజించుట త్రిగతము. టిట్టిభసెట్టి కుక్కుట కంఠ కాహళి విని వ్యంగ్యముగ మన్మథుడు ఏకశిలా పురంబులో చంచల నేత్రలను పతుల శయ్యలపై రతికేళి రాత్రి పోరించి ప్రభాత మున ధర్మధార పట్టించుచున్నాడని అర్థము చెప్పుట (క్రీ. 54)

5. ప్రియములవలె తోచెడి యప్రియ వాక్యములచేత బెలిపించి వంచించుట చేత ఛలము (సాం.ద. 524, 196 పుట) మంచన శర్మ కామమంజరిని నట్టనడుమ సురత కాలంబున విడిచి మోసగించుట. (క్రీ. 59)

6. వాక్కేళి యనగా హాస్య సంబంధమైనది. రెండు మూడు ప్రత్యుక్తుల చేత నగునది. (సా.ద. 525–196 పుట)

7. స్పర్థ చేత ఒకరిని మించి యొకరు పలుకుట అధిబలమనబడును. కర్ణాట భామతో మంచన శర్మ సలిపిన ప్రౌఢ సంవాదము హాస్యయుతమై వాక్కేళిని, అధిబలమునకును నిదర్శనమగుచున్నది.

8. ప్రస్తుతార్థ సంబంధమై భిన్నార్థమైన సత్వర వచనము గండము. కామమంజరి మంచన శర్మను 'జనకుడవు కర్త వొజ్జవు, సజ్జనుడవు క్రొత్త లంజల కాముండ, వుత్తముడవు' అని భిన్నార్థకముగ సంబోధించుట (క్రీ.199)

9. స్వరసంబునం జెప్పిన వాక్యమునకు వేఱు విధముగా వ్యాఖ్యానము చేయుట అవస్యందితము (సా.ద. 528. పుట 197)

10. ప్రహేళికయే హాస్యముతో కూడిన నాళిక యగును.

మఱుగు సేయునట్టి యుత్తరము ప్రహేళిక (529. 197 పుట)

11. అసంబద్ధమయిన వాక్యంబును, అట్టి యుత్తరమును, మూర్ఖుడు గ్రహింపక పోయినను వానికి హితవచనము చెప్పుట అసత్ప్రలాపము. (సా.దం 530, పుట 1!

12. ఇతరుని కొఱకు హాస్య క్షోభకరమైన వాక్యము వ్యాహారము (531—198)

13. ఎందు దోషములు గుణములును, గుణములు దోషములును అగునో అది మృదవము (532. 193 పుట) మంచన చెప్పిన విటధర్మ సూక్ష్మము. (క్రీ. 258).

## సమకాలిక జీవన చిత్రణము

సమకాలిక సాంఘికపరిస్థితులను ప్రతిబింబితము కావించుట క్రీడాభిరామము నందలి ప్రత్యేక గుణము. సమకాలిక ప్రజా జీవితమునకు అందలి సమస్యలకు స్థానమిచ్చుట ఒక విధముగా ఆధునిక కవితా లక్షణము. పురాణేతిహాసాదులు, శాస్త్ర కావ్యాదులు ఒక పద్ధతిలో వ్రాయబడుచుండిన సమయమున ఇట్టి నూతన కవితా లక్షణములను సంతరించుకొని వెలువడిన విశిష్ట కావ్యము క్రీడాభిరామము.

క్రీడాభిరామము నందు చిత్రితమైన ప్రజాజీవితము సామాన్య జన జీవితము. సాధారణముగ ఉన్నత తరగతి, సంఘము నందలి ఒక పరిధియందు మాత్రమే సంచరించును. సామాన్య జన జీవనము విస్తృతము. అది సహజము సామాన్యము, సార్వకాలికమునై యుండును. క్రీడాభిరామము వలన క్రీ.శ. పదునాల్గవ శతాబ్ది యందలి సంఘ జీవితము చిత్రితమైనను అందలి కొందఱు వ్యక్తులు, సమస్యలు ఈనాటికిని గోచరించుచుండును.

క్రీడాభిరామము వలన ప్రథమముగ తెలియనగునది ఆనాటి చాతుర్వర్ణ్య వ్యవస్థ. ఆనాడు నిమ్నజాతుల వారు వెలిపాళెమున వసించెడి వారు. వెలిపాళెము నగర ప్రాకారమునకు వెలుపల అగడ్తను చుట్టియుండెడు ప్రదేశము. దీనికి బాహ్య కటకము, వెలివాడ అని పేర్లు. ఇందు కట్టకడపట మేదరవాడయు, ఇంకొక ప్రక్క చండాల వాటియు నుండెడిది. ఈ వెలివాడలోని జనులందఱికి అగడ్త యందలి సీరే స్నానపానాదికము లన్నింటికి ఆధారము. అచటికి ఋతు స్నానార్థయై ఏతెంచిన చండాలాంగన, ఘటమున జలము కొనిపోవు కర్ణాటాంగన

క్రీడాభిరామమున వర్ణింపబడిరి. అచటి అగడ్త జలసమృద్ధముగ నుండెడిదని చెప్పనగును. కాని నాటి ఆ నీటనే ఋతుస్నానార్థము కూడ నుపయోగించెడు నప్పటి వారి పారిశుద్ధ్యము సంగతిని పాఠకు లూహించుకొనవచ్చును.

నగరములోనికి అరుగు హట్టమార్గమున మైల సంత జరిగెడిది. ఈ సంతలో 'సుసర భేత్తను' రోమహారిణి మందు సైతము బాహాటముగ నమ్మబడెడిది. ఈ సంత వెలివాడలోని జనుల కుద్దేశింప బడినది. నగరములో పాళెమున ఉన్నత జాతులకు ప్రత్యేకముగ సంత లుండెడివి. ఈ వెలిపాళెమునకు మధ్య ప్రదేశమున హాలికవాటి యుండెడిది. హాలికవాటి రైతులుండెడి స్థలము. హట్ట మార్గమున కుత్తరముగా మోహరి వాడ యుండెడిది. మోహరి వాడ యందు యుద్ధభటులు వసించెడి వారు. వీరు శత్రువుల బారి నుండి నగర బాహ్య ప్రదేశమును రక్షించుచుండిరి. ఇచటనే కుట్టు పనివారును ఉండెడివారు. నగరమునకు లోపల బ్రాహ్మణ క్షత్రియ, వైశ్యాదులగు ఉన్నత వర్గములవారు వసించుచుండిరి.

ఆనాటి సాంఘిక దురాచారములు :

1. అతిశయముగ కన్పట్టు జారత్వము — ఆనాటి వేశ్యలు తమ జాతి కులానుగుణముగ, కర్ణాట వేశ్య, మేదరకరణవేశ్య ఇత్యాదిగ పిలువబడుచుండెడి వారు. బ్రాహ్మణులకైనను, వైశ్యులకైనను జారత్వము దోషము కాదు. ఆ విషయమున కులాదుల నిషేధము లేదు. తిరునాళ్ళలో విశృంఖల వ్యభిచార ముండెడిది. శ్రీకాకుళపు తిరునాళ్ళలోని ధూర్తశృంగార మిందుకు నిదర్శనము (208–214). ఈ వేశ్యలు లోపాళెమునను, వెలిపాళెమునను కూడ వసించెడి వారు. నగరములో నుండు వేశ్యలు వెలినాటి వేశ్యల కంటె నాగరికులు. ఆనాటి వేశ్యలకు కొన్ని ఆచారములు, ధర్మములు ఉండెడివి. వారకాంతలు ఈడేరిన తమ ఆడుబిడ్డలకు ముకుర వీక్షణోత్సవము కావించెడి వారు. ఆనాడు వారికి అద్దమును చూచి 'మన్మథ వేధ' దీక్ష నిచ్చెడి వారు. ముకుర వీక్షా విధానము జరుగక వేశ్యాకన్యలు తమ వృత్తికి పూనుకొనరు. మధుమాసతీ మదాలసలకు మంచన

గీ. జాణ తనము గల్గి సవరతనము గల్గి
తెలివి గల్గి మోర తీరు గల్గి
చేయలంతి తనకుఁ జేకూడినప్పుడు
వావి వలదు లంజెవారి యింట'

ఇత్యాదిగా చెప్పిన విట జన ధర్మ సూక్ష్మము ఏహ్యముగ నున్నది. వేశ్యలు విటులను మోసగించుట కూడ కలదు. పరదేశియైన విటుని మోసగించిన వేశ్య మాతకు విధింపబడిన శిక్ష ఇందుకు నిదర్శనము.

గీ. ముక్కు సోణంబుదాకను జెక్కుటొకటి,
బోసి నోరుగఁ బండ్లూడఁ బొడుచుటొకటి,
గూబలంటగఁ జెవిదోయిఁ గోయు టొకటి,
లంజె తల్లి యొనర్చు కల్లలకు శిక్ష.

జూదము :

ఈ వ్యసనము వలన అమాయికులు మిక్కిలిగ మోసపోయెడి వారు. ఈ పాప ద్యూతము వలన కలుగు దుష్ఫలితము ఎనలేనిది. పందెము పై పందెము నంగీకరించు వారి మొలల నుండునవి కౌపీనములే యని చెప్పబడినది. ఈ జూదమును జనులు గుంపులు గుంపులుగ చేరి వీక్షించెడి వారు. ఈ పనిలేని సోమరిపోతులను పట్టణములో దగుల్బరి పందెగాడు, పశ్యతోహరుడు మోస పుచ్చుచుండెను.

వినోదములు – క్రీడావిశేషములు – కొలువులు :

ఆనాడు పలనాటి వీరుల కథాగానములు బహుళ వ్యాప్తిలో నుండెడివి. పల్లెటూళ్ళలోని పెద్దలు ఈ ఇతిహాస్యములను ఉత్సాహముతోఁ జెప్పు చుందురు. ఈ పల్నాటి వీరుల చరిత్రను వారు ఆ వీరులు ఏ ఏ స్థలముల యందు దేయే కృత్యములను కావించి చరిత్రను సృష్టించిరో వివరముగా తెల్పి వారి ఎడల తమకుఁ గల గౌరవమును వ్యక్తము గావింతురు.

వారు

సీ. ఇచ్చోట భుజియించి రేకకార్యస్థులై
సామంత నృపతులు చాపకూడు

ఇచ్చోటఁ జింతించె నిచ్చ యుపాయంబు
నళినాక్షి యార్వెల్లి నాయకురాలు
నిజమను శుద్ధికై నిప్పులయేటిలో
నోలాడె నిచ్చోట బీలసాని... (122)

ఇత్యాదిగా ఆయా స్థలములకు చని తన్నిర్దేశపూర్వకముగ పల్నాటి చరిత్రమును తెలిపెడి వారు. ఆనాటి ఓరుగల్లు పురమున పలనాటి వీర పురుషుల సంస్మరణ చిహ్నముగా ఆలయములు నిర్మింపబడినవి. ఈ పల్నాటి వీర చరిత్ర ద్విపద ప్రబంధమును ద్రుత తాళంబున పాడుచు వీరగుంపి పై "తక ధుంధుం కిటాత్కార సంగతి" వాయించుచు స్త్రీలు పాడుచుండెడి వారు. 'ఈ ధుంధుం కిటాత్కార' ము శ్రోతలలో ఆవేశమును కలించుచుండెడిది. ఈ తాళమునకు వంతపాడుచు చిందులు వేయుచు పురుషులు నాట్యము సలిపెడి వారు. ఆ పల నాటి వీర పురుషుల గుడిలో గచ్చు వేసిన చిత్రపు గద్దె పలకపై పలనాటి వీర చరిత్రము చిత్రిత మయ్యెను.

కాకతమ్మకు సైదోడని ప్రసిద్ధిగాంచిన ఏక వీరాదేవి కథలుపాడు కొనుట కూడ ఆనా డాచారము. ఏకవీర గుడి ఎదుట నిలిచి బవనీండ్లు ఏక తంత్రీ వాద్యమును మీటుచు వివిధ రాగములతోను, మాలెతలు, 'మాడ్వానద్ధఘంటా' వాద్యముల కనుగుణముగ కోకిల కంఠములతోను పరశురాముని గాథలను పాడెడు వారు. ఇంకను పలువురు ఆడుచు పాడుచు ఏకవీరను కొలుచు చుండెడి వారు. ఏకవీరకు మాహురమ్మ, ఎల్లమ్మ దేవర అనియు పేర్లుండెడివి. జక్కుల వాండ్రు కామవల్లీ మహాలక్ష్మీ వలపును బాడుచుండెడి వారు. కామవల్లీ మహాలక్ష్మి కే కామేశ్వరి యని పేరు. బ్రాహ్మణుల యందు సంతానార్థులయిన వారు అక్కల యారాధనము జరిపించెడి వారు.

ఏకశిలా నగరమున కొందఱు మైలారు దేవరను కొలుచుచుండెడి వారు. వారిని మైలార వీరభటు లందురు. వీరు గావించు మైలారు దేవర ఆరాధన అతి సాహస కృత్యములతో కూడినది. ఇందు కణకణ మండు చంద్ర నిప్పుల గుండములలో నుండి నడచి పోవుట, వాడి ఆలుగులు పాతిన పెద్ద పాతరలలో పై నుండి ఉట్టి చేరులు పట్టుకొని వ్రేలాడుచు ఉవ్వెత్తుగా దూకుట, వీపు చర్మమును గాలానికి గ్రుచ్చుకొని ఊయల లూగుట, గండ కత్తెరలు మ్రింగుట, నారసములు పొడుచు కొనుట, అరచేతుల తోడనే కర్పూర హారతు లొసంగుట

మొదలైన కృత్యములు చేసెడి వారు. ఈ సమయములలో గొరగ పడచులు 'గొండ్లి' నృత్యము చేసెడి వారు. ఆ పడుచు వెనుకకు మొగ్గవేసి, నీటితొట్టిలో నున్న ముంగరను ముక్కున గ్రుచ్చుకొని లేచుట, నాలుకతో నల్లపూసలను గ్రుచ్చుట మున్నగు వింత కృత్యములను సల్పును. నాగస్వరము, పాములాట ఆనాటి ప్రజలకు ప్రీతిపాత్రములు. ఉత్సవములలో ప్రజల ఉత్సాహము మేర మీరును. సింహ ధ్వజము లెత్తి నింబదళ మాల్య తోరణములు కట్టి పూర్ణ కలశాలు నిల్పెడి వారు. సీధువులలో మునిగి తేలి తప్పెట్లు తల్లెతాళములు మున్నగు వాద్యములతో రంపిల్లుచు గుంపులుగ వీధులలో విహరించెడి వారు. గడకట్టి ఆడువారి గంతులు కూడ కనుల పండువు కలిగించెడివి.

ఆనాడు కోడి పందెములు, పొట్టేళ్ళ పందెములు సామాన్య ప్రజల వినోదములలోని ముఖ్య భాగములు.

శకునములు :

మధ్య తరగతి ప్రజలు వీనిని విశ్వసించెడివారు. తూర్పున గుడ్లగూబ కూసిన శుభకార్యములు ఫలించును. కోడి, ఏట్రింత, కొంకినక్క ఎదురైన ప్రయాణీకులకు శుభము - నెమిలి కూతకూడ శుభ శకునమే. గోధూళి లగ్నము పురప్రవేశమున కుచితసమయము. ఉషఃకాలము సర్వ ప్రయోజనారంభములకు ప్రశస్తమైనది. మఱియు

గార్గ్య సిద్ధాంత మత ముషఃకాల కలన
శకున మానుట యది బృహస్పతి మతంబు
వ్యాస మతము మనఃప్రసాదాతిశయము
విప్ర జన వాక్య మరయంగ విష్ణుమతము. (66)

అని శుభ శకునములు చెప్పబడినవి.

పూటకూటిండ్లు :

ఈ పూటకూటిండ్లు ఆహార విహారములు - రెంటికి ప్రసిద్ధములు. ఇవి ఉండు స్థలమునకు బాడబుల వాడ, అక్కలవాడ అని పేర్లు. ఇచట పుష్పశరుడు నిత్యము బంధకీజారులకు సంధి విగ్రహయానాది సంఘటనములయందు రాయబారి యగునట (157). ఈ పూటకూటిండ్లను విప్రవిధవలు నడిపెడివారు.

ఆ పూటకూటిండ్లలో లభించు భోజనము దొడ్డ భోజనము. లక్ష్మణవజ్ఝుల యింట ఒక రూకకు,

ఉ. 'కప్పుర భోగి వంటకము, కమ్మని గోధుమ పిండి వంటయున్
గుప్పెడు పంచదారయును, గ్రొత్తగ చినయాలనే పెస
ర్పప్పును, గొమ్ము నల్లనటి పండ్లును, నాలుగు నైదునంజులున్
లప్పలతోడ గ్రొంబెరుగు లక్ష్మణవజ్ఝుల యింట రూకకున్ (116)

శీతకాలమున పల్లెటూరి భోజన సౌష్ఠవ మిట్లుండెడిది.

తే. శీత కాలంబు కడిమాడ సేయ గుడుచు
భాగ్యవంతుండు చేవాడి పల్లెపట్లఁ
గ్రొత్త యోరెంబు నిగురావకూర తోడఁ
బిచ్చిలంబైన నేతితోఁ బెరుగు తోడ (56)

ఇది పల్లెటూరి భోజనము అయ్యును భాగ్యవంతులది.

మత సమాదరము :

ఓరుగల్లు పురములో భైరవుని గుడి, చవదేశ్వరీ మహాశక్తి నగరు, వీరభద్రేశ్వరాగార మంటపము, ముద్దరాలు ముసానమ్మ సతి గుడి, కొమరుసామిగుడి, పాండవుల గుడి, కేశవ స్వయంభూ దేవాలయము మున్నగు హిందూ దేవాలయములతో పాటు బౌద్ధ విహారము, తురకల మసీదు కూడ నుండుటను బట్టి ఆనాటి మత సమాదరము తెలియనగును.

నాగరికత :

ఆనాటి సామాన్య స్త్రీలు కుసుమంబద్దిన చీరలు (ఎఱ్ఱరంగు అద్దకపు చీరలు) ఎఱ్ఱని చారలు గల చీరలు, బొమ్మంచు చీరలు, చిఱుత బాకంబుల తొగరుఁ బుట్టములు కట్టెడి వారు. కరములగు వెండి మొరివంక కడియములు ధరించెడివారు, గోళ్లకు గోరంట, తలకు సంపెంగ నూనె, నుదుట సిందూర తిలకము నుంచుకొని తాంబూల సేవనము గావించెడి వారు.

వాడలు శుభ్రముగా నుండెడివి. చక్కగా కత్తిరించుచు పెంచబడిన పూల చెట్లు గల మోహరి వాడ ఇందులకు నిదర్శనము. ఆనాటి ఇండ్లు కూడ రమ్యముగ నలంకరింప బడెడివి

గీ. చందనంబునఁ గలయంపి చల్లినారు
ముగ్గు లిడినారు కాశ్మీరమున ముదమున
వ్రాసినారిందు రజమున రంగవల్లి
కంజములఁ దోరణంబులు గట్టినారు (178)

ఇండ్లలో అద్దాల గదులుండెడివి (గాజుటోవరి).

ఆనాటి మధ్య తరగతి బ్రాహ్మణ స్త్రీలు పురుషులు తఱకు చెంగావి కోకలు, గన్నేరు పూజాయ మడుగు దోవతులు ధరించెడి వారు. గొజ్జంగి పూనీరు చిలుకరించిన గంగ మట్టిని లలాటమున తీర్చుకొనెడి వారు. ఆనాడు జంటనేత గల ఎఱ్ఱని దుప్పట్లు (తోపు రెంటిమ్ములు), ఉన్నితో నేసిన కంబళ్ళు శీత కాలమునం దుపయోగించెడివారు.

ధనికులు, రసికులునునైన వారి ఇండ్లలో చిత్రశాలలుండెడివి. ఓరుగంటి నగరమున మాచల్దేవి యను వారాంగన యింటనున్న చిత్రశాల ప్రత్యేకముగ చెప్పదగినది.

పదునాల్గవ శతాబ్ది నాటి ఓరుగల్లు సప్తపాతాళ విష్టప మహా ప్రస్థాన ఘంటాపథంబైన గగన పరిఖతోను, తారకా మండల స్తబకావతంసమై కను చూపు కానని ప్రాకార రేఖతోను, సంకులాంగణమైన వంకదారతోను, మేరు శైలమును బోలు పెను పైడి తలుపుల గవని తోడను వైభవోపేతముగ నల రారెడిది. రాజమార్గములు వారణఘటా ఘోటక శకటికాభటకోటి సంకులములై యుండెడివి. అనాడు ఆంధ్రోర్వీశుని మోసాలపై గడియారము ఘంటా ఘణా త్కారములతో కాలపరిమితిని సూచించెడిది.

## అనువాద సరణి

క్రీడాభిరామమునకు మూలముగా నెంచబడుచున్న ప్రేమాభిరామ ముప లభ్యమానము కాదు. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు పెదకోమటి వేమారెడ్డి రచించిన సాహిత్య చింతామణిలోను, వృత్త రత్నాకర వ్యాఖ్య యందును క్రీడాభిరామము నందలి మూడు పద్యములకు మూలములనదగిన శ్లోకములను గు ర్తించిరి. వానిలో ఒకటి

1. శ్లో పరారి సందర్శిత సన్నివేశా
పరుత్పరాభూత పయోజ కోశా
ఇహైషమస్తాళఫలోపమానౌ
స్తనౌకియన్తే పురతోభవేతామ్ (సాహిత్య చింతామణి)

చం. దొరసెము నందుఁ జుట్టుకొని తోరణ కట్టె నురోవిభాగమున్
నిరుడు పయోజ కోశ రమణీయత దాల్చెను, వర్తమానవ
త్సరమున నొప్పె హేమ కలశంబుల బాగున, ముందటేటికిం
గరినిభయాన చన్నుగవ కౌగిలి పట్టులు గాక యుండునే (288)

2. శ్లో తరుణం సర్షపశాకం
నవౌదనం పిచ్ఛిలానిచ దధీని
స్వల్ప వ్యయేన సుందరి!
గ్రామ్య జనో మృష్ట మశ్నాతి (వృత్త రత్నాకర వ్యాఖ్య)

తే. శీత కాలంబు కడి మాడ సేయఁ గుడుచు
భాగ్యవంతుండు జేపాడి పల్లెపట్లఁ
గ్రొత్తయోరెంబు నిగురావ కూరతోడఁ
బిచ్ఛిలంబైన నేతితోఁ బెరుగు తోడ (56)

3. శ్లో. పృథుల జఘన భారం మన్దమాన్దోలయన్తీ
ప్రచలిత కుచకుంభా సంభ్రమత్కర్ణపూరా
మృదుల చలదలకాన్తా ముగ్ధ పుంభావలీలా
మభినయతి హరిద్రావేషణచ్ఛద్మనైషా

మహాస్రగ్ధర.

పరిపాటీ ఖర్వ ఖర్జూపరతి సమయ సంభ్రాంత సంభోగ భంగిన్
దరుణీ రత్నంబు హేలా తరళ గతి హరిద్రా రజః కర్దమంబుం
గురులల్లాడంగఁ బీగుం గుచములు గదలం గొంత గూర్చుండి నూఱెన్
గర వల్లీ కాచ భూషా కలమధుర ఝణత్కారముల్ తోరముల్ గాన్ (110)

ప్రేమాభిరామమునకు క్రీడాభిరామము యథామూలమగు అనుసరణము కాదని నిర్ధారణముగ చెప్పవచ్చును. ఈ అంశమును గ్రంథనామమే విశదము చేయు

చున్నది. మూల గ్రంథ నామముచు మార్చుట కవి స్వాతంత్ర్యమునకు నిదర్శనము తెలుగు సాహిత్యమున నన్నయ మొదలు శ్రీనాధుని వఱకును, శ్రీనాధునికి పిదపను కూడ కవు లెవ్వరును మూలమును యథాతథముగ అనువదింప పూనుకొనలేదు. ఆంధ్రీకర్తల స్వాతంత్ర్య మందు పెక్కు విధముల వ్యక్తమగుచునే యున్నది. వల్లభరాయడు వస్తువు నెన్నుకొనుట యందును, నాటకాంధ్రీకరణమునకు పూనుకొనుట యందును ఆనాటి సాహిత్య రీతిని బట్టి కొంత స్వాతంత్ర్యమును వ్యక్తము కావించియే యున్నాడు. ఇట్టి కవి గ్రంథము నందు మూల భిన్నములగు మార్పులను గావించుననుటలో సందేహము లేదు. ఇందు కనవచ్చు శ్రీనాధ శైలి కూడ ఈ అనుసరణము స్వేచ్ఛానుసరణమని తెల్పును. ఇందు శ్రీనాధునికి ప్రీతిపాత్రములగు పదబంధములు పెక్కులున్నవి. అవి యన్నియు ప్రేమాభిరామము నందే యుండి యుండునను కొన్న శ్రీనాధుడు ప్రేమాభిరామము నుండి ఆ శబ్దజాలమును గ్రహించి తన ఇతర గ్రంథములందును ప్రయుక్తము గావించెనని తలంప వలసి వచ్చును. సహజ కవితా ధార గల శ్రీనాధుని కిట్టి అపకీర్తి నంటగట్టుట భావ్యము కాదు. మీదు మిక్కిలి ఇందు శ్రీనాధుని శబ్దాడంబర మేకాక పదబంధములు సైతము కనవచ్చుచున్నవి. శ్రీనాధుని భీమఖండమున గల 'గార్గ్య సిద్ధాంత మతముషః కాలకలన' యను పద్యము అలతి మార్పులతో క్రీడాభిరామము నందున్నది. మూలము నందా సందర్భమునం దట్టి అర్థము గల శ్లోక మింకొకటి యుండి యుండును. కాని అనుసరణమున మాత్రము ఇది స్వతంత్రతను సంతరించు కొన్నదని చెప్పవలెను. క్రీడాభిరామమున పాత్ర ప్రవేశమును వర్ణించు 'గన్నేరు పూజాయ కరమొప్పు నీర్కావి" అను సీసము మూలమున పాత్ర ప్రవేశ సూచకమైన ధ్రువాగీతమై యుండును. దీనిని శ్రీనాధుడు తన సహజ శైలిలో విస్తరించి యున్నాడు. ఈ సీసము శృంగార నైషదము నందలి 'గన్నేరుఁ బూజాయఁ గనుపట్టుజిలుగైన సలిల కాషాయ వస్త్రంబు గట్టి' (3. 108) అను పద్యపాదము ననుసరించు చున్నది.

"క్రీడాభిరామము నందు గల ద్రుతతాళాది పద్యనవకము నాటకమైన ప్రేమాభిరామమునందు లేక క్రీడాభిరామమునందు మాత్రమే కల విశేషమని సూక్ష్మ పరిశీలమునకు సుస్పష్టమగునని' శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి గారీ క్రింది ఉపపత్తులను చూపి యున్నారు. "ద్విపద ప్రబంధ" ప్రసక్తి గల ద్రుత

తాళంబున అను పద్యము వల్లభామాత్యుని స్వతంత్ర కల్పనము. పలనాటి వీర పురుష పరమ దైవత శివలింగ భవన వాటి గణపతి దేవుని కాలము నాటిదే కావచ్చును. అతని కాలము నాటికే అది గచ్చు పలక మీద చేరినది. పలనాటి వీరుల చరిత్ర చిత్రలేఖనము కాని ద్విపద ప్రబంధముకాదు.

"కోల దాపున త్రిక్కటి గూడి యున్న
గచ్చు చేసిన చిత్రపు గద్దె పలక
వ్రాసినా రదెచూడరా వైశ్య రాజ !
శీల బ్రహ్మాది వీరనాసీర చరిత" [125]

ఈ వీర పురుషులు మనకుం గార్యసిద్ధి సేయుదురు గాక [126] అని క్రీడాభిరామము నందు కలదు. ఇది ప్రేమాభిరామము నందు నుండ వచ్చును. క్రీడాభిరామము నందలి పద్యము నందు "వ్రాసినారు ... చరిత" అను మాట లున్నవని యది గ్రంథమని భ్రమపడుటకు అవకాశమున్నది. కాని పరిశీలించిన చోనది గ్రంథము కాదు. చిత్రమని సువిశదము కాగలదు. గచ్చు పలక మీద వ్రాసిన గ్రంథమును జూపించి యందలి వీర పురుషులను 'ఈ వీర పురుషులు' అని నిర్దేశించుట సహజమో, చిత్రమును చూపించి యందలి వీర పురుషులను 'ఈ వీర పురుషులు' అని నిర్దేశించుట సహజమో స్వయం వేద్యము అంతే కాదు. ఆ గచ్చు పలక 'చిత్రపు గద్దె పలక' యని పద్యము నందు స్పష్టముగ కలను. చిత్రపు గద్దె పలక యనగా వింత గద్దె పలక యనిగాక చిత్రలేఖన ఫలకమనియే యర్థము. కాబట్టి గణపతి దేవుని కాలము నాటికి గచ్చు పలక మీద చేరినది పల్నాటి వీర చరిత్రము కాని ద్విపద కావ్యము కాదని స్పష్టము.

వల్లభామాత్యుని క్రీడాభిరామమును బట్టి కాకతి గణపతి దేవుని కాలము నాటికే పల్నాటి వీర చరిత్ర ద్విపద కావ్యము కలదనుట కూడ నిష్కృష్ట సిద్ధాంతము కాదా ! మూలము నాటకము కాగా క్రీడాభిరామము అఖ్యానాత్మక ముగ నడుమ నడుమ కవి వచనములతో నడచుట కూడ ఇందలి స్వతంత్రత కొక ఉదాహరణము"[29]

ఏమయ్యెను ప్రేమాభిరామము లభ్యము కానందున క్రీడాభిరామము నందలి ఏ భావములు ఎంతవఱకు అందున్నవో ఊహించుట కష్టము. "కొందఱు త్రిపురాంతకుడీ నాటకమును తెనుగుననే వ్రాయగా వల్లభరాయడు దానిననుస రించెనని కూడ చెప్పుదురు"[30]

కవిత్వ చమత్కారము :

క్రీడాభిరామము చెట్ట పుస్తకమని కొందరు పండితులభిప్రాయ పడిరి. ఇందలి శృంగారాతిరేకతయు, జుగుప్సావహములైన కొన్ని వర్ణనములును ఇందులకు కారణములు. కాని ఈ కావ్యమున కనవచ్చు ప్రౌఢ నిర్భరమగు శయ్యా సంవిధానము, భావ శబలత, కవితా పరిపాకము దీనిని ఉత్తమ కావ్యముల సరసను నిలిపి పండితులను ప్రత్యేకముగ నాకర్షించినవి. ఇందు వర్ణనములు అతి సహజములై ప్రకృతి సిద్ధముగ నుండుట గమనింపఁ దగినది. ఏతద్గ్రంథ రచనము కావించిన కవి యెవ్వరయ్యును ఆతని కవితాహృదయము నిష్కళంకమును, నిరాడంబరమును నైనట్టిది. స్వచ్ఛందమైన కవితా గమనమిందు చమత్కార బంధురమై, సరసముగ సాగినది.

శీతోపద్రవమును గూర్చి కవి యిట్లు చెప్పెను.

ఉ. ప్రక్కలు వంచి వంచి, మునిపండ్లును బండ్లును రాచి రాచి తా
మ్మక్కిలఁ జేసి చేసి తల యల్లన గాళుల సంది సంది లో
చక్కికి నొక్కి నొక్కి, యిరుచంబడ గుమ్మడి మూట గట్టి పే
పెక్కి దువాళి చేసి చలి యిక్కడ నక్కడఁ బెట్టు వేకువన్ [45]

ఉ. కప్పురభోగి వంటకము, కమ్మని గోధుమ పిండి వంటయున్
గుప్పెడు పంచదారయును, గ్రొత్తగ గాచిన యాలనేయి పెస
ర్పప్పును, గొమ్మునల్లనటి పండ్లును నాలుగునైదు నంజులున్
లప్పలతోడి గ్రొంబెరుగు లక్ష్మణవఝ్ఝల యింట రూకకున్ [166]

అను పద్యమున నాటి పూటకూటింటి భోజనము పఠితలకు కూడ నోరూరించుచున్నది.

ఉ. మంచన వింటివో వినవొ మన్మధు దేకశిలా పురంబులోఁ
జంచల నేత్రలం బతుల శయ్యలపై రతికేళి రాత్రి పో
రించి ప్రభాతకాలము పరిస్ఫుట మైనను ధర్మదార
పట్టించుచున్నవాఁ డదె కుటీగత కుక్కుట కంఠ కాహళిన్.

ఇందలి భావము శృంగారరసభరితమై అలంకారికమై కవి భావుకతను వెల్లడి చేయుచున్నది. ధర్మదారయనగా యుద్ధపరిసమాప్తి సూచించుటకై యూదు

[బాకా] వాద్య విశేషము. ఇదివైరి సమాసమయ్యును ననింద్య గ్రామ్యమై అర్థ గంభీరముగా నున్నది.

మహా.

పరిపాటీ ఖర్వ ఖర్జూపరతి సమయ సంభ్రాంత సంభోగ భంగిన్
దరుణీ రత్నంబు హేలా తరళగతి హరిద్రా రజః కర్దమంబుం
గురులల్లాడంగ పీగుంగుచములు కదలం గొంతు గూర్చుండి నూతెన్
గరవల్లీ కాచ భూషాకల మధుర ఝుణత్కారముల్ తోరముల్గాన్ [110]

ఇందొక తరుణీ రత్నము హరిద్రాకర్దమ మును నూఱు విధముల వర్ణింప బడినది. ఇందు కవి వాడినయుపమానము సరసమై అతని భావనా మహిమను జాటుచున్నది.

క్రీడాభిరామము తెలుగు నుడికారపు టొడుపులకును, మేలిపలుకుబళ్ళకును ప్రసిద్ధిగాంచినది. అనంతర కవులలో పెద్దన, శ్రీకృష్ణదేవరాయలు, రామకృష్ణుడు మున్నగు వారి పలుకు బడుల ననుకరించిరి. బిల్హణీయము, అహల్యా సంక్రందనము, రాధికా సాంత్వనము, శశాంక విజయము మున్నగు అనంతర శృంగార కావ్యములలో క్రీడాభిరామముద్ర గోచరించును.

ఈ కావ్యమున కనవచ్చు అసాధారణ పదప్రయోగములను తదర్థములతో కూడ శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారును, శ్రీ బి. వి. సింగరాచార్య గారును ప్రచురించిరి. వాని నన్నిటిని ఇచట పేర్కొనుట పునరుక్తమగును.

ఉపయుక్త గ్రంథ నిర్దేశము

1. క్రీడాభిరామము పీఠిక పుట 85. గంటి సూర్యనారాయణ శాస్త్రి ముద్రితము 1923.

2. చాగంటి శేషయ్య - ఆంధ్ర కవితరంగిణి పుట 41. సంపు. 4.

3. శ్రీనాథుడు - డా. కొర్లపాటి శ్రీరామమూర్తి పుట. 148. సెయింట్ మైకల్స్ ముద్రణ 1971.

4. కవి తరంగిణి పుట 45.

5. ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యం. సంపు. 3, పుట 76–77.

6. ఈ మోపూరు కడప జిల్లాలోని పులివెందల తాలూకాలో నున్నది. ఇచట భైరవ స్వామి ఆలయము గలదు. భైరవుడే కవి కిష్టదైవము. క్రీడాభిరామ నాటకాంతమున,

చ. ముదమున ముల్కినాటి పురమోహనశైల సువర్ణ కందరా
సదనుడు, కాల భైరవుడు, శంభుని పట్టి, సమగ్ర వైభవా
భ్యుదయ పరంపరా విభవముల్ గృప సేయు గవీంద్ర కాంక్షిత
త్రిదశ మహీరుహంబునకుఁ దిప్పయ వల్లభరాయ మంత్రికిన్.

అని చెప్పబడినది. మోపూరు కడ మోహనాచల మున్నదనియు, దానిపై భైరవేశ్వరాలయ మున్నదనియు శాసనముల వలన తెలియుచున్నది. ఆకాలమున మోపూరు పెద్ద పట్టణముగా నుండి గొప్ప వర్తక స్థానముగా నుండెడిదట. కాని వల్లభరాయని నివాస మా గ్రామము కాదని తోచుచున్నది. క్రీడాభిరామమునం బై పద్యమునకుఁ బూర్వమే యున్న

క. నటులది దోరసముద్రము
విటులది యోర్గల్లు, కవిది వినుకొండ మహా
పుట భేదన మీ త్రితయము
నిట గూర్చెను బ్రహ్మ రసికు లెల్లరు మెచ్చన్.

అను పద్యమును బట్టి యీకవి నివాసము వినుకొండ యని నిశ్చయింప వలసి యున్నది.

7. లింగన 'హరి హర క్షోణీంద్ర సామ్రాజ్య వర్ధను' దనియు [క్రీ. 1–14]
8. తిప్పన వీర హరిహర రాయపృథ్వీకళత్ర రత్న భండార సాధికార ప్రగల్భుడు [క్రీ. 1–17]
9. కర్ణాటక ఆంధ్ర సాహిత్య చరిత్ర పుట 273, రత్నాకరం శంకర నారాయణ రాజు - కళా ప్రింటర్స్. 1976.
10. ఆరుద్ర స. ఆం. సా. పుట 169.
11. ఆరుద్ర స. ఆం. సా. సంపు. 4, పుట 183.
12. ఆంధ్ర సాహిత్య చరిత్ర — పుట - 388 - 389.
13. వేటూరి ప్రభాకర శాస్త్రి గారి పీఠిక, పుట 9-12 [1928]
14. క్రీడాభిరామ పీఠి పుట 2—6 [1909]
15. క్రీడాభిరామ పీఠిక - గ్రంథరచనా కాలము - శ్రీనాథుని సాహాయ్యము (1952)
16. శ్రీనాథకవితా సమీక్ష - క్రీడాభిరామము శ్రీనాథ కర్తృకమా. [పాపులర్ ప్రెస్, కాకినాడ. వికారి మకర సంక్రాంతి]
17. విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్ర వాఙ్మయ చరిత్రము. ప్రథమ భాగము పుట 85, 89, 95.
18. ఆరుద్ర - స. ఆం. సా. సంపు 4. పుట 182–184.
19. కుందూరి ఈశ్వర దత్తు - క్రీడాభిరామ కర్తృత్వ ప్రశంస, పుట 27, 28, 30, 31 [1964]
20. క్రీడాభిరామ పీఠిక - ఎమెస్కో. పుట 33, 1972.
21. శ్రీనాథుని కవిత్వతత్త్వము - కుందూరి ఈశ్వరదత్తు పుట 29.
22. శ్రీ చేకుమళ్ళ అచ్యుతరావు - విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్ర వాఙ్మయ చరిత్రము సంపు 1, పుట 91, 93–94.
23. క్రీడా. పీఠిక పుట 16.
24. క్రీడాభిరామ పీఠిక, పుట 45.

25. వేటూరి ప్రభాకర శాస్త్రి - శృంగార శ్రీనాథము. అష్టమ ప్రకరణము. పుటలు 261—5

26. ఆరుద్ర - సమగ్ర ఆంధ్ర సాహిత్యం. సంపు 4, పుట. 185. 86.

27. పోణంగి శ్రీరామ అప్పారావు. పుట. 111. క్రీడాభిరామము - వీధినాటక వికాసము.

28. పోణంగి - నాటక వికాసము. పుట 132.

29. డా. కొర్లపాటి శ్రీరామమూర్తి - శ్రీనాథుడు - పుట. 200—201.

30. ఆంధ్ర కవి తరంగిణి - చాగంటి శేషయ్య. సంపు 4. పుట 48.

# 3. శృంగార శాకుంతలము
## (మూలము, అభిజ్ఞాన శాకుంతలము)

### కాళిదాసు – కాలాదులు

మహాకవి కాళిదాసు తన కావ్యములందెచటను, తన దేశ కాలాదులను గూర్చి వివరించి యుండలేదు. ఈతని కాలము నెఱుంగుటకై పలువురు విమర్శకులు పెక్కు పరిశోధనలు కావించిరి. వానిలో ఈతడు క్రీ.పూ. ప్రథమ శతాబ్దమునకు చెందిన వాడని కొందఱి మతము. ఇతడు క్రీ.శ. 400 ప్రాంతము నందలి వాడని మరి కొందఱి యభిప్రాయము. మొదటి మతము భారతీయ విద్వాంసులదనియు, రెండవ మతము పాశ్చాత్య పండితులదనియు తెలపవచ్చును.

నవరత్న కవులనుగూర్చి ఈ క్రింది శ్లోకము అనుశ్రుతముగా వచ్చుచున్నది.

> "ధన్వంతరి క్షపణకామర సింహ శంకు
> వేతాల భట్ట ఘట కర్పర కాళిదాసాః
> ఖ్యాతో వరాహ మిహిరో నృపతే స్సభాయాం
> రత్నానివై వరరుచి ర్నవ విక్రమస్య."

ఈ శ్లోకమువలన కాళిదాసు విక్రమాదిత్యుని ఆస్థానమునందలి నవరత్నములలో నొకడై యుండెనని తెలియవచ్చుచున్నది.

భరతఖండమున విక్రమార్క బిరుదముకల రాజులు పలువురున్నారు. విక్రమాదిత్యుడు ఉజ్జయిని సింహాసనమున క్రీ. పూ. 57వ సంవత్సరమున పట్టాభిషిక్తుడై తనపేర నొక శకము స్థాపించెననియు, దానికే 'సంవత్' అను పేరు ఉత్తర హిందూస్థానమున వాడుకలో గలదనియు ఒక వాదము. ఇట్లైన కాళిదాసు క్రీస్తుశకమునకు పూర్వుడగును. ఇట్లుగాక క్రీస్తుశకము 357-418 సం॥రం మధ్య విక్రమాదిత్య బిరుదమును ధరించి ఉజ్జయినీ ప్రాంతము నేలిన

గుప్త సార్వభౌముడగు ఇమ్మడి చంద్రగుప్తుని కాలమునందుండెనని మఱియొక వాదము.[2]

అలహాబాదు నగరమునకు దగ్గరగానున్న భీత నామక గ్రామమున, మార్షలు జోన్సు పండితునకు గుండ్రని లోహపు రేకులు కొన్ని లభించినవి. అందు శాకుంతల నాటక ప్రథమాంకమునగల, దుష్యంతుడు హరిణమును తరుముట, మునులాతనిని వారించుట, శకుంతల వృక్షసేచనము గావించుట మున్నగు అంశములు చెక్కబడి యున్నవట. ఈ రేకులు క్రీ. పూర్వము 137 నుండి 71 వఱకు పాటలీ పుత్రమును పాలించిన సంగవంశపు రాజుల కాలము నాటివని పరిశోధకు లూహించుచున్నారు.[3] దీనిని బట్టి క్రీ. పూ. ప్రథమ శతాబ్ది నాటికి శాకుంతల నాటకము ప్రసిద్ధి నొంది యుండెనని ఊహింప వచ్చును. మాళవికాగ్ని మిత్రమునందలి

'ఆశాస్య మీతివిగమ ప్రభృతి ప్రజానాం
సంప త్స్యతే నఖలు గోప్తరి నాగ్నిమిత్రే'

అనెడు భరత వాక్యమును బట్టి కాళిదాసు అగ్నిమిత్రునకు సమకాలికుడని చెప్ప వచ్చును. ఈ అగ్నిమిత్రుడు క్రీ. శ. మునకు పూర్వము రెండవ శతాబ్దముల విదిశానగరమును పాలించెను.

కాళిదాసు క్రీ. శకమునకు పూర్వము ప్రథమ శతాబ్దమునకు చెందిన వాడనియే నేటి విమర్శకులు పలువు రంగీకరించుచున్నారు. క్రీ. శ. ప్రథమ శతాబ్దమునకు చెందిన అశ్వఘోషుడు బుద్ధచరితమున రఘువంశ సరణి నను కరించుట కూడ ఈ విషయమును బలపరచు చున్నది. కాళిదాసు శాకుంతలము, విక్రమోర్వశీయము, మాలవికాగ్నిమిత్రము, అను మూడు నాటకములను రచించెను. రఘువంశము, కుమారసంభవము, మేఘదూతము, ఋతు సంహారము అనునవి ఈతడు రచించిన ప్రసిద్ధ కావ్యములు.

కాళిదాసు జీవితమును గూర్చి పెక్కు కథలు వ్యాప్తిలో నున్నవి. కాని అవన్నియును కల్పితములు. ఇతడు తన కావ్యములలో ఉజ్జయినీ నగరమును విశేషముగా వర్ణించుటను బట్టి, కవి కభిమానమగు నానగరము అతని నివాస స్థలమై యుండునని విజ్ఞుల యభిప్రాయము. ఈతడు బ్రాహ్మణుడు. శైవ మతస్థుడు.[4] ఈతడు రచించిన నాటకములు మూడింటి యందును ఆరంభమున శివ స్తోత్రము గలదు. ఈతడు భరత ఖండము నంతటిని సందర్శించి యుండు

ననియు, అందును ఉత్తర ప్రాంతమునంతను సందర్శించెననుటకు సందేహము లేదనియు తెలుపుచు, ఇట్లనుటకు, ఈతడు గావించిన హిమాలయాదుల విపుల వర్ణనములే సాక్ష్యములని శ్రీ కాలేగారు వివరించెరి [5] ఈతని కావ్యము లితనికి గల బహు శాస్త్ర పాండిత్యమును చక్కగ వెల్లడించు చున్నవి.

శకుంతల కథకు ఆది మూలము సంస్కృత మహా భారతము. అందీ కథ ఆది పర్వమునందలి అఱువది నాల్గవ అధ్యాయము మొదలుకొని డెబ్బది నాల్గవ అధ్యాయము వఱకును గలదు. మహా భారతము పురాణ ప్రాయమైన మహేతిహాసము. ఇందు ప్రసక్తాను ప్రసక్తముగ ప్రవేశించిన పెక్కు ఉపాఖ్యానములలో శాకుంతలోపాఖ్యాన మొకటి. వైశంపాయనుడు జనమేజయునకు పౌరవ వంశానుక్రమమును వివరించిన సందర్భమున చెప్పబడిన ఈ కథ విషయ ప్రధానముగను సంగ్రహముగను సాగినది.

భారతము నందలి శకుంతలోపాఖ్యానము :

దుష్యంతుడు పౌరవ వంశకర్త. ఆతడు మహాప్రభావుడై సముద్రావరణ పర్యంతముగల పృథివి నేలుచుండెను. ఆతడొకనాడు చతురంగ బల సమేతుడై సపరివారముగ మృగయా వినోదమునకై కడంగి, వనాంతరము చొచ్చుచు మాలినీ నదీ తీరమునందున్న కణ్వాశ్రమము సమీపించెను. రాజు ఆ మహర్షిని సందర్శింప గోరి వినీత వేషుడై ఆశ్రమమున కరిగెను.

అట దుష్యంతునకు, అసామాన్య లావణ్యరాశి యగు నొక తాపస కన్య స్వాగత సత్కారములను గావించి తాను కణ్వపుత్రియగు శకుంతల ననియు, తన తండ్రి పండ్లు తేర నడవికి వెడలెననియు ఆతనికి విన్నవించినది. శకుంతల రూపము రాజు నాకర్షించినది. ఆతడామెను ఊర్ధ్వరేతుడని కీర్తిగాంచిన కణ్వ మహర్షి ఆమెకు జనకుడగుట ఎట్లు సంభవించెనని ప్రశ్నించెను. అంత శకుంతల కణ్వుడు ఎవరికో చెప్పుచుండగా తాను వినిన మేనకా విశ్వామిత్ర ప్రణయ గాథతో కూడిన తన జన్మవృత్తాంతమును రాజునకు వివరించెను. ఆమె విశ్వామిత్ర రాజర్షి పుత్రిక అయినందులకు సంతసించి దుష్యంతుడు ఆమెను గాంధర్వ విధిని వివాహ మాడగోరెను. అంత శకుంతల తనకు ఆతని వలన కలుగు పుత్రునికి యౌవరాజ్యాభిషేకముచేయునట్లు అతనిని ప్రతిన చేయుమనెను. రాజందులకు అంగీకరించి ఆమెను వివాహమాడి తిరిగి నగరికి మరలుచు ఆమెను త్వరలో యథావిభవముగ రాజధానికి పిలపించు కొనెదనని పల్కెను.

పిమ్మట కణ్వుడు ఆశ్రమమున కరుదెంచి దివ్యజ్ఞానముతో జరిగిన దాని నంతను గ్రహించెను. శకుంతల పురుషోత్తముడగు దుష్యంతుని ధర్మవిహితముగా వివాహమాడినందులకు సంతసించి ఆతడామెను దీవించి వరములిచ్చెను.

పతి సమాగమమున శకుంతల గర్భము ధరించి మూడు సంవత్సరములు గర్భము మోసి చక్రవర్తి చిహ్నముగల ఒక పుత్రుని కనెను. వాడు చిఱుత ప్రాయముననే గజ సింహాదులనుబట్టి వానితో ఆటలాడుచుండెను. ఋషు లాతనికి సర్వదమనుడు అను నామమిడిరి. వాడచటనే ఆఱు సంవత్సరములు పెరిగెను. కాశ్యపుడా కుమారుని పరాక్రమమునుగాంచి ఆతనికి యౌవరాజ్య పట్టాభిషేక మాచరింప వలసిన సమయ మరుదెంచినదని నిశ్చయించి, శకుంతలను పుత్ర సహితముగ రాజగృహమున కనుపుటకు సమకట్టెను.

కణ్వుని ఆదేశాను సారము శిష్యులు శకుంతలాసర్వదమనులను రాజ నగరిలో విడిచి వచ్చిరి. శకుంతల రాజు కడకు పోయి ఆతడు తన్ను పరిగ్రహించుట నెఱింగించి, పుత్రుని యౌవరాజ్య పట్టాభిషిక్తు నొనరింపుమనెను. దుష్యంతుడు సర్వము తెలిసియుండియు, లోకాపవాదభీతిచే ఆమె నెఱుంగని వాని వలె నటించి ఆమె నటనుండి వెడలి పొమ్మనెను. అంత శకుంతల ఆతని మాటలకు రోషము పూని అసత్యమాడుట దోషమనియు, భార్యాపుత్రులను త్యజించుట ధర్మము కాదనియు పలికెను. రాజు వర్తనము నందు మార్పు కానరాదాయెను. శకుంతల మిక్కిలి కోపముతో ఆతడు నిరాకరించినను తన పుత్రుడు సకలపృథ్వీ మండలమును బాలింప గలడని విశదీకరించి రాజ సభను విడిపోదలంచెను. అంత సభ్యులెల్లరు ఆశ్చెరు వొందునట్లుగా శకుంతల వచనములు సత్యములనియు, ఆ కుమారుడు దుష్యంతుని కుమారుడనియు ఆ శరీర వాణి పల్కినది. అపుడు రాజు లోకనిందకు వెఱచి కపటముగ నట్లు వర్తించితినని చెప్పి శకుంతలను, భరతుడని పేరు వడసిన సర్వదమనుని సాదరముగ గ్రహించెను.

## అభిజ్ఞాన శాకుంతలము నందలి కథ

ప్రథమాంకము :— హస్తినాపురమునేలు దుష్యంత మహారాజొక వేసంగిలో మృగయా వినోదార్థమై వెడలి మిక్కిలి వడిగల యొక జింకచే నాకర్షింపబడి

దానిని తఱుముచు పరివారమునువదలి బహుదూర మేగెను, అతడా జింక పై బాణ ప్రయోగము చేయునంతలో కణ్వశిష్యులాతని కెదురై బాణోపసంహార మును గావింప వలసినదని కోరుచు ఆ సారంగము ఆశ్రమ మృగమని అతనికి తెలిపిరి. రాజు వారి వాక్యములను మన్నించి బాణము నుపసంహరించెను. వారు దుష్యంతుని వర్తనమునకు సంతసించి, ఆతనికి చక్రవర్తికాగల పుత్రు డుద యింపగలడని దీవెనలిచ్చి కణ్వాశ్రమమునకు విచ్చేసి అట ఆతిథ్యము కొని పోవలసినదనికోరిరి. కణ్వుడు తన పుత్రియగు శకుంతల ప్రతికూలదైవమును శమింపజేయుటకై సోమతీర్థమునకేగెననియు, తపోవనమునందు అతిథి సత్కా- రమునకు శకుంతలను నియమించెననియు మునులు రాజునకు తెలిపిరి. దుష్యం తుడు వినీత వేషుడై ఆశ్రమము ప్రవేశించెను, అట నాతనికి శుభ సూచనలు పొడమెను. పిమ్మటనతడు, ఆశ్రమాంతికమున విస్రంభ ప్రలాపములు చేయుచు వృక్షములకు జలసేచనము గావించుచున్న మూవురు తాపస కన్యలను గాంచి వారి రూప లావణ్యముల కబ్బురపడెను. అతడొక తరుచ్ఛాయ నాశ్రయించి వారి ఆలాపములను విని, ఆకన్యలలోనొకతె కణ్వదుహిత శకుంతల యనియు, మిగిలిన ఇరువురు నామె చెలికత్తెలగు అనసూయా ప్రియంవదలనియు నెఱిం గెను శకుంతల ఎడ రాజున కనురాగ ముదయించెను. కాని ఆమె బ్రాహ్మణ కన్య యేమో అన్న సందేహ మాతనిని బాధించెను. అంతలో సలిలసేక సంభ్ర మమున నవమాలికా పుష్పము నుండి లేచి యొక తుమ్మెద నెత్తమ్మియను భ్రాంతితో శకుంతల వదనముపై వ్రాలెను. శకుంతల కలవరపడెను. తాను బయల్పడుటకదియే మంచి సమయమని ఎంచి రాజు భ్రమరము నదల్చు నెప మున వారి ముందుకు పోయెను. రాజును గాంచిన శకుంతలయందు ఆశ్రమ విరుద్ధమైన మనో వికారము గలిగెను. అనసూయా ప్రియంవదలు రాజున కుచి తముగ స్వాగతమొసంగి సిగ్గుతోనున్న శకుంతలను గౌరవించి అట కూర్చుండ చేసిరి. రాజు వారితో సంభాషించుచు శకుంతల జన్మ వృత్తాంతము నెఱింగి కణ్వుడామెకు వివాహముచేయ నిశ్చయించినాడని కూడ తెలిసికొని ఆనం దించెను.

ఇంతలో వెనుక బడిన రాజసైన్యము ఆశ్రమ ప్రాంతమునకు చేరినది. ఆ అలజడికి అడవి ఏనుగొకటి చెలరేగి ఆశ్రమ ప్రాంతమును విధ్వంసము గావించుచున్నదని ఎఱింగి ముని కన్యలు రాజునొద్ద సెలవు గైకొని వెడలిరి. రాజు ఆశ్రమరక్షణమునకై కదంగెను.

ద్వితీయాంకము :— శకుంతలపై వలపు నిలిపిన రాజునకు వేటపై ఆసక్తి నశించెను. అతడు తన సఖుడగు మాధవునికి శకుంతలను గూర్చి చెప్పి, తిరిగి ఆశ్రమము ప్రవేశించి ఆమెను గాంచుట కేదైన ఉపాయమును బోధింపుమని అడిగెను. అంతలో ఇద్దరు మునికుమారులు రాజు కడకేతెంచి తమ యిష్టికి విఘ్నమాచరించుచున్న రాక్షసుల బారినుండి తపోవనమును రక్షింప వలసినదిగా కోరిరి. రాజందులకు సంతోషముగా నంగీకరించెను. ఇంతలో రాజమాత కడ నుండి దుష్యంతునికి నగరమునకు రావలసినదిగా తెల్పు నొక వర్తమాన మందెను. రాజుకర్తవ్యము నాలోచించి, రాజ మాత పుత్రసమానునిగా గారవించు విదూషకుని తనకు బదులుగా రాజధాని కంప నిశ్చయించి ఆశ్రమ ప్రశాంతతకు భంగము కలుగ కుండ తన పరివారమునుకూడ అతనితో పంపి వేసెను.

తృతీయాంకము :— దుష్యంతుడు ఆశ్రమము ప్రవేశించినంత మాత్రముననే సవనము నిరుపద్రవ మయ్యెను. శకుంతల మదనతాపమునకు గురియై బాధపడుచుండ సఖులామెను లతామండపమునకు చేర్చి శీతలోపచారములను గావించుచు ఆమె మనసులోని కోరిక నెఱింగి అది సఫలమగుటకు మార్గము నన్వేషింప దొడంగిరి. ప్రియంవద సూచన ననుసరించి శకుంతల రాజున కొక ప్రణయ లేఖ వ్రాసెను. శకుంతల నన్వేషించుచు లతామండపమును చేరి కన్యల సంభాషణము వినుచుండిన రాజు వారి ఎదుటికి పోయి శకుంతలపై తనకు గల అనురాగమును వారికి వెల్లడించెను. సఖులు వారిరువురకు ఏకాంతము కల్పించిరి. రాజు లజ్జాన్వితయైన శకుంతల ననునయించి, గాంధర్వ వివాహము క్షత్రియ కులోచితమని ఆమెకు చెప్పెను. అంతలో వృద్ధ తాపసి యైన గౌతమి శకుంతల శరీరస్థితిని విచారించుటకై ఏతెంచు చున్నదని చెలు లన్యాపదేశముగా హెచ్చరిక గావించిరి. శకుంతల రాజును పొదలమాటున దాగుకొమ్మనెను. గౌతమి ఏతెంచి శకుంతల కుశలము నరసి ఆమెను తన వెంట ఆశ్రమమునకు కొని పోయెను. శకుంతల రాజునకు పునస్సమాగమము చంద్రోదయమున కాగలదని వ్యంగ్యముగ చెప్పెను. రాజు ఈ అంతరాయమునకు చింతించుచుండ సాయం సవనమునకు రాక్షసోపద్రవము కలిగెనను నెలుగు వినబడెను. రాజు సవనరక్షకై యరిగెను.

దుష్యంతుడు శకుంతలను గాంధర్వవిధిని వివాహమాడెను. వారిరువురును కొన్ని దినములు మాలినీ నదీ తీరమున రహస్యముగ విహరించిరి. సవనము

నిర్విఘ్నముగ పూర్తియైనది. రాజు నగరికి మఱలుటకు మును లనుమతించిరి. అతడు శకుంతలకు స్వనామాంకితమగు నొక అంగుళీయకము నిచ్చి, అందలి అక్షరములు రోజున కొకటి చొప్పున లెక్కింప నవి ముగియునాటికి తానామెను అంతఃపురమునకు పిలిపించుకొనియెదనని మాట ఇచ్చి వెడలిపోయెను.

చతుర్థాంకము :— భర్తృ విరహమున శకుంతల అన్యమనస్కయైనది. ఆ సమయమున అతిథియై వచ్చిన దుర్వాసుడామె తన్నాదరింప కుండుట కలిగి అమె ఎవ్వరిని గూర్చి తలపోయుచున్నదో అతడామెను మఱచునని శాపమిచ్చెను. దుర్వాసుని శాపము వినిన చెలులు మిక్కిలి కలత చెందిరి. ప్రియంవద వేగమె పోయి మునిని ప్రార్థించి ఆతని అనుగ్రహము వడసెను. ఏదేని అభిజ్ఞానమును చూపిన శాపము తీరునని ముని పల్కెను. సఖులీ శాప సమాచారమును శకుంతల కెఱిగింప లేదు.

కణ్వ మహర్షి సోమ తీర్థము నుండి ఆశ్రమమునకు తిరిగి వచ్చెను. అతి డగ్ని శరణము చొరగనే శకుంతలా వివాహవృత్తాంతము తెలిపి, ఆమె దుష్యంతుని వలన గర్భము దాల్చినదని అశరీర వాణి పల్కెను. అంత నతడు కుమారికను దీవించి ఆమెను భర్తృ గృహమున కంపుటకు నిశ్చయించెను. అతడు శకుంతలకు అత్తవారింట మెలగ వలసిన విధానమును చక్కగ బోధించి, గౌతమిని శార్ఙ్గరవ శారద్వతులను దోడిచ్చి ఆమె నత్తవారింటికి పంపెను. ఆమె వెడలు నపుడు అనసూయాప్రియంవదలు 'రాజామె ఎడ నిరాదర భావమును ప్రకటించినచో ఉంగరమును చూపు' మని బోధించిరి. కశ్యపుడు పుత్రికా వియోగమున కలత చెందిన వాడయ్యును పరార్థమగు కన్యను భర్త కడ కంపుటచే, న్యాసమును తిరిగి ఇచ్చిన వాని వలె నూఱట చెందెను.

పంచమాంకము :— దుర్వాసుని శాప ప్రభావమున రాజు తాను శకుంతలను పరిణయమాడిన వృత్తాంతము మఱచిపోయెను. గౌతమియును, ఋషి పుత్రులును శకుంతలను రాజ సమక్షమునకు గొనిపోయిరి. శార్ఙ్గరవుడు రాజునకు కాశ్యప సందేశమును వినిపించెను. శాపోపహతుడై శకుంతలను మఱచిన రాజు తాను శకుంతలను వివాహమాడిన విషయము నమ్మక శకుంతలను నిరాకరించెను. ఆమె చేత నున్న ఉంగరమును రాజునకు చూపదలచెను. కాని ఉంగరము కానరాలేదు. ఆ ఉంగరము శచీతీర్థమున స్నానావసరమున జారి

యుండునని గౌతమి తలంచెను. ఋషి పుత్రులు శకుంతలా స్వీకరణ, నిరాకరణములను రాజునకే వదలి తాము ఆశ్రమమునకు మరలిరి. రాజు తన పురోహితుని ధర్మ సందేహ మడిగెను. కార్తాంతికులు దుష్యంత పుత్రుడు చక్రవర్తి లక్షణ సమేతుడగునని నిశ్చయించిరి కాన శకుంతలను ప్రసవ మగునంతవఱకు తన యింట నుంచు కొనెదననియు, జన్మించిన శిశువు చక్రవర్తి లక్షణములు కలవాడేని రాజామెను పరిగ్రహింపవచ్చుననియు పురోహితుడు పల్కెను. తన దీనస్థితికి శకుంతల దుఃఖించుచు పోవుచుండ ఆమెను స్త్రీరూపమైన యొక జ్యోతి పొదివి యెత్తుకొని అప్సర స్తీర్థమునకు గొనిపోయెను.

షష్ఠాంకము :— ఒక నాడొక జాలరి రాజ నామాంకితమగు నొక యంగుళీయకమును నగరిలో అమ్మజూపి రక్షక భటులచే పట్టుబడెను. వాడది తనకు మత్స్య గర్భమునందు దొరికినదని చెప్పెను. భటులతనిని రాజు కడకు కొని పోయితద్వృత్తాంతము విన్నవించిరి. అంగుళీయకమును కనగనే రాజు మనమున అసితచ్ఛాయలు తొలగి ఉషోదయమైనట్లు శకుంతలా వృత్తాంతమంతయు స్మృతికి వచ్చినది. అతడు పశ్చాత్తాపముచే పొగుల జొచ్చెను. అతడు తనకు ప్రియాస్మృతిని కలిగించిన జాలరిని మిక్కిలిగ బహూకరించి పంపివేసెను.

జ్యోతి రూపమును ధరించి శకుంతలను గొని పోయినది మేనక. ఆమె శకుంతలను హేమకూటమునందలి మారీచాశ్రమమున అదితి పాదముల కడ చేర్చెను. అదితి ఆశ్రమమున శకుంతల ఒక మగ శిశువును ప్రసవించెను. మేనక ఆదేశమున హస్తినకు వెడలి శకుంతలా వియోగ దుఃఖితుడై యున్న దుష్యంతుని గాంచిన సానుమతి, దుష్యంతునకు శకుంతలపై నిశ్చలానురాగమున్నందులకు సంతసించెను. దుర్జయ సంహారమునకై ఇంద్రుని యొద్ద నుండి వచ్చిన పిలుపు నందుకొని దుష్యంతుడు మాతలితో ఇంద్రపురికి తరలెను.

సప్తమాంకము :— దుర్జయ సంహారము నిర్విఘ్నముగ ముగిసినది. దుష్యంతుడు ఇంద్రుని వీడ్కొని మరలి వచ్చుచు మార్గమునందున్న మారీచాశ్రమమును సందర్శింప గోరెను. ఆ ఆశ్రమ ప్రాంతమునం దాతనికి సింహకిశోరములతో క్రీడించుచున్న ఒక బాలుడు కన నయ్యెను. ఆ బాలుని సత్త్వమును బట్టి అచటి తాపసు లాతనికి సర్వదమనుడని పేరిడిరి. ఆ కుమారుని ఎడ రాజునకు మమతానురాగము లుదయించెను. బాలుని రక్షాకంకణము క్రింద

పడగా రాజు దానిని తీసి ఆతని కిచ్చుటను చూచిన తాపస కన్యలు అరక్షాకంకణ ప్రభావమును బట్టి దుష్యంతుడే సర్వదమనుని జనకుడని గుర్తెఱింగిరి. దుష్యంతుడు శకుంతలను గలసికొని అదితి మారీచుల ఆశీర్వాదమును బడసి, సతీ పుత్రులతో రాజధానికి మరలెను.

## శృంగార శాకుంతలము నందలి కథ :

ప్రథమాశ్వాసము :— హస్తినాపురమును దుష్యంతమహారాజేలు చుండెను. ఒక నాడాతని కడకు కొందఱు పుళింద వల్లభులేతెంచి ఆతనిని వేటకాహ్వానించిరి. రాజు మృగయాయత్త శీలుడై పరివారముతో వనమున కేగెను. ఆ వనమున గోపాలకులు రాజు రాక నెఱింగి ఆతని సముచితముగ సత్కరించి తమ యూర ఆనాటి రాత్రి విశ్రమింప గోరిరి. మాండవ్యుడు రాజు వేటకు తరలు నపుడు శుభశకునములు తోచుటను నిరూపించి భోజనాహ్వానము కార్యఫల సిద్ధికి మూలమని వ్యాఖ్యానించి గొల్లల ఆహ్వానమును రాజుచే అంగీక రింప జేసెను. రాజు గోపాల నాయకుడిచ్చిన విందును సేనాసమేతుడై యూర గించి ఆ రాత్రి కట విశ్రమించెను.

ద్వితీయాశ్వాసము :— మఱునాడు సూర్యోదయమున రాజు సుభట ప్రకరములను గూడి వేట కనువగు దెస నరణ్యమున కేగెను. అతడు మృగ ముల నెల్ల బాణ పతితముల గావించుచు మృగయా వినోదము ననుభవించు చుండ అతని దృష్టి నొక చక్కని ఇఱ్ఱి ఆకర్షించెను. అత డధిజ్యశరుడై దానిని వెంబడించుచు బహుదూర మేగి మాలినీతటమును చేరెను. ఆ ప్రదేశము ఆశ్ర మాంతికమగుటచే స్థల ప్రభావమున అతడు జింకపై ఎంతయు కరుణ గల వాడయ్యెను. అంత బ్రహ్మ తేజోధికు లగు నిర్వురు బ్రహ్మచారులు వెంటరాగా నొక వృద్ధ తాపసి రాజును సమీపించి ఆ జింక ఆశ్రమ వాసులచే కడు గారాబ ముగ పెంచబడినదనియు, దానిని రక్షింపవలెననియు వేడెను. రాజు వారి వాక్యముల మన్నించి జింకను విడిచెను. మును లాతని వినయమునకు సంతుష్టులై ఆతనిని దీవించి కణ్వాశ్రమమును సందర్శించి పోవలసినదని అర్థించిరి.

దుష్యంతుడు రథసారథులను మాలినీ నదీ తీరమున నిలిపి, ధనుర్బాణ ముల నుజ్జగించి తపోవనము చొచ్చెను. అచట నాతడు నాలుగైదు పదము లేగి

నంత నతనికి వృక్షసేచనము గావించుచున్న తాపసకన్యల ఆలాపరవము వినఁబడియెను. ఆత డటువైపేగి లావణ్యవతులైన మువ్వురు కన్యలను కనుగొనెను. వారిలో శకుంతల దివ్యలావణ్య మాతని మనమును హరించినది. ఆమె యందు క్షత్రియుడైన తన చిత్తము తగులుకొన్నకతమున ఆమె ముని కన్య కాకుండ వలెనని తలంచి వారి మాటల వలననే తన సంశయములు తీరు ననుకొనుచు చాటున నుండి వారి ఆలాపములను వినసాగెను.

అంతలో నొక తేటి కమల భ్రాంతిచే శకుంతల వదన మండలము నాక్రమించెను. శకుంతల భయపడి తన్ను రక్షింపు మని చెలులను వేడెను. వారామెను పరిహసించిరి. రాజు తాను వారి ఎదుట పడుటకు అదే తగిన సమయమని మఱుగున నుండి వారి ముందుకు వచ్చి శకుంతల మధుప బాధ నపనయించెను. అనసూయాప్రియంవదలు ఆతనికి స్వాగతము పల్కిరి. రాజు తాను దుష్యంతుడనని వారి కెఱిగించెను. శకుంతల దుష్యంతుని పై వలపు నిలిపెను. అంత అనసూయా ప్రియంవదలు అతిథియైన రాజునకు అర్ఘ్య పాద్యము లొసంగుటకై శకుంతలను పర్ణశాలకు గొని పోయిరి.

ఆ చెలులు రాజునకు అర్ఘ్య పాద్యములను సిద్ధముగావించి ఆతనిని పర్ణశాలకు తోడ్కొని రమ్మని ఒక ముని బాలకునాతని కడకంపిరి. రాజు ఆ బ్రహ్మచారి వలన ఆమె మేనకా విశ్వామిత్రులకు జన్మించిన దని తెలిసికొని మిక్కిలి సంతసించెను.

అంతట సాయంసమయ మైనది. కన్యలిచ్చు ఆతిథ్యమును గొనుటకై రాజు శిష్యునితో పర్ణశాల కరుగుచుండ వేట పులి యొకటి మృగయుల నుండి తప్పించుకొని ఆశ్రమ పదమును ప్రవేశించినది. దాని భీకరాకారమును గాంచి ముని కుమారుడు భీతి నొంది రాజును శరణు వేడెను. రాజు ఆ వ్యాఘ్రమును బంధించి దానిని నిజస్కంధావారము చేర్చెను. అప్పటికి చరమసంధ్య యగుటచే రాజు బ్రహ్మచారికి తాను పర్ణశాలకు మరునాడు వత్తునని తెలిపి విడిదికి చేరెను. అచట నతడు సంయమీంద్ర కుమారికను దలచు కొనుచు చింతామగ్నుడై తన చెలికాడగు మాండవ్యునికి శకుంతలా సౌందర్యమును వర్ణించి చెప్పి ఆమెపై తనకు గల అనురాగము నెఱింగించెను.

ఆశ్రమమున శకుంతలయు మునికుమారుని వలన జరిగిన వృత్తాంతము నెఱిగి, రాజు తన జన్మప్రకారమును నడిగి దాని నాసక్తితో ఆలకించినాడని విని

సంతసించి మదనబాణవేదనచే కలత చెందెను. ఆ రాత్రి వారికొక బ్రహ్మ కల్పము వోలె గడిచెను.

తృతీయాశ్వాసము :— శకుంతలాయత్త చిత్తుడగు రాజు వేట చాలించెను. మాండవ్యుని సారథిని, కతిపయాప్త పరిజనమును దప్ప తక్కిన వారినందఱిని నగరికి పంపించెను. అంత మునికుమారు లిరువురు రాజుకడ కేతెంచి ముని లతిగాత్రమను నొక క్రతువును తలపెట్టిరనియు, తత్సంరక్షణార్థమై అతనిని రమ్మని ప్రార్థింప తమ్మంపిరనియు తెల్పిరి. రాజు వారి అభ్యర్థన మన్నించి రథస్థుడై యజ్ఞ శాలకేగి అచటి మునుల కభయ మిచ్చెను. దుష్యంతుని సవన రక్షణ పరాయణత రాక్షసులకు కంటక ప్రాయ మయ్యెను.

రాజు శకుంతలా సందర్శనమును గోరి చనుచు నొకలతామండపమున విరహిణియైన శకుంతలను గాంచెను. చెలు లామెకు శైత్యోపచారములను గావించుచుండిరి. రాజు చాటున నుండి వారిని తిలకించుచుండెను. శకుంతల తన మనము రాజాంకితమైనట్లు చెలులకు తెలిపెను. చెలులు శకుంతల యను రూపుడగు వరుని కోరినందులకు సంతసించిరి. శకుంతలకు తగిన వల్లభుడు లభింపవలెనని ఉమావల్లభుని సేవింప సోమతీర్థమున కరిగిన కశ్యపుడు కూడ దీనిని విని సంతసించునని వారు భావించిరి. వారు శకుంతలపై రాజున కెట్టి యభిప్రాయము కలదో కనుగొన నెంచిరి. రాజు వారి ఎదుటి కేతెంచెను. చెలులు రాజునకు శకుంతల వలపును దెలిపి ఆమెను చే పట్టి రక్షింపు మని కోరిరి. రాజు తాను గాంధర్వ విధిని శకుంతలను వివాహమాడెదనని పల్కెను. అంత చెలులు శకుంతలకు దుష్యంతుని వలన జనించు పుత్రుని యౌవరాజ్య పదస్థుని గావింప వలెనని కోరిరి. రాజందులకు సమ్మతించెను. శకుంతలా దుష్యంతులకు గాంధర్వ వివాహమైనది. వారిరువురిని చెలులు పల్లవతల్పమునకు గొనిపోవు నెడ సంధ్యాకాలమున సవనవిఘ్న మాచరించు నక్తంచరుల నిష్ఠుర భేరీరవము విన వచ్చెను.

అంత దుష్యంతుడు మునుల ఆర్తిని విని మహార్థమైన శతయక యాగ సంరక్షణమునకై కడంగెను. అతడు రాక్షససేనతో భయంకర సంగ్రామము నెఱపి దానవాధిపుడైన కాళికాముఖుని బ్రహ్మాస్త్రముచే భస్మీభూతుని గావించెను. మునులు ఆనందించి అతని నాశీర్వదించిరి. పిదప నాతడు విరహతప్త యగు శకుంతలను చేరి, ఆమె ననునయించి ఆమెతో క్రీడించెను.

సప్తతంతు యాగము పరిపూర్ణమైనది. మునులు రాజునకు రాజధానికేగ ననుమతి నిచ్చిరి. రాక్షసులతో తమ రాజునకు పోరు కల్గెనని తెలిసికొని ఆతనికి సాహాయ్యమొనరింప రాజధాని నుండి సేన లేతెంచెను. దుష్యంతుడు హస్తినకు మరల దలచి శకుంతల కావార్త నెఱింగించెను. అత డామెను త్వరలో అంతిపురికి రప్పించుకొనెదనని చెప్పి, ముద్రాంగుళీయకమునామె వ్రేలికి తొడిగి, ఎట్టకేలకామె అనుమతి పడసి నగరికి మరలెను.

చతుర్థాశ్వాసము :— సోమతీర్థమున తప మాచరించు కణ్వ మహర్షి జ్ఞాన దృష్టితో శకుంతలా వివాహము నెఱింగి, ఆశ్రమమునకు తిరిగి వచ్చెను. శకుంతల తండ్రి యెడ భక్తి గౌరవములను చూపుచు జరిగిన వృత్తాంతము నాతనికి విన్నవించెను. కణ్వుడు శకుంతలా వివాహము ధర్మబద్ధమైనదని తలంచి సర్వమునీ జనాంగీకారమును బడసెను.

ప్రాణవల్లభుని గూర్చి చింతించుచు శకుంతల అతిథియై చనుదెంచిన దుర్వాసుని సత్కారమును మఱచెను. అంత నతడు కోపించి భర్త ఆమెను మఱచు నట్లు శపించెను. అనసూయ మునిని ప్రార్థించి ఆతని అనుగ్రహము పడసెను. ముద్రికా సందర్శనమున ప్రియుడు శకుంతలను గుర్తింపగలడని ముని నుడివెను. శాప ప్రభావమున దుష్యంతుడు శకుంతలను మఱచి రాజ్య కార్యమగ్నుడాయెను.

శకుంతల గర్భము దాల్చి నవ మాసములు నిండినపిమ్మట ఒక పుత్రుని కనెను. మునులాతనికి భరతుడను నామమిడిరి. కణ్వుడు శకుంతలను పతిసన్నిధికి పంప నిశ్చయించి ఆమెకు సతీధర్మములను బోధించి, అనసూయను, ప్రియంవదను, ఇద్దరు శిష్యులను ఆమెకు తోడిచ్చి పంపెను.

శకుంతలను విస్మరించిన రాజు ఆమెను నిరాకరించెను. అనసూయా ప్రియంవదలు ఆతని మాటలకు ఆగ్రహించి సతీ పుత్రులను విడనాడుట రాజునకు ధర్మము కాదని బోధించిరి. వారు సత్యమును దెల్పుడనుచు దేవతల నెలుగెత్తి పిల్చిరి. అంత నాకాశవాణి రాజునకు శకుంతల ఆతని సతియనియు, ఆ బాలు డాతని కుమారుడనియు ఎఱింగించెను. ఆ పలుకులు విని అనసూయా ప్రియంవదలు రాజు నధిక్షేపించుచు ఆతనికి ఉంగరమును జూపిరి. తద్దర్శనముతో ఆతనికి సర్వమును జ్ఞప్తికి వచ్చెను. ఆతడు శకుంతలను నిరసించినందు

లకు పం తపించి, కుమారుని గ్రహించి సభకు విషయము నంతను వివరించెను. అంత నారదు డట కేతెంచి రాజునకు విస్మృతి కలుగుటకు గల కారణమును వివరించి ఎల్లర మనసుల కలత దీర్చెను. దుష్యంతుడు శకుంతలను పట్టమహిషిగను, పుత్రుని యువరాజుగను ప్రకటించెను. నారదుడు యువరాజునకు రాజధర్మము లుపదేశించెను.

## అభిజ్ఞాన శృంగార శాకుంతలములు; నామౌచిత్యము :

అభిజ్ఞాన శాకుంతలమను సమాసము యొక్క విగ్రహమును గురించి పలువురు పలు విధముల వ్రాసియున్నారు. అభిజ్ఞాన స్మృతాశకుంలా, అభిజ్ఞాన శకుంతలా (శాకపార్థివాదివత్) యస్మిన్ తత్ అని కొందఱును 'అభిజ్ఞానంచ శకుంతలాచ (ద్వంద్వము) అభిజ్ఞాన శకుంతలే; తేయస్మిన్ తత్ అని కొందఱును, అభిజ్ఞానేన స్మృతా శకుంతలా యస్మిన్ తత్ (మధ్యమ పదలోపి) యని కొందఱును వ్రాసియున్నారు.[6]

అభిజ్ఞాన మనగా చిహ్నము, గుర్తు, కాళిదాసు తన నాటక కథయందీ అభిజ్ఞానమగు అంగుళీయకమునకు మిక్కిలి ప్రాధాన్యమొసగెను. దీని ద్వారమున అతడొక ప్రధాన కథాప్రయోజనమును సాధింపనెంచెను. నాటక ప్రథమాంకముననే ఈ అంగుళీయక ప్రస్తావము వచ్చినది. రాజు శకుంతలను ఋణవిముక్తను గావింపదలచి ఆ అంగుళీయకమును ప్రియంవద కొసంగబోయెను. ముని కన్యలకు భూషణములు అక్కఱలేదు. కాని రాజు తన హృదయమునే శకుంతల కర్పితము గావింప వలెనన్న తొందరలో అంగుళీయకము నీయబోయెను. కాని వారు దానిని గ్రహింపలేదు. ఈ సందర్భమున తమ జీవితముల యందీ ఉంగరము ప్రాధాన్యము వహించునని నాయికానాయకు లెఱుగరు. పై ప్రస్తావము యథాలాపముగ జరిగినది. రాజు గాంధర్వమున శకుంతలను పరిణయమాడి నగరికి మరలుచు, స్వనామ ముద్రాంగుళీయక మామెకిచ్చి ఇట్లు చెప్పెను.

> ఏకైక మత్ర దివసే దివసే మదీయం
> నామాక్షరం గణయ గచ్ఛసి యావదంతమ్
> తావత్ ప్రియే మదవరోధ నిదేశ వర్తీ
> నేతా జన స్తవ సమీప ముపేష్యతీతి 3-12

'ఉంగరములోని నామాక్షరములు దినమున కొక్కటిగా గణించుచుండ నవి ముగియు సరికి నా రాణి వాసమునకు నిన్ను పిలిపించుకొనియెదనని యిందలి భావము. రాజట్లు వచించి వెడలిన పిదప పతిధ్యానమున మునిగి యున్న శకుంతలకు దుర్వాసుని శాపము కలిగినది. అతడు అభిజ్ఞానము చూపించిన ప్రియుడు గుర్తింప గలడని తిరిగి అనుగ్రహ వచనములను పలికెను. నాయికా నాయకుల సమాగమమునకు గుర్తుగా మిగిలినది ఉంగర మొకటియే. అది కథయం దత్యంత ప్రాధాన్యము వహించుచున్నది. శకుంతల భర్తృ గృహము నకు వెడలు సమయమున చెలులు అతిస్నేహము పాపశంకి అనుచు, శకుంత లతో పతి నిరాకరించిన ఉంగరము చూపుమనిచెప్పిరి. శకుంతల దానిని శక్ర తీర్థమున జారవిడిచినది.

ఈ అభిజ్ఞాన కల్పనము వలన కాళిదాసు నాయికా నాయకుల ప్రేమను ఇంద్రియాతీతమైన దానినిగా నిరూపింపదలచెను. నాయకుడు కణ్వాశ్రమము ప్రవేశించి అమ్మహర్షిని గూర్చి కుశల ప్రశ్నములైన చేయక, శకుంతలా సౌందర్యమును గాంచి మోహమగ్నుడాయెను. నాయిక ఎడల అతనికి జనించిన అనురాగము ఐహికమైనది. శకుంతల గూడ దుష్యంతుని పొందుకోరినది. తండ్రి తనకు ఆదేశించిన 'అతిథిసత్కార' కార్యమును పూర్తిగ విస్మరించి, దుర్వాసునికి స్వాగతమీయక పరధ్యానమున బడినది. ఇట్టి స్వయం కృతా పరాధమునకు తగిన శిక్షను పొందినది. అంగుళీయకమును జార విడుచుటకు కూడ అశ్రద్ధయే కారణము. అటుపై నాయికా నాయకులకు కలిగిన వియోగము వారి చిత్తములను శాశనము గావించినది. కావుననే కవి అభిజ్ఞానము పోవు నట్లును, శకుంతల దానిని తిరిగి పొందు నట్లును చేసి రాజును దుర్భర దుఃఖమున ముంచెను. ఈ అభిజ్ఞాన సందర్శనము రాజును సతీనిరసనముపట్ల పశ్చాత్తప్తుని గావించినది. పుత్రునికొఱకు విలపింపజేసి అతని మనమును గార్హ స్థ్య ధర్మమునకు మరల్చినది. మారీచాశ్రమమున దుష్యంతుడు కనిన శకుంతలా రూపమిది.

'వసనే పరిధూసరే వసానా నియమ క్షామముఖీ ధృతైక వేణీ,
అపి నిష్కరుణస్య శుద్ధశీలా మమ దీర్ఘం విరహవ్రతం బిభర్తి. 7-21

ఈ శకుంతలా రూపము కణ్వాశ్రమమందున్న మూర్తికి భిన్నమైనది ఇది నాయకునకు మోహము కలిగింపక, అతని పూర్వ చర్యకు సిగ్గిలచేసి అమెపై

విశుద్ధ ప్రేమను నెలకొల్పినది. శకుంతలకూడ ఇన్ని దినములు తన తప్పిదమునకు విధి వేసిన శిక్ష ననుభవించి సర్వ సౌఖ్యములను వదలి పతివ్రతా దీక్షను పూనినది. ఇట్టి స్థితి యందు వారిపురి పునస్సమాగమము అతిలోకమై భాసించినది. ఇట్లు ఈ అభిజ్ఞానము కవ్యుద్దిష్టప్రయోజనమును సాధించి నామమును సార్థకమొనరించినది.

ఈ నామమునం దభిజ్ఞానము చేర్పబడుటకింకొక కారణమును కూడ ఊహింపవచ్చును. అది శాకుంతలునికి సంబంధించి యున్నది. దుష్యంతుడు మారీచాశ్రమమున ప్రవేశించి అచట బాలార్క బింబమువలె వెలుంగు నొక బాలుని గాంచెను. పుత్ర సమాగమునకై తహతహలాడెడు అతని మనమున, ఆ బాలుడు తన కుమారుడేమో అను అనుమాన ముదయించెను. అతని స్పర్శ మాత్రముననే అత డనిర్వచనీయానందము ననుభవించెను. క్రింద బడిన రక్షా బంధ రూపముననుండిన అపరాజితయను మూలిక ఆ కుమారుడు దుష్యంత కుమారుడని రుజువు చేసినది. ఈ శాకుంతలుని అభిజ్ఞాన మిట్లు కథానిర్వహణమును సుఖాంతముచేసినది. నాయకుడు తాను చరితార్థుడైనట్లు భావించెను. ఇట్టి ఆనందముతోనాతడు సతీ సమాగమము నొందెను. "అభిజ్ఞానేన జ్ఞాతం శాకుంతలం (శకుంతలా కుమారం) అధికృత్య కృతం నాటక" మ్మని ఈ సందర్భమున నామమును నిర్వచింపవలయును.

పినవీరన శకుంతలాఖ్యానమును శృంగార ప్రధానముగా రచింపదలచి, తద్రసమును నిపుణముగ పోషించెను. ఈ నామనిర్ణయమును గావించుటలో నతడు శ్రీనాథుని శృంగార నైషధము ననుకరించి, అందులోవలెనే ఇందును రస స్ఫూర్తిని సాధించెను. ఈ రసపోషణమున కనువుగ తన కథాప్రణాళికను మలచుకొనెను. శకుంతలోపాఖ్యానము నాయికా ప్రధానమైన కథ. వ్యాసుని సృష్టిలో శకుంతల ప్రౌఢ. ఆమె మున్యాశ్రమమున పెరిగి ధర్మాచరణమును కార్యవిచక్షణ జ్ఞానమును సంతరించుకొనినది. ఆమె యందు కన్యాసహజమైన ముగ్ధాత్వములేదు. కాళిదాసు భారత శకుంతల యొక్క రూపలావణ్యాదుల నతిశయము గావించి ఆమె హృదయమును సుకుమార స్నిగ్ధముగా మలచెను. ఈమె ఆశ్రమ వాతావరణమున పెరిగి లౌకిక జీవనమునకు దూరస్థితయే అయ్యును బంధములకు దూరముకాలేదు. ఈమె ఆశ్రమ వృక్షలతాదుల యందును మృగాదుల యందును నెఱపిన నెయ్యము ఈమె కోమలహృదయ

మును వెల్లడించును. బహిః ప్రాణములై వర్తించు చెలుల సౌహార్దముతోడను, మహర్షినే మమకారముతో కట్టివేయగల్గు వర్తనముతోడను పెరిగినది. సర్వ సృష్టికి ఆమె దివ్యశోభను సంతరించినది. ఇట్టి కుసుమ సుకుమార సదృశయగు నీమె నాటకాంతమునకు, ఒక మానసిక పరిణామమునకులోనై అర్యగృహిణిగ రూపు దిద్దుకొనినది. పినవీరన యొక్క శకుంతల కేవలము ముగ్ధ. భర్త ఆమెను తృణీకరించినపుడు సైతము నోరెత్తిపలుక జాలని అబల. ఈమె శృంగారమూర్తి. పినవీరన ప్రత్యేక దృష్టితో గావించిన ఈ నాయికా చిత్రణము ఈ ప్రబంధ నామమును సార్థక మొనరించుచున్నది.

శృంగార శాకుంతలమునకు శకుంతలా పరిణయమను నామాంతరము కలదు. ఈ నామము కూడ కావ్యవస్తువునకు ఉచితమై ఒప్పుననుటలో సందియము లేదు. పినవీరన తన కావ్యము నందెచటను దానిని శృంగార శాకుంతలమని కాని శకుంతలా పరిణయమని కాని పేర్కొనలేదు. కావ్యవతారికలో కృతిభర్త 'కూర్మి కృతి సేయునాకు శాకుంతలంబు' అని అర్థించెను. కథారంభమున 'నా యొనర్పంబూనిన శాకుంతల కథా లతాలవాలంబగు పురీలలామంబు' అని హస్తినాపుర వర్ణనమున నుప క్రమించెను. ఆశ్వాసాంత గద్యలలో 'శాకుంతల కావ్యం' బని పేర్కొనినాడు. కావున ఈ కవి తన కావ్యమునకు శాకుంతలము అను నామముంచెననుట స్పష్టము. కాని ఏతత్కావ్యమున శృంగార మత్యంత రమణీయముగ పోషింపబడుటచే - శృంగార శాకుంతలమను నామము, శకుంతలా పరిణయమను నామము కంటె మిక్కిలి ఒప్పిదమగుచున్నదని చెప్పవచ్చును. శాకుంతల కథననుసరించి కావ్యములు వ్రాసిన ఇతర కవులు, కృష్ణకవి, పెద్దాడ నాగయామాత్యుడు, రేవణూరి వేంకటార్యుడు మున్నగు వారీ కథకు శకుంతలా పరిణయమను నామమునే యొసంగిరి.

నాటక పరిశీలనము :

అభిజ్ఞాన శాకుంతలము ఏడంకముల నాటకము. ఇందలి వస్తువు ప్రఖ్యాతము. నాయకుడు ధీరోదాత్తుడు. రసము శృంగారము. నాటక లక్షణములను సాహిత్యదర్పణ మిట్లు వివరించుచున్నది.

"నాటకమున వృత్తము ప్రసిద్ధము. అయిదు సంధులు, విలాసము బుద్ధి లోనగు గుణములును, నానా విభూతులును ఉండును. అది సుఖ దుఃఖ సముద్భూతములగు నానా రసములచే నిరంతరమును అగును. అందు అయిదు మొదలు

పది పటుక్ అంకములు చెప్పబడినవి. నాయకుడు ప్రసిద్ధ వంశజుడు. రాజర్షి ధీరోదాత్తుడు, ప్రతాపవంతుడు, గుణవంతుడు, దివ్యుడేని దివ్యాదివ్యుడేని కావల యును. శృంగారమేకాని వీరమేకాని ఒకటేరసము అంగి. కడమరసములన్నియు అంగములు. కార్య నిర్వాహణమునందు అద్భుత రసము. కావ్య వ్యాప్యత పురు షులు నలువురైదుగురు ముఖ్యులు. దాని బంధనము గోపుచ్ఛాగ్రమునకు సమ మయిన యగ్రము గలదిగా చెప్పబడినది."7

కవిగా, నాటకకర్తగా సాహిత్యమున కాళిదాసునకుగల స్థాన మెనలేనిది. ఈతడు రచించిన కావ్యములన్నియు ఈతనికి యశస్సు నాపాదించుచున్నను అభిజ్ఞాన శాకుంతల నాటకము తత్కీర్తికి పతాక నెత్తినది. అందువలననే

"కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా
తత్రాపిచ చతుర్థోంక స్తత్ర శ్లోక చతుష్టయమ్"

అను అభియుక్తోక్తి ఏర్పడినది.

అభిజ్ఞాన శాకుంతలము నందలి కథకు మూలము మహాభారతము నందలి శకుంతలోపాఖ్యానము. ఈ కథ పద్మపురాణ స్వర్గఖండమున 1-5 అధ్యాయము లలో కలదు. కాళిదాసు నాటకమునకు ఈ పురాణముకూడ ఆధారమని కొందఱి అభిప్రాయము. అట్లుకాక కాళిదాసు నాటకము ననుసరించియే పురాణమున అభిజ్ఞాన వృత్తాంతము చేర్పబడి యుండునని కొందఱి అభిప్రాయము. ఈకథను ఇతడు రస దృష్టితోను, ఔచిత్య దృష్టితోడను, పరికించి చమత్కార సహితము స్వాభావికము నగు ఒక ఉత్తమ నాటకముగా రచించెను. మూలమును పలు వన్నెచిన్నెలతో నలంకరించి ఆతడొక సజీవ చారుతర నాటక మూర్తిని విశ్వ కావ్య శిల్పాలయమునం దగ్రస్థానమున ప్రతిష్ఠించెను. శాకుంతలమునందలి కల్పనములు కాళిదాసు భావనా పటిమను ప్రదర్శించు రమణీయ చిహ్నములు. అతడు కేవలము కథను కొనసాగించుటకే కాక, తాను కల్పించిన ఏచిన్న అంశము లేకున్నను కథారస స్ఫూర్తికి భంగమగునేమో అనునట్లుగ దానిని కల్పించెను. ఈ నాటకము నందలి ప్రథమ పంచమాంకములందును, సప్త మాంకమున కొలదిగను మాత్రమే భారత కథ గోచరించును. తక్కిన కథ అంతయు కవికల్పనయే.

కాళిదాసు భారత కథకు గావించిన మార్పులు ముఖ్యముగ నాల్గు తావు లందు కన్పించు చున్నవని శ్రీ కొమఱ్ఱాజులక్ష్మణరావుగారు తెలిపిరి.8

ఇందు మొదటి మార్పు నాయికా నాయకుల రాగోదయమునకు అనురాగాభివృద్ధికి సంబంధించినది. ఇది కాళిదాసు రస దృష్టిని సూచించు నట్టిది. మహాభారత కథయందు దుష్యంతుడు శకుంతలను కుటీరములో చూచి మోహించెను. శకుంతల తనకు జనించు కుమారుని పట్టాభిషిక్తుని గావించవలె నను ఒప్పందము గావించు కొని అతతని పరిణయ మాడెను. ఇచట శకుంతలకు రాజుపైగల ప్రేమ నిర్వ్యాజమైనదిగా కనరాదు. ఇంక దుష్యంతుడు పండ్లుతేర నడవికి వెడలిన కణ్వుడు మరలి వచ్చునంత వఱకైన తాళజాలక విరహాతురత్వమున శకుంతలను చేపట్టెను. ఇట్టి ఇంద్రియ లోలత్వము రాజు శీలమునకు లాఘవము నాపాదించుచున్నది కనుకనే కాళిదాసు కణ్వుని సోమ తీర్థమున కంపెను. అతడు తిరిగి వచ్చునరికి చాల వ్యవధి యున్నది. ఈ సమయమున నాయికా నాయకుల ప్రేమయు క్రమ వికాసమునొంది ఫలప్రాప్తిని బడసినది. ఇట వీరి అనురాగము పరస్పరమై కనవచ్చును. భారతము నందు దుష్యంతుడు శకుంతలను చేపట్టి పిదప మహర్షి తిరిగి వచ్చు నంతవఱకైన ఆగక దొంగవలె వెడలి పోయెను. నాటకమునందాతడు ఋషి పుత్రుల ప్రార్థనపై ఆశ్రమములో కొన్ని దినములుండి వారి సెలవు పొంది వెడలెను.

ఇక రెండవదియు ప్రధానమైనదియు నగు మార్పు దుర్వాసుని శాపము. దీనిని కాళిదాసు ఔచిత్య దృష్టితో గావించెను. భారతమున దుష్యంతుడు తాను నగరికి వెడలి నంతనే శకుంతలను తన సన్నిధికి పిలిపించు కొందునని చెప్పెను. కాని ఈ మాట నాతడు మనఃస్ఫూర్తిగా పల్కలేదని తెలియనగును. అతడు రాజధానికి మరలి నంతనే ఆ విషయమును మఱచిన వాడువలె నుండును. పిదప కుమారునితో గూడి వచ్చిన సతిని తెలిసియే నిరాకరించెను. ఇట్లీతడిందు అసత్యమునకు జంకనివానివలె గోచరించును. కాళిదాసు తన నాటక నాయకుని ఏ మచ్చయు లేని ఉత్తమ పురుషుని కావింప దలచెను. అందులకే దుర్వాసుని శాపమును కల్పించెను. ఈ శాప ప్రభావమున నాయకుడు తన పరిణయ వృత్తాంతము నంతను మఱచుటయు. అతని మనమునందు శకుంతలానురాగము జన్మ జన్మాంతర సౌహార్ద భావమై నిగూఢముగ దాగి యుండుటయు ఎంతో ఉచితముగ నున్నది.

మూడవ మార్పు కుమార సంబంధమైనది. ఈ మార్పు గూడ ఔచిత్యమునే సాధించుచున్నది. భారత కథయందు శకుంతల దుష్యంతుని కడకు

యౌవరాజ్యాభిషేకమునకు యుక్తుడైన కుమారునితో గలసి వచ్చును. ఆ కుమారుడమిత ప్రభావంతుడు. చక్రవర్తి లక్షణ సంయుతుడు. దుష్యంతుడు సతిని గుర్తింపకుండినట్లు నటించినను కుమారుని గూడ నిరసించుట ఉచితముగ లేదు. కావుననే కాళిదాసు శకుంతలను గర్భవతిగ నున్నప్పుడే రాజసన్నిధికి బంపెను. ఈ మార్పు నాటకమునకు సహజత్వము నాపాదించుచున్నది. నాల్గవ మార్పు నాటక నిర్వహణమునకు సంబంధించినది. భారత కథయందు అశరీరవాణి సత్యము ను తెలియజెప్పుటచే నాయకుడు నాయికను చేరదీసెను. ఈ సమాగమము రాజ సభయందయ్యెను. నాటకమునందది మారీచాశ్రమమున కల్పింపబడినది. ఈ ఆశ్రమముననే శకుంతల కుమారుని గనెను. అమె విరహవ్రత ధారిణియై ప్రశాంత మనస్కురాలై పతియందమితమైన యనురాగమును స్థిరముగ చిత్తము నందు నిల్పినది. నాయకుడు అభిజ్ఞాన దర్శనముచే ప్రియాస్మరణమునుపొంది పశ్చాత్తప్తుడై తన ఆత్మను పునీతము గావించుకొని ప్రేయసీ సందర్శనమున కును కుమార పరిష్వంగమునకును పరితపించుచుండెను. ఇట్లు నిర్మల చేతస్కులైన వారిరువురి కలయిక దివ్యమై భాసించినది.

ఈ నాల్గేకాక ఐదవదియు, నాయిక హృదయమును నాయక పునఃసమాగమమునకు సుముఖురాలిని గావించి, నాటక సుఖనిర్వహణమునకు పరోక్షముగ తోడ్పడినదియు నగు మార్పు సానుమతి పాత్ర కల్పనము. ఈ సానుమతి నాటకమునందలి ఆఱవ అంకమున ప్రవేశించును. ఈమె మేనకకు సఖి. మేనక ఖిన్నురాలై యున్న తనకుమార్తె శకుంతలకు ఆనందమొసగు కార్యము నేదైన చేయుమని అర్థింపగా. సానుమతి శకుంతల నెడబాసిన రాజు మనము ఎట్లు న్నదో గ్రహింప తలంచినది. సానుమతి దుష్యంతుని పరితాపమును, ఆతని హృదయమున ప్రేయసి ఎడల నెలకొనిన నిష్కల్మషమైన అనురాగమును కను లారగాంచినది. అతడు శకుంతలను ప్రత్యాఖ్యానము గావించుటకు దుర్వాసుని శాపమే కారణముగాని అన్యము గాదని ఎఱింగినది. సానుమతి శకుంతలను రాజెంతగా ప్రేమించుచుండెనో, శకుంతలకును, మేనకకును తిరిగి ఎఱింగించియే యుండును. పతి తనకొనరించిన అవమానముచే, ఆతని ప్రవర్తనముపట్ల వైముఖ్యము వహించిన శకుంతల, పతి తన్ను నిష్కారణముగ నిరాకరించ లేదనియు అతడు తనపై స్థిరానురాగము కల్గియున్నాడనియు తెలిసి కొంత

యూఅడిల్లి యుండును. దుష్యంతునిపట్ల ఆమెకేర్పడిన వైముఖ్యము దీనితో తొలగియుండును.

ఈ మార్పులు ప్రధానము లైనట్టివి. కాళిదాసుని నాటకమునకు సౌందర్యము నాపాదించునట్టి కల్పన లింకను అనేకములున్నవి. ఇవి పినవీరన గావించిన నాటకానుసరణమును వివరించునపుడు పేర్కొనబడును.

కాళిదాసు కవితామాధుర్యము నాటకము నందంతటను జాలువారుచున్నది. ఈ కవిత జగద్విదితము. ఇందలి భావములు స్నిగ్ధ మధురములు. దానిని గూర్చి ఇట ప్రత్యేకముగ చెప్పబనిలేదు. సంస్కృత నాటక వాఙ్మయమునందే అభిజ్ఞాన నాటకము మిక్కిలి ప్రసిద్ధిగని రంగ ప్రయోగ ప్రయోజనమునకు గూడ ననుకూలమై ఒప్పుచున్నదనుటలో నతిశయోక్తి లేదు.

పినవీరన కాలాదులు :.

పినవీరన రచించిన గ్రంథములలో నేడు శృంగార శాకుంతలము, 'జైమిని భారతము' అను రెండు మాత్రము లభ్యమానము లగుచున్నవి. అందు శాకుంతలము నీతడు చిల్లర వెన్నయామాత్యునకును, జైమిని భారతమును సాళువ నరసింహరాయలకును అంకిత మిచ్చెను. పినవీరన కాలమును నిర్ణయించుటకు శాకుంతలము సందెట్టి ఆధారములును దొరకుటలేదు. జైమిని భారత కృతిభర్తయగు సాళువ నరసింహరాయల కాలమునుబట్టి, పరిశోధకులు పినవీరన పదునేడవ శతాబ్ది ఉత్తరభాగమునందలి వాడని నిశ్చయించి. [9]జైమిని భారతము ఇతని చివరి రచన అనియు, శాకుంతలము నీతడు క్రీ. శ. 1474 నకు ముందుగను, జైమిని భారతమును 1474-86 మధ్యకాలమునను రచించియుండ వచ్చుననియు వారు భావించుచున్నారు. పినవీరన శ్రీనాథునికి సమకాలికుడనియు ఆతడు వృద్ధాప్యము నందున్నప్పుడే కవి చిఱుతప్రాయము నందుండి యుండు ననియుకూడ విజ్ఞులు అభిప్రాయ పడుచున్నారు.

ఈతని గృహనామమునుబట్టి ఇతడు పిల్లలమఱ్ఱి గ్రామవాసి యనియు, శకుంతలా పరిణయమును నెల్లూరు మండలమునందలి సోమరాజు పల్లెయందు నివసించు చిల్లర వెన్నయ కంకితమిచ్చుటచే ఈ గ్రంథరచనా కాలమున ఈ కవి సోమరాజు పల్లెయందు వసించి యుండనోపుననియు అటుపై జైమిని

భారత రచనాకాలమునకు కర్ణాట రాజధాని నగరమైన విజయనగరము నందుండె ననియు తలంప వీలగుచున్నది.

ఈ కవి కర్వాచీనుడును, పిల్లలమఱ్ఱి వంశస్థుఁడును ఆయిన పెనుమళ్ళ సోమయామాత్యుడు తాను 'రచించిన' సీమంతినీ పరిణయమున పినవీరనను గూర్చి పెక్కు విషయములను వెల్లడించెను. అందిట్లు కలదు. పిల్లలమఱ్ఱి గ్రామ వాసులైన గాదయ్య నాగమాంబలకు చాలకాలము వఱకు సంతానము కలుగ లేదు. వారు శ్రీశైలము నందు వసించిన భారతీ తీర్థులనెడు యతీంద్రు నుపాసించి, మంత్రోపదేశమును బడసి కవలపిల్లలను కనిరి. వారిలో నొకడు పెద వీరభద్రుడు, ఇంకొకడు పినవీరభద్రుడు. పినవీరన పుట్టుకతోడనే ఒక జడను ధరించి యుండుటచే. సాక్షాత్పరమేశ్వరుని అవతారముగ భావింపబడుచుండెను. ఇతడు శాస్త్రాదుల నభ్యసించి కాళిదాసాదుల వలె కవనము వ్రాయగల నేర్పరి అయ్యెను. పెదవీరన కర్ణాటరాజుల కొలువునకు పోయి అచట డెబ్బదివేల సామంతుల కధికారియై కీర్తినార్జించెను.[10]

పినవీరన తండ్రి గాదయామాత్యుడు. తల్లి నాగమాంబ. వీరిది కాశ్యప గోత్రము. పినవీరన భారతీతీర్థ యతీంద్రుల శిష్యుడు. 'భారతీ తీర్థగురు శ్రీ చరణ కరుణా కటాక్ష లబ్ధసిద్ధుడ'నని అశ్వాసాంత గద్యంలో చెప్పుకొనెను. ఇతడు శివభజనాసక్తుడు.[11] ఆరాధితామర వీరభద్రుడు.[12] వీరభద్ర పద పద్మ ధ్యాన శుద్ధాంతరంగుడు.[13]

పిల్లలమఱ్ఱి వారిది శారదాపీఠమని ప్రసిద్ధి కెక్కిన విద్వద్వంశము. పిన వీరన తాతయు, తండ్రియును, అగ్రభ్రాతయు కవులు. వారిలో నితడు వాసి గాంచెను. ఈ అంశములకు జైమిని భారతము నందలి ఈ క్రింది పద్యములు వెల్లడించుచున్నవి.

క. తాతయు తండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువన భాసురకృతిని
ర్మాతలు పిల్లలమఱ్ఱి వి
ఖ్యాతునిఁ బినవీరు బోల గలరే సుకవుల్. 1-21

తే. మఱి మాత్రంబె పిల్లలమఱ్ఱి పేరు
పేరు వలె కాదు శారదా పీఠకంబు

వారిలోపలఁ బినవీరు వాక్య సరణి
సరసులకు నెన్న కర్ణరసాయనంబు. 1-22

శ్రీనాథుని హరవిలాసమును కృతిగొనిన అవచితిప్పయ సెట్టికి పిల్లల మఱ్ఱి పెద్దన్న అను గురువుండెనట. అతడీ కవికి తాతయో లేక అన్నయో అయి ఉండునని పండితుల అభిప్రాయము.

పినవీరన సరస్వత్యుపాసనచే మహిమ సంపాదించిన వాడనియు, అతడు పర మనోగత భావాదులను కూడ నెఱింగెడివాడనియు తెలుపు కథలు లోకమున ప్రచారమునందున్నవి. ఇతడు వాణిని తనరాణి యని చెప్పుకొనినాడని యు తన అన్నగారు జపముచేయుచు మనసునందేదో తలచుకొనుచుండ, ఒకరరుదెంచి పినవీరనను "మీ అన్నగారేమి చేయుచున్నా"రని ప్రశ్నింప నితడు జపము చేసికొనుచున్నారని బదులు పల్కక భార్య నగలను గురించి యోచించుచున్నా డని ఉత్తరమిచ్చెన ననియు చెప్పుదురు. ఇతడు సరస్వతిని కైవసము గావించు కొనిన వాడగుటచే తదహంకారమున శ్రీనాథుని ఒకానొక సందర్భమునం దప హసించెనని చెప్పు కథయు ప్రచారమునందున్నది. కాని తనకావ్యమున పలు తావుల శ్రీనాథుని అనుకరించిన ఈ కవి అతని నధిక్షేపించెనని అనుకొనుట విశ్వసనీయము కాదు.

శృంగార శాకుంతలము నందలి ఈ క్రింది పద్యమునుబట్టి పినవీరన ఏతద్గ్రంథ రచనకు పూర్వము మఱినాల్గు గ్రంథములను రచించెనని తెలియ నగుచున్నది.

సీ 'రచియించి నాడవు రమణీయ వాగ్రీతి
నవతారదర్పణం [14] బభినవముగఁ
బల్కినాడవు తేటపడఁజేసి నారదీ
యము సత్కవి శ్రేణి యాదరింపఁ
జెప్పి నాడవు శేముషీ విశేషంబున
మాఘ మాహాత్మ్యంబు మంజుఫణితి
గావించి నాడవు ఘనబుద్ధి మానసో
ల్లాస సారము సముల్లసిత కయ్యె

తే. భారతీ తీర్థ యతి సార్వభౌమ గురు కృ
పాతిశయ లబ్ధ కవితా విభూతి కలిగి
గౌరవము గాంచినాడవు కవులచేత
విపుల చాటూక్తి నిర్నిద్ర వీరభద్ర. 1-22

పైని పేర్కొనబడిన అవతార దర్పణము. నారదీయము, మాఘమాహాత్మ్యము, మానసోల్లాస సారము అను కావ్యములు ఈనాటి వఱకును లభింప లేదు. అవతారదర్పణమును గూర్చి చర్చించుచు కొందరు విమర్శకులు 'కవి దీనియందు విష్ణుదేవుని పది యవతారములను వర్ణించి యుండునేమో'[15] యని అభిప్రాయపడిరి. అట్లుగాక శాకుంతలమున కవి చేసిన యిష్టదేవతాస్తుతియందు భైరవస్వామి స్తుతి [16] ననుసరించి ఈ కవి బిట్రగుంటయందు వెలసిన ఆ భైరవమూర్తి యవతార కథనమునే యవతార దర్పణముగా దీర్చెనేమో' అని కొందఱూహించిరి.[17] పై గ్రంథములు గాక పినవీరన పురుషార్థ సుధానిధియను గ్రంథమును కూడ వ్రాసినట్లు తెలియుచున్నది. ఆంధ్ర సాహిత్యపరిషత్తునందున్న ఉదాహరణ గ్రంథమున 'పిల్లలమఱ్ఱి వీరయ్య' రచించిన పురుషార్థ సుధానిధిలోనివని రెండు పద్యము లుదాహరింపబడినవి. ఈ పురుషార్థ సుధానిధి విద్యారణ్యస్వామి సంస్కృతమున రచించిన పురుషార్థనిధి యను గ్రంథమునకు ఆంధ్రానువాదమై యుండవచ్చుననియు, తైత్తిరీయ భాష్యసారమునకు మానసోల్లాసమను పేరు కలదు కావున పినవీరన రచించిన మానసోల్లాసము దానికాంధ్రానువాదమై యుండుననియు కొందఱు భావింతురు.[18] ఈ కవి సాళువ నరసింహరాయల పేర నవరత్నములను, రాజ్యాంగ పద్ధతులను గూర్చిన పద్యములను రచించెనని చాటుపద్యమణిమంజరి చెప్పుచున్నది.

కృతిపతి అభిలాష :-

శాకుంతల కావ్యకృతి పతియగు చిల్లర వెన్నయామాత్యుని పూర్వీకు లందఱు సప్త సంతానములకు తమ పేర నిలుపుకొనిన ఉదారచరితులు. వారు పంటరెడ్ల యొద్ద మంత్రులుగా నుండి పేరుమోసిన వారు. వీరు ఆఱువేల నియోగి బ్రాహ్మణులు. వదాన్యతకు ప్రసిద్ధికెక్కిన వారు. వీరి నివాసము "అఱువది నాల్గు విద్యలకు అపూర్వ ఘంటాపదంబైన పట్టణమతల్లి" యగు సోమరాజు పల్లి. ఇట్టి వంశకీర్తికిని, తానున్న తావునకును గల యశస్సు నినుమడింప చేసినవాడు చిల్లర వెన్నయమంత్రి. ఈతడు ఈశ్వరారాధకుడు. అనవరత

సోమవార దీక్షాపరతంత్రుడు. ఈతని నివాసంబున పంజర శారికాశుకములు సైతము పంచాక్షరీ మంత్రమును పలుకుచుండెనట! ఈ వెన్న మంత్రికి, సప్త సంతానములలో ఖిలము గాకుండ శాశ్వతముగ నుండునట్టి ఒక కృతిని స్వీక రింపవలెనను అభిలాష జనించెను. ఇట్లు శాశ్వతముగ తనకు కీర్తి నాపాదింప గలుగు నుత్తమ ప్రబంధమును రచింపగల సుకవివరుడు పినవీరభద్రుడే యని అతడు తలంచెను. ఈ పినవీరన

సీ. నన్నపార్యుని ప్రబంధ ప్రౌఢ వాసనా
సంపత్తి సొంపు పుట్టింప నేర్చు
దిక్కన యజ్వ వాక్ ఫక్కి కామోదంబు
చెలవు కర్ణముల వాసింప నేర్చు
నాచిరాజుని సోము వాచా మహత్త్వంబు
సౌరభంబులు వెదజల్ల నేర్చు
శ్రీనాథభట్టు భాషా నిగుంభంబుల
పరిమళంబుల గూడ బఱచ నేర్చు

తే. మహిత గుణశాలి పిల్లలమఱ్ఱి పీర
నార్యు, డాయింటఁ బైతామహంబగుచును
వెలయు చున్నది నేడు కవిత్వలక్ష్మి
యఖిల సత్కవి నికరంబు నాదరింప 1-17

అని గణుతికెక్కిన వాడు. ఇట్టి కవి అమోఘమును, అద్వితీయము నగు కావ్యమును రూపొందించుననుటలో సందియములేదు. ఈ కవి ఈ విషయ మును, ఇతః పూర్వమే అవతార దర్పణము, మాఘమాహాత్మ్యము ఆదిగా గల కావ్యములలో నిరూపించియే యుండును. కనుకనే వెన్నమంత్రి కృతికర్తతో

గీ. "కలదు చాలంగ ప్రేమ నీ వలన నాకు
వేడ్క నడిగెదఁ గవులెల్ల వేడ్కపడగ
షట్సహస్ర కులోద్భవ సచివులందు
సుకృతిగాఁ జేయు నాకొక సుకృతిచేసి" 1-28

అని తన మనోభిలాషను వ్యక్తీకరించెను. తరువాత ఆ కృతికి అనువగు వస్తువును, రసాదులను గూర్చి కూడ నిర్దేశించెను. కావ్యమనగనే ప్రప్రథమముగ

అందలి వస్తు, నాయక, రసాదులను గూర్చి ఒక ప్రణాళికను ఏర్పఱుచుకొన వలెను. వస్తువు ప్రఖ్యాతమనియు, మిశ్రమనియు, ఉత్పాద్యమనియు మూడు విధములు. అందు ప్రఖ్యాత వృత్తము వక్తకు, శ్రోతకు ఆహ్లాదము కలిగించునది అని భావించి వెన్నమంత్రి కావ్య వస్తువు ప్రఖ్యాతేతి వృత్తమును కలిగినదై యుండవలెనని సూచించెను.

రసములలో శృంగారము శ్రేష్ఠమని ప్రసిద్ధి కెక్కినది. అది సర్వజన హృదయానందకరము. కనుకనే వెన్నమంత్రి కవితో

క. శృంగారము ముఖ్యంబగు
నంగియు నంగములు దలప నన్యరసములు
న్నాంగ మగునేనిఁ దంకము
బంగారముతోడి యొర ప్రబంధము నొందున్ 1-26

అని పలికెను. కావ్యమునందు శృంగారము అంగిరసము కాగా తదన్యరసములు దానికి పోషకములైనచో నది బంగారమునకు దీటగునని భావించి అత డారస మున కుచితమైనట్టిదియును, ప్రఖ్యాతమును అయిన శకుంతలోపాఖ్యానమును కావ్యవస్తువుగా నిర్ణయించెను. ఈ కావ్యబంధమును గూర్చి అతడు ఇట్లు వివరించెను.

సీ. సర పువ్వులుగ మాలకరి పెక్కు తెఱగుల
విరుల నెత్తులుగఁ గావించి నట్లు
కర్పూర కస్తూరికా వస్తు వితతిచే
శ్రీ ఖండచర్చ వాసించి నట్లు
ఒడికంబుగా గందవొడికి నానాసూన
పరిమళంబులు గూడఁ బరిచినట్లు
సరసులు వివిధ పుష్ప మరందలవములు
గొనివచ్చి తేనియఁగూర్చి నట్లు

తే. భారత ప్రోక్త కథ మూలకారణముగ
కాళిదాసుని నాటక క్రమము కొంత
తాపసోక్తికి అభినవ శ్రీ వహింపఁ
గూర్మి కృతిసేయు నాకు శాకుంతలంబు 1-27

మాలాకారుడు వివిధములైన పూలతో సుందరమగు నొక మాలికను తయారు చేయునట్లుగా, భారతము నందలి కథను మూలముగా గ్రహించి, కాళిదాసుని నాటక క్రమమును కొంత దానితో జోడించి, అందు కవి యొక్క అభినవ కల్పనాచాతుర్యమును గూడ మేళవించి ప్రబంధము సంతరింపుమని అతడు కవిని గోరెను.

వెన్నయ పినవీరనను.

'కథ ప్రసిద్ధయు, మిగుల శృంగారవతియుఁ
బరిగణింపగ శ్రీమహాభారతమునఁ
గ్రథితమైన శకుంతలాఖ్యాన భంగి
నది ప్రబంధంబుఁ జేయు ప్రఖ్యాతి నొంద 1-26

అని ప్రథమమున — మహాభారతమునందలి శకుంతల కథనే శృంగారవతిగా తీర్చిదిద్ద వలసినదిగా కవిని కోరెను. పిదప నాతనికి ఒక క్రొత్త అభిలాష పొడమినది. ఆ నాటికి కాళిదాస నాటక కథయు ప్రఖ్యాతమే. అందు కాళిదాసుని రచనా శిల్పము పరాకాష్ఠ నొందినది. కనుక భారత కథకు, కాళిదాసుని నాటక క్రమమును కూడ కొంత చేర్చిన అది పరమ రమణీయముగ భాసించునని అతడు తలచెను. ఈ రెంటికి అనుబంధముగ ఆ ప్రబంధమింకను అభినవభావ సముజ్జ్వలమైనచో నది అద్వితీయమగును. కనుకనే ప్రబంధ బంధమును గూర్చి కవితో చర్చించుపట్ల అందు కేవల మహాభారతమునే కాక కాళిదాసుని నాటక క్రమమును, కవియొక్క అభినవ కల్పనములను గూడ కలిపి ప్రబంధమును రచింపుమనెను, అతడు కవికి కర్పూర తాంబూలము నిచ్చి సమాదరించెను. అంత పినవీరన "తద్వచన ప్రకారంబున మిశ్ర బంధంబుగా శాకుంతలంబను ప్రబంధంబు బంధుర ప్రీతి" చెప్పఁబూనెను.

కృత్యారంభము :—

శృంగార శాకుంతలము నాల్గాశ్వాసముల ప్రబంధము. ఇది ఇష్టదేవతా స్తుతితో నారంభమగుచున్నది. ఇది ఏడు పద్యములలో నున్నది. ఇందు ఆఱు పద్యములు చిల్లర వెన్నయామాత్యునకు శుభాశంసన పూర్వకముగా వ్రాయ బడినవి. ఆరంభమున వాసుదేవుడును, తరువాత అష్టమూర్తియైన శివుడును,

పిమ్మట, బ్రహ్మ, విఘ్నేశ్వరుడు, భైరవమూర్తి, లక్ష్మీదేవి, సరస్వతి అను వారును వరుసగ సంస్తుతింపబడిరి. ఈ ఇష్టదేవతాస్తుతి యందలి రెండవ సీస పద్యము కాళిదాసుని నాటక నాందీ శ్లోకమునకు అనుకరణము.

సీ. పూని చరాచరంబు భరించు నొక మూర్తి
యుడుపుదృష్టాభేద మొక్క మూర్తి
యారగించు మనోజ్ఞమగు హుతంబొక మూర్తి
యొసగు చైతన్యంబు నొక్క మూర్తి
యాదిత్యులకు త్రోవయై పోల్చు నొక మూర్తి
యుడు గణంబుల నేలు నొక్క మూర్తి
విశ్వంబు చీకటి విరియించు నొక మూర్తి
హోతయై దీపించు నొక్క మూర్తి

తే. యరయ నెవ్వనియందు నయ్యష్టమూర్తి
యిష్టఫల దాత కరుణా సమేతుడగుచు
వెలయ జిల్లర నాగయ వెన్నమంత్రి
జిరతరైశ్వర్య సంపన్ను జేయు గాత 1-2

పై పద్యమున కృతిపతికి అన్వయించు చివరి రెండుపాదములు తప్ప తక్కిన భాగము మూలనాటక భావమునే అనుసరించుచున్నది. ఆ నాందీ శ్లోక మిది.

"యా సృష్టిః స్రష్టురాద్యా వహతి విధిహుతం యా హవి ర్యాచ హోత్రీ
యే ద్వేకాలం విధత్తః శ్రుతివిషయగుణా యాస్థితావ్యాప్య విశ్వం
యా మాహుః సర్వబీజ ప్రకృతి రితి యయా ప్రాణినః ప్రాణవంతః
ప్రత్యక్షాభిః ప్రపన్న స్తనుభిరవతువ స్తాభి రష్టాభిరీశః 1-1

ఈ శ్లోకము అష్టరూపములు కలిగిన శివుని స్తుతించుచున్నది. ఇందు నాటకము నందలి పాత్రలు సూచింప బడినవని పండితుల అభిప్రాయము. 'యా సృష్టిస్రష్టురాద్యాః' అనుట వలన మహర్షి కణ్వుడును, 'యా విధిహుతం హవిర్వహతి' అను మాటవలన శకుంతలా దుష్యంతులును 'యేద్వేకాలం విధత్తః' అనుట వలన అనసూయా ప్రియంవదలును సూచింపబడుచున్నారని

వారి అభిప్రాయము. ఇంకను ఇందులో "కాళిదాసు సర్వస్వ్వష్టి యొక్క కావ్య వస్తువిది" యని అర్థము[18] స్ఫురించును. ఈ శ్లోకమిట్టి విశిష్టతను కలిగి యుండుటవలననే పినవీరన ఇష్టదేవతాస్తుతి యందు దీనిని చేర్చి ఈ అనుసరణ మున కొంత స్వాతంత్ర్యము చూపెను.

పినవీరన గావించిన ఈ క్రింది సరస్వతీస్తుతి అతని వ్యక్తిత్వమును ప్రకటించుచున్నదని డా. యస్. వి. జోగారావుగారు ఈ క్రింది విధముగా వివరించిరి.[19]

మ. "పొసగన్ నే కృతి చెప్పగా పరిమళంబుల్ చాల నొక్కొక్కచో
కొస రొక్కించుక కల్గ నేనియును సంకోచంబుగాకుండ నా
రసి అచ్చోటికి నిచ్చుగాత పరిపూర్ణం బొంద వాగ్దేవి యిం
పెసలారన్ తన విభ్రమ శ్రవణ కల్హారోదయామోదముల్. 1-7

అని శృంగార శాకుంతలమున నితడు చేసిన సరస్వతీస్తుతి చిత్రముగా నున్నది. ఇందు స్తుత్యర్థమేమియు లేదు. కాని వాక్పరముగా పరిమళప్రసక్తి తెచ్చియుండు టనుబట్టియు, వాగ్దేవి శ్రవణ కల్హారోద యామోదము తల్లోపపూరకము కాగల దనుటను బట్టియు ఒక మహార్థ మిందిమిడి యున్నదని తోచును. ఈ కవి వాక్కులే ఆ దేవి పూజాపుష్పములు. తత్పరిమళగ్రహణ తత్పర ఆమె. అవి వాక్పుష్పములగుట వాని గమ్యస్థానము ఆమె శ్రవణములే, కాన తత్పారభ లోపపూరకము లామె శ్రమణకల్హారోద యామోదములే. ఉపర్యుక్త సందర్భ ములనుబట్టి అహరహ సరస్వత్యుపాసకుడని యనిపించు నీతని వాక్కులు ఆ దేవి శ్రవణగోచరము లగుచుండునని ఈతని విశ్వాసము ఈ సారస్వత భారతీ తీర్థుడు భారతీతీర్థ కృపా సమృద్ధ సారస్వతుడే యగుట విశేషము".

ఇష్టదేవతా ప్రార్థనము ముగిసిన తరువాత పినవీరన ఒక పద్యమునందు నిజగురుస్తుతిని గావించెను. అటుపై పూర్వకవి స్తుతిగలదు. ఇందు వాల్మీకి వ్యాసాది సంస్కృత కవులను పేర్కొని అటుపై

క. ఇట్టుల మగు మతి భారత
ఘట్టమునకు నడవవచ్చు గట్టినకవితా
పట్టాభిషిక్తు నన్నయ
భట్టోపాధ్యాయు దలచి పరమ ప్రీతిన్. 1-11

గీ. ఉభయ కవి మిత్రు నత్యంత శుభ చరిత్రు
భాసు సమతేజు గొమ్మయ ప్రభు తనూజు
సుకృత విభ్రాజి తిక్కన సోమయాజి
ప్రణుత బహుదేశ కవిరాజ ప్రస్తుతించి 1-12

అని నన్నయను తిక్కనను స్మరించెను ఇట్లు కవిత్రయములో నిరువురిని మాత్రమే స్మరించి ఎఱ్ఱాప్రెగ్గడను పేర్కొని యుండకపోవుటకు గల కారణమును చర్చించుచు విమర్శకులు "ఎఱ్ఱాప్రెగ్గడ గుడ్లూరు గ్రామస్థుడు. అద్దంకి రెడ్డిప్రభువుల యొద్ద నాస్థానకవి. గుడ్లూరు కందుకూరు తాలుకాలోనిదే. సోమ రాజుపల్లికి చాల దగ్గరగా నున్నది. శృంగార శాకుంతల కృతిపతియగు చిల్లర వెన్నయామాత్యుడు కరణముగా నుండి రెడ్డి ప్రభువుల క్రింద నుద్యోగిగా నుండెను. ఏక శాఖీయులగు నియోగులై సమీప గ్రామములలో నున్న గృహస్థ కుటుంబములకు చేరియుండిన వారగుటచేతను, ఏకసంస్థానాధిపత్య సేవకులగుట చేతను, ఎఱ్ఱాప్రెగ్గడ కుటుంబమగు చదలవాడ వారికిని వెన్నయ కుటుంబమగు చిల్లర వారికిని అన్యోన్య ద్వేషము లుండును. అందుచేత కృతిపతి యగు వెన్నయ శత్రుకుటుంబము వాడైన శంభుదాసుని గురించి ఒక్కమాటయైనను వ్రాయనీయలేదు."[20] అనిరి. కాని ఈ అభిప్రాయము సమంజసము కాదు. ఏలన ఈ కవి, కవిస్తుతిలో, కవిసార్వభౌముడని కీర్తికెక్కినవాడును, కనకాభిషేక గౌరవమును పొందినవాడును, వయోవృద్ధుడును అగు శ్రీనాథుని ఈ కావ్యమునందేకాక జైమిని భారతము నందును పేర్కొనలేదు. జైమిని భారతమున, నన్నయ తిక్కన, నాచన సోమనాథులతోపాటు ఎఱ్ఱాప్రెగ్గడను కూడ సంస్తుతించెను. 'మిగుల నుదార స్వభావునిగా ప్రసిద్ధికెక్కి వైచిత్రి యొనర్చు సుకవి వరుండు కలిగిన ప్రబంధము రోచిష్ణు వగునని భావించి (1-18)'. కవుల యెడ ప్రత్యేకాదరముకల వెన్నయకు ప్రబంధపరమేశ్వరుడని నుతింపబడిన ఎఱ్ఱన పై ద్వేషముండునని ఊహించుట సంభావ్యము కాదు.

వినవీరన పూర్వకవి స్తుతిని గావించుచు అందు ఆ కవుల కవితా సమీక్షను గావింపకుండుట ప్రత్యేకముగా గమనింపదగిన అంశమనియు, శ్రీనాథునివలె ఆ యా కవుల కవిత్వ గుణములు తన కవిత్వమున కారోపించు కొనకుండుట, ఈ కవి అహంభావమును తెలుపుచున్నదనియు కొందఱు విమ

ర్శకులు భావించిరి. సమకాలికుడగు శ్రీనాధుని సంస్తుతింప కుండుటకు గూడ నిదే కారణమని తెల్పిరి.[22]

పూర్వకవి ప్రశంస తరువాత వెన్నయ మంత్రి ప్రశస్తి, అతని సంకల్పము, అతడు కృతికర్తను ప్రశంసించుట వస్తువివేచనము కవిని ప్రబంధ రచనము గావింప ప్రార్థించుట చెప్పబడినవి. పిదప కృతిపతి వంశాభి వర్ణనము ముప్పదిరెండు పద్యములతో సాగినది. షష్ఠ్యంతముల తరువాత కథారంభమైనది.

## ప్రబంధ రచనా సంవిధానము :

ఆంధ్రవాఙ్మయమున నన్నిచోడుసితోడనే ఆరంభమైన ప్రబంధ రచనా ప్రక్రియ శ్రీనాధుని కాలమునాటికి వర్ణన విధానమునను, శైలియందును ఒక పరిణామము నొందినది. శ్రీనాధుని కత్యంత సన్నిహితుడైన పినవీరన రచనయందిది ఇంకను రమ్యముగా భాసించి తద్రచనకు ఒజవడి దిద్దినది. ప్రబంధ పరిణామ చరిత్రలో శాకుంతలము నిర్వహించిన పాత్ర ప్రముఖమైనది. ఇది అనంతర ప్రబంధములకు, ముఖ్యముగా పెద్దన మనుచరిత్రమునకు మార్గదర్శకమైనదని చెప్పనగును. ఈ కావ్యమే తరువాత వెలసిన ప్రబంధ వంశవృక్షమునకు అది బీజము. పినవీరభద్రుడే ప్రబంధకవులకు మూలపురుషుడు. నన్నయాదులనుండి పిండాకృతిగ ప్రారంభించి, శ్రీనాధ జక్కనాదులయందు కించిద్విశద స్వరూపమును పొంది, తుదకు సమగ్ర లక్షణ సమన్వితముగా నాంధ్ర కావ్య శీర్షోదయమగుటయే పినవీరభద్రుని శృంగార శాకుంతలావతార తత్త్వము.[23]

పినవీరన కావ్యావతారికలో ప్రబంధశబ్దమును పలుమారు లుపయోగించెను. ఇష్టదేవతా స్తుత్యనంతరము 'ఒక్క ప్రబంధంబు రచియింపబూని యున్నంత (1-13), అని చెప్పుకొనెను. ఇట్లే కావ్యవస్తు రసాదులను గూర్చి ముచ్చటించునపుడును ప్రబంధ శబ్దమునే వాడెను' (1-25-26), ప్రబంధము నందలి ప్రధాన రసము శృంగారమని చెప్పిన వారిలో నితడు రెండవవాడు. మొదటి వాడు మంచన, కృతిపతి కోరిన విధముగా తాను మిశ్రబంధంబుగా శాకుంతలంబను ప్రబంధంబు బంధురరీతి చెప్పబూనినట్లు వ్రాసికొనెను. అశ్వాసాంత గద్యలలో మాత్రము "శృంగార శాకుంతల కావ్యము నంద"నియే కలదు.

ఈ ప్రబంధము నందలి కథ, నాయకుడు, రసము మున్నగు అంశము లన్నియు ప్రబంధోచితములుగ నున్నవని ఎఱింగియున్నాము. ఇందలి కథ వస్త్వైక్యముతో భాసించుచున్నది. నాయికా నాయకులు పరస్పరానురక్తులై గాంధర్వమున వివాహమాడుట ఇందలి ఆధికారిక వృత్తము. ఈ అనురాగము యొక్క ప్రాదుర్భావము, వికాసము, పరిణామము అను అంశములు క్రమముగ బీజబిందు పురస్సరముగ వ్యాప్తి నొంది నిర్వహణమును గాంచినవి.

వైఖానసుడు కథారంభముననే దుష్యంతునికి పుత్రసిద్ధి కలుగవలెనని దీవించుట భావ్యర్థమును వెల్లడించుచు కథాబీజమును సూచించుచున్నది. రాజు కణ్వాశ్రమమున కేగుటయే అచట నాతనికి బాహుస్ఫురణముచే శుభసూచన మగుట ముఖసంధిలో నావహిల్లినది. నాయికా నాయకసమాగమమునకు ముందు వ్యాఘ్ర ప్రవేశము కథకు కొంత అంతరాయము కలిగించి, తిరిగి నాయకుని మునులు సవనరక్షణమునకై ఆశ్రమము నందుండవలసినదిగా అభ్యర్థించుటచే బీజము అవిచ్ఛేదమై ప్రతిముఖ సంధిలో గాంధర్వ వివాహరూపమున సిద్ధించినది. దుర్వాసుని శాపము గర్భసంధి. అనసూయా ప్రియంవదలు రాజాస్థానము నందా తనికి, అభిజ్ఞానమును చూపక అతనితో జరిపిన సంభాషణము అవమర్శసంధి. ఆకాశవాణి పలుకులు నారదాగమనము మున్నగు అద్భుతాంశములతో కథానిర్వ హణమైనది.

ఈ ప్రబంధము పురవర్ణనముతో నారంభమై నారదమహర్షి భరతునకు రాజనీత్యుపదేశము కావించుటతో నుపసంహరింప బడినది. ఇందు పిన వీరన ప్రబంధోచితములగు పెక్కు వర్ణనములను సందర్భానుగుణముగా చొప్పించెను. ఈ వర్ణనములన్నియు స్వతంత్రములు. ఇవి ఈతని కావ్యనిర్మాణ చాతురిని వ్యక్తము చేయుచున్నవి. ఇందలి పెక్కు వర్ణనములు కావ్యమున కలంకార ప్రాయములై శోభిల్లుచున్నవి. కొన్ని వస్త్వాశయములై కథాసందర్భమున కందము కలిగించుచున్నవి. ఇవి అలంకారికముగను, సరసముగను నుండి గంభీరముగ సాగినవి. ఇవన్నియు నీతని ఉపజ్ఞను ప్రదర్శించుచున్న వనుటకు సందియము లేదు.

ఈ కావ్యమునందలి ప్రతి ఆశ్వాసమునను వర్ణనములు కలవు. ఇందు సముద్రవర్ణన, సలిలక్రీడ, మధుపాన, ద్యూతములు అను నాల్గు తప్ప అష్టాదశ

వర్ణనములలోని మిగిలిన పదునాల్గును కలవని చెప్పవచ్చును. ప్రథమాశ్వాసము నందలి వర్ణనలివి.

1. పురవర్ణనము :

ఇది సాంగోపాంగము. ఇందు ప్రాకారములు, పరిఘలు, గోపురములు, హర్మ్యములు, నాట్యశాలికలు, పురస్త్రీలు, చాతుర్వర్ణ్యము రథ గజ తురగపదాతులు, పుష్పలావికలు, మందానిలము అనునవి వర్ణింపబడినవి. ఇందు నైషధమునలేని చాతుర్వర్ణ్యవర్ణన, మనుచరిత్రమునందు లేని రథగజ తురగాది వర్ణనము, పుష్పలావికావర్ణనము ఉండుట గమనింపదగినది శృంగార శాకుంతలానంతర ప్రబంధములన్నియు షష్ఠ్యంతముల తరువాత పురవర్ణనము తోడనే కథ నారంభించుచున్నవి.

2. నాయక గుణవర్ణనము :

ఇది అలంకార శాస్త్రోక్త గుణముగ నున్నది. ఈ వర్ణనము సమగ్రముగను, నిర్దుష్టముగను నున్నది. కవి ఈ వర్ణనము నొనరించుటలో నొక చక్కని కావ్యశిల్పమును ప్రదర్శించెను. ఈ వర్ణనము తొమ్మిది పద్యములలో నున్నది. (1–87–95). ఇందలి ఆరంభ సీసము కావ్యనాయక సామాన్య గుణములను, అంతము నందలి సీసము నాయకుని యందలి ప్రత్యేకములగు గుణములను అభివర్ణించుచున్నవి. ఇందలి గుణవర్ణనము కథాసందర్భమున కనుకూలించునదియై కావ్యశరీరము నందంతటను వ్యాపించి సార్థక మగుచున్నది.

మృగయా సంరంభము :

ఇందు పుళిందులు వచ్చి దుష్యంతునికి కానుకలుపెట్టి యాతనిని వేటకాహ్వానించి మృగయాసక్తి కల్గించుట వివరింపబడినది. అటుపై మృగయాసాధన సామగ్రి, వేటకుక్కలు తత్సంరంభము అంతయు విశదముగ వర్ణింపబడినది. ఇది సుమారు ఇరువదిరెండు గద్యపద్యముల యందున్నది. ఈతడు కావించిన ఈ వేట వర్ణనము నూతనగాగాని యే పెద్దన మనుచరిత్రమున స్వారోచి వేటను మఱికొంత పెంచి వర్ణించెను.

శకున ఫలాధ్యాయము :

ఇది విదూషకుడగు మాండవ్యునిచే నాయకునకు చెప్పబడినది. ఇది కవి శకునశాస్త్ర పాండిత్యమును వెల్లడించును. అటుపై నాయకునకు గొల్లలు పచరించు విందు వర్ణింపబడినది. ఇందలి వివిధ భోజ్య పదార్థముల వర్ణన చవులూరించును.

ద్వితీయాశ్వాసము నందలి వర్ణనములు :

వేట :

ఇందు నాయకుని మృగయా వినోదము, అతడు వివిధ మృగముల నేయుట, తత్కౌతుకము వర్ణింపబడినవి.

నదీ వర్ణనము :

ఇందలి మాలినీ నదీవర్ణనమునందా నదికి స్త్రీత్వ మారోపింప బడినది. నదీ సహజగుణము లన్నియు లావణ్యరాశియగు నొక స్త్రీ కన్వాయింపదగి యున్నవి. ఇందు రమ్యములగు శబ్దములకూర్పు హృద్యముగా నున్నది.

మ. చలదిందీవర చారు నేత్ర సమదంచచ్చంచరీ కాలకన్
జల జాతానన, కంబుకంఠి, బిస హస్తన్, చక్రవాక స్తనిన్
పులిన శ్రోణి, మరాళరాజగమనన్, భూజాని గాంచెన్ నట
జ్జల కల్లోల పరంపరా నినద వాచా శాలినిన్ మాలినిన్. 2-27

దీనినే వసుచరిత్రమున భట్టుమూర్తి శుక్తిమతీనదీ వర్ణనలో సమగ్రము కావించెను.

తపోవన వర్ణనము :

ఇది ఈ ఆశ్వాసమున దుష్యంతుడు మాలినీ తటమును ప్రవేశించిన సందర్భము నందును, తిరిగి వృద్ధముని అతనిని ఆశ్రమమునకు ఆహ్వానించిన సమయము నందును కలదు. మొదట ఆశ్రమ ప్రశాంత రామణీయకత్వమును, తరువాత అందలి సాత్త్వికత గుణసంపత్తియు అతిసహజముగ వర్ణింపబడినవి. ఈ వర్ణనము నందచటనచట పినవీరన నన్నయ మహాభారతమును, కాళిదాసు నాటకమును అనుసరించియుండెను.

నాయికా సౌందర్య దర్శనము :

దుష్యంతుడు మున్యాశ్రమమును ప్రవేశించి అచట శకుంతలను గాంచి చకితుడగుట, ఆమె సౌందర్యము నభివర్ణించుట, పిమ్మట భ్రమర వృత్తాంతము, నాయికా నాయకుల పరస్పర సందర్శనము, వారి చూపులు, మనోజ వికృతి, నాయక సౌందర్యము, నాయికకు పొడమిన శృంగారానుభావములు మున్నగునవి ప్రబంధోచితముగ వర్ణింపబడినవి. నాయకుడు మునికన్యల ఎదుటికి వచ్చినప్పుడు వ్రాయబడిన,

ఉ. "ఎక్కడివాడ వన్న ? జగతీశ్వర లక్షణ లక్షితంబు నీ
చక్కని మేను, దీర్ఘభుజ శాఖలుఁ దేజము చర్చ సేయగా
నిక్కడి కొంటి వచ్చుటకు నెయ్యదికారణ మంతవట్టు నీ
నిక్కము చెప్పుమన్న ధరణీపతి సత్యచరిత్రుడాత్మలోన్"
2–81

అను పద్యము అనంతర ప్రబంధములలోని ఆగంతుకులనడుగు కుశలప్రశ్నముల కొరవడి యగుచున్నది. ఇందు 'నిక్కము చెప్పు' మని ప్రశ్నించుట కొంత కథాప్రయోజనమును సాధించుచున్నది. అటుపై నాయకుని సత్యచరిత్రుడనుట పై ప్రశ్నమున కితడిచ్చు సమాధానమున తోపింపజేయును. మునికన్యలచే నట్లు ప్రశ్నింపబడిన వాడగుట వలననే నాయకుడు తానెవరో వారికి దాపరికములేక తెలియజేసెను.

పిదప ఈ శృంగార ప్రబంధమునందలి అవాంతర శృంగార కథయైన మేనకా విశ్వామిత్రుల సంగమము అతిరమణీయముగ వర్ణింపబడినది. ఇందు హిమాలయము, విశ్వామిత్రుని తపము, మేనకాగమనము, వసంతవేళ, కుసుమాపచయము. మలయానిలాదులు సరసముగ చెప్పబడినవి. ఈ సందర్భమునందలి వసంతర్తు వర్ణనము ఎన్నదగినది. ఇది అలంకారభరితమై కవి ప్రకృతి పరిశీలన పాటవమును చక్కగ విశదీకరించుచున్నది. వసంత మేతెంచిన తరువాత ప్రకృతియందు కలిగెడి సహజపరిణామము నీక్రింది పద్యము హృద్యముగ వివరించుచున్నది.

సీ. తళ తళ మించు కెందలిరు టాకులనెడ
నెడ నొయ్యొ నొయ్యన తొడిమలెత్తె
తొడిమల నడుమ వాతు లోకింత కనవచ్చె
రావన నన లంకురంబు నొందె
నన లంకురం బంది నవకంబుతో గూడ
బలసి లేదావుల కళికలయ్యె
కళికల పరిమళంబులు వాకొలుపు మోము
లరవిచ్చి మవ్వంపు టలరులయ్యె

తే అలరు గుత్తులు మకరంద మలక నెరయ
విచ్చి సోడు ముట్టగ వన వీథికలను
తరుణభావంబు నొందించె తరుల లతల
నభినవంబైన నవ వసంతాగమంబు 2-126

ఇందు వృక్షములు లతలు చిగురించుట, మొగ్గ తొడుగుట, క్రమముగ వికసించుట, పరిమళము నింపుట సహజముగ భాసించుచున్నవి.

నాయికా సౌందర్య వర్ణనము :

ఇది ఆపాద మస్తకముగ సాగినది. ఈ వర్ణనమున నాయకుని విరహాతురత్వము కూడ ప్రతిబింబించుచున్నది. ఇందలి భావ సంపద ప్రశంసనీయము.

మ. నవలావణ్య పయోధి, చిత్తమను మంథానాద్రికిం, జంద్రికా
పవనాళిం దరిత్రాడుగా బెనచి యజ్ఞాతాశుగుం డిచ్చినన్
రవళిం కోకిల కీరముల్ దరువ నా రత్నాకరం బందును
ద్భవముం బొందిన లక్ష్మి కావలయు నాపద్మాక్షి భావింపగన్ 2-184

విరహము :

నాయికా నాయకుల పూర్వరాగ విప్రలంభమిందు రసానుకూలముగ వర్ణింపబడినది. వినవీరన ద్వితీయాశ్వాసమున సూర్యోదయ సూర్యాస్తమయములను సూచించి వదలివైచెను.

తృతీయాశ్వాసమునందలి వర్ణనములు :

ఈ ఆశ్వాసము ప్రబంధ వర్ణనములకునికి పట్టగుచున్నది. ఇందు యజ్ఞశాలావర్ణనము, నాయక పరాక్రమము, ఆతని విరాళి వివరింపబడిన తరువాత నాయికకు చెలు లాచరించిన శీతలోపచారముల వర్ణనము దీర్ఘముగ సాగినది. పిమ్మట అష్టవిధ వివాహ ప్రశంస, నాయికా నాయకుల గాంధర్వము చెప్పబడినవి.

యుద్ధ వర్ణనము :

ఇది గంభీరముగను విపులముగను సుమారు నలువది గద్యపద్యములలో రసోదంచితముగ సాగినది. ఇందలి శైలి సహజ గంభీరమై యున్నది. వినవీరన నాయకుని పరాక్రమమును తెలుపుటకు సందర్భానుకూలముగ కల్పించిన సార్థక వర్ణనమిది ఇందు రౌద్ర వీర బీభత్సాది రసము లుచితముగ పోషింపబడినవి.

ప్రకృతి వర్ణనములు :

ఈ తృతీయాశ్వాసము కవియొక్క ప్రకృతి పరిశీలన పాటవమును పెక్కు తెఱగుల ప్రదర్శించును. ఇందు సూర్యాస్తమయాంధకార, చంద్రోదయ, చంద్రికా వర్ణనములును, కోడికూతయు, ప్రత్యూష, భాస్కరోదయాది వర్ణనములును శబ్దార్థాలంకారములతో గూడి హృద్యముగ నున్నవి.

ఉ. అంకిలి లేక చంపిర కులాగ్రణి నేడు శకుంతలా మన
శ్శంకరు డయ్యెడుం, గలుగు శాత్రవ మాతనితో ఘనంచు మీ
నాంకున కంగరక్షకయి యామిని రేడొనరించినట్టియా
మంకెన పూవు కేడె మన, మండల మొప్పె మరీచి మాలికిన్.
3-205

ఇందలి ఉత్ప్రేక్ష రమణీయము. ప్రత్యూష కాలమును కవి భావికథ సూచ్యమగునట్లు వర్ణించెను. దుష్యంతుడు శకుంతలా మనశ్శంకరుడయ్యెను కనుక ఆతనితో వైరము తప్పదని మీనాంకునికి అంగరక్షగా చంద్రుడు నిల్పిన మంకెన పూవుకేడెమువలె భానుమండల మొప్పినది. రాక్షసుల యుద్ధముచే విర

హము ప్రాపించిన శకుంతలా దుష్యంతులకు కలుగనున్న సంభోగము నిది సూచించుచున్నది.

కోడి కూత :

పినవీరన కోడికూతను వర్ణించు పద్యము రమణీయమగు శైలితో నొప్పారుచున్నది.

ఉ. తోయజ పుష్పబాంధవుడు తూరుపు గొందకు రాదలంచె, భూ
నాయకుడున్ శకుంతల మనం బలరం జనుదెంచు, దుమ్మెద
ల్మ్రోయకుడీ ! శుకంబులు నెలుంగులు సేయకుడీ ! పికంబులుం
గూయకుడీ ! ప్రమాదమని కూకలు వేసిన భంగి గొక్కురో
కోయని బిట్టు మ్రోసె దొలుకోడి నికుంజ కుటీర వాటికన్ 3-193

ఈ కోడి కూత కథాసందర్భముతో అన్వయించు చున్నది. భానుడు తూరుపు గొండకువచ్చి తోయజము నలరించునట్లు భూనాయకుడు శకుంతల నలరింప నేతెంచుచున్నాడనియు, నాయికా నాయక సమాగమము జరుగనున్న దనియు తొలికోడి కూత హెచ్చరించి చెప్పుట రమ్యముగానున్నది. ఇంకను ఈ ఆశ్వాసము నందలి ప్రబంధోచిత వర్ణనములలో నాయకవనవిహారము, చంద్ర మన్మథోపాలంభనము, నాయిక మూర్ఛ, ఉన్మాదావస్థ ఇత్యాదులు పేర్కొనదగినవి. చంద్రోపాలంభనమున నాయిక, చంద్రుడు తన మనోనాథుని వంశనాథుడు కావున పంద్యుడు కాని నింద్యుడు కాడని, తిరిగి అతనిని వేడి కొనుట సరసముగా నున్నది. పిదప నాయికా నాయకుల రతి రసవంతముగా వివరింపబడినది.

ఈ ఆశ్వాసమును ముగించుచు కవి దుష్యంతుని సైన్యముయొక్క రాకను రగడలో వర్ణించెను. నాయకుడు హస్తినకు మరలుచు శకుంతల కడ వీడ్కోలు గొనుట మనుచరిత్రమున మాయాప్రవరుడు వరూధినికడ సెలవు గైకొను ఘట్టమును స్మరింపజేయును. ఇచట నాయకుని మనోభావాదులు అతిసహజముగ వర్ణింపబడినవి.

చతుర్థాశ్వాసము నందలి వర్ణనలు :

ఇందారంభమున కణ్వమహర్షిచే శంకరస్తుతి గావింపబడినది. అటుపై చంద్రవంశ కీర్తి ప్రశస్తు లుగ్గడింపబడినవి. శకుంతలా దౌహృద చిహ్నములు,

పుత్రోదయము ప్రబంధోచిత విధానముతో నలరారుచున్నవి. నారదమహర్షి భరతునకు రాజనీత్యుపదేశము చేయుటతో కావ్యముపసంహరింపబడినది.

**నాటకీయత :**

కథా కథనాత్మకముగ సాగు శ్రవ్య ప్రబంధములో సందర్భానుగుణముగ నాటకీయతను ప్రవేశపెట్టుట ప్రబంధ కవులలోని ప్రత్యేకత. పినవీరన ఇట్టి నాటకీయతను తన కావ్యమున పలుతావుల ప్రదర్శించెను. నాటక గుణములగు పాత్ర ప్రవేశము, అభినయసూచనలు, సంభాషణములు మున్నగు అంశములిందు కనవచ్చును.

ద్వితీయాశ్వాసమున వనమునందలి జంతుజాలమును గాంచి వెఱచిన విదూషకుని స్వగతము నాటకానుగుణముగ నున్నది.

మాండవ్యుడు గొల్లల విందు నంగీకరింప వలసినదిగా రాజునకు నచ్చజెప్పుట, విదూషకుని మృగయాభీతిని రాజపనయించుట, శకుంతలా దుష్యంతుల సమావేశ ఘట్టములు, శకుంతల అత్తవారింటికి ప్రయాణమగుట మున్నగు సన్నివేశములు సంభాషణాత్మకముగా రచింపబడినవి.

ముఖ్యముగా శకుంతల భ్రమర పీడితయైన ఘట్టమున ఆమె చెలులకు తన ఆర్తిని వెల్లడించుట, వారు పరిహాస పూర్వకముగ నామెకు సమాధానము చెప్పుట సరసముగ నున్నవి. శకుంతల చెలులతో నిట్లనును.

ఉ. "ఈ యళిపోత మే నెఱుగ నెక్కడ నుండియొవచ్చి మోముపై
రాయిడి చేయుచున్నది, కరంబులఁ జోపిన, బోవదన్న.

అనసూయ ఇట్లు సమాధానము చెప్పినది.

ఓ తోయజనేత్ర ! నే నెఱుగుదున్ విరవాదికి నీరువోయగా
నాయెడ నుండి వచ్చె భవదానన గంధము నాస్వాదింపగన్.

2-69

ఆమెను రక్షించుటకు రాజును పిలిచెదమని చెలులు నవ్వులాటకు రెండు మూడు పదంబులరుగుట, వారివెంట శకుంతల ఆక్రోశము చేయుచు కదలుట అప్పటి వారి అభినయమును తెలుపుచున్నవి.

శకుంతలాశాప కారణం బెఱుగని అనసూయ కన్నీరు నించెను. ఆమెకు ప్రియంవద తానెఱింగిన విషయమును చెప్పదలచి అనుమతిని కోరగా అనసూయ "భౌమ ముడియం బెట్టుచు గను గీటి" [8-50] అనుమతిని తెలిపినది.

తృతీయాశ్వాసమున శకుంతల మనమును రాజునకు తెలుపుచు అనసూయ అతనితో గావించిన సంభాషణము చతురముగా నున్నది.

పినవీరన ఎడనెడ పాత్ర ప్రవేశమును నాటకానుగుణముగా సూచించెను. తాపస కన్యల ఎదుటికి రాజు "ప్రాని చాటు విడిచి, జవనిక వాయందట్టిన బొడసూపు బహురూపి తెఱంగున మఱుంగు పడియున్న తానన్నలిన విలోచన లకు లోచనగోచరుండై" [2-78] నిలిచెను. విరహిణియైయున్న శకుంతల కడకు దుష్యంతుడు "ఒక యెలమావికి ఛద్మంబున బిసతంతు వాగురం బాగుగా నమర్చి యురి వేటకాని లాగున, శకుంతలంబుల నిరీక్షించు చున్నవాడ పోలె" [3-78] ఏతెంచెను.

కణ్వుడు సోమతీర్థమునుండి మరలివచ్చి శకుంతలను ఆశ్రమాంతిక యోగక్షేమాదులను గూర్చి ప్రశ్నించుట నాటకోచితముగ నున్నది. అతడు తద్వదనాంబుజంబున క్రొత్తసిరి వెలయుటను చూచి ఆమెను విషయమును దాచక తనతో చెప్పమనుటయు, అందులకామె "గజగజ వడకుచు న్రవవారి, కన్నుగవరాల గద్గద కంఠి యగుచు" [4-15] విషయమును తెలుపుటయు దృశ్యకావ్యసరణి కనుకూలముగ నున్నవి. దుష్యంతుని సభయందాతనితో అనసూయా ప్రియంవదలు గావించిన సంభాషణము కూడ నాటకోచితముగ నున్నది.

మూలానుసరణము :

పినవీరన కావ్యావతారికలో తాను ప్రధానముగ భారత ప్రోక్తకథను, కొంత కాళిదాసుని నాటక క్రమమును అనుసరింతునని చెప్పుకొనెను. కావ్యమును అభినవముగా తీర్చిదిద్దుట [24] తన ప్రధానాశయమని కూడ స్పష్టము చేసెను.

శకుంతల కథకు ఆదిమూలము మహాభారతము కనుక ఆ కథ కావ్యము నందంతటను బీజప్రాయముగ గోచరించుచునే యుండును. ఇక నాటకానుసరణ విషయము. పినవీరన తాను ముందు చెప్పియున్నట్లు అభిజ్ఞానశాకుంతల నాటక

క్రమమును కొంత మాత్రమేకాక మిక్కిలిగనే అనుసరించెనని చెప్పవలెను. అతడు నాటకములోని చతుర్థాంక పర్యంతముగల కథాసన్నివేశముల నధికము గను, పంచమాంకమును కొలదిగను అనుసరించెను. సూక్ష్మముగ చెప్పవలెనన్న పినవీరన కాళిదాసుని నాటక కథాకల్పనములనే కావ్యమునందంతట అనుసరించుచు కావ్య నిర్వహణమును మాత్రము మహాభారత కథానుగుణముగ కావించెనని చెప్పవచ్చును. కాళిదాస కల్పనములచే శకుంతల కథ దివ్యముగ భాసించినది. ఈ కల్పనములను మహాభారత కథతో జోడించి, రెంటికిని, చక్కని సమన్వయమగునట్లు పినవీరన కథయందు చేర్చిన మఱికొన్ని స్వతంత్ర కల్పనములాతని వస్తు సంవిధాన కౌశలమును ప్రకటించుచున్నవి. పినవీరన తాను గ్రహించిన భారత, నాటక కథాంశముల నెచటను యథాతథముగ గ్రహించి యుండలేదు. వానికి పెక్కు స్వకపోల కల్పనములను చేర్చెను. కావ్యమునందెల్లెడల స్వాతంత్ర్యమును ప్రకటించుట పినవీరన ప్రత్యేకత. ఇందెడనెడకన వచ్చుచున్న నాటక భావానుసరణముకూడ ఈవిషయమునే వ్యక్తము గావించును.

పినవీరన నాటకము నుండియు, భారతము నుండియు గ్రహించిన కథాంశములు.

నాటకమునుండి గ్రహించిన అంశములు :

1. దుష్యంతుడు వనమునందొక హరిణముచే నాకృష్టుడై దానిని తరుముచు కణ్వాశ్రమ ప్రాంతమును చేరుట.

2. అది ఆశ్రమ మృగమనియు, దానిని కొట్టవలదనియు ముని శిష్యులాతనితో పలుకుట.

3. ముని శిష్యులు దుష్యంతునికి చక్రవర్తి లక్షణ సమన్వితుడగు కుమారుడుదయించునని దీవించుట, వారాతని కణ్వాశ్రమమును దర్శింపరమ్మని ఆహ్వానించుట.

4. ఆశ్రమ ద్వారము చేరిన దుష్యంతునికి శుభసూచనలు పొడముట.

5. దుష్యంతుడు కణ్వాశ్రమమున వృక్షములకు జలసేచనము కావించు మునికన్యలను చూచి, అందు శకుంతలా సౌందర్యమునకు ముగ్ధుడయి, వారిని చాటున నుండి గమనించుట.

6. దుష్యంతుడు శకుంతల ముని కన్యయగునా అని వితర్కించుట.
7. శకుంతలా వదన సరోజమున తేటి ముసురుకొనగా, దాని నదల్చు నెప మున రాజు కన్యల ఎదుటి కేగుట.
8. శకుంతలా దుష్యంతులకు ప్రథమ వీక్షణముననే అనురాగోదయమగుట.
9. శకుంతల లతామండపమున విరహవేదన ననుభవించుట, చెలులామెకు శైత్యోపచారములు చేయుచు ఆమెతో సంభాషించి తద్ద్వారా ఆమె మనము నెఱుంగుట, దుష్యంతుడు మాటుననుండి వారి సంభాషణము లాలకించుట, శకుంతలా దుష్యంతులకు గాంధర్వవివాహము జరుగుట, దుష్యంతుడు రాజధానికి మరలుచు ముద్రాంగుళీయకము నిచ్చుట.
10. పతి ధ్యానమున నున్న శకుంతలను అతిథియై వచ్చిన దుర్వాసుడు శపించుట. అభిజ్ఞాన సందర్శనము వలన ప్రియునకు ఆమె స్మరణము కల్గునని చెలులు శాప నివారణోపాయమును తెలుపుట. అంగుళీయక దర్శనముతో దుష్యంతునకు శకుంతలా స్మరణము కలుగుట అనునవి కవి నాటకమునుండి గ్రహించిన అంశములు.

భారత కథ ముఖ్యముగ మూడు పాత్రలలో సాగినది. మూడే పాత్ర లున్న నాటకమున రక్తి కలుగదు. కావున కాళిదాసు, అనసూయ, ప్రియంవద, విదూషకుడు, వైఖానసుడు, శార్ఙ్గరవ, శారద్వతాదులు, గౌతమి మున్నగు పాత్రల కల్పన మొనరించెను. వర్ణనాత్మకమగు ప్రబంధమున పెక్కు పాత్రల ఆవశ్యకముండదు గనుక పినవీరన నాటకము నందలి, అనసూయా ప్రియంవదలను, విదూషకుని గ్రహించి తక్కిన వారిని వదలివైచెను. ఈతడు నాటకము నందలి మాధవ్యుని మాండవ్యుడనియు, వైఖానసుని వృద్ధతాపసి అనియు పేర్కొనెను. ఇది స్వతంత్ర కావ్యము కనుక నాటకము నందలి ప్రస్తావనాదులు పరిహరింపబడినవి. నాందీ శ్లోకము మాత్రము ఇష్టదేవతా స్తుతియందు గ్రహింపబడినది.

భారతము నుండి గ్రహించిన కథాంశములు :

1. దుష్యంతుని మృగయా విహార వర్ణనము.
2. శకుంతలా జన్మవృత్తాంతము వివరముగా చెప్పబడుట.

3. తనకు శకుంతల వలన కలుగు కుమారుని యువరాజును చేయుదునని దుష్యంతుడు శపథము చేయుట.

4. కణ్వుడు, పుత్రవతియైన శకుంతల నత్తవారింటికి పంపుట.

5. శకుంతలను, కుమారుని, నిరాకరించిన రాజునకు సభలో ఆకాశవాణి సత్యము నెఱింగించుట.

కథాంశములను విస్తరించుట :

సాధారణముగ నాటకము నందలి వస్తువు దృశ్యము, సూచ్యము అని రెండు విధములుగ ఉండును. శాకుంతల నాటకమున తృతీయ, చతుర్థాంకము లందు విష్కంభము లును, పంచమ షష్ఠాంకములకు నడుమ ప్రవేశకమును కలవు. తృతీయాంక విష్కంభము వలన, దుష్యంతుడు తాపసుల సవనమును నిరుపద్రవము కావించినట్లును, శకుంతల తాపబాధకు గురియైనట్లును తెలియ నగును. చతుర్థాంకము నందలి అర్థోపక్షేపకము వలన, శకుంతలా దుష్యంతు లకు గాంధర్వ వివాహము జరిగినట్లును, శకుంతల దుష్యంత సమాగమము వలన గర్భము ధరించినట్లను తెలియవచ్చును. షష్ఠాంకారంభమునందలి ప్రవేశ కము దుష్యంతునికి అభిజ్ఞానము లభించిన వృత్తాంతము తెలుపును.

పై సూచ్యాంశములలో పినవీరన దుష్యంతుడు రాక్షసులను జయించి సవనమును కాచుట రసోదంచితముగను, విస్తృతముగను వివరించెను. శకుం తల విరహము, చెలులామెకు శైత్యోపచారములు కావించుట, నాయికా నాయ కుల సంభోగ శృంగారము లలితమగు ప్రబంధ సంవిధానమును సంతరించు కొన్నవి. శకుంతలా గర్భము, పుత్రోదయము మున్నగు సూచ్యాంశములు అఖ్యానాత్మకముగ వివరింపబడినవి.

దుష్యంతుని మృగయావిహారము నాటకమునందు సూచ్యమాత్రముగను భారత కథయందు కథనాత్మకముగను నున్నది. పినవీరన దీనిని పై రెంటికన్న భిన్నముగ విపులముగ వర్ణించెను. నాయికా సౌందర్యమును విపులీకరించుట యందు కూడ నతడు స్వతంత్రత చూపెను.

పై అంశములను అనుసరించుటలో పినవీరన చూపిన స్వాతంత్ర్యమట్టిది.

1. తాను మూలము నుండి గ్రహించిన కథాంశముల నన్నింటిని ప్రబంధోచిత రీతి విస్తరించి వర్ణించుటయే కాక అందు పెక్కు నూత్న కల్పనములను కావించుట, తాను గ్రహించిన కథాంశములకు చక్కని సమన్వయము కల్పించుట.

2. మూలకథ యందు కొన్ని మార్పులను కావించుట.

11. కథయందు చేర్చిన నూత్నాంశములు :

1. మాండవ్యుడు దుష్యంతునకు శకున ఫలమును చెప్పుట.

2. అడవిలో రాజును గొల్లలు విందున కాహ్వానించుట. ఈ ఘట్టము రాజునకును, ప్రజలకును మధ్య నొక సాన్నిహిత్యమును నిరూపించుచున్నది.

3. దుష్యంతుడు ఆశ్రమ ప్రభావముచే కరుణాంతరంగుడై హరిణమును కొట్టకుండుట ఈ ఆశ్రమ సాత్త్వికసంపత్తిని వ్యంగ్యముగ స్ఫురింపజేసి కథను రమణీయ మొనరించుచున్నది.

4. దుష్యంతుడు తాను ఆశ్రమ మృగము నలయించినందుకు మునులు శపింతురేమో యని భయపడుట, ఇది రాజు యొక్క వినయ శీలత్వమును నిరూపించుటకు తోడ్పడుచున్నది.

5. దుష్యంతుడు రాక్షసులతో యుద్ధము చేయుచున్నాడని ఎఱింగి అతనికి సాహాయ్య మొనరింప నగరమునుండి సైన్యములు వచ్చుట. ఈ సైన్యములరాక, దుష్యంతునకు యుద్ధమున విజయము లభించిన పిమ్మట చెప్పబడినందు వలన దీనివలన ప్రత్యేకముగా కథ కొనగూడిన ప్రయోజన మేమియును లేదు. కాని ద్విరదగతిరగడలో సాగిన ఈ వర్ణనము కవికి సైన్యమును వర్ణించు నవకాశమును కల్గించెను.

6. సోమతీర్థమున తపము చేయుచున్న కణ్వుడు దివ్యదృష్టితో శకుంతలా దుష్యంతుల వివాహము నెఱుంగుట. కాళిదాసు నాటకము నందెచటను మునియొక్క దివ్యదృష్టి ప్రసక్తిని కొనితేలేదు. పినవీరన మునియొక్క

దివ్యదృష్టి ప్రసంగమువలన, ఆతడు మున్ముందు జరుగనున్న శకుం తలా ప్రత్యాఖ్యామును గూడ ఎఱింగియే ఆమెను అత్తవారింటి కంపు నపుడు, ఆమె వివాహమునకు సాక్షులైన అనసూయా ప్రియంవదల నామెతో కూడ పంపియుండు ననుకొనుట కవకాశము కల్గుచున్నది.

7. కణ్వమహర్షి ఆశ్రమ వాసులందరిచే శకుంతలా గాంధర్వ వివాహమును అంగీకరింప చేయుట. ఇది ఔచిత్యవంతమగు కల్పనము, వివాహాది కార్యములు సంఘమునందు ఆమోద ముద్రను బడయవలెను. అపుడే అవి గౌరవపాత్రము లగును. కణ్వుడు తన అల్లుని ప్రతిష్ఠ నెఱింగి శకుంతలా వివాహమును ఆమోదించిన చాలదు. అది సకల ఋషి సంఘ ముచే నంగీకృతమై నపుడే గౌరవప్రదమై భాసింపగలదు. కావుననే కణ్వుడు, దుష్యంతుని వంశప్రతిష్ఠను ఆశ్రమవాసుల కెల్లరకు వివ రించి, శకుంతలా పరిణయమును గూర్చిచెప్పి, ఆ వివాహము నెల్లరిచే అంగీకరింపజేసెను.

పినవీరన తన కావ్యమునందు కాళిదాసుని నాటకమునవలె అభిజ్ఞానాంగు ళీయకమును గాంచి రాజు శకుంతలను తాను పరిణయమాడిన వృత్తాంతమును సంస్మరించుటయు, భారత కథయందువలె అశరీరవాణి సభయందు రాజునకు సత్యము వెల్లడించుటయు, రెంటిని గ్రహించి వానినడుమ కొన్ని అమూలక కల్పనములను కావించెను.

1. అందు కణ్వుడు అనసూయా ప్రియంవదలను కూడ తోడిచ్చి శకుంతలతో నత్తవారింటికి పంపుట మొదటిది. అనసూయా ప్రియంవదలు శకుంతలకు ప్రాణసఖులై, ఆమె యభీష్టము నెఱిగి తదనుకూలముగ ఆమె ప్రణ యము కొనసాగుటకు సహకరించి వివాహపర్యంతము ప్రధానపాత్ర వహించిరి. దుర్వాసుని శాపమును తదవధిని కూడ ఎఱింగినది వీరే. భూతవర్తమాన భావ్య ర్థముల నెఱింగిన మహర్షి శకుంతల రాజునొద్దకు వెడలునపుడు చెలులుకూడ వెంటనుండుట ఆవశ్యకమని ఎఱింగి వారిరువురను కూడ నామెతో హస్తినాపురి కంపి యుండును.

కాని రాజు శకుంతలను గుర్తింపక తిరస్కరించిన సందర్భమున, అనసూయా ప్రియంవదలాతని నధిక్షేపింతురే కాని అంగుళీయకమును బయట

పెట్టరు. కాగా దేవతలందఱను ఎలుగెత్తి పిలిచి సత్యము నెఱింగింపవలసినదిగా కోరుదురు. అంత అశరీరవాణి సత్యమును చాటిచెప్పును. అయినను దుర్వాసుని శాపము ప్రభావమున రాజునకింకను శకుంతల స్మరణకు రాలేదు. ఆకాశవాణి సత్యము నెఱింగించిన పిదప "శకుంతలాంగుళీ స్థాపితమైన యుంగరము జయ్యన నూడిచి మీదవైచి అది బాలిక వ్రేలికెట్లు వచ్చెనో చెప్పుమనిరి". ఈ అంగుళీయక దర్శనముతో రాజునకు శాపతిమిరము తొలగి ప్రసన్నత కలిగెను.

ఇట్లు పినవీరన అనసూయా ప్రియంవదలను రాజసభయందు ప్రవేశపెట్టి ఆ ఘట్టమునకు కొంత వినూత్నత సంతరించి యుండినను, సత్యము నెఱింగిన అనసూయా ప్రియంవదలు, రాజు శకుంతలను విస్మరింప అతని నధిక్షేపించుటకు తగినంత కారణము కనరాదు. దేవతల నెలుగెత్తి పిలిచి అశరీరవాణిచే నిజము పల్కించుటకును హేతువు లేదు. ఏలన ఆకాశవాణి సత్యము పలికినను రాజుపై శాప ప్రభావముండియే తీరును. అంగుళీయకమును చూపిన పిదపకూడ వారాతనికి దుర్వాసుని శాపమును గూర్చి చెప్పక నారదునిచే దానిని చెప్పింతురు. పినవీరన లౌకికములైన ప్రమాణములుండగా, నలౌకిక ప్రమాణముల నాశ్రయించుట ఆతనికి సత్యమును దివ్యముగ భాసింప చేయవలెనను తలంపు కలదని స్పష్టమొనరించు చున్నది. ఏమైనను భారతకథలో అశరీరవాణికి గల ప్రాధాన్యమిందు తగ్గినదని చెప్పవచ్చును.

2. దుష్యంతుని సభకు నారదుడేతెంచుట పినవీరన కావించిన రెండవ కల్పనము. ఈతడు దుర్వాసుని శాపమును రాజున కెఱింగించుటకై దివి నుండి భువి కేతెంచును. ఆ దేవమునివలన సత్యము నినిన రాజునకు కలత తొలగినది. ఆతడు పుత్రుని యువరాజుగ ప్రకటించెను. భరతవంశ కులజులందఱకును మూలపురుషుడైన భరతుని పరిపాలన మాదర్శవంతముగ నిలుచుటకు తగిన రాజనీతులన్నియు నారదుడు భరతునకు బోధించెను.

ఈ కావ్యాంతమును గూర్చి చెప్పుచు విమర్శకులు "కావ్యాంతమున నాయకుని యెడ వానప్రస్థ స్వీకారాభినివేశ మున్నట్లు చెప్పబడినది. శృంగార కావ్యమున కిది తగదు. అయితే అతడు నాయికతో రాజ్యసుఖముల ననుభవించుచుండినట్లు కథ ముగిసినది. కొంత నయము"[25] అని పేర్కొనిరి.

మూలమునకు మెఱుగుపెట్టిన ఘట్టములు :

1. పినవీరన రాజు వేటకు వచ్చుటను సకారణముగ నిరూపించి రాజు మృగయా వ్యసన పరాయణుడై వేటకు కడంగలేదని స్పష్టమొనరించి అతని శీలమున కౌత్కృష్ట్యము నాపాదించెను. అతడు మునులతో

"తపస్వికుంజర ! యేను దుర్వ్యసనంబున మృగయా విహారంబునకు గడంగినది లేదు. సింహ శరభ సైరిభ ద్వీపి ద్విపాది దుష్ట మృగంబులు గోష్ఠంబులకు, నేదిష్ఠ గ్రామంబులకు, నరిష్టంబు సేయుచున్నయవి యని భిల్ల పల్లవ జనంబు లెఱింగించిన, వాని మర్దించుటకునై వేటాడ వచ్చితి" నని చెప్పెను. [2-39] పినవీరన నాటకమునందు చతుర్థాంకమున గల దీర్ఘాపాంగ మను హరిణ శాబకము వృత్తాంతము నాధారముగా గ్రహించి దానిని ప్రథమాశ్వాసమున మనోరంజకముగ తీర్చిదిద్దెను. నాటకమున శకుంతల అత్తవారింటికి బయలు వెడలునపుడు దీర్ఘాపాంగము అమె కొంగుపట్టి లాగి ఆమెను నిలువరింప యత్నించును. ఆహరిణముపట్ల శకుంతల నెఱపిన సౌహార్ద మిట్టిది.

"యస్య త్వయా వ్రణవిరోపణ మింగుదీనాం
తైలం న్యషిచ్యత ముఖే కుశసూచి విద్ధే
శ్యామాక ముష్టి పరివర్ధితకో జహాతి
సో యం న పుత్రకృతకః పదవీం మృగస్తే. 4-13

శకుంతల ఈ హరిణమును పెంపుడు కొడుకువలె సాకినది. దర్భమొనలు గ్రుచ్చుకొన్న దాని మూతికి గారనూనె పూసి గాయమును మాన్పుచుండెను. చామలు పిడికిళ్ళతో పెట్టి ఆదరించుచుండెను. దీనినే పినవీరన, వృద్ధతాపసి రాజునకు ఆశ్రమహరిణ వృత్తాంతమును చెప్పు సందర్భమున "ఇది ఆశ్రమవాసులకు ప్రాణమిత్రమై చరించునట్టిది. తల్లి దీనిని ఈనిన మైతడి ఇంకను ఆరక మునుపే ఇది దారితప్పి తపోవనము ప్రవేశించినది. మును లపారమైన ప్రేమతో మునివ్రేళ్ళతో ముచ్చటగా దర్భలను మేపి దీనిని కన్నబిడ్డవలె పెంచిరి, ఈ హరిణ శాబకమునకు మునిపత్నులే తల్లులు. మునిగణములే తండ్రులు. అక్క సెల్లెండ్రు మునికన్యలు. ఇట్లు ఆశ్రమమున ముద్దు ముద్దుగా నిది పెరిగినది. ఇది ఆహారార్థము లడవికి మేతకు పోయినపు డెవరైన తాపస గణమును కను చూపుమేర కనుగొనినచో మేత మాని వారి దరిచేరి సౌహృదోత్కంఠతో కండూ

యనము చేయించుకొనును" అని వివరించినట్లు రచించెను. మునిజనముల వాత్సల్యమున, అత్యంతాదరమున పెంచబడిన ఈ హారిణ వృత్తాంతము, తాపస జనుల కరుణార్ద్ర ప్రవృత్తిని వివరించుటయేకాక పసితనముననే తలిదండ్రులచే పరిత్యక్త అయిన శకుంతల కథను కూడ ధ్వనింప చేయుచున్నది. కావ్యారంభముననే కథా సూచనము నత్యంత హృద్యముగ కావించుట నిస్తులమగు కావ్య శిల్పమునకు తార్కాణము.

2. శకుంతల అత్తవారింటికి వెడలు ఘట్టము నాటకమునందు పరమ విశిష్టమైనదిగా ఎన్నబడుచున్నది. కావుననే ఇందలి చతుర్థాంకము రమణీయమైనదిగా ప్రసిద్ధి చెందినది. ఇది ఇంతటి ప్రాశస్త్యము వడయుట కిందలి సహజత్వమే కారణము. సాధారణముగ కన్యను పతి గృహమున కంపునపుడు ఆమెకు చీర సారెలిచ్చుట, వెంట బంధువర్గమును పంపుట, తగిన బుద్ధులను జెప్పుట, వీడలేక పీడుచు ఆమెను చాలదూరము వఱకు సాగనంపుట, పుత్రిక దూరమైనదను బాధ పొందినను తండ్రి తుదకు తన భారము తీరినదని భావించుట మొదలుగా గల సహజ భావాదులన్నియు నిందు హృద్యముగ ప్రదర్శితములైనవి. మహర్షియగు కణ్వుడు పుత్రికా వియోగమునకు సామాన్య గృహమేధివలె అకులుడగుట, శకుంతల ఆశ్రమ ప్రకృతిలోని అణువణువుపై చూపిన సౌహార్దము, వానిని వీడిపోవునప్పటి ఆమె హృదయావేగము, కణ్వుడు పుత్రికకు చేసిన హితబోధ, అల్లునకిచ్చిన సందేశము మున్నగు అంశములన్నియు కాళిదాసుని కల్పనాశక్తికిని లోక పరిశీలనమునకును నిదర్శనములు. ఈ చతుర్థాంకము నందు పై భావాదులను ప్రకటించు శ్లోకములు నాల్గు అత్యుత్తమములుగా గణన కెక్కినవి.

ఈ ఘట్టమును విశ్వనాధ ప్రత్యేకమగు శ్రద్ధతో తీర్చిదిద్ది మూలమునకు మెఱుగుపెట్ట యత్నించెను. ఈ ఘట్టమున కణ్వుడు శకుంతలకు గావించిన హితబోధ కులస్త్రీల కందఱకును నాదర్శప్రాయమైనది. ఆ సమయమునందు కణ్వుని యొక్క హృద్గత భావ సంచలనమును కవి ఇట్లు వర్ణించెను.

ఉ. "పొమ్మనఁ జూచు జూచి మది బుట్టిన ప్రేమము పేర్మి బాష్పముల్
గ్రమ్మిన గ్రమ్మఱం బెడమొగం బయి కన్నుల నీరు ప్రింగుచుం
గ్రమ్మఱదా శకుంతల మొగంబగు, నశ్రులునించు గొంతనే
పమ్మని జాలి బొంది ధృతి యంతయు నిల్వక విచ్చి పొఱగన్ 4-84

ఇట్లు మహర్షి అయ్యును అతడు సహజ కరుణాప్రవృత్తిచే శకుంతల యెడ గాఢమమతానుబంధమును పెంచుకొనెను. అతడీ మోహలత త్రెంప నసాధ్యమైనదని ఎంచి క్షణకాలము పర్యాకులుడాయెను.

3. అనంతరము కుమార్తెకు అతిసరళముగ అత్తమామల యింట మెలగవలసిన విధానమును గూర్చి హెచ్చరించెను. "అత్తమామలకు నీయపనేమి వెట్టక కనుసన్నజేయుమీ పను లెఱింగి" అని చెప్పుటలో మూలభావము రమ్యముగ విపులీకరింప బడినది. శకుంతల ఆశ్రమ లతావృక్షాదులతో నెఱపిన నెయ్యమును

గీ. తోడు నీడయుబోలె నీ తోయజాక్షి,
పెరిగె నిన్నాళ్ళు మీలోన బెద్ద యయ్యె
బురుషునింటికి ననుపక పుట్టినింట
నునుచ కొనరాదుగా యంచు నుస్సురనుచు 4-94

అని చెప్పి కణ్వుడు యుక్త వయస్కురాలైన కన్యయెడ తండ్రికి గల బాధ్యతనెఱింగించెను. ఇక శకుంతల జనకుని ఆశ్రమ వాటికను వీడలేక వీడలేక వీడిన పరిస్థితిని ఆమె హృదయావేదనను కూడ కవి అత్యంత హృద్యముగ రచించెను. అనిమిష నది రత్నాకరమున కేగెడు భంగి గదలి మున్యాశ్రమమును శకుంతల వదలి పోయెడు ఘట్టము మఱపురానిది.

4. మూలమునందలి భ్రమర వృత్తాంతము కూడ కవిచేత రమణీయముగ తీర్చిదిద్ద బడినది. పినవీరన ఇందు సమయోచిత సరస సంభాషణములను కల్పించెను. ఈ ఘట్టమున శకుంతల దీనావస్థ, ఆమె చెలులను రక్షింప వేడుకొనుట, వారామెను పరిహసించుచు చతురోక్తులతో సమాధాన మిచ్చుట కన్నులకు కట్టినట్లుగా చిత్రింపబడినవి. మూలమున మధుపము ముసురుకొనగా శకుంతల చెలులతో ఇట్లనును.

శకు — సఖ్యౌ, పరిత్రాయేథామ్, పరిత్రాయేథామ్, అనేన దుర్వినీతేన మధుకరేణ అభిభూయ మానాం మామ్.

ఉభౌ — (సస్మితం) కే ఆవాం పరిత్రాతుం ? దుష్యన్త మాక్రన్దస్వ. రాజ రక్షితవ్యాని తపోవనాని నామ — మూలమున సంగ్రహముగానున్న శకుం

తల అభ్యర్థనమును తెలుగు కవి విస్తరించెను. ఇందు శకుంతల చెలులతో తమ స్నేహమెంతటిదో వివరించి "ప్రాణములను కాపరే ప్రాణమిచ్చి మమత విడువక మాన్పరే మధుపబాధ" [2-74] "వివర మొనరింప బొందులు వేఱుగాని ప్రాణమొక్కటి మనకు పద్మాక్షులార పాపరే నాకు నీ యాతిబాధ" [2-76] అని వారిని ప్రార్థించును. ఇచట చెలుల పరస్పర ప్రేమను కవి పాత్ర చేతనే పలికించినాడు. శకుంతల వారితో "మీచేతులెల్ల గిజగిజ గాజేసెను మొగలి ముండ్లు గాడిన భంగిన్" అని తేటిబాధను ఉపమాన సహితముగా చెప్పుటకూడ సన్నివేశమునకు స్ఫూర్తి నిచ్చుచున్నది. మూలమునందలి దుష్యంతమాక్రందస్వ రాజరక్షితాని తపోవనాని నామ అను భావమును విస్తరించుచు చెలులు దుష్యంతుని ప్రజారక్షణ శీలత్వమును కూడ వివరించి అతడు "దుర్దాంతుని య్యాశిం గెడపి తాముం పుంజెలసాల బెట్టెడున్" అను విశేషోక్తిచే ఆ ఘట్టమునకు సౌందర్యము నాపాదించిరి. రాజు సన్నిధికి వోయెదమని నగవులకు అనసూయా ప్రియంవదలు రెండు మూడు పదంబులరుగుట - వారివెంట శకుంతలయు ఆక్రోశము చేయుచు కదలుట మున్నగు కల్పనలు రాజు వారి ముందు కేతెంచుటకు చక్కని అవకాశమును కల్పించినవి.

5. శకుంతలా దుష్యంతుల ప్రథమ సమాగమము : ఇది మూలమున సంభాషణ ప్రాధాన్యముగా నున్నది. ఈ సంభాషణమున శకుంతలకు ప్రవేశము తక్కువ. శకుంతల తనకు రాజుపై జనించిన అనురాగమును లజ్జాన్వితయై అభినయాదులతో ప్రకటించును. దుష్యంతుడు శకుంతలను గూర్చిన వివరముల నన్నింటిని ఆమె చెలుల నడిగి తెలిసికొనును. పినవీరన ఈ సమాగమును భావ ప్రాధాన్య మొనరించెను. దుష్యంతుని చూచిన శకుంతల అతని అందమును మనసార భావించును. ఇరువురి చూపులును మనసులును కలసికొనినవి. మూలమున తనకు కలిగిన మనోవికారమునకు సరియైన అర్థము చెప్పుకొనలేని స్థితి నాయిక అనుభవించెను. కావ్యమున దుష్యంతుని కాంచినంతనే శకుంతల "ఇతండు ప్రియుండుగాగల భాగ్యవతి కన్యయెవ్వతె యొకో" అని చింతించి తానాతని సహచారిణి కావలెనని అభిలషించినది.

6. నాటకము నందు తృతీయాంకమునందు గల శకుంతల విరహతాప ఘట్టమును పినవీరన తృతీయాశ్వాసమునం దతిరమణీయముగ తీర్చిదిద్దెను.

తమ చెలి అస్వస్థురాలగుటను కాంచి అనసూయా ప్రియంవదలు 'తాత, కాశ్యప మునీంద్రుడు జేరువ లేడు' అని కలవరమందుట సహజముగా నున్నది. ఆ సమయమున శకుంతల యొక్కయు చెలుల యొక్కయు పరస్పరానురాగము హృద్యముగా వివరింప బడినది. చెలులు శకుంతలతో

క. నీకు బహిః ప్రాణములము
మాకే యెఱిఁగింప వింక మఱియెవ్వరికిన్
గోకనద హస్త చెప్పెదు
దాకొని మదిలోన నున్న తగులున్ నెగులున్ 3-57

అని బుజ్జగించి యడుగుట, శకుంతల వారితో తన మనస్సు విప్పిచెప్పుట, అట్లు గావించుటకు

శా. గంగా గర్భము నుండి నేటి తుదదాకన్ మాట దాకుండ నుం
డంగా గల్గెను, మీ మొగంబు లిక చూడన్ నాకు మోమేది?...
3-61

అని సంకోచపడుట, కన్యాసహజమైన ముగ్ధాత్వమును తెల్పుచున్నవి.

7. నాయికా నాయకుల ద్వితీయ సమావేశము : ఈ ఘట్టమునందు కావ్యమునందు గల అనసూయా దుష్యంతుల సంభాషణము మనోహరమై ఒప్పు చున్నది. కవి కల్పించిన ఈ సన్నివేశము నాయికా నాయకుల కిరువురకును పరస్పరము గల సమానానురాగమును తెలుపుచున్నది. రాజు అనసూయతో

క. "మా సొమ్ము మాకు నొసగిన
మీ సొమ్మున్ మీకు మగుడు, మీ, మా సొమ్ముల్
వాసి పడకుండ నూదక
గోసన యేమిటికి మార్చుకొనియెద మొండెన్" [3-83]

అని చమత్కారముగ పలుకుట, రాజునకు గల సమయస్ఫూర్తిని సరస సంభాషణ చతురత్వమును తెలుపుచున్నది.

దుష్యంతుడు శకుంతలను వీడి నగరికి మరలు ఘట్టము అతి రమ్యముగ ఒప్పుచున్నది. అతడు తాను మరలుచున్నట్లు ప్రియురాలికి చెప్పలేక

"చెప్ప నాల్క తుద గదలింపం
గాలేక తలిరుటాకున
వాలిక నఖమున లిఖించి వనితకు" 3-239

చూపుట అతని మనఃస్థితిని చక్కగ తెలుపుచున్నది.

అన్యథాకరణము :

1. పినవీరన మూలమును మార్చిన పట్లు ఔచిత్యవంతములై యొప్పుచున్నవి. భారత కథయందు పండ్లుతేర నడవికి వెడలిన కణ్వుడు మరలివచ్చునంతవఱకు గల వ్యవధినోర్వజాలక దుష్యంతుడు విరహాతురత్వమున శకుంతలను చేపట్టెను. ఇది రాజు ఇంద్రియ చాపల్యమును సూచించుచు నతని శీలమునకు లాఘవము నాపాదించుచున్నది. అట్లుకాక నాటకమున నాయికా నాయకుల ప్రణయము క్రమ వికాసము పొంది వారియందలి అభిలాష తీవ్రమగు నంతటి వ్యవధిని కల్పించుచు కాళిదాసు కణ్వుని సోమతీర్థమున కనిపెను. కావ్యమునందును కణ్వుడు సోమతీర్థమున కరిగెను. కాని నాటకమునందు కణ్వుడు దుహిత భాగ్య ప్రాతికూల్యము శమింపచేయుట కరుగగా ప్రబంధము నందీతడు శకుంతలకు అనురూపుడగు భర్త కలుగవలెనని శివుని ప్రార్థింప నేగెను. నాటకమునందు మహర్షి ఏ ఫలమునుగోరి సోమతీర్థమున కేగెనో అది అతనికి ప్రాప్తించలేదు. శకుంతలకు దుర్వాసుని శాపమనెడు ఆఘాతము తగిలినది. ప్రబంధము నందలి కణ్వుని ఆశయము సిద్ధించినది.

2. భారతమునందు శకుంతల తన జన్మ వృత్తాంతమును తానే రాజున కెఱిగించినది. కన్య ముగ్ధయై యుండుట యుచితమని తలచిన కాళిదాసు అనసూయా ప్రియంవదలను శకుంతలకు ప్రాణసమానలైన సఖులను కల్పించి అందు అనసూయచే ఆ వృత్తాంతమును చెప్పించెను. వివేకశీలయగు అనసూయ మేనకా విశ్వామిత్రుల శృంగారముతో కూడిన ఆ వృత్తాంతమును ఎంతవఱకు చెప్పుట ఉచితమో అంతవఱకే చెప్పి తక్కిన దానిని రాజునూహకు విడిచి పైచెను.

పినవీరన తన కావ్యమునందు మేనకా విశ్వామిత్రుల ప్రణయ వృత్తాంతమును విపులముగా చెప్పదలచి. అట్టి శృంగార వృత్తాంతమును మునికన్యలచే

పల్కించుట ఉచితము కాదనకొని దానినొక తాపస శిష్యునిచే చెప్పించెను. వ్యాస కాళిదాస పినవీరనల ఘట్టమును భిన్నవిధమున రచించుటను విమర్శకు లిట్లు సమర్థింతురు. "భారత సాహిత్య దృష్టిలో అకృత్రిమమైన సహజమైన వాతావరణంలో మిథ్యా నాగరికతలూ, లజ్జాభినయాలు ఎరుగకుండా పెరిగిన శకుంతల తన తండ్రి ఒకప్పుడు ఒక మహర్షితో చెబుతూ ఉండగా తాను విన్న మాటలు యథాతథముగా దుష్యంతునికి వినిపించడమూ ఉచితమే. నాగరికత ప్రబలి సాహిత్యానికి రాజుల ఆస్థానాలు అలంబనాలుగా ఏర్పడిన తరువాత వచ్చిన కాళిదాసు నాటకంలో శకుంతలను ముగ్ధానాయికగా నిరూపించి ఆమె చెలికత్తెచేత సంగ్రహంగా సూచనమాత్రంగా మేనకా విశ్వామిత్రుల ప్రణయ వృత్తాంతం చెప్పించడమూ ఉచితమే. రసవద్ఘట్టాల విపుల వర్ణనకు ప్రాధాన్యం ఏర్పడిన తెలుగు ప్రబంధ యుగావతరణకాలంలో చాపల్యం ఇంకా పూర్తిగా పోని ఒక బ్రహ్మచారిచేత పినవీరన సంభోగ శృంగార వర్ణన విపులంగా చేయించడమూ ఉచితమే. భిన్న దృష్టులతో కూడిన రచనలను ఆయా రచయితల విశిష్ట దృక్పథాలనుంచే గ్రహించి ఆస్వాదించడం సహృదయుల ధర్మం"26. మొత్తముమీద పినవీరన గావించిన ఈ మార్పు మిగుల సమంజసమైన దనుటలో సందియము లేదు.

8. మూలకథలో శకుంతల రాజుతో గాంధర్వ వివాహమున కంగీకరించి తనకాతని వలన కలుగు పుత్రుని యౌవరాజ్య పట్టాభిషిక్తుని గావింప వాగ్దాన మొనరింపుమని కోరెను. కాళిదాసు శకుంతలా దుష్యంతుల ప్రేమను స్వచ్ఛందమును, నిర్వ్యాజమును ఒనరించుటకై ఆ వాగ్దానమును పరిహరించెను. శకుంతలా దుష్యంతులు పరస్పరము అనురాగము కలిగియున్నారని ఎఱింగిన చెలులు మాత్రము శకుంతలపై అపారమగు సౌహార్దము కలిగినవారు కావున రాజునిట్లు ప్రశ్నింతురు. "అనసూ : వయస్య బహువల్లభా రాజానః శ్రూయన్తే. యథాసౌ ప్రియసఖీ బంధుజన శోచనీయా న తథా నిర్వహస్వ"

అని శకుంతలకు సవతులతో సమానాదరము లభించునా అని మాత్రము అడిగి, బహు భార్యలను కలిగియుండు నతడు శకుంతలను సమానాదరముతో చూచునో చూడడోయని కలవరము వెలిబుచ్చుదురు. అంత రాజు

"పరిగ్రహ బహుత్వేపి ద్వే ప్రతిష్ఠే కులస్యమే
సముద్ర రశనా చోర్వీ సఖీ చ యువయోరియమ్"

అని తనకు భార్యలెందఱున్నను శకుంతలయే పట్టపురాణికాగలదను భావమును వ్యక్తము చేసెను.

పినవీరన మహాభారతము నందువలె రాజు శాకుంతలుని యువరాజు చేసెదనను వాగ్దానమును చేయు ఘట్టమును గ్రహించి యున్నను అందువలె ఆ విషయము శకుంతలచే గాక ఆమె చెలులచే నడిగించెను. వారు

'వేటమెయి వచ్చి నృప ! మా
బోటికి జిట్టంట్లు నంటి పోయిన పిదపన్
దాటుపడుం గులమునకును
మాటయుఁ గణ్వునకు వచ్చు మౌనుల చేతన్' 3-89

అని తమకెట్టి అపవాదము కలుగకుండ జాగరూకత వహించిరి. తమ చెలిపై ఆతనికి నిక్కువమగు ప్రేమ యున్నచో శకుంతలకును అతనికిని జనించు కుమారుని యౌవరాజ్యపదమున నిలుపుమనిరి. తమ సఖి బాగోగులను దృష్టి యందిడుకొని వారట్లు శపథమును చేయుమనుట ఉచితముగ నున్నది.

ఇట్లు పినవీరన కొన్నిచోట్ల వ్యాస కాళిదాస కల్పనములకు భిన్నములగు కల్పనములను కావించెను. మఱికొన్ని చోట్ల కాళిదాస కథాకల్పనామార్గము ననుసరించుచునే అందు క్రొత్తదారుల నన్వేషించెను. ఈ మార్పులీతని స్వతంత్రతను వెల్లడించుచు ఔచిత్యవంతములై యున్నవి.

1. దుష్యంతుడు కణ్వాశ్రమమును ప్రవేశించుటను కాళిదాసు ఆహ్వాన పూర్వకము కావించెను. వినీతుడగు దుష్యంతుని మెచ్చి వైఖానసుడాతనిని కణ్వాశ్రమమును దర్శించి అచటి ఆతిథ్యమును గొనిపోవలసినదిగా అభ్యర్థించెను. కణ్వుడా సమయమునం దాశ్రమమున లేకున్నను, తానాశ్రమమును సందర్శించిన తన భక్తి ప్రపత్తు లామునికి ఆశ్రమమునకు తిరిగి వచ్చిన పిదప తెలియునని ఎంచి రాజు తపోవనమున కేగ నిశ్చయించెను. శాకుంతల ప్రబంధమునందు కూడ మునులు దుష్యంతుని ఆశ్రమమునకు వచ్చి అచటి మునుల ఆశీర్వాదమును పొంది వెడలవలయునని అభ్యర్థించుట కలదు.

పినవీరన ఇందు మూలమునందలి వైఖానసపాత్రమును యథాతథముగా కాక అతనిని వృద్ధతాపసిగా మార్చెను. ఇట్లు మార్చుట ఆ సందర్భమున

కెంతయు ఉచితముగా నున్నది. అతడు దుష్యంతుని దీవించుటకు ఈ వృద్ధా పృము అనుకూలమై యొప్పుచున్నది. అతడు ఆశ్రమ సాత్త్విక సంపత్తిని వివరించుట, హరిణ శాబకమును ముని లాదరముతో పెంచిన వృత్తాంతము చెప్పుట మున్నగు ఘట్టము లీతాపసి నోట పల్కించుటచేనవి ఆదర్శప్రాయములగుటయే కాక సహజములుగా కూడ నున్నవి.

కావ్యమునందు మునులు దుష్యంతునికి కణ్వుడాశ్రమ నందున్నదియు లేనిదియు తెలుపలేదు. సంయమీంద్రులు దుష్యంతుడు వేటకై వనమునకు వచ్చుటను తమ దివ్యజ్ఞానముతో నెఱింగి యున్నారనియు కావున నాయురైశ్వర్యాభి వృద్ధికరంబును, గలుష కర్మనంబునగు తాపస దర్శనంబు జేసిపోవలెననియు రాజునకు చెప్పిరి. మునుల దివ్యజ్ఞాన ప్రశంస మూలమున లేదు. దీనిని కల్పించుట వలన పినవీరన సాధించిన ప్రయోజనము లేదు. ఈతడీ సందర్భమునందే కాక, చతుర్థాశ్వాసమున సోమతీర్థమున శివుని ప్రార్థించు కణ్వుడు కూడ దివ్య జ్ఞానముచే శకుంతలా పరిణయగాథ నెరింగినట్లు రచించెను. వ్యాసుని భారత కథయందు కూడ కణ్వుడు ఈ విషయమును దివ్యదృష్టితో గ్రహించినట్లు కలదు. "మునులు దివ్యదృష్టిశక్తిని ప్రతి స్వల్ప విషయము కొఱకు వెచ్చించెదరను నపయశస్సు మహర్షులకు రాకుండ కాళిదాసు చూపించిన శ్రద్ధ పినవీరన కనబఱుపలేదేమో యనిపించుచున్నది [27]

.

2. శకుంతలకు భ్రమరబాధ నపనయించు మిషతో చెలుల ఎదుటికి పోయిన రాజును అనసూయ సవినయముగా అతని కులగోత్ర నామ దేశాదికములను గూర్చి ప్రశ్నించినది. అంత మూలమున రాజు తాను రాజ ధర్మాధికారిననియు ధర్మారణ్య సంరక్షణార్థమై అట కేతెంచితిననియు చెప్పుకొనెను. కావ్యమునందీ సందర్భమున రాజు

క. వారక యసత్యవచనము
నారక హేతువనగను వినంబడెడుం బు
ణ్యారణ్యములోపల ముని
దారికలకు బొంకనేల ధర్మచ్యుతిగన్ 2-82

అని తాను దుష్యంతుడననియే వారితో చెప్పియుండెను.

3. రాజు చెలులతో సంభాషించు నవసరమున పినవీరన శకుంతలా జన్మవృత్తాంత ప్రసక్తిని తేలేదు. ఆ సందర్భమున నాయికా నాయకుల అనురాగోదయముననే ప్రధానాంశముగా చిత్రించెను. పిదప లజ్జాన్వితయైన శకుంతలను, చెలులు రాజునకు, అర్ఘ్యపాద్యాదికము లాయత్తపఱుచుటకై పర్ణశాలకు కొనిపోయిన ట్లాసన్నివేశమును మార్చెను.

4. కాళిదాసు ప్రథమాంక నిర్వహణమున వనగజ ప్రవేశ వృత్తాంతము ననుసంధించి నాయికా నాయకులకు తాత్కాలిక వియోగము ఘటింప చేయుటద్వారా అయోగ విప్రలంభమునకు పరిపుష్టి చేకూర్చెను. పినవీరన వనగజ ప్రవేశమునకు మారుగా వ్యాఘ్రప్రవేశమును కల్పించెను. ఈ వ్యాఘ్ర ప్రవేశ కల్పనము వలన నెట్టి ప్రయోజనమును లేదని శ్రీ దేకుమళ్ళ అచ్యుత రావుగారి తలంపు.[28] ఈ వ్యాఘ్రకల్పనము మూలము నందలి వనగజ ప్రవేశము సాధించిన కథా ప్రయోజనముల నన్నింటిని సాధించుచున్నదనుటలో సందియము లేదు. పినవీరన గజమునుకాక వ్యాఘ్రమును ప్రవేశపెట్టుటకు విమర్శకులీ క్రింది కారణమును చెప్పుచున్నారు.

"ముని కుమారుని వెంట దుష్యంతు డాశ్రమమునకు శకుంతలా దర్శనార్థము బయలువెడలెను. ఆతడాశ్రమమునకు వెడలినచో నింటిపట్టు దొరకినచో మహాభారత కథలోవలె గాంధర్వ వివాహ మచ్చటనే జరుగు నవకాశ మేర్పడును. పవిత్ర కణ్వాశ్రమముననా వివాహము జరుగకుండ చూచుటకై కాళిదాసు జాగరూకత వహించెను. నాయికా నాయకుల సమాగమ స్థలమును లతామండపమునకును, నదీ పులినమునకును మార్చి యౌచిత్యమును పాటించెను. పినవీరన కాళిదాసు కల్పనలోని లోతులను దెలిసిన మనీషి. అందువలననే వీడుకోలు సందర్భమున మాత్రమే దుష్యంతుని నాశ్రమమున ప్రవేశపెట్టెను. ఈ సందర్భమున వ్యాఘ్రప్రవేశ విఘ్నము నాపాదించి దానిని వారించెను.

వ్యాఘ్రము వనవ్యాఘ్రము కాదు. వేటకై మచ్చిక చేయబడిన పెంపుడు పులి. వేటకాండ్ర యప్రమత్తత వలన నది తప్పించుకొని పారివచ్చినది. వన్య వ్యాఘ్రమైనచో నా మహాబలుడు తత్క్షణమే చంపి మునికుమారుని వెంటనేగుటకు వీలున్నది. పెంపుడు పులి యగుటచే పట్టి స్కంధావారమున భద్రపఱుప వలసి వచ్చినది. సూర్యుడస్తాద్రిపై నిలిచినాడు. పులిని గట్టివైచి తిరిగివచ్చుటకు

సమయము లేదు. అప్పటికి చీకటి పడిపోవును. నిశాసమయమున నాశ్రమము సేగుట యుచితము కాదు. ఏగినచో శకుంతలా కరగ్రహణ మాపర్ణశాలలో జరిగి తీరును. ప్రథమ వీక్షణమున నంకురించిన యనురాగలత యింకను చిగుళ్ళు వేయలేదు. మొగ్గలెట్లు తొడుగును ? అందువలన నాయికా నాయకులకు విరహో ద్దీపనమునకై విరామము కావలెను. అది నిశాసమయమైనచో నిబిడమై భాసింప గలదు. ఇట్టి కథా ప్రయోజనము నభిలషించియే పినవీరన వ్యాఘ్రకల్పనమును సార్థకముగ కల్పించెనని స్పష్టమగును."[29]

5. నాటకము నందలి ద్వితీయాంకమున రాజు తన ప్రేమకథను మాఢవ్యున కెఱింగించి, పిదప నాతడు నగరికివెళ్లు సందర్భమున శకుంతల సమాచారమును అంతఃపురములో చెప్పునేమోయని శంకించి తానిదివఱకు శకుం తలను గుఱించి చెప్పిన ప్రేమకథ అంతయు "పరిహాస విజల్పిత" మని తెల్పెను. కావ్యమునందీ ఘట్టము మార్చబడినది. దుష్యంతుడు తాను శకుంతలా సౌందర్యమును మాండవ్యున కెఱింగించుచు ముందే

గీ. ప్రాణ సఖుడవు నీకుఁ జెప్పక మదీయ
వృత్త గోపన మెట్లు గావింప నేర్తు
మచ్చనాలుక వాడవు మంతనంబుఁ
బొడమనీకని రసనకు బుద్ధిచెప్పు 2-172

అని ఆతని వాచాలత్వమునుటంకించి తన రహస్యము కాపాడుమని హెచ్చరించి పిదప ప్రణయ వృత్తాంతమును చెప్పెను. ఇట్లు గావించుట ఉచితముగానున్నది. ఇందువలన కవి రాజు నెచటను అసత్యము పలికింపక తగు జాగరూకత వహించెనని తెలియనగును.

6. నాటకమున దుష్యంతుడు సవన రక్షణమునకై తానాశ్రమ ప్రాంత మున కొన్ని దినములుండదలచి రాజమాత యొనరించు వ్రత పారణ సమయ మున తనకు బదులుగా అచట నుండుటకు మాఢవ్యుని అతనితోపాటు తదితర పరివారమును నగరికి మరలించెను. కావ్యమునందట్లు కాక రాజు శకుంతలా యత్తచిత్తుడై వేటయందాసక్తి తగ్గుటచే వేటరుల నందఱిని పురికి మరలించి మాండవ్యుని కతిపయాప్త పరిజనమును తనతో నుంచుకొనెను. కాని ఈ మార్పు

వలన సార్థక్యమేమియు కనరాదు. ఎలన మాండవ్యుడు దుష్యంతునితో నుండియు లేనివానితో సమానుడయ్యెను. శకుంతలా ప్రత్యాఖ్యాన సందర్భము నందీతడు ఒక్కపలుకైన పలుక లేదు.

7. దుర్వాసుని శాపము, అభిజ్ఞాన కల్పనము అను వాని ద్వారమున కాళిదాసు నాయకుని శీలమును పోషించుట, నాయికానాయకులకు విప్రలంభమును కల్పించి వారిరువురి అనురాగమున కొక సుస్థిరరూపము కల్పించుట మున్నగు ముఖ్య కథా ప్రయోజనములను సాధించెను. ఈ కల్పనముల వలననే శకుంతలాదుష్యంతుల ప్రేమ అమరమైనది. పినవీరన కాళిదాసుని నాటకములోని ఈ కల్పనములను గ్రహించెను. కాని అతడు కావ్యకథను ముగింపదలచిన విధానము వేరుకావున వానిని భిన్నవిధానమున మలచెను. ఈ దుర్వాసుని శాప కల్పనము వలన అతడు పరిరక్షించినది నాయక శీలమును మాత్రమే. దీని మూలమున అతడు నాయికానాయకుల విప్రలంభమును పోషింప కడంగలేదు. అందు వలననే ఇందు నాటకములోవలె అంగుళీయకము శక్రతీర్థమున జారిపడిపోవు వృత్తాంతము లేదు.

కావ్యమునందు దుర్వాసుడు శకుంతలను శపించినపు డాతనిని ప్రార్థించి ప్రసన్నుని కావించుకొనుటకు నాటకమునందు వలె ప్రియంవద కాక అనసూయ వెడలినది. పిదప నీ శాపవృత్తాంతమును అనసూయ ప్రియంవద కెఱింగింప లేదు. ఇట్లొనరించుటకు గల కారణమేమో కవి తెలుపలేదు.

నాటకము నుండి గ్రహింపక వదలిన కల్పనలు :

పినవీరన కాళిదాసుని నాటకములోని పెక్కు కమనీయ కల్పనములను గ్రహింపక వదలివైచెను. నాటకమున కౌత్కృష్ట్యము నాపాదించుచున్న అట్టి కల్పనములను వదలివైచి స్వయముగా కొన్ని కల్పనలు కావించి వానిచేతనే కావ్యమును విస్తరించుట అతని విలక్షణ వ్యక్తిత్వమున కొక ఉదాహరణము. ఇతడు నాటకము నుండి గ్రహింపక వదలి వైచిన మనోహర కల్పనములివి.

1. పినవీరన నాటక ప్రథమాంకము నందలి కథనంతటిని అనుసరించి యున్నను కొన్ని ఘట్టములను వదలివైచెను. రాజు వృక్షములకు నీరుపోయు

చున్న శకుంతలను ఆమె చెలులను మాటుననుండి చూచుచున్నప్పుడు వారి నడుమ కొనసాగిన విస్రంభాలాపములు మనోహరముగా నున్నవి.

శకుంతలా : ఇత ఇతః సఖ్యౌ.

అన : హలా శకున్తలే ! త్వత్తోపి తాత కశ్యప స్యాశ్రమవృక్షకాః ప్రియతరా ఇతి తర్కయామి. యదనేన నవమాలికా కుసుమపేశలా త్వమ ప్యేతేషా మాలవాల సేచనే నియుక్తా.

శకు : న కేవలం తాతనియోగ ఏవ. అస్తి మమాపి ఖలు సోదర స్నేహ ఏతేషు.

అనసూయ పరిహాసార్థము పలికిన దానిని శకుంతల తాను కేవలము పితృనియోగముచేతనే కాక స్వయముగా ఆశ్రమ తరులతాలవాలాదుల ఎడ సోదర స్నేహమును కలిగియున్న దాననని పలుకుట ఆమె స్నిగ్ధ హృదయమును తెలుపుచున్నది. పినవీరన తన కావ్యమున పై సంభాషణమున అనసూయ పలుకులను గ్రహించి వానినన్యథా విస్తరించి యున్నను, శకుంతల సంభాషణమును గ్రహింపక వదలివైచెను.

మూలమునందు పై సంభాషణము వలన రాజునకు శకుంతల కణ్వదుహిత యని తెలియనగును. పినవీరన కావ్యమునందు పై అనసూయ వాక్కులను యథాతథముగా గ్రహింప కుండుటచే పై అంశము రాజునకు తెలియరాదు. కాని రాజు శకుంతలను కణ్వదుహితగా గ్రహించినట్లు పినవీరన రచించి యున్నాడు. అతడు "ఇట్టి కోమలి లతా తరుసేచన మాచరింపగా కరుణయొకింత లేక కడగట్టె మునీంద్రుడు మాటలేటికిన్" అని భావించును. ఇది కావ్యమునందొక లోపమే యని చెప్పవలయును.

కాళిదాసు శకుంతలా తత్సఖుల సంభాషణము నందు అడుగడుగున శకుంతల యొక్క వయోరూప లావణ్యాదులను విస్ఫుటము కావింప యత్నించెను.

శకుం :- అనసూయే, అతిపినద్ధేన, అనేన స్తనవల్కలేన ప్రియంవదయా నియంత్రితాస్మి, శిథిలయ తావ దేనమ్.

అన — తథా

ప్రియం — అత్ర పయోధర విస్తారయితృక మాత్మనో యౌవన ముపాలభస్వ మాంకిముపాలభసే ?

రాజా - సమ్యగియ మాహ.

ఇద ముపహిత సూక్ష్మ గ్రన్థినా స్కన్ధదేశే
స్తనయుగ పరిణాహాచ్ఛాదినా వల్కలేన
వపు రభినవ మస్యాః పుష్యతి స్వాం న శోభాం
కుసుమ మివ పినద్ధం పాండుపత్రోదరేణ 1-14

ఈ సంభాషణము నందలి స్తనవల్కల ప్రసంగమున అమె యౌవన సౌందర్య విలాసము రాజు ఎఱింగి మిక్కిలి సంప్రీతుడాయెను. ఇట్లే ప్రథమాంకమున చెలులాడిన వనజ్యోత్స్న ప్రసక్తి వలన శకుంతల అనురూపుడగు వరు నభిలషించుచున్నదని రాజునకు తెలియనగును. అందుచే నతి డామెయెడ నాసక్తియు అభిలాషయు పెంచుకొనెను. ఈ ఘట్టములను పినవీరన వదలి వైచెను. ఇట్లే శకుంతల వెడలి పోవుచు కాలికి దర్భగ్రుచ్చు కొనినదనియు, వల్కలము చెట్టునకు పట్టుకొనినదనియు మిషవెట్టి రాజును చూచుటకై యాగుటనుకూడ నితడు పరిహరించెను.

తృతీయాంకమున విరహ వేదనతోగూడిన శకుంతల, ప్రియంవద సూచనచే రాజునకు ప్రేమలేఖ వ్రాయును. రాజిట్లు నాయిక అనురాగమును స్వయముగా ఆమె నోటనే విని ఆమె చెంతకుపోవును. కావ్యమునందు నాయికకు రాజుపై గల అనురాగమును, ఆమె విరహతాపమును బహుభంగుల వివరింపబడుటచే పినవీరన ఈ అంశమును పరిహరించియుండును.

నాటక పంచమాంకము నందలి శకుంతలా ప్రత్యాఖ్యాన ఘట్టమును గ్రహించి పినవీరన దాని నన్యథాకరించెను. కాని ఈ అంకారంభము నందలి హంసపదికా గీతమును, రా జాగీతమును విని పర్యుత్సుకు డగుటను పరిహరించెను. షష్ఠ, సప్తమాంకములను పూర్తిగ వదలెను.

## పినవీరన కావించిన కొన్ని కల్పనలు - వాని ప్రయోజనములు :

### భావానుసరణము :

పినవీరన మూలమునుండి కొన్ని విశిష్ట భావములను గ్రహించి వానిని యథేచ్ఛగా అనువదించెను. ఈ అనుసరణము కావ్యమునందలి ద్వితీయ తృతీయ

చతుర్థాశ్వాసములందు ఎక్కువగా కనవచ్చును. ఈ భావముల ననుసరించుటలో వినవీరన ఒకటి రెండు సందర్భముల యందు తప్ప తక్కినచోట్ల ప్రత్యేకమగు శ్రద్ధ ప్రదర్శింపలేదని చెప్పవచ్చును. ఈ అనుసరణములు కొన్ని ఎడల మూల భావములను యథాతథముగా వ్యక్తము చేయకున్నను పినవీరన కవితలోని సహజ రామణీయకము వానికి కొంత ఔత్కృష్ట్యము నాపాదింపగలిగినది.

విస్తరణము :

పినవీరన కొన్ని ఎడల తాను గ్రహించిన భావమును వివరణాత్మకముగ పెంచును.

1. రాజు విదూషకునితో శకుంతలకు తనపైగల అనురాగభావాదికములను గూర్చి ప్రసంగించుచు "నిసర్గాదప్రగల్భ స్తపస్వి కన్యాజనః (2–100 పు) అని అనును. తపస్వి కన్యయగు శకుంతల స్వభావముచే అప్రగల్భ అను భావమును కవి ఇట్లు వివరించెను.

ఉ. అచ్చపలాక్షి కన్య, విమలాశ్రమవాసిని, ప్రేమచిహ్నముల్
మచ్చిక లేక చేయ, దనుమానము కల్గదు. సత్యసంతతుల్
వెచ్చవు గూరుముల్ పరిభవింపగ నేరదు, నేర దబ్జ సం
ప చ్చటలంబులై మెఱయు పచ్చని చూవుల క్రేవ్ప చూడగన్
2–160

పై పద్యము మూలమునందువలె రాజు విదూషకునితో ముచ్చటించునపుడు కాక వ్యాఘ్రమును బట్టి నిజస్కంధావారమునకు చనుచు ఆత్మగతంబున శకుంతలా సౌందర్యమును భావించు ఘట్టమున పొందుపఱుపబడినది.

2. శకుంతల దుష్యంతునిపై మక్కువ నిలిపినదని ఎఱింగిన అనసూయ "సాగర ముజ్ఝిత్వా కుత్రవా మహానద్యవ తరతి"(111 పు151) అని మహానదికి సాగరునకు అనురూప సంగమమగు నట్లు శకుంతల అనురూపుడగు వరుని కోరినదని అమెను ప్రశంసించినది. ఇందలి భావమాంధ్రమునందిట్లు వివరింపబడినది.

ఉ. నీకు విచారమేల ? మహనీయ చరిత్రమ, నీ మనంబుగం
గా కమనీయ పావనము, కల్మషమందగ నేరదెందు మం

దాకిని నిర్ఝరాకృతినుదారగతిం జనుదెంచు బెల్లర
త్నాకరు బొందుగాక యహహా ! చననేర్చునె చౌటికుంటకన్
3—61

ఇందలి చివరి రెండు పాదములు మాత్రము మూలమునకు అనుసరణములు. మూల భావమిచ్చట చక్కగా వివరింపబడినది. మందాకిని నిర్ఝరాకృతినుదార గతి నేతెంచుటలోని తదాకార గమనములు అమూలకములు. రత్నాకరుని వీడి మందాకిని చౌటికుంటకు చననేరదని చెప్పుట ఆ రెంటికిని గల అంతరమును తెల్పుచు రత్నాకరుని గంభీరతను, మహోన్నతత్వమును చాటుచున్నది. ఈ పంక్తులు కావ్య నాయకుడైన దుష్యంతునికి అన్వయించుచుండుటచే, ఆతని ధీరోదాత్తత్వమును కూడ ప్రకటించుచున్నవి

3. మూలమునందు రథసారధి అధిజ్య కార్ముకుడైన దుష్యంతుని అతడు వెన్నాడు హరిణమును కనుగొని, ఆ సందర్భమున రాజు సాక్షాత్పినాక పాణివలె గోచరించెనని అభివర్ణించెను. [1-1] – పినవీరన ఈ శ్లోకము నను సరించుచు అందలి "మృగానుసారిణం" అను పదమును "పరయజ్ఞ మృగము వెంబడి నరిగెడు" [2-18] అని వివరణాత్మకముగ రచించెను. ఇట్లే పినవీరన, తపోవన ప్రకృతిని వర్ణించు సందర్భము నందలి 'నీవారాశ్శుక గర్భకోటర" [1-8] ఇత్యాదిగా గల శ్లోకము ననువదించుచు, అందలి "ప్రస్నిగ్ధాః క్వచి దింగుదీ ఫలభిదః సూచ్యన్త ఏవోపలాః, విశ్వాసోపగమా దభిన్నగతయ శ్శబ్దం సహన్తేమృగాః" అను పాదములను "తలఁకు గారకాయలు నూఱ నందుల చమురంటి మెఱయు పాషాణతతులు – తమ మేనులొరసి కొంచు మనుష్యులరిగిన భయమున జంచలింపని మృగములు [2-48] అని వివరించెను. ఈ సీస పద్య మునందలి గీతమున "కలిగి అన్యోన్యమైత్రి నక్కడ జరించు "ఇత్యాది భారత భావమును చేర్చెను.

4. శకుంతల ఆశ్రమ లతాదులయెడ నెఱపు సౌహార్దమును వర్ణించు

పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేనయా పల్లవమ్
ఆద్యేవః కుసుమ ప్రసూతి సమయే యస్యాభవత్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతి గృహం సర్వైరనుజ్ఞాయతామ్
[4-8]

అను శ్లోకమును పినవీరన

అలవెఱుంగక తావకాలవాలములకు
నెమ్మితో నిరవొంద నీరు వోసి
క్రమవృద్ధి బొందు మార్గంబు లారసి వచ్చి
పూట పూటకు జాల బ్రోది చేసి
ప్రేమాతి రేకత బ్రియమండనమునకు
జిగురాకు కొనగోర జిమమ వెఱచి
పరిపాటి నల్లన ప్రసవోద్గమంబైన
సఖులుదానును మహోత్సవ మొనర్చి

తల్లియై పెంచె మిమ్ము నే తలిరు బోడి
యత్తవారింటి కరిగెడు నాలతాంగి
క్షితిరుహములార ! పుష్పితలతికలార !
యనుమతింతురు గాక కల్యాణయాత్ర 4-93

పినవీరన ఒకయెడ మూలశ్లోకము ననువదించుచు అందలి కొంత భాగ మును గ్రహింపక వదలి గ్రహించిన దానిని అమూలకముగ విస్తరించును.

1. శుశ్రూషస్వ గురూన్, కురు ప్రియ సఖీవృత్తిం సపత్నీజనే
భర్తు ర్విప్రకృతాపి రోషణతయా మాస్మ ప్రతీపం గమః
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భాగ్యే ష్వనుత్సేకినీ
యా న్త్యేవం గృహిణీపదం యువతయో, వామాః కులస్యాధయః
4-17

అత్తమామలకు నీయపనేమి వెట్టక
కనుసన్న జేయుమీ పనులెఱింగి
ప్రాణమిత్రములుగా భావించి యే ప్రొద్దు
సవరింపుమీ ప్రేమ సవతులందు
భర్త యొక్కొక వేళ బహుమాన మొనరింప
గదియ రానీకుమీ గర్వరేఖ
పతిచిత్త మెఱిగి తత్పరిజనంబుల మీద
జేయుమీ మిగుల దాక్షిణ్య గరిమ

తే. కలక నొందకుమీ ధవు దలిగినపుడు
పలుకులను జేరనీకుమీ పరుస దనము
వీని వెలిగాగ దిరుగు నే వెలదియైన
గులమునకు నాధియగు జుమీ కూతుగుజ్జ 4-83

పై శ్లోకము నందలి 'శుశ్రూషస్వ గురూన్' అను పదములు "అత్తమామలకు సీయపనేమి పెట్టక కనుసన్న జేయుమీపను లెఱింగి" అని వివరింపబడినది. "భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే" అను దాని భావము 'పతిచిత్తమెఱిగి తత్పరిజనంబుల మీద జేయుమీ మిగుల దాక్షిణ్య గరిమ' అని అనువదించెను. ఇచట 'యాన్త్యేవంగృహిణీపదం' అను భాగము గ్రహింపబడలేదు. 'భాగ్యేష్వనుత్సేకినీ' అనునది మూడవ పాదముగా పరిణమించినది. 'వామాః కులస్యాధయః' అనునది వివరణాత్మకముగ గీతము నందలి నాల్గవ పాదమున చెప్పబడినది.

2. అనసూయా: హలా శకున్తలే! త్వత్తోపితాతకాశ్యపస్యాశ్రమ వృక్షకాః ప్రియతమా ఇతి తర్కయామి. యదనేన నవమాలికాకుసుమ పేశలా త్వమ ప్యేతేషా మాలవాల సేచనే నియుక్తా.

శకుం

రాజా: కథమియం సాకణ్వదుహితా. అసాధు దర్శీఖలు
తత్రభవాన్ కాశ్యపః య ఇమా మాశ్రమధర్మేనియుంక్తే.

చ. దిరిసెన పువ్వుకంటె గఱితింపగ మెత్తన మేనుదీగె యీ
తరుణికి నిట్టి కోమలి లతా తరుసేచన మాచరింపగా
గరుణ యొకింత లేక కడగట్టె మునీంద్రుడు మాటలేటికిన్
సరవి యెఱుంగలే కకట! జాదులు వేచెర మంగలంబునన్ 2-61

మూల సంభాషణము నందలి అనసూయ వాక్కులును రాజు ఆత్మగతముగా అనుకొనిన మాటలును ఇట రాజు స్వగతముననే చెప్పబడినవి ఇందు కవి తాను గ్రహించిన 'నవమాలికా కుసుమ పేశలా త్వమప్యేతేషా మాలవాల సేచనే నియుక్తా' అనుభావమును మొదటి రెండు పాదములలో వివరించి చక్కని ఎత్తుగడలో రచించెను. "అసాధుదర్శీతత్రభవాన్ కాశ్యపః" అనునది 'కరుణ

యొకింత లేక కడగట్టె మునీంద్రుడు మాటలేటికిన్ ' అని అన్యథా చెప్పబడినది లోకోక్తిపూర్వకమైన నాల్గవ పాదము అమూలకము.

౩. అస్మాన్ సాధు విచిన్త్య సంయమధనా నుచ్చైః కులం చాత్మనః
త్వయ్యస్యాః కథమ ప్యబాంధవ కృతాం స్నేహ ప్రవృత్తిం చ తామ్
సామాన్యప్రతిపత్తి పూర్వక మియం దారేషు దృశ్యా త్వయా
భాగ్యాయత్త మతః పరం నఖలు తద్వాచ్యం వధూబన్ధుభిః

సీ. మహనీయ సంయమంబు మహా ధనంబుగా
మతియించి వర్తించు మమ్ము దలచి
యొసగ శాపానుగ్రహ సమర్థుడైన బ్ర
హ్మయత తేజు గాధేయు దలచి
గణన కెక్కిన దేవ గణికా తతికి రత్న
ముకురమై వెలుగు మేనక దలంచి
యాఖేట రతివచ్చి, యాశ్రమస్థలిదడ
బాటు చేసిన చెల్లుబడి దలంచి

తే. మిక్కిలిగ మన్ననయు జేసి మెలగ వలదు
తక్కువయు జేయవలవ, దంతఃపురంబు
సతులలోపల సరియకా సరవి తోడ
నీ శకుంతల భూకాంత నేలు మనియె 4-112

కణ్వుడు శకుంతల నత్తవారింటికి పంపు సందర్భమున కణ్వుడు అల్లున కిచ్చిన సందేశమిది. ఇట మూలశ్లోక భాగమును కవి విస్తరించి సీసపద్యము నందలి నాల్గు పాదములను వ్రాసెను. శ్లోకము నందలి నాల్గవ పాదము భావము వదలివేయబడినది. మూడవ పాదము తేటగీతిగను, రెండవ పాదము నందలి భావము "ఆఖేట రతివచ్చి" అను పాదముగను వివరింపబడినవి.

కవి మూలభావము నొక ఎడ అన్యథాకరించి విస్తరించును.

1. జన్మ యస్య పురోర్వంశే యుక్తరూప మిదంతవ,
పుత్రి మేవంగుణోపేతం చక్రవర్తిన మాప్నుహి 1-7

ఉ. సర్వ జనైక పూజ్యుఁడవు సత్యయుతుండవు, నీవు మామకా
శీర్వచనంబునం గను ప్రసిద్ధ నపూర్వ సుపర్వ నాయకాం
తర్వసుడైన నీయనుగు దాత పురూరవు బోలువాని నీ
యుర్వర జక్రవర్తి పదమొందు సుపుత్రుని సచ్చరిత్రునిన్ 1-42

"పురువంశమునఁ బుట్టిన నీకిది యుక్తమే. ఇట్టి గుణములతో గూడిన చక్రవర్తి యను పుత్రుని బడయు"మని మూలమునయందు వినఁబడిన పురూరవు బోలునట్టియు చక్రవర్తి పదమొందు నట్టియు సుపుత్రుని గాంచుమని మూలమున కించుక భిన్నముగా బోయి యందలి భావమును వివరించెను.

2. శాన్తమిద మాశ్రమ పదం, స్ఫురతిచ బాహుః కుతః ఫల మిహాస్య
అథవా భవితవ్యానాం ద్వారాణి భవన్తి సర్వత్ర 1-2

చ. చనుఁనెడ నంతలో గుడిబుజం బదరంగ దొడంగినన్ మనం
బున గడు జోద్యమందుచు దపోవన మిచ్చట దీనికిన్ ఫలం
బొనర మనోజ్ఞ మూర్తియగు నుగ్మలి గౌగిలి జేర్ప గావలెన్
గొనకొని యీశ్వరుండ ఎఱుగం గనరాదిది మానుషంబునన్ 2-50

'ఇచట స్ఫురతిచ బాహు' అను దాని అనువాదమున 'కుడి' యనునది అమూలక విశేషణము, 'కుతఃఫలమిహాస్య' యనుదానిని కవి "అన్యథా ఒనర మనోజ్ఞ మూర్తియగు సుగ్మలి గౌగిలి జేర్పగావలెన్' అని వివరించెను. శ్లోకమందలి రెండవపాదమునకు భిన్నముగా సందర్భమునకు తగినట్లు నాల్గవ పాదమును రచించెను.

3. అసంశయం క్షత్ర పరిగ్రహ క్షమా,
యదార్య మస్యా మభిలాషి మేమనః
సతాం హి సందేహ పదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః 1-17

ఉ. సందియ మేల యీ వికచ సారస లోచన రాజపుత్రి నా
డెందము మౌని కన్యల బడిం జన నేరదు, నిక్కవంబయే
చందమునందు సంశయ విచార పదంబగునట్టి వస్తుసీ
మం దమ చిత్తవృత్తులు ప్రమాణము లుత్తములైన వారికిన్ 2-64

మూలమున ఈమె క్షత్రియ పరిగ్రహ యోగ్యురాలనుట నిస్సంశయము. వీలయన నీమెను నామనసు అభిలషించుచున్నది. అని యున్న అర్థమును పిన వీరన మొదటి రెండు పాదములలో అన్యథా వివరించెను. 'క్షత్రపరిగ్రహక్షమా' యనుటలో ఉన్న అర్థ వైశద్యము రాజపుత్రి యనుటలో లోపించినది. రెండవ పాదమును కవి మూలభిన్నముగ అనువదించెను.

పినవీరన కొన్నిఎడల మూల భావమునందలి కొంత అర్థమును గ్రహింపక విడిచి, గ్రహించిన దానిని అన్యథాకరించును.

1. ముక్తేషు రశ్మిషు నిరాయత పూర్వకాయాః
నిష్కమ్ప చామర శిఖా, నిభృతోర్ధ్వ కర్ణాః
ఆత్మోద్ధతై రపి రజోభి రలంఘనీయా,
ధావ న్త్యమీ మృగజవాక్షమ యేవ రథ్యాః 1-8

యదా లోకే సూక్ష్మం వ్రజతి సహసా తద్విపులతాం
యదర్ధే విచ్ఛిన్నం భవతి కృతసంధాన మివ తత్
ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయనయో
ర్న మే దూరే కిఞ్చిత్క్షణ మపి, న పార్శ్వే రథ జవాత్ 1-4

సీ. కను దృష్టి నెయ్యది మినుమినుక్కను చుండు
ఘనత వ్రేల్మిడిలోన గాన బడగ
నెడ త్రెవ్వియుండు నెయ్యది యేని నదికూడ
నదికిన చందాన నన్వయింప
నే యది విలువంకయై యుండు బదమున
నది సమరేఖతో నందమంద
దూరాన నెయ్యది తోచ నాలోకింప
నది పార్శ్వమున లేక యవుల జనగ

తే. శ్రవణములు నిక్క నిష్కంప చామరాగ్ర
ముగ నిరాయత పూర్వాంగముల దనర్చి
ఘన ఖురోద్ధూత రేణువు గడవ బాటి
నిగిడె భువి తేరి హయములు మృగ జయములు 1-118

ఇచట మూలమున మొదటి శ్లోకమునందు గుఱ్ఱముల ధావనమును, రెండవ శ్లోకమున రథవేగమును వివరింపబడినవి. పినవీరన ఈ రెండు శ్లోకములను అనుసరించుచు రెండపదాని అర్థమును సీసపద్య భాగముననుమొదటిదాని భావమును తేటగీతిగను అనువదించెను. తేటగీతిలో మూలశ్లోకమునందలి 'ముక్తేషు రశ్మిషు' అను పదములు వదలివేయబడినవి. "ఆత్మోద్ధతైరపి రజోభిరలంఘనీయాః" అను దానిని కవి "అనుపదము ఘన ఖురోద్ధూతరేణువు గడవ బాఱి" అని ఇంచుక మార్పుతో అనువదించెను. "మృగజవాక్షమయేవ" అనగా లేడివేగము నోర్వలేని వానివలెనని అర్థము. కవి అందలి సుందర భావమును విడిచి "హయములు మృగజయము" లని ఊరక లేడివేగమును జయించునవను చిన్న విశేషణమును మాత్రము వాడి యుండెను.

2. చలాపాఙ్గాం దృష్టిం స్పృశసి బహుశో వేపథుమతీం
రహస్యాఖ్యాయీవ స్వనసి మృదు కర్ణాన్తిక చరః
కరం వ్యాధున్వత్యాః పిబసి రతిసర్వస్వ మధరం
వయం తత్త్వాన్వేషా న్మధుకర హతా, స్త్వంఖలు కృతీ

మ. వనితం జంచ దపాంగజేసి కనుఁగ్రేవల్ ముట్టుచుంజేరి మం
తనముం జెప్పెడు భంగి నొయ్య జెవిచెంతన్ మ్రోయుచున్ మెల్ల, మె
ల్లన మోవిన్ రతి సౌఖ్య సంపదల గొల్లల్ గొంటి ధన్యుండ, వీ
వనఘా ! తుమ్మెద ! నేను వెల్వడితి దత్త్వాన్వేషణముం జేయుచున్
2-72

ఇచట మూలమునందలి 'వేపథుమతీం' కరం వ్యాధున్వత్యాః అను పదముల అనువాదము లేదు. కాళిదాసు అధరమే రతిసర్వస్వ మని తెల్పగా పినవీరన ఇంచుక మార్పుతో 'మోవిని రతి సౌఖ్యసంపదల కొల్లల్ గొంటి' వని రచించెను. వయం అనునది బహువచనము. రాజిట్లు వాడుట అతని ఠీవిని చాటుచున్నది. పినవీరన 'నేను' అని అనువదించుటలోనది కొఱవడినది.

కవి ఒకప్పుడు మూలభావమును సన్నిహితముగా గ్రహించి అందు అలతి అలతి మార్పులను కావించును.

వాచం న మిశ్రయతి యద్యపి మే వచోభిః
కర్ణం దదాత్యభిముఖం మయి భాష మాణే

కామం న తిష్ఠతి మదానన ... నా
భూయిష్ఠ మన్యవిషయా నతు దృష్టి రస్యాః

ఉ. ఆడదు గాని మాట, లోక యంచుల నించుక వీనులొగ్గినా
యాడిన మాట లెల్ల విను, నర్మలితో దను నేను జూచినం
జూడదు గాని, యొండుదెస జూచిన దా నను జూచుచుండు. నీ
జాడలు నా పయిం దగులు చందము డెందము జేర్పనేర్పగున్
2-159

ఇందు మూలభావమే వివరింపబడినది. "నర్మలితోడను నేను జూచినం జూడదు" అనునది అమూలకము.

2. అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవ మనా స్వాదితరసమ్
అఖండం పుణ్యానాం ఫలమివ చ తద్రూప మనఘం
న జానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః 11-10

చ. గొనకొని తావి మూర్కొనని క్రొవ్విరి, యెయ్యెడ వజ్రసూచి రా
యని రతనంబు, జిహ్వ చవి యానని తేనియ, గోరుమోపి గి
ల్లని చిగురాకు, లాలిత విలాస నికేతన మూ లతాంగి, దా
ననుభవ కర్తయే మనుడొ? యా విధియత్న మెఱుంగ నయ్యెడున్
2-158

మూలమున 'విధి అనుభవకర్త నెవ్వని నేర్పఱుచునో యెఱుగ' నని యుండ పినవీరన 'ఆవిధి యత్న మెఱుంగ నయ్యెడున్' అని యించుక మార్పు చేసెను.

స్రస్తాంసా వతి మాత్ర లోహితతలౌ బాహూ ఘటోత్క్షేపణాత్
అద్యాపి స్తన వేపథుం న జహతి శ్వాసాః ప్రమాణాధికాః
బద్ధం కర్ణ శిరీష రోధి వదనే ఘర్మాంభసాం జాలకం
బన్ధే స్రంసిని చైక హస్తయమితాః పర్యాకులా మూర్ధజాః 1-25

మ. చికురంబుల్ నొసలంట, నున్న చెమటల్ చెక్కుల్ దలిర్పన్ ఘటో
దక భారమ్మున గెంపు హస్తయుగ ముద్గారింప నంసంబు లిం
చుక జాఱం జనుదోయి యూర్పువడి సంక్షోభించి కంపింప దా
నొక కేలం దుఱుమావటించు చెలువం బుల్లంబు గొల్లాడదే 2-161

అనువాదమున మూలభావమించుక మార్పుతో చక్కగా వ్యక్తము చేయబడినది.

కవి కొన్ని ఎడల మూలము నందలి పదములను విడుచుట వలన భావమునకు లాఘవము కలిగినది.

గ్రీవాభంగాభిరామం ముహు రనుపతతి స్యన్దనే బద్ధ దృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్ట శ్శర పతన భియా భూయసా పూర్వకాయం
దర్భై రర్ధావలీఢై శ్శ్రమ వివృత ముఖ భ్రంశిభిః కీర్ణ వర్త్మా
పశ్యోదగ్ర ప్లుతత్వా ద్వియతి బహుతరం స్తోక ముర్వ్యాం ప్రయాతి 1-2

చ. విలుగొని వెంట వెంట బృథివీపతి రా శరపాత భీతి దా
మలగి మలంగి కన్గొనుచు, మార్గము గ్రేవకు నడ్డగించుచు
న్నిలుచుచు గొంత కొంత గమనించుచు నర్ధము మేసి మేసిద
ర్భలు వివృతాస్య పార్శ్వముల రాలగ మింటికి జౌకళించుచున్.
2-19

ఇది కాళిదాసు ప్రసిద్ధ శ్లోకములలో నొకటి శరపతన భీతిచే పరువెత్తు మృగము యొక్క స్థితి గత్యాదులొక చిత్రములోవలె ప్రత్యక్షము చేయబడినవి. పై శ్లోకమునందు "ఉదగ్రప్లుతత్వాద్వియతి బహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి" అను పంక్తి అనువాదమున 'మింటికి చౌకళించుచున్' అని సంగ్రహింపబడినది. 'గ్రీవాభంగాభిరామమ్' 'పశ్చార్ధేన ప్రవిష్టః' "భూయసాపూర్వకాయమ్" అను మూలపంక్తులు అనూదితములు కాలేదు ఈ శ్లోకము యొక్క రామణీయకమంతయు ఈ పదముల యందే నిక్షిప్తమై యున్నది. వీనిని వదలుటచే అనువాదమున భావము కొఱవడినది.

2. యాస్యత్యద్య శకున్తలేతి హృదయం సంస్పృష్ట ముత్కణ్ఠయా
కణ్ఠ స్తమ్భిత బాష్పవృత్తి కలుషః చిన్తా జడం దర్శనమ్
వైక్లబ్యం మమ తావదీదృశ మహో స్నేహా, దరణ్యౌకసః
పీడ్యన్తే గృహిణః కథంను తనయావిశ్లేషదుఃఖై ర్నవైః

ఉ. ఎంచ మునీంద్రులందు విజితేంద్రియుడైన తపస్వి కూర్మిగా
పెంచి శకుంతలం బనిచి, విస్మృతి నొందిన మోహపాశముల్
ద్రెంచు కొనంగలేక, తియతీపుల జిత్తము గాసి వెట్టె శీ
లించిన నెవ్వ డింక వదలింపగ నోపెడు మోహబంధముల్ 4-85

కాళిదాసునకు అపారమగు ప్రతిష్ఠను తెచ్చిపెట్టిన శ్లోక చతుష్టయములోని శ్లోక మిది. కవి ఇందలి సారభూతములగు పదములనన్నింటిని వదలి యథేచ్ఛముగా అనువదించుట వలన మూలభావ సౌందర్యమిందు లోపించినది.

పినవీరన కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతల నాటకము ననుసరించుటయే కాక, తన కావ్యరచనమున కాదర్శప్రాయుడైన ఆ మహాకవి కుమారసంభవ కావ్యమును కూడ హిమవత్పర్వత వర్ణనావసరమున ననుసరించి యుండెను. అందు కొండు రెండుదాహరణము లొసంగబడుచున్నవి.

1. "అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః
పూర్వాపరౌ వారి నిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవమానదండః కుమార 1-1

తే. అలరి పెంపొందు బూర్వాపరాంబు నిధుల
నడుమ ధరణికి మాన దండంబువోలె
దేవతాత్మ ధనాధీశ దిగ్విభూష
పుణ్య నిలయంబు నీహార భూధరంబు 2-1-1

పినవీరన హిమవన్నగ వర్ణనమొక సీసపద్యముతో నారంభించుచు అందలి యెత్తుగీతిలో పై శ్లోకము ననుసరించెను.

2. ఉద్వేజయత్యంగుళి పార్ష్ణిభాగాన్
మార్గే శిలీభూత హిమేఽపియత్ర
న దుర్వహ శ్రోణి పయోధరార్తా
శ్చిన్దన్తి మన్దాం గతి మశ్వముఖ్యః 1-10

ఉ. బింగపుజాలుగా హిమము పేరిన యగ్గిరి త్రోవ దుర్వహో
త్తుంగ కటీకుచాలసవతు ల్తురగాస్యలు సంచరించు చో
నంగుళి పార్శ్వభాగముల కార్తి యొనర్చినగాని యయ్యెడ
న్గంగలు దాచి మంద గమనంబున కొందగనీ రపాయముల్ 2-107

ఇట్లే ఈ కావ్యమునందు హిమాలయ వర్ణన సందర్భమున గల [108-106] పద్యములు కూడ కుమార సంభవ శ్లోకముల యందలి భావచ్ఛాయలు కలిగియున్నవి.

పినవీరన వ్యాసప్రోక్త శకుంతలోపాఖ్యాన కథనే తన కావ్యమునకు మూలకారణముగా గ్రహించినను, దాని నాంధ్రీకరించిన నన్నయ భట్టారకుని శైలీ విన్యాసము, సమాసరచనము, వర్ణన విధానము మున్నగు వానిచే నధికముగా ప్రభావితుడైనాడు. కావ్యావతారికలో చెప్పుకొనినట్లు నన్నపార్యుని ప్రబంధప్రౌఢ వాసనా సంపత్తి సొంపును తన ప్రబంధమున పెక్కుచోట్ల విస్తరించెను. ఈ క్రింద కొన్ని ఉదాహరణము లీయబడినవి.

1. కాఱడవి బఱచు మృగముల
నూఱడకందిగిచి డస్సియు న్నతని శ్రమం
బాఱగ నెడ పరితాపము
దీఱగ బై వీచె నన్నదీపవనంబుల్ ఆ.ప. 4-19

పై పద్యములోని నదీపవనములను కవి వివిధ సుగంధ వాసనాభరితములుగచేసి ఆ పద్య భావమునిట్లు విస్తరించెను.

సీ. కదగి సంక్రీడించు నడవి యేనుంగుల
గండస్థలుల దాన గంధములను
ఱెంచుల రాచ కెంజిగురాకు బోడుల
శిరసుల జవ్వాది పరిమళముల
విచ్చిన నెత్తమ్మి విరుల దుమ్మెదలాడ
జారిన పూదేనె సౌరభముల
గూలద్రుమంబుల గాలితాకున రాలి
వచ్చిన యలరు క్రొవ్వాసనలను

తే. కబలితంబగు నయ్యేటి సలిలకణము
లల్లనల్లన గొనుచు మందానిలుండు
చల్లగా వీచి వనపథ శ్రాంతి దీర్ప
నది కనుంగొని వేడుక గదలికదలి. 2-24

2. అట్లే భారతమునందు శకుంతలా సౌందర్యమును దుష్యంతుడు వీక్షించెనని చెప్పు సందర్భమునందు గల 'సంకులమిళితాళి నీల పరికుంచిత కోమల కుంతలన్ శకుంతలయను కన్యకం గనియె' [ఆ.ప. 4-25] అను పద్యమును

శా. చంచత్పల్లవ కోమలాంగుళకర స్సంపూర్ణ చంద్రాననన్,
న్యంచచ్చందన గంధి. గంధగజయానం, జక్రవాక స్తనిం
గించిన్మధ్య, దటిల్లతా విలసి తాంగిం, బద్మపత్రాక్షి వీ
క్షించెన్ రాజు శకుంతలన్మధుకర శ్రేణీలసత్కుంతలన్ 2-59

అని అంది పుచ్చుకొని చివరి పాదమును నన్నయ పద్యమువలె ముగించెను. అట్లే కణ్వాశ్రమ ప్రకృతి వర్ణనము గావించిన సందర్భమునందు గల శ్రవణ సుఖంబుగా సామగానంబులు చదివెడు శుకముల చదువు దగిలి అను పద్యాలాప మునందు మఱికొన్ని కల్పనములను గావించి

శా. వేదాధ్యాపకులైన రా చిలుకటన్ వేదాంత మీమాంసలన్.......
నాదంబొంద పినాకిపాదు నఖలన్ వందారులై చూచుచున్ 2-49

అని వర్ణించి తన శివభక్తి పారమ్యమును కూడ ప్రకటించుకొనెను.

3. శకుంతల దుష్యంతునిచే నిరాకరింపబడి

ఎఱుగడొకొ నన్ను నెఱిగియు
నెఱు గనియట్లుండు నొక్కొ యెద దవ్వగుటన్
మఱచెనొకొ ముగ్ధ లధిపులు
మఱవరె బహు కార్యభారమగ్నులు కారే ఆ.ప. 4-69

అని తలంచును. ఈ భావమునే పినవీరన తన కావ్య కథానుకూలముగ రాజ సభలో కణ్వ శిష్యులచే నిట్లు పలికించెను.

గీ ఏ మెఱంగని పని యని హృదయ వీధి
వెఱచితో ? కాక మఱచితో వెనుక జింత ?
మఱపు లేదైన, బహు కార్యమగ్నమతులు
ధారుణీ నాయకులు గదా దానికేమి ?

4. భారతమున శకుంతల రాజునకు ధర్మోపదేశము గావించిన ఘట్టము నందలి కొన్ని పద్యములను కూడ పినవీరన అనుసరించి వానిని అనసూయా ప్రియంవదలచే పలికించెను.

కం. సతియును, గుణవతియు, బ్రజా
పతియు, ననువ్రతయు నైన వనిత నవజ్ఞా

న్వ్రత దృష్టి జూచు నతిదు
ర్మతి కిహముం బరము గలదె మతి బరికింపన్   ఆ.ప. 4-92

గీ. గుణవతియు బుత్రవతియును, గులవతియును
నైన భామను విడుచు నన్యాయకారి
కిహ పరంబులు లే వనియెడ సమిద్ధ
ధర్మశాస్త్రంబు లెఱుగవా ధరణి నాథ ! 4-133

౬. నీటిలో తన నీడను జూచుకొనునట్లు జనకుడు నిజసూనునిం జూచి మహానందము పొందునన్న భారతమందలి శకుంతలా వాక్యములను [ఆది. 4-88] అనసూయా ప్రియంవదలీ క్రింది పద్యమున ననుసరించిరి.

ఉ. అద్దములోని నీడవలె నాకృతియం దొక లేశ మాత్రముం
బిద్దముగాక, నీకు ప్రతిబింబము వోలె వెలుంగుచున్న నీ
పెద్దకుమారు భూవర ! యభిన్న మతిన్ మొగమెత్తి చూడుమా
ముద్దియ నీ పయిం గలుగు మోహము భక్తియు గానవయ్యెడున్ 4-124

6. భారతమున కణ్వుడు శకుంతలతో

"ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
బెద్ద కాల మునికి తద్ద తగదు
పతుల కడన యునికి సతులకు ధర్మవు
సతుల కేడు గడయు బతుల చూవె" 4-66

అని వివరించి చెప్పిన సతీ ధర్మమును వినవీరన ఒక సీసము నందు

"జీవితేశ్వరు బాసి చిరకాల వసతిగా
బుట్టినింటనె యున్కి బుద్ధి గాదు
పొరుగిండ్లు నిరుగిండ్లు ప్రొద్దు వోకలకైన
బలుమాఱు నరుగుట పాటి గాదు 4-75

అని వివరించెను.

7. దుష్యంతుని సభలో ఆకాశవాణి ఇట్లు పలికెను.

చ. గొనకొని వీడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు సే
కొని భరియింపు మీతని శకుంతల సత్యము పల్కె సాధ్వి స

దీవ్యనుత మహాపతివ్రత వివేకముతో ననిదివ్యవాణి దా
వినిచె ధరాధినాథునకు విస్మయమందగ దత్సభాసదుల్ 4-105

పై పద్యభావమును పినవీరన గ్రహించి ఆ కథా సందర్భమున

మ. అనునాలోనన తత్సభాజనము లత్యాశ్చర్యముం బొంద నో
జననాథోత్తమ ! యీ శకుంతల మహా సత్యవ్రతాన్వీతత
త్తనయుండున్ భవదీయ వీర్యజుడు, సత్యంబౌమటిన్ సత్యమా
ననుమానింపకు మంచు మ్రోసె వడి నయ్యాకాశవాణి ధ్వనల్ 4-167

అని ఆకాశవాణిచే పలికించెను.

రసపోషణ :

మహాభారతము నందలి శకుంతలోపాఖ్యానము భరతుని జన్మవృత్తాంత మును ప్రధాన విషయముగా చెప్పునది. అందు శకుంతలా దుష్యంతుల శృంగార కథకు ప్రాధాన్యము లేదు. ఇట్టి కథను శృంగార రస సముజ్జ్వలముగా నొనరిం చిన వాడు కాళిదాసు. ఆ రసము శాకుంతల కావ్యమున మఱింత భాసించినది.

శాకుంతల నాటకమున ప్రధాన రసమగు శృంగారమునకు వీరకరుణము లంగములుగ పోషింపబడినవి.

'నవినా విప్రలంభేన సంభోగః పుష్టి మశ్నుతే' అను లాక్షణికోక్తి నను సరించి కాళిదాస పినవీరనలు విప్రలంభమును గల్పించి సంభోగమునకు పరి పుష్టిని చేకూర్చిరి. కాని వారిరువురును విప్రలంభమును నిర్వహించిన విధానము వేరు. నాటకమున నాయికా నాయకులకు ప్రథమ వీక్షణము నందంకురించిన రతి కాళిదాసు కల్పించిన గజవృత్తాంతము కారణముగా అయోగ విప్రలంభముగా పరిణమించినది. ఈ విప్రలంభము ఆ తరువాతి సంభోగమునకు స్ఫూర్తి నొసం గినది. కాళిదాసు ఈ రతిని పోషించుటలో అపార నాటకీయ చాతుర్యమును ప్రదర్శించెను. నాయికా నాయకు లేకాంతము నందున్న సమయమున నాయిక సవినయముగా మర్యాదను కాపాడుమని ప్రార్థించెను. నాయకుడు నాయికను చుంబింప వాంఛించెను. అంత నేపథ్యమునందుండి చక్రవాక వధువు నుద్దేశించి పలుకబడిన 'ఆ మంత్రయస్వ సహచరమ్. నను ఉపస్థితా రజనీ' అను వాక్య ములు అన్యాపదేశముగా ఆర్యగౌతమి రాకను శకుంతలకు నిర్దేశించినవి. నాయికా నాయకులకు మరల వియోగము తటస్థించినది. సంభోగ వేళల యందలి వారి

లలిత విలాసములు, నాటకానుగుణముగ పంచమాంకమున రాజసభయందు ఆత నికి ప్రియా సంస్మరణము కల్గించు నుద్దేశముతో శకుంతలచే చెప్పబడినవి. పిమ్మట నాయికా నాయకులకు దుర్వాసుని శాపము కారణముగా వియోగము తటస్థించినది. ఈ విరహ విప్రలంభము కరుణముచే నుద్దీపించినది. నాయకుడు సతీసుతులను నిరాకరించిన దుఃఖము తోడను, నాయిక విధి ప్రాబల్యమునకు తలయొగ్గి అవలంబించిన విరహవ్రతము తోడను తమ మనములను ప్రక్షాళిత ములు కావించుకొనిరి తుదకు వారిరువురి సమాగమము నిర్వ్యాజమై దివ్యముగా భాసించినది.

పినవీరన తన కావ్యమునందు అభిలాష విప్రలంభమునకు అధిక ప్రాధాన్యమొసంగి దాని నతిరమ్యముగ పోషించెను. నాయికా నాయకుల రతికి పెక్కు విధముల తన కావ్యకల్పనా సామర్థ్యమున విఘ్నములను కల్పించి వారిలో అభిలాషను పెంపొందింప చేసెను. ఈ కావ్యమున నాయికా నాయకుల సమాగమము మూడుసార్లు సంఘటితమైనది. ఈ మూడు పర్యాయములును వారు పూర్వరాగ విప్రలంభముచే పరితపించి పరస్పర దర్శనమునకు తహతహ లాడిరి. పినవీరన ఈ విప్రలంభమును కల్పించిన విధానమిట్టిది.

నాయికా నాయకులకు ప్రథమ సందర్శనమైన పిమ్మట వారియందు అనురాగముదయించినది కాని ఈ సమాగమమునకు వ్యాఘ్రప్రవేశ మడ్డుపడి నది. పిదప వారిరువురికిని విప్రలంభ ముద్దీపించినది. ఆ తరువాత వారిరువురి ద్వితీయ సమావేశమున వివాహ మంగళము జరిగినది. కాని ఈ సమాగమము నకు రాక్షస విజృంభణమెడబాటు కల్గించినది. అంత ఈ సందర్భమున విప్ర లంభము పరిపాకము నొందినది. మూడవ సమాగమమున సంభోగము సిద్ధించి నది. ఇట్లు క్రమ పరిణామమున ఏర్పడిన సంభోగము సహజ రమ్యమై ఒప్పారినది.

ఈ పూర్వరాగ విప్రలంభము నందు మన్మథావస్థల నభివర్ణించుట కావ్య సంప్రదాయము. ఈ దశావస్థలను లాక్షణికులిట్లు పేర్కొనిరి.

"దృఙ్మనస్సంగ సంకల్పోజాగరః కృశతారతిః
హ్రీత్యాగోన్మాద మూర్ఛాంత ఇత్యనంగదశాదశ".

38)

దృక్కు (దర్శనము లేక చక్షుః ప్రీతి) మనస్సంగము, సంకల్పము, జాగరము, కృశత, అరతి, హ్రీత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, అంతము (మరణము) అనునవి పది మన్మథావస్థలు.[30] అవస్థలన్నియు శృంగార శాకుంతలమున సమగ్రముగ పోషింపబడినవి. నాయికా నాయకుల పూర్వరాగమున ధీరుడైన నాయకునియందు మూర్ఛ, మరణము మున్నగునవి వర్ణించిన రసపుష్టికి భంగము కలుగును. కావున ముగ్ధయైన నాయిక యందీ అవస్థల నన్నింటిని ప్రదర్శించి నాయకుని యందు పైని పేర్కొనబడిన రెంటిని పినవీరన పరిహరించెను.

నాయికా నాయకుల ప్రప్రథమ సమాగమమున కలిగిన దృక్ప్రసారమును కవి హృద్యముగ నిట్లు వర్ణించెను.

ఉ. బాలిక చూపులున్, ధరణిపాలకు చూపులు నొండొకళ్ళపై
గీలుకొనం జనంగ కనుగ్రేవల నవ్వుచునిల్చి యుద్ధరన్
వాలిక పువ్వుదూపు లిరువంకల బారగ నిక్షు చాపముం
గేల నమర్చియేయ దొడగెం బ్రసవాస్త్రుడు సవ్యసాచియై 2-88

చూపులు ఒండొరులపై ప్రసరింపగనే మన్మథుడు విరితూపులువేసి వారియందు రతిని స్థిరముగ నెలకొల్పెను. ఇట్లు చూపులతో మనస్సంగమమైన తరువాత వారికి ఒక రాతిరి ఎడబాటు కల్గినది. ఈ సమయమున వారియందు సంకల్పము, జాగరము అను అవస్థలేర్పడినవి. వీనియందే కృశత, అరతి మున్నగు తాప సహజ వికారములు రాణించినవి. వ్యాఘ్ర ప్రవేశ కారణముగా దుష్యంతుడు ప్రియురాలిని తిరిగి దర్శింప లేకపోయెను. అతడామె తోడి సమాగమమునకు విఘ్నము కలిగినందులకు పరిపరి విధముల చింతించెను. అతడు

ఉ. మజ్జన భోజన క్రియలు మాని వలాని యరోచికంబునన్
కజ్జము గొంత కొంత కసిగాటులుగా భుజియించి యెవ్వరిం
బజ్జను జేరనీక తన భావము లోపల దాపురంబుగా
సజ్జకు జేరి యుండె నృప చంద్రుడు సాంద్ర వియోగ వేదనన్
2-167

ఇట్లు కృశతను అరతిని పొందెను. శకుంతలా సౌందర్యమును ఆపాదమస్తకము వర్ణించి తన విరహతాపము వెల్లడించుచు ఆమె దర్శనమును కోరెను. నాయిక కూడ తాపభారమున కృశించినది. అతని దర్శన సంస్పర్శములను కోరి

నది. ఆమెకు చెలులు చేసిన శైత్యోపచారము లాతాపమును మఱింత పెంపు చేసినవి. ఈ విరహము విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావసహితముగ వర్ణింపబడినది. 'పినవీరన రసానుకూలమగు సర్వసామగ్రిని సమయోచితముగ వర్ణించి విరహ దశా విస్ఫూర్తిని వ్యంగ్యముగ సాధించి కావ్యరసపోషణమును కావించెను.[81] తీవ్రమైన తాపమామెచే లజ్జాత్యాగము చేయించినది. ఆమె తన మనము దుష్యంతున కంకితమైనదని చెలులకు చెప్పుకొనినది. నాయకుడును చెలులకు

గీ. మొదట మా ధైర్యధనములు ముచ్చిలించి
యించు విలుకాడు దొంగ మీ యింతి కిచ్చె
నేము కోవెల పులుగుచే నెఱుగుటయును
గుదువ మాకిచ్చె మీ యింతి హృదయ ధనము 8-82

అని శకుంతలపై తనకు గల అనురాగమును తెలుపుకొనెను.

నాయికా నాయకులకు వివాహానంతరము కలిగిన విప్రలంభము నాయికా నాయకుల యందున్మాదమును, నాయికయందు మూర్ఛామరణాదులను కల్పించినది. వియోగ భారముతో శకుంతల

ఉ. పూని కరంబులం బొదివి బోటులు తోడ్కొని తేర, మన్మథ
గ్లాని వహించి చాల గసుగంది శకుంతల ప్రాణ నాయక
ధ్యానము తోడ గన్నులనె ప్రాణము నిల్పి శరీర మాత్రయై
తానట కేగుదెంచె వడ దాకిన చెందొవ కాడ కైవడిన్

ఈ విప్రలంభమున నాయకుని యందు రతిని నాయిక యందు సంతాపమును వర్ణించుట పినవీరన ఉచితజ్ఞతను నిరూపించుచున్నది. ఈ అభిలాష క్రమక్రమముగ అధికమై వారిరువురి యందు స్థిరమైన అభిలాషను నెలకొల్పు నట్టిదిగా తీర్చుటకు కవి కథయందు పెక్కు కల్పనలను గావించి కృతార్థుడాయెను. ఇట్టి విప్రయోగముతో పరిపక్వమైన శృంగారము సంభోగమున సంయమనముతో పోషింపబడి పాఠక హృదయంగమమైనది.

ఈ కావ్యము నందు, శృంగార ప్రధానమైన మేనకా విశ్వామిత్ర చరిత మొక చక్కని ఉపాఖ్యానముగ భాసించుచు అంగిరసమునకు పరిపోషకమగుచున్నది. వసంతోద్గమ మలయ పవన విలాసములతో అలరువిలుకాడు తోడు

రాగా అచ్చర మచ్చెకంటులు కుసుమాపచయ క్రీడలొనరించుట మున్నగు విభావానుభావ సామగ్రితో మేనక ఘోర తపోనిష్ఠుడగు విశ్వామిత్రునిలో రతి రగిలించెను. వీరిరువురి శృంగారము నభివర్ణించుటలో కవి చమత్కారము వెల్లడియగును.

సీ. "ప్రసవ కార్ముకుడను పాపకర్ముని చేత
సూనాస్త్రుడనెడు దురాత్ముని చేత
సంబుచరధ్వజుండను కిరాతుని చేత
మన్మథుండను నసన్మార్గు చేత ..... .... 2-143

అని మన్మథుని నొక క్రూరునిగ వర్ణించి ఆతనిచే చెడిన వారల గాథలు వేరు చెప్పుటేలయని విశ్వామిత్రుడు శృంగారలోలుడై తగులుకొనుట పేర్కొనెను

ఈ కావ్యమున వీరము అంగము. దుష్యంతుడు రాక్షససేనతో యుద్ధము గావించిన సందర్భము నందిది చక్కగా నిర్వహింపబడినది. వీరమునకు స్థాయియైన ఉత్సాహము ఈ వర్ణనారంభము నందే ఇట్లు ప్రకటితమైనది.

మ. చెలిమిం జేసె దదాహవ స్థలమునం జృంభించి యా చంద్రమః
కుల భూపాలక బాహుదండ విలసత్కోదండ టంకారముల్
గులిశారావ గభీర భైరవ మహాకోపోగ్ర హుంకారముల్
ప్రళయారంభ నటత్కృతాంత పటహ ప్రత్యగ్ర భాంకారముల్ 3-109

ఇట్టి ఉత్సాహముతో నాయకుడు మాకంద శంభులను సైన్యాధ్యక్షు లిరువురిని 'వీరలక్ష్మీ రమణీయ భూతబలికిన్ బలిగొఱ్ఱెలను' గావించెను. [3-111] పిదప రాక్షస సుభటయూథంబుతో సంకుల సమరము గావించెను. తరువాత రవిజిహ్వుడు నాయకు డుపయోగించిన వారుణాస్త్రమునకు బ్రతీకారమెఱుగక విగత జీవుడాయెను. అటుపై పాటల, మానాళి, మర్త్యాశి త్రయంబునందు మానాళి మర్త్యాశులు ఖేలద్బాణ యుగ్మంబుతో దుష్యంతుని క్రోధాగ్నికి ఆహుతులైరి. పాటల వర్ణుడు నాయకునిపై నింద్రజాలాశుగంబు నేయగా నతడు రాక్షస మాయకు లోబడెను. కాని సారథిచే తన స్థితి నెఱింగినవాడై తిరిగి సమరోన్ముఖుడై పాటల వర్ణుని చంపెను. పైని జరిగిన సంగరమంతయు సంగ్రహముగ వివరింపబడినది. రాక్షస నాయకుడైన కాళికాముఖుని తోడి యుద్ధము దీర్ఘముగ సాగినది. ఇందు నాయకుని యందలి వీరమును, ప్రతినాయకుని రౌద్రమును

యుద్ధ క్షేత్రము నందలి బీభత్సమును హృద్యముగ వర్ణింపబడినవి. తుదకు దుష్యం తుడు బ్రహ్మాస్త్రముచే కాళికాముఖుని సంహరించి విజయ శంఖమును పూరించెను.

పినవీరన శృంగార వీరముల వలెనే సులలితమైన హాస్యమును కూడ కల్పించుటలో నేర్పరి. ఇది విదూషకుని సంభాషణములలో గోచరమగును. వన మృగములను జూచి భయము చెందిన మాండవ్యుడు తాను వేటయందు పాల్గొనక తప్పించుకొనుటకై ఏవో కొన్ని సాకులు కల్పించి దుష్యంతునితో చెప్పెను. కాని ఆతని పాచిక పారలేదు. దుష్యంతుడు సఖుని పిరికితనమును గ్రహించి అతని ననునయించుచు కుసుమంబునుంబోలె కందకుండ నిన్నుం దెచ్చెదనని చెప్పి తోడ్కొని పోయెను. మాండవ్యుని బుద్ధికుశలత రాజును గొల్లలిచ్చు విందును స్వీకరించుటకు ఒప్పించుటలో సార్థకమైనది.

ఇక ఈ కావ్యము నందలి అన్యరసములలో తపోవన వర్ణనమున శాంత మును, శార్దూల దర్శనమున విప్రునిలో భయానకమును, శకుంతలా ప్రస్థాన సందర్భమున కరుణ రసమును కావ్యనిర్వాహణమునందు అద్భుతమును సంద ర్భానుగుణముగ పోషింపబడినవి.

పినవీరన శైలి - భాషాదులు :

పినవీరన కవితలో ధారాశుద్ధి ప్రత్యేకముగ ఎన్నదగినది. ఈతని శైలి వర్ణనాత్మకము.పద్యరచనా పాటవ మమోఘమైనది. 'తెలుగు పద్యము పినవీరన చేతిలో సౌందర్య పరాకాష్ఠ నందుకొనినదని చెప్పవచ్చును.'[12] ఈ పద్యముల యందలి శైలి అలంకారికమై భాసిల్లుచున్నది. ఈతని భావుకత, వర్ణనా వైద గ్ధ్యము శృంగార రస నిరూపణమునందు సరసములై యొప్పినవి. చంద్రోద యము నాయికలో రగిలించిన విరహతాపమును కవి చమత్కారముగ నిట్లు వర్ణించెను.

సీ. విరహులపై జల్లి విషపు జూర్ణము నించి
పట్టిన దంతపు బరిణె యనగ
దెప్పించి పాంథుల దెగటార్ప శశికాంత
శిల ఘటించిన వధ్యశిలయొ యోలె
గాంతాప రాధుల గౌముదిం దొడికింప
బెట్టిన పటికంపు బిందె యనగ

వెనవియోగుల దెగ వ్రేయ బుల్గడిగింది
నిలిపిన గండ్ర గొడ్డలి యనంగ
తే. ముదుర వెన్నెల గిన్నెల ముంచవచ్చు
కరణి నుత్పుల్ల కాళ నీకాళయగుచు
దెల్లవాటి మధ్యంది నాదిత్యుడవగ
దనరు శశి జూచె నా శకుంతల భయమున 3-178

ఇందు శశికి చెప్పబడిన సాదృశ్యములన్నియు సందర్భోచితములై హృద్యముగ నున్నవి. సార్థకములగు పదములను పోహళించుటయే పినవీరన పద్య రచనా శిల్పము.

పినవీరనకు తెలుగు పదములకంటె సంస్కృత శబ్దజాలముపై మక్కువ ఎక్కువ. తఱచుగా నితని కవిత్వమున దీర్ఘ సమాసములు కనిపించును. ముని బాలకునితో శకుంతలా దర్శనోత్సాహియై వెళ్ళు దుష్యంతున కొక బెబ్బులి ఎదురైనది. ఆ వ్యాఘ్ర ప్రవేశమును కవి ఇట్లు వర్ణించెను.

మ. 'అని చింతించుచు సంతసించుచు రయం బారంగ సారంగలాం
ఛన వంశాగ్రణి యేగుచో జటుల పర్ణాశాల కాలాంబుద
స్తనిత ధ్వాన పథాధ్వనీనగళ గర్త క్రోడ నిర్ధ్యూత ని
స్వన నిర్భగ్న నితాంత శాంత బహు సత్వ స్వాంత కాంతారమై

క. శైలద్రుమ చరదేణీ
జాలోదర దళన కేళి సమయాతి గళ
త్కీలాల సిక్త దంష్ట్రా
ఖీల నఖంబగుచు నొక్క బెబ్బులి వచ్చెన్ 2-153

ఇట్టి సంస్కృత భాషాభినివేశము కావ్యము నందంతటను కనవచ్చును. కాని ఇతడు తెలుగు పదముల నుపయోగించి రచించిన మనోహర పద్యములు కూడ కొన్ని లేకపోలేదు. ఈ క్రింది పద్యమందుకు నిదర్శనము.

ఉ. లాతి తనంబు చేసి యబలా యెఱిగింపక నిల్వనోపుదే
లేతలు గాక గుండె లగలించెడు కోయిల దుండగీల పె
న్మూతలు గండు దుమ్మెదల గుంపుల మ్రోతలు లోన నీతలుం
బోతలు నైన యట్టి తలపోతలు గంతుని వీక చేతలన్ 3-58

పినవీరన ఉక్తివైచిత్రి అభినవమైనది. ఈ కావ్యము నందలి అపురూప ములగు కొన్ని పదబంధములు జాతీయములు వినూత్నములై యొప్పుచున్నవి. ఇవి ఈతని అపార భాషాశాస్త్ర పాండిత్యమునకు నిదర్శనములు. ఈతడిట్టి వాక్య విన్యాసముతో చక్కని అర్థస్ఫూర్తిని సాధించును.

| | | |
|---|---|---|
| 1. | టంకము బంగారముతోడి యొఱ ప్రబంధము వొందున్ | 1-25 |
| 2. | వెచ్చము పెట్టుమన్న పదివేంకు నుద్దరు లొల్లరు | |
| 3. | ఓమన బాప గోలె గృపనోమితి నీ మృగరాజడింభమున్ | 2-32 |
| 4. | దేవర ప్రసాదంబు జాదులుంబలె నయ్యెనని | 1-107 |
| 5. | నాలుక వెచ్చన మునులకు గినుక వేగము వచ్చున్ | 2-35 |
| 6. | అకట జాదులు వేచెర మంగలంబునన్ | 2-61 |
| 7. | మచ్చనాలుక వాడవు | 2-172 |
| 8. | పురుటాలి తగవు గొంపోవు హరిణి | 2-45 |
| 9. | చరణముల లేతచిగురు మేజాలు దొడిగి | 341 |

అట్లే పొడ పువ్వన కలిగినట్లు [1-128] కుసుమంబునుంబోలె కంద కుండ నిన్నుం దెచ్చెద [1-31] మొదలైనవి. ఇందలి జాతీయములు మనోహ రములై యున్నవి. చతుర్థాశ్వాసమున శకుంతల నత్తవారింటికి పంపు ఘట్ట మున జాతీయతాముద్ర అధికముగ కనిపించును.

1. కసిగాటులుగా భుజించి 2-167 – ఏటికెదురంటినకరణి 2-165
2. తూచి వేసిన గతినుండె దోర్బలములు 3-13
3. లోన నీతలుం బోతలు నైన యట్టి తలపోతలు 3-58
4. మూసిన ముత్తియంబు 3-77

లోకోక్తులు :

1. అదయుడై విధి కంచము మొదటివాని లేశమంతయు గృప లేక లేవనెత్తి 2-165
2. అరయంగా మెడబెట్టు కొంచు దిరుగన్ హారంబులే భామినుల్ 3-242

3. ఏనుంగు నెక్కి-లదిడ్డి చొ అగ 3-246

4. అనటి పండొల్వ నేటికి నినుపగోరు ? 447

5. తోటకూరకుఁ జంద్రహాసము దెత్తురే 4-48

6. నీళ్ళముంచు పాలముంచు మునివరేణ్య 4-50

7. తల్లి విషము వెట్టఁ దండ్రి యమ్మగ మాన్పగలరె యొరుల 4-50

8. తీటగొనినం గొఱవిందల గోకి కొందురే 4-115

అంస్యాదమృతం విషమ్ [3-71], శుభస్యశీఘ్రం [3-72] మున్నగునవి ఇందలి కొన్ని సంస్కృత లోకోక్తులు

పినవీరన సందర్భోచితముగ పెక్కు సూక్తులను కూడ ప్రవేశపెట్టెను.

1. క. వారక యసత్య వచనము
నారక హేతు వనగను వినంబడెడుంబు
ణ్యారణ్యము లోపల ముని
దారికలకు బొంకనేల ధర్మచ్యుతిగన్ 2-82

2. సీ. చింతాకులత్వంబు చెఱచు దేజోలక్ష్మి
సీధుపాన ప్రీతి సిగ్గుజెఱచు
జెఱచు మిథ్యా దృష్టి శీలతా గరిమంబు
బిశున వాచావృత్తి పెంపు జెఱచు
జిత్త వైకల్యంబు చెఱచు బ్రజ్ఞా ప్రౌఢి
పర వధూ సంగతి బైని జెఱచు
జెఱచు గ్రోధము తపః స్థిర సమాధి స్థితి
గాముకత్వము వివేకంబు జెఱచు

3. తే. గుటిల మానవు మైత్రి సద్గుణము జెఱచు
నసమ విద్యా వివాదంబు యశము జెఱచు
ఫలిత కార్యము వేగిర పాటు చెఱచు
దమక మొప్పదు పనికి నేంతటి ఘనునకు 3-80

శకుంతల యత్తవారింట కేగు నప్పుడామెకు కణ్వుడు హితములను చెప్పు ఘట్ట మంతయు సూక్తిమయమై యున్నది.

పినవీరన కవితలో కనవచ్చు కొన్ని స్వతంత్ర ప్రయోగములు.

1. రోషాకులమున్నదటు — రోషాకులమున్ అదటు 3-28

2. వెలుగన్నస్నీరజముఖి — వెలుగన్ అన్నీరజముఖి 3-62

3. పట్టున్నదలంచి — పట్టున్ అదలించి 4-48

4. పాటలన్నిల — పాటలన్ ఇల — ఇవన్నియు ద్రుత

ద్విత్వ సంధి కార్యము జరిగిన తావులు. ఇక

1. కదిసెన్నడు — కదిసి ఎన్నడు 3-47

2. ఎఱిగుండి — ఎఱిగి ఉండి

3. ఏనుంగునెక్కేల — ఏనుంగు నెక్కి ఏల

వంటిక్త్వార్థకే కారమునకు సంధి జరిగిన రూపములు కనవచ్చుచున్నవి.

## పినవీరనపై పూర్వకవుల ప్రభావము :

పినవీరన తన కవితలో నన్నపార్యుని ప్రబంధ ప్రౌఢ వాసనా సంపత్తి సొంపును, దిక్కయజ్వవాక్పుక్కి కామోదమును, నాచన సోముని వాచా మహత్త్వ సౌరభమును, శ్రీనాథుని భాషా నిగుంఫ పరిమళమును కలవని చెప్పు కొనినాడు. పినవీరనపై పైని పేర్కొనబడిన కవులందఱి ప్రభావముండుట సత్యమే. అయ్యును అందు శ్రీనాథుని ప్రభావ మపారము. ఈతడు ప్రధానముగా శ్రీనాథునే లక్ష్యముగా నిడుకొని గ్రంథరచనము కావించెను. శ్రీనాథుని కవిత్వమునందున్న లక్షణములీతని కవిత్వమునందును కనవచ్చుచున్నవి. పినవీరనపై పూర్వకవుల ప్రభావమును, శ్రీనాథుని కవితాప్రభావ ప్రాముఖ్యమును విమర్శకులు కూలంకుషముగ చర్చించి యున్నారు.[38]

"గడచిన వెయ్యేండ్లు ఆంధ్రసాహిత్య చరిత్రను సమీక్షించినచో కవిత్రయము ఒక్కటేగాక రెండు మూడు కవిత్రయములున్నట్లు కనిపించును. మొదటి కవిత్రయము అందరెరిగినదే. రెండవ కవిత్రయము జక్కన, శ్రీనాథుడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు. మూడవ కవిత్రయము అల్లసాని పెద్దన, తెనాలి రామకృష్ణుడు, రామరాజభూషణుడు. మొదటి కవిత్రయము వారినుండి

రెండవ కవిత్రయము వారు రచనా శిల్ప రహస్యములను గ్రహించిరి. ప్రబంధ కవులు రెండవ కవిత్రయము వారినుండియే గ్రహించిరి.[34]" "శ్రీనాథుడు నన్నయ వంటివాడు. జక్కన తిక్కనవంటి వాడు. ఇక పినవీరభద్రుడు ఎఱ్ఱన వంటి వాడు." "మొదటి కవిత్రయములో సమాన లక్షణమేదియును లేదు. ముగ్గురు మూడు త్రోవల వెళ్ళిరి. కాని రెండవ కవిత్రయము వారట్లు కాదు. వారికొక సమాన లక్షణము కలదు. తెలుగున సంస్కృతమున వారి నుడికారము, సమాన రచనా ధోరణి ఉత్పల చంపకమాలికలను, మత్తేభమును, సీసములను నడిపించు రీతి రెండవ కవిత్రయము వారిలో ముగ్గురి యందును సమాన లక్షణ లక్షితములై కనుపించును. తక్కిన విషయములందు వారి వారి ప్రత్యేక విలక్షణత వారికి కలదు. వారినే తర్వాతి కవులనుసరించి ప్రబంధ యుగము నావిష్కరించిరి.[35]

పినవీరన ననుసరించిన కవులు :

1. సింహాసన ద్వాత్రింశికను రచించిన కొఱవి గోపరాజు తన కావ్యమునందు పినవీరనను మహామతి [1-12] యని కీర్తించెను. పినవీరన ప్రభావ మీకవిపై కొన్ని ఎడల చంద్రికాచకోరాది వర్ణనములందు కనిపించును.

2. పినవీరన ప్రభావము అల్లసాని పెద్దనపై అపారముగ కనవచ్చును. అది మనుచరిత్ర ప్రబంధారంభముననే గోచరించును. పినవీరన కావించిన విఘ్నేశ్వర స్తుతిని పెద్దన ఇట్లనుకరించెను.

మ. జననీ స్తన్యము గ్రోలు చుం జరణకంజాతంబునం గింకిణీ
స్వన మింపారగ దల్లిమేన మృదుల స్పర్శంబుగా దొండమ
ల్లన నాడించుచు జొక్కు విఘ్నపతి యుల్లాసంబుతో మంత్రివె
న్ననికిన్ మన్నన సొంపు మీఱ నొసగున్ భద్రంబు లెల్లప్పుడున్
[శృం. శా. 4-1]

ఉ. అంకము జేరి శైలతనయా స్తన దుగ్ధములానువేళ బా
ల్యాంక విచేష్ట దుండమున నవ్వలిచ న్గబళింప బోయి యా
వంకకుచంబు గాన కహివల్లభహారము గాంచి వే మృణా
ళాంకుర శంక నంటెడు గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్
[మను. 1-4]

3. పినవీరన గావించిన శంకర ప్రశస్తి

సీ. 'గిరిజా విభుండు ముంగిటి పెన్నిధానంబు
కృత్తివాసుండు తంగేటి జున్ను
గోరాజ గమనుండు గుజ్జు మామిడిపండు
కుసుమాస్త్ర హరుడు ముంగొంగు పసిడి — 4-4

... ... ... మొదలుగా నుండ పెద్దన దాని ననుకరించి గృహమేధి నిట్లు వర్ణించెను.

సీ. కెలకుల నున్న తంగెటి జున్ను గృహమేధి
యజమానుడంక స్థితార్థ పేటి
పండిన పెరటి కల్పకము వాస్తవ్యుండు
దొడ్డి బెట్టిన వేల్పు గిడ్డి కాపు — [మను. 1-67]

4 పినవీరన వేటవర్ణనము నాదర్శముగా గ్రహించి పెద్దన దానిని బహు విధముల విస్తరించెను. ఉదాహరణమునకు వేటకుక్కల పేళ్లు

సీ. పులిమల్ల డడవి పోతుల రాజు గరుడుండు
గాలివేగంబు పందేలపసిడి — 1-103

పులియడు బూచిగా డసుర పోతుల రాజనుమంతిగాడు చెం
గలువ సివంగి బైరవుడు కత్తెర సంపఁగి వెండిగుండు
— 4-32

ఇట్టి అనుకరణ మింకను వెక్కుతావుల కననగును. ఇంకను పల్వురు ప్రబంధ కవులపై ఇతని ప్రభావము కనవచ్చును. పినవీరన కావించిన మాలినీ నదీ వర్ణనమును రామరాజ భూషణుడు శుక్తిమతీ నదీవర్ణనమున కూతగా గ్రహించెను.

శాకుంతల కావ్యమున ఆనాటి సాంఘికాచారములు కొన్ని తెలియునగు చున్నవి.

1. స్వప్నఫలములను, శకునఫలములను నమ్ముట 1-129
2. దిష్టు, దిగదుడువులు తీయునాచారము ౬-41
3. చరణములకు మేజాలు తొడుగుకొనుట 3-41

4. తెలుబొమ్మలాటలు 3-125
5. జాతరలందు మేషబలి 3-130
6. ఆడువారు కావ్యేతిహాసములు చదువుట 3-47
7. పురిటాలికి కానుకలు. బాలెంతకు చేయు విధులు 2-45, 4-62
8. పతిసేవ స్త్రీ పరమార్థమని భావించుట 4-71, 82
9. అల్లుదు అత్తవారిపై తప్పులెన్నుట 4-78

శకుంతలా పరిణయము :

శకుంతలా పరిణయమును రచించిన కృష్ణకవి క్రీ. శ. 18వ శతాబ్దిలో నివసించిన వాడు. ఈతడు నెల్లూరి మండలమున నివసించుచుండెను. ఈ గ్రంథము చిరుమామిళ్ళ పాపయ అను కమ్మ నాయని ప్రేరణముచే శ్రీ వేంకటేశ్వరాంకితముగ రచింపబడినది.

శకుంతలా పరిణయము మూడాశ్వాసముల ప్రబంధము. ఇందు కవి భారతము నందలి శాకుంతలోపాఖ్యానమునకు కాళిదాసుని నాటక కథా కల్పనములు కొన్నింటిని చేర్చి కావ్యము రచించెను. కవి కావించిన పెక్కు స్వతంత్ర కల్పనములు కూడ నిందు కలవు.

దుష్యంతుని సభకు నారదుడు విచ్చేసి వనుల క్రీడించు దుష్టసత్త్వముల వలన నాశ్రమమ్ముల కొదవె మహాశ్రమమ్ము' [1-28]. కావున అడవికి వెడలి మృగవ్యంబు చేసి తాపసులను రక్షింపుమని కోరుట, దుష్యంతునకు చక్రవర్తి లక్షణలక్షితుండగు కుమారుడుదయించి వంశకరుండగునని దీవించుట, అటుపై ఋతువర్ణనమూ, గ్రీష్మ శరదృతు వర్ణనములు, దుష్యంతు డంపిన చారులు నారదుని వాక్యములు సత్యములని చెప్పగా దుష్యంతుడు మృగయాఖేలనమునకు సంసిద్ధుడగుట, రాజ సందర్శనమున శకుంతల విరహమును పొంద, ప్రియంవద రాజస్కంధావారమునకు పోయి శకుంతల స్థితిని వివరించి ఆతనిని శకుంతలా సన్నిధానమునకు రావలసినదిగా నర్థించుట. రాజసభయందు శకుంతల ప్రార్థింప మహావిష్ణువు ప్రత్యక్షమై అమె పాతివ్రత్యమును గూర్చి జనపతికి చెప్పుట మున్నగు కథాంశములు కవి కల్పితములు.

కణ్వుడేరుగును, దుష్యంతుడేతెంచుననని అతని కర్తవ్యము నిమ్మని ప్రియంవదాదులతో చెప్పుట, శకుంతల జన్మవృత్తాంతము ప్రియంవద రాజునకు చెప్పుట, కశ్యపుడు తీర్థయాత్రల కరుగుట మున్నగు కథాంశములు నాటకకథకంటె కవి భిన్నముగా చేసిన మార్పులు.

నాటకము నందలి అనసూయా ప్రియంవద లిండుగలరు. కాని ప్రియంవదకే ప్రాముఖ్య మీయబడినది రాజు తపోవనము ప్రవేశించి శకుంతలనుగాంచి "అక్కన్యకా సరస సల్లాప సమాకర్ణన కుతూహలంబున బొదలమాటునం బొంచి" [1-27] యుండుట యందును, నాయిక నాయకుని యెదుట నిలువజాలక మఱుగునకు చనునప్పుడు తరుకంటక నద్ధంబగు చేలము సడలించుకొను నెపమున రాజును చూచుట యందును కొంత నాటకానుసరణము కనవచ్చుచున్నది. నాయికా నాయకులకు ప్రథమ సందర్శనమైన పిమ్మట నాటకమున గజ ప్రవేశ కారణముగా వారికి వియోగము కలిగినట్లు ఇందు సైనికుల కలపరము కారణముగా నాయకుడేగుటతో వారిరువురికి వియోగము కల్గినట్లు కల్పింపబడినది ఇట శకుంతలా విరహతాపము ప్రబంధోచితముగ వివరింపబడినది. కణ్వముని శకుంతల నత్తవారింటికి పంపునపుడును ఆమెకు హితోపదేశము కావించిన సందర్భము నందును కొంత నాటకానుసరణము కనవచ్చును.

నాటక భావానుసరణము :

1. "అసంశయం క్షత్ర పరిగ్రహక్షమా" అను శ్లోకమునకు

ఉ. అంకిలి గాదు నాదు హృదయంబు తమోరహితంబు సూవె యీ
కుంకుమ బొమ్మ పై మరులు కొన్న విధంబు దలంచి చూచినన్
శంకిల నేటికీ వెలది క్షత్ర పరిగ్రహ పాత్రయై తగున్
మంకు దనంబులేని ఘన మానస వర్తనముల్ ప్రమాణముల్ 2-26

అను పద్యము నందును

2. "యాస్యత్యద్యశకుంతలేతి హృదయ" మ్మను శ్లోకమునకు

చ. కనుగవ బాష్ప పూరములు గ్రమ్మెడు గద్గదభిన్నమై యెలుం
గనువున రాదు నా హృదయ మాకుల మయ్యెడు మేను గ్రాస్సెడం
బెనిచిన వాని కింతవగ బిమ్మటి గ్రమ్మెడు కన్న వారలుం
దనయను బంప లేక పరితాప భరంబున నెట్లు సైతురో 8-102

అను పద్యము నందును

3. "పాతుం న ప్రథమం వ్యవస్యతిజల" మ్మను శ్లోకమునకు

సీ. తోయంబుగా మీకు దోయమెత్తక కాని తోయంబు ద్రావదీ తోయజాక్షి
చివురెత్తు వేడ్కమై చివురు గైసేయ మీ చివురందగోరదీ చివురు బోణి
కుసుమాపచితి నన్యకుసుంబు కాని మీ కుసుమంబు కోయదీ కుసుమగాత్రి
ఫలదానములకైన ఫలియించి యున్న మీ ఫలమంట దీ మహోత్పల
సుగంధి

తే. యట్లుమిము బ్రోది లాలించి యరయుచున్న
మన శకుంతల తనదు కుమారు తోడ
నత్తవారింటి కేగెడు నాదరమున
నాజ్ఞ యీదగు వనభూరుహంబులార 3-105

అను పద్యమునందును

4. "శుశ్రూషస్వగురూన్" అను శ్లోకమునకు

మ. గురు శుశ్రూషలు సేయుమీ సవతులం గూర్మిన్వి లోకింపు మీ
పరివారమ్ముల బ్రోవుమీ సిరుల గర్వస్ఫూర్తి గైకోకు మీ
పురుషుం దూరకుమీ, సతుల్ నడచు నేర్పుల్ నీకు సూచించితిన్
దరుణీలోకమతల్లి ! చేకొనవె మా తల్లీ ! మదీయోక్తులన్ 3-109

అను పద్యము నందును అనుసరణము గోచరించుచున్నది.

ఈ కావ్యము నందలి శైలి ప్రబంధోచితమై అలంకార బంధురముగ నున్నది. ఇందు కవి కావించిన కల్పనలు కావ్యమునకు రమ్యతను సాధించుచున్నవి. నాయకుని అయోగ విప్రలంభమును కూడ కవి విపులముగ వర్ణించి అప్పుడతడు పొందిన వికారములను వివరించి యున్నాడు.

భరతాభ్యుదయము :

ఇది నాల్గాశ్వాసముల ప్రౌఢ ప్రబంధము. ఏతద్గ్రంథకర్త శ్రీ మాడభూషి వేంకటాచార్యుల వారు. గ్రంథ రచనా కాలము క్రీ.శ. 1880. ఇది ఆనాటి మద్రాసు హైకోర్టు వకీలు శ్రీ రాయబహదూర్ పనప్పాకం అనంతాచార్యులవారి ప్రేరణముచే రచింపబడినది. కవి గారికిని తమకునుగల సఖ్య

మును పురస్కరించుకొని అనంతాచార్యుల వారు వేంకటాచార్యుల వారిని మహాభారతమునకు మూలమగునట్టి భరత నృపాల చరితమును భరతాభ్యుదయమను నామముతో కావ్యముగా రచింపుమని అభ్యర్థించిరి. కవి హర్షించి ఈ కావ్యము రచించెను

శ్రీ వేంకటాచార్యుల వారు, నూజివీడు వాస్తవ్యులు. శాస్త్ర చతుష్క ప్రసంగ క్రియాదక్షులు. శతలేఖినీ పద్య సంధాన సమర్థులు. ఆంధ్ర గీర్వాణ కావ్య గ్రథనాభిజ్ఞులు. లలిత సంగీత కళారసజ్ఞులు. [1-18] వీరి తండ్రి శ్రీ నరసింహాచార్యుల వారు. శ్రీ విద్వన్నర సింహాచార్యతనూభవ తత్కృపాప్రాప్త చతుర్విధ కవితా సామగ్రీ సమగ్ర వైదుషీ విశేష ప్రదర్శన మహాస్థాన సంస్థానాధిప ప్రదత్త విద్వానభినవ పండిత రాయాది బిరుదాంక నిరంకుశ చర్య వేంకటాచార్య ప్రణీతంబైన అని ఆశ్వాసాంతగద్యలలో పేర్కొనబడినది. శ్రీ మాడభూషి వేంకటాచార్యుల వారు కాశ్యపగోత్రులు. వీరిది వైష్ణవ సంప్రదాయము. ఈ గ్రంథము భక్తలోక పాంకుడైన పార్థసారథి కంకితము. గ్రంథారంభము కూడ పార్థసారధి స్తుతితోడనే ఆరంభమగుచున్నది.

ఈ కావ్యము నందలి కథ మహాభారతము నందలి శాకుంతలోపాఖ్యానము ననుసరించుచున్నది. తృతీయాశ్వాసమున కాళిదాసుని నాటక ప్రథమాంక కథయు అందలి బావానుసరణమును కొంత కన్పట్టును. ఈ కావ్యమున కాళిదాస నాటకములోని ప్రియంవదా వైఖానసులు కలరు. ఈ కవి కావ్యమున కొన్ని నూత్నకల్పనములను గావించి ప్రబంధాను గుణములగు వర్ణనములను ప్రవేశ పెట్టెను. ఆశ్వాసాంత గద్యలలో నిది 'శృంగార మహాప్రబంధము' అని పేర్కొనబడినది.

శకుంతలా దుష్యంతులు తమ ప్రథమ సందర్శనమునకు పూర్వమే నారద మహర్షి వలన పరస్పర రూపగుణాదులను గూర్చి విని ఒండొరులపై అనురాగమును కలిగిన వారగుట, ఇట్టి అనురాగముచే శకుంతల విరహిణి యగుట కవి కావించిన కల్పనములలో ముఖ్యముగా పేర్కొనదగినవి. కవి ఈ కావ్య ద్వితీయాశ్వాసమున శకుంతల అయోగ విప్రలంభమును ప్రబంధోచితముగను, విపులముగను వర్ణించెను. శకుంతలను, పుత్రుని చేరదీసిన పిదప కొంత కాలమునకు భరతుడు యౌవరాజ్య పదవీ నిర్వహణమునకు సమర్థుడైనంత

దుష్యంతుడు కుమారునికి వివాహము చేయ నిశ్చయించి తన తలపును మంత్రు లతో చెప్పుట, అంత మంత్రులు దుష్యంతునితో కేకయ రాజపుత్రియగు సునంద భరతునకు తగిన వధువని తెలుపుట, దుష్యంతుడు కేకయ రాజునకు రాయబార మంపుట, కేకయ రాజు అంగీకారము, సునందా భరతుల పరిణయము, కవి సందర్భానుగుణముగా కావించిన కల్పనలు. కవి శకుంతల జన్మవృత్తాంతమును రాజునకు ప్రియంవదచే చెప్పించెను.

దుష్యంతుడు వేటకేగి అట హరిణమును గాంచి దానిని తరుముచుబోయి శరసంధానము చేయునంతలో వైఖానసు డేతెంచి దుష్యంతునిచే బాణోప సంహా రము చేయించుట, దుష్యంతునికి చక్రవర్తి యగు నొక సుతుం డుద్భవింప గలడని ఆతనిని దీవించుట, కణ్వుడు సోమతీర్థమున కేగెననియు తపోవనము నందతిథి సత్కారమునకై శకుంతలను నియమించెననియు తెలిపి, దుష్యంతుని ఆశ్రమమున కాహ్వానించుట మున్నగు కథాంశములు నాటకమునుండి గ్రహింప బడినవి.

ఈ కావ్యము నందెడనెడ కాళిదాసుని నాటక శ్లోకఛాయానుసరణముకూడ కనవచ్చును. అందు కీ క్రింది పద్యము లుదాహరణములు.

ఉ. కాంచితె సూత యీ మృగము గంతము ద్రిప్పి రథంబు సారెకుం
గాంచుచు బోవుచు న్విశిఖఘాత భయంబున బూర్వ కాయము
న్వంచి సగంబు మేసిన తృణంబు శ్రమంబున నేల రాలగా
నించుక యుర్వి జాలదివి నేగెడు నందక గంతులేయుచున్ 8-15

[గ్రీవాభంగాభిరామం ముహురనుపతతి ....]

2. తే. పిన్న వస్తువు త్రుటిలోన బెద్దదిగను
దోచు వక్రంబు దిన్ననై తోచునట్లు
నికట దూరంబు లనిరూపణీయములగు
రథరయంబు కతమున సారధి వతంస 8-17

[యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసాతద్విపులతాం ...]

3. ఉ. అంతట గొంత నాశయము నారసి సూతుడు రశ్మిజాల మొ
క్కింత సడల్పసాగి చెవులింపుగ నిక్క ఖురోత్థధూళిక

త్యంత మలంఘనీయములు నై మృగవేగమునైప నట్టుల
క్రాంతగతిన్ హరుల్పఱవ సామియు విస్మయమొంది సూతుతోన్
3-18

[ముక్తేషు రశ్మిషు నిరాయత పూర్వకాయాః ...]

ఈ కావ్యము నందలి శైలి ప్రౌఢము కవి తన ఆంధ్రగీర్వాణ భాషా పాండిత్యమును కావ్యమునందంతట ప్రకటించుకొనెను. ఇందు వివిధ చ్ఛందము లుపయోగింపబడుటతోపాటు లాలిపాట, జోలపాట మున్నగునవి కూడ చొప్పింపబడినవి. కవి ప్రబంధ కవిత్వమునందు తనకు గల నేర్పును పెక్కు చోట్ల ప్రదర్శించెను. సర్వోత్కృష్టకందము, అచల జిహ్వోక్తి గీతము, దుష్కర ప్రాసకందము, రుగ్మవతీవృత్తము, ఘనమయూర వృత్తము, సుగంధి వృత్తము. పుష్పమాలికా బంధసీసము మున్నగు విశేషచ్ఛందములు, కంద గర్భిత చంపక మాల పుష్పగుచ్ఛ బంధ విద్యున్మాలాగర్భమణిగణ నికరము, మత్తేభ మణి గణ నికర వృత్తద్వయ సీసము మున్నగు వృత్తముల ప్రయోగము కవి వైదు ష్యమును సూచించును. ఇందు నారద మహర్షి దుష్యంతుని సభకు విచ్చేసిన సందర్భమునను కొన్ని ఆశ్వాసాంత పద్యములందును అశరీరవాణి శకుంతలా పాతివ్రత్యమును సభయందు వెల్లడించి నప్పుడును సంస్కృతభాష ప్రయుక్త మైనది.

శృంగార మహాప్రబంధము అని పేర్కొనబడిన ఈ కావ్యమున శృంగార రసవిస్ఫూర్తి కన్పట్టును. ఆయోగ శృంగారమంతయు నాయికా పరముగనే నిర్వహింపబడినది. ఇక ప్రబంధానుగుణముగ ప్రవేశపెట్టబడిన వర్ణనములలో స్వాభావికత లోపించినది. కథయందు వైఖానసుడు రాజుతో కణ్వుడు సోమ తీర్థమున కేగినాడనియు, శకుంతల రాజుతో మహర్షి సమిదాహరణార్థము కాన కేగినాడని యు చెప్పుట పరస్పర విరుద్ధముగా కన్పట్టును. శకుంతల రాజుసభలో గావించిన హరిస్తుతి కవియొక్క వైష్ణవ భక్తితత్పరతను సూచించును.

పిండిప్రోలు లక్ష్మణకవి, వెద్దాద నాగయామాత్యుడు, రేవణూరి వేంకటా ర్యుడు కూడ శాకుంతల కథను శకుంతలా పరిణయమను పేర కావ్యములుగా రచించి యుండిరి. కాని ఎందఱెన్ని వ్రాసినను శాకుంతల కథకు పినవీరన కల్పించిన రామణీయకము మఱెవ్వరును కల్గింపలేదనుట అతిశయోక్తి కాదు.

ఉపయుక్త గ్రంథ నిర్దేశము :


1. A. B Keith, Sanskrit Drama. Page 143.
2. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము, పుట 624, గడియారము రామకృష్ణశర్మ.
3. మల్లాది సూర్యనారాయణశాస్త్రి, సంస్కృత వాఙ్మయ చరిత్ర, పుట 372.
4. M. R. Kale, Abhignana Sakunthala of Kalidasa, introduction, P. 10.
5. — do —
6. కొమర్రాజు లక్ష్మణరావు, విజ్ఞాన సర్వస్వము, సం 3, పుట 1248.
7. వేదం వేంకటరాయశాస్త్రి, ఆంధ్ర సాహిత్య దర్పణము, పుట 134.
8. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము, సం. 3, కొమర్రాజు లక్ష్మణరావు, పుట 1246.
9. చాగంటి శేషయ్య, ఆంధ్రకవి తరంగిణి, సం. 6, పుట 47.
10. టేకుమళ్ళ అచ్యుతరావు, విజయనగర సామ్రాజ్యము నందలి ఆంధ్ర వాఙ్మయ చరిత్రము, సంపుటి 1, పుట 163
11. 1-20.
12. ఆశ్వాసాంత గద్య.
13. 1—21.
14. అవతార దర్పణమునకు నవరస దర్పణము అని పాఠాంతరము కలదు.
15. చాగంటి శేషయ్య, ఆంధ్రకవి తరంగిణి, సంపుటి 6.
16. శృం. శా. 1—5.
17. నాయని కృష్ణకుమారి, శృం. శా. పీఠిక, పుట 24.
18. పి. పినవీరభద్ర కవి, సారస్వత వ్యాసములు, టేకుమళ్ళ, పుట 161.
19. ఆ. విశ్వనాథ సత్యనారాయణ, విజ్ఞాన సర్వస్వము, కాళిదాసు పుట 626, సంపుటి 6.
20. డా. యస్. వి. జోగరావు, శారదామంజీరము, పుట 159.
21. టేకుమళ్ళ అచ్యుతరావు, పిల్లలమర్రి పినవీరభద్రుడు, సారస్వత వ్యాసములు, పుట 165, 166.
22. శాకుంతల కావ్యావతారికలో వెన్నయామాత్యుడు పినవీరన కవితా ప్రాశస్త్యము నుగ్గడించుచు చెప్పిన కొన్ని పద్యములలో 'ఆరంభము నందున్న' నన్నపార్యుని ప్రబంధ ప్రౌఢ వాసనా సంపత్తి సొంపు పుట్టింప నేర్చు' అనుదానిలో శ్రీనాథ ప్రశంస కలదు. ఈ పద్యము

ప్రక్షిప్తమని కొందఱు విమర్శకుల యభిప్రాయ పడుచున్నారు. వారిట్లను టకు ఈ పద్యమునందు ఎగుడు దిగుడు కనవచ్చు చున్నదనియు, అర్థ స్ఫూర్తి స్పష్టముగా లేదనియు, ఈ పద్యమును తీసివేసి కృతిభర్త పిన వీరనను కావ్యము రచింపుమని అడిగిన ఘట్టము చదివినచో అన్వయము చెడకుండుటయే కాక అతికినట్లుండుననియు కారణములను తెల్పిరి. డా. నాయని కృష్ణకుమారి పీఠిక పుట 20, 21.

23. నాయని కృష్ణకుమారి, శృ. శా. పీఠిక పుట 19.

24. గుంటూరు శేషేంద్రశర్మ, సాహిత్యకౌముది, పుట 66, 67 వ్యాసము- రెండవ కవిత్రయము.

25. తే. భారత ప్రోక్త కథ మూలకారణముగఁ
గాళిదాసుని నాటక క్రమము కొంత
తావకోక్తికి నభినవ శ్రీవహింప
గూర్చి కృతి సేయు నాకు శాకుంతలంబు 1-27

26. డా. యస్. వి. జోగారావు, శారదాపీఠము, శారదా మంజీరము, పుట 171.

27. విద్వాన్ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, శృ.శా. వాచవి, పుట 29.

28. డా. జి. వి. సుబ్రహ్మణ్యము, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు పీఠిక, పుట 87.

29. బేకుమళ్ళ అచ్యుతరావు, సారస్వత వ్యాసములు – పిల్లలమఱ్ఱి పినవీర భద్రకవి, శృంగార శాకుంతలము, పుట 167.

30. డా. జి. వి సుబ్రహ్మణ్యము, పి. పి. వీ. పుట 107.

31. కావ్యాలంకార సంగ్రహము. వివరణ కర్త, సన్నిధానము సూర్యనారా యణశాస్త్రి. పుట 394.

32. డా. జి.వి. సుబ్రహ్మణ్యం, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, పుట 113.

33. గుంటూరు శేషేంద్రశర్మ, సాహిత్య కౌముది, రెండవ కవిత్రయము, పుట 66.

34. బేకుమళ్ళ అచ్యుతరావు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి, శృంగార శాకుం తలము, సారస్వత వ్యాసములు, సంపుటి 1, పుట 168.

35. డా. జి.వి. సుబ్రహ్మణ్యము, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, పుట 149- 155.

36. గుంటూరు శేషేంద్ర శర్మ, సాహిత్య కౌముది.

# 4. ప్రబోధ చంద్రోదయము

[సంస్కృత మూలము – కృష్ణమిశ్రుని
ప్రబోధ చంద్రోదయము]


1. ప్రబోధ చంద్రోదయము, చింతామణి ముద్రాక్షరశాల 1900..
2. Prabodha chandrodaya – Rama chandra Misra, Prakasa sanskrit Hindi commentaries, Chowkamba – 1968.
3. Prabodha chandrodayam, with Chandrika, prakashakhya vyakhyas – 1924, Nirnaya Sagar Press.
4. Prabodha chandrodaya, Dr. Sita Krishna Nambiar, Motilal Banarsidasa – 1971.
5. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము. మతములు – దర్శనములు, సంపుటి 7,
6. Know thyself – C.E. Mudi Raj, Aurora Printers – 1969.
7. వడ్డాది సుబ్బారాయుడు, ప్ర. చం ఆంధ్రీకరణము.
8. గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి, ప. చం. ఆంధ్రీకరణము.
9. P. V. Parabrahma Sastri – అద్వైత కావ్యములు, Thesis.
10. Indian Philosophy -- బులుసు వేంకటేశ్వర్లు.
11. ఆరుద్ర – సమగ్రాంధ్ర సాహిత్యం, సంపుటి 6, 1965.
12. ఆంధ్రకవి తరంగిణి – చాగంటి శేషయ్య, సంపుటి 6.
13. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము, సంపుటి 2, కొమర్రాజు వేంకట లక్ష్మణరావు.


**సంస్కృతకవి - కాలాదులు :**

ప్రబోధ చంద్రోదయమను అద్వైత వేదాంతార్థ బోధకమగు నాటకమును రచించినవాడు కృష్ణమిశ్రుడు. ఈతడు బ్రహ్మవేత్త, యోగిసత్తముడు, మిథిలా

నగరవాసి. ఇతడు హంసాద్వైత మతమునకు చెందినవాడు. ఇతనికి పలువురు శిష్యులుండిరి.[1] ఈతని శిష్యులలో నొకడు వేదాంతార్థ పఠన పరాఙ్ముఖుడును, నాటకాది కావ్యాభ్యసనాభిలాషియునై యుండెనట. వానికి రుచిరమగు విధమున జ్ఞానోపదేశము గావించుటకై కృష్ణమిశ్రుడీ నాటకమును రచించెనందురు.

"రాజైన కీర్తివర్మకు కృష్ణమిశ్రు డెన్నివిధముల నద్వైత మతము బోధించినను ఆతని మదికెక్కలేదు. అప్పుడు కామక్రోధాదులగు దుర్గుణములను, మతి వివేకాదులగు సద్గుణములను పాత్రలను చేసి జ్ఞానాజ్ఞానములకు యుద్ధము కల్పించి నాటకముగా రచించి దానిని ప్రదర్శింపజేసి కీర్తివర్మ కద్వైతమునం దభిరుచి కల్గించె" నని కొందఱు చెప్పుచున్నారు.[2]

కృష్ణమిశ్రుని కాలము నెఱుంగుటకు, ఆతని నాటకము నందలి ప్రస్తావన ఆధార భూతమగుచున్నది. గోపాలుడనువాని ఆనతిచే ఈ నాటకము కీర్తివర్మ మహారాజ సమ్ముఖమున ప్రయోగింపబడినట్లు ప్రస్తావన తెల్పుచున్నది. గోపాలుడు కీర్తివర్మకడ పైత్యాధ్యక్షుడై యుండునని విమర్శకుల అభిప్రాయము. ఈతడు అద్వితీయ విక్రముడై శత్రుపక్షము నోడించి కీర్తివర్మ కఖండ యశస్సు సమకూర్చెను. చేదిరాజగు కర్ణుడు నిర్జింపబడిన శుభసందర్భమున ఈ నాటకము ప్రయుక్తమైనది. కీర్తివర్మ మహారాజు చరిత్ర ప్రసిద్ధుడు. ఆతని గూర్చి, ఆతడోడించిన కర్ణుని గూర్చియు లభించు శాసనాధారములను బట్టి శ్రీ కృష్ణమిశ్రుడు క్రీ.శ. 1063 - 1098 నడుమ నుండిన వాడని నిశ్చయింప వచ్చును.

నాటక కథ :

ప్రథమాంకము - ఈశ్వరునకు మాయా సంగమము వలన మనస్సనెడు కుమారు డుద్భవించెను. ఇతడు నిఖిలలోక కర్త. ఈతనికి ప్రవృత్తి, నివృత్తి యను నిరువురు భార్యలు గలరు. వారిలో ప్రవృత్తి వలన మహామోహ ప్రధానమగు నొక కులమును, నివృత్తివలన వివేక ప్రధానమగు నొక కులమును కలిగెను. మనస్సు మోహాదులఎడ అధికానురాగము కలిగి వర్తించుటచే వారు విజృంభించి వివేకాదుల నోడించి తామే సర్వజగము నాక్రమించిరి. వివేకుడు అజ్ఞాతవాసము గడుపుచు శత్రు వినాశమొనరింప దగిన సమయమునకై నిరీక్షించుచుండెను.

వివేకునకు ఉపనిషత్కాంత వలన విద్యయను కన్య, ప్రబోధోదయుడను సోదరునితో కలసి పుట్టి, తల్లిదండ్రులాదిగా గల సర్వ వంశమును నశింపజేయ గలదని ప్రజాపతి వాక్కు. వివేకున కుపనిషత్సంగమము ఘటింప జేయుటకై శమదమాదులు ప్రయత్నించిరి. వారి ప్రయత్నములను మోహుడు విఘటింప నెంచెను.

మనసు అహంకారానువర్తియై వంశకర్తయగు ఈశ్వరుని ఛేదింపరాని పాశములతో బంధించెను. మోహాదులా బంధమును దృఢ మొనరించిరి. ఈశ్వరు డిట్టి దయనీయమగు నవస్థకలోనగుటకు మాయయే కారణము. ఆమె కపట వర్తినియై విషయరస విముఖుడగు పురుషుని స్థానమున తన కుమారుడగు మనసును ప్రతిష్ఠింప దలచినది. మనసు కూడ తల్లి యభిప్రాయము నెఱింగి, నవ ద్వారములుగల పురము నొకదానిని నిర్మించి పెక్కు రూపముల తానందు వసించి తానే ఈశ్వరుడైనట్లు ప్రవర్తింపసాగెను.

వివేకుడు తమ వంశకర్తకు కలిగిన దురవస్థకెంతయో చింతించి ప్రబోధోదయముచే శత్రుపక్షమును నశింపజేసి, పురుషుని కాపాడుటకై బద్ధకంకణు డాయెను. అతడు తన భార్యయగు మతిని, స్వల్పకాలము విషయేచ్ఛాదూర వర్తినియై మెలగ వలసినదని బోధించి, తాను ఉపనిషద్దేవితో గూడుటకు ఆమె అనుమతి వడసెను. తరువాత శాంత్యాదులను బిలిచి ఉపనిషద్దేవిని తోడ్కొని రండని యాదేశించెను.

## ద్వితీయాంకము :

ప్రబోధోదయము నాశించి, ప్రార్థనాదికములు జరుపుటకు శమదమాదులు పుణ్యతీర్థముల వెంట జనిరి. వారి యత్నములకు విఘ్నములు గావించి, వర్ణాశ్రమ ధర్మముల నన్నింటిని భంగ మొనర్పవలసినదిగా, మోహుడు తన హితుడగు దంభుని పరమ పవిత్ర క్షేత్రమగు కాశికి పంపెను. దంభుడట కేగి వాస మొనర్చుచు తన ప్రభావమునకు వశీభూతమైన యా నగరమును గాంచి సంతసించెను. దక్షిణ రాఢాదేశము నుండి అట కేతెంచిన అహంకారుడు, దంభుని గలసెను. మహామోహునకు వివేకుని వలన రాబోవు నుపద్రవమును నివారింప తాను కాశి కేతెంచినట్లు అహంకారుడు దంభునకు దెలిపెను. మోహుడు వివేకుని జయించి, ఇంద్రలోకమందుండి, నాడో, మఱునాడో కాశి కేతేరగలడని చెప్పెను.

కాశీనగరము విశ్వేశ్వరుని నిలయము, ఆ నగరమునందలి మూఢులకైనను ఈశ్వరు డంతమున తారకోపదేశమును గావించును, కాన మోహుని కట జయ మశక్యమని అహంకారుడు చెప్పగా, కామక్రోధాదులు అతనికి జయముగూర్ప సమర్థులని దంభుడు పలికెను.

మోహుడు కాశీనగరమున కేతెంచి ఆస్తికులు మూఢులగు జనులను తమ యుక్తులచే నాకట్టు కొనుచున్నారని వారిని నిరసించి ప్రత్యక్షమే ప్రమాణ మనెను. అతడు కర్ణసుభగములై వినవచ్చెడు చార్వాకుని సూక్తులు విని సంత సించెను. అంత చార్వాకుడు ఆతని కడ కేతెంచి "మోహుని భృత్యుడగు కలి ప్రభావమున ఉత్తరాపథము నందలి వారు వేదముల నామమును సైతము మఱ చిరి. ఇతర స్థలముల వేదస్మరణము పొట్టకూటికి మాత్రమే యుపయోగపడునది కాని శాంత్యాదులకు దోహదకారి కాజాలదు. కనుక విద్యా ప్రబోధ చంద్రుల ఉదయము కల్ల" యని తెల్పెను. మోహు డానందించెను. కాని చార్వాకుడు తెలి పిన విష్ణుభక్తియను యోగిని మాహాత్మ్యము మోహుని కలవరపఱిచెను. పగతు రల్పులయ్యును, వారి నుపేక్షింప దగదని ఎంచి అతడు తన హితులగు కామ క్రోధాదులను బిలిచి, విష్ణుభక్తిని వధింపుడని ఆజ్ఞాపించెను.

పురుషోత్తమ దేవాలయమునుండి మదమానులు మోహునికొక జాబు వ్రాసి యంపిరి. 'తల్లియు, కూతురునైన శాంతిశ్రద్ధలు, వివేకునికి ఉపనిషద్దేవితో సాంగత్య మొదవింప ఆమె కడకు దౌత్యము చేయనేగిరి. ధర్ముడు వైరాగ్యాదు లతో గలసెను.' అనునది అందలి సారాంశము. ఆ లేఖ చూచి మోహుడు మిక్కిలి కోపించి ధర్ము నణంచుటకై, కాముని, శాంతిని గొట్టుటకై క్రోధ లోభులను నియోగించెను. క్రోధలోభులు తమ భార్యలగు హింసా తృష్ణలతో గలసి మోహునికి కార్య సాఫల్యము నవలీలగ గూర్తుమనిరి. శాంతి శ్రద్ధయం దపారమగు ప్రేమ గలది. కావున శ్రద్ధను చెఱపట్టినచో మాతృవియోగమునకు తాళజాలక శాంతి చచ్చునని తలంచి మోహుడు శ్రద్ధను చెఱపట్ట నూహించెను. అందుకతడు మిథ్యాదృష్టియను విలాసినియే సమర్థురాలని ఆలోచన చేసి మిథ్యా దృష్టిని తన యొద్దకు తోడ్కొని రమ్మని విభ్రమావతి నంపెను. పిదప తనకడ కేతించిన మిథ్యాదృష్టిని లాలించి, శ్రద్ధను బట్టి పాషండుల కప్పగింప వలసి నదిగా నాదేశించెను.

తృతీయాంకము :

మిథ్యాదృష్టి మోహుని ఆదేశానువర్తినియై, శ్రద్ధను వశపఱచుకొని దానిని పాషండుల కొప్పగించెను. శాంతి తల్లి వియోగమున కోర్వక విలపింప సాగెను. ఆమెను సఖియగు కరుణ ఓదార్చుచు, శ్రద్ధను వెదకుటకు రమ్మనెను. వారిరువురును పుణ్యతీర్థముల యందును యజ్వల గృహములందును, నాల్గాశ్రమములలోను శ్రద్ధ జాడ కనుగొనజాలక తుదకు పాషండ గృహములలో వెదక నిశ్చయించిరి. వారికి మార్గమున దిగంబర సిద్ధాంతి ఎదురాయెను. వారతడు మహామోహుని భృత్యుడని ఎఱింగిరి. వానివలన శ్రద్ధావార్త ఏమైన తెలియ గలదని, చాటునుండి వాని ఆలాపములను వినిరి. ఆతడు తనయొద్ద గల తామసీ శ్రద్ధనూహించి శ్రద్ధాయని పిలిచి, ఆమెను సదా శ్రావక సంఘము నావహించి యుండవలయునని నియోగించెను. ఆ శ్రద్ధ తన తల్లికాదని శాంతి ఎఱింగెను. పిదప వారు బౌద్ధుని యొద్దగూడ తామసీ శ్రద్ధయే యున్నదని ఎఱింగిరి. జైన, బౌద్ధ సిద్ధాంతులు తమతమ మతముల ప్రాశస్త్యము నుగ్గడించుకొనుచు వాదోపవాదములు జరుపుచుండ, వారికడకు సోమసిద్ధాంతి యొక డేతెంచెను. వానియొద్ద రాజస శ్రద్ధ గలదు. దాని ఆలింగనమున జైన, బౌద్ధ సిద్ధాంతులు మైమఱచిరి. కాపాలికుడు వారిచే సురాపానము చేయించెను. కాపాలికుని మహత్త్వమునకు భ్రమసిన వారిరువురును అతనిని తమ గురువుగ నెన్నుకొనిరి. పిదప వారు మువ్వురును తామేక కార్యార్థులైన మోహుని భృత్యులని యెఱింగిరి. మోహుని ఆదేశానుసారము సత్త్వతనూజ యగు శ్రద్ధ నపహరించుటకు తగు నుపాయము నన్వేషించుచు, ఆ శ్రద్ధ విష్ణుభక్తి సహితయై మహాత్ముల హృదయములందున్నదని గ్రహించిరి. కాము నెడబాసిన ధర్ముడు కూడ అటనే యుండుట ఎఱిగి వారు ధర్ముని, శ్రద్ధనుబట్టి తెచ్చుటకు మహాభైరవిని నియోగింప నెంచిరి. ఈ విషయమును విష్ణుభక్తి కెఱింగిలప శాంతి కరుణలు ఆమె కడ కేగిరి.

చతుర్థాంకము :

క్రూర సత్త్వయగు మహాభైరవి డేగవలె మీది కెగిరి, ధర్ముని ఒక చేతను, శ్రద్ధ నింకొక చేతనుబట్టి ఆకాశ మార్గమున కెగసెను. ఆమెకు విష్ణుభక్తి అడ్డు నిలువగా, ఆమె ధాక కోర్వక భైరవి శ్రద్ధాధర్ములను విడిచి నేలకొఱగెను. మోహుని కుతంత్రము నెఱింగిన విష్ణుభక్తి అతనిపై మిక్కిలి

కోపించి, ప్రబోధోదయముకై తీవ్రమగు కృషి చేయవలసినదిగా, వివేకునకు శ్రద్ధా ద్వారమున నొక సందేశము నంపెను. వివేకుడు కామక్రోధాదులను జయించిన వైరాగ్య ముదయించుననియు, తగిన సమయము చూచి యమ నియమాదులను గూడి విష్ణుభక్తి వివేకునికి సహకరింప గలదనియు, ఋతంభరాదులు సయితము శాంత్యాదుల ప్రయత్నముచే ఉపనిషత్తును చేరిన వివేకుని యందు ప్రబోధోదయమును కలిగింప యత్నింతురనియు నందలి సారాంశము.

తాను దలంచిన కార్యమునకు దైవ సాహాయ్యము లభించినందులకు వివేకుడు సంతసించెను. అతడు మోహుని దుశ్చేష్టితములకు వగచెను. అతడు కాము నణంచుటకు వస్తువిచారుని, క్రోధుని నిర్జించుటకు క్షమను, లోభు నెదిరించుటకు సంతోషుని నియమించి, శత్రు పక్షమును మార్కొనుటకు తగిన సైన్యమును సమాయత్తము గావించెను. ఒక శుభముహూర్తమున నతడు తేరెక్కి రణమునకై చంద్ర తీర్థమునుండి కనురెప్పపాటులో వారణాసి చేరెను. అతడు తమ రాకవలన కామాదులు కలవరపడుట యెఱింగెను. పిదప అచటి ఆదికేశవాలయమును ప్రవేశించి అందున్న స్వామిని స్తుతించి ఆ గుడి గర్భమండపమున తన సేనతో విడిసెను.

## పంచమాంకము :

వివేక మోహుల సంగ్రామమును చూడజాలని విష్ణుభక్తి ఆ సమయమున సాలగ్రామ తీర్థమున వసింప నేగుచు, సంగ్రామ వార్తలను తనకు వినిపింపవలసినదిగా శ్రద్ధ నాదేశించెను. వివేకునికి విజయము సిద్ధించిన పిమ్మట శ్రద్ధ విష్ణుభక్తి కడకేగి వివేక మోహాదుల యుద్ధమును గూర్చి యిట్లు చెప్పెను.

"ఉభయ పక్షములును పౌలికలన నిలిచినవుడు, వివేకుడు, మోహుని తత్పరివారముతో గూడ కాశీ పట్టణము వీడిపోవలసినదని నైయాయికునిచే రాయబారము పంపెను. మోహుడు కోపించి పాషండాగమములను వివేకునిపై కంపెను. అంత సరస్వతి వేద పురాణేతిహాస, శైవ, వైష్ణవ సౌరాగమములను గూడి వివేకుని కడ నిలిచెను. సరస్వతి ఎదుట మీమాంస సాంఖ్య న్యాయ కణాదులతో ప్రత్యక్షమైనది. పిదప నిరుపక్షములకును హోరాహోరిగ పోరాటము జరిగెను. సదాగమముల ధాటి కాగజాలక పాషండాగమములు మ్లేచ్ఛ దేశముల

నాశ్రయించెను. మీమాంస నాస్తిక తర్కాదుల నణచెను. కామ క్రోధ లోభాదులు ప్రతిపక్షము వారిచే నిహతులైరి. మోహు డెటకో పాఱిపోయెను". శ్రద్ధ చెప్పిన విషయములు విని, ఇంకను శత్రుశేషము మిగిలి యున్నందుకు విష్ణుభక్తి చింతించెను.

మనసు పుత్రశోక మగ్నుడై మిగుల దుఃఖించుచున్నాడని శ్రద్ధవలన వినిన విష్ణుభక్తి, ఆతనియందు వైరాగ్య ముదయింప జేయ వేదాంత సరస్వతి నంపెను. మనసు తన భార్యయగు ప్రవృత్తి కూడ మరణించుట యెఱింగి మిగుల చింతాభరమున పొక్కుచు, అగ్నియందు బడుటకై నిశ్చయించుకొనెను. ఆతని దఱిజేరిన సరస్వతి, అతని మనము తేఱుకొనున ట్లుపదేశము గావించెను. ఆమె అతనికి మోహమే సర్వానర్థ కారణమనియు, చింతనమే మోహ జాడ్యమును నివారించు పరమౌషధ మనియు తెలిపి బ్రహ్మానంద సాధనములను వివరించెను. ఆమె వాక్యములతో మనసు నిర్మలత్వము నొందెను అంత వైరాగ్యుడేతెంచును. కుమారుని బహుకాలమునకు గని మనసు సంతసమందెను. వైరాగ్యుడాతనికి సంసార భ్రాంతి వివరించి ఆతని మోహమును ఛేదించెను.

సరస్వతి మనసుతో, ఆతడు గృహస్థాశ్రమమును వీడరాదనియు, నివృత్తి గృహిణిగను, ఉపనిషత్సహితుడగు వివేకుడు యువరాజుగను ఉండగా యమనియమాదులగు అమాత్యు లతని సేవింప, విష్ణుభక్తిచే పంపబడిన మైత్రి మున్నగు నలుగురు తోబుట్టువులకు కనుల పండువుగా రాజ్యము చేయవలెననియు, అతడట్లు స్వాస్థ్యము నొందిన క్షేత్రజుడును ప్రకృతిని పొందుననియు చెప్పెను.

షష్ఠాంకము :

మనః ప్రశమనము నొంది, పంచక్లేశములను తరించిన పురుషుడు తత్త్వవిబోధ మహోదయమును గోరెను. ఆతడు వివేక సంగమము నాశించెను. పురుషుని అభ్యుదయము కడనుంచి వివేకుడు, తా నుపనిషత్సహితముగ ఆతనిని జేర నెంచెను. ఇక పురుషుడు మాయ అనర్థ కారణమని ఎఱింగి దానిని మూలముట్టుగ దునుమాడ నెంచెను. అతడు నిష్కామములగు సుకృత కర్మముల నవలంబించెను. అతడు నిత్యానిత్య చింతయను సతితో, వైరాగ్యుని స్నేహముతో, యమాదులగు ఆప్తమిత్రగణముతో శమ ప్రాయు లుత్తమ సహాయులై యుండగా,

మైత్రి మున్నగు చెలుల సేవలతో, మోక్షేచ్ఛ సహచరి కాగా, సుఖముననుండెను. స్వామి యొక్క ప్రత్యక్షప్రీవణత్వమును చూచి ధర్ముడు తాను కృతార్థుడనైతి నని తలపోసెను.

ఇక యుద్ధమున పలాయితుడైన మోహుడు జీవపురుషు డుపసర్గ సక్తుడైనచో, వివేకుడు ఉపనిషచ్చింతనమును బాయుసని తలంచి, మధుమతి యను విద్యతో కూడ నుపసర్గములను పురుషుని యొద్ద కంపెను. వాని బారినుండి జీవుని ఆతని సమీపవర్తిని యగు తర్కుడు రక్షించెను. జీవుడు విష్ణుభక్తి మాహాత్మ్యమున తాను సర్వవిధముల కృతకృత్యుడ నైతినని తలంచెను. వివేకుడు తన పుత్రుడయ్యును అవిద్యామయుడైన తన్ను మేల్కొలుపుటచే ఆతడు తనకు గురు సమాను డయ్యెనని పలికెను.

వివేకుడు తన్నింత కాలమెడ బాసినందులకు ఉపనిషత్కాంత అతనిపై కినుక పూనెను. ఈ ఎడబాటు ప్రబోధోదయమును సహింపజాలని కొందఱు మూర్ఖు లొనరించిన దుష్కార్యముల వలన సంభవించినదే కాని, ఇందు వివేకుని దోషమేమియు లేదని శాంతి ఆమెకు నచ్చచెప్పెను. శాంతి ఉపనిషద్దేవిని, వివేకునితో గూడియున్న పురుషుని సన్నిధికి కొనిపోయెను. ఆమెను గాంచి పురుషుడు ఆదరమున స్వాగతమిచ్చి, ఆమె ఇంతకాల మెచట, ఏ రీతికాలము గడపినదో తెలుప వలసినదని ప్రార్థించెను.

అంత ఉపనిషత్తు జీవునికి సమాధాన మొసంగుచు వివేకు నెడబాసిన తానాశ్రయమును గోరి అటు నిటు తిరుగుచు. యజ్ఞ మీమాంసా, తర్క విద్యాదులను జేర. వారందఱు తన మతము నంగీకరింపక తన్ను తఱిమి వేసిరనియు, తాను వారినుండి తప్పించుకొని దండకారణ్యము వెంట బరువెత్తుచుండ, అచటి మధుసూదనాలయము నుండి వచ్చిన హరిభృత్యులు తర్కాదులను దన్ని దఱిమిరనియు, అంత గీతాకన్యవచ్చి తన్నమ్మా యనుచు గారవమున కౌగిలించుకొని యూఱడించెననియు తెల్పెను.

పురుషుడు ఉపనిషద్దేవి వలన తానే పరమాత్మయైనట్లు తెలిసికొనెను. ఒక సూర్యుడే నీట ప్రతిబింబించి రెండుగా తోచు విధమున, మాయ వలన నాతడు రెండు తెరగులై గోచరించెననియు, పరమాత్మకును అతనికిని నిజమునకు భేదము లేదనియు వివరించెను. వివేకుడుగూడ పురుషునికి తత్త్వమసీత్యాది వాక్యార్థమును దెలిపి పరమాత్మ తత్త్వమును బోధించెను. ఈ వాక్యములు తల

పోయుచు పురుషుడుండగా, నిధి ధ్యానము ప్రవేశించి, రహస్యముగ నుపనిష త్తును బిలిచి "నీవు వివేకునికి సమీపవర్తిని వైతివి. నీ గర్భమున విద్యయను కన్యయు ప్రబోధ చంద్రుడను పురుషుడను గలరు. విద్యను మనసునకు సంక్ర మింప చేసి, ప్రబోధ చంద్రుని స్వామి యందుంచి వివేకునితో కలసి, తన కడకు రావలసినదిగా" విష్ణుభక్తి ఆదేశమని ఆమెకు తెలిపెను.

పురుషుడు ధ్యానమున నుండ విద్య పుట్టి మోహుని చంపెను. ప్రబోధ చంద్రుడు, సకల సంశయ విచ్ఛేదకారి యగుచు నేతెంచి పురుషునికి మ్రొక్కెను. శాంతిశ్రద్ధాదులను జీవుడు 'మీ మీ యింద్ల మునివృత్తి నుండి సుఖింపు' దని పంపెను. అతడు విష్ణుభక్తిని గాంచి యెంతయో కొనియాడి ఆమె ఆశీస్సులను బడసెను. వివేకుడు శత్రు నిశ్శేష మొనరింప జీవుడు సదానంద పదవి నొంది భాసించెను.

ప్రబోధ చంద్రోదయ కావ్యమందలి కథ నాటక కథనే యనుసరించు చున్నది.

## ప్రబోధ చంద్రోదయము - నామౌచిత్యము :

ఈ నామము మిక్కిలి అన్వర్థము. ప్రబోధమనగా జ్ఞానము. చంద్రోదయ మనగా చంద్రుడు పొడసుట. మొత్తము మీద దీని యర్థమును జ్ఞానమనెడు చందమామ పొడముట నధికరించి రచింపబడిన నాటకమని చెప్పనగును. సంస్కృతమున దీని వ్యుత్పత్తి 'ప్రబోధ ఏవ చంద్రః ప్రబోధ చంద్రః-తస్య ఉదయః ప్రబోధ చంద్రోదయః, తమధి కృత్య కృతం నాటకమ్' అని చెప్ప బడినది. ప్రబోధమను పదమును కొందఱాంగ్ల పండితు లనువదించుచు Knowl-edge [4] అనియు True Knowledge [5] అనియు Spiritual awakaning అనియు అనువదించిరి. దీనికి 'పరమాత్మ జ్ఞాన రూపము గు మెలకువ' అను నర్థము కూడ చెప్పుకొనవచ్చును. ఈ ప్రబోధము స్వస్వరూపము నెఱింగించు నది. ఈ కావ్యము నందలి కథ అంతయు పేరులోనే ఇమిడి యున్నది. అనిత్య మగు నీ సంసారమునే సత్యమని ఎంచి మనోవిజృంభణమునకులోనై, అవిద్యా మయమైన నిద్రయందు మునిగిన పురుషుడు, అందుండి మేల్కాంచి, సచ్చిదా నంద రూపమే తానని గ్రహించుట ప్రబోధము. అట్టి ప్రబోధము శీతాంశు కిరణ ములవలె మిగుల చల్లనైనది. సంతాపహారి కనుకనే దీనికి చంద్రసామ్యము

చెప్పబడినది. ఈ జ్ఞానము వలన జీవుడు శాంతాకారుడై స్వచ్ఛుడై వెలుగును. ఇట్లే నామము కావ్యప్రధాన రసమగు శాంతమును గూడ సూచించుచు మిగుల నుచితమై ఒప్పుచున్నది.

**సాంకేతిక నాటకము :**

ప్రబోధ చంద్రోదయ మొక సాంకేతిక నాటకము. సాంకేతిక నాటకమును అన్యాపదేశ నాటకమని కూడ పేర్కొందురు. ఇట్టిది ఒకానొక ప్రధాన ప్రయోజనము నుద్దేశించి వ్రాయబడును. ఇందొక అంతరార్థ ముండును. సాధారణ నాటకములందు వలె ఈ నాటకమున, సజీవ వ్యక్తులును, వారి వర్తనములును గాక, కొన్ని భావములు, గుణములు, సిద్ధాంతములు మొదలగు వాని ప్రతీకలు పాత్రలుగా ప్రవేశ పెట్టబడును.[6] ఈ భావాదులకు గలిగిన సంఘర్షణ ఉత్తమ నీతి ఫలపర్యవసాయి యగును. సాంకేతిక నాటకమును గూర్చి శ్రీ కృష్ణమాచార్యులు గారిట్లు వ్రాసిరి.

"Personification of inanimate beings and personal qualities, or senses, shortly called allegory, is as old as vedic literature. The comparative superiority of the various organs and senses was often illustrated by diologues and action. Such for instance are the controversies between Vak (speech) and Manas (Mind) and prana and the five indriyas"7

ఇట్టి నాటకము నొకదానిని అశ్వఘోషుడను కవి క్రీ. శ. ప్రథమ శతాబ్దమున వ్రాసి యుండినట్లు తెలియుచున్నది. కాని అది సమగ్రముగ లేదు. కావున ఇట్టి నాటకములను మొదట సమగ్రముగా నిర్వహించినవాడు కృష్ణమిశ్రుడే యని చెప్పనగును. ఇట్లు ఒక నూతన కావ్య ప్రక్రియకు నాంది పలికిన సూత్రధారు డితడు. ఈ నాటకము నాదర్శముగా గొని మఱికొందరు కవులు కొన్ని రూపకములను రచించిరి. అట్టివానిలో వేదాంతదేశికుని సంకల్ప సూర్యోదయము, రత్నఖేట శ్రీనివాస దీక్షితుని భావనా పురుషోత్తమము, వరదాచార్యుని యతిరాజ విజయము [వేదాంత విలాసము], కవి కర్ణపూరుని చైతన్య సూర్యోదయము ఇత్యాదులు పేర్కొనదగినవి. వీనియన్నింటిలో ప్రబోధచంద్రోదయ మగ్రగణ్యము.

**నాటక పరిశీలనము :**

ప్రబోధ చంద్రోదయము ఆఱంకముల నాటకము. ఇందలి వస్తువు ప్రఖ్యాతము. దీనికి మూలము పురంజనోపాఖ్యానము. ఇది భాగవతము చతుర్థ

స్కంధమున 25. 26, 27, 28 అధ్యాయములలో నున్నది. ఇందలి రసము శాంతము. ఇందు నాటక నియమములన్నియు సమగ్రముగ నున్నవని చెప్పనగును. ప్రబోధ చంద్రోదయము, వస్తు రసాదుల యందును ఉపదేశ ప్రదానమునందును, తదితర సంస్కృత నాటకముల కంటె భిన్నమైనది. ఈ విలక్షణత్వమే సంస్కృత నాటక సాహిత్యమున దీనికొక ప్రత్యేక స్థానము కల్పించినది. సాధారణముగ కావ్యము లానంద ప్రధానములై, ఆనుషంగికముగ నుపదేశమును కూడ నొసంగును. కాని ఈ నాటకము ఆనందసహితమై యొప్పుచునే, ఉపదేశ ప్రధానమై యుండి హృదయాహ్లాది యగుచున్నది. ఈ ఉపదేశము బుద్ధిని హత్తించుకొనువాడు బ్రహ్మానంద స్వరూపుడై వెలుంగును.

జటిలమును దురవగాహమునైన వేదాంతార్థమును మనోజ్ఞమగు నాటక రూపమున ప్రవచించుటలో కృష్ణమిశ్రు డద్వితీయ రచనా సంవిధానము నవలంబించెను. విషయ నిరూపణము నందొక చక్కని క్రమమును బాటించెను. ఈతడవలంబించిన శైలి, వేదాంత సంకేతములను సజీవ పాత్రములుగా తీర్చిదిద్దిన నైపుణ్యము, అద్వైతమును కాంతాసమ్మితముగ బోధింపగల సామర్థ్యము ఈతని ప్రతిభా వైశిష్ట్యమును చాటుచున్నవి. ఈ కాంతా సమ్మితమగు ఉపదేశము విషయ శుష్కతను తొలగించి, కృష్ణమిశ్రుడు నాటక రచనమునం దాశించిన ఫలమును సిద్ధింప జేయుచున్నది.

కృష్ణమిశ్రుడు నాటక పాత్రలను చైతన్యవంతములుగా భాసింపజేయుటకై, వాని పరికల్పనమున కొక ప్రణాళిక సిద్ధము చేసెను. పురుషుని సన్మార్గమున నడిపించి, అతనిలో ప్రబోధమునకు తోడ్పడెడు, సుగుణములను, సచ్ఛాస్త్రములను, సన్మతములను, అతని నింద్రియ వశత్వమునకు లోనుగావించి మాయాంధకారమున బడవేయు దుర్గుణములను, దుశ్శాస్త్రములను, దుర్మతములను, దుష్కర్మములను, పరస్పర విరుద్ధములగు రెండు పక్షములుగ విభజించెను. వానిలో సుగుణాదులకు రాజు వివేకుడనియు, దుర్గుణాదులకు ప్రభువు మహామోహుడనియు చెప్పుట ఉచితముగా నున్నది. ఇక వాని గుణక్రియాదులకు గల పరస్పర సంబంధము ననుసరించి, ఆ యా పాత్రల కన్యోన్య సంబంధమును, చుట్టరికమును గల్పింపబడినవి. మాయా పరమేశ్వరుల సంగమము వలననే సృష్టి ఆరంభమగు చున్నది. వీరిరువురిని దంపతులుగ సృజించుట యెంతయో సమంజసముగా నున్నది. అట్లే మత్యుపనిషద్వివేకులయు, క్రోధ

హింసా, తృష్ణాలోభాదులయు దాంపత్యములు కూడ నుచితములుగ గల్పింప బడినవి. ఇక వివేక మోహాదులకు గల జ్ఞాతి వైరము సకారణముగా వివరింప బడినది. ఆ యా పక్షములందు గల స్వామిభృత్య భావములకు గూడ అన్వయము సార్థకమగుచున్నది ఈ పాత్రల స్త్రీ పురుషత్వములు, సంస్కృత విశేష్య శబ్దముల రూపసిద్ధి ననుసరించి వివక్షింపబడినవి.

వేదాంతార్థమును కావ్యానుకూలమగు కథగా రూపొందించుటకు కృష్ణ మిశ్రుడు మహాభారతేతిహాసము నాదర్శముగా గొనెను. వివేక మోహాదులు కురు పాండవుల వంటి వారు. వివేకుడు పాండవాగ్రజునివలె ధర్మపరుడు. మోహుడు దుర్యోధనుని వలె జ్ఞాతి విభవమునకు సహింపజాలని వాడు. వీరి జనకుడు మనస్సు, ధృతరాష్ట్రుడు కౌరవులపై ప్రీతి కలిగి వర్తించినట్లు, మహామోహాదులఎడ పక్షపాతము గలిగి యుండెను. చీకటి ఎంత దట్టమయ్యును దీప సన్నిధిని దాని సామర్థ్యము వ్యర్థమౌనట్లు, మహామోహుడెంత బలవంతుడయ్యును, స్వపక్షునగు కామక్రోధాదులతో వివేకున కోటువడెను. భారత కథనమున కృష్ణుడు పాండవుల కండదండయై, వారిని విజయ శోభితులను గావించినట్లు ఇందు విష్ణుభక్తి, వివేకాదులకు సహకరించి ఆద్యంతము వారికి బాసటయైనది, గీతా ప్రబోధము అర్జునునకు కర్తవ్యోపదేశము గావించినట్లు ఇందలి ఉపనిషద్విచారము, పురుషునిలో ప్రబోధోదయమునకు తోడ్పడి ఆనంద మార్గమును జూపెను.

ప్రబోధ చంద్రోదయ నాటకాంధ్రీ కర్తలగు నంది మల్లయ, ఘంట సింగన లిరువురును బంధువులు. నంది మల్లయకు ఘంట సింగన మేనల్లుడు. ఈ సింగనకు మలయమారుత కవి యను బిరుద నామముండెను. వీరు ప్రబోధ చంద్రోదయమునే కాక వరాహ పురాణమను మఱియొక కావ్యమును గూడ రచించిరి. ప్రబోధ చంద్రోదయము నందలి ఈ క్రింది పద్యమున తమ్ము గూర్చి కవులిట్లు చెప్పుకొనిరి.

సీ. కలరు కౌశిక గోత్ర కలశాంబు రాశి మం
దారంబు సంగీత నందినంది
సింగ మంత్రికి బుణ్యశీల పోచమ్మకు
నాత్మసంభవుడు మల్లయ మనీషి

యతని మేనల్లుడంచిత భరద్వాజ గోత్రా
　　రామ చైత్రోదయంబు ఘంట
నాగధీమణికి బుణ్యచరిత్ర యమ్మలాంబకు
　　గూర్మితనయుండు మలయమారు

తాహ్వయుడు సింగనార్యుడు సమ్మృత
వాక్కు లీశ్వరారాధకులు శాంతు లిల ప్రసిద్ధు
లుభయ భాషల నేర్పరు లుపమరులు సమ
ర్థులీ కృతిరాజ నిర్మాణమునకు　　1–2

సంగీత నంది యని ప్రసిద్ధి గాంచిన సింగ మంత్రికిని, పోచమ్మకును జనించిన వాడు మల్లయ మనీషి. వీరు కౌశిక గోత్రులు. ఘంట నాగధీమణికిని అమ్మలాంబకును జనించిన వాడు సింగనార్యుడు. వీరు భరద్వాజస గోత్రులు. ఈ జంట కవులు ఆపస్తంబ సూత్రులు. దక్షిణామూర్తి, అఘోర శివుల శిష్యులు. శివభక్తి తత్పరులు, శాంతచిత్తులు, ఉభయ భాషల యందును నేర్పరులు. వాగీశ్వరీ మంత్రసిద్ధి పారగులు. ఉపమరులు. ఘంట సింగనకు పారిజాతాపహరణ కావ్య కర్తయు, ముక్కు తిమ్మన యను ప్రసిద్ధి పడసినవాడు నగు నంది తిమ్మన మేనల్లుడు.

ఈ జంట కవులకు రాచమల్లు కవులనియు నామాంతరము గలదు. ఈ కవిద్వయము క్రీ.శ. 1480– 90 ప్రాంతముల వారు. వీరు తాము రచించిన ప్రబోధ చంద్రోదయమును పెసరువాయ గంగయామాత్యునకును, వరాహ పురాణమును శ్రీ కృష్ణదేవరాయల తండ్రి యగు తుళువ నరస నాయకునకు అంకిత మిచ్చిరి. వీరు ప్రథమమున ఉదయగిరి సంస్థానము నందు కవులై యుండి పిమ్మట విజయనగర రాజుల నాశ్రయించిరని తెలియుచున్నది.

ప్రబోధ చంద్రోదయ కృతిపతి యగు అనంతుని గంగయ పూసపాటి బసవరాజు కడ మంత్రిగా నుండెను. ఈ బసవరాజు క్రీ.శ. 1480 ప్రాంతమున గజపతులకు సామంతుడై ఉదయగిరి దుర్గము నేలుచుండెను. ఈ బసవ రాజునకు దూబగుంట నారాయణ కవి తన పంచతంత్రము నంకితము చేసెను. బసవరాజ, గంగయామాత్యులు పిల్లలమఱ్ఱి పినవీరభద్ర కవి జైమిని భారత కావ్య కర్తయగు సాళువ నరసింహ రాయనికి సమకాలికులు. ఈ సాళువ నర సింహ రాయని, పురుషోత్తమ గజపతి ఒకానొక యుద్ధమున ఓడించిన సందర్భ

మున, గంగయ మంత్రి తన నయవిద్యాకరణ నిపుణత్వము నెంతగనో చూపి యున్నట్లు కొందరు తెల్పియున్నారు.[9] వారిట్లనుటకీ క్రింది పద్యము నాధార భూతముగ గ్రహించిరి.

క. శ్రీకర వీక్షణ దాన
శ్రీవర నరసింహ నృప వశీకరనయవి
ద్యాకరణ చతుర్దశ వి
ద్యాకర ధీరంగమతి యనంతయగంగా ప్ర. చం. 2-1

ఈ గంగయ మంత్రి ప్రబోధ చంద్రోదయమునకే కాక, దగ్గుపల్లి దుగ్గన రచించిన నాచికేతూపాఖ్యానమునకు గూడ కృతిభర్త. ఈ విషయమును ప్రబోధ చంద్రోదయము నందలి

కం. ప్రఖ్యాత నాచికేతూ
పాఖ్యాన మహాప్రబంధ పరిమిళిత సుధీ
వ్యాఖ్యాన శ్రవణోదిత
సౌఖ్యా! సంఘటిత చిత్త ! శంకర సఖ్యా"

అను పద్యము తెలుపుచున్నది. ఈ అంశములను బట్టి దుగ్గన, నారాయణ కవి, పినవీరన ఈ జంట కవులు సమకాలికులని చెప్పవచ్చును.

వరాహ పురాణ కృతిభర్త యగు తుళువ నరసనాయకుడు, ఈ కృతి నందు నాటికి సాళువ నరసింహరాయల యొద్ద సర్వసైన్యాధ్యక్షుడై యుండెను.[10] ఈతడు దేవకీ పురవాసి. ఈ దేవకీపురము నేటి ఉత్తరార్కాట్ మండలమున, ఆరణి జిల్లాయందు గల దేవకాపురమను గ్రామముగ గుర్తింప బడినది. సాళువ నరసింహరాయలు క్రీ.శ. 1455 నుండి 1504 వరకు రాజ్యమేలెనని కొందఱందురు.[11] కాని ఈతనికి సంబంధించిన శాసనములు 1490 తరువాత లభింప కుండుటచే, ఆ నాటికి తుళువ నరసనాయకుడు సింహాసనము నధిష్ఠించి యుండు నని భావింపనగును. వరాహపురాణము క్రీ.శ. 1490 కి పూర్వమును 1485 తరువాతను రచింపబడి యుండునని విమర్శకుల యభిప్రాయము.[12]

**ఇతర కృతులు :**

ఈ జంటకవులు పై రెండు కావ్యములనే కాక, మఱికొన్ని కావ్యములను గూడ రచించినట్లు లక్షణ గ్రంథములు పేర్కొను చున్నవి. వీరు భాగవతము

నందలి షష్ఠ స్కంధమును తెనిగించినట్లు క్రీ.శ. 1560 ప్రాంతమందున్న ముద్ద రాజు రామన్న మొదలు క్రీ శ. 1740 ప్రాంతము నందలి కూచిమంచి తిమ్మ కవి వఱకు గల లక్షణ గ్రంథ కర్తలందఱు నుదాహరించిన పద్యములనుబట్టి తెలియనగును. ఈ షష్ఠస్కంధానువాదమునకు కవులు షష్ఠ మనియు, శృంగార షష్ఠమనియు, రాచమల్లు కవుల షష్ఠమనియు నామములున్నవి.[13] నంది మల్లయ ప్రత్యేకముగ 'మదనసేన' మను నొక కావ్యమును రచించినట్లు పెదపాటి జగ్గన, ప్రబంధ రత్నాకరమున పేర్కొని, అందలి కొన్ని పద్యముల నుదాహరించెను. ఈ గ్రంథమును నంది ఘంట కవులిరువురు రచించి యున్నను, జగ్గన మల్లయ నొక్కని మాత్రమే పేర్కొని యుండునని విమర్శకుల భావము.[14] కస్తూరి రంగకవి రంగరాట్ఛందమున నంది సింగన రచించిన వామన పురాణములోని పని రెండు లక్ష్యముల నొసంగెను. నంది మల్లయ తండ్రి పేరు సింగయ. కావున బహుశః ఈ సింగయ వామన పురాణము నొక దానిని రచించి యుండునని తలంప నగును. అట్లయినచో ఈ విషయమును కవులు తమ గ్రంథములందు పేర్కొని యుండరాదా అని అనుమాన ముదయించును.[15] ఈ గ్రంథము లేవియును లభింపని కారణమున, వానిని గూర్చి యిద మిత్థమని నిర్ణయము చేయుట కవకాశము లేదు.

**కృతిపతి అభిలాష :**

ప్రబోధ చంద్రోదయ కృతిపతి యగు గంగయ సంసార యోగి. అతడు సరిలేని నీతిచాతురి చేత రాజ్యతంత్రమును నడపిన వాడైన నేమి, ఎప్పుడును పుష్ప చందన వనితాది సౌఖ్యముల తేలిననేమి, సంగీత సాహిత్య సరస విద్యా వినోదముల దగిలిన నేమి, అనిశము స్వామి హితాసక్తి చరించిన నేమి నీళ్ళ లోపలి పద్మినీదళము వలె నిర్లేపుడు.[16] కావుననే ప్రబోధ చంద్రోదయ నాటకమును యోగ్యకవీంద్రులచే తెనుగు సేయించి అంకితము గొనుట, ఆతని వర్తనమున కెంతయో ఉచితమనియు, ఆ కావ్య కన్య కాతడు పతి యగుట, పైడికి కస్తూరి తావి యబ్బినట్లును, కస్తూరికి బంగారపు కాంతి గలిగినట్లును భాసించు ననియు, గంగయ సభయందలి కవులును, బుధులును ఆతనితో పల్కిరి. వారు ప్రబోధ చంద్రోదయ నాటక వైశిష్ట్యము నాతనికిట్లు వివరించిరి.

సీ. వివరింప నిది సర్వ వేదాంత సారంబు
తలపగా నిది గట్టి తెలివి త్రోవ

యిది భోగ మోక్ష సంపదలకు మూలంబు
మోస లేదిది ఘనంబులకు ఘనము
జ్ఞాన కర్మ రహస్య సాధనంబును నిది
యిది నవరసముల నీను సురభి
షడ్దర్శనంబులు సరవి నిందున్నవి
సందేహములు దీఱ విందు గాని

యిమ్మహారస పాకము నెఱిగినట్టి
జను డెఱుంగడు మఱి తల్లి చన్నుపాలు
దీని సరి చెప్ప మఱిలేవు త్రిభువనముల
దొరక దీ కృతి నీవంటి దొరకు గాని 1-21

ఈ కావ్యరసాస్వాదన గావించిన జనునకు మఱి పునర్జన్మ యుండదు. సాటిలేని యేతత్కావ్య ఘనత, గంగయ మంత్రిలోని తత్త్వజిజ్ఞాసను ఇనుమడింప చేసినది. వెంటనే అట్టి మహానాటకమును తెనుగున ప్రబంధశయ్యలో రచింప చేయవలెనని అతడు సంకల్పించెను. తత్కార్యము సుసంఘటిత మొనరింపగల సుకవు లెవరని అతడు పండిత మండలిని ప్రశ్నించెను. వారీ కృతిరాజ నిర్మాణమునకు నంది మల్లయ, ఘంట సింగనలు సమర్థులని నుడివిరి. అంత గంగయ వారితో 'మీ తలంపు నా తలంపు నేకమయ్యె' నని పలికెను. ఆ శుభ నిమిత్తమున నతడు కవులను సభకు బిలిపించి, వారికి కర్పూరపు పీడియంబు లొసగి ఉచితరీతిని సన్మానించి తన కోర్కె నిట్లు వెల్లడించెను.

క. నేరుపరి పోహణించిన
హారము వెల యెక్క లీల నతిశయముగ నా
పేర దెలిగింప వలయును
సారపు ఫణితుల ప్రబోధ చంద్రోదయమున్ 1-27

అనురాగోక్తులతో మంత్రి కవులకు తన అభిలాషను వెల్లడించుచునే వారి కవిత్వము 'సారపు ఫణితుల వెలయ వలె' నని నిర్దేశించెను. అమాత్య శేఖరుని పలుకులు వినిన కవులు తత్క్షణమే, కృతి నిర్మాణమున కీయకొనిరి. తమ కృతికి అతడు పతి యగుట సౌందర్య లక్ష్మికి యౌవనోదయము కలిగిన విధమున భాసించి తమకు కీర్తి నాపాదింప గలదని తలంచిరి.

కృత్యారంభము :

ఈ కవులు తమ కృతిని ఆశీర్వాదముతో నారంభించిరి. మొదటి ఐదు పద్యముల యందును క్రమముగ శంకరుడు, జగదంబ, వినాయకుడు, పద్మా కంజాక్షులు, నలువ, వటోరమణి స్తుతింపబడిరి. వారు అనంతుని గంగయకు అభీష్ట సిద్ధి నిత్తురు గాక యను మంగళాశాసనము గావింపబడినది. కావ్యారంభమున గావించిన యీశ్వరస్తుతి కావ్యవస్తువున కెంతయు నుచితమై ఒప్పుచున్నది. హరి మొదలు స్తంబ పర్యంతము, రత్నములోని దారముపలె, కరండకముపై నిచోళీ భావమును వహించి సర్వప్రపంచము నంతంతర్బహిర్వ్యాపియై వర్తిలు వాడు ఈశ్వరుడు. జగమునందంతట తానొక్కరుడై వ్యాపించు నీశ్వరుని తత్త్వమిందు నిరూపితము. ఇక గంగయ కోరిన సారపు ఫణితుల నీకవుల కృత్యవతారిక యందే మెఱయింప జేసిరి. ఈ క్రింది పద్యము చూడుడు

చ. అమల మరాళయాన చతురాననభావ సువర్ణ దేహవి
భ్రమముల నిద్దఱుం దొరసి బ్రహ్మము శక్తియునైనతా రభే
దమున నటించు లీల విశదంబుగ దెల్పుచు నల్వయున్వచో
రమణియు నిత్తు రీప్సిత వరంబు లనంతయ గంగమంత్రికిన్. 1-5

పై పద్యమున శ్లేష ఘటింపబడినది. బ్రహ్మ సరస్వతులు ప్రకృతి పురుషులై అభేదమున నటించుట చక్కగ వివరింపబడినది.

కృతిపతికి ఆశీర్వచనమైన పిమ్మట పదునైదు పద్యములలో, అతని వంశాదికమును ప్రశస్తియు నుగ్గడింపబడినవి. పిమ్మట కృతిపతికి, తానొక కృతిని అంకితముగాగొన వలెననెడు సంకల్పము గలుగుట చెప్పబడినది. ఈ సందర్భము నందొక పద్యమున కవులు తమ గోత్రాదికములను వివరించుకొనిరి. పిమ్మట సంప్రదాయము ననుసరించి కృతిపతి కవుల నొక కృతిని రచింపు డనుచు, సవినయముగ నర్థించుట, వారందుల కీయకొనుట, మున్నగు అంశములు గలవు. పిమ్మట కవులు సుకవులను స్తుతించి, కుకవులను గర్హించిరి, ఇందు ప్రత్యేకముగ పూర్వ కవులెవరును పేర్కొనబడలేదు. తరువాత గురుస్తుతి పూర్వకముగ, తామొనరించు గ్రంథము నందలి ప్రధాన తత్త్వమగు నద్వైతము నొక సీసపద్యమున వివరించిరి. యథాక్రమముగ కృతిపతికి షష్ఠ్యంతములను జెప్పి కథారంభమున కుపక్రమించిరి.

ప్రబోధ చంద్రోదయ ప్రత్యేకత :

సంస్కృత నాటకమును పద్యకావ్య రూపమున రచించిన వారిలో నంది మల్లయ, ఘంట సింగనలు నాల్గవవారు పై అనువాదములలో వీరి ప్రబోధ చంద్రోదయము కొన్ని ప్రత్యేకతలు సంతరించు కొన్నది. ఆ గుణము లివి :

1. మూల నాటకమును సమగ్రముగ అనుసరించిన దీ ప్రబంధము. వీరు మంచనాదులవలె మూలము నందలి కథాక్రమమును గాని భావార్థములను గాని ఎచటను మార్చియుండలేదు. శ్రవ్య కావ్య సరణి ననుసరించి రచన సేయుచు సంస్కృత నాటకమును సమగ్రముగ నందింప గలిగి నందువలననే వీరి కీర్తి ఇనుమడించినది. వీరిందు అనవసరములగు వర్ణనములను జేయక, గ్రంథమును వస్తుప్రధానముగను, ఆసక్తి దాయకముగను చేసిరి. దీనివలె ఆధ్యాత్మిక విషయ నిరూపణము గావించెడు ప్రబంధము లాంధ్రమున నరుదు. వేదాంత విషయమున విసుగు గలుగ కుండుటకై కృష్ణమిశ్రుడు దానిని వివరింప రమ్యమగు రూపక మార్గము నెన్నుకొనెను. ఈ కవులు తద్రచనమునకు ప్రకృష్టమగు ప్రబంధ సరణి నెన్నుకొని, వైవిధ్యమును జూపి సహృదయుల రంజించిరి.

2. ఈ కావ్యము ఇరువురు కవుల ప్రతిభా వ్యుత్పత్తుల సమ్మేళన మయ్యును వీరిద్దరును అద్వైతమును బోధించుటలో నొక్కరై కావ్యము నందాద్యంత మెచటను ఎగుడు దిగుడులులేని రచనా సంవిధానము నవలంబించిరి.

ప్రబంధ కవితారీతి :

ప్రబోధ చంద్రోదయ నాటక వైశిష్ట్యమును బుధులు పొగడగా విని గంగయామాత్యుడు తన్నాటకమును ప్రబంధముగా తెనుగు సేయింప నెంచెను గంగయ మంత్రి శ్రీనాధాదులు వెలయింప జేసిన ప్రబంధ కవితా రీతులను చవి చూచినవాడు, ప్రత్యేకముగ 'నాచికేతూపాఖ్యాన మహాప్రబంధ పరిమిళిత సుధీ వ్యాఖ్యాన శ్రవణముచే' సౌఖ్యము నొందినవాడు కావుననే అతడు ప్రబంధ శయ్య నాదరించెను.

కృతి నిర్మాణమున కీయకొనుచు కృతికర్తలు తమ కృతిని "మహాప్రబంధము"గా పేర్కొనిరి.

గీ. అనిన సౌందర్య లక్ష్మికి యౌవనోద
యంబు దొరకినగతి నీమహాప్రబంధ
మునకు బతివైతి మాకు నపూర్వమైన
కీర్తి గల్గె నటంచు నంగీకరించి ... 1-28

షష్ఠ్యంతముల తరువాత కథారంభమునకు గడంగునపుడు "అభ్యుదయ పరంపరాభి వృద్ధిగా మా రచియింపంబూనిన ప్రబోధ చంద్రోదయ మహా కావ్యమునకు కథాసూత్ర మెట్టిదనిన" అని "మహాకావ్య శబ్దము నుపయోగించిరి. ఇక అశ్వాసాంత గద్యలందును ప్రబోధ చంద్రోదయంబను మహా కావ్యంబు నందు" అని మహా కావ్యపదమునే వాడిరి. ఇట్లు కొన్నిచోట్ల తమ కృతిని మహా కావ్యమనుటలో వింత యేమియు లేదు. ఏలన నీ ప్రబంధము మహా కావ్య లక్షణముల నన్నింటిని సంతరించుకొన్నది. మహా కావ్యమును దండి ఇట్లు నిర్వచించెను.

"సర్గ బంధో మహాకావ్యముచ్యతే తస్య లక్షణమ్
ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశో వాపి తన్ముఖమ్
ఇతి హాస కథోద్భూత మితర ద్వా సదాశ్రయమ్
చతుర్వర్గ ఫలోపేతమ్ చతురోదాత్త నాయకమ్
నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయ వర్ణనైః
ఉద్యాన సలిలక్రీడా మధుపాన రతోత్సవైః
విప్రలంభై ర్వివాహైశ్చ కుమారోదయవర్ణనైః
మంత్రద్యూత ప్రయాణాజి నాయకాభ్యుదయైరపి
అలంకృత మసంక్షిప్తం రస భావ నిరంతరమ్
సర్గై రనతివిస్తీర్ణైః శ్రావ్యవృత్తైః సుసంధిభిః
సర్వత్ర భిన్న సర్గాంతై రుపేతం లోకరంజనమ్
కావ్యం కల్పాంతర స్థాయి జాయతే సదలంకృతి
న్యూన మప్యత్ర యైః కైశ్చిదంగైః కావ్యం నదుష్యతి
యద్యుపాత్తేషు సంపత్తిః ఆరాధయతి తద్విదః

[కావ్యాదర్శము]

దండి చెప్పిన సర్గబంధ మహాకావ్య లక్షణము లన్నియు నించుమించుగా ప్రబంధమున కన్వయించును. కాని ప్రబంధము వివిధ కల్పనముల తోడను, శృంగార రస ప్రాధాన్యముతోడను గూడి మఱింత మనోరంజక మగుచున్నది.

నంది ఘంట కవులు ప్రబంధ మార్గము నెంతవఱకు అనుసరించిరో గమనింతము. ఇందలి కృత్యవతారికయు, అశ్వాసాద్యంతములును ప్రబంధోచిత రీతిలో సాగినవి. వస్తువు ప్రఖ్యాతము, వివేకుడను రాజు ఉపనిషత్కాంతా యోగమున ప్రబోధ చంద్రుడను కుమారుని బడయుట అను కథయును ప్రబంధానుకూలమై యున్నది. ఇందు చక్కని వస్త్వైక్యము ఘటింపబడినది. సంధ్యాదులు నాటకమునవలెనే కూర్పబడినవి. ప్రథమాశ్వాసమున కాముడు రతితో వివేకునకు నుపనిషద్దేవి వలన కాళరాత్రి కల్పయగు విద్యయను రాక్షసి ప్రబోధ చంద్రుని తోడం గూడ నుద్భవిల్లి తల్లిదండ్రులను, సహోదరులగు మోహాదులు మొదలైన సకల కులంబునుం గసిమసంగి మెసంగు" నని చెప్పుటలో కథాబీజ ముపలక్షితమైనది. ప్రబోధోదయమునకై శమదమాదులు ప్రతిపన్నోద్యోగులగుటతో ముఖసంధి ఆరంభమైనది. ద్వితీయాశ్వాసమున దంభాహంకారుల సంభాషణముతో నవాంతర విచ్ఛేదము పొందినదయ్యు, అహంకారుడు దంభునితో "వినుము మన యేలికయైన మహామోహునకు, వివేకుని వలనం గాగల మహోపద్రవంబు బరిహరించుటకై వచ్చితి" నను పలుకులతో కథ తిరిగి బిందురూపమున సాగుచున్నది. "తన తల్లి శ్రద్ధయు, దాను, శాంతి వివేక భర్తకు నుపనిషత్స్వామినికిని నడుపుచున్నది దౌత్యంబు విడువ కెపుడు" అని మదమానులు, మోహుని కంపిన లేఖ ద్వారమున ప్రయత్నము కనవచ్చి ప్రతిముఖ సంధిగా పర్యవసించినది. చతుర్థాశ్వాసమున విష్ణుభక్తి "తనవారల యభ్యుదయము, తన కన్నారను గన్నదాకను హృదయంబునిశంబు నపాయ శంకను తల్లడిల్లునని" ఫలప్రాప్తిని శంకించుటలో గర్భసంధిని, వివేక మోహాదుల యుద్ధము అవిమర్శ సంధిని ప్రకటించుచున్నవి. ఈ కథలో విష్ణుభక్తి వృత్తాంతము పతాకగను [17] వేదాంత సరస్వతి మనసునకు గావించు తత్త్వబోధను ప్రకరిగను గ్రహింప నగును.

గర్భసంధి యందును, విమర్శసంధి యందును నింద్రియ విషయములకు మిథ్యాత్వము చెప్పుట, అవిషయ స్నేహమును నిరసించుట, వైరాగ్యోత్పత్తి, పంచక్లేశ నిరసనము ప్రతిపాదితమైనవి, అచ్చటచ్చట విక్షిప్తములగు నీ అంశములన్నియు ప్రబోధ చంద్రోదయ రూపమున, ఏక కార్య సమన్వితము లగుచు, పంచమాశ్వాసమున, చక్కని నిర్వహణము గాంచినవి. మహామోహ, వివేక ప్రభృతుల వైర ప్రసక్తితో నారంభమైన ఈ కథ, ఆ వైర నాశరూపమైన

నాయక కార్య సాఫల్యముతో నంతమై యాద్యంతము వస్త్వైక్యముతో భాసించు చున్నది.

ఇందలి నాయకుడగు వివేకుడు ధీరోదాత్తుడు. అతడు రాజ్య [చిదానంద నగరము] ప్రాప్తికై దృఢసంకల్పుడై కావ్యము నందాద్యంతము ప్రతిపక్ష శక్తులతో పోరాడి అందు విజయము సాధించెను. ఇందలి నాయిక ఉపనిషత్తు. ఈమె ప్రౌఢ, బహుకాలము పతి తన్నెడబాసి నందుల కాతనిపై కినుక పూనెను. తిరిగి ఆతని చేరుట కామె కాత్మాభిమాన మడ్డుపడినది. కాని ప్రబోధోదయముచే ఆతనికి చేతోమోదము కలిగింప ఆతని కూడినది.

ఇక ప్రబంధమునకు ప్రాణముల వంటివగు వర్ణనల విషయమున ఈ జంటకవులు ప్రత్యేకమగు శ్రద్ధను జూపిరి. తామెన్నుకొనిన కథావస్తువు ఈ విషయమున, వారి స్వాతంత్ర్యము నరికట్టినప్పటికిని వీరెడనెడ సమయోచితములగు వర్ణనములను గావించిరి. ఈ వర్ణనములలో అమూలకములు గూడ కొన్ని గలవు.

వీరు ప్రబంధ కథను పురవర్ణనముతో నారంభించిరి. ఈ పురవర్ణనము అమూలకము, ఇందు కోటలు, పరిఘలు, మేడలు, తోటలు, సరసులు మున్నగునవి ఉచితరీతిని వర్ణింపబడినవి. తరువాత చతుర్థాశ్వాసము నందలి కాశీ పురవర్ణనము మూల విధేయమయ్యును ప్రబంధ రీతి ననుసరించు చున్నది. ఆపురి సౌధముల సొంపు పూదోటల ప్రాచుర్యము, మలయ సమీరముల సౌరభ్యములు ఒప్పిదములగు పదములతో వర్ణింపబడినవి. పూదోటలను వర్ణించునప్పటి అలంకార వైచిత్రి గమనింపదగి యున్నది.

క. "చంచల గరు దంచల మద
సంచర దళి సంచయాతి సంభన్నదళో
దంచిత సుమ కంచుకితము
లెంచ గొలది గాక మించునవె పూదోటల్ 4-42

ఇచట బిందు పూర్వకమగు "చకార పునరావృత్తి చంచలములై సంచరించెడు అళిసంచయముల సందడిని తెలుపుచున్నది. పంచమాంకము నందు వీరు మూలాతిశాయిగ కల్పించిన సిద్ధాహ్వయ పట్టణ వర్ణనము గూడ ఎన్నదగి యున్నది. ఇది రెండు పద్యములందును, నొక వచనమునను గావింపబడినది.

అంతయు నైంద్ర జాలికముగ తోచెడు నా నగరమునందలి నదులు వనవాటి కలు, కమలాకరములు మున్నగువాని విన్నాణ మిందు వివరింపబడినది. అందలి విద్యాధర పల్లవాధరల పోకడలు సరసముగ చెప్పబడినవి.

వీరు ఆమూలకమగు సూర్యాస్తమయ చంద్రోదయాది వర్ణనములను కూడ గావించిరి. ఈ సందర్భములందలి ప్రకృతివర్ణనమును కవులు కథా సంవిధానమున కనుగుణమగు నట్లొనరించిరి. ఒక శార్దూలమునను, ఒక సీసము నను కొనసాగిన ఈ వర్ణన [4-48-49] చిన్నదయ్యును కవుల భావుకతను నిరూపించుచున్నది.

వీరి ప్రబంధమున యుద్ధవర్ణనము గూడ కలదు. వివేకుని యుద్ధోద్యోగ మును సూచించు ఈ క్రింది పద్యము దీర్ఘసమాసములతో గూడి ప్రౌఢమై యున్నది.

సీ. కటి తటీ కట దారన్గంధ భ్రమ దృంగ
 భీకర కరిఘటాబృంహితముల
భీషణ విద్వేషి వేషి యథోచిత
 వేష ఘోటక ఘోర హేషితముల
ధనురాది వివిధాయుధ ధ్వజాధిష్ఠిత
 నిష్ఠుర స్యందననిస్వనముల
ఖడ్గ మయూఖాంధ కారితా శాముఖ
 వీర భట ప్రోద్భటారభటుల
గాహళారవభేరి భాంకారములను
గంచుకి వ్యూహ భూరిహుంకారములను
బద్మజాండంబు బీటలు వాఱుచుండ
దళ దశంబులు చక్రతీర్థంబు వెడలె 4-37

ఈ సైన్యార్భటికి బద్మజాండము బీటలు వాఱినది. ఇట్టి వీరసేన నాయ కునకు జయము గూర్చుననుటలో సందేహములేదు. యుద్ధవర్ణనముగూడ రెండు పద్యములలోను, ఒక వచనమునందును గావింపబడినది.

ఇక శృంగార వర్ణనము: ఈ కావ్యము శాంతరసప్రధానము. ఈ శాంత మునకు స్థాయియైన శమమును సహృదయుల చిత్తములలో స్థిరరూపమున

(43)

నిల్పి, వారికి శృంగారాద్యైహికేచ్ఛా విముఖత్వము గల్పించుటకై శృంగారమును దెగనాడుచునే దానిని శృంగార ప్రధాన కావ్యములలో గూడ కనరానంత రమ్యముగ వ్యాజోక్తి పూర్వకముగ వర్ణించిరి. కావ్యఫలమును దృష్టియం దిడుకొని, దాని కుద్దీపనములుగ వివిధరసములను పోషించుటయు ఈ కావ్యముల ప్రశస్తి కొక కారణమైనది.

ఇంతుల ఇంగితము లెంతటి వారలనైన తమ బంటుల గావించుకొనునట. పడతులు పచరించెడు వన్నెచిన్నెలను కవులు శబ్దాలంకారముతో నిట్లు విశదీకరించిరి.

సీ. వన్నెలు పచరించి కన్నుసన్నలు చేసి
వెడమాటలను ప్రేమ గడలు కొలిపి
తరితీపు నటనల దమకంబు బుట్టించి
వట్టి ప్రియంబుల గుట్టు తెలిసి
కలికితనంబున గాకలు గావించి
తోడి నీడలువోలె గూడిమాడి
యలుకల నలయించి కలయిక వలపించి
బాసల నడియాస పాదుకొల్పి
మనసు కరగించి భ్రమయించి మసరించి
మిగుల జొక్కించి యెంతయు దగులుపఱచి
పాసి యెడబాసి తమబంటు జేసికొనరె
వామలోచన లెంతటి వారినైన... 1-76

పై సీసమునందలి భావము మూలమునందుగూడ నున్నను, కవులా భావమును స్వతంత్రముగ విస్తరించి ప్రబంధ పద్ధతిలో తీర్చిరి. ఇందు గనవచ్చు తెలుగునుడికారము ఈ వర్ణనమును మఱింత రమ్య మొనరించుచున్నది. చకోరేక్షణల కౌగిలింత ఇహమునే మఱపించునని చెప్పెడు నిక్రింది పద్యము కూడ కవుల ప్రబంధ శైలి కొక చక్కని ఉదాహరణము.

ఉ. లోలకనీనికాకుల విలోచన దీప్తులు గ్రేఁళ్లు దాటగా
జాల భయంబున న్వదకు చక్కని చన్ను లురంబు మోవగా
జాల మనోజ్ఞకంకణభుజాలతలన్ దను దానె యీగతిన్
బాల కవుంగిలించిన మనంబున దుఃఖము లంటనేర్చునే 1-59

ద్వితీయాశ్వాసమునందు మోహుని కడ కేతెంచు నప్పటి విభ్రమావతి మందయానము "మొరయు మేఖలతోడి గురు నితంబభరంబు, మందయానము నకు నంద మొసగు" ఇత్యాదిగా మధురముగ వర్ణింపబడినది. ఇక అన్య వర్ణనములలో నాయకాభ్యుదయ మొకటి. నాయకుడగు వివేకుడు, దుష్టులగు తన సోదరులచే బంధములకు లోనైన తమ వంశకర్త ఈశ్వరునికి ముక్తి ప్రసాదింప దలంచి అందు విజయము సాధించును. ఆతని యౌవరాజ్యాభిషేకముతో కథ ఉపసంహరింప బడినది. ఇట్లు ఆద్యంతము కథలో నాయకాభ్యుదయము సంఘటిత మైనది.

కవులు ప్రబంధోచితములగు నాటకరీతులను గూడ చక్కగా ప్రకటించి రనుటకు ఇందలి ద్వితీయాశ్వాసమునందు గల దంభాహంకారుల సంభాషణమును, తృతీయాశ్వాసము నందలి, జిన. బౌద్ధసోమ, కాపాలిక సిద్ధాంతుల ప్రలాపములును ఉదాహరణములు. తృతీయాశ్వాసము నందలి ఈ సంభాషణమున పాత్రోచితభాషకూడ వాడబడినది. భాషణము ఏకవచనముతో నడచుట, వారొకరినొకరు దూషించుకొనుట, ప్రలాపములతో జాతీయము లెక్కువగా నుపయోగించుట మున్నగు లక్షణములతో నీఘట్టము రమ్యమై యొప్పుచున్నది.

మత్తకోకిల— ఓరి భిక్షుక చెప్పరా నిను నొక్కశాస్త్ర రహస్యమే
జేరి వేడెద నన్న బౌద్ధుడు బిట్టుముట్టు మటంచు నో
రోరి! జైన పిశాచ నగ్నుడ యోరి దుర్మలభాండ నీ
కూర కేటికి శాస్త్ర గర్వము లోరి కాలులు మానరా. 3-22

ఇక పంచమాశ్వాసమున ఉపనిషద్దేవిని గాంచిన పురుషు డిట్లు కుశల ప్రశ్నలను గావించును.

విద్యున్మాల— అమ్మా యిన్నాళ్ళత్యంతాయాసమ్ముం జెందన్ సచ్ఛాస్త్రాకా
రమ్మం జొప్పారంగా నెచ్చో నెమ్మె నెమ్మొందున్ నీవుంటన్.
5-78

కవు లీ ప్రబంధమున పద్యరచనాపాటవమునే కాక, గద్యరచనా కౌశలమును కూడ ప్రదర్శించి తమ కావ్యమును చక్కని చంపూకావ్యముగా తీర్చి దిద్దిరి. కొన్నిచోట్ల మూలనాటకమునందలి శ్లోకములను గూడ వీరు వచనమున నలచుట వీరికి గద్యరచనపై గల అభిమానమును ప్రకటించును. ఈ ప్రబంధ

మున మూలానుసారియగు దండకము గూడ కలదు. చతుర్థాశ్వాసమున మోహినీ ఆదికేశవాలయము ప్రవేశించు సందర్భమునం దిది గలదు. ఇట్టి దండకములను భీమరాజు భారతిని ప్రార్థించునపుడు శ్రీనాథుడును, కృష్ణావతార వర్ణనమున పారిజాతాపహరణమునందు తిమ్మనయు, నృసింహ ప్రాదుర్భావ షష్టమున ఎఱ్ఱాప్రెగ్గడయు రచించిరి.

ఇట్లు ఈ జంటకవులు ప్రబంధ రచనా విధానము ననుసరించి పెక్కు వర్ణనములను గావించి యున్నను మొత్తముపై నీకావ్యమున వర్ణనా బాహుళ్యము లేదని చెప్పవచ్చును. వీరు గావించిన వర్ణనలు సైతము సందర్భానుగుణములు సంక్షిప్తములునై యింపుగా నున్నవి.

**అనువాద పద్ధతి :**

వీరి యనువాదము మూలవిధేయ మగు ప్రబంధ పద్ధతిని సాగినది. వీరు మూలకథ నెచటను మార్చుట గాని సంగ్రహించుట కాని కావింపలేదు. శ్రవ్య కావ్యసరణికి అనుకూలమగునట్లు కథా కథన పద్ధతి నించుక మార్చుట, కావ్యోచిత వర్ణనా వైదగ్ధ్యమును ప్రకటించుటకై అమూలకములగు కొన్ని వర్ణనములు గావించుట, కథాగమనమున కొన్ని నూత్న కల్పనములను ప్రవేశపెట్టుట మాత్ర మచ్చటచ్చట కాననగును. కవులు భావముల నధికముగా అన్యథాకరించుట గాని, తొలగించుట గాని చేయలేదు. మూలభావమునకు వన్నె తెచ్చు విధమున ఎడనెడ భావ విస్తరణము మాత్రము కావించిరి. ఇట్లు మూలము నాద్యంతము సన్నిహితముగ ననుసరించుచునే వారు దానిని శ్రవ్యకావ్యముగ రూపొందించి యుండిరి.

వీ రాఱంకముల మూలనాటకము నైదాశ్వాసముల ప్రబంధముగా తీర్చిరి. ఇందలి ప్రథమ, ద్వితీయాశ్వాసములు, నాటకమునందలి ప్రథమ, ద్వితీయాంక కథలను వరుసగ అనుసరించుచున్నవి. ఇక తృతీయాశ్వాసమున తృతీయాంక కథతోపాటు నాటకము నందలి చతుర్థాంకమున గల విష్కంభ కథార్థమును కూడ నిమిడ్చిరి. చతుర్థాంకము నందలి కథను పంచమాంకమునందలి ప్రవేశకములోని వివేక విజయపర్యంతము గల కథను చతుర్థాశ్వాసము నందే పొందుపఱిచిరి. పంచమాశ్వాసమున పంచమ, షష్ఠాంకార్థములను రెంటిని మేళవించిరి. నాటక ప్రబంధములు రెంటియందును కథ సమానమే అయ్యును నాటకము నందలి క్రమము ప్రబంధమున కొన్నిచోట్ల మార్చబడినది. ఇట్టి మార్పులు

ప్రథమ, పంచమాశ్వాసములందు గోచరించుచున్నవి. నటీ సూత్రధారులు తప్ప నాటక పాత్రము లన్నియు ప్రబంధమున గలవు. అందలి శ్లోకములు సంభాషణములు, ఏవియు నుపేక్షింపబడక స్వతంత్ర పద్ధతి ననుసరింపబడినవి.

కథాఖ్యాన శైలి నవలంబించుచు నాటక కథకు గావించిన మార్పులు :

1. వీరు నాటకమునందలి వస్తు నిర్దేశ పూర్వకములగు నాందీశ్లోకములు రెంటిని, ప్రబంధారంభమున గాక షష్ఠ్యంతములకు పూర్వము, గురుస్తుతి పూర్వకమగు నొక సీసపద్యమునందు పొందుపఱిచిరి. నాటకమునందలి ప్రస్తావన యిందు తొలగింపబడినది.

2. నాటకమునందు ప్రస్తావనాంతమున కథోద్ఘాతముద్వారా పాత్ర ప్రవేశము గావింపబడినది. కావ్యసూత్రధారులైన కవులు మహామోహుడు తన తమ్ములతో పేరోలగంబున్నట్లును, అతడు వైరుల పీచమణంచుటకు దగిన ఉపాయము దెలుపుడని వారిని ప్రశ్నింప, అందులకు తాను సమర్థుడనని కాముడాతనికి బదులు పలికినట్లును వ్రాసి పాత్రప్రవేశమున కుచితమగు సందర్భమును కల్పించిరి.

3. నాటకమున నొక తృతీయాంకమున దప్ప, ప్రథమ చతుర్థాంకారంభములందు విష్కంభములును, ద్వితీయ పంచమ షష్ఠాంకారంభములందు ప్రవేశకములును గలవు. కవులు ఈ అర్థోపక్షేపకము లందలి అంశములను ప్రబంధమునందు తామె వచించిరి. ఇక ప్రథమ, షష్ఠాంకము లందలి విష్కంభ ప్రవేశకార్థ వివరణమున కొన్ని మార్పులను గావించిరి.

నాటకమునందు ప్రథమాంకారంభ మందలి విష్కంభమున రతి కాముల సంభాషణములోని అంశములు ప్రబంధమున ప్రథమాశ్వాసము నందు అచట నచట పొందుపఱుప బడినవి. కాముడు స్వోత్కర్షను ప్రకటించుకొనుచు రతితో నాడెడు మొదటి నాల్గు శ్లోకముల అర్థమును (1-11-14) కావ్యమున ఆతడు మహా మోహునితో సభయందు పల్కినట్లుగా చెప్పబడినది. పిమ్మట సభయందే రతి కామునితో భాషించును. కవులు వీరాడెడు మాటలలోని కొన్ని విషయములు, సదాచారుడను చారునిచే వివేకునికి చెప్పించిరి. అందు వివేకుడు కులక్షయ ప్రవృత్తుడని దూరుచు కాముడు రతితో నిట్లు పలుకును.

కామ : ప్రియే ! కులక్షయ ప్రవృత్తానాం పాపకారిణాం కుతః స్వపర ప్రత్యవాయ గణనా. పశ్య పశ్య.

సహజ మలిన వక్రభావ భాజాం
భవతి భవః ప్రభవాత్మనాశ హేతుః
జలధర పదవీ మవాప్య ధూమో
జ్వలనవినాశ మనుప్రయాతి నాశమ్ 1-21

అటుపై వివేకుని ఆగమనము నెఱింగి కాము డాతని వైక్లబ్యము నిట్లు వివరించును.

రాగాదిభిః సరస చారిభి రాత్త కాంతి
ర్నిర్భర్త్స్యమాన ఇవ మానధనః కృశాంగః
మత్యా నితాంత కలుషీ కృతయా శశాంకః
కాంత్యేవ సాంద్రతుహినాంతరితో విభాతి. 1-28

పై వచనమును, తరువాతి శ్లోకములలో మొదటి దానియందలి చివరి రెండు పాదములయు, రెండవ శ్లోకము యొక్కయు తాత్పర్యమును సదాచారుడు వివేకునికి చారవిషయ సంగ్రహములో నిట్లు చెప్పెను. "దేవర పంపున మహా మోహుని రాజ్యంబునకుం జని వారలాడుకొను దురాలాపంబులునుం జేయు కృత్యంబులు నెఱింగితి నది యెట్లంటేని యప్రతిహత స్వేచ్ఛా విహారులైన రాగాదులచేత భర్త్సితుండై తేజంబు గోలుపడి సాంద్ర నీహార పరంపరాంతరిత మైన కాంతితోడి చందురు చందంబునం బొసుంగుపడిన మతిసతిం గూడియున్న వివేకుండు మిక్కిలి కృశాంగుడయ్యెను మానధనుడు గావున నసము డింపక యుపనిషద్దేవి వలన విద్యా ప్రబోధ చంద్రులం గని మనలకుం దన కులంబు నకు హానిచేయ దలంచుచున్న వాడట ! కులక్షయ ప్రవృత్తులగు దుర్వృత్తులు తమ చేటు దలంతురే ? ధూమంబు జీమూతపథంబు బొంది నిజసంభవ స్థానం బైన దహనంబు నార్చి తానుం దూలిపోవదే... [1-66]

విష్కంభము నందలి విషయము సామాజికుల కుద్దిష్టము. ఆ విషయ ములు పాత్రలకు తెలియరావు. కావ్యమునం దా పద్ధతిని మార్చి కవులందలి విష యములను కావ్యపాత్రములకు కూడ తెలియునట్లు వ్రాయుట వలన ఆ పాత్రలు కార్యోన్ముఖు లగుటకు ఎక్కువ అవకాశముండును.

కాముడు రతితో తమ వంశోత్పత్తిని 1-17 శ్లోకములను, ఆటుపై వివేకమునను వివరించుట, దాయాదులైన అన్నదమ్ములు కురుపాండవుల వలె గలహించుట అను నంశములను కవులు కథారంభమున పూర్వవర్ణన మైనవిమ్మట కథనపద్ధతిలో వివరించిరి.

షష్ఠాంకమునందలి ప్రవేశకము శ్రద్ధాశాంతుల భాషణముతో కూడినది. వారి సంభాషణమువలన, శాంతి వివేకుని పంపున ఉపనిషత్తు కడ కేగుచున్నట్లును, శ్రద్ధ జీవమహారాజు ఆదేశమున వివేకుని యొద్దకు వెళ్ళుచున్నట్లును తెలియును ప్రబంధకర్త లీవిషయమును "విష్ణుభక్తి మహాదేవి శ్రద్ధ గనుంగొని శ్రద్ధాంగనా ! మనమనికేతం బంతయు బాసె నింక నీవు జీవమహారాజు వద్దికిం జని యచ్చటం జేయవలసిన కృత్యంబు లనుసంధింపు చుండు" మని పనిచి, శాంతింజూచి, "నీవు వివేకుని కడకుం జని యతనికి బరిచారంబులు సలుపుము. నేనును నతనికి ననర్గళ శ్రేయః ప్రాప్తియగున ట్లనుగ్రహించెదనని పనిచిన" అని విష్ణుభక్తియే వారిరువురిని వివేకోపనిషద్దేవులకడ కంపినట్లు (౬-౪౫) వివరించిరి. నాటకమున ద్వితీయాంకమున దంభుని స్వగత మిట్లు "ఆదిష్టోస్మి మహారాజ మహామోహేన యథా — వత్స దంభ ! ప్రతిజ్ఞాతం సామాత్యేన వివేకేన ప్రబోధోదయాయ ప్రేషితాశ్చ తేషు తేషు, తీర్థేషు శమదమాదయః స చాయ మస్మాక ముపస్థితః కులక్షయో భవద్భిరప్రమత్తైః ప్రతికర్తవ్యః తత్ర పృథివ్యాం పరమం ముక్తిక్షేత్రం వారణాసీనామ నగరీ తద్భవాం స్తత్ర గత్వా చతుర్ణా మప్యాశ్రమాణాం నిఃశ్రేయస విఘ్నార్థం ప్రయతతా" మితి- ఈ స్వగతమున, సామాత్యుడగు వివేకుడు ప్రబోధోదయమునకై ఆయా తీర్థములందు శమదమాదులను నియోగించుట, ఆ విషయము నెఱింగిన మోహుడు ప్రతీకారాభిలాషతో దంభుని కాశీనగరమున కంపుట, మున్నగు విషయములు వెల్లడింపబడినవి. ఈ అంశములు కావ్యమున ప్రథమాశ్వాసమునందే కలవు. వివేకుని యత్నమును దెల్పుచు దుర్గుణుడను చారుడు మోహుని కిట్లు పలుకును.

"మోహుని సమ్ముఖంబునకు దుర్గుణుం డనెడిపేరి చారుం డొకండు వచ్చి వినతుండై "దేవా ! వివేక విభునకు నుపనిషద్దేవికి యోగంబు గలుగుటకా దంపతులకు విద్యాప్రబోధ చంద్రు లుదయించుటకు విఘ్నంబు లుద్భవింపక యుండ శమదమాదులు వచ్చి సకల పుణ్యతీర్థంబుల వెంట దేవతాప్రార్థ

నంబులు సేయ సమకట్టియున్నవారు. చేయకుండ నంకిలిం దగ గావింపం దగువారిం బనుపు" మనిన మోహుండు మదిలోన న్నాగ్రహించి" 1-63

కం. దంభుని జూచి వివేకా
రంభంబున కిప్పు డంతరాయము చేయన్
గుంభిని తీర్థంబులలో
సంభావిత కాశిపురికి జనుమని యనిపెన్" 1-64

ఇట్లు స్వగతమును అఖ్యానానుకూలముగ మలచుకొని కవులందలి యర్థమును సుస్పష్టము గావించిరి. ఇట్లే ద్వితీయాంకమున పురుషోత్తమ దేవాలయము నుండి మదమానులచే మోహుని కడ కంపబడిన వ్రతహస్తుని స్వగతమును కూడ (2-51) మార్చిరి.

3. కాము డాడు దురాలాపములను విని వివేకుడు నేపథ్యమునందుండి ఇట్లు పలుకును.

"గురో రప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః
ఉత్పథప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే. 1-22

పై నేపథ్యమును కవులు పరిహరించి, అందలి యర్థమును వివేకుడు

క. కార్యాకార్యము లెఱుగక
నార్యత వర్తించు గురువునైనను విడువన్
మర్యాద యనుచు వృద్ధా
చార్యులు పలుకుదురు వేదసమ్మత మగుటన్ 1-65

అని మతికి చెప్పినట్లుగా రచించిరి.

అంగికాభినయాంశముల వివరణ :

దృశ్యకావ్యములందు పాత్రలకు సూచింపబడు నాట్యాంశములను, నంది ఘంట కవులు కథనాత్మకముగ వివరించి ఆయా పాత్రలను వారి యవస్థలను మనోనేత్రములకు ప్రత్యక్షమగు నట్లొనర్చిరి. అందుకు కొన్ని ఉదాహరణము లీయబడుచున్నవి. మూలమున ద్వితీయాంకము నందలి దంభాహంకారుల సంభాషణమున నటుల కుద్దేశింపబడిన సూచనలను కవు లిట్లు వివరించిరి.

1. వటు : (తామ్రమఘటీం గృహీత్వా)

'దంభుని యనుమతి దామ్రంపు గిండి నంబువు లిడగై కొని' (2-18)

2. దంభ : (దంతా స్సంపీడ్య వటుం పశ్యతి)

"కోప ముదయింపగాఁ బండ్లు కొఱుకు కొనుచు" (2-14)

3. మోహుని ప్రవేశము (తతః ప్రవిశతి మహామోహో, విభవతశ్చ పరివారః)

కం. మోహుండతివైభవమున సాహో యని కటికవారు సందడి జడియం
గా హేమ రత్నఖచితమహా హర్మ్యము చొచ్చి యందు నాసీనుండై
2-29

4. తృతీయాంకమున బౌద్ధుని పాత్రప్రవేశ సూచన మిట్లు గావింపబడినది (తతః ప్రవిశతి భిక్షురూపః, పుస్తక హస్తో బుద్ధాగమః)

కం. పౌదవును బోడియునై యిల
నడతాడిం బోలి కరమునం బుస్తకపుం
దడక ధరియించి కటి జిం
పుడు వల్కలము దూల బుద్ధముని శిష్యునితోన్. 3-26

5. కాపాలికుని ఆదేశమున శ్రద్ధ క్షపణకుని ఆలింగనము గావించినది. అది నాటకమున ఇట్లు నిర్దేశింపబడినది (కాపాలినీక్షపణక మాలింగతి).

ఈ ఆలింగనమును, అప్పటి ఆమె హావభావములను కవులు 'అదియును మహాప్రసాదంబని మురిపంపు నడకల జైను డగ్గఱంజని, కలకల నవ్వుచు, గలికిమాపు మెఱుంగుల ధైర్యతిమిరంబు విరియించి కాంచనచషక దగద్ధగాయ మాన దోర్మూలరోచుల వీచులు వెల్లి విరియ, ఘల్లు ఘల్లున గంకణంబులు మొరయ హస్త మస్తక సంయోగంబు చేసి వదన మదిరా మోదంబునం దదీయ దుర్వాసన వీసర పుచ్చం గరంబున బిసబిస నసమశర మంత్రంబుచెప్పి గొప్ప చనుగుబ్బలు ఱొమ్మున గాడి పాఱ బిగియ కౌగిలించిన" (3-51) అని వర్ణించిరి.

44)

కాపాలిని భిక్షువును కౌగిలించినది. అతడంత రోమాంచ మభినయిం చును. (సానందం పరిష్వజ్య రోమాంచన మభినీయ జనాంతికమ్) ఆపరిష్వంగ మునకు బౌద్ధుని మేను గజరు గజరులు వోయినదని వర్ణించిరి (౬-46).

6. యుద్ధ సన్నద్ధుడగు వివేకుడు అనికిబోవ నరద మెక్కుట మూలమునం దిట్లున్నది (కృతమంగలవిధి రారోహణం నాటయతి) అతడు రథ మెక్కిన విధమును జంటకవు లిట్లు చెప్పిరి.

కం. అప్పుడు వివేకనరపతి
ముప్పిరిగొను వేడ్క రత్నముల టెక్కెములన్
విప్పగు రుచు లొగి గుప్పలు
గప్పెడు రథరాజ మెక్కి కదలెడు వేళన్ 4-38

ఇట్లీ కవులు నాట్యధర్మములగు పాత్ర ప్రవేశార్థోపక్షేపక, స్వగత నేప థ్యాదులను శ్రవ్యకావ్యసరణి కనుకూల మగు విధమున మలచి యుండిరి.

సంభాషణముల ననుసరించిన విధానము :

వీరు మూలము ననుసరించుచు, 1. ఒకచో నందు వచనముగానున్న సంభాషణమును పద్యరూపముగను, 2. వేఱొకచో పద్యగద్యాత్మకముగ సాగిన ఘట్టములను వచనములుగను అనువదించిరి. 3. ఒక్కొక్కచో మూలము నందలి శ్లోకమునంతకు ముందున్న గద్యముతో కలపి ఒక పద్యముగా ననువ దించిరి. 4. మూలమునందలి గద్యములకు గద్యరూపానువాదములు కూడ గలవు. ఇట్టివానికి ప్రబంధమున పెక్కుదాహరణములు కలవు. ఒక్కొక్కదాని కొక్కొక్క యుదాహరణమే యొసంగబడుచున్నది.

1. మూలమునందలి గద్యమునకు పద్యానువాదము :

పంచమాంకమున స్వజనులను గోల్పోయిన మనస్సు ఇట్లు పరితపిం చును. మనః (సాస్రమ్) – హా పుత్రకాః! క్వగతాః స్థ। దత్త మే ప్రియ దర్శనమ్। భోభోః కుమారకాః। రాగద్వేష మద మాత్సర్యాదయః పరిష్వ జ్యధ్వం మామ్। సీదంతి మమాంగాని। హా న కశ్చిన్మాం వృద్ధ మనాథం సంభా షయతి। క్వగతా అసూయాదయః కన్యకాః, ఆశాతృష్ణా విరసాదయో వా

స్నుషాః ? కథం తా అపి మందభాగ్యస్య మే సమకాలమేవ దైవహతకే నాపహృతాః ?

పై వచనమును పద్యరూపమున హృద్యముగ రచించిన తీరు గమనింప దగియున్నది.

సీ. హా కామరాగ మదారి పుత్రకులార !
కాన రారేల నాకూనలార ;
కడుపు చుమ్మలు చుట్టగా నెట్లు నే నిర్వ
హించెద నను నూఱడించరయ్య
హా యసూయాది కన్యకలార ! నన్న
నాథుని విడిచి యిటపోఁజనునెమీకు
నక్కటా హింసాదులైన కోడండ్రార !
యెక్కడ నున్నారు దిక్కునాకు

నేది యేదితి మిమ్ముల నిన్నినాళ్ళు
పాపకర్మపు దైవ మీపగిది మిమ్ము
నొక్కరిని జిక్కకుండగ నుక్కడంచె
బాపురే నాదురంత దౌర్భాగ్య మహిమ 5-8

ఈ అనువాదము నందలి తెలుగు నుడికారపు సొంపు ఆసమయమునందలి భావములను చక్కగ వెల్లడిచేయుచున్నది.

2. మూలమున గద్యపద్యరూపముగ నున్న ఈ క్రింది సంభాషణమును గద్యరూపమున ననువదించిన విధానమిట్లున్నది. ప్రథమాంకమున వివేకుడు తన భార్య మతితో దురాచారిణియగు మాయకపట వర్తనము నిట్లు తెల్పెను :

రాజా - ఏవ మనయా దురాచారయా విచింతితం యదహం తావద్గత యౌవనా వర్షీయసీ। అయం పురాణ పురుషః స్వభావాదేవ విషయరస విముఖః తతః స్వతనయమేవ పారమేశ్వరే పదే నివేశయామీతి తమేవ మాతు రభిప్రాయ మాసాద్య నితాంత ప్రత్యాసన్నతయా తద్రూపమి వాపన్నేన మనసా నవ ద్వారాణి పురాణి రచయిత్వా।

ఏకోపి బహుధా తేషు విచ్ఛిద్యేవ నివేశిత,
స్వచేష్టిత మధో తస్మిన్విదధాతి మణావివ 1-28

మతి : అర్య పుత్ర ! యాదృశీ మాతా పుత్రోపి తాదృశ ఏవ జాతః

రాజా - తతో సావహంకారేణ చిత్తస్య జ్యేష్ఠపుత్రేణ నప్రాప్తి పరిష్వక్తః తతశ్చాసావీశ్వరః

"అదియునుం గాక దురాచారియగు మాయాదేవి కపట కృత్యం బొక్కటి వినుము. తానును జవ్వనం బెడలిన పెద్దదాన నతండు పురాణ పురుషుండు విషయ రస విముఖుండు గావున నేతత్పరమేశ్వర పదంబునం దన తనయుం దగు మనంబు నింతటం బట్టంబు గట్టెదనని తలంప నమ్మనంబు నమ్మ యభిప్రాయం బవలంబించి తాను జనకు నాసన్నవర్తి యగుటంజేసి తత్పరమేశ్వరత్వంబు గైకొన్నవాడు పోలె విజృంభించి నవద్వారంబులగు పురంబులు రచియించి యప్పురంబుల నద్వితీయుండగు నాత్మునిం బ్రదుంచివైచిన నతండు దనకు లోనై మణిక్రింద వత్తి విధంబున దనయందు నిజచేష్టితంబులు చూపుచుండ నీడ తోడంగూడిన దర్పణంబు జాడ నహంబ్రహ్మీభవించి తల్లికిం దగిన బిడ్డయె కలిగెనన మెలంగు చుండునట్టి మనంబు పెద్దకొడుకగు నహంకారుడను మనుమనిచే నాలింగితుండై పరమేశ్వరుడు...." (1-76)

పై అనువాదము మూలము ననుసరించునదే అయ్యునంతయు గద్య రూపమున సాగినది.

3. వీరు మూల గద్యభాగములను గద్యములుగనే ఆంధ్రీకరించిరనుటకు ప్రబంధమున ద్వితీయాశ్వాసము నందలి 69వ వచనమును, చతుర్థాశ్వాసము నందలి 69వ వచనమును, పంచమాశ్వాసము నందలి 42వ వచనమును ఉదాహరణములు - వీరొక్కొక్కపుడు మూలమునందలి గద్యమును తరువాతి శ్లోకమును గలిపి తదర్థమునొక పద్యముగా వ్రాయుదురు. ఉదా॥

1. అహం - కిమేవం గర్వాయసే.

> ఆరే కఖవ వాసవః కథయ కోత్ర పద్మోద్భవో
> వద ప్రభవభూమయో జగతి కా మునీనా మపి
> అవేహి తపసో బలం మమ పురందరాణాం శతం
> శతం చ పరమేష్ఠినాం పతతు వా మునీనాం శతమ్ 1-11

శా. ఓరీ డాంబిక ! యెంత పట్టెదవు గర్వోద్రేకివై యింద్రుడున్
నీరేజాసనుడున్ మునీశ్వరులు నా నీకింత దొడ్డీ సునా

సీరు లక్షలు వేలు బ్రహ్మలు ముని శ్రేణుల్ పరార్థాధికుల్
పోరా నే నెఱుగంగ నాతపము పెంపుల్ చూడ నింతింతలే. 2-22

ఇందు అహంకారుని భాషణములోని చివరి వచనములును తరువాతి శ్లోకమును ఒకే పద్యముగా అనువదింపబడినవి. పై శ్లోకమున పురందరశతము, పరమేష్ఠి శతము, మునిగణశతము పేర్కొనబడగా అనువాదమున సునాసీరు లక్షలు, వేలు బ్రహ్మలు మునిశ్రేణులని చెప్పబడినది.

అమూలక కల్పనములు :

వీరు నాటకమును ప్రబంధముగా మార్చుచునందు అమూలకములగు కొన్ని వర్ణనములను, కథా, భావములలో కొన్ని నూత్నాంశములను జేర్చిరి. ఇవి చాల స్వల్పములు, అనూత్న కల్పనము లిట్టివి :

1. కథారంభమునందలి చిదానంద నగర వర్ణనము. వేదాంతరాజ్యమునకు 'చిదానందనగరి' యను నామధేయ మొసంగుట వీరి ప్రతిభకు నిదర్శనముగా నున్నది. ఇందలి అర్థద్వయము ఆనందదాయకముగా నున్నది. ఈ చిదానంద నగరి, జీవుడు సాధించెడు బ్రహ్మానందలోకమే కాని వేరొకటిగాదు. ఆ స్థితినందిన పురుషుని కనుభవ వేద్యమైన ఆత్మారామత్వమే, పురవిషయకముగ వర్ణింపబడినది.

2. ప్రథమాశ్వాసమున దుర్గుణ, సదాచారుల కల్పన మెంతయో యుచితముగ నున్నది. దుష్ప్రవృత్తి గలిగిన మోహునికడకు దుర్గుణుడను చారు డేతెంచుట, సుశీలుడైన వివేకుని కడకు సదాచారు డేతెంచుట వారి వారి స్వభావముల కనుకూలముగ నున్నది. ఈ కల్పనము కథాసందర్భముతో నతికి నట్లున్నది.

3. ప్రథమాశ్వాసము నందలి మోహుని పేరోలగము కల్పనము, అతడు తమ్ములనుగూడి విభవమున కొలువు దీర్చుట, వారితో గూడి అతడు వైరుల నణచుటకు తగిన ఉపాయము వెదకుట, కాముడాతనికి బదులు పలుకుట అను నంశములు కవుల సన్నివేశ కల్పనా చాతుర్యమును వెల్లడించును. ఇదే ఆశ్వాసమునందలి

ఆ.వె. కాన మానసంబుగలగిన యమనియ
మాదులెల్ల బోవు నాడ నాడ

కమల వనములోన కలహంస పంక్తులు
కలక నీరు విడిచి తొలగునట్లు 1-55

అను పద్య మమూలకము. ద్వితీయాశ్వాసమందలి

క. నను నేలిన యేలిక పం
పిన పనిసాధించి జనులు మేలని పొగడన్
బునరాగతుడై యేలిక
తను మెచ్చగ మ్రొక్కు బంటు ధన్యుడు కాడే 2-44

అను పద్యము నందలి భావము కవికల్పితము. ఇది చక్కని సుభాషితమైకూడ నున్నది ఈ ఆశ్వాసమునందే విభ్రమావతికి నాస్తికవిలాసిని అను పేరు వాడ బడినది. ద్వితీయా శ్వాసమునందలి 44వ కంద పద్యమునందలి భావము కవుల కల్పనము :

4. రసానుకూలములగు సహజ భావములను గల్పించుటలో కూడ వీరు సిద్ధహస్తులు. తృతీయాశ్వాసమున శాంతి తన తల్లి శ్రద్ధకొఱకై విలపించుచు ఆమె నెడబాపిన వారి నిట్లు దూరును :

సీ. ఏజంత బోధించెనే నిన్ను నాతల్లి
కాన పాషండ సంగతుల మెలగ
నే బోడి గావించెనే యింత విరిపోటు
తల్లి నీ కుపనిషత్తరుణితోడ
నేముండ యెడ బాపెనే నిన్ను దల్లి మా
మీద హత్తిన కూరిమియును కృపయు
నేరండ భ్రమయించెనే నిన్ను తల్లి ధ
ర్మంబు మోక్షం బబద్ధంబు లనుచు

గీ. నంచు దుఃఖించు గన్నీరు నించు దిశలు
గలయ నీక్షించు గానక కళవళించు
నించు కించుక గమనించు జంచలించు
దల్లి దొఱగుడు వేయి చందముల మఱియు 3-37

పై పద్యమున ఆడంబరములేని శబ్ద గుంఫనము కరుణనూను చక్కగా వ్యక్త మొనరించుచున్నది. ఈ సీసమునకు ముందుగల వచనము (3-2) గూడ నమూ

లకమే. అందు మిథ్యాదృష్టి శ్రద్ధ నేవిధముగ వశము గావించుకొనినదో వివరింపబడినది. నాటకమున నది ఊహ్యము మాత్రము.

5. చతుర్థాశ్వాసము నందలి పదియవ సీసపద్యము మిక్కిలి వైరాగ్య పోషకముగ నున్నది. ఈ సీసము ఒక ప్రతియందే యుండుటవలన ప్రక్షిప్తమని తోచుచున్నది. ఈ సీసము జంటకవుల సహజశైలి కంటె కొంత భిన్నముగా నున్నట్లు తోచును. ఇది సంస్కృత శబ్ద భూయిష్ఠముగను జుగుప్సావహముగను ఉన్నది.

6. చతుర్థాశ్వాసము నందలి సూర్యాస్తమయ చంద్రోదయ వర్ణనము

శా. అంతం గుంకుమ పంక పాటలిమతో నస్తాద్రిపై నిల్చె భా
స్వంతుం డిందుడు నింద్ర గోపరుచిఁ బూర్వక్ష్మాధరం బెక్కవా
రెంతేఁ జూడగ నొప్పిరప్పుడు వివేకేశ ప్రతాప ప్రభా
ప్రాంతం బందలి వెంట పంజువలె దద్రాకాదినాంతంబునన్. 4-48

సీ. మోహు పక్షము వారి మొగములపగిది
నంభోరుహ వ్రాతంబు ముచ్చుముణిగె
వికసించె దొగలు వివేకుని పక్షంబు
వారల చిత్తోత్సవంబు కరణి
మోహుని బంధు సమూహంబుకైవడి
గోక సమూహంబు శోకమందె
జెలగె జకోరకములు వివేకక్షమాధ
వుని నెయ్యంపు బంధువుల పగిది

ముదిసె నిశ మోహు రాజ్యసంపద యనంగ
దెల్లవారె వివేకుని తెలివి యనగ
దొలగె జుక్కలు మోహుని బలమనంగ
దరణి పొడిచె వివేక ప్రతాప మనగ 4-49

ఇందు సూర్యాస్తమయమునుండి ఉదయము వఱకు ప్రకృతియందు గలిగెడి మార్పు లతిసహజముగ వర్ణితములైనవి. ఈ సందర్భము కథతోగూడ నన్వయించు చుండుట గమనింపదగిన అంశము.

7. పంచమాశ్వాసమున మనసునకు వేదాంత సరస్వతి చేసెడు బోధనము నందలి 34వ వచనమును కవులు కల్పించిరి. ఇందు బ్రహ్మానంద సాధకంబులగు అంతర్బహిర్లక్ష్యములు వివరింపబడినవి. ఇదే ఆశ్వాసమునందు శారదా రమణి 'వత్సా! మృత జ్ఞాతి బంధునికాయంబున కీనదింజలుపుమా తోడ్తోనివాపాంజలుల్' అని మనసునకు బోధించిన పద్యము (5-44), పురుషుడు విష్ణు భక్తి మహిమను కొనియాడుచు "ఇది కలిగెననుచు నుబ్బక" ఇత్యాదిగా పలికిన పద్యము (5-113) అమూలకములు

భావానుసరణము :

నంది ఘంటకవులు మూలభావము ననుసరించుచో ప్రకటించిన కౌశలమెన్నదగినది. ఇది వీరి కుభయ భాషలయందును గల పాండితీకౌశలమును చాటుచున్నది. వీరు నాటక భావములను స్వాయత్తములు గావించుకొని వానికి పలువిధములగు వన్నెలు తీర్చదిద్దిరి. ఒకానొకచో మూలభావమును పదమునకు పదముగా గూడ వివరించిరి. ఇట్లు అర్థమునంతను సమగ్రముగ అనువదించుచునే దాని వ్యక్తీకరణమున కొంత స్వేచ్ఛ వహించిరి. ఈ స్వతంత్రత పద్యపుబెత్తుగడలలోను, నుడికారపు తీరులోను, ఆలంకారిక శయ్యయందును, అదే భావమునకు మెఱుగు దిద్దుటయందును వ్యక్తమగుచున్నది. వీరు పెక్కుచోట్ల భావములను విస్తరించిరి. మూలభావమున కన్యథాకరణములు గాని, సంగ్రహణములు గాని అధికముగ గావింపక, తత్సౌందర్యమును గాపాడిరి. ఎడనెడ భావముతో పాటు సంస్కృత పదములను గూడ మూలమందుండి గ్రహించి యున్నారు.

విస్తరణ :

కవులు నాటక భావములను విస్తరించిన పట్లు వారి కల్పనా సామర్థ్యమును చాటునవియై విశిష్టములుగ నున్నవి. ప్రథమమున వీరు గావించిన అలంకారయుతమగు పెంపును గమనింతము.

1. సంమోహయంతి మదయంతి విడంబయంతి
నిర్భర్త్సయంతి రమయంతి విషాదయంతి
ఏతాః ప్రవిశ్య సదయం హృదయం నరాణాం
కిం నామ వామనయనా న సమాచరంతి 1-27

సీ. వన్నెలు పచరించి కన్నుసన్నలు చేసి
వెడమాటలను ప్రేమగడలు కొలిపి
తరితీపు నటనల దమకంబు బుట్టించి
వట్టి ప్రియంబుల గుట్టు తెలిసి
కలికితనంబున గాకలు గావించి
తోడి నీడలు వోలె గూడి మాడి
యలుకల నలయించి కలయిక వలపించి
బాసల నడియాస పాదుకొల్పి

మనసు కరగించి భ్రమయించి మస్తరించి
మిగుల జొక్కించి యెంతయు దగులు పఱిచి
పాసి యెడబాపి తమ బంటుజేసి కొనరె
వామలోచన లెంతటి వారినైన 1-75

ఇందు కవుల శబ్దాలంకార ప్రావీణ్యము దేశ్య శబ్దప్రాచుర్యము అను వానితోపాటు కన్నుసన్నలు చేయుట, వట్టి ప్రియముల గుట్టు తెలిసికొనుట, బాసల నడియాస పాదుకొలుపుట మున్నగు నారీవిలాస చేష్టలు మూలభావమునకు వన్నెదిద్దుచున్నవి.

2. సహజ మలిన వక్ర భావ భాజాం
భవతి భవః ప్రభవాత్మనాశహేతుః 1-21

క. సహజ ఖలుం డుదయించుచు
మహగులముం జెఱిచి తాను మడియు జుమీభూ
రుహము లొరయగా బుట్టిన
దహనుం డడవెల్ల గాల్చి తా జెడునుగదా 1-62

మూలభావమును మఱింత స్పష్టమొనరించుటకు, ఆంధ్రీకర్తలు చేర్చిన రమ్యోపమాన మిది.

3. రాజా - ప్రియే సేర్ష్యం ప్రాయేణ యోషితాం భవతి హృదయమ్ ।
(ప్ర. అం)

క. చంచలము మానయుతమును
గంచు పదను వంటి దరయ గాంతల హృదయం బంచు" 1-80

అను పద్యమునందలి ఉపమానము కూడ నమూలకమే.

4. ప్రథమాశ్వాసమున నలువది నాల్గవ పద్యమున వివేకుడు "వృత్రుని కోడిపోయిన సురరాజు చందమున నెక్కడో యణగుండుట" అమూలకము.

5. అముష్య సంసార తరో రబోధమూలస్య నోన్మూల వినాశనాయ విశ్వేశ్వరారాధనబీజ జాతా తత్త్వావబోధాదపరోఽభ్యుపాయః 1-7

ఇట్టి మోహ భూత మిరవగు సంసార
సాల మనవ బోధ మూల యుతము
కాన నీశ్వరాంఘ్రి కమలార్చనాజాత
బోధ గజము చేరి పోవ పైచు 4.చ.

ఇచ్చట నీశ్వరాంఘ్రికమలార్చనా జాతబోధమున గజత్వ మారోపించుట అమూలకమై రమ్యముగా నున్నది.

6. షష్ఠాంకము నందలి 24వ శ్లోకమునకు అనువాదమైన పంచమాశ్వాసమునందలి 97వ పద్యములో ఉపనిషత్తరుణి నాస్తికాదుల ధాటి కోర్వక పరువెత్తు నప్పుడు "కుక్కలడ్డంబులు వెంటఁబడ్డ వేగంబున జను హరిణీ పోతముంబోలె భీతిన్" జెందుట మూలమున కానరాదు.

(బి) వీరు మూలభావమును కొన్నిపట్ల "సామెతలతోడను, జాతీయముల తోడను" పెంపు చేయుదురు.

1. కేయం మాతా పిశాచీ క ఇవ హి జనకో భ్రాతరః క్షేత్రకీటా
వధ్యోఽయం బంధువర్గః కుటిల విట సుహృచ్చేష్టితా జ్ఞాతయో మే ।
11-33

పదతి ! తల్లిని దండ్రి జంపుట తృణ ప్రాయంబు తోబుట్టులన్
మడియం జూచుట లెక్కగాదనిన జన్మజ్ఞాతి కీటంబులన్
గెడపంబూనుట నాకు దొడ్డె గుడి మ్రింగే వానికిం దల్పుల
ప్పడముల్గావున బిల్ల పిల్ల తరమున్ భక్షింతు దాయాదులన్ 2-67

ఇందు గుడి మ్రింగేవానికి తల్పులప్పడములు అను ప్రయోగము తెలుగు దేశము నందలి పలుకుబడి. ఈ క్రింది అనువాదములు గూడ నిట్టివే

2. భణ తావత్క్షణ వినాశినా త్వయా కస్యకృతే ఇదం వ్రతం ధార్యతే

గీ. క్షణ వినాశి వౌదుగద నీవు మఱిసీకు
నిట్టి వ్రతము లెల్ల బట్టనేల
రెండిటికిని జెడిన రేవడవై వృథా
బోడవైతి వెందు గూడవైతి. 3-24

3. స్వారాజ్యం ప్రాజ్య ముత్సృజ్యలోకే నింద్యామనిందితః
అభివాంఛతి కో నామ భవానివ పిశాచతామ్ 111-10

సీ. ఏమిరా తాజెడ్డ కోమటి వెనకయ్య చేతికివెసల యిచ్చిన విధమున
మమ్ము మీమతము గైకొమ్మని చెప్పెదు ప్రాణికి మీమతం బర్థమగునె
స్వర్గవైభవము విసర్జించి యెవ్వడు జనదూష్యమైన పైశాచవృత్తి
నీవలె దాల్చురా నిర్భాగ్య! యన...

పై అనువాదములలోని రెంటికిని జెడినరేవడవై, తాజెడ్డ కోమటి వెనకయ్య చేతికి వెసల యిచ్చినవిధమున" అను అమూలకముల కల్పనము కవుల లోకజ్ఞతకు గూడ నిదర్శనమై ఒప్పుచున్నది.

4. శాంతి, శ్రద్ధ జాడ కానరాక దుఃఖించుచు, విధి వక్రించెనేని ఎంతటి సజ్జనులకైనను ముప్పు తప్పదని విచారించునప్పటి (౬-13) పద్యము నందలి "ఉష్ణముష్ణేన శామ్యతి" అను సంస్కృతలోకోక్తి కూడ నమూలక మైనట్టిదే.

వీరు మూల భావమునకు మెఱుగులు దిద్దిన విస్తరణములు :

1. అహల్యాయై జారః సురపతి రభూ దాత్మ తనయాం
ప్రజానాథోయాసీ దభజత గురో రిందు రబలామ్
ఇతి ప్రాయః కోవా న పదమపథే కార్యతమయా
శ్రమో మద్బాణానాం క ఇవ భువనోన్మాద విధిషు 1-14

సీ. తన కన్నకూతును దాన పెండ్లాడడే
వారిజ గర్భుండు వావి తప్పి
బలభేది గౌతము భార్య నహల్య గా
మించి చేయడె నల్లమేక తప్పు

కడలేని రట్టడి కొడిగట్టుకొని యైన గమ
లారి గురుతల్పగతుడుకాడె
తపన సూనుడు తారదానాక్రమింపడె
యన్న ప్రాణములకు నఱ్ఱుదలచి
మఱియు నిట్లు జగంబుల మదులు కొల్చి
యెట్టి నియతాత్మకుల నైన గుట్టు చెఱిచి
కాని త్రోవల నడిపించు కడిమి నాడు
వాలుదూపులగమి కవలీలగాదె 1-50

ఇచట తపన సూనుడు తార నాక్రమించెననుగాథ అమూలకము. మూల కవి, కాముని ప్రభావమును దెల్పుటకు నాదర్శముగా కొన్ని పురాణగాథలను వివరింపగా, వీరు వానికింకొటి గూడ జేర్చి సందర్భమునకు సొబగు దెచ్చిరి. మూలమున ఇంద్రుడు ప్రథమమున పేర్కొనబడగా అనువాదమున బ్రహ్మకు ప్రథమ స్థానము కల్పింపబడినది.

మూలమునందలి తృ. అం. నాల్గవశ్లోకమునకు అనువాదమైన తృతీయాశ్వాసము నందలి పదునొకండవ పద్యము నందలి "చాప చుట్టగజుట్టి చంక బెట్టుక పోడెధరణి హిరణ్యాక్షదానవుండు" అను హిరణ్యాక్షుని వృత్తాంతము కూడ కవులు చేర్చినదే.

2. క్షేత్ర గ్రామ వనాద్రిపత్తన పురద్వీప క్షమా మండల
ప్రత్యాశాయుత సూత్ర బద్ధ మనసాం లబ్ధాధికం ధ్యాయతామ్
తృష్ణే దేవి యది ప్రసీదసి తనోష్యంగాని తుంగాని చే
త్తద్భోః ప్రాణభృతాం కుతః శమకథా బ్రహ్మాండ లక్షైరపి 11-32

సీ. పుడమిలో మాన్యంపు మడిగొంత గలవాడు
గ్రామమెల్లను నేలగా దలంచు
గ్రామమేలెడు వాడు కాంక్షించు గిరి వన
స్థల జల దుర్గవ ద్రాజ్యమేల
రాజ్యమేలెడు వాడు రాజ్యవైభవమున
హెచ్చి తానొక ద్వీపమేలగోరు
ద్వీపమేలెడివాడు తేజస్వియై మహీ
వలయ మెల్లను, నేలవాంఛజేయు

ఛిట్లు కడలేని యాసాస లీనుచుండ
జనులు బ్రహ్మాండ కోటుల దనివి నొంద
రనిన శాంతికి గాలూదనైన గలదె
యెడము మది తృష్ణనీవింత వెడలితేని 2–63

ఆశకు అంతు లేదని తెలుపుచున్న మూలార్థమును వీరు విస్తరించి మఱింత విశద మొనరించిరి.

3. అస్తి తర్హి మహానర్థ శేషః ప్రహరణీయశ్చాసౌ.

శ్రద్ధ వివేక మహామోహాదుల యుద్ధమును విష్ణుభక్తి వివరించుచు 'యుద్ధమున మోహుని పక్షము అంతయును నిర్జింపబడినది. కాని మోహుడు పారి ఎటనో దాగియున్నాడు" అని చెప్పగా విష్ణుభక్తి ఇంకను మహానర్థ శేషము మిగిలియే యున్నది. దానిని నాశమొనరింపవలెను అని పల్కెను. దానిని తెలుగు కవులు ఈ క్రింది విధమున అనువదించిరి. ఇచట "కేళ్ళంగి వ్రేసినట్లు" అనునది విశేషముగ వాడబడినది.

"కేళ్ళంగి వ్రేసినట్లు
త్రుళ్ళడమున మోహుబట్టి తునుమాడక యీ
పిల్లల దునుముట కూకటి
వ్రేళ్ళుండన్ మునిడి కొనలు విఱుచుటగాదె" 5–8

మూలమున ఛాయామాత్రముగ నున్న విష్ణుభక్తి భావమును కవులు దృష్టాంతముతో విశదీకరించి అర్థస్ఫూర్తిని గల్గించిరి. కూకటి వేళ్ళుండగా మునిడి కొనలు విఱుచుట సందర్భోచితమై ఒప్పుచున్నది.

4. నిత్యం స్మరం జలదనీల ముదార హార
కేయూర-కుండల కిరీటధరం హరింవా
గ్రీష్మే సుశీత మివ వా హ్రద మస్తశోకం
బ్రహ్మ ప్రవిశ్య భజ నిర్వృతి మాత్మనీనామ్ -31

లయగ్రాహి – నందక ధరున్ మన పురందరమణి ప్రతిము, నిందిర
మనోహరు. ముకుందు హరి గానీ
చందన మరాళ బిసకుంద ధవళాంగు, గిరిమందిరు, నుమా
రమణు, నిందుధరు గానీ 5-33

వైష్ణవ మతిస్థుడైన కృష్ణమిశ్రుడు శ్రీ మహావిష్ణువును ధ్యేయముగా పేర్కొనగా అనువాదకులు ఇందు ధరుని కూడ పేర్కొనిరి. ఇందలి ఇందుధర స్తుతి పూర్వకమగు రెండవ పాదము అమూలకము.

5. పంచమాంకమున సరస్వతి మనసు దురవస్థ గాంచి 'ప్రాణాంత వ్యవసాయంబిది యింతులకుంగాక నీకు నెన్నికయగునే' అని హెచ్చరించుట (5-13), ఆమె మనసునకు జేసెడి బోధనమున (5-42) "సదాశివుండుమాదేవి తోడ నొక్క కుత్తికగా మనుచున్నవాడు. వెన్నుండిందిరా దేవికిం దన డెందంబు మందిరంబు గావించి యానందంబు బొందు, నరవింద నందనుండు చదువుల మచ్చెకంటి న్మెచ్చి మొగమిచ్చి యచ్చపు మచ్చికలం బొదలెడు. వీరి మువ్వురికి నాది కారణంబైన పరమ పురుషుండును, జిదాత్మికయైన పరశక్తి ననురక్తిం గూడిమాడి వేడుకలం గ్రీడింపుచుండు" కావున నీవు గృహస్థాశ్రమ మును ముహూర్త కాలమైన వీడవల" దని చెప్పు భాగము కవులు సందర్భాను గుణముగ పెంచినట్టిది. ఈ భావములు మూలమున లేవు.

6. షష్ఠాంకమున ఉపసర్గ ప్రభావము వివరింపబడిన ఘట్టమును తెనుగు కవులు స్వతంత్రరీతిలో విస్తరించిన విధము ఎన్నదగినది. ఇందు జీవుడు గాంచిన చిత్రమగు లోకమునకు వీరు సిద్ధాహ్వాయ పట్టణమని నామకరణ మిడిరి.

ఈ ఉపసర్గ ప్రభావమును వీరు పంచమాశ్వాసమున 54 సీసము మొద లుకొని 59వ సీసము వఱకును మొత్తము ఐదు గద్యపద్యములలో వివరించిరి. ఈ ఘట్టము స్వతంత్ర పద్ధతిలో విస్తరింపబడి మూలమునకు మెఱుగులు దిద్దు చున్నది. వీరా సిద్ధాహ్వాయ పట్టణము నందలి విభ్రమముల నుచిత శబ్దప్రయోగ ముతో వివరించి ఆఘట్టము నొక రమణీయ చిత్రమువోలె సాక్షాత్కరింపజేసిరి.

7. కృత్యంతమున జీవేశ్వరుని సుజ్ఞాన సింహాసనము నందభిషేకిం చుట, ఫలశ్రుతి చెప్పుట అను భాగములు (5-114 వచనమునందలివి) కావ్యాను కూలముగ కవులు చేర్చినట్టివి.

వీరొక్కొక్కచో అమూలకములైన విశేషణములను జేర్చి, ఆయా సందర్భములకు తగిన భావములను సుస్పష్టమొనరించు చుందురు. ద్వితీయా శ్వాసమున క్రోధుడు హింసను గని దుస్స్వాధాటోపమున మల్లు చఱచుట (66)

కాపాలికుడు క్షపణకుని కుత్తుక గోయుదు ననుచు "రౌద్రరసాఖిలంబగు కరవాలంబు నొఱవెడల దీయుట", (३-४०) శ్రద్ధ జాడకానక శాంతి "పెదవులు వేడియూరుపుల బీటలు వాఱగ గద్గదోక్తుల" నాడుట (३-९) పంచమాశ్వాసమున మోహోప సర్గావిష్టుడైన పురుషుని తర్కామాత్యుడు "సంతప్తాయత లోహిత కటాక్ష క్రూరుడై" చూచుట, (5-61) విష్ణుభృత్యులు తర్కవిద్యలను 'గుదెల నెముకలెల్ల గుల్లలుగ మోదుట', (5-९३) మున్నగునవి ఉదాహరణములు.

సంగ్రహీకరణము :

వీరు మూలభావమును సంగ్రహించిన తావులు స్వల్పములు. వానిలో కొన్ని ఇట ఉదాహరింపబడుచున్నవి

1. వీరు నాటకము నందలి నాందీశ్లోక భావములను రెంటిని కలిపి షష్ఠ్యంతములకు ముందొక సీసమున (1-३२) సంక్షిప్తముగ చెప్పిరి.

2. మైత్రి శ్రద్ధతో తానును తన సఖురాండ్రగు కరుణాముదితోపేక్షలును మహాత్ముల మదిలో శాంతిని కల్గించు విధమును వివరించుచు చెప్పిన,

"ధ్యాయన్నిమాం సుఖిని దుఃఖిని చానుకంపాం
పుణ్యక్రియాసు ముదితాం కుమతావుపేక్షామ్
ఏవం ప్రసాద ముపయాతి హి రాగలోభ
ద్వేషాది దోష కలుషోప్యయ మంతరాత్మా" 4-5

అను శ్లోకము

క. నను సఖునెడ, నతిదుఃఖప
రునెడ గరుణ, బుణ్యతత్పరుని యెడ ముదితన్,
జెనటి యెడ నుపేక్షను, దమ
మనమున నిల్పుదురు శాంతమతులు మహాత్ముల్ 3-31

అని సంగ్రహముగ నాంధ్రీకరింపబడినది. పై శ్లోకమునందలి ధ్యాయన్నిమాం సుఖిని అను పదము 'నను సఖునెడ' అని సంక్షిప్తముగ చెప్పబడినది "ఏవం ప్రసాద ముపయాతి హి రాగలోభద్వేషాది దోష కలుషోప్యయ మంతరాత్మా" అను పదములందలి 'ఏవం ప్రసాద ముపయాతి అంతరాత్మా' అను భాగము మాత్రమే గ్రహింపబడినది.

3. విష్ణుభక్తి మహాదేవి సాహాయ్యము తనకు లభించినదని సంతోషించిన వివేక మహారాజు "సుజనులకు దైవము తోడ్పడును" "అపమార్గమున నడచువానిని సోదరుడైనను వీడును" అని తలంచును. "ప్రాయః సుకృతీనామర్థే దేవా యాంతి సహాయతామ్। అపంథానం తు గచ్ఛంతం సోదరోపి విముంచతి" (4-7) అను ప్రసిద్ధమైన శ్లోకమును భట్టమురారి అనర్ఘరాఘవమున రచింప, జయదేవ కవి ప్రసన్న రాఘవమునం దనుకరించెను. తత్త్వవిదు లిట్లు చెప్పుదురని కృష్ణమిశ్రుడు దాని నుద్ధరించెను. జంటకవులు ఇందలి రెండవ పాదమును విడిచి వచనమున మొదటి పాదముయొక్క అర్థమును "సుకృత కర్మవ్యవసాయ పరులకు దైవ సాహాయ్యంబు గలుగునని పెద్దలు చెప్పుమాట నిజమయ్యె" (4-2) నని అనువదించిరి.

4. సూతుడు కాశీనగరమును వర్ణించుచు అందలి గంగను గురించి ఇట్లు చెప్పును. "చంద్రచూడునకు నివాసమును, ముక్తికి స్థానమునైన యీ నగరము విద్యవలె తమోవిఘటనముచేత ఆత్మప్రభవమైన ఆనందమును లోన ధరించుచు మనసును రజించుచున్నది. ఇచట గంగ, భూమి కంఠమునందు వ్రేలాడు వక్రమైన ముత్యాల హారమువలె నుండి తన ఫేనపటలముచేత వంకరగానున్న చంద్రకళను చూచి నవ్వుచున్నది" (-29).

ఈ శ్లోక భావమును కవులు

గీ. విద్యకైవడి ముక్తికి విడిదియగుచు
  నాత్మవిధమున నానందమైన ఇచట
  నున్న సర్వేశు నౌదల పిన్న చంద్రు
  నవ్వుచున్నది గంగ ఫేనములచేత 4-44

అని సంగ్రహముగా చెప్పిరి. ఇందు మూలమున గంగకు వాడబడిన విశేషణములును, ఉపమానమును (ముక్తావళిః ఇవ) విడువబడి శ్లోకసారము మాత్రమే గ్రహింపబడినది. "చంద్ర చూడవసతిః" అని కాశికి వేయబడిన విశేషణము కూడ విడువబడినది. "ముక్తేః పదమ్" అనునది మూలమున కాశికిని విద్యకును కూడ నన్వయించును. "సర్వేశు నౌదలపిన్న చంద్రు" ననునది అమూలకము.

5. సరస్వతి మనసునకు గావించెడు బోధలో "వత్సా, నీమనమిపుడు నా బోధను గైకొను స్థితియందున్నది. కనుక నేను తత్త్వమును వివరించి

చెప్పెదను. మూర్ఖుడైన జనుడు పితాపుత్ర బంధు మరణాదులచే దుఃఖానుభవము నొందును. కాని లోకము సారవిహీనము అసత్యము అని ఎఱింగిన విజ్ఞుడు వియోగములచే దృఢమైన విరక్తిచే ప్రశాంతత్వమును పొందును" అని చెప్పును (22) ఆ శ్లోక మిట్లున్నది.

వశం ప్రాప్తే మృత్యోః పితరి తనయే వా సుహృదివా
శుచా సంతప్యంతే భృశ ముదర తాడం జడధియః
అసారే సంసారే విరసపరిణామో తు విదుషాం
వియోగో వైరాగ్యం ద్రఢయతి వితన్వన్ శమసుఖమ్. 5-22

అనువాదము సందీ శ్లోకము

ఆ. జడున కీయసార సంసార విభ్రాంతి
కతన దల్లి దండ్రి సతుల సుతుల
గడచు టధిక దుఃఖ కారణము వివేక
ఘనున కిది విరక్తి కారణంబు 5-35

ఇందు పై శ్లోకమునందలి రెండవ పాదము 'జడున కధిక దుఃఖ కారణము' అనియు, చివరి రెండు పాదముల యందలి అర్థము 'వివేక ఘనున కది విరక్తి కారణంబు' అనియు సంగ్రహముగా ననువదింప బడినది. మూలము నందలి అర్థము వివరణాత్మకముగా నుండగా తెలుగు కవులు దానిని సంక్షిప్తముగ చెప్పిరి.

వీరిట్లు ఎడనెడ కావించిన సంగ్రహీకరణము యాదృచ్ఛికముగా చేసి నట్టిదే కాని అందు ప్రత్యేక ప్రయోజనమేదియు లేదు.

తొలగింపు :

జంటకవులు మూలభావములను కొన్నిటిని గ్రహింపక వదలి వైచిరి. ఇట్లు వదలివేయుట కొన్నిచోట్ల ఔచిత్యవంతమై యున్నది. నాటక ప్రథమాంక మున కాముడు రతితో తమ వంశోత్పత్తిని గూర్చి చెప్పెడు (17-19) శ్లోకము లలో ఒకదానియందు "సంభూతః ప్రథమ మహేశ్వరస్య సంగా న్మాయాయాం మన ఇతి విశ్రుతస్తనూజః" అనియు రెండవ దానియందు "పుంసః సంగ

సముజ్ఝితస్య గృహిణీ మాయేతి తేనాప్యసా వస్పృష్టాపి మనః ప్రసూయ తనయాంలోకా న సూత క్రమాత్" అనియు చెప్పుటలో వైరుధ్యము గలదు. కావున వీరు దీనిని పరిహరించి "పూర్వంబున సంగరహితుండైన పరమేశ్వరునకు దద్గృహిణియైన మాయకు గూటమి లేకయే చిత్రంబుగా సంభవించిన మనంబునకు" [1-58] అని ఒకే పర్యాయము పేర్కొని ఆవైరుధ్యమును దొలగించిరి.

2. చతుర్థాంకమున శ్రద్ధ విష్ణుభక్తిచే వివేకునికి విజయము గలిగినదనియు అపుడు, సదాగమంబుల ధాటికాగలేక పాషండాగమములు మ్లేచ్ఛదేశముల బ్రవేశించెననియు చెప్పుచు ఆ మ్లేచ్ఛ దేశములలో ఆంధ్రదేశమును కూడ చేర్చెను. అనువాదకర్తలు దేశాభిమానముతో ఆ సందర్భము ననువదించుచు అందు ఆంధ్రదేశ ప్రసక్తిని వదలివైచిరి [4-69]

3. నాటకమున నాస్తిక సిద్ధాంతమును ప్రతిపాదించుచు చార్వాకుడు చెప్పిన

నిహతస్య పశోర్యజ్ఞే స్వర్గప్రాప్తి ర్యదీష్యతే
స్వపితా యజమానేన కింను కస్మాన్న హన్యతే 11-20

అను శ్లోకమును అనువదింపక వదలి వైచిరి.

4. తృతీయాంకమున భిక్షు, జైన, కాపాలికులు శ్రద్ధాధర్ముల జాడ కనుగొన యత్నింతురు. వారిలో జైనుడు వారు భూమిపై గాని, జలమున కాని కొండగుహలలోకాని నరకమున గాని ఎచటను లేరనియు, మహాత్ముల హృదయమునందు వసించు విష్ణుభక్తితో నున్నారనియు పల్కును. [111-24] పై భావముగల శ్లోకము శ్రద్ధకొక పర్యాయమును, ధర్మునకొక పర్యాయమును చెప్పబడినది. అనువాదకులీ పునరుక్తిని తొలగించి వారిరువుర కన్వయించునట్లొకే పర్యాయము చెప్పియుండిరి. [3-66]

మార్పులు :

[ఏ] వీరు మూలభావము నచ్చటచ్చట అన్యథాకరించిరి. వీరు గావించిన ఈ మార్పులు ఎడనెడ మూలమునకు శోభ కలిగించుచున్నవి.

1. నాస్మాకం జననీ తథోజ్జ్వల కులా సచ్ఛ్రోత్రియాణాం పున
ర్వ్యూఢా కాచన కన్యకా ఖలు మయా తేనాస్మి తాతాధికః
అస్మచ్ఛ్యాలక భాగినేయ దుహితా మిథ్యాభిశప్తా యత
స్తత్సంపర్క వశాన్మయా స్వగృహిణీ ప్రేయస్యపి ప్రోజ్ఝితా. 2-9

చ. వినుము మదీయ మాత జన విశ్రుత వంశజ, యంతకంటె మ
ద్వనిత కులస్థు రాలగుటఁ దండ్రికి నేఁ ధికుండ, నట్టినా
యనుగు వధూటి తమ్మునికి నల్లుని కూతురు లేని నింద బొం
దిన ప్రియ భార్య మానితి విసందిత బాంధవ గంధ సంగతిన్ 2-10

సంస్కృతము నందు అహంకారుడు, తన తల్లి అంత ప్రశస్తయగు కులము నకు చెందినది కాదనియు, తన తల్లి కంటె తాను పెండ్లాడిన కన్య ఉత్తమ కులజయనియు వచించెను. ఇచట తల్లిని గూర్చి అతడట్లు పలుకుట యుచిత ముగా లేదు. కావున తెలుగు కవులు దానిని మార్చిరి. అతని తల్లి విశ్రుత వంశజ యనియు, అంతకంటె అతని భార్య ఉత్తమ కులజయనియు చెప్పుట భార్య గుణాధిక్యమును మాత్రమే సూచించుచు తల్లియెడగల నీచార్థమును తొల గించుచున్నది.

2. మామనాలోక్య నస్నాతి నభుంక్తే నపిబత్యపః
నమయా రహితా శ్రద్ధా ముహూర్తమపి జీవతి 3-2

కం. కుడువవుగా నే బొత్తున, గుడువక
నేత్రెక్కలేక కూర్కవు గాయే
యెడ నన్ను బాసి నీవర గడియయు
నిలువంగ లేవుగాయో జననీ 3-5

ఇచట మూలమునందలి స్నాతి, పిబతి అను పదములకు బదులుగా కూర్కవు అనుట ఉచిత తరముగా నున్నది, పిబతి అనునది భుంక్తే అనుదానిలోనే అంత ర్భవించియున్నది.

శ్యేనావ పాత మవపత్య పదద్వయే మా
మాదాయ ధర్మ మపరేణ కరేణ ఘోరా
వేగేన సా గగన ముత్పతితా నఖాగ్ర
కోటి స్ఫురత్పిశిత పిండయుతేవ గృధ్రీ 4-3

కం. పిడుగువలె వచ్చి నన్నొక
పిడికిట మఱి ధర్ము నొక్క పిడికిట గొనితా
నడువీధి కెగసి మాంసము
నొడిసి పడిన్నెగయు గృధ్రయుం బలెనన్నున్ 2-17

పై శ్లోకమునందు శ్యేనావ పాత మవపత్య అనియున్నచోట పిడుగువలె వచ్చి అను జాతీయముతో గూడిన ఎత్తుగడ మూల భిన్నమయ్యును అర్థ గాంభీర్యముతో గూడియున్నది, 'పదద్వయే మామాదాయ', 'ధర్మమపరేణకరేణ' అను వాక్యార్థమును అందముగా — నన్నొక పిడికిట, ధర్మునొక్క పిడికిట అని అనువదించిరి.

4. "యది రమసేకాపాలినీ భావైః శ్రావకాః కిం కరిష్యం తీతి" [3-19] నీవు కాపాలినీ భావములతో నాతోరమించుచో శ్రావకులేమి చేయుదురని మూలమునందలి భావము. దీని జంటకవులు "శ్రావకీజనంబులు నీకాలి గోరునం బోల" రని [3-51] అనువదించిరి. మూలమున శ్రావకీ జనముల ప్రసక్తియే లేదు.

[బి] ఒకానొకచో జంటకవులు మూలభావమును మార్చుచు, దానిని లోకోక్తిపూర్వకముగ వివరింతురు

1. దురాచార సదాచారాం దుర్దర్శా ప్రియదర్శనామ్
అంబా మనుసర త్యేషా దురాశా నకథంచన 3-7

దురాశయు, దురాచారయు దుర్దర్శయునగు నీమె సదాచారయు ప్రియదర్శనయునగు నాతల్లి నెట్లును అనుసరింప జాలదు అని దీని అర్థము.

కం. ఔ నౌ నెచ్చెలి నామది
బెనగొనెడు దురాశ కతన బేరొకతైనా
వీనుల సోకె నమంగళ
దీనికి మాతల్లి సవతు! దిట చెడిపడితిన్ 3-18

పై శ్లోకమున దురాశ అనునది తామసీ శ్రద్ధకు విశేషణముగ నున్నది. దురాచారా, దుర్దర్శా అనునవి కూడ ఆమెకే విశేషణములు. కాని తెనుగు కవులు వీని నన్నింటిని ఒక్క అమంగళ — అను పదముతో అనువదించుటయేకాక, దురాశా అనుదానిని శాంతికి కల్గిన దురాశగా ననువదించిరి. పేరొక్కటి యగు

టిచే ఈ అమంగళను మా తల్లియే అని భావించితిని నాదురాశ ఏమని చెప్పను అని భావము.

2. మతి – ఆర్యపుత్ర, అన్యాస్తాః స్త్రియోయాః
సరస ప్రవృత్తస్య వా, ధర్మార్థ వ్యాపార ప్రస్థితస్య
వా భర్తుః హృదయ స్థితం విఘటయంతి.
[ప్రథమాంకము పుట 24]

కం. అనుమాన పడక వల్లభ
వినుమా నామాట వారి వీరిఁబలె నన్
గనుగొనకఁడు కులకాంతలు
పెనిమిటి ధర్మమున కెడమ పెని పెట్టుదురే 81. ప్ర.

ఇది మూలమునకు స్వతంత్రానువాదము. విఘటయంతి అనుటకు "ఎడమ పెని పెట్టుదురే" అను పదము వాడబడినది. ఎడమ పెనిపెట్టు అనుదానికి వ్యతిరేకించు అను నర్థమున్నది. ప్రయోగము జాతీయమై యింపు గొల్పుచున్నది. కాని పెని అనునది పెన ఆయియుండును.

యథాతథానుసరణము :

[ఏ] వీరు మూలభావము నందలి యొక్క పదమునైన విడువక వివరింతురనుటకు ప్రబంధము నుండి ఉదాహరణము లనేకము తీయవచ్చును. వానిలో కొన్ని ఈ క్రింద పేర్కొనబడుచున్నవి.

1. సంతు విలోకన భాషణ విలాస పరిహాస కేలి పరిరంభాః
స్మరణ మపి కామినీనా మల మిహ మనసో వికారాయ. 1-16

కం. తరుణుల చూపులు మాటలు
గరగరికలు నగవు బిగవు కౌగిటి పొందుల్
పరికింప నేల తత్స్మ
స్మరణమె చాలదె మనంబు సంచల పఱుపన్ 1-64

పై అనువాదము మూలానుసారి యయ్యును తద్వివరణమున కవులు ప్రకటించిన స్వేచ్ఛ ఎన్నదగినది. ఇది వారి దేశ్యపద ప్రయోగాభిమానమును జాటుచున్నది. మూలమునందలి విలాసమను పదమునకు గరగరికలను పదముపయోగించుట

అర్థస్ఫూర్తికి పోషకమగుచున్నది కేలిపరిరంభాః అనుదానిని బిగువు కౌగిటి పొందుల్ అని అనువదించుట సుందరముగా నున్నది. ఇట్టిదే మఱియొక ఉదాహరణము.

2. 'రమ్యం హర్మ్యతలం నవాః సునయనా గుంజద్విరేఫా లతాః
ప్రోన్మీల న్నవ మల్లికాః సురభయో వాతాః సచంద్రాః క్షపాః
యద్యేతాని జయంతి హంత పరితః శస్త్రాణ్యమోఘానిమే
తచ్చేతః క్వదృగసౌ వివేక విభవః క్వధృక్ప్రబోధోదయః 1-12

మ. అలిగీతంబుల తోడి పుష్పలతలున్, హర్మ్యంబులుం, జందనా
చల మందానిల కందళంబులును, వాసంతంబునుం, బండువె
న్నెలలుం గాంతలు నాకు నమ్మిన బలానీకంబులై యెల్లచో
టుల నుండంగ వివేక మెట్లొదవు బుట్టున్ బోధ మెబ్బంగులన్ 1-48

రమ్యం, నవాః, ప్రోన్మీలన్నవమల్లికాః అను మూలపదములు విడువబడినను అనువాదము మూలానుగుణమై హృద్యముగా నున్నది. ఇచట సచంద్రాః క్షపాః అను మూలమునకు, పండువెన్నెలలను జాతీయము నుపయోగించుటయు 'సురభయోవాతాః' అనుపదములను 'చందనాచలమందానిల కందళంబు' లని వివరించుటయు భావమునకు వన్నె కలిగించుచున్నవి.

3. క్లమో న వాచాం శిరసోన శూలం
నచిత్తతాపో న తనోర్విమర్దః
న చాపి హింసాది రనర్థ యోగః
శ్లాఘ్యాపరం క్రోధజయేహమేకా 4-16

మ. అలయంగా జగడింపకే, మిగుల దేహం బెల్ల నొప్పింపకే
దల నొప్పిమియు జెందకే, హృదయ సంతాపంబునం బొందకే,
దలపంగా రిపు హింస మున్నగు ననర్థ వ్రాతముంజేరకే
చులకంగా విదళింతు క్రోధుని గడున్ జోద్యంబు నేనూరకే. 4-23

మూలమువలెనే ఇందును అలతి అలతి పదముల తోడి భావవ్యక్తీకరణము రమణీయముగ నున్నది.

4. పాంథానా మివ వర్త్మని, క్షితిరుహాం నద్యామివ భ్రశ్యతాం,
మేఘానామివ పుష్కరే, జలనిధౌ సాంయాత్రికాణా మివ,

సంయోగః పితృమాతృ బంధు తనయ భ్రాతృప్రియాణాం యదా
సిద్ధో దూర వియోగ ఏవ విదుషాం శోకోదయః క స్తదా 5-25

మత్తకోకిల త్రోవ బాంధులు, పుష్కరంబున దోయదంబులు, వార్ధిలో
నావికుల్, సలిల ప్రవాహమున న్నగంబులు కూడుచున్
బోవు చుండెడి కైవడిం బితృ పుత్ర బంధుల వేక స్వా
భావికం బని కోవిదుల్ మది బట్టుకొల్పరు శోకమున్ 5-39

క్షితిరుహాం అనుదానికి విశేషణమైన భ్రశ్యతాం అను పదమిందు విడువబడినది సాంయాత్రికులనగా ఓడవర్తకులు. వారు కొంతకాలము మాత్రము కలసి యుండి తరువాత విడిపోవుదురు. అందుచే నావికులనుటకంటె వర్తకులనుట యుచిత తరము. మూలము నందలి మాతృభ్రాతృప్రియ పదములు విడువబడినను భావ మునకు భంగము లేదు. పద్యము ధారాశుద్ధి శోభితమై మూలభావమును చక్కగా వ్యక్తము చేయుచున్నది.

[బి] పదములను యథాతథముగా గ్రహించుట :

వీరు తమ అనువాదమునందు కొన్ని యెడల మూలపదములను యథా తథముగ గ్రహించిరి.

1. శైవ పాశుపతాదయో దురభ్యస్తాక్ష పాదమతాః [2 పుట 28]
ఈ శైవపాశు పతాదులయ్యా దురభ్య స్తాక్షపాదమతులు [2-7]

2. విన్యస్త కృష్ణాజిన దృష దుపల సమిచ్చషాలోలూఖల ముసల...
[పుట 30]
ఆడ కాడకు బచరించిన కృష్ణాజిన దృషదుపల చషాల కోలూఖలముస లంబుల వలనను [2-9]

3. సర్వథా లోకాయత మేవ శాస్త్రం యత్ర ప్రత్యక్షమేవ ప్రమాణం, పృథి వ్యప్తేజో వాయవ స్తత్త్వాని... [పుట 40]
లోకాయతికంబె శాస్త్రంబు, దండ నీతియే విద్య, ప్రత్యక్షంబె ప్రమా ణంబు పృథివ్యప్తేజో వాయు రాకాశంబులే తత్త్వంబులు.
దండ నీతియే విద్య అనున దమూలకము.

4. మస్తిష్కాంత్రవసాభిపూరితమహామాంసాహుతీర్జుహ్వతాం [111-13]
మస్తిష్క త్ర్ర వసాభి పూరిత మహా మాంసంబులన్ వ్రేల్చుచున్ [3-34]

5. ఆద్యోదాత్త వివేక మార్జిత తమః [5-32]
అపర్యాప్త వివేక మార్జిత తమంబై నట్టి [5-41]

6. కృష్ణాజి నాగ్ని సమిదాజ్య జుహూస్రువాది
పాత్రైస్త్రధేష్టి పశు సోమ ముఖైర్మఖైశ్చ [3-13]
అంతట కృష్ణాజినాజ్య సమిజ్జుహుస్రువ పాత్ర పశ్విష్టసోమముఖ్య
[5-31]

ఇట్టి వింకను పెక్కు కలవు.

ప్రబోధ చంద్రోదయము - శైలి :

నంది మల్లయ ఘంట సింగనల కవిత మలిసారిగా ఆంధ్ర సాహిత్యమునకు జంట కవిత్వపు మధురిమలనందించినది. జంట కవిత్వము వాగర్థముల కలయిక వంటిది. వీరు ప్రతి ఆశ్వాసాంతమును "ఇది శ్రీమదుమామహేశ్వర వర ప్రసాద లబ్ధ సారస్వతాభినంది నంది సింగయామాత్యపుత్ర మల్లయ మనీషి తల్లజ మలయమారు తాభిధాన ఘంట నాగయ ప్రధాన తనయ సింగయ కవిపుంగవ ప్రణీతంబైన ప్రబోధ చంద్రోదయంబను మహాకావ్యంబునందు" అని యిరువురి పేర్లను తప్పక పేర్కొని యుండనిచో, ఈ ప్రబంధమేక కవి కర్తృకమే యనిపించు నంతటి శైలీ సామ్యముతో నొప్పారుచున్నది. ఇందెచ్చటను 'ఈ భాగమీ కవిచే రచియింపబడినది. ఈ భాగమింకొకరిది' అని వేర్పఱుచుటకు వీలులేదు. ఇట్లు జీవశరీరముల వలె కలసి నట్టిది వీరి కవిత్వము. కాని వీరిరువురిలో మలయమారుతకవి ఉత్తముడైన కవియను ప్రతీతి అనుశ్రుతముగా వచ్చుచున్నది.

వీరి శైలి సరళము నిసర్గము నైనది. దీనిని ద్రాక్షాపాకమని చెప్పవచ్చును. మూల నాటక కవిత్వము గూడ ప్రసాద మాధుర్యములతో కూడి యుండుట, అనువాదకుల సహజ శైలికి కొంత దోహదము గూర్చి యుండునను కొనుటలో తప్పులేదు. వీరు భావానువాదవిషయమున సమకాలిక కవుల ననుసరించినను, రచనా సంవిధానమున నొక నూతన మార్గము నవలంబించిరి. తమ్మ్యము నాద్యంతము నలతి యలతి పదముల కూర్పుతో నలంకరించి, జాతీయ

శబ్ద చందన సౌరభ్యములతో పాఠకుల మైమఱపింప జేయుట మఱియ మారత కవికిని అతని జంటయైన నందిమల్లయకును ప్రకృతి సిద్ధముగ వచ్చిన విద్య. వీరు కావ్యావతారికలో తాముభయభాషలయందును నేర్పరులమని చెప్పుకొనుటకు సంస్కృత నాటకమును క్షుణ్ణముగ సమీక్షించి అందలి భావార్థాదుల నెచటను పొల్లు పోనీక తెనుగున "సారపు ఫణితుల ప్రబంధ శయ్యకు" గూర్చుటయే దృష్టాంతమగుచున్నది. వీరు పాండిత్యప్రకర్షకై తమ కావ్యమును వ్యర్థములగు సమాసములతోడను అనుచితములగు ప్రౌఢవర్ణనాదికములతోడను నింపి యుండ లేదు. వీరు కావ్యావతారికలో

కం. పొరిబొరి నొప్పసలాకల
నొరసిన కుందనపు బూదెయును బోలె సభన్
సరసుల సంఘర్షణమున
వరకవి కావ్యంబు మిగుల వన్నెకునెక్కున్" 1–29

అని చెప్పుటనుబట్టి, తమ కావ్యము సరసులు తఱచిన కొలది వన్నెకు నెక్కునదిగా నుండవలెనని ఆశించినట్లు తెలియనగుచున్నది. కావుననే వారు జటిలమును దురవగాహమునైన వేదాంతార్థమును గూడ చమత్కారవంతమగు కావ్యమార్గమున ప్రకటించి యుండిరి.

వీరు మూలనాటకార్థమును సమగ్రముగ ననుసరించుటవలన ప్రత్యేకముగా వీరిదిట్లేయని చెప్పదగిన రామణీయకము ప్రబంధమం దెచ్చటను గోచరింపదు. కాని మూలభావమును, తెలుగు సొబగుతో తీర్చిదిద్దు నైపుణ్యము సర్వత్ర కాననగును. ఇట్టి తెనుగు సేతయే కావ్య సౌందర్యమునకు దోహదకారి కాజాలినది. ఈ తెనుగు తనము మూలమునకు కొన్నిపట్ల మెఱుగులు దిద్ది యున్నది. అట్టి ఘట్టములలో తృతీయాశ్వాసము నందలి జిన, బుద్ధ, కాపాలికుల సంభాషణము ప్రధానముగా పేర్కొనదగినది. వీరీ ఘట్టము నపురూపములగు జాతీయములతో నలంకరించిరి. "గుడి మ్రింగేవానికి దల్పులప్పడము ల్గావున" "రెండిటికిని జెడిన రేవడనైతి" 'తాజెడ్డకోమటి వెనకయ్య చేతికి వెసలఖిచ్చిన విధమున' మున్నగు లోకోక్తులను వీరు సందర్భానుగుణముగ ప్రబంధమున జొప్పించిరి. వీరీ కావ్యమున సరసములగు జాతీయములు నుడికారములు పెక్కులు గలవు. గుట్టుచెఱిచి, ఒడిగట్టుకొని, వావిదప్పి (11–50) పండు

వెన్నెలలు [1-48, 60] పగ్గముపాము కానికరణి [1-82] కంచుపదనువంటి [1-80] ప్రాణ పర్యంతమెట్టు [1-57] పిడుగువంటి వార్త [1-58] పిడుగు వలె వచ్చి [3-77] పూసగ్రుచ్చినట్లు [1-65, 4-50] ఎడమ పెన వెట్టుదురే [1-81] అడియాస పాదుకొల్పి [1-75] పిల్ల పిల్ల తరము [2-67] మనసు చీకట్లు కొలుప [2-71] దేవర పాదమాన - నీపాదమాన [2-53, 4-24] చెవికి నింపై [2-42] చంకబెట్టుకపోడె [3-11] తామరపాకునీరుగతి [4-57] కడుపు చుమ్మలు చుట్టగా [5-8] జిహ్వకు జిడ్డంటనికరణి [5-31] గుదెల నెముకలెల్ల గుల్లలుగను [5-69] శాస్త్రపుం బల్లఱపులు [3-2] కాలూదనైన కలదె ఎడము [2-64] మల్లి చఱచుచు [2-66] దిగ్గనెగుండె [3-75] కాలి గోరునం బోలరు [2-45] ప్రొద్దు పొడుపు [5-34] వెక్కసపుటలుక [5-95] కుక్కలడ్డంబులు వెంటంబడ్డ విధంబున [5-97] కాలుమట్లనెపోయె [4-69] చెవులు మూసికొని [3-35] పిష్పంబులు మొలపించి [5-10] చెవియుంజెక్కు నెఱుంగకుండ [3-2] మున్నగునవి వానిలో కొన్నిమాత్రమే. ఈ కవులకు శబ్దాలంకారములపై ప్రీతిమెండు. వీరర్థాలంకారములలో ఉపమార్థాంతరన్యాస స్వభావోక్త్యాదులను దప్ప అన్యముల నధికముగ ప్రయోగింప లేదు. వీరు ముద్రాలంకారము నొక ఎడ వాడియున్నారు.

భుజంగ ప్రయాతము :

నయ ప్రాపితో త్తేజన ప్రౌఢ శౌర్యో
దయోద్భూత విద్వేషి ధాత్రీ భుజంగ
ప్రయాతా వధి క్ష్మాధర స్థాపితోద్య
జ్జయ స్తంభ సంభారి జంభారి భోగా 4-72

వీరు అచటనచట సంస్కృత పద భూయిష్ఠములగు పద్యములను రచించియుండక పోలేదు. కాని ప్రబంధమున కేవలమొక యుద్ధ ఘట్టమున మాత్రమే అట్టివి యెక్కువగా కనవచ్చును.

వీరు ప్రబంధమున సాధారణ వృత్తములతోపాటు, హరిణి, మాలిని, మత్తకోకిల, ఉత్సాహ, పృథ్వి, మహాస్రగ్ధర, లయగ్రాహి, స్రగ్విణి, మణిగణనికరము, కంద గర్భిత మణిగణనికరము, తరళ, మంగళమహాశ్రీ మున్నగు విశేష వృత్తములను కూడ వాడిరి. కావ్యమును మంగళముతో నారంభించి,

మంగళపూర్వకముగా నదేవృత్తముతో ముగించుట అను సంప్రదాయమును నన్నెచోడు డారంభింపగా దానిని తరువాత జక్కన, మడికిసింగనాదులును ఈ జంటకవులును అనుకరించిరి, వీరిపై పూర్వకవులలో పోతనామాత్యుని ప్రభావమీ క్రింది పద్యమున స్పష్టముగ కనవచ్చును.

ఉ. ఎవ్వనిచే జనించు, జగమెవ్వనిలోపల నుండు లీనమై

ఇత్యాదిగా పోతన భాగవతమున వ్రాసిన పద్యమును ఈ కవులు

ఉ. ఎవ్వనియందు విశ్వముదయించు, నడంగు, దలంపనీ జగం
బెవ్వని దీప్తి గాన బడు, నెవ్వని తేజము చిత్సుఖాత్మకం,
బెవ్వని బుణ్యులెల్ల గుణియింపుచు ద్వైత తమంబు బాసి తా
రెవ్వలనన్ భవంబునకు నేగరు వాని నుతింతు సీక్రియన్ 5-82

వీరి కావ్యమున సుమారు నలువది రెండు గద్యములున్నవి అవి అన్నియు నాతి దీర్ఘముగా సరళముగ సాగినవి ఈ వచనములు వర్ణన ప్రధానములుగ కాక, కథా ప్రధానములై యుండుట విశేషము. ఇట్లు లలితముగ వచనమును రచించుట వీరి సమకాలికులలో నరుదుగ కనవచ్చును.

ఈ జంట కవులు కొన్ని విశేషములగు దేశీయ పదముల నుపయోగించిరి. 1. వెరుసుమాట (1-46) 2. నల్లమేక తప్పు (1-50) 3. ఆసాసలీను చుండ (2-64) 4. గాణుకలుగనేరదు (2-75) 5. గజరుగజరులు (3-46) 6. సవరనిదంచు (4-7) 7. కేళ్ళంగి వ్రేసినట్లు (5-3) 8. ముసిడికొనలు (5-3) 9. మచ్చిక బొజుంగులు (2-69) 10. విరాకుల విత్తు (2-45) 11. ఏది నేదితి (5-3) 12. పొఱబిగియ (2-51) 13. చీకు త్రవ్వెడిని (5-95) 14. చుఱచూర్లు చూడగ (3-7) 15. వదలు వల్లయ్యె (5-53) మున్నగునవి.

వీరు తొత్తుకూతురు, తొత్తుమారికాన, కుంచెనకత్తె అను పదములను కూడ నుపయోగించిరి.

ఈ కవులు తమ ప్రబంధమున ధ్వన్యనుకరణ శబ్దముల నధికముగ నుపయోగించిరి ఇవి యెడనెడ పునరుక్తములై గూడ నున్నవి. ఎల్ల నెల్లన (1-12) గరగరిక (1-54) కసిమసంగి మెసంగు (1-58) మేలుమేలు (5-68) ఓసి ఓసి (5-95) చెకచెక చెక్కుల (5-59) ఇస్సిస్సి (3-12) నవ్వులుం బువ్వులుంజల్లు (5-58) తటతట (4-60) పురపురమను (3-12) చిట్టుముట్టు

మటంచు (3-32) గజరుగజరు (3-46) ఘల్లుఘల్లున (2-71) దొనదొన (3–12) ఎఱింగెఱింగి (5–2) కూడిమాడి (5–42) నకనకలై (5-59) తప తప (3–60, 2–59) యదాయదలు (5–100) హోరాహోరి (1–43) అల్లల్లి [3–25] కలకల (3-51, 58) కొఱకొఱ (2–48) వికవిక (5-83) గొలగొల (1-25) చొక్కిచొక్కి (2-73) వెదవెద [13-69] మున్నగునవి.

ఈ కవుల భాషా ప్రయోగమున కొన్ని స్వతంత్ర వ్యాకరణ ప్రయోగములు కనవచ్చుచున్నవి.

1. అణగుండె [1-44] [అణఁగి + ఉండె]; ఎఱింగెఱింగి [ఎఱింగి + ఎఱింగి] [4-7]; సంశయించడుగనొల్లక [5-112] సంశయించి + అడుగనొల్లక.
2. ముదిమను తెల్లత్రాచు [4-35] [ముదిమి + అను]; ఇకారసంధి.
3. మిథ్యోట [5-28] మిథ్య + ఔట- తత్సమాకారమునకు సంధి. ఆత్మ + అను; ఆత్మను [2-19]; ప్రతిమౌట [4-7] ప్రతిమ + ఔట.
4. ద్వైతా ద్వైతపదవి-ద్వైతాద్వైతపుటడవి—టుగాగమ లోపము.

ప్రబోధ చంద్రోదయ నాటకము ఉపనిషత్ ప్రధానమగు కావ్యమగుటచే నిందలి నాందీశ్లోకము మొదలుకొని పెక్కు శ్లోకములు చక్కని సుభాషితములై యున్నవి. వాని నన్నింటిని తెలుగు కవులు అనువదించుటయే కాక, ఎడనెడ మూలసుభాషితములందు కొన్ని మార్పులుచేసి కొన్ని అమూలకములను గూడ చేర్చిరి. ఆ సుభాషితము లన్నియు పేర్కొనిన అతివిస్తరమగును కాన అందు మచ్చునకు నొండు రెండు మాత్రమే పేర్కొనబడుచున్నవి.

1. "కార్యాకార్యము లెఱుగక
నార్యత వర్తించు గురువు నైనను విడువన్
మర్యాద యనుచు వృద్ధా
చార్యులు పలుకుదురు వేదసమ్మతమగుటన్" 1-68

2. మ. ఇది నాతల్లి, యితండు తండ్రి, యిది నాయి, ల్లీ కళత్రంబునా
యిది, నాబిడ్డలు వీరు నాహితులు వీరే, వైభవం బెల్లనా
యది, యంచున్ జడమానసోదయు డవిద్యానిద్ర ఘూర్ణిల్లుచున్
సదసద్వస్తు వివేకి యయ్యె గను సంసారామితస్వప్నముల్ 2-77

3. తమలోన నొంటు కుండిన
సమసంభవు లైనవారు శత్రులు యెడలన్
సమయము గూడుదు రెదిరికి
దమగుట్టిచ్చుట శుభప్రదముగాదగుటన్ 4-63

ఈ జంటకవులు మూలమును సమగ్రముగ అనుసరించుట వలన నందలి గుణములన్నియు వీరి రచనలో గనవచ్చుచున్నవి. మూల నాటకమున కృష్ణ మిశ్రు డొకచో రెండర్థములను సంఘటించి యున్నాడు. నాటకము నందలి ప్రతి పదమును వేదాంతార్థద్యోతకముగ నున్నది. అట్లే ప్రబంధ వాక్యములుగూడ గంభీరార్థ పూరితములై యొప్పుచున్నవి.

ప్రథమాశ్వాసమున కాముడు రతితో తమ వంశోత్పత్తిని గూర్చి చెప్పుచు "పూర్వంబున సంగరహితుడైన పరమేశ్వరునకు దద్గృహిణి యైన మాయకు గూటమి లేకయే చిత్రంబుగా సంభవించిన మనంబునకు దనయుండైన వివేకు నకు" (1-68). ఈ వచనములు శ్రుతి వాక్యములతో నమన్వితములగును. "బ్రహ్మణో వ్యక్తః, అవ్యక్తాన్మహత్, మహతోఽహంకార, అహంకారాత్పంచ తన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యః పంచమహాభూతాని, పంచ మహాభూతేభ్యోఽ ఖిలంజగత్": ఈ వాక్యములు సృష్టిక్రమమును వివరించునవి. ఈశ్వరుడు అద్వితీయ పరబ్రహ్మము. మాయ అనునది అవ్యక్తము. మాయావృతుడగు పర మేశ్వరుని యందు మన సుద్భవించినది. ఈ మనసు నందుండియే బాహ్యాంతర ప్రపంచ మెల్లనేర్పడినది - ఇట్లే పంచమాంకమున -

"భారతీదేవి మనసుతోడ
వత్సనీతనయుండు వైరాగ్యుడేతెంచెనితని సంభావింపు మిప్పుడనిన
మనసా సరస్వతి మాటకు హర్షించి కదిసి మ్రొక్కిన సుతు గౌగిలించి
పుత్రక! నీవుమున్ పుట్టినప్పుడె నన్నువిడిచి పోవుట జేసి వెదగనైతి

నిన్ను జూడంగ నిపుడు నానెమ్మనమున
నాటుకొని యున్న శోక చింతా భరంబు
ప్రొద్దు పొడుపున జీకట్లు పోలె దొలగె
ననిన వైరాగ్యుడిట్లను జనకుతోడ 5-33

ఇచట చిరకాల మెడబాసిన పుత్రుని గాంచిన ఆనందము సహజముగ వ్యక్తము గావింపబడినది. విషయరసాదులయందు బడి చింతావ్యాకులుడై యున్న జీవు

నిలో వేదాంత బోధ వైరాగ్యమును కలిగించి మనఃప్రశమన మొందించుటు చమత్కారముగ నిర్దిష్టమైనది. ఇట్టియెడ భావభరితమును సరళమునైన పద్య రచన హృదయరంజకమై యొప్పుచున్నది.

ప్రబోధ చంద్రోదయ కావ్యమున, దార్శనిక భావము లెన్నియో లెస్సగా విశదీకరింపబడినవి. ఇందలి పాత్రములన్నియు చైతన్యవంతములై శోభిల్లు చున్నవి. అమూర్త భావములకు మూర్తిమత్త్వము గల్పించిన నేర్పు ప్రబోధ చంద్రోదయ విశిష్టత కాక నిదర్శనము.

కాముని రూపవర్ణనమును కవులిట్లు చేసియున్నారు.

“రతి సముత్తుంగ కుచాంకిత రోమాంచకంచుకితాంగుండును మద ఘూర్ణితాపాంగుండును సకల జగన్మోహనాకారాభిరాముండునగు కాముండు... (1-46)

ఇందు ముజ్జగములను రమింపజేసెడు మనోజ్ఞత్వముతోపాటు, కాము నందలి రజోగుణము కూడ వ్యక్తము చేయబడినది. ఆయా సంకేతములకు ప్రతీకలుగా పాత్రలెటు కల్పింపబడినవో తచ్చేష్టాదికములు గూడ నట్లే కల్పింప బడి ఆ పాత్రలకు సమగ్రస్ఫూర్తి నొసంగుచున్నవి. క్రోధుడు తన ప్రభావము నిట్లు వివరించుచున్నాడు.

కం. కానడు కృత్యాకృత్యము
వీనుల హితభాషణములు వినడభ్యస్తం
బైనట్టి విద్యమఱచును
మానవు డెటువంటి వాడు మత్సంగతుడై 2-58

క్రోధావేశము కృత్యాకృత్య రాహిత్యమును కలుగ చేయును. ఇది క్రోధుని చర్యాదికముగ నిరూపింపబడినది.

ఇక ఈ ప్రబంధమున గమనింపదగిన అంశమొకటి కలదు. అది ఇందలి స్త్రీ పాత్రల విషయము. ఈ పాత్రలు, తదితర ప్రబంధ పాత్రలకంటె మిక్కిలి విలక్షణములు. వీరియందు స్త్రీ సహజములగు ముగ్ధతా సౌందర్యములు కాని, విలాసములు కాని కానరావు. వీరు కావ్య కథాగమనమునకు సహకారిణులు మాత్రమే. శాంతి, కరుణ, ముదిత, శ్రద్ధ, మైత్రి మున్నగు వారు ఆయా

మృదుల భావములకు ప్రతిరూపములు కాగా, హింసా తృష్ణా రత్యాదులు తత్సహజ తమోరూపములకు ప్రతిబింబములై యున్నారు. ఇందు ఒక్క విభ్ర మావతికి మాత్రము మందయాన విలాసము వర్ణింపబడినది.

విమర్శకులు భావించినట్లు ప్రబోధ చంద్రోదయమున అన్య దర్శన నిరసనము కొంత తీవ్రముగ సాగినదనియే చెప్పవచ్చును. కృష్ణమిశ్రుడు జిన, బుద్ధ, కాపాలికాది మతములు మహా మోహావిష్టములని తెలుపును. అందులకే ఆమతముల వారు మోహుని భృత్యులుగా చెప్పబడిరి.

"వినుడు ఋషిసేవ, దవులం
గని మ్రొక్కగ వలయు వారు కాంక్షించిన భో
జన మిడవలె, వారలు దమ
వనితల రమియింప నీర్ష్యవలవదు చేయన్ 5-ప

అని దిగంబర సిద్ధాంతి పలుకుట, బౌద్ధుడు "సర్వ సంస్కారంబులు క్షణికం బులు, నాత్మయు స్థిరంబు గావున భిక్షుకులు తమ దారల నాక్రమించిన నుపాస కుల నీసడింపరా" దని పలుకుట (౫-21).

సోమసిద్ధాంతి :

"పార్వతీ వనితగా భావనచేసి చక్కని చకోరేక్షణ గౌగిలించి చూడ
తన్ను సదాశివాత్మకునిగా భావించి, క్రీడించునతడిందు మూర్తి" 3-41

అని చెప్పుట చూచినచో ఆమతములు కేవలము వ్యభిచారమునే బోధించినవా యను తలపు కలుగును. జిన, బౌద్ధ సిద్ధాంతులు కాపాలిన్యాలింగన స్పర్శనము నకు సొక్కి, సురాపానమున మైమఱచి కాపాలికుని తమ గురువుగా భావించుట కూడ ఆ మతములపై కృష్ణమిశ్రునికిగల నిరసనమును తెలియజేయుచున్నది. కృష్ణమిశ్రుడు అద్వైత మహత్త్వము తెలియజేయుటకై ఇతర దర్శనాదర్శము లను నిరసించుటచే పాఠకుల కాతని యుద్దేశము స్పష్టమగుచునే యుండును.

వేదాంతార్థమును బోధించుటలో ఒక చక్కని క్రమమేర్పడుట కూడ ఈ కావ్య ప్రసిద్ధికి దోహదమగుచున్నది. పరమాత్మ జ్ఞాన మెఱుంగుటకు గల సాధనాంతరము లిట్లు బోధింపబడినవి.– "కామ క్రోధాదుల గెలువ నుద్యోగంబు చేయు మట్లైన వైరాగ్యం దేతెంచు, నేనును సమయంబెఱింగి యమనియమ ప్రాణాయామాదుల బ్రోది చేసికొని భవదీయ సైన్య సంరంభణము చేసెద.

శాంత్యాది కౌశలంబున నుపనిషద్దేవీ సంగతుండవగు నీకుం బ్రబోధ చంద్రుం డుదయించుటకునై, ఋతంభరాదేవీ సమూహంబునుం గృత సన్నాహయై యున్నయది యని చెప్పుమనిన" ఇందు ప్రబోధ చంద్రోదయ పర్యంతము కావలసిన మానసిక పరిణామము బోధింపబడినది.

ప్రబోధ చంద్రోదయమున మానవ స్వభావమునకు సహజములగు భావములు గూడ రుచిరముగ విశదీకరింపబడినవి. తృతీయాశ్వాసమున శాంతి తన తల్లిని కానక ఆమె కొఱకు పరితపించుట, పంచమాశ్వాసమున మనసు పుత్ర శోకాతురుడై విలపించుట, ఉపనిషద్దేవి మీమాంసాదులచే తఱుమబడి దురవస్థ పాలగుట, మున్నగు నంశము లీవిషయమున పేర్కొనదగినట్టివి. పురుషుడు, వివేకుని గలిపి సలిపిన ఉపనిషద్విచారము పరమాత్మ తత్త్వమును లెస్సగా దెలుపుచున్నది. ఇట్లు అన్నివిధముల ఆత్మానంద జనకమై సాగిన ఈ ప్రబంధము రమ్యమైన దనుటలో సందేహము లేదు.

రసపోషణ :

ఈ కావ్యమునందు ప్రధాన రసము శాంతము. శాంతము రసమగునా కాదా యను విషయమున లాక్షణికులలో నభిప్రాయ భేదములున్నవి. భరతుడు నాట్యశాస్త్రమున రసము లెనిమిది అనియే పేర్కొనెను[18]. తొలుదొల్త ఈ శాంత రస ప్రస్తావనము చేసినవాడు భట్టోద్భటుడు. అతడు కావ్యాలంకార సార సంగ్రహములో తొమ్మిది రసములను పేర్కొనెను.[19] అభినవ గుప్తపాదులు శాంతమును రసముగ నంగీకరించుటయే కాక, దానిని కావ్య, నాటకాదులయం దంగిరసముగ నిబంధింప వచ్చునని తెలిపిరి. అభినవ గుప్తుని గురువగు భట్ట తౌతుడు శాంతమే ప్రధానరసమని భావించినట్లు కాణే పండితుడు తెల్పియుండెను. "We know that Bhatta Touta was the guru of Abhinavagupta and that he wrote a work called Kavya koutuka, on which Abhinava wrote a Vivarana. One of his doctrines was that Santa was at the head of all Rasas and it led on to Moksha."[20]

సాహిత్య దర్పణకారుడు శాంతరస లక్షణముల నిట్లు పేర్కొని యున్నాడు.

"శాంతమునకు శమము స్థాయి భావము. నాయకుడు ఉత్తముండు. కుందేందు సుందరము వర్ణము. నారాయణుడు అధిదేవత. అనిత్యతాదికారణంబున

సకల వస్తు నిస్సారతయేని, పరమాత్మ సర్వరూపమేని ఆలంబనము. పుణ్యా శ్రమ హరిక్షేత్రములు, తీర్థములు, రమ్యములైన వనములు, మహాపురుష సంగ మము మున్నగునవి ఉద్దీపనములు. రోమాంచాదు లనుభావములు. నిర్వేద హర్ష స్మరణ భూతదయాదులు వ్యభిచారులు 21

ప్రబోధ చంద్రోదయమునందు శాంతము సర్వలక్షణ సమన్వితముగ పోషింపబడినది. సంస్కృత నాటక సాహిత్యముననూ, ఆంధ్ర ప్రబంధ సార స్వతముననూ శృంగార ప్రధానములగు కావ్యములు కోకొల్లలుగ నున్నవి. కాని శాంతరస ప్రధానములైనవి ఒండు రెండు మాత్రమున్నవి. ఇవి ఉద్భవించిన పిమ్మట కూడ నేతదన ప్రధానములగు కావ్యము లుద్భవింపకుండుటచే దీనిని సమర్థతతో పోషించుట దుష్కరమని తేటతెల్లమగుచున్నది. ఈ ప్రబంధమున ద్వితీయాశ్వాసమున, క్రోధ, తృష్ణా లోభాదికముల ప్రాచుర్యము చెప్పబడినది. చతుర్థాశ్వాసమున తన్నివారణోపాయములగు క్షమా, వైరాగ్యసంతోషాదుల ప్రసంగము కలదు. పంచమాశ్వాసమున సరస్వతిబోధ, శాంతరస స్థాయియగు శమమును వివరించుచున్నది. చిట్టచివర ప్రబోధ చంద్రోదయము పాఠకులను రసానంద పరవశులుగ నొనరించి పర బ్రహ్మస్వరూతమును ప్రత్యక్షము చేయు చున్నది.

హాస్యము :

ఈ కావ్యమున అంగిరసమగు శాంతముతోపాటు, అంగరసములు కూడ నెడ నెడ పోషింపబడినవి. అందు హాస్యము పేర్కొనదగినది. ఇందలి ద్వితీయాశ్వాసమున దంభాహంకారుల సంభాషణముననూ, తృతీయాశ్వాసమున జిన, బుద్ధ కాపాలికుల ప్రసంగముననూ సరసమగు హాస్యము ప్రకటితమైనది.

## ప్రబోధ చంద్రోదయ నాటకమునకు ఇతర కావ్యరూపానువాదములు :

ప్రబోధ చంద్రోదయ నాటకమునకు రెండవ పద్య కావ్యరూపానువాద మును గావించిన వాడు శ్రీ కొటికలపూడి వెంకటకృష్ణ సోమయాజి.22 ఇతని కాలమును శ్రీ ఆరుద్రగారు క్రీ. శ. 1750–1850 నడుమ భాగముగా నిర్ణ యించిరి.

48)

కవి మూలనాటకమును యథాతథముగ అనువదించి యున్నాడు. ఇందు నాటకమునగల నాందీ శ్లోకములు, ప్రస్తావన అన్నియును గలవు. భరతవాక్యము గూడ నాటకమునే అనుసరించుచున్నది. ఇందు కవి సూత్రధారుని ముఖమున తాను కృష్ణమిశ్రుని నాటక కథాభేదములను వివరింతునని చెప్పించెను. ఇచ్చట భేదములనగా విశేషములని యర్థము. మూలమున "సంభూతః ప్రథమ మహేశ్వరస్య సంగాన్మాయాయాం మన ఇతి విశ్రుత స్తనూజః" అని యున్నదానికిం దనువాద మిట్లున్నది.

చ. "అనవిని కాముడిట్లనె శుభాంగి మహేశుని గొల్చి మాయ దా

గనియె మనస్సమాఖ్యుని".... కవి ఇందు మూలమున గల సంగ శబ్దమును పరిహరించి ముందు వచ్చు "పుంసః సంగసముజ్ఝితస్య గృహిణీ మాయేతి తేనాప్యసా వస్పృష్టాపి మనః ప్రసూయ తనయాం లోకా నసూత క్రమాత్" అనెడి శ్లోకమునకు అనువాదముగా రచించిన

ఉ. సంగము లేని బ్రహ్మకును జాయయనందగె మాయయాను

వర్ణాంగి మనస్సుతుం, జగములన్నియు గాంచెను.

అను పద్యభాగమునందలి "సంగములేని" యనెడి భావమునకు విరుద్ధము గాకుండ చేసెను.

నాటకమున చతుర్థాంకాంతమున దండకరూపమున నున్న శివకేశవ స్తుతుల నితడు ద్వితీయాశ్వాసాంతమున స్వతంత్ర పద్ధతిలో ననువదించెను. ఇచ్చట గల ఐదారు స్తుతిపద్యములు అమూలకములు.

సీ. గాంగేయ సన్నుతాకారుడు మాధవు

డండజాధీశ వాగర్చితుండు

జీమూతధాముడు సేవిత బుధగణు

డంధకాసుర దోర్బలాపహరుడు

విషమాంబక యుతుండు వృష వర్ణిత గుణుండు

చతురాననస్తుత సద్యశుండు

సకలాగమాంత పూజాభాజనుడు సత్వ

సంయుతుం డచ్యుత సాయకుండు

గీ. ప్రజల జగదుద్భవ స్థితి ప్రళయ కార్య

కారణానుచ రావృతాగారుదనుచు

జనులు నిన్ను నుతించిన సరణి హరిని
సన్నుతింతు రభేదధీసహితులగుచు"

ఇతి హరి హరాద్వైత భావమును హృద్యముగ ప్రకటించుచున్నది. మూలమున పంచమాంకమున గల "మార్జార భక్షితే దుఃఖం యాదృశీ గృహ కుక్కుటే" యను శ్లోకమునకు

గీ. పొంచి కోడిని పిల్లి భక్షించినపుడు
మమతచే దుఃఖితుండౌను మానవుండు
చెలగి యది మూషకమును భక్షించునప్పు
డవ్విధంబున దుఃఖితుండౌనె చెపుమ" ఆశ్వా. 3

పై విధముగ గావించిన అనువాదము మూలానుసారమే అయ్యెను అందలి ఎత్తుగడలో "పొంచి" యను పదమునకు బదులు, "ఇంటికోడిని" అన్నచో మూలమున కనుగుణముగ నుండెడిది.

మూలమున షష్ఠాంకమున ఉపనిషత్తు పురుషునితో "(సకోపమివ) కోనా మాత్మాన మజానంత మంధమివ ప్రత్యుత్తరం దాస్యతి" (గ్రుడ్డివానివలె ఆత్మ నెఱుంగని వానికెవ్వరు ప్రత్యుత్తర మీయగలరు) రని పలికిన వాక్యమునకు

క. అనఘా ! యాత్మ నెఱుంగని
జనుడీశ్వరు డెవ్వ దని ప్రసంగించిన యా
తనికిం బ్రత్యుత్తర మి
చ్చిన పండితు డతని కంటె శ్రేష్ఠుండగునే"

అని కావించిన అనువాదము సరళమయ్యె, మూలము కంటె భిన్నముగాను విస్తృతతరముగను ఉన్నది.

ఈ కావ్యము నందలి ద్వితీయాశ్వాసాంతము నందు గల కాశీపురవర్ణనము ప్రబంధ రీతిలో సాగినది. ఇందు అల్లసాని పెద్దన మనుచరిత్రము నందలి "అటచని కాంచె భూమిసురు" డను పద్యానుకరణము గనవచ్చుచున్నది.

చ. "కనుగొనియె న్నివేకు డుడుకాంత శిలామయ సౌధసంచర
ద్వన రుహ లోచనా విలసిత స్తన మండల సంస్థ చంద్ర చం
దన కమనీయ గంధ ముదిత ప్రబల త్రిదశ స్రవంతికా
వనరుహ విభ్రమ ద్భ్రమర వర్ణ ననర్గళ కాశికాపురిన్"

ఈ విధముగా ఈ అనువాదము మూలమునకు విధేయమయ్యును ఎడనెడ స్వతంత్రమై ప్రబంధోచితమగు శైలీబంధముతో ఒప్పుచున్నది.

ఈ ప్రబోధ చంద్రోదయ కావ్యమున మూడాశ్వాసములు గలవు. ఆశ్వాసాంత గద్యమునందు "ప్రబోధ చంద్రోదయంబను మహా నాటకంబునందు ప్రథమాశ్వాసము" అని నాటకశబ్దమే ఉపయోగింపబడినది. ఇందు నాటకము నందలి ప్రథమ ద్వితీయాంకములు, ప్రథమాశ్వాసముగను (237 గద్యపద్యములు) తృతీయ చతుర్థాంకములు, ద్వితీయాశ్వాసముగను (222 పద్యగద్యములు) మిగిలిన రెండంకములు తృతీయాశ్వాసముగను కూర్చబడినవి. ఈ కావ్యమున 'సభిక' శబ్దము 'సభ్య' శబ్దమునకు పర్యాయముగా పలుమార్లు వాడబడినది. 'సభిక' పదమునకు సభయందలి ధర్మజ్ఞుడను నర్థమేకాక జూదరియను నర్థము కూడ నున్నది. ఇందలి శైలి సరళమై జాతీయములతో నొప్పారుచున్నది.

## ద్విపద ప్రబోధ చంద్రోదయము :

ఈ ద్విపద రూపమైన అనువాదమును గావించినవాడు రాచూరి వెంకట లింగకవి.[23] ఇతని తల్లి సుబ్బమాంబ. తండ్రి రామయామాత్యుడు. గురువు సద్గుణేంద్రస్వామి ఇతడు ఆర్వేల నియోగి. కౌండిన్యస గోత్రుడు. ఆపస్తంబ సూత్రుడు. ఈ గ్రంథము నితడు శ్రీ ఘెనపురి చంద్రశేఖర నృపతి, ఆతని కుమారుడు బంగారు వెంకట వీర పృథ్వీ వల్లభుడు అనువారల ప్రేరణచే రచించి శ్రీ రామభద్రునకు అంకితము గావించెను. ఈతని కాలము క్రీ.శ. 1800 ప్రాంతము.

ఈతడీ కావ్యమును రచించుటలో మూలనాటకమునే కాక, నంది మల్లయ ఘంట సింగనల కావ్యమును గూడ ఆధారముగ గ్రహించెనని తోచును. ఇతడు ఆఱంకముల మూలనాటకమును ఐదాశ్వాసముల కావ్యముగా రచించుట, చిదానంద నగర వర్ణనము గావించుట, ఈశ్వరునకు మాయవలన మనస్సనెడి పుత్రుడు పుట్టెనను సందర్భమున 'సంగ' శబ్దమును తొలగించుట, కథాంతమున జీవేశ్వరునకు పరమానంద రాజ్యపట్టము గట్టుట, ఫలశ్రుతి చేర్చుట మున్నగు అంశము లీవిషయమును నిరూపించుచున్నవి. పై సందర్భములోని భావములు, పదములు కూడ కొన్ని నంది ఘంటల అనువాదము నుండి గ్రహింపబడినవే అని చెప్పవచ్చును.

ఇక ఈతడు స్వతంత్రముగ కూడ కొన్ని మార్పులు చేసెను.

1. ఈతడీ కావ్యమును — పార్వతీ పరమేశ్వర సంవాదముతో నారంభించెను. "మునురజతాచలంబున శ్రీ కంఠు, గనుగొని పార్వతీ కాంత బంధ మోక్షములకు మనసు కారణ మందురది ఎట్లనిన" శివుడు మదిలో మోహ ముదయింప బంధ మొదవును. వివేకము గల్గ మోక్ష మొదవును" అని చెప్పెను. అంత పార్వతి మోహము వివేకము నేమిట జయించును? వాని పనులేవి? వాని బలమెయ్యది? వాని లక్షణములేవి? మోహమెట్లు ప్రబలును? వివేకము దానిని ఖండించి ఎట్లు ప్రబలును? కేటతెల్లముగ విస్తరింపు" మనెను. అంతట శివుడీ కథను చెప్పెను.

2. ఈ కవి కావ్యాంతమున నేతత్కావ్య ఘనతను వివరించెను:

ద్వి — ఇది మహా నాటకం బిది పావనంబు
అరయ సాకార నిరాకారములకు
కిర మొప్పగా నాది కారణం బదియు
శ్రుత్యంతములను విఖ్యతమైన దిదియు
ప్రత్యక్షమైన శబ్ద బ్రహ్మ మిదియు

సంతతం బీకృతి చదివిన బుద్ధి
మంతుడు సురలకు మాన్యుడై యుండు
మొక్కెదనని సాగి మ్రొక్కినయంత
గ్రక్కున శివుడెత్తి కౌగిట చేర్చి
అలివేణి! నీవు నేననెడి భేదంబు
గలుగునే మనలమొక్కటి యౌట గనవె
యని గౌరియును దాను నధిక సంతోష
మున బొంగి కైలాసమున నుండిరంత

పైని గ్రంథ రచనోద్దేశమైన అద్వైత భావము గూడ ప్రదర్శింపబడినది.

మొత్తము మీద ఈ గ్రంథము మూలవిధేయమే అని చెప్పనగును. ఇందలి ద్విపదలు ధారాళముగ సాగినవి. ఇందు 'దినరాత్రి', 'అనుభవించుక', 'మనలము' (మనము) వంటి ప్రయోగములు కన్పట్టును.

'వివేక విజయము' (యక్ష గానము) :

ప్రబోధ చంద్రోదయమునకు గల మఱియొక అనువాదము వివేక విజయము. ఇది యక్షగానము. దీని కర్త చల్లా సూరయ్య. ఇతడు 16వ శతాబ్ది యందలి వాడు. దీని వ్రాతపతి తంజావూరు నందలి సరస్వతీమహాల్ గ్రంథాలయమున గలదు. కోసూరి గంగాధరుడను కవియును జ్ఞానకురవంజి యను పేర ప్రబోధ చంద్రోదయ నాటకము ననుసరించుచు నొక యక్షగానమును రచించెనట.[24]

జగన్నాటకము :

ఇది తెలుగు ప్రబోధ చంద్రోదయము ననుసరించి వ్రాయబడిన స్వతంత్ర కావ్యము. ఏతద్గ్రంథ కర్త ఏమట్ల శేషాచలుడు. ఈతడు క్రీ.శ. 1700 ప్రాంతమున తెలంగాణమున నివసించెను. ప్రబోధ చంద్రోదయ కావ్యమువలె నిది కూడ ఐదాశ్వాసముల కావ్యము. ప్రబోధ చంద్రోదయమునకును జగన్నాటకమునకును గల భేదసాదృశ్యము లివి.[25]

రెండింటియందును ఈశ్వరుండైన పరబ్రహ్మంబు నందు జీవ ప్రకృత్యాది జననము వర్ణితమైనది. అందువలె నిందును వివేకుడు, మతి, కాముడు, రతి, క్రోధుడు, హింస, లోభుడు, తృష్ణ, అహంకారుడు అను పాత్రలు వత్తురు. అందు ప్రబోధ చంద్రుడు ఇందు జ్ఞానదేవుడు జనింతురు. బౌద్ధ, జైన, చార్వాకాది మత ప్రసక్తి రెంటియందు సమానమే.

## భేదములు

| ప్రబోధ చంద్రోదయము | జగన్నాటకము |
| --- | --- |
| 1. అద్వైత వేదాంత ప్రతిపాదకము. | 1. విశిష్టాద్వైత వేదాంత ప్రతిపాదకము. జీవ బ్రహ్మ భేద నిరూపకము. |
| 2. ఈశ్వరునకు మాయ వలన మనసు, మనసునకు ప్రవృత్తి | 2. ఇందు పరబ్రహ్మమునకు జీవ ప్రకృత్యాదులు జనించిరి. ద్వైత |

| | |
|---|---|
| నివృత్తి అను భార్యల వలన కామక్రోధాదులు, వివేకాదులు జనించిరి. | విశిష్టాద్వైతములందు మాయ లేదు. |
| ౩. అహంకారుని భార్య పేరు లేదు. | ౩. ఇందు మమకారి యను భార్య కలదు. |
| ౪. జైన బౌద్ధ చార్వాకాది సంవాదము, మోహునికి వివేకునికి యుద్ధము. | 4. శైవ వైష్ణవ సంవాదము, వారిరువురికిని యుద్ధము. |
| ౫. వివేకునకు ఉపనిషద్దేవివలన ప్రబోధ జననము. | 5. నిరహంకారునికి శాంతి వలన జ్ఞానదేవుని జననము. |

## ప్రబోధ చంద్రోదయము - అద్వైతబోధ:

"బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః" అను సిద్ధాంతము అద్వైతము. "బ్రహ్మ మొక్కటియే సత్యము, జగమంతయు మిథ్య. జీవాత్మ పరమాత్మ కంటె భిన్నము కాదు" అను జ్ఞానము నిది కలిగించును. ఈ విషయమునే ప్రబోధ చంద్రోదయ కావ్యమున

ఏకము, నిత్యము బ్రహ్మము వైకల్పిత వికృతులున్న వస్తువులెల్లన్
ఏకత్వ మెఱుగు వారికి శోకము మోహంబు లేదు సుమ్మీ మనసా 5-17

అని చెప్పును. ఈ అద్వైత మతస్థాపకులు శ్రీ శంకర భగవత్పాదులు. కృష్ణమిశ్రుడు శంకరుని అద్వైతమునే తన నాటకమున ప్రతిపాదించెను. కొన్ని కొన్ని అవాంతర విషయ నిరూపణములందు మాత్రము భిన్న మార్గ మనుసరించెను. కృష్ణమిశ్రుడు తన నాటకమున ప్రవచించినది వైష్ణవాద్వైతము. అవిద్యామోహము నుండి మేల్కొనిన పురుషుడు తాను విశ్వాత్మకుడైన సాక్షాద్విష్ణుస్వరూపుడే అను సత్యము నెఱుంగును.

"మోహాంధకార మవధూయ వికల్ప నిద్రా
మున్మథ్య కోప్యజని బోధ తుషార రశ్మిః

శ్రద్ధా వివేక మతి శాంతి యమాదికేన
విశ్వాత్మకః స్ఫురతి విష్ణురహం స ఏషః 6-10

కృష్ణమిశ్రు డిందాద్యంతము భక్తి ప్రాబల్యమును వివరించెను.

"అముష్య సంసారతరో రబోధ మూలస్యవోన్మూల వినాశనాయ
విశ్వేశ్వరారాధన బీజ తత్త్వావబోధా దపరోఽభ్యుపాయః" 4-7

భక్తియనెడు బీజమూలమున లబ్ధమగు తత్త్వబోధమే ఈ భవవృక్షమును సమూలముగ కూల్చివేయుటకు తగిన సాధనమని తెలిపెను. జీవుడీ భక్తి ద్వారముననే పరమాత్మైక్యమును గుర్తించి కృతకృత్యుడగును. "సర్వదా కృత కృత్యోస్మి భగవత్యావిష్ణుభక్తేః ప్రసాదాత్" అని సార్థక్యము పొందును. జీవన్ముక్తావస్థ యందును ఆమె అతనితో నుండును. ఇట్లందు, భక్తితత్త్వ మద్వైతముతో మిళితమాయెను.

ప్రబోధ చంద్రోదయము నందలి ఈక్రింది రెండు శ్లోకములందును జగన్మిథ్యాతత్త్వమును, నిర్గుణము సగుణమునైన పరమాత్మ స్వరూప తటస్థ లక్షణములును బోధింపబడినవి.

మధ్యాహ్నార్క మరీచి కాస్వివ పయః పూరో యదజ్ఞానతః
ఖం వాయు ర్జ్వలనో జలం క్షితిరితి త్రైలోక్య మున్మీలతి
యత్తత్వం విదుషాం నిమీలతి పునః స్రగ్భోగి భోగోపమం
సాంద్రానంద ముపాస్మహే తదమలం స్వాత్మావబోధం మహః 1-1

మధ్యాహ్న సూర్యుని కిరణములు జలమయములై తోచునట్లు, అజ్ఞాని కీవిశ్వము భూజల వాయ్వగ్ని నభోమయముగ కన్పట్టును. యోగుల దృష్టికి పూదండ యందలి సర్పభ్రాంతి వంటిదగు నీ భ్రాంతి తొలంగును. ఇట్లు స్వప్రకాశమును, నిర్మలమును, జ్ఞాన ఘనమును, అగు పరమాత్మ నుపాసింతును.

"యతోవా ఇమాని భూతాని జాయంతే యేన జాతానిజీవంతి యత్ప్రయంత్యభిసంవిశంతి తద్విజిజ్ఞానస్వ తద్బ్రహ్మేతి" అని శ్రుతివాక్యము. చరాచరమగు నీ సర్వప్రపంచము ఎందుండి యుద్భవించెనో, ఎందుండునో, ఎందు లయించునో అదియే బ్రహ్మము. అనగా సర్వ ప్రపంచమునకు నుత్పత్తి స్థితి లయకారణము బ్రహ్మము. ఆ పరమాత్మ మాయా కారణమున పృథ్వ్యగ్ని తేజోవాయు రూపముల గోచరించును. ఈ తటస్థ లక్షణమునకు, కృష్ణమిశ్రుడు

మధ్యాహ్నార్క మరుమరీచికలను, స్రగ్భోగి భోగమును ఉపమానముగ చెప్పెను. ఇక సాంద్రానందము, అమలము, స్వాత్మావ బోధము అను మాటలలో పరమాత్మ స్వరూప లక్షణము చెప్పబడినది. ఈ ప్రపంచ కల్పనారంభమునకు పూర్వము, ఏకము అద్వితీయమునయి, సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహితమైయున్న ఏకైక వస్తువు బ్రహ్మము. ఈ బ్రహ్మపదార్థము నేతినేతి వాక్యములతో మాత్రము నిరూపింప దగినది. ఈ ప్రపంచము అనృతజడ దుఃఖాత్మకము. అట్లు కానిది బ్రహ్మము. అందుచేతనే దానిని సచ్చిదానంద మనిరి. 'తమేవ భాంతమను భాతి సర్వం' అని శ్రుతి చెప్పినట్లు ఆ బ్రహ్మము తాను స్వయం ప్రకాశమానమయి సర్వ జగత్తును, సూర్యచంద్రాదులను సైతము ప్రకాశింప జేయుచున్నది.

> అంభః శీత కరాంతరిక్ష నగర స్వప్నేంద్ర జాలాదివత్
> కార్యం మేయ మసత్య మేత దుదయ ధ్వంసాది యుక్తం జగత్
> శుక్తౌ రూప్యమివ స్రజీవ భుజగః స్వాత్మావ బోధే హరా
> వజ్ఞాతే ప్రభవ త్యథాస్తమయతే తత్త్వావ బోధోదయాత్ 6-32

జలమున గనవచ్చు చంద్రుడు, గంధర్వ నగరము, స్వప్నము, ఇంద్రజాలము అనువానివలె కార్యము అనృతము. అదిమేయము. ఉదయధ్వంసాన్వితము. అట్టి జగము రజ్జువున సర్పము, శుక్తియందు రజతమువలె బ్రహ్మము నందు గోచరించును. అజ్ఞాన మూలమైన ఈ అబోధము తత్త్వజ్ఞానముచే తొలంగును — 'కస్మిన్ను భగవతో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి' అనునది శ్రుతివాక్యము. స్వాత్మావ బోధ రూపమగు బ్రహ్మము కంటె ప్రపంచము భిన్నము కాదు. కాని అధ్యాసచే ఒకదానియం దింకొకటి గోచరించును. ఒకప్పుడు త్రాడు పాము వలెను, ముత్యపుచిప్ప వెండివలెను తోచును. సర్పభ్రాంతికి రజ్జు వధిష్ఠానము. రజతభ్రాంతికి శుక్తి అధిష్ఠానము. ఈ అధిష్ఠాన జ్ఞానము కలిగిన ఎడల సర్వమును భ్రాంతియని తోచుటచే అజ్ఞాన మడగును. సర్వానర్థ నివృత్తి కరమగు ఈ తత్త్వజ్ఞానమే పురుషార్థ సాధనము.

**మాయ :**

జగన్మిథ్యా తత్త్వమును వివరించు నీ వేదాంతమున మాయా సిద్ధాంత మధిక ప్రాముఖ్యము వహించును. మాయయే అఖిల సృష్టికి కారణము. కృష్ణమిశ్రుడు జగత్సృష్టిని గూర్చి యిట్లు చెప్పెను.

"పుంసః సంగసముజ్ఝితస్య గృహిణీ మాయేతి తేనాప్యసా
వ స్పృష్టాపి మనః ప్రసూయ తనయం లోకా నసూత క్రమాత్" 1-17

"సంభూతః ప్రథమ మహేశ్వరస్య సంగా
న్మాయాయాం మన ఇతి విశ్రుత స్తనూజః
త్రైలోక్యం సకల మిదం విసృజ్యభూయ
స్తే నాథో జనిత మిదం కులద్వయం నః" 1-19

ఈ ఈశ్వర మాయా సంగ మతిచిత్రమైనది. సత్యమును గప్పిపుచ్చి యసత్యమును ప్రదర్శించు నీ రెండు గుణములు మాయాలక్షణములు. ఈ లక్షణమును బ్రహ్మ కారోపించిన అత డీశ్వరుడగును. అచలము శుద్ధమునగు ఏకబ్రహ్మము, తన మాయా శక్తిచే సృష్టికర్త అయ్యెను.[26] కృష్ణమిశ్రు డీసిద్ధాంతమును కావ్య రీతిలో చమత్కరించెను. పురుషుడు నిస్సంగుడు, ఆతని గృహిణి మాయ. తత్సంస్పర్శనము లేకయే ఆతడు మనోభిధుడగు సుతుని గాంచెను. రెండవ శ్లోకమున "సంభూతః ప్రథమ మహేశ్వరస్య సంగాత్" అని గలదు. ఇట నీ సంగము కేవలవీక్షణ మాత్రమే అని గ్రహింపవలెను. ఈ మాయ పురుషుని గృహిణి ఆయ్యును ఆమె వేశ్యావిలాసిని వలె నాతని వంచించును. అవిచార సిద్ధయైన, అసత్య భావముల నుపదర్శింప జేయును.[27] ఆమె దుర్వివగ్ధ[28] — ప్రయోజన కారణ రహితముగ వర్తించునది[29]. పై మాయా విచేష్టితము లిట్టివి.

స్ఫటిక మణివద్భాస్వా న్దేవః ప్రగాఢ మనార్యయా
వికృతి మనయా నీతః కామ ప్యసంగత విక్రియః
నఖలు తదుపశ్లేషా దస్య వ్యపైతి రుచిర్మనాక్
ప్రభవతి తథాప్యేషా పుంసో విధాతు మధీరతామ్ 1-26

మాయ కుటిల స్వభావయై, స్ఫటిక మణివలె సదమల స్వచ్ఛుడై భాసించెడు పురుషునిలో వికారములను గలుగజేసెను. ఈ మాయేశ్వరుల ప్రథమసృష్టి మనస్సు — ఈ మనస్సును మాయయే పరమేశ్వర పదమునం దభిషేకించినది. ఈ దుర్వర్తనము నాంధ్రీకర్త లిట్లు వివరించిరి. 'అదియునుం గాక దురాచారి యగు మాయాదేవి కపట కృత్యం బొక్కటి వినుము. తానును జవ్వనం బెడలిన పెద్దదాన నతండు పురాణ పురుషుండు, విషయరస విముఖుండు గావున నేతత్పరమేశ్వర పదంబునం దన తనయుండగు మనంబు నింతటం బట్టంబు గట్టెదనని తలంప'

ఈ మాయ బ్రహ్మమువలె సత్పదార్థముగాదు. జ్ఞానముచే దానికి నివృత్తి గలదు ఇట్టి మాయ నొప్పినందు వలన బ్రహ్మ శుద్ధత్వమున కెట్టి భంగమును గలుగదు. ఇది అనర్థ మూలమని ఎఱింగినంతనే జ్ఞాని దానిని మూలముట్టుగా జెఱుచును.

మనో విజృంభణము :

మాయావశిష్టుడగు నీశ్వరుని ప్రథమ సృష్టి మహత్తు. అనగా మనసు. ఈతనికి చిత్తము, అంతరాత్మయని పేర్లు. ఈతనికి ప్రవృత్తి, నివృత్తి యను భార్యలిరువురు. ప్రవృత్తి వలన మోహ ప్రధానమగు, కామ క్రోధ. లోభ దంభాహంకారాదు లుద్భవించిరి. నివృత్తి వలన వివేక, వస్తువిచార, వైరాగ్య, సంతోష సంకల్ప ప్రభృతులు కలిగిరి. మనసు మాయా ప్రోద్బలమున విజృంభించి - తానే పరమేశ్వరుని వలె వ్యవహరించెను, ఈతడు నవద్వార పురము[80] నిర్మించి అందు తానిచ్చవచ్చినట్లు వర్తిలుచు, స్వధర్మములను పురుషుని కారోపించును.

ఏకోపి బహుధా తేషు విచ్ఛిద్యేవ నివేశితః
స్వ చేష్టితమథో తస్మి స్విధదాతి మణావివ 1-28

అంత పరమాత్మ ఆతని కందు మణిక్రింద వత్తివిధంబున నిజ చేష్టితంబులు చూపుచుండ, నీడ తోడం గూడిన దర్పణంబు జాడ నహంబ్రహ్మీభవించి మెలగుచుండెను. ఈతని ప్రథమ సంతానమగు అహంకారుడు ఈశ్వరుని కౌగిలించెను. అంత నీశ్వరుడు ఆత్మబంధముల చిక్కుకొని అవిద్యానిద్రకులోనై బహు విధ స్వప్నముల గావించెను.

ఇది నా తల్లి, యితండు తండ్రి, యిది నాయిల్లీ కళత్రంబు నా
యిది నా బిడ్డలు వీరు నాహితులు వీరే వైభవం బెల్ల నా
యది యంచున్ జడమాన సోదయు దవిద్యా నిద్ర ఘూర్ణిల్లుచున్
సద సద్వస్తు వివేకి అయ్యు గను సంసారామిత స్వప్నముల్ 1-77

మనః ప్రవృత్తి మోహానువర్తిని. అది మోహాదుల ఎడ ప్రీతి గలిగి వివేకమును పారద్రోలి, స్వప్నమునే సత్యముగ నెంచి భ్రాంతిలో బడెను. మోహాదు లవిరళ ప్రచారము గలిగి పురుషుని సంపూర్ణముగ నాక్రమించెను.

## మోహ విలాసము :

మోహము ప్రగాఢమైనది. కామ సాహచర్యమున పురుషునిలో అది చిత్తవైకల్యమును గలిగించును. విద్యా విషయముల నడ్డగించును. ధర్మమును నశింప చేయును. శాంతిని విలయ మొందించును. మోహవిషయకములగు క్రోధ లోభాదులు, హింసా తృష్ణాత్మకము లగుట వలన అహింసా సత్యాస్తేయాపరిగ్రహాదులను చెఱుతురు. మోహునకు మిథ్యాదృష్టి సతి. విభ్రమావతి నెచ్చెలి. ఈ మోహ విభ్రమము నాస్తికతా నిలయము. మోహుడు మిథ్యాదృష్టితో కుంటెనకత్తెయైన శ్రద్ధయను తొత్తుకూతు రుపనిషత్తరుణిని వివేకునితో హత్తింప నెత్తుకొన్న యది, మున్న యది మనలకు బ్రతికూల గావున దలపట్టి తివిచి తెచ్చి యారండను బాషండుల కొప్పించు" మనుటయు [2-78] - అదియును "శాస్త్రంపు బల్లఱుపులు శరీర సుఖంబులకు జెఱుపన చేటలు గాని నిజంబులు కావనియును, మోక్షంబు గలిగెనేని అది విషయానంద విముక్తంబు కావున గొఱకాదనియు చెవినిల్లు కట్టుకొని చెప్పి వేద మార్గోపనిషత్తుల తోడ శ్రద్ధను విరుద్ధపఱిచి, చెవియుం జెక్కు నెఱుంగకుండ వేద బాహ్య పాషండ వశంవద" జేయుటయు నిందుకు నిదర్శనము. (3-2) మిథ్య మోహుని హృదయమున సాలభంజిక వోలె స్థిరముగ నెలకొన్నది. (1-70)

మిథ్య మోహు నుపశ్లేషించిన క్షణమున నామెకు తిరిగి యౌవనము ప్రాపించెను. "రాణించిన నీ కౌగిట బ్రాణేశ్వర మగుడ నాకు బ్రాయము వచ్చెన్" (2-75) అని ఆమె అనును. ఇట్టి మిథ్యను కామక్రోధలోభాహంకారులు నిముసమైన ఎడబాయలేరు.

## వివేకము - మానసిక లయము :

సారశుభైక మూర్తియగు సర్వ జగత్పతిని మోహానువర్తియగు మనసు సంసార పయోధి యందు ద్రోచెను. అతం డంత మిథ్యావశమున వివేకుని తృణీకరించెను. చిఱుదీపము కూడ నంధకారమును తఱుము శక్తమైనట్లు, వివేకు డతనిలో నెచటనో దాగియుండి విద్యా ప్రబోధ చంద్రుల యుదయమునకై యత్నించి విష్ణుభక్తి అనుగ్రహమున, శాంత్యాది సఖుల సహకారమున ఉపనిషద్విచారమున జీవునిలో అద్వైతానుభవము గలిగించెను.

జీవుడిట్టి అద్వైతానుభవము నొందుటకు గొప్ప మానసిక పరిణామ మవసరము. ఇట్టి పరిణామమునకు యోగము పరమోపకారకమైనది. వృత్తి శచిత్తున కేకాగ్రత కలుగుటకు నిర్దిష్టములైన యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార, ధారణ ధ్యాన, సమాధులను యోగాంగానుష్ఠానము లవసరములు. అద్వైతానుభవమునకు యోగప్రాధాన్యము తెలుపుచు కృష్ణమిశ్రుడు తన నాటక నాంది యందలి రెండవ శ్లోకమున యోగసమాధి నిష్ఠుడైన శివుని ధ్యానము గావించెను. ఈ యోగము ఇందు విష్ణుభక్తి ప్రేరితము. అందుచేత విష్ణుభక్తి యమ నియమాదులను గూడి వివేకుని సైన్యసంరంభణము గావించుట (౪-౬౦) "ఋతంభరా తత్రప్రజ్ఞా" అని యోగ సూత్రము వచించునట్లు, శాంతి శ్రద్ధల దౌత్యమున వివేకోపనిషత్సంగమమయి ఆనందించు జీవునిలో ఋతంభర ప్రబోధ చంద్రోదయమునకై కృత సన్నాహయగుట (౪-౮౦) జరిగినవి. యోగ సూత్రములందు శాంత చిత్తము సాధించుటకై చెప్పబడిన సాధనములు మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష అనునవి. వానినే కవి కావ్యమున వివేకుని చెల్లెండ్రుగా పేర్కొనెను. వ్యాసుడు యోగసూత్ర వ్యాఖ్యానమునందు చెప్పిన దానినే (1-౩౩) కృష్ణమిశ్రు డిట్లు చెప్పెను.

మైత్రి ఇట్లనును.

నను సుఖునెడ, నతి దుఃఖపరు నెడ గరుణ బుణ్యతత్పరుని ఎడ ముదితన్
జెనటి యెడ నుపేక్షను తమ మనమున నిల్పుదురు శాంతమతులు మహాత్ముల్
(౪-౮1)

సుఖుని ఎడ మైత్రిని, దుఃఖ విహ్వలుని ఎడ అనుకంపను, పుణ్య కర్మ ముల ఎడ ముదితను, కుబుద్ధుల ఎడ నుపేక్షను శాంత మతితో నిలుపవలెను. ఈ విధముగ జరిపించిన ఆతడు రాగముఖోగ్ర దోష సంకలితుడయ్యును అతని ఆత్మవులు కడిగినట్లు నిర్మలమగును.

ఈ యోగ సాధనమునకు మున్ముందుగా జీవుడు కామ క్రోధములను వీడవలెను. అపుడు కాని వైరాగ్యముదయింపదు. అటు పిమ్మటనే ఆతడు యోగ ముచే స్మిత, రాగ ద్వేషాభినివేశాది పంచక్లేశములనుండి తరింప గలడు.

వివేకము ఆత్మోద్ధరణ యత్నమున అబోధమే మోహమూలమను సత్యము నెఱుంగును. తాను నిస్సారమగు మరుమరీచి కాబ్ధి జలమున మునిగి తేలుచున్న

వాడనని గుర్తించి, ఇట్టి అబోధ మీశ్వర పదార్చనముననే ఛేదింపనగు నని తలంచును. వస్తు విచారముచే కాముని జయింప నెంచును. వస్తు విచారము మూఢునికి మిథ్యాత్వము నెఱింగించును. స్త్రీ యనునది కేవలము మాంసపు బుత్రిక యను జ్ఞానము కలిగించును. వ్యాస శాంతివాక్యములు (బ్రహ్మ సూత్రములు— మహాభారత పఠనము, భగవద్గీత) బుధ ప్రవర సమాగమమ్ములు, కాము నోడించుటకు తగిన ఆయుధమ్ములు. క్షమాగుణముచే క్రోధము నణంచవలెను. కోపించు వానిని చిఱునవ్వు ముఖముతో నెదుర్కొనుట, ఆవేశ వివశుడగు వానిని సాధూక్తులతో బలుకరించుట హెచ్చి చేపట్టకు వచ్చు నాతని, విలోకించి ప్రార్థనముగావించుట క్షమాగుణ లక్షణములు. దయాత్మక సాధనమే క్రోధ నిరసనమునకు సమర్థము — క్రోధ మర్దనమున హింసా పారుష్య, మాన మాత్సర్యాదులు సహజముగ నంతమొందును. సంతోషముచే లోభమును జయింప వచ్చును. ఆ సంతోష మిట్లు బోధించును.

"ముదిమను తెల్లత్రాచు తన మూర్ధము మ్రింగెడి మృత్యుదేవియ
ప్పిదప బరిగ్రహంబు లనుపెన్ బులులుం దినగాచుకొన్న వ
త్యదయత నిల్లెఱింగి కృపణా ప్రమదామృత వారి రాశిలో
విదిలిచికొమ్ము లోభ పదవీ పరిషిక్త రజఃపరంపరల్ (4—95)

ఇట్టి ప్రమోదమున లోభమణగి పోవును. అట్లే తృష్ణాదైన్యానృత వాద పైశున్య వాక్ స్తైయాసత్ప్రతిగ్రహాదులు నిగ్రహింపబడును. అనసూయాదులచే మాత్సర్యము, పరోత్కర్షసంభావనచే మదము, పరగుణాధిక్యకథనముచే మానము నిర్లేపములు. ఇట్టి మానసిక పరిణామావస్థ యందు విష్ణుభక్తి వివేకునికి తోడ్పడును. అతడు ఉపనిషత్సంగము నాశించి తనకు ఉపనిషద్విరహము గల్పించిన మోహుని నాశమొనరింప, పరివారయుతుడై కదనమునకు గదలును. ఇట్టి యుద్ధ సమయమున విష్ణుభక్తి నిష్క్రమించును. ఏలన వివేకుడు పాషండాది మతముల నెదిరించి ఋజు సద్ధాంతమును గ్రహించు సమయమిది. శ్రద్ధ సంగ్రామాద్యంతము అతనితో నుండును. వివేకుడు న్యాయ దర్శనము ద్వారా మిథ్యాతత్త్వంబు నెఱుగ యత్నించును.[౩౧] బహువిధ పాషండాగమముల నెదిరించుటకై వేదాంత సరస్వతి వైష్ణవ శైవ సౌరాది బ్రహ్మ సిద్ధాంతములతో కూడి వివేకుని కండగా నిలుచును. మీమాంసయు ఆమెకగ్ర భాగమున నుండును.

ఆపాణి సతి యగ్రగభాగమున సాంఖ్యన్యాయ కాణాద భా
ష్యావళ్యావృతపార్శ్వయై, దశ శత న్యాయ స్ఫుర ద్బాహయై
తావేదత్రయ లోచన త్రితయయై ధర్మాస్యయై సంగర
క్ష్మా విక్రీడకు వచ్చె దుర్గపలె మీమాంసా మహాదేవియున్ (౪—౭౧)

స్వభావ ప్రతి ద్వంద్వములగు నాగమములు తర్కములు ఏకత్ర సమా వేశమగుటకు శాంతి ఆశ్చర్యము నొందగా శ్రద్ధ "వేదమూలములగు, శాస్త్రము లకు అవాంతర విరోధమున్నను నాస్తిక ప్రతిక్షేపణమున వానికి సాపత్యము గల దని ఆమెకు తెల్పును. ౩౨ సముద్రము నందు ఏర్లు అంతర్లీన మగునట్లు, వైదిక మతములన్నింటికిని, జగత్కాంతుడగు నీశ్వరుడొక్కడేగమ్యుడు. ఇట్టి వైదిక మతాదుల సాహాయ్యమున పురుషుడు లోకాయత, పాషండ, దిగంబర కాపాలి కాది మతము లసత్యములని యెఱుంగును. న్యాయాద్యనుగతమైన మీమాంస నాస్తిక తర్కములను తరిమివేయును. వివేకుడిట్లంతర బాహ్య శత్రు నిర్జయము గావించును. మోహుడు "దూరదృష్టి దూర శ్రవణంబులు మొదలయిన యోగోప సర్గంబులునుం దాను నెక్కడ నడంగెనో కాని యదపొడ గనరాకుండపోవును" (౫—౨) మనసు పుత్ర పౌత్ర విలయంబున బుట్టిన శోక వహ్నిచే వెత నొందు చుండ నాతనికి వైరాగ్య ముదయించును. అంత విష్ణుభక్తి తోడై వ్యాస భారతి నాతని కడకంపి ఆతనికి చిత్తశాంతిని కలిగింప ప్రయత్నించును.

కామక్రోధాదులు నశింప ప్రవృత్తి రహితమైన మనసు తానే శూన్యమని తలంపగా, సరస్వతి ఆతనికి మోహబంధములు తొలగించు త్రోవను, ప్రపంచ మెల్ల నశ్వరమనియు, పాంచ భౌతిక తనూకోశంబు సముద్ర ఫేన సమమనియు తత్త్వరహస్యమును తెలుపును. ఆ బ్రహ్మ మొక్కటియె సత్యమనియు, తద న్యము వికల్పితమనియు, నా సత్యము నెఱింగిన వానిని మోహ శోకములంట వనియు భవ దుఃఖసారమునకు మూలము మమత్వమే అనియు బోధించును. "పెంచినట్టి కోడిఁ బిల్లి భక్షించిన, చెందు వగపు పిచ్చుకందు గలదె" అని చెప్పి మోహము అపత్యము పేర స్వీయమౌ తనువును నిట్టనిల్వ నిరతంబు దహించు చుండుననియు, పాశముక్తుడైన వానికి విరక్తియు ప్రశాంతియు లభింపగలవనియు వచించును. నితాంతశోక ప్రహారమునకు చింతయే భేషజమని తెలిపి బ్రహ్మానంద సాధన కారణములగు అంతర్బహిర్లక్ష్యంబులను వివరించును. ౩౩

వైరాగ్యము :

వేదాంత బోధచే ప్రశాంతి నొందిన మనమ్మున వైరాగ్యోదయమైనది. ఈ వైరాగ్యము తనువు నశ్వరమనియు, సిరులు చంచలములనియు, లోకము ప్రబల శోక నిర్భర మనియు— అయినను మూర్ఖులు ఆత్మ సుఖముల ఎదనే ఆసక్తులగుదురనియు మనమున కెఱింగించును.

క్రోవ బాంధులు పుష్కరంబున దోయదంబులు వార్ధిలో
నావికుల్ సలిల ప్రవాహమున న్నగంబులు కూడుచున్
బోవు చుండెడి కైవడిం బితృ పుత్ర బంధుల వోక స్వా
భావికంబని కోవిదుల్ మది బట్టు కొల్పరు శోకమున్ (5—32)

అని క్షణ భంగురములగు నైహిక బంధములను దూషించును. వైరాగ్యముచే ప్రశమనము నొందిన మనము నివృత్తిని చేపట్టి శమదమ సంతోషాదులగు పుత్రులు అతని ననుసరింప, యమ నియమాదులగు నమాత్యులతో వివేకు డుప నిషత్సహితముగ యౌవరాజ్యము ననుభవింప మైత్రి మున్నగు తోబుట్టువు లతని సేవింప, విష్ణుభక్తి యనుగ్రహమున స్వస్థత నొందును. ఇట్లు పంచక్లేశములను తరించిన మనము తత్త్వబోధమహోదయము నందదుగిడును. ఆతనికిపుడు సర్వ విచారము సత్యాన్వేషణమే — ఇట్లు మనము నిశ్చలత్వము బొందిన నంత రాత్మయు సంతతానందము వహించును.

ఉపనిషద్విచారము—అద్వైతానుభవము—అత్మానుసంధానము అనువానితో నిర్మలుడైన జీవుడు మాయ అనర్థ మూలమని యెఱింగి ఆమెను అంతమొనరింప నెంచెను. వైరాగ్యోదయంబైనది మొద లిహపర సుఖవిముఖుడై నరక జననం బైన పాపమునకు వెఱచినట్లు నశ్వరమును బంధ కారణమును నగు పుణ్యంబున కును వెఱచును. నిష్కామమైన సుకృతకర్మము నెట్టకేల కంగీకరించును. ఈ స్వామి యొక్క ప్రత్యక్ప్రవణత్వమును చూచి ధర్ముడు తన్ను కృతకృత్యునిగా తలపోసి వ్యాపార రహితుడగును. ఆతడిపుడు వివేకసహితముగ ఉపనిష ద్విచారము గావించి పరమాత్మజ్ఞానము పొందును. పురుషుని కిట్టి ఉపనిష చ్చింతను బాప నెంచిన మోహుడాతనిపై మధుమతి నంపును. కాని తర్కసా హాయ్యమున నీశ్వరుడాయోగోప సర్గమును తిరస్కరించి విష్ణుభక్తి ప్రభావమున సంసార వార్నిధిని తరించితినని సంతసించును.

పురుషుని నాస్తిక పాషండ మత ప్రభావముల నుండి రక్షించుటకు ఒక్కటైన న్యాయ మీమాంసాది మతములు, వివేకోపనిషత్సంగమానంతరము అవస్థాంతరము లగుచున్నవి. ఉపనిషత్తు

ఎవ్వని యందు విశ్వ ముదయించు నడంగు దలంప నీ జగం
బెవ్వని దీప్తి గానబడు నెవ్వని తేజము చిత్సుఖాత్మకం
బెవ్వని బుద్ధి లెల్ల గుణియింపుచు ద్వైతతమంబు బాసితా
రెవ్వలనన్ భవంబునకు నేగరు వాని నుతింతు నక్రియున్ 5-82

అని విశ్వాత్మతత్త్వము తెల్పును. జీవుడు ఉపనిషత్ప్రశంసను, తదన్య దర్శన సమగ్ర పరిశీలనముతో గావించుచు యజ్ఞవిద్యను పరిశీలించును. అది కర్మ ప్రధానము. అక్రియుడగు పురుషుని కీశ్వరత్వము లేదనియు, భవచ్ఛేదన సామర్థ్యము సత్కర్మమునకు గలదనియు, అట్టి క్రియ లొనర్చుచునే జీవుడు ప్రశాంత స్థితి వడయవలెననియు దాని సిద్ధాంతము. కాని వివేక జ్ఞానముచే సత్యము నెఱింగిన పురుషుడు, యజ్ఞ విద్యావాదము నంగీకరింపడు. స్వభావంబున నచంచలంబగు లోహము, దా నచేతనమయ్యు చుంబక పాషాణ సన్నిధానమున గదలు కరణి నస్వతంత్రయగు మాయ యీశ్వరదృష్టి ప్రేరితయై చేష్టించి జగములు కల్పించుచుండును. ఇట్టి యీశ్వరుని మహిమ తమోంధులయిన వారలు గానలేరు, కర్మంబులచేత నజ్ఞానమయ సంసారంబు చెడుననుట చీకటి చేత చీకటి చెడుననుట గాదే యని తద్విమర్శనము చేయును. [5-82] వేదాంత దర్శనమును (ఉత్తర మీమాంస) వస్త్వైక్య పరమగుటచే నద్వైత దర్శనమనియే చెప్పనొప్పును. ఉపనిషత్తు లోకాంతర ఫలోపభోగయోగ్యుడగు పురుషుని ప్రతిపాదించుట ద్వారా కర్మోపయుక్త మగుచున్నదని మీమాంస నుడువును. ఇందుకొక శిష్యుడు సమ్మతించును. ఈ శిష్యుడు ప్రభాకరుడని చంద్రికా వ్యాఖ్యానము. మీమాంసా హృదయాధిదైవతమగు కుమారిలుడు "ఉపనిషత్తు కర్మోపయుక్తుడగు పురుషుని కాక, అకర్తయు అభోక్తయునగు నీశ్వరుని ప్రతిపాదించుచున్నదనియు, లోకాంతర ఫలోప భోక్తయగు పురుషుని కంటె నితరుడీశ్వరుడు కలడనియు" చెప్పును.

ఆతడు చూచుచుండు జగదావళి చేష్టలు సర్వసాక్షియై
యీతడు మోహబద్ధు, డతడిచ్ఛ క్రియాఫలమానజేయు దా
నీతడు తత్ఫలంబు లతడేలు శరీరుల నెల్ల నీతడి
చ్ఛాతత కర్మ శేషగత సంగు డితండతడౌట యెట్లనన్ 5-90

వివేకుడు కుమారిలుని వాక్యములను ప్రశంసించి ఉపనిషద్వాక్యము లందులకు ప్రమాణములనును

ద్వాతౌ సుపర్ణౌ సయుజౌ సఖాయౌ
సమానం వృక్షం పరిషస్వజాతే
ఏక స్తయోః పిప్పల మత్తి పక్వ
మన్య స్త్వ నశ్నన్నభి చాకశీతి

పైని పేర్కొనబడిన పక్షులలో నొకటి జీవాత్మ, మఱియొకటి పరమాత్మ. వారాశ్రయించిన వృక్షము దేహము. అందాత్మ పూర్వకర్మ ఫలముల ననుభవించును. పరమాత్మ నిశ్చలుడై యుండును.

వివేకుడు తర్క సిద్ధాంతముల నంగీకరింపడు. ఆతనికి జగత్కారణమును గూర్చి యొక నిశ్చితాభిప్రాయము గలదు. ప్రమేయ సముదాయమంతయు ఘటాదికముల వలె కార్యము, కావున పరమాణువులు ఉపాదాన కారణములు కాగలవనుట సర్వదా ఉపేక్షణీయమని ఎంచును. నల్లని మేఘమాలికలు ఆకసమును గప్పినను ఆకసమెట్టి వికారమును గాంచనట్లు బ్రహ్మము ప్రపంచరూపమున గనవచ్చుట వలన ఆతని శుద్ధత్వమున కెట్టి భంగమును రాదు.

జ్వలనద ధూమోద్గతిభిః వివిధాకృతి రంబరే యథాభాతి
తద్వద్ విష్ణు సృష్టి స్వమాయ యాద్వైత విస్తరాభాతి
పరమార్థ సారము 5-33

అద్వైతానుభవము :

ఉపనిషత్తు జీవున కాతడే పరమాత్మయని ఎఱింగించును. అంత పురుషుడు జరామరణములు గల తన కమలసచ్చిదానందాత్మకత నారోపించుట

ఎట్లని ప్రశ్నించుచు. వివేకమాతనికి తత్త్వమసీత్యాది వాక్యార్థమును బోధించును. "బ్రహ్మము నిర్గుణము, దనిని ఎఱిగియున్నచో ప్రతి వస్తువును వస్తుగుణముల నుదాహరించి 'నేతి నేతి', [ఇదికాదు ఇదికాదు] అని మాత్రమే వర్ణింపదగును.[34]" "ఇది అంతయు బ్రహ్మము" 'సర్వంఖల్విదం బ్రహ్మ' 'తత్త్వమసి' యను బోధలు ఛాందోగ్యమందలివి. అహం అను భావము అంతరాత్మ లక్షణము. మిథ్యాతత్త్వము నెఱింగిన పిదప త్వం అనగా పరమాత్మ యని తెలిసి అంతరాత్మ ప్రశాంతమగును. ఈ తత్త్వమసి వాక్యమునకు అనంత మంగళ గుణాకరమైన బ్రహ్మమునకును, అజ్ఞానియగు జీవునకును సామానాధికరణ్యము గలదని తాత్పర్యము. జీవజడాత్మకమగు బ్రహ్మాండము శరీరమనియు, బ్రహ్మము దాని కాత్మయనియు జీవ బ్రహ్మలకు గల సంబంధము నీవాక్యము తెలుపును. తత్త్వమసి అనగా "నీవు వాడై యున్నావు" అని అర్థము.[35]

"ఇది నేగానిది నేగానిది నేగాననుచు నిశ్చయింపుము రాని
ర్వది యైదు నడచి యెయ్యది తుదితోచెడినదియె నీవు ధ్రువమని
పలికెన్" 5-106

ఉపనిషద్విచారము వలన జీవుడు బ్రహ్మ విద్యాధికారి అగును. అతడు ఆత్మను వినవలెను. ఆలోచింపవలెను. ధ్యానింపవలెను. "ఆత్మావాఅరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిధిధ్యాసితవ్యః" అని బృహదారణ్యకోపనిషత్తులో ఆత్మ సాక్షాత్కారార్థమయి శ్రవణాదులు చెప్పబడినవి. శ్రవణమనగా ఉపక్రమోప సంహారాది నిబంధనలను న్యాయములను అనుసరించి ఉపనిషదర్థ విచారము చేయుట. ఆవిచారమున ప్రత్యగభిన్నాద్వితీయ పరమాత్మ యందు సర్వోపనిషత్తులకు తాత్పర్యమని స్పష్టపడగలదు. మనన మనగా ఆ విచారము వలన తేలిన భావమును యుక్తులతో సయితము నిశ్చయించి ఎల్లప్పుడును చింతనము చేయుట." నిధిధ్యాసనము వలన పురుషుని యందు విద్యా ప్రబోధ చంద్రోదయమగును.

"కలుగునొ కల్గదో యవునొ కాదకొ, తోచునొ తోచదో తుదిన్
నిలుచునొ నిల్వదో యనెడు నిర్భర సంశయమెల్ల మాని ని
ర్మల సహజ ప్రకాశ మహిమంబును బొందుదు రెల్లవారునే
గలిగిన యట్టి నాడ యిదె కల్గితి నేను ప్రబోధ చంద్రుడన్" 5-109

ప్రబోధము జనించిన పిదప మోహాంధకార వికల్పములు నశించును. ద్ధ్రా శ్రీ వివేకమతి శాంతి మయాదికము ద్వారా పురుషుడు విశ్వాత్మకుడైన విష్ణువగును.

గాఢ మోహాంధకార వికల్ప నిద్రి
తములు వోవ ప్రబోధ చంద్రముడు పొడమె
శ్రద్ధ మతి శాంతి మొదలు సర్వమును గలయ
జూడగా నేనె తత్పరంజ్యోతి నైతి 5-111

అని పురుషుడు బ్రహ్మముతో నైక్యము పొందును.

## ప్రబోధ చంద్రోదయమున ప్రతిపాదింపబడిన అన్య మతములు :

### 1. చార్వాక మతము :

దీనికి లోకాయత మతమనియు, బృహస్పతి మతమనియు, పేర్లు "అథ లోకాయతం, పృథి వ్యాప స్తేజో వాయురితి తత్త్వాని, తేభ్యశ్చైతన్య" మ్మని బృహస్పతి సూత్రము. ఈ మతమందు పృథివి, సలిలము, అగ్ని, వాయువు అనితత్త్వములు నాలుగు. ప్రత్యక్షమే ప్రమాణము. అందువలననే పంచభూతములలో ప్రధానమైన ఆకాశము వీరి మతమున లేదు. బ్రతికియున్నంత కాలము సుఖముగ జీవింపవలెననుట వీరి సిద్ధాంతము. వీరు అలౌకిక పురుషార్థమగు మోక్షము నంగీకరింపరు. ఈ మోక్షము పరలోక సుఖము అనునవి మూఢులచే కల్పింపబడినవని ఈ మతస్థుల విశ్వాసము. సర్వలోకాభిమతార్థము నుపదేశించుటచే లోకుల యందాయతమయినది (విస్తరింపబడినది) గావున లోకాయత మతమనియు, సురగురువైన బృహస్పతిచే నిది కల్పింపబడుటచే బృహస్పతి మతమనియు వ్యవహరింపబడుచున్నది. నిరీశ్వరమగుట వలన ఈ మతము నాస్తికమైనది.

### 2. అర్హత మతము :

దీనికే జైనమతమని పేరు. ఈ మతమందు కార్యరూపముగా నసత్యము, భిన్నము, అనిత్యము; కారణరూపముగా సత్యము, అభిన్నము, నిత్యము. ఆత్మ దేహానురూప పరిమాణము గలది. ఈ మతస్థులు ప్రాణి హింసను మాని దిగంబరులై, విషయ వైరాగ్యము నవలంబించి దేహమునందు మలము పూసికొని పాణిపాత్ర భోజనులై, కేశోల్లుంచనము చేసికొని వాఙ్నియమము గలవారై యుండవలయును. మలధారణాదికము వలనను, ఆత్మజ్ఞానము వలనను బ్రకృతి వినిర్ముక్తులై యూర్ధ్వగతి ప్రాపించుటయే మోక్షము.

3. బౌద్ధ మతము :

దీనికి సౌగతమని ఇంకొక పేరు. ఈ మతస్థులలో నాల్గు తెగలవారు గలరు. వారిలో యోగాచారులు బాహ్యశూన్యత్వ వాదులు. రెండవవారు సౌత్రాంతికులు, వీరు బాహ్యానుమేయత్వవాదులు. మూడవవారు వైభాషికులు బాహ్యార్థ ప్రత్యక్షవాదులు. నాల్గవ వారగు మాధ్యమికులు సర్వశూన్యవాదులు.

4. పాశుపత మతము :

పాశుపతులు ఈశ్వరుండే సర్వజగంబునకు నిమిత్త కారణుండనియు, పరమాణువులె ఉపాదాన కారణం బనియు, శైవాగమంబున చెప్పబడిన కంఠిక, రుచకము, కుండలము, శిఖామణి, భస్మము, యజ్ఞోపవీతము అను ఆరుముద్రలను ధరించుట, సురాకుంభ స్థాపనంబు, సురాకుంభస్థ దేవతార్చనంబు మొదలగు కర్మలచే అణుస్వరూపుండగు జీవునకు గలమలమయ కర్మ తిరోధానము కలుగగా శివసారూప్యంబు నొందుటయె మోక్షమనియు చెప్పుదురు.

5. నైయాయిక వైశేషిక మతము :

ఈశ్వరుడు నిమిత్త కారణము. జగము సావయవము గావున ఘటాదుల వలెనే పుట్టినది. జననవంతమయిన దంతయు దాని యుపాదానోపకరణ సంప్రదాన ప్రయోజనాదు లెఱింగిన వానిచేతనే చేయబడుట కానవచ్చుచున్నది. కాబట్టి జగము నిర్మించు నేర్పు గలవాడును, కర్మ పరవశులై పరిమిత జ్ఞానముగల జీవుల కంటె విలక్షణుండునునగు నొక్క సర్వజ్ఞు డుండవలయునను ననుమానంబు సాధకము. అనాది కర్మ ప్రవాహంబున సుఖదుఃఖానుభవంబను సంసారముంజెందియున్న జీవులలో నొక్కొక్క డీశ్వర ప్రీత్యర్థంబుగా వేదోక్త కర్మంబుల నాచరించుచుం దత్ప్రసాదలబ్ధంబైన యష్టాంగ యోగంబున నాత్యంతిక దుఃఖ నివృత్తియను మోక్షంబు వడయును. ఆత్యంతిక దుఃఖనివృత్తి యనగా మఱియెన్నడు పుట్టకుండ దుఃఖము తొలగిపోవుట యని నైయాయిక వైశేషిక మతము. అపుడు జ్ఞాన దుఃఖాదులెవ్వియు నుండవు గావున నిది పాషాణ ముక్తియని వీరందురు.[36]

6. కాపాలిక మతము :

ఏతన్మతానుయాయులు శివు ననుసరించి కపాల భిక్షాటనము, శ్మశాన వాసము, దిగంబరత్వము పూనియుందురు. బ్రహ్మచర్యము వీరి విధులలో లేదు.

కపాల భిక్షాటనము ప్రధాన సిద్ధాంతము కావున వీరికి కాపాలికులను పేరు కల్గినది.

7. మీమాంసా మతము :

ఈ మతము పూర్వ మీమాంస, ఉత్తర మీమాంస అని రెండు విధములు. పూర్వమీమాంస జైమినిచే ప్రతిపాదింపబడినది. ఇందు భాట్ట ప్రభాకర మతములను రెండు తెగలున్నవి. ఈ మతము కర్మ ప్రాధాన్యము. ఉత్తర మీమాంస వ్యాస ప్రతిపాదితము. ఇది జ్ఞాన ప్రధానము.

8. ద్వైతము :

ఈ మతమున ఈశ్వరునికి, జీవునికి భేదము చెప్పబడును. జీవుడు విష్ణువును సేవించుట వలన జ్ఞానమును పొంది తత్కృపచే మోక్షానందము పడయును.

ఉపయుక్త గ్రంథ నిర్దేశము :

1. Krishna Misra was an ascetic belonging to the Hamsa order of Advaita school and had many disciples.
Krishnamacharya. History of Sanskrit literature.

2. ప్రబోధ చంద్రోదయము. పీఠిక. నిడుదవోలు వేంకటరావు. పుట 25

3. At any rate his work can be dated with precision. It was produced for one Gopala in the presence of the Candella king Kirtivarman of Jejakabhukti of whom we have an inscription of A.D. 1098 : Sanskrit Drama. A. B. Keith P 251

According to the Mahoba inscription Kirtivarman defeates Lakshmikarna i e.Cedi king karna of Tirupati who is mentioned in an inscription dated 1042 A.D. Probodha Chandrodaya-Dr. Sita krishna Nambiar. P. 1

4. Macdonell – Rise of the moon of knowledge.
P. 366 History of sanskrit literature.

5. Das Gupta – the moon rise of true knowledge. History. P. 481

6. Sita Krishna Nambiar – the rise of the moon of spiritual awakening – Prabhodha chandrodaya, P. 3

6 a. "Unified symbolic system in which characters, plots or settings are used to represent abstract ideas or conceptd P. 38. Vol. 1. M.C. Graw Hill Encyclopedia of world Drama.

7. History of classical sanskrit literature. M. Krishnamachariar – P. 675

8. ప్రబోధ చంద్రోదయము, పీఠిక, నిడుదవోలు వేంకటరావు, పుట 30

8.అ. నిడుదవోలు వేంకటరావు, పోతన, పుట 173

9. ఆరుద్ర, స.ఆం.సా, సం. ౩, పుట 237

10. ధరణి సుత దేవకీ పుర
వర నిలయ శ్రీ గిరీశ వర సంపన్నో

శ్వర విభు తనయా సాళువ
నరసింహ నృపాల దండనాయక తిలకా [వరాహ 11-1]

11. చాగంటి శేషయ్య

12. ఆంధ్రకవి తరంగిణి, సం. 1, పుట 133

13. నిడదవోలు వెంకట్రావు. పోతన పుట 178

14. చాగంటి శేషయ్య ఆం.క.త. సం. 6 పుట 149

15. ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యము సం. 6 పుట 254

16. ప్రబోధ చంద్రోదయము (1-18)

17. అత్ర విష్ణుభక్తిర్వివేకస్య సాహాయ్యం కుర్వతీ సతీ స్వకార్యం మహా మోహ నిరసనం కుర్వాణా ప్రబోధోదయం కరోతీతి తద్వృత్తాంతః పతాకా. [చంద్రికా వ్యాఖ్య పుట 180]

18. శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత సంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యే రసాః స్మృతాః"

19. శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానకాః
బీభత్సాద్భుత శాంతాశ్చ నవ నాట్యేరసాః స్మృతాః

20. విజ్ఞాన సర్వస్వము పుట 121 సం. 6 తెలుగు భాషా సమితి 1961

21. ఆంధ్ర సాహిత్య దర్పణము.

22. ఈ గ్రంథ మముద్రితము. దీని వ్రాత ప్రతి యొకటి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య లిఖిత పరిశోధన సంస్థ యందున్నది. గ్రంథ సంఖ్య 476.

23. దీని వ్రాతప్రతి తిరుపతిలో వేంకటేశ్వర విద్యాలయము నందలి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున గలదు. గ్రంథ సంఖ్య ఆర్. 715.

24. శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి Dramatic Art - Page 41.

25. నిడుదవోలు వేంకటరావు-ప్రబోధ చంద్రోదయ పీఠిక పుటలు 102, 103.

26. అప్రాణమ్ శుద్ధ మేకమ్ సముభవ దథ తన్మాయయా కర్తృ సంజ్ఞమ్,
శతశ్లోకీ పుట 24

27. రాజా - ప్రియే, అవిచార సద్దేయం వేశ్యావిలాసినీవ మాయా అసతోపి
భావా నుపదర్శయంతీ - పరపురుషం వంచయతి. పుట 20

28. మతి : ఆర్య పుత్ర కింపునః కారణం యేన సా తథోదారచరితం దుర్వి
దగ్ధా ప్రతారయతి :

29. రాజా - నఖలు ప్రయోజనం కారణం వా విలోక్య మాయా ప్రవర్తతే
పుట 20

30. నవద్వారపురము రెండు కనులు, చెవులు, నాసికారంధ్రములు, నోరు, మలద్వారము, యోని మున్నగునవి. కఠోపనిషత్తు పదునొకండు ద్వారములను పేర్కొనినది. అందు బొడ్డు బ్రహ్మరంధ్రము కూడ చేర్చబడినవి.

31. ప్రళయ జలధర ధ్వాన భీషణ పటహ ఘోషణంబునుగా మోహరించు నప్పుడు వివేక మహారాజు మోహుని కడకు నైయాయిక దర్శనంబు రాయబారంబు పంపిన ... [4-58]

32. కాన వేద ప్రసూతంబులైన శాస్త్ర
సంచయంబులు వేద రక్షణము కొఱకు
నాస్తికుల గెల్వ నొక్కటౌ నాగమములు
తత్త్వమే చెప్పగాన భేదంబు లేదు. [4-64]

33. ఏటు పోటు వ్రేటు నేమియులేక మర్మములు సెలలు వాఱి మాననట్టి
భీకరంబులైన శోక వ్రణమ్ముల కౌషధంబు చింతయంద్రు బుధులు
[5-31]

34. బృహదారణ్యకోపనిషత్తు. విజ్ఞాన సర్వస్వము. సం. 7 పుట 60

35. కొమఱ్ఱాజు లక్ష్మణరావు, విశిష్టాద్వైతము, [సంపు. 2, పుట 935]

36. మేడేపల్లి వెంకటరమణాచార్యులు
ప్రబోధ చంద్రోదయ విమర్శనము
ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. మూడవ సంపుటము, పుట 48.



1)

# 5. ప్రసన్నరాఘవ నాట్య ప్రబంధము
## (మూలము : జయదేవుని ప్రసన్నరాఘవ నాటకము)

సంస్కృత పతి :

By Acharya Sesa Raja sarma Regmi,
Chowkhamba vidya Bhavan, 1972.

తెలుగు ప్రతి :

సంపాదకుడు : డా. బి. రామరాజు,
ఆంధ్ర రచయితల సంఘము, 1962.

Preface in English by K. Lakshmi Ranjanam.

### సంస్కృత కవి - కాలాదులు :

ప్రసన్నరాఘవ నాటకకర్త జయదేవుడు. ఇతడు గీత గోవిందమును రచించిన జయదేవునికంటె భిన్నుడు. ఈ నాటకకర్త 'పీయూషవర్ష' బిరుదాంచితుడు పై నాటకమునే కాక యితడు 'రతి మంజరి', 'చంద్రాలోకము' అను మఱి రెండు కావ్యములను కూడ రచించెను. ఈతడు కావ్యకర్తయే కాక గొప్ప తార్కికుడు. వంగదేశీయుడు. మైథిల బ్రాహ్మణుడు.

జయదేవుడు కౌండిన్య గోత్రుడు. తల్లి సుమిత్ర. తండ్రి మహాదేవుడు. ఇతడు రామభక్తుడు.[1] ఇతని కాలము క్రీ. శ. 13 వ శతాబ్దమని విమర్శకులు నిర్ణయించిరి. అందుల కుపపత్తిగ నీ క్రింది అంశములను గ్రహించిరి.

జయదేవుడు చంద్రాలోకమునందు గావించిన కావ్యలక్షణ ప్రస్తావమున

"అంగీకరోతి యః కావ్యం శబ్దార్థా వనలంకృతీ
అసౌ న మన్యతే కస్మాదనుష్ణ మనలం కృతీ 1-5

అని చెప్పుట మమ్మటుని కావ్య నిర్వచనమును[2] ఖండించుచున్నది. మమ్మటుని

కాలము క్రీ. శ. 12వ శతాబ్దముగా భావింపబడుచున్నది. మమ్మటుని కావ్య లక్షణము నధిశేపించిన జయదేవుడు ఇతని కించుక అర్వాచీనుడై యుండును.[1]

సాహిత్య దర్పణ కారుడగు విశ్వనాథ కవిరాజు అర్థాంతర సంక్రమిత వాచ్యమునకు ఉదాహరణముగా ప్రసన్నరాఘవము నందలి

"కదలీ కదలీ కరభ : కరభ :
కరి రాజ కర : కరిరాజ కర :
భువన త్రయేపి బిభర్తి తులా
మిద మూరుయుగం న చమూరుదృత : 1-37

అను శ్లోకమును గ్రహించియుండెను. విశ్వనాథ కవిరాజు కాలము క్రీ. శ. 14వ శతాబ్ది పూర్వార్థము. కావున జయదేవు డితనికన్న పూర్వుడై యుండును.

కొన్ని ఆంధ్ర గ్రంథములయందు కూడ ఈ నాటకానుసరణములు కన్పట్టుచు జయదేవుని కాల నిర్ణయమునకు తోడ్పడుచున్నవి. భాస్కర రామాయణము నందలి అరణ్య కాండము నందు రావణుడు సీత నెత్తుకొని పోగా రాముడు విలపించెడు ఘట్టమున ఈ క్రింది పద్యమున్నది :

చ. తపనుడు వేప జొచ్చె నను తమ్ముడ వృక్షము క్రింద బెట్టు నా
తపనుడు రేయిలేడు వసుధావర ! చంద్రుడు గాని, చంద్రునిన్
నృపసుత యెట్లెఱింగితివి నీవుః మృగాంకము చూడ నున్కి హా
చపల మృగాక్షి చంద్రముఖి జానకి యెచ్చట నున్నదానవే?
7-263

ఈ పద్యము ప్రసన్నరాఘవములోని క్రింది శ్లోకమునకు అనువాదప్రాయము.

రామ : సౌమిత్రే! నను సేవ్యతాం తరుతలం చండాంశు రుజ్జృంభతే
లక్ష్మణ : చండాంశో ర్నిశి కా కథా రఘుపతేః చంద్రోయ మున్మీలతి
రామ : వత్సై త ద్విదితం కథం ను భవతా
లక్ష్మణ : ధత్తే కురంగం యతః
రామ : క్వాసి ప్రేయసి! హా కురంగనయనే! చంద్రాననే జానకి!
6-1

భాస్కర రామాయణ కర్తృత్వము వివాదాస్పదముగనున్నది. అరణ్య కాండ రచన క్రీ. శ. 1300 ప్రాంతములకు ముందే అనుటలో విప్రపత్తి లేదు. కాబట్టి జయదేవ కవి క్రీ. శ. 1300 ప్రాంతమునందలి వాడే కాని అటు తరువాతివాడు కాడు.[14]

జయదేవ కవికి 'పక్షధరు' డను బిరుదముకూడ కలదనియు, ఇట్టి నామముగల తార్కిక ప్రవరుడు 16 వ శతాబ్దమున వంగదేశమును పాలించు చుండిన వాసుదేవ భూపాలునికి గురువై యుండెననియు కొందఱి మతము. కాని పక్షధరునకు, జయదేవునకు నభేదము ఘటించుట కాధారములు కానరావు.

## నాటక కథ :

### ప్రథమాంకము :

చక్రవర్తి యగు జనకుడు సీతా వివాహ విషయమున పర్యాకులుడై యుండెను. బాణుడు శివుని పూజించి తన దోర్బలమును బ్రకటించుటకు తగిన హరశరాసన మొకటి జనకుని కడ నున్నదని ఎఱింగి, తత్కార్ముక విలోకన కుతూహలుడై మిథిలానగరమున కేగెను. లంకాధిపతియగు రావణుడు కూడ సీతాస్వయంవర వార్తను విని మిథిలకు కదలెను.

సీతాస్వయంవర మండపము నానాదిగంత సమాగతమగు రాజమండలితో శోభిల్లెను. అచట స్తుతి పాఠకులగు మంజీరక నూపురకులు రావణునితో వక్రోక్తి పూర్వకముగ సంభాషించి అతని నిజమైన రూపమును కనుగొనిరి. సీతా సౌందర్యమును గాంచి రావణుడు ముగ్ధుడయ్యెను. బాణ రావణు లిరువురును స్వోత్కర్షను బ్రకటించు కొనుచు వాదులాడిరి. వారిరువురును హరచాపా రోపణమొనర్ప నసమర్థులైరి. తదనంతరము నందన వనోన్మూల నాసక్తుడై బాణుడు స్వయంవర సభను వీడెను. మారీచుని ఆక్రందనమును విని, సీతా పహరణ బద్ధచిత్తుడగు రావణుడు, అతనిని సమాశ్వాసించుటకు వెడలెను.

### ద్వితీయాంకము :

విశ్వామిత్రు డభ్యర్థింప, ఆతని సవన సంరక్షణార్థము దశరథుడు ప్రాణ సమానులైన పుత్రులను రామలక్ష్మణుల నాతనికి అర్పించెను. దశరథుని వినయమునకు మెచ్చిన విశ్వామిత్రుడు దివ్యమగు తాటంక యుగము నొకదానిని

రాజునకు కానుకగా నిచ్చెను. అది వీరమాతలు ధరించుటకు అర్హమగు నట్టిది. కావున దానిని కౌసల్యాదేవికి అర్పింపవలసినదిగా అతనికి నిర్దేశించెను. ఈ వృత్తాంతము తెలిసికొనిన నిశాచర మంత్రి మాల్యవంతుడు, ఆ తాటంక యుగము లంకేశ్వరుని తల్లియగు నికషాదేవికి మాత్రమే తగినదని నిశ్చయించి దానిని సంగ్రహించి తెమ్మని తాటక నాదేశించెను. కాని తాటక రామబాణముచే నిహతురాలైనది. రామబాణము ఆమె పుత్రులలో సుబాహుని సంహరించి మారీచుని దూరవిక్షిప్తుని గావించినది. సీతామోహమున మగ్నుడైన రావణుడు బంధు ఘాతుకుల నెదిరింపక మిన్నకుండెను.

విశ్వామిత్రుడు రామలక్ష్మణులతో మిథిలానగరము ప్రవేశించెను. అచటి ఆరామశోభ రామలక్ష్మణులను మురిపించినది. రాముడందున్న చండికాయతనమును గాంచి అటకేగి దేవికి ప్రణామము లాచరించెను. అంత నచటికి సీత తన సఖిని గూడి ఏతెంచినది. ఆమె దేవికి సేవాంజలి ఘటించెను. సీతాదివ్య సౌందర్యము రాముని మనము నాకర్షించెను. రాముని గాంచిన సీతకును అనురాగ భావము లుదయించినవి. అంతలో అంతఃపురము నందుండి చేటి తెచ్చిన వార్త ననుసరించి సీత తన తల్లులను చేర బోయినది. సంధ్యాసమయమున దేవతార్చన నలుపు విశ్వామిత్రుని సేవింప రామలక్ష్మణు లేగిరి.

### తృతీయాంకము :

విశ్వామిత్రునకు జనకు డాదరపూర్వకముగ స్వాగత మిచ్చెను. నిమి వంశరాజుల ప్రశస్తిని జనకుని కీర్తిని విశ్వామిత్రుడు కొనియాడెను. జనకుడును విశ్వామిత్రుని మహిమాన్వితతకు జోహారు లర్పించెను జనకునకు రామలక్ష్మణులపై అపారమగు ప్రీతి కలిగెను.

విశ్వామిత్రుడు ప్రసంగ వశమున జనకునికి, తాను సీతారామ కల్యాణము నభిలషించు చున్నట్లు సూచించెను. జనకుడు చమత్కారముగ హరచాపారోపణ విషయమును మునికి విన్నవించెను. అంత ముని అతనితో రాము డాచాపమును అవలీలగా నెక్కుపెట్టగలడని చెప్పెను. అంతలో జామదగ్న్యు కడనుండి సందేశమును తెచ్చిన ఒక ముని అట కేతెంచెను. 'జనకుడు చాప కర్షణాలాపమును వీడవలయుననియు, లేనిచో నతడు పరశువుచే ఖండింపబడగలడనియు' తత్సందేశసారము. జనకుడు జామదగ్న్యుని అహంకారమునకు తగిన విధముగా

ప్రతిసందేశమిచ్చెను, "హరచాపారోపణమును గావించు తన అల్లుని కడ నతని పరశువు ధారారూపమైన జలత్యాగ మొనరింప వలసియుండు" నని తెలిపెను. "హేరామపరశో! మదీయ జామాతా త్వదీయ ధారాజల గర్వమపనేష్యతీతి భావః"

రాముడు ధనుర్భంగము గావించెను. తన చిరకాలమనోరథ మీడేరి నందులకు జనకుడు సంతసించెను. సీతారాముల కల్యాణముతోపాటు ఊర్మిలా, మాండవీ, శ్రుత కీర్తులకు కూడ క్రమముగా లక్ష్మణ, భరత, శత్రుఘ్నులతో పాణిగ్రహణము జరిగెను.

చతుర్థాంకము :

జనకునియెడ కుపితుడైన పరశురాముడు జగమును నిర్జనకము గావింప సమకట్టెను. హరచాపారోపణము గావించిన రామునిపై కూడ కినుక బూని అతడు రఘువంశ వినాశమును దలపెట్టెను. అతడు శోభాయమాన మగుచున్న సీతారామ కల్యాణమండపము ప్రవేశించి జనకుని, అతని గురువగు యాజ్ఞవల్క్యుని అవహసించెను. రాముడాతనితో సామవాక్యములను బలుకగా జామదగ్న్యుడు గర్వోద్ధతిని ప్రకటించి, పూజ్యుడగు విశ్వామిత్రునిపై గూడ నిర్లక్ష్య భావమును చూపెను. జగద్వంద్యుడగు తన గురువును అధిక్షేపించినందులకు రాముడు సహింప జాలక పరశురామునికి తన భుజబలము చూప నుంకించెను. పరశురాముడు అసమానమగు వైష్ణవ చాపమును రామునికి చూపి సామర్థ్య మున్నచో తద్గ్రహణము కావింపు మనెను. ఇరువురును సంగ్రామ స్థలికి జనిరి. రాముడు హరచాపమట్లు హరి చాపమును గూడ అద్భుతముగ నెక్కిడెను. పరశురామునికి రాముని దివ్యత్వము తెలియవచ్చినది. అతడు రాముని సంస్తుతించి ఆతనికి శుభాశీస్సుల నొసంగెను.

పంచమాంకము :

సుగ్రీవుడు వాలిచే పరాభూతుడై తన పరిజనముతో నొక దుర్గము నాశ్రయించి యుండెను. కైకేయి దశరథుని వరము లడిగినది. రాముడామె కోరిన ప్రకారము అడవికి బయలు దేరెను. రాముని సీతా లక్ష్మణులు కూడ అనుసరించిరి. రామ వియోగమును సహింపజాలని దశరథుడు అసువులు వాసెను. అటుపై మాతుల గృహమందుండి ఏతెంచిన భరతుడు తల్లివలన జరిగిన

వృత్తాంతము దెలిసికొని ఆమెపై కినిసి విరక్తుడై నంది గ్రామముచేరి అట రాముని పునరాగమనమునకై నిరీక్షించుచుండెను.

సీతారామ లక్ష్మణులు వనయాత్ర గావించుచు యమున దాటి గోదావరీ తీరమును జేరిరి. జన స్థానమున లక్ష్మణుడు శూర్పణఖ నాసికా ఖండనము గావించెను రాము డచటి నిశాచర సమూహమును నిర్జించెను. తామాదులచట కతిపయ దినములు వసించిరి ఒకనాడు అచట చరించెడి కనక మృగమును గాంచి సీత ముచ్చట పడగా రాముడు దానిని పట్టుటకై పోయెను. లక్ష్మణుడు కూడ నాతని ననుసరించెను. ఒంటరిగా ఉటజము నందున్న సీత కడకు భిక్షుక వేషధారియై రావణుడేతెంచి ఆమె నపహరించెను. రామబాణమున నిహతమైన కనకమృగము మారీచ రాక్షస రూపమును పొందెను. సీత ఆర్తనాదమును విని రావణు నెదిరించిన జటాయువు అతని చేతిలో సమసెను. రామలక్ష్మణులు సీతను వెదకుచు ఋష్యమూకమును చేరిరి. రాముడు వాలిని నిర్జించి సుగ్రీవుని కిష్కింధారాజ్యమున అభిషిక్తుని గావించెను. సుగ్రీవుడు వానరసేనకు సీత జాడను అరయ వలసినదిగా ఆనతిచ్చెను.

షష్ఠాంకము :

సీతా వియోగ దుఃఖమున విహ్వలుడైన రామునకు లక్ష్మణుడు పలికెడు సాంత్వన వచనములు విరహోద్దీపకము లయ్యెను.

అశోక వనమున సీత శోక మగ్నయైయుండెను. నాథునికై పలవరించెడు సీతను త్రిజట అనునయింప యత్నించెను. హనుమంతుడు లంక కేతెంచెను. అతని నెదుర్కొనుటకై రావణ కుమారు డక్షయు డేగెను; రావణుడు సీతకు తన మోహమును వెల్లడించెను. సీత ఆతనిని తిరస్కరించి రాముడేతెంచి రావణుని దునుమాడగలడని హెచ్చరించెను. రావణుడామె పలుకులకు క్రుద్ధుడై ఆమెను వధించుటకు కరవాలము నెత్తెను. కరవాలము నెత్తిన అతని చేతిలో అక్షయ కుమారుని తలవచ్చి పడెను. కుమారుని మరణమునకు కడుంగడు దుఃఖితుడైన రావణుడు తన కిట్టి దుఃఖమును గల్పించిన కపిని తునియలు గావింప నిశ్చయించెను. సీత అగ్ని ప్రవేశముచేయ దలచి, తనకొక నిప్పు తునుకు ననుగ్రహింపు మని అశోక వృక్షమును వేడుకొనెను. అంత ఆవృక్షమందుండి అగ్నికి బదులుగా నొక పద్మరాగ మణి వచ్చిపడెను. సీత దానిని

రామాంగుళీయకమని గుర్తించెను. హనుమంతుడు ఆమె యెదుటికేతెంచి తానెవరో ఆమెకు తెలుపుకొని రాముడు సుగ్రీవునికి పట్టము గట్టిన వార్తనెఱిగించెను. తరువాత అక్షయకుమారుని సంహరించినది తానేయని తెలిపి, రామ సందేశము నామెకు వినిపించెను. సీతయు రామునకు ప్రతి సందేశము పంపెను. రాక్షసాక్రందనములే సీతకు రాముని వార్తలు తెలుపగలవని హనుమంతుడు వచించెను. పిదప నాతడు లంకను దహించి అబ్ధిని లంఘించెను. అనంతరము హనుమంతుడు దధిముఖు నోడించి మధువనమున యథేచ్ఛముగా విహరించి నీలాంగదాది వానర ప్రముఖులతో గూడి రాముని సన్నిధికి పోయెను.

సప్తమాంకము :

రావణుని వర్తనము సహింపని విభీషణుడు సోదరుని వీడి రామునాశ్రయించెను. రామలక్ష్మణులు కపి సేనతో గూడి సేతు బంధనము గావించిరి.

మండోదరి రావణునితో తనకు దుశ్శకునములు పొడముట తెలిపి, కపిసేనల కలకలము తన మనమున కలవరము కలిగించు చున్నదని పల్కెను. రావణుడామె ననునయించుచు, తన బాహు బలమును గాంచి కపిసేన అబలవలె భీతి చెందగలదని గర్వాడంబరము ప్రదర్శించెను. కపిసేనకును రాక్షససేనకును యుద్ధ మారంభమయ్యెను. కుంభకర్ణ, మేఘనాదులు రామలక్ష్మణులచే నిహతులైనారని ఎఱింగిన మండోదరీరావణులు మూర్ఛ నొందిరి. మూర్ఛనుండి తేరి రావణుడు స్వయముగ సమరమునకు బోయెను.

రావణుడు ప్రయోగించిన శక్తి లక్ష్మణుని మూర్ఛితుని గావించెను. హనుమంతుడేగి గంధమాదనమును గొనిదెచ్చెను. తదౌషధ గంధ మాత్రముననే లక్ష్మణుడు తేరుకొనెను. రావణుని ఔద్ధత్య ప్రలాపములకు కినిసి రాముడాతనిని బాణ నిహతుని గావించెను. సీత అగ్ని ప్రవేశ మొనరించి పునీతయైనది.

వనవాసము ముగిసినది. రామలక్ష్మణులు తమ రాకను దెలుపుచు హనుమంతుని అయోధ్యకు పంపిరి. సీతారామలక్ష్మణులు విభీషణ సుగ్రీవాదులతో పుష్పక విమానమెక్కి అయోధ్యకు పయనమైరి. మార్గమున వారు పెక్కు కమనీయ దృశ్యములను గాంచిరి. అశరీరవాణి రామునికి శుభాశంసనము పలికెను. వశిష్ఠాది గురువులును, బంధుమిత్రులును, అయోధ్యావాసులందఱును బ్రహ్మానందపరవశులై నగరము చేరిన రామాదులకు స్వాగతము పలికిరి.

నాటక, ప్రబంధములు రెంటి యందును కథ సమానము.

ప్రసన్నరాఘవము – నామౌచిత్యము :

జయదేవు డొక శ్లోకమున నాటక నామమును చిత్రముగ నిట్లు సూచించెను.

"ప్రత్యంక మంకురిత సర్వరసావతార
స్నవ్యోల్ల సత్కుసుమ రాజి విరాజి బంధమ్;
ఘర్మేతరాంశుమివ వక్రత యాతిరమ్యం
నాట్యప్రబంధ మతిమంజుల సంవిధానమ్ 1—7

పైశ్లోకము నందు ప్రతి పాదము నందును గల ప్రథమాష్టమ వర్ణములను గ్రహించిన ఏతన్నాటక నామమేర్పడును. ఇందీ నామమొకటే కాక నాటక శైలి కూడ వివరింప బడినది.

'ప్రసన్న రాఘవము' అనగా ప్రసన్నుడైన రాఘవుని అధికరించి రచింప బడిన నాటకము' అని వ్యుత్పత్తి చెప్పుకొనవచ్చును. కథను బట్టి నాటకమునకీ నామము అన్వర్థమగుచున్నదనుటలో సందియము లేదు. రామకథ మిక్కిలి ప్రసన్నమైనది కనుకనే ఎందఱో కవీంద్రులు వ్రాసిన రామకథనే తాను మరల వ్రాయ నుంకించి నాడు జయదేవుడు. అతడు

స్వసూక్తీనాం పాత్రం రఘుతిలక మేకం కలయతాం
కవీనాం కో దోషః ? సతు గుణ గణానా మవగుణః
యదేతై ర్నిశ్శేషైరపర గుణలుబ్ధైరివ జగ
త్యసావేక శ్చక్రే సతత సుఖసంవాస వసతిః 1—12

'కవులందఱును రాముని కథనే వ్రాయుట వారి దోషముగాదు, సుగుణ సమూహము స్థిరముగా రాముని ఆశ్రయించుటయే అందులకు కారణము' అని అతడు వ్యంగ్యముగా రామకథాగుణ మహత్త్వమును వెల్లడించెను.

ఈ నాటకమున సీతా స్వయంవరము మొదలుకొని రామ పట్టాభిషేక పర్యంతముగల రామాయణ కథ అంతయు సమగ్రముగ చెప్పబడినది. ఈ కథ యందు సీతాపహరణము ప్రధానాంశము. రావణుడు సీతా స్వయంవరమున కేతెంచి అచట ఆమెను గాంచి ఆమె లావణ్యమునకు ముగ్ధుడయ్యెను. అతడు

తగిన సమయము వఱకును వేచి వనవాస కాలమున సీతను అపహరించెను. రామునికి పత్నీ వియోగము దుస్సహమైనది. ఆమెకై ఆతడు మానవ మాత్రుని వలె విలపించెను. కపి బలము తోడుకాగా ఆమె నన్వేషించి, సముద్రమును దాటి శత్రువును దునుమాడి పత్నీ పునస్సమాగమము పొంది ప్రసన్నుడైనాడు. ఇట్టిది ప్రసన్న రాఘవ మైనది.

ఈ నాటకము నాంధ్రీకరించిన బొడ్డుచర్ల చినతిమ్మయ ఈ నామమును యథాతథముగా గ్రహించెను. దీనిని 'నాట్యప్రబంధ' మనుట కూడ మూలాను సరణమే. ఆంధ్ర ప్రసన్న రాఘవమునందు నాటకలక్షణములును ప్రబంధ గుణములును రెండును మేళవింపబడుటచే కూడ ఈ నామ ముచితమై యొప్పు చున్నది. కవి మూలము నందు వలెనే కావ్యనామము నీక్రింది పద్యమున గుప్త ముగా సూచించెను.

"ప్రతి రసంబును నిఖిలాంక పంక్తి నెగడ
నలిన రాజి వినూత్న బంధంబు సెలగ
ఘటిత ప్రకత శశిరేఖ కరణిరమ్య
మగుచు నుతికెక్క నాటకం బద్భుతముగ" 1—10

ఈ తేటగీతి యందలి మూడు పాదములలోని ప్రథమ ద్వితీయ గుణముల ఆద్యక్షరములను కలిపి చదివిన 'ప్రసనరాఘవ' అను పద మేర్పడును. ద్విత్వన కారము వాడుట కవకాశము లేకపోయినది.

నాటక పరిశీలనము :

ప్రసన్న రాఘవము అర్వాచీన సంస్కృత నాటకములలో మిగుల ప్రఖ్యాతి గాంచినట్టిది. రామాయణ వస్తుకములై ప్రసిద్ధి గాంచిన, భవభూతి ఉత్తరామచరిత మహావీర చరితములు, దిజ్నాగుని కుందమాల, మురారి అనర్ఘ రాఘవము, రాజశేఖరుని బాలరామాయణము అను నాటకములతో ఈ నాటకము కూడ సమాన గౌరవమును గాంచినది.

ఇది ఏడంకముల నాటకము. ఇందలి వృత్తము ప్రఖ్యాతము. ఇందలి నాయకుడు దివ్యాదివ్యుడును, ధీరోదాత్తుడును అగు రాముడు. ప్రధాన రసము వీరము. శృంగారాద్భుత రౌద్ర హాస్యాద్యన్యరసములు అంగరసములు. ఇందలి

ప్రతినాయకుడు రావణుడు. రీతి ప్రాయికముగా పాంచాలి. అటనట వైదర్భి ప్రసాదము అను గుణములు కూడ కనవచ్చును.

ప్రసన్నరాఘవము రమ్యబంధముగల నాటకము. సంస్కృత నాటక వాఙ్మయమునందు ప్రౌఢమైనదిగా నెన్నబడుచున్న మురారి అనర్ఘ రాఘవ నాటకము నిది శైలీసంవిధానమునం దనుకరించుచున్నది. కావుననే ఈ నాటకకర్తకు 'పిల్లమురారి' అను వాడుక కలిగినది. జయదేవుని శైలి పరమ రమణీయమైనది. ఇందలి శ్లోకములు సాహిత్యదర్పణము, శార్ఙ్గధర పద్ధతి, రసార్ణవ సుధాకరము మున్నగు లక్షణ గ్రంథములం దుదాహరింపబడినవి భాస్కర రామాయణము, సింహాసనద్వాత్రింశిక [4-1.C] మున్నగు తెలుగు కావ్యములందును ప్రసన్న రాఘవము నందలి శ్లోకముల అనుకరణము కనవచ్చు చున్నది. ఇట్లు తెలుగు సంస్కృత కవులే కాక తులసీదాసు గూడ రామచరితమానసమున నాటకమందలి శ్లోకముల ననుకరించి యున్నాడు. నాటకమునందలి షష్ఠాంకమునందు గల ఈ క్రింది శ్లోకము, రాము నెడబాసిన సీత దుఃఖమును దెల్పుచున్నది.

"చంద్రహాస ! హర మే పరితాపం, రామచంద్ర విరహానల జాతమ్
త్వంహి కాంతిజిత మౌక్తిక చూర్ణ ధారయా వహసి శీతలమంభః"

పై శ్లోకమును తులసీదాసిట్లు అనుకరించెను.

"చంద్రహాస। హర మమ తాపం రఘుపతి విరహ అనల సంజాతమ్
శీత నిశాతన అసివం ధారా కహ సీతా హరు దుఃఖభారా ॥"

ఈతడీ శ్లోకమునే కాక ఈ నాటకము నందలి పెక్కు ఘట్టములనుకూడ అనుసరించెను.

జయదేవుడు కవిత్వమునకు మిక్కిలి ఉన్నత స్థానము నిచ్చెను.

"న బ్రహ్మవిద్యా నచ రాజలక్ష్మీ
స్తథా యథేయం కవితా కవీనామ్
లోకోత్తరే పుంసి నివేశ్యమానా
పుత్రీవ హర్షం హృదయే కరోతి 1-28

ఇతని కవిత్వము మిక్కిలి సరసమై అసామాన్యమైన శిల్పమును ప్రకటించును :

'యస్యాశ్చోరశ్చికుర నికరః కర్ణపూరో మయూరో
భాసో హాసః కవికుల గురుః కాలిదాసో విలాసః
హర్షో హర్షో హృదయ వసతిః పంచ బాణస్తు బాణః
కేషాం నైషా కథయ కవితా కామినీ కౌతుకాయ" 1-22

'కవితా కామినికి కవిచోరుడు కేశకలాపము, మయూరుడు కర్ణభూషణము, భాసుడు హాసము, కాళిదాసు విలాసము, హర్షుడు హృదయస్థిత హర్షము, బాణుడు పంచబాణుడు. అట్టి శోభతో విరాజిల్లెడు నామె ఎవరికి కౌతుకము కలిగింపదు?' అని ఇందలి భావము. ఇందు కవులు భారతికి భూషణ ప్రాయులుగ వర్ణింపబడుట హృద్యముగ నున్నది. ఆ యా కవులు ఏ కవితా గుణములందు ప్రసిద్ధి కెక్కిరో ఆ గుణములతో నామె అలంకరింపబడుట ఇందలి వైశిష్ట్యము.

జయదేవుడు బంధ త్ర కవిత్వములందు మేటి శ్లేషను గల్పించుటలో నద్వితీయుడు.

'అయే లంకేశ! విన్యస్త శేఖరాలోక నేనతే' 1-38

ఇయం లీలా లోలాంగద భుజలతా సీలచికురా 7-16

మున్నగు శ్లోకము లిందుల కుదాహరణములు. ఈతని అనుప్రాస సంఘటనము సుందరమైనది. ఈతడు గావించిన వర్ణనములలో సీతా సౌందర్య వర్ణన [11] సంధ్యా [11] సూర్యోదయ [111] చంద్రోదయాది [11] వర్ణనములు ప్రౌఢములయ్యును ధారాశుద్ధికి నిలయములై యింపు నింపుచున్నవి. జయదేవుని సంస్కృత భాషా పాండిత్యము అపారమైనది. ఈ నాటకమునందు ప్రాకృత భాష అతిస్వల్పముగ నుపయోగింపబడి యుండుట గమనింపదగిన అంశము. ఈతడు దీర్ఘచ్ఛందముల యెడ మక్కువను ప్రకటించును. వసంత తిలకము ఈతని కభిమాన పాత్రము. ఈత డలంకార శాస్త్రమునందు పండితుడై యుండుటచే నాటకమును అర్థ శబ్దాలంకారములతో నలంకరించి యుంచెను. తన కవిత్వములో సరసతాకోమలతలతో పాటు కఠినతావక్రతలు కూడ నెలకొని యుండుట నతడిట్లు సూచించెను :

"యేషాం కోమల కావ్య కౌశల కలా లీలా వతీ భారతీ
తేషాం కర్కశ తర్క వక్ర వచనోద్గారేపి కిం హీయతే,

యైః కాంతా కుచ మండలే కరరుహాః సానంద మారోపితా
స్తైః కిం మత్త కరీంద్ర కుంభ శిఖరే నారోపణీయాః శరాః" 1-18

జయదేవుడు నాటకమునందు కేవల కవిత్వాడంబరమే కాక హృద్యమగు నాటకీయతను గూడ ప్రదర్శించియున్నాడు. ఇతడు మూలరామాయణ కథకు పెక్కు అమూలక కల్పనములను గావించి, చక్కని నాటక శిల్పమును ప్రదర్శించెను.

అమూలక కల్పనలు :

1. సీతా స్వయంవరమునకు బాణరావణు లేతెంచుట వాల్మీకి రామాయణమున లేదు జయదేవుడీ కల్పనము నొకానొక కథాప్రయోజనము నాశించి గావించెను. బాణరావణు లిరువురును లోకోత్తర విక్రమ సంపన్నులు, గర్వోద్ధతి గలవారు. వారిరువురికిని స్వోత్కర్ష మెండు. వారొకరిసి మించిన వారొకరని భావింతురు. కాని వారిరువురును హరచాపారోపణమునం దసమర్థులైరి. దీనినిబట్టి శివకార్ముక మహత్త్వము వెల్లడి యగుచున్నది. ఈ విధముగా తత్కార్ముక ప్రాశస్త్యమును తెలుపుటయే జయదేవు డాశించిన ప్రయోజనము. నాటక ప్రథమాంకముననే దీనిని సాధింపదలచినాడు నాటకకర్త. ప్రథమాంకమున నాయికా నాయకులకు ప్రవేశము లేదు. అందు కేవలము బాణరావణుల ప్రసంగము మాత్రమే ప్రధానముగా నిర్దేశింపబడినది. ఇట్టి మహావీరులకే అశక్యమైన ఆ చాపారోపణము బాలుడగు రాము డవలీలగా గావించుట భావి కథార్థమున కెంతయో పోషకముగ నున్నది.

2. నాయికా నాయకులు వివాహమునకు పూర్వమే ఒకరినొకరు గాంచి అనురాగము పొందుట కూడ కవి కల్పించినదే. ఈ కల్పనము నాయికా ముగ్ధాత్వమును ప్రకటించుచున్నది. వీరిరువురికిని వీక్షణ మాత్రముననే పరస్పరము జనించిన సహజ ప్రేమ, అనంతరము వారికి కలిగిన వియోగమున కుద్దీపక మగుచున్నది.

3. విశ్వామిత్రుడు, సవన సంరక్షణార్థము రామలక్ష్మణులను తనతో పంపిన దశరథుని వినియమునకు మెచ్చి, తాటంక యుగ్మము నాతనికి కానుకగా ఇచ్చుట, తత్సంగ్రహణార్థము మాల్యవంతుడు తాటక నంపుట మున్నగు ఘట్టము లు మూలమున లేవు.

ఇట్టి అభినవాంశమునను జేర్చుటయేకాక జయదేవుడు సీతాస్వయంవరము మొదలుకొని శ్రీరామ పట్టాభిషేకము వరకును గల రామాయణ కథను సమగ్రముగ దృశ్య రూప మొనరించుటలో ఎనలేని చాతురిని బ్రదర్శించెను. అందలి కొన్ని అంశములు తప్పక పేర్కొనదగినవి.

చతుర్థాంకము నందలి పరశురామ గర్వభంగ వృత్తాంతము జయదేవుని నాటకీయత కొక చక్కని ఉదాహరణము. ఇందు రామలక్ష్మణ, పరశురామ సంభాషణ మొకచో వ్యంగ్యమై, మఱియొకచో సరసమై, ఇంకొకచో ప్రౌఢమై సాగినది. ఈ వృత్తాంతము ప్రసిద్ధమే అయ్యును వానిని జయదేవు డభినవ విధానమున చిత్రించినాడు.

ప్రసన్న రాఘవము నందలి పంచమాంకము విశిష్టమైనది. ఇందు సీతా పరిణయానంతరము అయోధ్యలో జరిగిన వృత్తాంతము మొదలుగా సీతాన్వేషణము వఱకును గల రామాయణ కథ చెప్పబడినది. కాని ఈ అంకము నందెచటను ప్రధాన పాత్రలకు ప్రవేశము లేదు. పై వృత్తవర్తిష్యమాణ కథాంశము లన్నియును గంగ, యమున, సరయువు, గోదావరి మున్నగు నదులచే సంభాషణము మూలమున తెలుపబడును. ఇట్టి సూచ్యాంశములను అర్థోపక్షేపకముల ద్వారా వెల్లడింపక అంకమునందు వివరించుట కవి అవలంభించిన నూత్న విధానము. ఈ అంకమున జయదేవుడు తన సంభాషణ రచనా సామర్థ్యము వెల్లడించి యున్నాడు.

సంభాషణములను రచించుటలో జయదేవుడు మేటి. ఈ సంభాషణములు వక్రోక్తి పూర్వకములై వ్యంగ్య భరితములై యుండును. ఇట్టి సరస సంభాషణములలో సీతా స్వయంవరపు ఘట్టమున రావణబాణులతో స్తుతి పాఠకులగు మంజీరక నూపురకులు గావించినదియు, పరశురామ గర్వభంగ సందర్భమున లక్ష్మణుడు జామదగ్న్యునితో గావించినదియు, విశ్వామిత్రుడు మిథిల కేతెంచిన వార్తను దెలుపుచు వామన కుబ్జకులు కావించినదియు ఎన్నదగినది. కావ్యమంతయు నిట్లు సరసముగ సాగుటచేతనే ఇందు విదూషక పాత్రము లేకున్నను హాస్యము చిప్పిలుచున్నది.

జయదేవు డీ నాటకము నందు చిత్ర విచిత్రములగు సన్నివేశములను పెక్కింటిని కల్పించి చమత్కారము సాధించెను. లంకయందలి సీతా వృత్తాంత

ముమ ఐంద్రజాలిక ప్రభావమున రాముడు గాంచు ఘట్టము రమణీయమైనసన్ని వేశములలో నొకటి. ఇందు సీతా శోకము, త్రిజట అనునయము హృద్యము లుగా నున్నవి. రావణుడు క్రోధమున సీతపై కరవాలము నెత్తగా అతనిచేత అక్షయ కుమారుని తలవచ్చి పడు సన్నివేశము ఈతని నాటకీయ శిల్పమునకు నిదర్శనము. రావణుడు చిత్రపట సందర్శనము ద్వారా వైరుల బలపరాక్రమ ముల నెఱుంగు ఘట్టము కూడే కథాప్రయోజనమున కుచితమై ఒప్పుచున్నది.

పైని పేర్కొనబడిన నాటకీయత ప్రసన్న రాఘవమున గోచరించు చున్నను సంస్కృత వాఙ్మయము నందు జయదేవునకు నాటక కర్తగా సము న్నత స్థానము లేదనియు, రామాయణ కథ నాటకముగా రచింపబడుటకు అను కూలమైనట్టిది కాదనియు, ఆ కథలో ఏదేని భాగమును కాక దాని నంతటిని గ్రహించి జయదేవుడు తత్క్రిమమును సుసంఘటితము చేయుటలో విఫలు డాయెననియు విమర్శకుల యభిప్రాయము.[6] ప్రస్తావన అతి దీర్ఘముగా నుండు టయు, తదనంతరము దాల్భ్యాయముని స్వగతమును, మంజీరక నూపురకుల సంభాషణమును కూడ అతి విస్తరములై నాటకమునకు నీరసత నాపాదించు చున్నవి.

నాటకాంతము నందలి చంద్రోదయాది వర్ణనములు కూడ కథతో నెట్టి సంబంధమును కలిగి యుండక పోవుటచే కవిత్వము రమణీయ మయ్యు నవి రూపకానుగుణములు కాకుండ పోయినవి.

### బొడ్డుచర్ల చినతిమ్మయ్య కాలము :

బొడ్డుచర్ల చినతిమ్మయ్య ప్రసన్న రాఘవ నాట్యప్రబంధమును నంద్యాల తిమ్మరాజున కంకితము చేసియుండెను[8] ఈతడు కృతిలో తన్ను గుఱించి యొక పద్యమును మాత్రము వ్రాసికొనెను.

ఉ. ధీరుడు బొడ్డుచర్ల చిన తిమ్మయ మంత్రి కుమారుడంచితా
కారుడు సత్కళా విదుడు కౌశిక గోత్రుడు పద్మనేత్ర సే
వారత బుద్ధి నందవర వంశ్యుడు పాకవిలోకనాధుడా
చార సమగ్ర వర్తనుడు సారవచోనిధి యున్నవాడొగిన్. 1-7

అటుపై పద్యమునకు ముందున్న వచనము (1-6) నందు తాను నందేల తిరుమల ధరావరుని కొలువునం దర్ధాసన మలంకరించినట్లును, కృతిపతి ప్రశంస ముగిసిన పిదప నొక గద్యమున తన కారాజు "ప్రవిమల ముక్తాఫలాత పత్రాం దోళి కాంగద పదక పదకటక హారాగ్రహార కర్పూర గంధసారాదికంబులు తోరహత్తుగా మెచ్చి యిచ్చినట్లును (1-80) చెప్పుకొనెను.

ఈ కవిని గూర్చి శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు తమ చాటు పద్య మణి మంజరి' ప్రథమ భాగమున 'శ్రీకృష్ణ దేవరాయ' అను శీర్షికలో నీ క్రింది పధమున వ్రాసి యుండిరి.[7]

"రాయలకు జదరంగపుటెత్తులు వేయుటయం దత్యాసక్తి యుండెడిదట. బొడ్డుచర్ల చిన తిమ్మన యను కొప్పోలు కరణము కవీశ్వర దిగ్గంతియను ప్రతిష్ఠ గలవాడై శ్రీకృష్ణదేవరాయలతో జదరంగ మాడుచుండెడి వాడు. శ్రీకృష్ణ రాయల పక్షమున ఎందఱాలోచించి ఎత్తు వేయుచున్నను నీత డొక్కడే ఎదురెత్తువేసి యాట గెల్చుట వేయార్లు పందెము గొనుచుండు వాడట. అతని శక్తికి సంతోషించి రాయలు కొప్పోలు గ్రామమునకు గృష్ణరాయ పురమను నామ మేర్పఱిచి సర్వాగ్రహారముగా నాతనికి ధారవోసెను.

క. సత సంఖ్యలొక్కడైనను
సతతము శ్రీకృష్ణరాయ జగతీపతితో
జతురంగ మాడి గెల్చును
ధృతిమంతుడు బొడ్డచెర్ల తిమ్మ భళిరే.

ఉ. ధీరుడు బొడ్డుచెర్ల చిన తిమ్మన మంత్రి కుమారు డంచితా
కారుడు సత్కళావిదుడు కౌశిక గోత్రుడు పద్మనేత్ర సే
వారత బుద్ధి నందవర వంశ్యుడు సత్కవిలోకనాథుడా
చార సమగ్ర వర్తనుడు చారు వచస్స్థితి నొప్పు వాడొగిన్."

పద్యములలో పై కందము చాటువు. క్రింది పద్యము నాట్య ప్రబంధ మునకు సంబంధించినది. ఈ పద్యములలో మొదటిదానిలో 'ధృతిమంతుడు బొడ్డుచెర్ల తిమ్మన' అనియు, రెండవదానిలో ధీరుడు బొడ్డుచెర్ల చిన తిమ్మన అనియు స్వల్పమగు నామభేదము గలదు. ఇంకను ప్రస్తుతము ముద్రితమైన నాట్య ప్రబంధములో కృతికర్త చెప్పుకొనిన పద్యము నందు 'ప్రాకవిలోక

నాథుడు, అని యుండగా చాటు పద్యమణి మంజరిలోని రెండవ పద్యమున' సత్కవిలోక నాథుడని పాఠ భేదమున్నది. ప్రాకవినాథుడను సమాసము దుష్ట మగుటచే నెవరో ఆ మార్పు చేసియుందురు. పీని మూలమున కృతికర్త కాల మును గుఱించియే కాక ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధ కర్త చిన తిమ్మయ యగునా కాదా అను విషయమును గూర్చి కూడ సందేహము కలుగుచున్నది.

రాయలతో చదరంగ మాడిన తిమ్మయయును కృతికర్తయగు తిమ్మయ యును ఒకరా కాదా అని పరిశీలించి విమర్శకులు తమ తమ అభిప్రాయములను దెలిపి యుండిరి. డా. బి. రామరాజుగారు చదరంగమాడిన తిమ్మయ కృతి కర్త మనుమడని భావించి అతని కాలమును క్రీ.శ. పదునాఱవ శతాబ్ది చరమ పాదమని నిర్ణయించిరి. కృతికర్తకు సంబంధించిన పద్యమునందు సత్కవిలోక నాథుడు అను పాఠాంతర ముండుటచేతను, ఆ పద్యమున 'బొడ్డుచెర్ల చిన తిమ్మయ మంత్రి కుమారుడు' అని పేర్కొనబడుటవలనను, శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు ఏతద్గ్రంథ కర్త బొడ్డుచెర్ల చిన తిమ్మయ కుమారుడగు లోకనాథుడనియు ఒతడు చదరంగ మాడిన తిమ్మయ మనుమడనియు చెప్పి ఒతని కాలము క్రీ.శ. 1550 - 85 అని వచించిరి. శ్రీ నిడుదవోలు వేంకట రావుగారు ఈ విషయమును చర్చించుచు, రాయలతో చదరంగమాడిన తిమ్మయ యును కృతికర్తయగు చిన తిమ్మయయును అభిన్నులని చెప్పి ఈతని కాలమును 1500 - 1530 ప్రాంతముగా భావించిరి.[9] శ్రీ ఆరుద్రగారు ప్రసన్న రాఘవ నాట్యప్రబంధ కర్త లోకనాథుడని భావించుటయే సమంజసమనియు, ఈ బొడ్డు చెర్ల లోకనాథుడు, చదరంగమాడిన బొడ్డుచెర్ల చిన తిమ్మయ కుమారు డగు నేమో అనియు తమ అభిప్రాయము వెలిపుచ్చి "అతడు 1530 లో పుట్టి 1575 ప్రాంతమున ఈ రచన చేసి ఉండవచ్చును"[10] అన్నారు.

ఈ అభిప్రాయములలో బొడ్డుచెర్ల చినతిమ్మయ కుమారుడగు ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధకర్త లోకనాథుడను భావనయే సరియైనది. ఏలన కృతి కర్త తన్ను గూర్చి చెప్పుకొనిన పద్యములో "ధీరుడు బొడ్డుచెర్ల చినతిమ్మయ మంత్రి కుమారుడు' అని స్పష్టముగ నున్నది. ఇక రాయలతో చదరంగమాడిన తిమ్మయయును, పద్యము నందుగల చిన తిమ్మయయును అభిన్నులను నిడద వోలు వారి అభిప్రాయమును కూడ ఒప్పుకొన వచ్చును. అప్పుడు మంత్రి

కుమారు డనునది ఆతనికి విశేషణమై యుండును. ఈ చిన తిమ్మయకు 'కవీశ్వరదిగ్దంతి' అను బిరుదము గలదు. ఈతడు కవియై యుండెననుటకు ఎట్టి అనుమానమును లేదు

ఈ కావ్య కృతిభర్తయగు నంద్యాల తిమ్మరాజు ఆరవీటి బుక్కరాజునకు అబ్బలదేవి వలన జనించిన సంతతికి ఆఱవతరము వాడు. ఈతడును కళాపూర్ణోదయ కృతి భర్తయగు నంద్యాల కృష్ణరాజును అన్నదమ్ముల మనుమలు. నంద్యాల కృష్ణరాజు క్రీ.శ. 1580 నుండి 1599 వఱకు గండికోటను ఏలినట్లును, ఈతడు విజయనగర రాజగు వీరవేంకటపతి రాయలచే 1599 - 1600 ప్రాంతమున జరిగిన జంబులమడక యుద్ధమున ఓడింపబడి చంద్రగిరి కారాగారామునందుంచబడి, కొన్నాళ్ళకు మరణించినట్లును 11 పరిశోధకులు చెప్పుచున్నారు. కనుక కృష్ణరాజునకు సోదరుడగు నంద్యాల తిమ్మరాజు కూడ అన్నగారికి సమకాలీనుడై 16వ శతాబ్దమున నుండియుండు ననుకొనవచ్చును. బొడ్డుచెర్ల కవి ప్రసన్న రాఘవమునందు చెప్పిన కొన్ని పద్యముల వలన 12 కృతిపతి నంద్యాల తిమ్మరాజు, క్రీ.శ. 1567 ప్రాంతమున విజయనగర సేనలు కల్యాణిని ముట్టడించిన సందర్భమున జరిగిన యుద్ధములో పాల్గొని యుండునని కొందఱభిప్రాయ పడుచున్నారు.13 ఇట్లు విమర్శకులచే కృతిభర్త కాలము క్రీ.శ. పదునాఱవ శతాబ్దముగా నిర్ణయింపబడినది. కావున కవి కూడ ఆదే కాలమునకు చెంది యుండును. ఇంతకంటె నెక్కువ నిశ్చయముగా చెప్పుట కవకాశము లేదు.

పింగళి సూరన కళాపూర్ణోదయ ప్రస్తావనలో నంద్యాల తిమ్మరాజును మూడు పద్యములలో 14 ప్రశంసించి యున్నాడు. వానిలో ఇతడు, "కవిత్వ ప్రముఖ బహుకళాపారగు డనియు".

"ఏసీమ నెదురు లేక విభాసిలు నంద్యాల తిమ్మ పార్థివు బలముల్
వాసిగల యతి విభాసి ప్రాసాదులతోడ దత్ప్రబంధముల గతిన్"

అనియు కీర్తింపబడుట వలన నంద్యాల తిమ్మరాజు బహు ప్రబంధములను అంకితము కొనియుండినట్లు తెలియ వచ్చుచున్నది. వానిలో ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధమొకటై యుండును.

ప్రసన్న రాఘవ నాట్యప్రబంధ స్వరూపము :

ప్రసన్న రాఘవము తదితరాంధ్ర ప్రబంధముల కంటె విలక్షణమైనది. కావున తత్స్వరూప మెట్టిదో ముందు గ్రహించుట ఆవశ్యకము.

1. ఈ ప్రబంధమునందు మూల నాటకము వలెనే అంకవిభజనము గలదు. అందువలెనే ఇందును ఏడంకము లున్నవి.

2. కృత్యాదియు ఆశ్వాసాద్యంతములును కావ్యరీతికి భిన్నములు. ఆరంభమున ప్రస్తావన యున్నది. ఇందు నాందీ పద్యములును, నాంద్యంతమున సూత్రధారుడు ప్రవేశించి కవి వర్ణించినట్లు కృతిపతి వంశమును వర్ణించుటయు, పిమ్మట నటసూత్రధారుల సంభాషణమును కలవు. అన్ని అంకముల చివరను

క. నందేల తిమ్మరాజ పు
రందర చిహ్న ప్రసన్న రాఘవ నాట్యా
మంద ప్రబంధ రాజము
నందున ప్రథమాంకమయ్యె నార్యస్తుతమై 1-328

అని సంఖ్యాభేదముతో నంకావసానము పేర్కొనబడినది.

3. ఇందు నాటకము వలెనే అర్థోపక్షేపాదులు, నాందీప్రస్తావనలు, పాత్ర ప్రవేశ నిష్క్రమణాదులు, సాత్త్వికాద్యభినయాంశములు, నేపథ్య స్వగతాదులు యథాతథముగా గ్రహింపబడినవి. "ప్రస్తావనలో కృతిపతి ప్రశంసను చేర్చుట నాటకము ప్రబంధము అను రెండు భిన్న ప్రక్రియల నడుమ వంతెన గట్టి నాట్య ప్రబంధముగా తీర్చిదిద్దుట"[15]

4. ఇందు వచన భాగము స్వల్పము. ఇందు మొత్తము 1371 గద్యపద్యములున్నవి. "కవి సూచనములను సంధి వాక్యములను కుండలీకరణములందుంచి పాత్రల పేరుల కెదురుగా వాది సంభాషణములుంచి ముద్రించినచో నిది యొక పద్యనాటకమగును".[16]

ఈ గ్రంథమున కొన్ని ప్రత్యేకతలు కూడ కనవచ్చుచున్నవి.

1. ఆంధ్ర సాహిత్యమునందు నంద్యాల రాజుల వృత్తాంతమును దెలుపు

గ్రంథములలో నిది రెండవది. మొదటిది కళాపూర్ణోదయము ఈ గ్రంథ మున మూలాతిశాయిగా నున్న భాగముల వలన ముఖ్యముగా కావ్యాంతము నందుగల పురవర్ణనము వలన, సమకాలీన సాంఘికచరిత్ర కొంత తెలియుచున్నది.[17]

2. ఆంధ్ర నాటక పరిణామ చరిత్రలో మొదటిదశ సంస్కృత నాటకములు స్వతంత్ర పద్ధతిలో తెలుగు కావ్యములుగా రూపొందుట; రెండవదశ నాటక లక్షణములను ప్రతిబింబించుచునే నాటకము ప్రబంధ రూపమును పొందుట. ఇట్టి లక్షణము క్రీడాభిరామమున ప్రకటింపబడినది. ఈ ప్రసన్న రాఘవము క్రీడాభిరామము కంటె నధికముగా నాట్యలక్షణములను సంతరించుకొని, ఆంధ్రనాటక సమగ్ర స్వరూపావతరణమునకు కొంత దోహదము కావించుచున్నది.

కృత్యారంభము :

ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధ కృత్యారంభము మూలనాటకమువలెనే నాందీ పద్యములతో సాగుచున్నది. ఈ పద్యములు మూడు. ఇవి తిమ్మనృపాలుని నామముతో కూడి తన్మంగళాశంసన పూర్వకములై యున్నవి. ఈ మూడింటి యందును 'హరి' స్తుతింపబడినాడు. ఇందలి రెండవ పద్యము వస్తు సూచనమును గావించుచున్నది.

శా. "ఆరోగ్యం బొసగున్ మురారి ముఖ చంద్రాంచన్మరున్మాధురీ
ధీరోదాత్తము, మేఘనాద విజయోదీర్ణంబు, నిర్భిన్నదే
వారాతి ద్విప కుంభకర్ణము, దశాస్యాశాక్రమోత్కంఠునై
భూరి శ్రీదగు పాంచజన్య రవమెప్డున్ తిమ్మభూభర్తకున్"

ఈ పద్యమున శ్లేష గలదు. తద్ద్వారమున వస్తువు నిర్దేశింపబడినది. ఈ కావ్య నాయకుడు ధీరోదాత్తుడగు రాముడు. అత డవలీలగ మేఘనాదుని కుంభకర్ణుని నిర్జించెను; దశాస్యుని వధించి సమస్త దిగ్విజయమున కీర్తి చంద్రికలను విస్తరించెను. అనువస్తుధ్వని – మురారి పాంచజన్యరవ వర్ణనము ద్వారా వ్యంజితమైనది. నాంద్యంతమున 'అంజనాద్రీశుని' తీర్థయాత్రా సందర్భమున నందేల తిరుమల ధరావరుండు సకల వైభవ సముపేతముగ కొలువు దీర్చియున్న సందర్భమున ఆ రాజుతో అర్ధాసనమున నాసీనుడైన కవి 'ప్రసన్న

రాఘవంబను మహానాటకం బంధ్ర నాట్యప్రబంధంబుగా 18 అనుసంధించి ఆత నికి అంకితమిచ్చెను. ఈ సందర్భమున కవి స్వవిషయము నొక పద్యమున వెల్లడించెను. అటుపై – డెబ్బది నాలుగు గద్య పద్యములలో కృతిపతి వంశావ తారవర్ణనమును, తత్ప్రశంసను గావించెను.

కృతిపతి ప్రశంస గావింపబడిన తరువాత సూత్రధారుడు, రంగతరంగు డను నటునితో గావించిన ప్రస్తావన గలదు. మూల నాటక ప్రస్తావన ననుస రించి ఇదియును దీర్ఘముగ సాగినది. ఇందు వాణీస్తుతి, ఆదికవి వాల్మీకి నుతి, రామ కథా ప్రాభవము మున్నగు అంశములును, పిమ్మట జయదేవ కవి గోత్రా దికములును, తత్కవితా వైశిష్ట్యమును, పూర్వసంస్కృత కవుల కవితావైభవ మును తెలుపబడినవి. నాటకమునందువలె కథోద్ఘాతము ద్వారా పాత్ర ప్రవేశము గావింపబడిన పిమ్మట కథారంభమైనది.

## ప్రబంధ కవితారీతి :

ఈ ప్రబంధము నాయికా కల్యాణ ప్రసక్తితో నారంభమగుచున్నది. ఈ ఘట్టమున నాయికా స్వయంవరమున కేతెంచిన వివిధ రాజుల గుణరూపాదిక ముల వర్ణనమాదిగా తత్స్వయంవర సంరంభమంతయు చక్కగ వర్ణింపబడినది. ఈ కావ్యమునందలి ద్వితీయాంకమున ప్రబంధ కవితారీతి గోచరించు చున్నది. అందు ఆరామ విహారము, వసంత వికాసము, నాయికా నాయకుల ప్రథమ సమాగమము, వారియం దుద్భవించిన శృంగార భావములు, తత్సౌందర్యము, నాయికా ముగ్ధ విలాసము, సంధ్యాకాల ప్రకృతి మున్నగున వన్నియు హృద్య ముగా వర్ణింపబడినవి. ఈ వర్ణనములు మూలమును స్వతంత్రముగా ననుకరించు నవియై కావ్యశోభ నినుమడింప జేయుచున్నవి.

ఈ అంకమున కవి నాయిక నాపాద మస్తకము తనివిదీర వర్ణించి యున్నాడు. ఈ వర్ణనము ఇంచుమించు నలువది పద్యములలో సాగినది. ఇందు కొంత భాగము మూలాతిశాయియై కవి యొక్క వర్ణనా కౌతుకమును వెల్లడించు చున్నది. ఈ క్రింది పద్యమునందలి ఉత్ప్రేక్ష మనోహరము.

గీ. అతివ సకలాంగకంబులు నర్ఘ వస్తు
వితతిచే జేయుచో ధాత చతురుడగుచు

మగుడవైచిన యర చందమామ నిటల
మందు జెందిన కందు కంపారు బొమలు. 2-66

బ్రహ్మ ఆమె సర్వావయవములను యోగ్యవస్తు సముదాయముతో నిర్మించు తఱిచతురుడై తిరుగవైచిన అర్ధచంద్రుడు ఫాలభాగము కాగా నందలి కందు వలె కనుబొమ లింపారును. రాముని గాంచిన సీతకు గలిగిన సాత్త్విక భావములను కవి యిట్లు వర్ణించెను

ఉ. చూచి విలోలలోచన రుచుల్ నవరాగ కషాయితంబులై
లోచవి జొక్క చెంగలువలున్ బలెకుంకుమ మిశ్రఘర్మ వా
ర్వీచుల ద్రోచి ముత్పులక రేఖలు ఝల్లన నంకురింప న
మ్మేచక మేఘ నీలకచ మేనికి దూరము సేసెధైర్యమున్ 2-136

ఈ పద్యభావము కవి స్వతంత్రముగా కల్పించినట్టిది. ఇందు నాయికకు లోచనకాంతులు నూతన రాగ కషాయితంబులగుట, స్వేదమలము కొనుట, మేను పులకరించుట, ధైర్యము వీడిపోవుట మున్నగు భావములు ఆమె యందం కురించిన అనురాగ భావమును చక్కగ ప్రస్ఫుటము గావించుచున్నవి. నాయకుని గాంచి ఆమె అన్య మనస్కయగుట, చెలి ఆమె మనోభావమును బసిగట్టి మేలమాడగా సీత లజ్జా సలిల నిమజ్జనము గావించుట, చెలి ఆమెను

క. "పట్టిన చలంబు విడువవు
కట్టా! మామీద నేమికారణమునకో
పట్టాభిషిక్త నందన
కట్టడి యోయమ్మ నీప్రకారము దలపన్ 2-141

అని శబ్దమాధుర్యమును చిందించుచు నూఱడించుట మున్నగు సన్నివేశములు సరససుందరములై యున్నవి. ఇదే సందర్భమున సీత అన్యాపదేశముగా తేటితో పలికిన క్రింది పద్యము కమనీయము. ఇది ప్రబంధ కవితా చతురుడైన కవి స్వయముగ కల్పించినట్టిది.

చ. "తొలగకు మింక నోకలికితుమ్మెద యన్య మధుప్రియంబులుం
బలె బహువల్లి వల్లభతబట్టకుమీ యతి సౌరభద్రుని
ర్గళదమృతాంబు ధారగల కమ్మదనంబులు నీకు కల్గునే
కెళవుల సత్పరిగ్రహ సుఖిత్వము మెత్తు రుదాత్త మానసుల్ 2-157

ఇందు సీత చుమ్మెదతో బల్కినట్లుగా నాయకునకు తనగుణరూప లావణ్యాదు లత్యుత్తము లైనవని తెల్పుచున్నది. ఆతని చమత్కారముగా 'బహువల్లి వల్లభత పట్టకుమీ' అని ఏక పత్నీవ్రతుడవై యుండవలెనని ఉద్బోధించుచున్నది.

ఈ అంకము నందలి సంధ్యావర్ణన ప్రౌఢమును అలంకార సంయుతమును, భావ ప్రపూర్ణమునునై యున్నది. ఆకసమందలి చంద్రకళను కవి ఇట్లుపమించెను.

గీ. ఆకసము పేరి తామర పాకునకును
సలిలకణమగు నీ చంద్రకళ దనర్చె
కమ్మ పన్నీరు నించిన కంతు నింతి
కప్పురపు గిండి నాళరేఖయును బోలె 2-181

ఆకసమను తామరపాకుపై సలిల కణమైన చంద్రకళ రతిదేవియొక్క పన్నీరు నించిని కప్పురపు పాత్ర నాళరేఖవలె నొప్పుచున్నది. ఇట్లే తృతీయాంకమున విశ్వామిత్రునితో రామలక్ష్మణులు మిథిలానగరమున కేతెంచు సందర్భము నందలి సూర్యోదయ వర్ణనము కూడ ఎన్నదగినది. [3-39] పంచమాంకమున సీతా రామలక్ష్మణుల వన ప్రయాణము వారి యాత్రా విశేషములు అన్నియును కావ్యానుకూలముగ వివరింపబడినవి.

షష్ఠాంకమున సీతావియోగము నందిన రాముడామెకై పరితపించు ఘట్టము రమణీయము. రాముడు ప్రకృతిని గాంచి సీతనే స్మరించుట చమత్కారముగ వివరింపబడినది.

చ. హిమకర పాద ఘాతమున నెంతయు మూర్ఛవహించి చంచరీ
కమధుర గీతి మూలుగుచు గ్లాంతి మెయిం దలవాంచియున్న యీ
కమలిని గ్రమ నైజ కలికా పరికీలిత కోరక స్తనిన్
దమకముమీర గోరెడు గదా కలహంసము మాటిమాటికిన్ 6-19

ఇచట నప్రస్తుత ప్రశంస వలన అప్రస్తుతమయిన కమలినీ వృత్తాంతము ప్రస్తుతమైన కథానాయికా వృత్తాంతమును స్ఫురణకు తెచ్చుచున్నది. హనుమంతుని దౌత్యము, ఆతడు లంకయందు రేపిన కలవరము, సీత ప్రతి సందేశమును గొని సముద్రమును లంఘించి రాముని చేరుట మొదలైన అంశములు మూలాను

సారులే అయ్యును ప్రబంధోచితముగ చెప్పబడినవి. సప్తమాంకమున రామ రావణులయు కపిసేనారాక్షస సేనలయు యుద్ధ వర్ణనము వీరరసోదంచితమై దీర్ఘముగ సాగినది.

సీతారామలక్ష్మణులు అయోధ్యా నగరమునకు మరలి వెడలు సందర్భ మున మాల్యవంతుని చంద్రోదయాది వర్ణనములు కావింపబడినవి. ఈ వర్ణన ములు శబ్దాలంకారము తో గూడియింపు నింపుచున్నవి.

మ. చతురానంగభుజంగ మస్తక మణిన్ సర్వగ్రహగ్రామణిన్
రతి కాంచీ మణి శంభు జూట మణి పాంథ ద్యోమణిన్ తారకాం
చిత హారాగ్రమణిన్ జకోర పరిష చ్చింతా మణిన్ జంద్రు జూ
చితె ప్రాచీకర పద్మదర్పణమణిన్ శృంగార రక్షామణిన్ 7-161

ఇదే సందర్భమున కవి అయోధ్యాపుర వర్ణనము ప్రవేశపెట్టెను. ఈ వర్ణనము ఇరువది రెండు గద్య పద్యములలో [7-221 – 243] నున్నది. ప్రబంధమున పుర వర్ణనము నెచటనో ఒకచోట చొప్పింపవలెననెడు కవి కుతూ హలము గ్రంథాంతమున పూరితమైనది. ఈత డీ అవకాశమును వినియోగించు కొని ఆ పురము నంతటిని సమగ్రముగ ప్రబంధ పద్ధతిలో వర్ణించెను. ఈ ప్రబంధ కథ నాయకాభ్యుదయముతో నంతమై నాటకము నందువలెనే భరత వాక్యముతో ముగియుచున్నది.

**అనువాద పద్ధతి :**

బొడ్డుచెర్ల కవి మూల నాటకము ననుసరించుచు అందలి కథాక్రమము నెచ్చటను మార్చి యుండలేదు అంక విభజనము కూడ యథామూలముగనే జరిగినది. నాటక పాత్రములన్నియు నిందు ప్రవేశించినవి. కాని ఒక్క ప్రథ మాంకము నందు, సీతా స్వయంవర సందర్భమున అంతఃపుర కాంతలు చోద్య ముగా చూచుచుండ కరపద్మము నందు చిత్రపటమును దాల్చిన చందనిక మాత్రము కావ్యమున మందార కళికయైనది. [1-286] కాని అనువాదము మూలము నందలి పద్యమునకు పద్యముగా గద్యమునకు గద్యముగా సాగి యుండలేదు. ఇతడు మూలము నందలి సంభాషణాత్మక వచన భాగము నధిక ముగా పద్యములలో సంతరించెను. ఇక భావానువాద విషయమున శ్రీనాథునివలె ఉచిత స్వాతంత్ర్యమును ప్రకటించెను.

మొదట ఈతడు ఆఖ్యాన శైలి నవలంబించి నాటకమున గావించిన మార్పు లెట్టివో పరిశీలింతము.

1. మూల నాటకమున ప్రథమ ద్వితీయ సప్తమాంకముల యందు విష్కంభమును, తృతీయాంకము నందొక ప్రవేశకమును, చతుర్థాంకమునందు ధ్రువగీతములును ప్రయుక్తము లైనవి. ఇవన్నియును ప్రబంధము నందున్నవి. కాని మూలమున గద్యపద్యాత్మకముగ నున్న ఈ ఆర్థోపక్షేపకముల నీతడు అధిక భాగము పద్యాత్మకముగనే రచించెను. వాని యందెడనెడ గల వచనములు సంధి వచనములై ఆ యా సంభాషణములకు సంబంధము కూర్చుచున్నవి.

చతుర్థాంకారంభమున నేపథ్యము నందుండి ధ్రువాగీత మాలపింపబడును. [నేపథ్యే ధ్రువా గీయతే]

"మణిమయ మంగల దీపో, జనక నరేంద్రస్య మండపే జ్వలతి
చండానిలోపి ప్రాప్తో, యస్మిన్ విఫలాగమో భవతి" 4-1

ఈ ధ్రువాగీతము ఒక గీత విశేషము. తద్ద్వారమున నాటకమునందలి పాత్ర రస విశేషాదులు వ్యంగ్యముగ స్ఫురింపచేయబడును. నాటకమునందు పై ధ్రువా గీతమున సూచ్యమైన ధ్వనిని ఆంధ్రీకర్త

క. అని ధ్వని దోపగ రఘునం
దను నాక్షేపింప జామదగ్న్యుడు కడకన్
జనుదెంచి విఫలుడగునని
వినదగు ధ్రువ వాడబడియె వెస తెరలోనన్ 4-2

పై విధముగా ఆఖ్యాన శైలిలో వివరించి యున్నాడు.

2. నాటకము నందు పాత్ర ప్రవేశ నిష్క్రమణాదులు కేవలము నిర్దేశ మాత్రములై యుండును. అట్టి వానిని అనువాదకుడు కావ్యోచితమగు నట్లు రమ్యముగా వర్ణించెను. ద్వితీయాంకారంభమున తాపసుని ప్రవేశము ఈ క్రింది విధముగ సూచింపబడినది.

[తతః ప్రవిశతి తాపసః] – దీని నొక సీస పద్యమున కవి యిట్లు వివరించెను.

సీ. శ్రీమీర గటి సూత్ర దామంబు తిరియంగ
ముడి గొన్న యినుప కచ్చడము వాడు
ఘన బాహు మూలమందున జుట్టి పట్టిన
తెలి నాగ బెత్తంబు తీగవాడు
గిడుగు చందమున లంకించుమూపుల మీద
గప్పిన కాషాయ కంథ వాడు
ఒడలి పై నావంత పొడయైన లేకుండ
బూయు దట్టపు బూది పూత వాడు

గీ. మిట్ట పేరెద వా డంటుపొట్టవాడు
కూర్పగకపాలవాడు చేకుండి వాడు
గుబురు గూర్చంబు వా డెజ్జ గుడ్లవాడు
వచ్చెదాపసు డా తరువాత నొకడు 2-1

పై పద్యమున 'వచ్చె దాపసుడా తరువాత నొకడు' అనుమాట తప్ప తక్కిన భాగమంతయు కవి కల్పితము. ఇందు ఆ తాపసున కుచితమగు వేషభూషలు హృద్యముగ వర్ణింపబడినవి. 'మిట్ట పేరెద' 'అంటు పొట్ట' మున్నగు విశేషణము లాతాపసుని ఆకారమును రమ్యముగ చిత్రీకరించుచు పెద్దన సిద్ధుని వర్ణనమును దలపునకు దెచ్చుచున్నవి. ఇట్లే ఇతర స్థలములందు గూడ కవి పాత్ర ప్రవేశాదులను ఉచితముగ వర్ణించెను.

3. నాటకము నందలి సాత్త్వికాంగికాద్యభినయాంశ నిర్దేశములను గూడ కవి కమనీయ కవితామయముగా వర్ణించెను.

[సీతా సలజ్జ మధోముఖీ తిష్ఠతి] [11 పుట 118]

క. చిగురించు సిగ్గు ప్రేగున
మొగ మించుక వంచ నిందుముఖి మద కలమౌ
మగ తేటి కొదమ వ్రాలిన
బిగువున నెత్తమ్మి వచ్చు బిసినియ పోలెన్ 2-147

సిగ్గుతో నవనత ముఖియైన సీతను కవి సోపమానముగ ప్రబంధ శైలిలో వర్ణించెను.

బొడ్డుచెర్ల కవి ఒకానొకచో నాటకమునందు సూచింపబడు నిట్టి అభి నయాంశములను రెండు మూడింటిని గలిపి ఒక పద్యముగా రచించును.

[సీతా త్రాసం నాటయతి]

[తతః ప్రవిశతి రావణః]

[సీతా పరాఙ్ముఖీ తిష్ఠతి] పుట 327

క. నా విని సంత్రాసంబున
నా వనజాయతాక్షి యడలగ నాలో
రావణుడు వచ్చి నతముఖి
యై వడకెడు సీత జూచి యనియె నయముగాన్ 6-60

ఈ పద్యమున 'పరాఙ్ముఖి' యను పదము 'నతముఖి'గా మార్చబడినది. సీత వణకుట మూలమున లేదు.

111. ప్రథమాంకమున మంజీరకుని వాక్యములకు గినిసిన పురుషునకు నిర్దేశింపబడిన ఆంగికాభినయాంశములను తెలుగు కవి ఇట్లు వర్ణించెను.

[కృపాణ ముద్యమ్య] – [పరితో విలోక్య] [1, పుట 62]

క. మెరుగులు పరిగొను కరవా
లొర వాయగ బెరికి తిరిగి యురక నలుదెసల్
చుర చుర జూచుచు నాతం
డరి మురి నిట్లనియె గరిన హాస ముఖుండై 1-251

ఇచట కరవాలము నెత్తుటలోని తీవ్రత్వమును, అప్పటి క్రోధమునకు దగిన భావమును వివరింపబడినవి.

అనుసరణ కర్త ఒకప్పుడు మూలమునం దొక్కొక్కపాదము తరువాత గల సూచనాంశముల నన్నిటి నొక పద్యముగా రచించి పిదప ఆ సందర్భము నందు గల శ్లోక పాదములను గ్రహించును.

రావణ :– ... [ఇతి ఖడ్గ ముత్పాటయతి]

రామ :– హా జానకి ! త్వమధునాసి కథం భవితా
[సవిచికిత్సమ్]

ధిగ్దైవతం తవ సుదారుణ ఏవ పాకః

[సక్రోధమ్]

ఆః పాప ! రాక్షస కులాధమ । సంహృతో సి

[ససంభ్రమమ్]

హే వత్స లక్ష్మణ । ధనుర్ధనురేష కాలః 6-29

క. కరవాలం బొర వాపిన
గరుణయు సంశయము, గినుపు, గడిమియు మదిలో
బెరయగ నప్పుడు రఘుకుల
శరనిధి చంద్రుండు రామ చంద్రుడంనియెన్ 6-78

ఇచట రామునిలో కలిగిన కరుణాది భావములు ముందుగా పేర్కొన బడినవి. స్వగతముగా నాతడు పలికిన పద్యపాదములను కవి ఆ తరువాతి పద్యము నందనుసంధించెను.

ఈతడొకచో సూచనాంశములను పద్యపాదములను గలిపి పద్యరచన గావించును.

భార్గవ :- [స్వగతమ్]

(సకరుణమ్) రామే చంద్రాక్షిరామే వినయవతి శిశౌకిం ప్రకుప్యాతి మాత్రం (విమృశ్య సక్రోధమ్) హుం చాపం చంద్రమౌలేశ్చపలమతి రసావిత్తు దండం బభంజ (పునః సానుక్రోశమ్) బాలా వైధవ్యదీక్షాం జనక నృప సుతా నార్హతీయం మదస్త్రాత్ (పునర్విచింత్య సామర్షమ్) "ఆః శాంతో మే కుఠారః కథమయ మధునా రేణుకా కంఠ శత్రుః" [4-18]

ఆ. వె. అనుడు పరశురాము డాత్మగతంబున
గొంత కనికరంబు కొంత గినుపు
కొనలు వార జూచి తన ప్రోల జూపట్టు
నిన కులీను మఱియు నిట్టులనియె

శా. బాలేందు ద్యుతి ధాము రామునని జంపన్ జాల హుం, పీడుగా
డా లోకేశ్వరు విల్లు ఫెల్లన రసాలాఖంబుగా ద్రుంచెన

యో ! లక్ష్మీ సమనాథు బాయపలదే యుర్వీతనూజాతయా
రా లీలాహత రేణుకా గళము నా యస్త్రంబు సన్యస్తమే 4-48, 49

ఇందు పరశురాముడు రాముని నాశము గావింప దలంచి, ఆతనిని గాంచిన పిదప ఆత్మలో విమర్శ గావించుకొనుటకు, ఆ సందర్భము నందలి ఆతని మనోగత భావములను కవి హృద్యముగా నొక సీసపద్యము చివరి ఆట వెలది యందును ఒక శార్దూలమునను వివరించి యున్నాడు. సానుక్రోశం, పునర్విచింత్య, సామర్షం అను సూచన లిందు విడువబడినవి.

4. ఈతడు నాటకము నందలి స్వగతము, నేపథ్యము, మున్నగు నంశములను గూడ విడువక అనుసరించి వానికి నటు తరువాతి కథతో సమన్వయ మొనరించుచు సంధి వచనములను ఘటించును.

1. కథం మమాపి దశ (ఇత్యర్థోక్తే స్వగతమ్) కథం సంవరణీయం వివరితు ముపక్రాంతోస్మి (I పుట 51)

కం. నను దశయని వెలిగ్రక్కుచు
మనమున దలపోసి మిగుల మఱగిడదగు సీ
తని పేరటు వచియింపగ
మొనసితి నగుగాక యిదియె మొదల నిలిపెదన్ 1-215

II. (నేపథ్యే) — భర్తృదారికే ఇత ఇతః (II పుట 96)

క. అను నత్తఱి దెర మఱుగున
వినవచ్చె మనోజ్ఞ వినద వీచి యొకటి యో
జననాథ తనయ యిట యిట
చనుదెమ్మను వచన రచన చతురత వెలయన్. 2-59

నాటకమున నేపథ్యము స్వగతము అను అంశములు రంగస్థలమున నటునకు నిర్దిష్టములైనవి. చిన తిమ్మయ వానిని కావ్యమున కూడ విడిచి యుండలేదు.

5. ఈ ప్రబంధమున మూల వచనము అధిక భాగము పద్యరూపమున సంతరింప బడినది. దాదాపు అందు పద్య గద్యాత్మకముగ సాగిన సంభాషణ మంతయు నిందు పద్యరూపమున వెలసినదని చెప్పవచ్చును. ఈ వచనము ననుకరించు పట్ల కవి చక్కని ప్రబంధ శైలిని ప్రకటించెను. వచనము సీత

డనువదించిన తీరు కవి భావానుసరణ పద్ధతిని గూర్చి చర్చించునపుడు వివరింపబడును.

**అమూలక కల్పనలు :**

ప్రసన్న రాఘవ నాటకమును అనుసరణ కర్త యథాక్రమముగ గ్రహించుటతోపాటు అందు కొన్ని అమూలక కల్పనములను కూడ చేర్చెను. ఇవన్నియును కవి యొక్క వర్ణనాభినివేశమును చాటునట్టివి. ఇట్టి భాగములు ముఖ్యముగా ప్రథమ ద్వితీయ సప్తమాంకము లందు గోచరించుచున్నవి.

1. ప్రస్తావనలో గల కృతిపతి వంశావతార వర్ణనము. ఇది ప్రబంధోచితముగా మొత్తము డెబ్బదినాల్గు గద్య పద్యములలో వివరింపబడినది.

2. ప్రథమాంకమున కొన్ని కంద పద్యములను కవి అమూలకముగా రచించెను.

రావణుడు సీతా సౌందర్యము నాలోకించి

క "కనుకాంతి మెఱుగు తెఱగై
కనుచూపుల పసలు నల్లగలువల చెలులై
తనరిన యాకృతి సామ్యపు
మొనకట్టున మతి కృపాణి మొగ తిరిగెగదా 1-229

అనిన పద్యమును,

సీత రావణుని పాలబడునేమో యని విచారించుచు నూపురకుడు పల్కిన

క. ఎక్కడి జానకి రావణు
డెక్కడ విధికృతము ద్రోయ నెవ్వరి తరమౌ
నెక్కడ జూడగ నోపుదు
మక్కట యీ బారి దైవ మూ కడుచు నాకో ! 1-274

అను పద్యమును అమూలకములు.

3. ద్వితీయాంకమున సీతా సౌందర్యము వర్ణింపబడిన సందర్భమునందు గల పద్యములు [64-74] మూలము నందు లేవు.[20] ఇదే అంకమున

రాముని గాంచిన సీతయందుదయించిన సాత్త్విక భావములు (156) సీత అన్యాపదేశముగ తుమ్మెదను నిర్దేశించి తనపై ప్రేమను స్థిరముగ నిల్పుమని రామునికి చెప్పుటయు (153) సీతా సౌందర్యమును వర్ణించు పద్యమును(124) అమూలకములు. ఈ క్రింది పద్యము కవి యొక్క శబ్దాలంకార ప్రావీణ్యమును చాటుచున్నది.

సీ. లవలీ వినూత్న పల్లవ లీల నవలీల
గిమాడు చెక్కుల కిలకిలలకు
మరలేని పసిడి తామర పువ్వు మఱపించు
కలికి మద్దు మొగంబు కళకళలకు
కువలయ వలయ లక్ష్ముల నధిక్షేపించు
మించు వాల్గన్నుల మిల మిలలకు
శంపాలతల మీద జంపన ... యారి
తావి క్రొన్నన మేని ధళ ధళలకు

గీ. లలిత మదన మదంబులౌ లలితములకు
ప్రహరణంబులు మరునకౌ విహరణముల
కెల్లయగు దీని జవ్వనం బిరవు కొలిపె
బదను గల ప్రేమ మామక హృదయసీమ 2-132

ఈ పద్యము అమూలకమని డా. రామరాజు గారు చెప్పిరి. (పుట-12). కాని దీనికి మూలము ద్వితీయాంకము నందలి "అమలమ్మృణాల కాండ కమనీయ కపోలరుచేః" అను శ్లోకమున గనవచ్చును - [శ్లో 20] కాని శ్లోకము నందలి భావమిందు విస్తరింపబడినది.

4. పంచమాంకమున సీతారామలక్ష్మణులు అడవి కేగుచు మార్గమున సమసైకత పదములను, శాద్వల స్థలంబులను గాంచునప్పటి 'చెంచుపల్లి' ప్రస్తావము అమూలకము. (5-65) ఇదే అంకమున సీతారామలక్ష్మణులు గోదావరీ తటమును చేరిరని చెప్పునప్పటి గోదావరీ నదీ వర్ణనము (5- కూడ అమూలకమే.

5. షష్ఠాంకమున రావణుడు సీతపై రోషముతో కత్తి నెత్తునప్పటి

క. "ఈ లీల బలుక నేలా
కాలక్షేపంబు దీని గళ నాళగళ
త్కీలాలము నర్పించెద
హాళిం గాళికి నటించునని యంచుగనన్ 6-84

అను పద్యమునకు మూలములేదు.

6. సప్తమాంకమున అయోధ్యకు తిరిగి వచ్చునప్పుడు, సుగ్రీవ వైశ్రవణులకు సౌమిత్రి అయోధ్యా నగరమును వర్ణించి చెప్పుట (221, 242) కూడ కవి కల్పితమే.

భావానుసరణము :

బొడ్డుచెర్ల కవి మూలభావముల ననుసరించుటలో పెక్కుచోట్ల స్వాతంత్ర్యము ప్రకటించెను. ఈతడి స్వాతంత్ర్యమును మూలమును విస్తరించుట యందధికముగా ప్రదర్శించెను. ఈ విస్తరణ విధానము పెక్కు భంగుల సాగినది.

1. విస్తరణ :

1. అనుసరణ కర్త ఒకప్పుడు మూలము నందలి చిన్న చిన్న వాక్యార్థములకు సమగ్రత్వమును కల్పించును. ఇట్టి పట్లు ప్రథమాంకమునం దధికముగా కనవచ్చును. ఇవన్నియును సాధారణముగా కందములలో వివరింపబడినవి.

నట : అహో ! అస్య కవేః సూక్తీనాం సరలతా కోమలతాచ.

సూత్ర : క్వచి ద్వక్రతా కఠిన తా చ (1; పుటలు 28-29)

క. అన విని నటుడీ కవి వా
క్కున దోచున్ సరసతయును గోమలతయు జం
గ్రమని లేత కొదమ నమృతము
దనువును దెలికించు క్రియ మిథఃస్థితి ననుడున్ 1-136

క. రమణి తన నును చసుంగవ
గొమరారెడు బొమలగతిని కుటిలత్వంబుల్

సేమఁకూడియు దగు గతి జే
యు మనః ప్రియ మతని సూక్తిఁ బ్రసంగించెన్ 1-187

నాటకము నందలి రెండు వచనములును రెండు పద్యములుగా సంతరింప బడినవి. మూలము నందు జయదేవుని కవిత్వ ప్రశంసను గావించుచు నటుడును సూత్రధారుడును ఆతని కవిత్వము సరసత్వము, కోమలత్వము, కఠినత, వక్రత మున్నగు గుణములతో కూడి యుండునని చెప్పియున్నారు. తెనుగు కవి ఆ గుణములను అలంకారయుక్తముగ వివరించి యున్నాడు.

నూపురక : వయస్య ! కస్యాయం మహీతల చంద్రాహూ రథ క్రకర కర్కశః

కంఠ ధ్వని : శ్రూయతే । [1, పుట 51]

క. అచ్చెరుపడి నూపురకుడు
నెచ్చెలి గుండాల కొండ నెట్రవుద్రోవన్
వచ్చు వెనుబండి మ్రోతకు
నెచ్చగు నీ కంఠరావ మెవ్వని యదియో 1-212

మూలము నందు 'భూతలము నందు తిరుగు రాహు రథ చక్ర ధ్వనివలె కఠోర ముగ నున్న కంఠధ్వని' అను భావమును కవి అన్య విధంబున వివరించి యున్నాడు. రాహు రథ మను మాట యిందు విడువబడినది.

నూపురక : ... కిమి తీయంతి మస్తకాన్యుహ్యంతే కిమితి నైకం రక్షిత్వా పున రపరాణి యత్ర కుత్రచిన్న నిక్షిప్యంతే ... [1, పుట 65]

క. విను మొకటి చాలదే తల
పనిమాలినవాడ ! నీకు పదియేటికి వ
ల్లని మోపు చేటు భువి బూ
డ్చిన మేలొక్కటియె తక్క చిక్కినవెల్లన్ 1-264

మూలమున రావణునితో వంది సాక్షేపముగా పల్కిన పలుకులివి. పది తలలు బరువు మోయుటకన్న, కావలసిన దొకటి యుంచుకొని తక్కిన వానిని బూడ్చి వేయుమని అతడు రావణునితో చెప్పును. ఆ భావమును కవి తెలుగు మాటలతో విప్పి చెప్పెను. పనిమాలినవాడు వల్లని మోపు చేయు అను వానినిచేర్చి కవి భావమును విస్తరించెను.

రావణ : తదేష వైతాలిక ఇత్యుపేక్ష్యః [1, పుట 66]

క. తిట్టిన దీవించిన రా
కొట్టిన జలపట్టినను దగుందగదనినన్
భట్టు బహుమానయోగ్యుడు
గట్టిగ నని వంది నిన్ను గాచితి జుమ్మీ 2-266

మూలమున వైతాళికుడ వగుటచే నుపేక్షింప దగిన వాడవని రావణుడు వందితో పలికిన పలుకులను కవి వివరించి చెప్పెను.

ఉ. సోయమశక్తి ప్రకార : [1, పుట 72]

క. బలి తనయుడనియె నౌరా
విలుద్రిప్పగ బ్రాలుమాలి వెనుకటి సుద్దుల్
దలపోసెదు పదపుడిగిన
వెలయాల్గతి నావు డలుక వెలి కురుకంగన్ 1-261

మూలము నందున్న అశక్త ప్రకారమును కవి తెలుగు నుడికారముతో వివరించి చెప్పెను.

2. కొన్నిపట్ల మూలమునందు సంగ్రహముగను సరళముగను సంభాషణ రూపమున నున్న వచన భావమును గ్రహించి అనుసరణ కర్త సరసముగ పద్య రూపమున విస్తరించును.

అ. తాపస : ననుకీటవ న్మహీపర్యటనేన శ్రాంతో భవాన్. తత్రమిధిలాయాం పంచరాత్ర నివాసేన శ్రమోపనేతవ్యః ప్రసంగాదయంచ రాజా జనకో ద్రష్టవ్యః

బిక్షు : కిమస్మాకం నిరీహాణాం రాజ దర్శనేన ? [11 పుట 87]

సీ. బిక్షుకవర్య యీ పృథివీ తలము నెల్ల
ద్రిమ్మరె దేటికి డెగిన గాలి
పడగ చందంబున బడలితి రెంతైన
నీ మిథిలాపురి నేను రాత్రు
లధివసింపుడు మేని యందలి ఖేదంబు
నపనయింపుడు ప్రసంగార్హ సరణి

జనక వసుంధరా చక్రేశు బొడగను
డుచిత ప్రసంగోక్తు లుగ్గడింపు

గీ. మనుడు యతిపల్కు దాపసు నహహామాకు
నిస్పృహాత్ముల కేటికి నృపుల గోష్ఠి
యడుసు చొర నేమిటికి కాళ్ళు గడుగనేటి
కేను వెళ్ళినే రాజుల యిరుకు సొరగ 2-5

ఇచట భిక్షుకవర్యుడు తెగిన గాలిపడగ చందంబున ద్రిమ్మరుట అతడు 'అడుసు చొర నేమిటికి కాళ్లు కడుగ నేటికి' అని వచించుట, మూలమున లేక పోయినను చేర్చినట్టివి. ఇవి తెలుగు జాతీయములై యుండుట ఆ సందర్భమున కెంతేని సహజత్వమును గూర్చుచున్నవి. ఇట్టిదే ఇంకొక ఉదాహరణము.

ఆ. కుబ్జక : (విహస్య) కథం వితస్తి మాత్రేణ తవాంగేన ద్వార శిఖరం ఖంఙ్యతే ? (పునః సక్రోధమ్) అరే అలీక వాచాల। కేన తవ కథిత మహం కుబ్జక ఇతి ?

వామనక : నన్వనేనైవ దృప్త వృషభకకుర సదృశేన పృష్ఠ స్థితేన మాంస స్తబకేనోద్వాహితేన (111-138)

సీ. అనుడు కుబ్జుడు వల్కు హాసార్ద్ర వదనుడై
కటకటా చిట్టెడు గాని లేదు
నీదు శరీరంబు నింగి మోచిన ద్వార
శిఖరంబు నిది యెట్లు శిథిల పరప
గలదు దబ్బరలాడగా నేల యేనుకు
బ్జుండని నీకు నెవ్వండు దెలిపె
రూప ధన్యుల జూచి రూపహీనులు నింద
గావింతురనుట నీ కడన గలిగె

గీ. ననుడు వామనకుడు వల్కు నహహ యొరులు
దెలుపగానేల నీకల దేహరేఖ
వృషభకకుదంబునుం బోలి వీపునందు
గుంతవోయిన యీ పెద్ద కంతి వ్రేల 2-7

వితస్తియన ద్వాదశాంగుల ప్రమాణము.

'వితస్తి మాత్రేణ' అను పదమునకు 'చిట్టెడు కాని లేదు' అను అనువాదము రమ్యముగా నున్నది. 'అలీకవాచాల' అనునది 'దబ్బరలాడుట'గా మారినది. 'ద్వార శిఖరము నింగిని తాకుట. రూపధన్యుల జూచి రూపహీనులు నింద గావింతురనుట' కవి కల్పించిన భాగములు. మూలము నందున్న పృష్ఠస్థితేన మాంస స్తబకేనోద్వాహితేన' అను వాక్యమునకు 'వీపునందు గుంతవోయిన యీ పెద్ద కంతి ప్రేలన్' అను అనువాదము సహజ రమణీయముగ నున్నది.

3. తెలుగుకవి మూలము నందు సంగ్రహముగ నున్న భావమును వర్ణనాత్మకముగ విస్తరించిన పట్లు ప్రబంధమున పెక్కు కానగును. ఈ విస్తరణము మూలమునకు మెఱుగులు దిద్దుచున్నది. ఇట్టి భాగములు ద్వితీయాంకము నందధికముగా కననగును.

అ. సీతా — హలా ! కోయం కనక వర్ణః శిఖండి పిచ్ఛ మండిత కర్ణ పూరో ముగ్ధత్వ విముక్త లోచన వికారః కుమారో దృశ్యతే ? ఇమం పశ్యంత్యా మమ నిజ వత్స ఇవ వాత్సల్య ప్రక్షాలితం హృదయం వర్తతే

(11, పుట 209)

ఉ. కాకర పండువంటి కనకంబును బోలెడు వాడు ముద్దు పెం
గూకటి వాడు సోగ నిడుగోపుల చూపుల వాడు, పింఛపుం
జీకటి ప్రాని క్రొంజివురు చెర్వీన వీనుల వాడు, కంతు పే
రాకలి మాన్పు వాడు చెలువా చెలు వొందెడు వాని జూచితే 2-110

క. ఈ చిన్ని యొప్పులానిన్
జూచిన యప్పటను గొలె కిశోర స్తని ! యీ
నా చిత్తము వత్సలతా
వీచి ప్రక్షాళనమున వేచెలువందెన్ 2-111

ఈ అనువాదము నందు రమ్యమైన భావుకత్వము వెల్లివిరియుచున్నది. మూలము నందలి 'కనక వర్ణము' 'కాకరపండు వంటి' అను విశేషణముతో వివరింప బడినది. 'నెమలికన్నుల నందముగా చెవుల యందిడుకొని ముగ్ధతా విహీనములైన చూపుల వికారము గల' అను భావమును కవి విస్తరించి ముద్దు పెంగూకటి వాడు, సోగ నిడుగోపుల చూపుల వాడు, అని చెప్పుటయేకాక నెమలి పింఛము అను చీకటి ప్రాని యొక్క క్రొంజివురును వీనుల యందు

ధరించెనని రూపకము కూడ ఘటించెను. కంతుపేరాకలి మాన్పు వాడనుట కూడ అమూలకము. 'ఇమం పశ్యంత్యా మమ' అను దానికి 'ఈ చిన్ని యెప్పు లానిం జూచిన' అనుట ఆతని తరుణత్వమును సూచించుచున్నది. ఇట్టి సందర్భమున 'కిశోర స్తని' అనునది చె   సంబోధనము. ఇట పాఠము సందిగ్ధముగా నున్నట్లు సూచింపబడినది.

ఆ.   రామః కథ మిప మితశ్చండి కాయతనమ్

కరుణ తరంగ తరంగిణి వికసన్నయనామృతోర్మి శీకరిణి
తరుణ తుహిన కర చూడామణి రమణి ! త్వాం నమస్యామి   2-6

సీ. ఆతోద్యసినద హృద్యాంబోధర ధ్వాన
      కృత మనోహర లాస్యకేళి కేకి
   గగన గంగా నూత్న కనకారవింద శం
      కాకారి కాంచన కలశ కులము
   కంఠ వేణీ బద్ధ కంఠీరవ ధ్వజాం
      చల చాలన చలిత జలద దలము
   సేవాసమాయాత సిద్ధ సీమంతినీ
      మహిత మాణిక్య విమాన చయము

గీ. పార్శ్వ వేష్టిత నవకదంబక కదంబ
   కుసుమ సౌరభపోషితభసలకలభ
   మల్లయదె కంటివే పర్వతాధిరాజ
   తనయ వసియించు దివ్య సౌధము కుమార

వ. అని తదభిముఖుండై నిండు మనంబున నచ్చండికాదేవిం దలంచి

శా. తల్లీ తెల్లని వేల్పురాణి ! దివిషత్త్రాటంకినీ దత్తమ
   త్తల్లీ చంద్రకళా వతంసము దయాధారా పరిష్కారదృ
   క్కల్లోలంబును హల్లకాభమగు నీ కల్యాణ రూపంబునే
   హృల్లేఖోపనిషద్రహస్యముగ నా హృద్వీథి భావించెదన్.

గీ. సింధు కోటీర దేహార్ధ సింహ పీఠి
   నిండు కొలువుండు నీకు నెవ్వండు మ్రొక్క

వాని కవనిజయగు లక్ష్మి వచ్చు పొదవు
సంతతానంద సామ్రాజ్య జనక మగుచు 2-50, 53

మూలము నందలి ఒక వచనము, శ్లోకము తెనుగున ఒక సీసము, వచనము, శార్దూలము, గీతముగా నవతరించినవి మొదటి వచనమునకు సీసమును, శ్లోకమునకు తక్కిన రెండు పద్యములును విస్తరణములు. చివరి గీతము నందలి 'అవనిజయగు లక్ష్మి' అను పదములు భావి సీతాకల్యాణమును ధ్వనింపజేయుచున్నవి.

4. కొన్ని సందర్భములందు విస్తరణము శుద్ధములగు తెలుగు పదములతో సాగుచుండును.

అ. అథావిరాసీత్ కురువిందలోచనో
ద్రుమాంతరే విద్రుమ శృంగ శోభితః
విభక్త ముక్తామయ చిత్రమండనో
మనోపహారీ హరిణో హిరణ్మయః 5-36

ఉ. కిమ్ముల బూతపూ వలుకు కెంపుల కన్నులు మిన్నచుక్కతు
దమ్ముల నీను ముత్తెపు బొడల్ విడిగప్పులు గుప్పునీలవా
లమ్మును నిమ్మపంటి పసలం గసరెత్తు పసిండిమేనియం
దమ్మును గల్గు నొక్క మృగతల్లజ మల్లన దోచె ముందరన్ 5-110

ఇందు కవి స్వతంత్రత మిక్కుటముగా గోచరించుచున్నది. మూలమును కవి యిచట పదమునకు పదముగా గాక, అందలి భావమును మాత్రము ఆధారముగ గొని కమ్మని తెలుగు పదములతో తీర్చిదిద్దెను. ఇందు పసిడి మృగముయొక్క వన్నె చిన్నెలు రమణీయమగు శబ్దజాలముతో వివరింపబడినవి. ఇందు బూత పూవలుకు అను ప్రయోగము నర్థము స్పష్టపడుట లేదు.

అ. హిమాంశు శ్చండాంశు ర్భవ జలధరో దావ దహనః
సరిద్వీచీవాతః కుపిత ఫణినిఃశ్వాసపవనః
నవామల్లీ భల్లీ, కువలయవనం కుంత గహనం
మమ త్వద్విశ్లేషాత్సుముఖి ! విపరీతం జగదిదమ్ 6-48

సీ. తిలకించు మంచు మించుల వేల్పు మొగి మింట
జను ( ? ) రోపు జగ వెలుంగు

మీటి నల్లగు పాట పాటు చిన్కుల క్రొత్త
మొగులు కారడవిలో దగులు చిచ్చు
పరతెంచు మడుగు లే దెర తెమ్మెరలు పాప
బుస కొట్టు బెట్టున నెసగు గాడ్పు
జివ్వాడ ముయ్యాడు బువ్వు మోచిన సేవ
తీవ నచ్చున గచ్చుదేరు చూరి

గీ. యెప్పుడటు విప్పువచరించు గప్పు గలువ
తుప్పుడించిన రెప్పల కుప్పికోల
వాలుగన్నుల మగమీల మేలుగొన్న
యన్నుదలమిన్న నినుబాసి యున్నతనకు 6-119

ఇందు మూలభావము పెక్కు తెలుగు పదములతో విస్తరింపబడినది. ఇందు 'చండాశుః' అను అర్థమును స్ఫురింప జేయుచున్న పదములతో 'రోపు' అను పదము నందలి కొన్ని అక్షరములు లోపించినవి. సూర్యుడను నర్థము వచ్చునట్లు అచట పదములను పూరింప వలయును. 'నవజలధరః' అను పదమునకు 'క్రొత్త మొగులు' అను అనువాదము చాలును. కాని కవి దానిని 'మీటి నల్లగు పాటపాట చిన్కుల క్రొత్త మొగులు' అనియు, 'దావదహనము'ను కూడ 'కారడవిలో దగులు చిచ్చు' అనియు విస్తరించెను. 'కుపితఫణి' అను దానిని భంగ్యంతరముగా బుసకొట్టు బెట్టున' అని అనువదించెను. నవామల్లీ భల్లీ' అను దానినిగూడ చివ్వాడు ముయ్యాడుబువ్వు మోచిన సేవ, తీవ నచ్చున గచ్చుదేరు చూరి' అని వ్రాసెను. 'కువలయ వనం కుంతగహనం' అను పదములను ఎప్పుడటు విప్పు వచరించు గప్పు గలువ తప్పుడించిన రెప్పల కుప్పీ కోల' అని విస్తరించెను. సుముఖి అను పదము "వాలు గన్నుల మగమీల మేలుకొన్న అన్నుదలమిన్న" యైనది. "విపరీతం జగదిదమ్" అనునది వాచ్యముగా చెప్పబడలేదు

౫. ఒకప్పుడు కవి మూలమును సమగ్రముగ ననుసరించుచునే కొంత స్వతంత్రతను చూపి ఆ భావమును అమూలకములగు కొన్ని విశేషాంశముల తోడను విశేషణములతోడను విస్తరించును. ఇట్టివి ఆయా సందర్భములకు స్ఫూర్తిని కలిగించును.

అ. తృతీయాంకమున జనకుడు విశ్వామిత్రునకు హర చాప నిరస్త భుజావలేపులై యున్న రాజమండలిని చూపు సందర్భము నందలి శ్లోకము (3-40) ను అనువదించుచు ఆంధ్ర కవి అందు మూలమున లేని మగధ పాంచాలాంధ్ర చోళాది దేశ నరేశులను పేర్కొనెను. (3-143). దీనివలన ప్రయోజనము లేకున్నను, కవి ఆంధ్రదేశమును తన కావ్యము నందెచటనైన పేర్కొన వలెనను నుత్కంఠతో ఆ దేశముతో పాటు తక్కిన వానిని గూడ చేర్చి యుండును. కాని యిది ఆంధ్రదేశ నృపతుల కెట్టి గౌరవమును గలిగించుట లేదు.

ఆ. పంచమాంకమున గంగాదులకు హంస జనస్థానము నందు రాక్షసులు రాము నెదిరించిరని చెప్పు సందర్భమున "వాహరథనాగ భటోత్కటులై యెదిర్చి రమ్మానవనాథు వలమాన కృపాణరచల్ భ్రమింపగన్" (5-99) అనుటయు, అదే అంకమున రావణుని బారిపడిన సీత దీనాలాపములను జేయుచు "రాలుగరగై పరపన్ మొరపెట్టుట"యు (5-135) అమూలకములు.

ఇ. షష్ఠాంకమున రాముడు సీత తోడను తమ్మునితోడను గోదావరీ తటీవిపినముల గడపిన మధుర దినములను స్మృతికి దెచ్చుకొను సందర్భమున సీత 'రామచిలుక మాడ్కిం బల్కరు పిల్వగన్' (6-34) అను ఉపమానమును, ఇదే అంకమున లంకావాసులకు హనుమంతు డేతెంచినాడనియు ఆతని నెదుర్కొన అక్షయ కుమారుడేగినాడనియు చెప్పునప్పటి "దోర్మండలాగ్ర చండరుచి కాండ హిండితాఖండ దిగధిపాలఖేల త్ప్రితాపవాతూల సఖుడు రణకళా దక్షు డయ్యక్ష రాక్షసుండు"(6-67) అను అక్షయకుమార పరాక్రమ ప్రశంసయు నమూలకములు.

ఈ పంచమాంకమున గంగా గోదావరీ సరయూ నదుల సంభాషణమున గంగానదిని అమరనిది, మిన్నేరు, జహ్నుపట్టి, మరున్నది, బుభువాహిని మందాకిని, సురనది, భాగీరథి, అనిమిషనది అని వివిధ విశేషణములతో వివరించుట కూడ ఈతని భాషాప్రయోగ వైవిధ్యమును తెలుపుచున్నది.

ii మార్పులు :

బొడ్డుచెర్ల కవి తాను రచించు పద్యమున కనుకూలమగువట్లు మూల భావములను కొన్నిపట్ల మార్చి యున్నాడు. ఇట్టి మార్పులు ఈతడు స్వాతం

త్ర్యము చూపినపట్ల నన్నింట గోచరించుచున్నను, ఉదాహరణ కొండు రెండొ సగబడుచున్నవి.

1. కథ మారంభరమణీయ ఏవ ఏషాం సంరంభః పుట 49

"మొదలనే తీపు తుద జప్పనగు" 1-208

కవి మూలము నందలి 'ఆరంభ రమణీయ' మను భావమును తెలుగు పదములతో జెప్పి యున్నాడు.

2. సీతాభిలాషశీతలే లంకేశ్వరచేతసి నారూఢ ఏవకోప పరితాపః

ii అంక. 63 పుట

కం. సీతానన చంద్రాతప
శీతలమగు పంక్తిముఖుని చిత్తము నందు
ద్యోతింప దయ్యె నూష్మల
తాతత విభవంబు నీట నగ్నియ పోలెన్ 2-35

సీతాభిలాషచే శీతలమైన లంకేశ్వరుని చిత్తమున కోప ముదయింప లేద నెడు మూల భావమును మార్చి కవి అలంకారికముగ సీతాననము అనెడు చంద్రాతపముచే శీతలత్వము పొందిన అని వ్రాసెను. చివరనున్న ఉపమానము అమూలకము.

3. అప్యుచ్ఛందైః స్తపన కిరణైః స్తాపితాయాం పృథివ్యా
మప్యన్యేషాం కఠిన వపుషాం దుర్గమే మార్గ సీమ్ని
ప్రేమార్ద్రేణ ప్రగుణిత ధృతి శ్చేతసా శీతశీతాన్
మేనే సీతా ప్రియతమ పదైః రంకితాన్ భూమి భాగాన్ 5-27

గీ. చండ చండాతప స్ఫూర్తి మండ నట్టి
ధరణి గరకులు బోలె నీ తెరువు సీత
శీతలంబుగ బ్రేమార్ద్ర చిత్తయగుచు
దలచె ప్రాణేశు నడుగుల కలిమిజేసి 5-77

ఇందు మూలభావ మొకింత సంగ్రహింపబడి కొంత మార్పు చెందినది. మూలమునందలి "ప్రచండ సూర్య కిరణములచే ధరణి తపించు చుండగా

కఠిన దేహులకు సైతము దుర్గమమైన మార్గసీమ యందు సీత రాముని అడుగు జాడలచే చిహ్నితములైన భూభాగములను శీతలముగా భావించెను" అను భావ మును కవి తెనుగున ద్వితీయ పాదమును పరిహరించి తపించెడు పృథివికే 'కరకులు' బోలె అను నుపమానము చేర్చి అనువదించెను.

4. 'సూచీ శలాకా విద్ధాని మమ నఖాన్యల క్తకరసేన సించతి'
(5, పుట 297)

తూలెడు తన మెయి శీత సుధాలవనవ దృష్టిచేత దడిపెడు వారల్"
5—150

ఇందు కవి మూల భావమును గ్రహింపనే లేదు, ఆ సందర్భమునకు తగినట్లు ఆ భావము నింకొక విధముగా వ్యక్తము చేసెను.

5. అమె । కథ మశోకోపి మమాయం శోకతాం గతః 6-36

ఈ అశోకమును నాపాలింటి కాద్యక్షరంబునకుం బాసెనయో 6-99

మూలమునకు కవి చమత్కార వంతముగ గావించిన మార్పిది. అశో కము గూడ శోకమయ్యెను గదా యను భావమును కవి 'అశోకము ఆద్యక్షరం బునకుం బాసెనయో' యని మార్చి అర్థస్ఫూర్తిని సాధించెను.

6. "పుణ్యవతా మగ్ని రేవ రత్నం భవతీతి ప్రవాదః సత్యఏవ సంవృత్తః"
పు. 342

క. మతి దలపగ నతి భాగ్యో
న్నతులగు వారెద్ది వట్టినన్ కనకం బౌ
గత లేల యిప్పు డనలం
బతివా ! నీవంట రత్నమయ్యెనా కాదో 6-105

పుణ్యవంతుల కగ్నియే రత్నమగు నను మూలభావమును తెలుగు కవి విపులీకరించెను. పట్టిన దెల్ల బంగారమగునను సామెత కూడ రమ్యముగ చేర్ప బడినది.

ఈ అనువాదమున మూలము నందలి కొన్ని భాగములు అనూదితములు కాలేదు. కవి చూచిన ప్రతులందివి యుండి యుండక పోవచ్చును. ఇట్టి భాగ ములు నాటకోత్తరార్ధము నందు మాత్రము కనవచ్చును.

1. పంచమాంకమున సరయూ గంగాదులు, భరతుడు, సీతారామ లక్ష్మణుల వనవాస ప్రయాణము నెఱింగి దుఃఖితుడై నంది గ్రామమున రాజ్య భోగ విముఖుడై వసించుచు రాజ్యము పాలించుచుండెనని తెలుపు శ్లోకము (5-19) ఇందు లేదు.

2. రావణుని రాకకు అశోకవనము కంపించు చున్నదనుచు "కథం పునః సహ మహీధరేణ వేపత ఇవా శోకవనమ్" అను సీతావాక్యములు కావ్యము నందు లేవు. (6 పుట 326)

3. సప్తమాంకమున పాఠ భేదముతో పునరుక్తముగా నున్నదియు ప్రహస్తుడు రావణునితో చెప్పినదియునగు

'మా భవ నాకపతేః పరిభవ మాత్రేణ గర్వ నిర్వ్యాధః
వసుధా మిమాం గిరి సంకట మయీం దశరధస్య నందనః ప్రాప్తః'
7-19

రాజా ! ఇంద్రుని పరాభవించితిని గదాయని గర్వ సంపన్నుడవు కాకుము. ఏలన దశరథ పుత్రుడైన రాముడు చిత్రకూట పర్వతముచే దుర్గమ మైన యీ లంకను పొందినాడు. అను శ్లోక మనువదింపబడలేదు.

4. సప్తమాంకమున విద్యాధర మిథునము పలికిన పలుకులు :

విద్యాధర : స ఏష రామ సమర కౌతుకీ దశకంఠః

విద్యాధరీ : కః పునరేషః అంజన పుంజచ్ఛవి శరీరః కపివీర స్తస్యన్య సమ్ముఖం పరావర్తతే.

విద్యాధర : ప్రియే స ఏష విచిత్ర సమర శీలోనీలః 7 పుట 384

ఈ పలుకులు అనువాదమున 7-81 వ పద్యము తరువాత రావలసి యుండెను. కాని ఇవి గ్రహింప బడలేదు. ఇదే అంకమున 216 వ పద్యము తరువాత నుండవలసిన సీతాదేవి వాక్కులు - సీతా - (విహస్య, విలోక్యచ) కథమయ మున్మీలిత ఏవ. పూర్వగిరి పద్మరాగః ప్రకటీకృత నయశీతల స్వభావః కుంకుమ కృతాంగ రాగో నలినీవన వల్లభోదేవః (7 పుట 440) (తూర్పుకొండకు కెంపు వంటివాడును, అప్పుడే ఉదయించుటచే నేత్రములకు చల్లదనము నిచ్చు స్వభావము గలవాడును, కుంకుమముచే నంగరాగము చేసి

కొన్నవాడు వలె రక్తవర్ణుడును అగు పద్మినీ వల్లభుడైన సూర్యదేవు డావిర్భ వించినాడు.) కూడ గ్రహింపబడలేదు. ఇదే అంకమున 13వ శ్లోకము తరువాత నుండవలసిన ముని వచనములు "నిజ చిత్తవృత్తి భూమికాను సారిణీ వాక్ప్రత్రాణీ లోకస్య" అనునవి విడువబడినవి.

కావ్యము నందు మూల భాగములు కొన్ని తారుమారు కావింపబడినవి.

1. మూలము నందు రాముడు సీతా సౌందర్యమును వర్ణించెడు ఘట్టమునందు గల శ్లోకములు (ii - 26 27 28) అనుసరణమున క్రమము తప్పినవి. ఈ క్రమమే సరియైనదని డా. రామరాజుగారి అభిప్రాయము.

2. తృతీయాంకమున రాముడు శివధనుస్సును విఱిచెనని చెప్పు (148, 149) పద్యములు మూలమున విశ్వామిత్రునిచే చెప్పబడినవి. ఆంధ్రమున కంచుకి నోట చెప్పబడినవి.

3. సప్తమాంకమునందు చంద్రోదయవర్ణనసందర్భమున రాముడు చెప్పిన "శంకరార్ధదేహ సన్నద్ధశాంకరీ" అను పద్యము (7-155) మూలమున విభీషణోక్తముగా (7-56) ప్రాచీన ప్రతులందు కానవచ్చుచున్నది.

అనువాద కౌశలము :

ప్రసన్న రాఘవ నాటక కర్తయైన జయదేవుని కవిత్వము ప్రశంస నీయము. ఆత డొలికించు కవితా పీయూష వర్షమునకు వారధి నిర్మించుట దుస్సాధ్యమగు కార్యము. కాని అట్టి పనికి పూనుకొనిన వాడు బొడ్డుచెర్ల కవి. ఈతడు మూల భావ రామణీయకము నెచటను పొల్లు పోనీయని అనువాద సామర్థ్యమును ప్రకటించెను. మూలమున బంధకవిత్వము, శ్లేష సమాసోక్త్యా ద్యర్థాలంకారములు ఉన్న పద్యముల నత డతినిపుణముగ తెనుగులో తీర్చి దిద్దెను. శైలీ సంవిధానము కూడ మూలమునకు దీసిపోకుండ మిక్కిలి శ్రమించెను. ఈ అనుసరణమునం దీకవి కృతార్థత నెఱింగించుట కిచట రెండు మూడు ఉదాహరణము లీయబడుచున్నవి.

జయదేవుని నాటకమున శ్లేష చమత్కారముతో గూడి యున్న శ్లోకములు పెక్కులున్నవి. అనుసరణ కర్త ఆశ్లేష కెచటను భంగము కలుగనీయ లేదు.

1. ఇయం లీలా లోలాంగద భుజలతా నీల చికురా
సమున్మీలత్తారా కుముద హసితా చారునయనా
ప్లవంగానాం సేనా యువతి రివ తారాపతి ముఖీ
మహాగ్రే కందర్పం ప్రకటయితు మద్య ప్రభవతి 7-16

ఈ శ్లోకమునందు కపిసేనకును, యువతికిని అభంగ శ్లేష కల్పింపబడినది. నీల కచ కుముద హసిత విలోలాంగద బాహువు, చారులోచన, తారోన్మీలత్తార, తారాధిప ముఖియను విశేషణములు కపిసేనకును యువతికిని సమముగా అన్వయించుచున్నవి. దీని ననువదించుచు కవి

గీ. లాలితాంగద భుజలత, నీలచికుర,
చారునయన, సముజ్జ్వలత్తార, కుముద
హాస, తారేశ వదన, వనాట సేన
యబల నాగ్రమోల మారు మాటాడగలదె

అను పద్యమున మూల శ్లోకమందలి శ్లేషను యథాతథముగ ప్రకటించి యున్నాడు. సంస్కృతము నందలి కందర్ప (కం + దర్పం) అను పదమును 'మారు మాటాడ గలదె' అని అనువదించుట మూలార్థమును యథాతథముగ నందించకున్నను ఔచిత్యవంతమై ఒప్పుచున్నది. (కందర్పం ప్రకటయతి అనగా కీదృశమైన అవలేపమును ప్రకటింప గలదని సేనా పక్షమునను, కామచేష్టను మాత్రమే ప్రకటింప గలదని యువతి పక్షమునను అర్థము).

2. యావన్నీరనిధేః ప్రభాత సమయః ప్రోద్ధృత్య లోకత్రయీ
మాణిక్యం రవి బింబ మంబర వణిగ్వీథీ పథే న్యస్యతి ।
తావత్కర్తు మివాస్య మూల్య ముచితం పద్మాకరేణ స్వయం
లక్ష్మీర్లబ్ధ వికాస పంకజ కరన్యస్తా పురః స్థాప్యతే 111-4

ఇందు రూపకోత్ప్రేక్షలు రెండును కలియుటం జేసి యిది సంకరాలంకారము. ఇందు జయదేవుని భావుకత పరమ రమణీయముగ భాసించినది. ప్రభాతము, కడలిలో నుండి భాస్వద్రత్నమును దెచ్చి వ్యోమమను అంగడిలో వెలయింపగా పద్మాకరము తత్పురో భాగమున వికాస సమంచితమగు కమల లక్ష్మిని మూల్యముగా నొసంగినది. ఈ శ్లోకము కేవలము వర్ణనా పరముగనే కాక, కథార్థ పరముగ గూడ అన్వయించుచున్నది. ఇందు ప్రభాత సమయము,

రవిబింబము, పద్మాకరము, లక్ష్మి అను పదములు విశ్వామిత్రుడు, రాముడు, జనకుడు, సీత మున్నగు పాత్రములను స్ఫురింప జేయుచున్నవి. విశ్వామిత్రుడు రామ లక్ష్మణులతో మిథిలను ప్రవేశించునపుడే ఆతని మనమున సీతారాములకు కల్యాణము జరుగ వలెనను అభిలాష కలదు. పై శ్లోకము వారు మిథిల కేతెంచు సందర్భము నందుండుట సందర్భానుగుణముగ నున్నది. దీనిని తెలుగు కవి ఇట్లనుసరించెను.

చ. తెలివి ప్రభాత కాల ముదధిం గొని తెచ్చు త్రిలోక రత్నమున్
జలరుహ బంధు బింబము నిజంబుగ నెప్పుడు నిల్పె నంబర
స్థల విపణిన్ సరోవరము దానట మున్న తలంచి యీ
డుగా వెలయును దెచ్చె నందదర వింద వనేందిర పేర జూచితే 3-43

ఈ పద్యము నందు సరోవరము తాను "అటమున్న తలంచి యీడుగా" వెలను దెచ్చుట కవి స్వతంత్రతను వెలయించు భాగములు. ఇవి మూలమునకు మెఱుగు దిద్దుచున్నవి. ఇట్లే ఇంకను పెక్కు పద్యములను ముఖ్యముగా సప్తమాంకమునందు చంద్రోదయ వర్ణన సందర్భమునందు గల 161, 163, 165, 167 పద్యములను రచించుటలో కవి చక్కని నైపుణ్యమును ప్రకటించెను.

సూక్తులు :

జయదేవుడు తన నాటకమున ప్రసక్తానుప్రసక్తముగ పెక్కు సూక్తులను సుభాషితములను ప్రవేశపెట్టెను. ఇవి నాటక ప్రస్తావన యందును, పంచమాంకమున గంగాదుల సంభాషణమునను అధికముగా కనవచ్చును. సప్తమాంకము నందలి విష్కంభమున గల ముని కరాలకుల సంభాషణము ద్వారా చెప్పబడిన విభీషణ ప్రసంగము ధర్మబోధాత్మకమై యున్నది. ఇట్టివి నాటకమున లెక్కకు మించినవి గలవు. వానిలో కొన్నింటిని తెనుగు ప్రబంధమెట్లు తీర్చినదో చూతము. ఇందు తెలుగుకవి కొన్ని స్వతంత్రములైన వానిని గూడ జొప్పించెను.

క. క్షితి బర నిందకు నాత్మ
స్తుతికిని సత్పురుషులేల సొగయుదురని పూ
ర్వ తపః ఫల విఘ్నము లని
స్మృతి ప్రతి వారమును జాటి చెప్పుచు నుండున్ 1-316

ఈ సుభాషితము కవి కల్పనము. మూలమునందు 'స్వయమే వాత్మానం వర్ణయంతొ నఃజ్జైథే? (1 పుట 82) అని యున్న దానికి కవి చక్కని అర్థ స్ఫూర్తి నొసంగెను.

2. ఉ. శీలము గల్గు విద్యయును చిత్తము రంజిలజేయు వార్తయున్
సీలకచాకుచ స్తబక నిర్వృతమౌ మృగనాభి తావియున్
దైల కణంబు నీటబడి తజ్జల మంతయు నిండబర్వున
ప్పోలిక నెల్లలోకముల బట్టు తనంతన దుర్నివారమై 2-20

3. క. ధర మీదట మనగో రెడు
సరసులు కలనైన జూడ జనరు చతుర్థీ
హరిణాంక రేఖనుం బలె
పరకాంతా ఫాలరేఖ బరికింపంగన్ 7-10

ఇట్లు అతి సరసమగు విధమున హితోపదేశమును గావించు పద్యములు పెక్కులు హృద్యములై యున్నవి. వీనిలో పథిక నీతిని వివరించెడు పద్యము (6-72) కూడ ఎన్నదగినది.

## ప్రసన్న రాఘవము - రసపోషణ :

ప్రసన్న రాఘవము నందు ప్రధాన రసము వీరము. "ఇందు నాయకు డుత్తముడు. స్థాయి భావము ఉత్సాహము. మహేంద్రుడు దేవత. బంగారు వర్ణము. ఎవనిని జయింపవలెనో అతడు లోనగువారు ఆలంబన విభావములు. సహాయులను వెదకుకొనుటలో నగునవి అనుభావములు. ధృతిమతి గర్వస్మృతి తర్క రోమాంచాదులు సంచారులు. అది దాన ధర్మ యుద్ధముల తోడను, దయ తోను కూడినదై నాలుగు విధములగును."[22]

పై నాల్గు విధములైన వీరములలో నిందు యుద్ధవీరము కలదని చెప్ప వచ్చును. ఇందలి రస విషయము చర్చించుచు కొందఱది కరుణ విప్రలంభమని పేర్కొనిరి[23] నాట్య ప్రబంధము నందలి షష్ఠాంకమున విప్రలంభము పోషింప బడినది. కాని అది కరుణ విప్రలంభము కానేరదు అసలు కరుణ విప్రలంభ మనునది లేనేలేదని కొందఱి మతము. "కరుణ విప్రలంభమనునది లేనేలేద నియు గేవల కరుణమో కేవల విప్రలంభమో యుండును గాని కరుణ విప్ర

లంభమనునదియే యుండదనియు సిద్ధాంతము. లోచనమున గల కరుణ విప్రలంభాది పదము నొక్కటిగా గ్రహించి పండితులీ పొరపాటు పడిరి. అట కరుణ, విప్రలంభాది అని పద విభాగము చేసికొన వలయును. ధ్వన్యాలోకము శృంగార భేదములలో గరుణ విప్రలంభమును జెప్పనే లేదు సాహిత్య దర్పణ కారుడే దీనిని లేవదీసెను." కావ్యాలంకార సంగ్రహము పుట 412... ఇందలి రసమును నాందీ పద్యముల ద్వారమున గ్రహింప నగును. నాంది యందలి రెండవ పద్యము 'ధీరోదాత్తుడైన రాముడు కుంభకర్ణ మేఘనాదాదులను జయించుట, దశాస్యుని నిర్జించి యశస్సంపద నార్జించుట మున్నగు నంశములను తెలుపుచున్నది. మూడవ పద్యము "సక్రోధముద్రాసక్తిన్ మధుకైటభున్, సకరుణోదారంబుగా లక్ష్మి, నాశ్వాస స్నేహమతిన్ విరించిగను తేజం బేలు తిమ్మాధిపున్" అని పేర్కొనబడినది. మూలమున నిచ్చట "సకరుణ స్నేహం సుతామంబుధేః, సోత్ప్రాస ప్రణయం సరోజవసతింపశ్యన్" అని కలదు. సకరుణ స్నేహం అనుదానికి దయా ప్రణయ సహితం యథా అని వ్యాఖ్య. ఇందలి సక్రోధం, సకరుణస్నేహం అను పదములు అంగియగు వీరమును, అంగమగు శృంగారమును వివరించుచున్నవి.

నాటకము నందలి ప్రథమ పతాకా స్థానకము నందు వీరమున కాలంబన విభావమిట్లు సూచింపబడినది.

గీ. మహిత శుభవృత్తి సూక్తి సంపదలుగల్గు
పరుని కృతినైన సతినైన బ్రాలు మాలి
యపహరించిన దలపౌకడంబు రాశి
సొచ్చియైనను గాంచునే సుఖమొకింత 1-128

ఇందు సీత నపహరించిన రావణుడు సూచింపబడినాడు. తత్పర్యవసానము గూడ వ్యంగ్యముగ సూచింపబడినది. విశ్వామిత్రుడు వీరమాతలు మాత్రమే ధరింప నర్హమైనట్టి ఒక తాటంకయుగమును దశరథున కిచ్చి, దానిని కౌసల్యాదేవి కిమ్మనుట రాముని వీరత్వమునకును, ఉత్తమత్వమునకును 24 నిదర్శనము. వీరమునకు స్థాయియైన ఉత్సాహము ఇట్లు ప్రకటిత మగును.

హరచాపారోపణావసరమున విశ్వామిత్రుడు రాముని పురారికార్ముకాధిరోహణమునకు సంసిద్ధుడవగు మనుచు,

గీ. తాటక గఠోర ఖేటక గీటడంచి
దురితగేహు సుబాహు దుత్తమురు సేసి
నీచు మారీచు నేచి మున్నీట ద్రోచి
చెలగు నీవిల్లు లక్ష్మణు చేతి కిమ్ము 3-121

పిదప,

క. అక్షయ ధనురాగమములు
దక్షత నా వలన నేర్చి దానవ శిక్షా
దక్షుండై యీతడు గురు
దక్షిణ మత్సవన రక్షితం గావించెన్ 3-123

అని ఉత్సాహము నుద్దీపింప జేసెను.

రామ రావణుల యుద్ధసంరంభమంతయు సప్తమాంక విష్కంభమున విద్యాధర మిధునముచే విపులముగ వివరింపబడినది ఆ యుద్ధ సమయము నందలి విభావానుభావాదులును సంచారి భావములును ఉచితముగ పోషింపబడి నవి. నాయక ప్రతి నాయకుల సమానోత్కర్ష ఇట్లు ప్రకటింపబడినది.

ఉ. "భీమ శరాంధకారములు పెంచుచు జూచితె రావణుండు సం
ధ్యాముఖమయ్యె నావుడని యమ్ముల గిమ్ముల బార జిమ్ముచు
రాముడు సోముడయ్యె
7-120

తనతో సమానుడగు వైరితో బోరి నందున ఈ వీరము నాయకుని యందు ప్రతిభాసించినది. రాముడు రావణునితో నట్లనుచున్నాడు.

"పూర్వమేవ ప్రయాతానాం ఖర మారీచ వాలినామ్
సౌజన్య ముగ్ధః పంథాన మధివర్తితు మీహసే" 7-89

(మున్ను ఖరుడు మారీచుడు, వాలి మున్నగు వారు రామబాణముచే నిర్జితు లైరి. ధర్మ మార్గమును దప్పిన రావణుడు కూడ వారి ననుసరింప గోరు చున్నాడు.) ఇచట ఉత్సాహము స్థిరమైనది. రాముని యొక్క చూపు అరుణ మైనంత మాత్రముననే 'దశాస్యుడు ధరాశయ్య ధూళి బ్రుంగి వ్రాలినాడు.' (7-142)

హుంకార స్ఫుట కీశ కంఠ కదన ప్రోద్యత్కృపాణ ప్రభా
సంకీర్ణాఖిల దిఙ్ముఖుల్ చెలగి రక్షామోద్ధతిన్ రాక్షసుల్ 7-68

ఈతడు ప్రబంధము నందాద్యంతము శబ్దాలంకార వైచిత్రిని ప్రకటించెను.

క. "అభ్రంలిహ బహుకీలా
దభ్రాగ్నింజొచ్చి వెడలి తనరెడు సీతా
సుభ్రూమణి రుచి నుదితా
ర్కభ్రాజిత కిరణ కళిక కరణిం దరుణి 7-145

ఈత డుపయోగించిన జాతీయములు నుడికారములు సుందరములుగా నుండును.

1. మొదలనే తీపు తుద జప్పనగు (1-208)
2. కూపము కప్ప వార్ధి రాజును బలె (1-216)
3. కాలిగోరున కెనరాదు (1-233)
4. పనిమాలిన వాద నీకు పదియేటికి (1-264)
5. విదళించున్ జగతి విషము విషమును బోలెన్ (1-280)
6. పడపుడిగిన వెలయాల్గతి (1-291)
7. పులివాతన్ విడివడిన లేడివలె (1-326)
8. మాయల మూట పట్టు (2-3)
9. తెగిన గాలి పడగ చందంబున (2-5)
10. అడుసు చొరనేమిటికి కాళ్ళు గడుగనేటికి (2-5)
11. వీనుబండువై (3-12) కనుగవ పండువు చేయగ (2-39)
12. దీనిం దిగ ద్రావంగలమా (5-18)
13. పాము నీమీద నిదె యోర వడగ పెట్టి (6-31)
14. కన్నీరు పూసలనగా (6-127) కుట్టులు వెళ్ళగా (6-143)

15. కలలోనైన గానని వాని (7-18) చూపుల విందుగాదె (7-30)

16. నోర గొలందుఉ (7-45)

ఈ ప్రబంధము నందు గల నలువది యొక్క విశేష పద ప్రయోగము లను డా. బి రామరాజు గారు ప్రరోచనలోనిచ్చి యున్నారు. వీనిలో కొన్ని శబ్ద రత్నాకరమున కనవచ్చుట లేదనియు మఱికొన్ని యున్నను వానికి ప్రయోగ ములు లేవనియు తెలిపిరి.[26] ఇంకను కంచుటరిగ (1-28) గొంట కట్టి తెర పాము [1-58] తురము గోడెలు [2-65] గిర్బున [39] విపాట [4-27] వంటి ప్రయోగములు కూడ కొన్ని యున్నవి. కొనబు [గొనబు] తిద్దు [దిద్దు] పెబ్బులి [బెబ్బులి] అనునవి పరుషాదులుగా నున్నవి. అయోధ్యాపుర వర్ణన సందర్భమునందు కూడ నిఘంటువు లందు లేని పదములెన్నియో కలవు.[27]

ఈతడు నన్నెచోడుడు కుమారసంభవమునందు [6-30] ప్రయోగించిన 'తంతుర్పముల్' అను పదమును 'పల్లవకరోద్గీర్ణంబు తంతుర్పముల్' [6-48] అని ప్రయోగించుట వలనను, ఈ పదము కన్నడ పదమగుటచేతను ఈ కవిపై నన్నెచోడుని కుమార సంభవ ప్రభావమున్నదని శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు తెలిపిరి.[28]

చిన తిమ్మయకు బహువిధచ్ఛందములపై మోజు లేదు. ఈతడు గీతము లను కందములను రచియించుటలో నేర్పరి. ప్రస్తావనలో మాత్రము చతుర్విధ కందము [1-66] మణిగణ నికరము [1-74] అను వానిని రచించెను. ప్రత్యం కమును శ్రీ అను పదముతో మంగళకరముగ నారంభించెను.

ఈతడు మూలము నాద్యంతము సమగ్రముగ అనుసరించినను తన ప్రత్యేకాభిరుచులను కూడ నిలుపుకొని యున్నాడు. జనకునిచే గౌరవింపబడిన రాజులను పేర్కొను సందర్భమున ఆంధ్రరాజుల ప్రసక్తి [3-143] పంచ మాంకమున విపుల గోదావరీ నదీ తటవర్ణనము [5-98] ఈతని ఆంధ్ర దేశాభి మానమును వ్యక్తము చేయుచున్నవి. అట్లే ఈతడు తన గ్రంథము నందు వైష్ణవమతాభిమానమును గూడ ప్రదర్శించెను. జయదేవుడు నాటక నాంది ప్రస్తా వన లందును, భరతవాక్యము నందును, హరిహరుల స్తుతి గావించెను. నాందీ

శ్లోకములు మూడును హరిని స్తుతించునట్టివి. అటుపై ప్రస్తావన యందలి సూత్రధారుని వచనములు "నిజవదన శారదారవింద నర్తిత గిరినందినీ నయన ఖంజనస్య .... భగవతః శంకరస్య యాత్రాయాం పరిమిలితా ఏవ పారిషదాః" [1 పుట 6] అని శివుని ప్రస్తుతించెను. భరతవాక్యమునం దద్వైతభావముతో శివకేశవు లిరువురకును స్వస్తి చెప్పెను. ప్రబంధకర్త మాత్రమిట్లు గాక, హరి స్తుతి పూర్వకములగు నాందీ శ్లోకములను యథాక్రమముగ నట్లే యుంచి నాంద్యంత ప్రస్తావన లందు "అంజనాద్రీశు తీర్థయాత్రానురక్తి" అని మూలము నందలి శివుని అంజనాద్రీశునిగా [వేంకటేశ్వరుని] మార్చెను.

ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధమును వెలుగులోనికి తెచ్చినవారు డా. బి. రామరాజు గారు. వీరు తమకు లభించిన తాటాకు ప్రతిని సమగ్రముగ బరిశీలించి మిక్కిలి శ్రమించి దానిని బరిష్కరించినారు. గ్రంథము నందు పెక్కు భాగములను పూరించినారు. ఛందోభంగాదులను సవరించిరి వీరు తమ పరిష్కరణ విధానమును పీఠికతో తెల్పి యున్నారు. వీరు తమకు లభించిన తాళపత్ర ప్రతికిని, సంస్కృత ప్రతికిని [క్రీ.శే. శివరామమహాదేవ పరాంజపే, నారాయణ సఖారాం హస్సే – షిరాల్కర్ కంపెని పూనా [1894] కొన్ని సారూప్య వైరూప్యములున్నవని తెలుపుచు, సంస్కృతమున సప్తమాంకము నందలి 'రణే ముక్త ప్రాణా రజని చర వీరా దినమణిం ... [75] 'ప్రాచీము ఖైక తిలక' [174] అను శ్లోకములలో అధోజ్ఞాపికలో నున్న పదములను అను సరణ కర్త గ్రహించెనని వ్రాసి యున్నారు కాని ఆ పదములు ఆచార్య శేష రాజ శర్మ రేగ్మిగారు ప్రకటించిన ప్రతిలో శ్లోక భాగముల యందే యున్నవి.

ఉపయుక్త గ్రంథ నిర్దేశము :

కవీంద్రః కౌండిన్యః సతవ జయదేవః శ్రవణయో
రయాసీ దాతిథ్యం నకిమిహ మహాదేవ తనయః 1-14

లక్ష్మణ స్యేవ యస్యాస్య సుమిత్రా కుక్షి జన్మనః
రామచంద్ర పదాంభోజే భ్రమద్భృంగాయతేమనః 1-15

2. తదదోషౌ శబ్దార్థౌ
సగుణా వనలంకృతీ పునః క్వాపి. [కావ్యప్రకాశము]

3. శేషరాజ శర్మ [సం॥ పీఠిక] ప్ర. రా. పుట 9

4. నిడుదవోలు వేంకటరావు; ప్ర. రా. నాట్య ప్రబంధము భారతి, మార్చి 1963, పుట 76.

5. Considered in the light of a dramatist he sinks down to a very low level. Sivaram Mahadev Paranjape and Narayan Sakharam Panse – Introduction to Prasanna Raghava.
Page. XV

6. ప్రసన్న రాఘవమును ఏకైక తాళపత్ర ప్రతినుండి యుద్ధరించి పరిష్కరించిన వారు డా. బి. రామరాజు గారు. దీనిని ఆంధ్ర రచయితల సంఘము హైద్రాబాదు వారు ప్రకటించిరి. ఆంగ్ల పీఠికా రచయితలు ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము గారు.

7. చాటు పద్య మణిమంజరి – పుటలు 155-156.

8. ఈ వృత్తాంత మంతయు మెకంజీ రికార్డులలో గలదని నిడుదవోలు వేంకటరావు గారు సప్రమాణముగ నిరూపించిరి.
[మెకంజీ సంపుటము 186. పుట 80]

"ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధము" భారతి, మార్చి 1963,
పుటలు 72, 73.

9. నిడుదవోలు వేంకటరావు 'ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధము', భారతి మార్చి 1963, పుట 73.

10. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం, సంపుటి 8, పుటలు 193-194.

11. నేలటూరు వేంకట రమణయ్యగారు, అష్ట దిగ్గజములు, పీఠిక పుట 16

12. ప్రసన్న రాఘవ నాట్య ప్రబంధము 1-75

13. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం, సంపుటి 8. పుట 195

14. కళాపూర్ణోదయము [1-46-49]

15. డా. బి. రామరాజు - ప్రరోచన పుట 11

16. డా. బి. రామరాజు - ప్రరోచన పుట 10

17. "ఇది ఆనాటి నంద్యాల వర్ణనమో లేదా గతానుగతికముగా వచ్చు పుర వర్ణనమో యనుకొనవచ్చును. ఎటులైనను అమూలకము, స్వకపోల కల్పితము నగుటచే కవి సమకాలీన వాతావరణమును అభిరుచులను ఈ వర్ణనమున ప్రతిబింబించుచున్న వనుట మాత్రము నిజము"
డా. బి. రామరాజు, పుట 12.

18. ప్ర. రా. నా. ప్ర. 1-8.

19. "ప్రథయతి పాత్ర విశేషాన్ సామాజిక జనమునాంసి రంజయతి
అనుసందధాతిచ రసాన్నాట్య విధానే ధ్రువా గీతిః"
రాజశేఖరుడు, కావ్యమీమాంస.

20. ఇందుగల 79వ పద్యము నాటక ప్రథమాంకమున రావణునిచే చెప్ప బడినది. [1-37]

21. డా. బి. రామరాజు ప్రరోచన పుట 17

22. వేదం వేంకటరాయ శాస్త్రి, ఆంధ్ర సాహిత్య దర్పణము, తృతీయ పరిచ్ఛేదము, పుట 98.

23. శేషరాజ శర్మ రేగ్ని, [పుట 456-57]

24. క. కావున శ్రీ కౌసల్యా
దేవీశ్రుతి యుగళి నిల్పు దివ్యంబుగని
ప్పావన కుండల యుగ్మం
బావెలదియు వీర సూపదాశ్రయ మగుటన్ 2-15

# 6. అనర్ఘ రాఘవము

[మూలము మురారి అనర్ఘరాఘవము]

బిజ్జుల తిమ్మభూపాలుడు

పరిష్కర్త
కేశవపంతుల నరసింహశాస్త్రి
జనవరి 1977
నాగార్జున ఆర్ట్ ప్రింటర్స్
కాచిగూడ, హైదరాబాదు 500027.

అనర్ఘ రాఘవమ్

The commentary of Ruchipati.
Edited by
Pandit Durgaprasad
and
Wasudev Lakman Sastri Pansikar

Published by
Pandurang Jawaji
Nirnayasagar Press
Bombay
1937.

సంస్కృత కవి - కాలాదులు :

అనర్ఘ రాఘవ నాటకమును రచించిన భట్టమురారి బాలవాల్మీకి బిరుదాంకితుడు. ఈతని నామములోని భట్ట పదము పూజ్య వాచకము. ఈతడు మౌద్గల్య గోత్రుడు. పండిత వంశాకరము. భట్ట శ్రీవర్ధమాను డీతని తండ్రి. తల్లి తంతుమతి. ఈ విషయములు ఈ క్రింది ప్రస్తావనా వాక్యములవలన తెలియనగుచున్నవి.

"అస్తి మౌద్గల్య గోత్ర సంభవస్య మహాకవే ర్భట్ట శ్రీవర్ధమాన తనూ జన్మన స్తంతు మతీ నందనస్య మురారేః కృతి రభినవ మనర్ఘరాఘవం నామ నాటకమ్" - ఈతడు బ్రాహ్మణుడు. "అస్యహి మౌద్గల్యానాం బ్రహ్మర్షీణా మన్వయ మూర్ధన్యస్య మురారి నామధేయస్య" అను ప్రస్తావనా వాక్యములవలన ముద్గల గోత్రము అనేకులు బ్రహ్మర్షు లవతరించిన పవిత్ర వంశమని తెలియ నగుచున్నది. మురారి తన తండ్రి శ్రోత్రియుడని కూడ చెప్పుకొనెను.

మురారి దేశకాలాదులను గూర్చి యే విషయమును నిర్దిష్టముగ తెలియ వచ్చుట లేదు. ఈతని నాటకమునకు కాశ్మీర దేశమం దధిక ప్రాచుర్యముండు టచే ఈతడు కాశ్మీర నివాసి కానోపునని, నిర్ణయసాగర ముద్రణమును బరిష్క రించిన దుర్గాప్రసాద పండితు లభిప్రాయపడిరి.[2] ఈతని నాటకమున మాహిష్మతీ నగరము వర్ణింపబడి యుండుటచే, నేడు మాంధాత నగరమని పేర్కొనబడుచు నర్మదాతీరమందున్న మాహిష్మతీ నగరమే ఈతని నివాస స్థలమని మఱికొందఱి యభిప్రాయము.[3] మురారి ఆంధ్ర దేశీయుడని పేర్కొనుచు శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు నాటకమున శ్రీ రామాదులు రావణ సంహారానంతరము పుష్పక విమానమెక్కి అయోధ్య కేగుచుండగా క్రిందుగా వచ్చిన కొన్ని దేశము లను పట్టణములను క్షేత్రములను వర్ణించు సందర్భమున కవి ఆంధ్రదేశము నందలి భీమేశ్వరుని వర్ణించుట నందుల కుపపత్తిగ చూపి యున్నారు.[4] ఆంధ్ర ప్రదేశము నందలి భీమేశ్వర క్షేత్రమును కవి ప్రత్యేకముగ పేర్కొని యుండు టచే వారట్లు ఊహించి యుందురు. ఆంధ్రదేశ పండితలోకమున ఈ నాటకము నకు విశేషఖ్యాతి యుండుట ఈ వాదమునకు కొంత సాధకముగ నున్నది. మఱియును మురారి నాటక వ్యాఖ్యాతలలో హరిహర దీక్షితులు, రామానందా శ్రమముని యను వారిరువురును తెలుగువారై యుండుట కూడ పై వాదమును కొంత సమర్థించును.

ప్రస్తుతము లభించుచున్న కొన్ని ప్రమాణములను బట్టి మురారి క్రీ.శ. 850-880 ప్రాంతములందు వసించెనని చెప్ప వీలగుచున్నది. క్రీ.శ. 1135-45 నడుమ రచింపబడిన మంఖకుని శ్రీకంఠ చరితమునందు గల ఈ రెండు శ్లోక ములను బట్టి మురారి క్రీ.శ. 9వ శతాబ్ది యందలి సుప్రసిద్ధ కవియగు రాజ శేఖరుని కంటె పూర్వుడని తెలియవచ్చుచున్నది. రాజశేఖరుడు మురారి ననుక రించినట్లు

"పథా చరతి వక్రేణ వాగ్యస్య చతురైః పదైః
సరస్వత్యై వినిర్మాతు మువ్యతేవ ప్రదక్షిణమ్
ప్రక్రమై ర్భార వక్రిమ్ణో మురారి మనుధావతః
శ్రీ రాజశేఖర గిరో నీవి యస్యోక్తి సంపదా"

అను శ్లోకముల వలన తెలియవచ్చును. రాజశేఖరుడు కావ్య మీమాంసలో స్వర్గ్య పాతాళీయ కవి రహస్య స్థాపనమను పదునాఱవ యధ్యాయము నందు — మురారి నాటకమునుండి 'యదిందోర న్వేతి వ్యసన ముదయం వా నిధి రపామ్'[5] అను శ్లోకమును కవి పేరుగాని కృతి పేరుగాని పేర్కొనకయే యుదాహరించెను. దీని ననుసరించి కూడ మురారి రాజశేఖరున కించుక ప్రాక్తనుడో లేక సమకాలికుడో కావచ్చునని యూహింప వచ్చును. వీరిరువురును సమకాలికులైనచో మురారి వృద్ధుడును, రాజశేఖరుడు చిన్నవాడును అయి యుందురు.

క్రీ శ. 855-84 మధ్య భాగమున కాశ్మీరము నేలిన అవంతి వర్మ ఆస్థానము నందు గల రత్నాకరుడు[6] "అఙ్కోఢ (అంకేత్థ) నాటక ఇవోత్తమ నాయకస్య । నాశం కవిర్వ్యధిత యస్యమురారి రిత్థమ్" అని అంక, నాటక, కవి, మురారి పదములను ప్రయోగించి, నాటక నిర్మాతయగు మురారిని సూచించి యున్నాడు. ఈ ప్రమాణము ననుసరించి విమర్శకులు మురారి క్రీ.శ. 855 కంటె ప్రాక్తనుడని వ్రాసిరి[7] అనర్ఘ రాఘవమునందు గల మాహిష్మతీ నగర వర్ణనము ననుసరించి మురారి చేది మండలమును పరిపాలించిన కలచురి ప్రభువుల నాశ్రయించి యుండెనని కొందఱి యభిప్రాయము[8] ఈ కలచురి వంశ ప్రతిష్ఠకు కారకుడగు కొక్కల్ల దేవుడు క్రీ.శ. 850 ప్రాంతమున రాజ్యపాలనము గావించినట్లు చరిత్ర తెల్పును. మురారి చేసిన చేది మండల ప్రశంస[9] యీతని రాజ్యపాలన కాలమునకు చెందవచ్చును. కావున మురారి క్రీ.శ. 850 సం॥ కంటె నర్వాచీనుడనదగును.

## మురారి రచించిన గ్రంథములు :

మురారి కృతులలో ననర్ఘరాఘవ నాటక మొక్కటే ప్రస్తుతము లభించు చున్నది. మైసూరు ప్రతిలో నాటకము చివర గల గద్యమున[10] "సమాప్త మిదం మౌద్గల్యాన్వయస్యభట్ట మురారేః కృతిషు అనర్ఘ రాఘవం నామ నాటక" మ్మని కలదు. ఇందలి కృతిషు అను బహువచన ప్రయోగము వలన మురారి

ఇంకను కొన్ని కృతులు రచించియుండెనేమో యను సందేహము కల్గుచున్నది. కొన్ని సాహిత్య గ్రంథము లందును, సుభాషిత గ్రంథములందును మురారి కృతములుగా బెక్కు శ్లోకము లుదాహరింపబడి యున్నవి వానిలో కొన్ని అనర్ఘరాఘవ నాటకమున గానవచ్చుట లేదు. దీనినిబట్టి యవి యాతడు రచించిన యితర కృతులలోని వేమోయను నూహ జనించుచున్నది. కీత్ పండితుడు మురారి యను నతడు ఒక సంస్కృత నిఘంటువును రచించినట్లు చెప్పి యుండెను.[11] 1928 ప్రాంతమున శ్రీ యస్. కె. రామనాథశాస్త్రి గారు మురారి మిశ్రుడు రచించిన 'త్రిపాదీ నీతినయన' మను దర్శన గ్రంథము నొకదానిని ప్రచురించి యీ మురారి మిశ్రుడు బహుశః అనర్ఘ రాఘవ నాటకకర్త కంటె భిన్నుడై యుండునని సూచించి యున్నారు.[12] 'మురారే స్తృతీయః పంథాః' అను సూక్తి లోకమున ప్రచారమున నున్నది. దీనికి మురారిది ప్రసిద్ధములైన రెండు మార్గముల కంటె భిన్నమైన మూడవ మార్గమని యర్థము. పూర్వ మీమాంసా దర్శన రచయితలలో ప్రసిద్ధు లయిన కుమారిల భట్ట, ప్రభాకరుల ప్రస్థానముల కంటె మురారి దర్శనము విలక్షణమై యున్నదని దాని భావము. అనర్ఘ రాఘవ నాటకమునకు ప్రకాశ వ్యాఖ్య రచించిన శ్రీ రామచంద్ర మిశ్రులు కూడ 'మురారే స్తృతీయః పంథాః' అను నాభాణకము ఆ మురారి మతము భట్ట మత గురుమతముల కంటె భిన్నమై యుండుటను సూచించుచున్నదని తెలిపి యుండిరి.[13] సాహిత్య విషయమున కూడ మురారి నాటకమును బట్టి పై ఆభాణకమును సమర్థింప వచ్చును. ఏలన ఇతని రచనా మార్గము కాళిదాస భవభూత్యాదుల దానికంటె భిన్నముగా నుండును.

మురారి పాండిత్యము :

మైసూరు నగరమున తెలుగు లిపిలో ముద్రింపబడిన అనర్ఘ రాఘవమున "తత్ర భవతా సకల తంత్రస్వతంత్రేణ సంగీత సాహిత్య పార దృశ్వనా విద్వత్కవి సార్వభౌమేన శ్రీ భట్ట మురారిణా విరచిత మనర్ఘ రాఘవాభిధం నాటకమ్" అను దానినిబట్టి మురారికి సకల తంత్ర స్వతంత్ర, విద్వత్కవి సార్వభౌమ అను బిరుదములు కలవనియు, నతడు, సంగీత సాహిత్యములందు పారంగతుడనియు తెలియుచున్నది. ఇతర ప్రతులలో "ఇతి మహాకవి శ్రీ మురారి విరచిత మనర్ఘరాఘవమ్ నామ నాటకమ్" అని మాత్రము కలదు. అందుచే మైసూరు ప్రతి యందలి బిరుదములు కవి వ్రాసికొన్నవో, ప్రకాశకులు

కల్పించినవో తెలియదు. కాని యవి మురారి విషయమునే యథార్థములనియే తోచుచున్నది. సర్వతంత్ర స్వతంత్రుడనగా నన్ని శాస్త్రముల యందును నిష్ణాతుడని యర్థము. మురారికి వేద, రాజనీతి, వ్యాకరణ, ధర్మశాస్త్ర, తర్క, వైశేషికాదులలో పాండిత్యము కలదని నాటకము నుండియే యుదాహరణములు చూపవచ్చును. ఒక్క సంగీతశాస్త్ర పాండిత్యమునకు మాత్రము నిదర్శనములు కనబడుట లేదు. మురారి గొప్ప విద్వాంసుడును, మహాకవియు నగుటచే నతడా కాలమున విద్వత్కవి సార్వభౌముడను బిరుదమును పొంది యుండవచ్చును. "దేవీం వాచముపాపసతేహి బహవః సారంతు సారస్వతమ్ జానీతే నితరామసౌ గురుకుల క్లిష్టో మురారిః కవిః, అబ్ధి ర్లంఘిత ఏవ వానరభటైః కింత్వస్య గంభీరతా మాపాతాళ నిమగ్న పీవరతనుః జానాతి మంధాచలః" అను శ్లోకము పండిత లోకమున ప్రచారము నొంది యుండుటయేకాక సదుక్తి కర్ణామృతము, రసిక జీవనము అను గ్రంథములలో కూడ మురారి కృతముగా కానబడుచున్నది. పెక్కితర గ్రంథములలో కవి పేరు లేకుండ నీ శ్లోక ముదాహరింపబడి యున్నది. ఈ శ్లోకమున గురుకుల వాసమున నతిక్లేశమును సహించి వ్యాసంగ మొనర్చిన మురారి కవికే సారస్వత సారము తెలియును గాని యది వాగ్దేవి నుపాసించు పలువు రితరుల కేమి తెలియునని ననిదర్శనముగా చెప్పబడినది. ఇందు కొంత యతిశయోక్తి యున్నమాట నిజమే. కాని కొందఱు సంస్కృతాంధ్ర మహాకవులు తమ పాండిత్య విశేషమును గూర్చి యిట్లు చెప్పుకొను పరిపాటి లేకపోలేదు.

లోకమున మురారి కవితా మహత్త్వమును గూర్చి ఎవరు రచించిరో తెలియని శ్లోకములు కొన్ని వినవచ్చుచున్నవి.

"మురారి పద చింతాయాం భవభూతేస్తు కా కథా
భవభూతిం పరిత్యజ్య మురారి మురరీ కురు
భవభూతి మనాదృత్య నిర్వాణమతినా మయా
మురారి పద చింతాయా మిద మాధీయతే మనః"

అను శ్లోకములు భవభూతి కంటె మురారికి గల యాధిక్యమును, శ్లేషచే శివుని కంటె విష్ణువునకు గల యాధిక్యమును వెల్లడి చేయుచున్నవి.

మురారి పద చింతాచే త్తదా మాఘే మతిం కురు
మురారి పద చింతాచే తదా మాఘే మతిం కురు"

అను మఱియొక శ్లోకము కూడ వినవచ్చుచున్నది. ఇందలి వాక్యములకు రెండు విధములుగా నర్థము చెప్పవచ్చును. విష్ణు పాదచింతయున్నచో (అఘేమతిం మా కురు) పాపమున బుద్ధి నుంచకుము అని యొక అర్థము. మురారి కవి పద చమత్కారము నెఱుగ దలచినచో ముందు మాఘ కావ్యమును జక్కగా పఠింపుము అని రెండవ అర్థము. మురారి పెక్కు వ్యాకరణ చమత్కారములను, బహు నిఘంటువు లందలి విశిష్ట పదములను ప్రయోగించి యుండెను. పెక్కు నిఘంటువులను పరిశీలించిన కాని ఈతని కృతి బోధపడదు. ఈ విషయమున నితనికిని మాఘునికిని చాల సాదృశ్యము గలదు. "నవసర్గగతే మాఘే నవశబ్దో న విద్యతే" అను సూక్తి వలన మాఘకృత శిశుపాల వధ యందలి తొమ్మిది సర్గములను పఠించినచో నింక క్రొత్త శబ్దముండదని తెలియుచున్నది. కవితా ప్రౌఢినిబట్టి కూడ ననర్ఘ రాఘవ నాటకమును బఠింపదలచినచో ముందు శిశుపాలవధను బఠింపవలెనని పండితులు చెప్పుదురు. మురారి నాటకము నందలి శ్లోకములను జయరథుడు, హేమచంద్రుడు రామచంద్రసూరి, శారదాతనయుడు, పండితరాయలు, విశ్వనాథ కవిరాజు మున్నగు వారెందరో తమ లక్షణ గ్రంథములం దుదాహరించి యుండిరి.

మురారి వ్యాకరణ శాస్త్రమును కూలంకషముగా నెఱింగి యుండెననుట కాతని నాటకము నుండి పెక్కు ఉదాహరణములు చూపవచ్చును. కొన్ని వ్యాకరణ శాస్త్ర మర్మములకు శాస్త్రకారులే యాతని ప్రయోగములను దృష్టాంతములుగా నొసంగి యుండిరి. ఉజ్జ్వలదత్తుడు ణాది సూత్రముననను, భట్టోజీ దీక్షితుడు సిద్ధాంత కౌముదీ యందును, ననర్ఘ రాఘవము నుండి కొన్ని ప్రయోగములను పేర్కొని యున్నారు. మురారియే చివరి యంకమున "నశబ్ద బ్రహ్మోత్థం పరిమళ మనాఘ్రాయ చ జనః కవీనాం గంభీరే వచసి గుణదోషౌ రచయతు" అని శబ్దశాస్త్ర పరిమళము నాఘ్రాణింపక జనులు కవుల గంభీరములైన వాక్కులందు గుణదోషముల నారోపింపరాదని చెప్పి యున్నాడు. ఈ వాక్యము నాతడు తన గ్రంథము నందలి ప్రయోగములను విమర్శించు వారిని గూర్చియే చెప్పి యుండెనని తోచుచున్నది. మురారి తన నాటకమున నచ్చటచ్చట పాణినీయ సూత్రములనే చమత్కారముగా కూర్చి యుండెను. "యదిందో రన్వేతి వ్యసనముదయం వా నిధి రపాం ముపాధి స్త్రాయాం జయతి జనికర్తుః ప్రకృతితా" (1-58) అనుచోట 'జనికర్తుః ప్రకృతిః' అను సూత్రమును, "ప్రకృష్ట

కర్త్రభిప్రాయ క్రియా ఫలవతోవిధీన్ ప్రయుంజానా స్స్వయాపీగ పరిపాల్యా వహేమయమ్" (2-86) అను శ్లోకమున 'స్వరితజితః కర్త్రభిప్రాయే క్రియా ఫలీ" అను సూత్రమును అతడు ప్రవేశపెట్టి యుండెను. అట్లే నాల్గవ యంకమున స్థానివద్భావేనశత్రుం కార్యం న జహతి' అనుచోట వ్యాకరణ శాస్త్రము నందలి స్థానివద్భావ' మను సాంకేతిక పదమును "కుర్యుః శస్త్రి కథామమీ యది మనోర్వంశే మనుష్యాంకురాః స్యాచ్చేత్ బ్రహ్మగణోయ మాకృతి గణః తత్రేష్యతే చేత్ భవాన్" (4-41) అను శ్లోకమున 'నాకృతి గణ'మను సంకేతమును జొప్పించి యుండెను. వ్యాకరణ ప్రియులకు తద్ధిత ప్రయోగము లందాసక్తి మెండుగా నుండును. అదిగాక 'ప్రియ తద్ధితాః దాక్షిణాత్యాః' అను సూక్తి కూడ నుండుటచే తద్ధిత ప్రయోగముల నెక్కువ వాడియున్నాడు. "ఐణేయ్యాంత్వచి, త్రైశంకవం చరితమ్, త్రైయంబకం కార్ముకమ్, ఐషీకమస్త్రమ్" మున్నగు ప్రయోగము లిందు కుదాహరణములు.

"అహి భయోపజాయ జర్జరం సుహృద్గృహ ముప సృత్య ... ఆత్మబలైక దేశం వాలి ప్రతి గ్రహాయ ప్రాహిణోత్" (1-పుట 69) ఆరణ్యోగ్నిరివ సుఖదుఃఖా మర్షజం తేజో విక్రమయతి మండలస్య చాణుగ్రాహ్యో భవతి (4-పుట 204) రాజ పుత్రోంగ దోసౌబాలో నవబుద్ధి రామపాత్రమివ యద్యదాధీయతే తత్తదాను చూషతి" (6-పుట 321) "అరిషడ్వర్గ ఏవాయ మస్యాస్తాత పదాని షట్ తేషా మేకమపి ఛిన్దన్ ఖంజయ భ్రమరీం శ్రియమ్" (6- శ్లో 9) అను వాక్యములు మురారి రాజనీతి వేత్తృతకు తార్కాణములు. "న దీక్షిష్యమాణాః క్రుధ్య స్త్రీతి రక్షితారం క్షత్రియ ముపావధత్" (2 పుట 75) "అతి పాతికే కర్మణి రాజ్ఞాం సద్యశ్శుద్ధిః (5 పుట 265) అను వాక్యములు మురారి ధర్మశాస్త్ర పరిజ్ఞానమును చాటుచున్నవి. "విశ్వం చాక్షుష మస్తమస్తిహి తమః కైవల్యహౌపాధిః ప్రాచ్యాది వ్యవహార బీజ పరహాద్ధి జ్యాక్రమేవస్థితమ్" (2శ్లో 52) "వైశేషిక కందళీ పండితో జగద్విజయమానః పర్యటామి" అనునవి అతని వైశేషిక శాస్త్ర విజ్ఞానమునకును, "యదధికరణం ధర్మస్థీయంతవైవ వచాంసినః" అనునది యతని మీమాంసా శాస్త్ర పరిచయమునకును 'చతురక్షరోపి రాక్షస శిక్షా సిద్ధ మంత్రః" అనునది యతని మంత్ర శాస్త్ర పరిచయమునకును తార్కాణములు. ద్వితీయాంకము నందలి "పరిణమయతి జ్యోతిర్వృత్త్యా యజూంషి' అను వాక్యమును (2 శ్లో 23) "గాయత్రీద్రుపదాదేవీ పాప్మానమప

హంతు తే పునంతు పావమాన్యాస్స్వా మృథోన్నితు బ్రహ్మతే పరమ్" (4-62) అనునవి యతని వేద విజ్ఞానమును సూచించుచున్నవి. సాహిత్య శాస్త్రమున నాతనికి గల విజ్ఞానమున కాతని నాటకము నుండియే అనేకోదాహరణముల నీయవచ్చును కాళిదాసు, భారవి, మాఘుడు, శ్రీహర్షుడు మున్నగు కవులుకూడ తమ కావ్యములలో నిట్లే సందర్భము కలిగినచోట్ల తమ బహుశాస్త్ర పాండిత్యమును ప్రదర్శించి యున్నారు.

మురారి కవిత్వము మిగుల ప్రౌఢము, సమాస జటిలమునై పండితైక వేద్యముగా నుండును. ఆత డనర్ఘ రాఘవమున

తత్త్వాద్భుగుజ్జ్వల కకుత్స్థ కుల ప్రశస్తి
సౌరభ్య నిర్భర గభీర మనోహరాణి
వాల్మీకి వాగమృత కూప నిపాన లక్ష్మీ
మేతాని బిభ్రతి మురారి కవేర్వచాంసి  1-'2

అను శ్లోకము ప్రసిద్ధము, అనన్యసాధారణము, ఉజ్జ్వలమునైన సూర్య వంశ రాజకులము ప్రశస్తి యొక్క సౌరభ్యముచే గంభీర మనోహరములైన తన వాక్కులు వాల్మీకి వాక్కనెడి యమృత కూపమునకు నిపానశోభను [నిపాన మనగా నూతి ప్రక్క కట్టబడిన తొట్టి] వహించునని చెప్పి యున్నాడు. దీనిని బట్టి వాల్మీకి రామాయణ మమృత కూపమనియు నందుండి యా యమృతమును గ్రహించుట కష్టమగుటచే మురారి యనర్ఘ రాఘవమను తొట్టిని గట్టి యందా యమృతమును నింపి సర్వసులభము కావించెననియు తెలియుచున్నది. యథా కూపాన్న్యూనం నిపానం తథా వాల్మీకి వచసేభ్యః కించిన్న్యూనాని మురారి వచనా నీతి భావః" అని దీనిని వ్యాఖ్యాతలు వివరించిరి.[13] ఇది మురారికి వాల్మీకి యెడగల భక్తిని సూచించుచున్నది. ఇతని వాక్కులు గంభీర మనోహరములగుటయు వాల్మీకి వాక్కులమృతతుల్యము లగుటయు సత్యమేకాని యతని కవిత్వము కంటె నీతని కవిత్వము సులభము మాత్రము కాదు. ఈతడు వ్యక్తము చేసిన భావములు గంభీరముగా నుండును. అచ్చటచ్చట నితడు మనోహరములైన యుపమోత్ప్రేక్షారూపకాదులగు నలంకారములను కూడ వాడి యున్నాడు. ఈతని వర్ణనములు కూడ నపూర్వములు నుదాత్తములునై కన్పట్టును. సుకుమార కవి "మాధుర్యైక భువాం మురారి వచసామాస్వాది యాస్వాదిమా" యని తన రఘువీర చరిత నాటకమున మురారి వాక్కులు

మాధుర్య శోభితములని వ్రాసి యున్నాడు. తెలుగున కాకమాని మూర్తి కవి 'మురారి కోమల పదంబు ప్రసాద' మనియు, రామరాజ భూషణుడు 'మురారి శయ్యే నేర్పు' అనియు ప్రశంసించి యున్నారు. కాకమాని మూర్తి కవి శ్లేష కౌఱకు కోమల పదంబు ప్రసాదము' అను పదములను వాడి యున్నాడు రుచి పతి వ్యాఖ్యలో మురారి కొన్ని శ్లోకముల నుటంకించి వానిలో ప్రసాదమను వాక్యార్థ గుణము కలదని చెప్పియున్నాడు. అల్పసంఖ్యాకము లగు నతని శ్లోక ములలో మాధుర్య ప్రసాదాది గుణములు గోచరించు మాట నిజమే అయ్యును మొత్తముమీద నతని కవిత్వము బహు శాస్త్ర విషయ సంప్రదాయ ప్రచుర మును, అపరిచిత ప్రౌఢ పదపూరితమునై పెక్కుచోట్ల సామాన్యులకు దురవ గాహముగా నుండునని చెప్పక తప్పదు

> హృదయా కలితా శేష శబ్ద శాసన సంవిదః
> మురారే రిహ శబ్దార్థ తత్త్వం కోవేద ? తద్వవ
> యే శబ్ద శాస్త్ర నిష్ణాతాః యే శీలిత నిఘంటవః
> తేషా మేవాధికారో౽స్తి మురారి కృత నాటకే

అను శ్లోకములను బట్టి శబ్ద శాస్త్ర నిష్ణాతులును, బహు నిఘంటువులను పరిశీలిం చిన వారును నగు పండితులకు మాత్రమే మురారి కృత నాటకమున నధికారము కలదని తెలియుచున్నది. ఈ అభిప్రాయము మిక్కిలి యథార్థము. ఆంధ్ర మహా కవుల యందొకడైన శ్రీనాథుడు బాణుని గద్య కావ్యముల శైలిని వలెనే మురారి శ్లోకముల శైలిని కూడ పెక్కుచోట్ల ననుకరించి యున్నారు.

> భూయస్తరాణి యదమూని తమస్వినీషు
> జ్యోత్స్నీషు చ ప్రవిరళాని తతః ప్రతీను
> సంధ్యానలేన భృశ మంబర మూషికాయా
> మావర్తితై రుడుభిరేవ కృతో౽య మిందుః [3 అం. 81 శ్లో]

పై శ్లోకమునం దద్భుతమైన యుత్ప్రేక్ష యున్నది. నక్షత్రములు కృష్ణపక్ష నిశలయం దతి ప్రచురముగను, శుక్లపక్ష నిశలందు స్వల్పముగను కానవచ్చు టచే సంధ్యాకాల రూపమైన యగ్నిచే ఆకాశ మను మూస యందు ద్రవీకృతము లైన నక్షత్రములచే చంద్రుడు పూరింప బడుచున్నా డని భావించుచున్నా మని

యందలి భావము. ఈ శ్లోకమును బట్టి మురారికి 'ఇందు మురారి' యను బిరుదము లభించెనని చెప్పుదురు. మాఘునకు ఘంటామాఘుడనియు, కాళిదాసునకు దీపశిఖా కాళిదాసుడనియు భవభూతికి శ్రీ కంఠుడనియు బిరుదము లున్నట్లు వినుచున్నాము.

## నా ట క క థ :

ప్రథమాంకము :

ఒకనాడు దశరథ మహారాజు కొల్వుండగా వామదేవు డరుదెంచి ఆతనికి వశిష్ఠుని సందేశమును వినిపించెను. ఆ సమయమున వశిష్ఠుని మహత్వము ప్రశంసింప బడెను. అంత విశ్వామిత్రు డరుగుదెంచిన వార్త తెలియగా దశరథ వామదేవులు సాదరముగా నాతని నాహ్వానించి పూజించిరి విశ్వామిత్రుడు దశరథ కృత ఘనకార్యములను, పరిపాలన నైపుణ్యమును ప్రశంసింప, దశరథుడు విశ్వామిత్రుని తపోమహత్వమును, ఆతని యపర బ్రహ్మత్వమును కొనియాడెను. దశరథుడు విశ్వామిత్రుని యాగమన కారణమును తాను నెఱవేర్ప వలసిన కార్యమును ఆనతీయవలసినదిగా కోరెను. అపుడు విశ్వామిత్రుడు తాను వైతానిక వ్రతదీక్షయం దుండునపుడు తపోవన రక్షణార్థమై శ్రీరాముని తన వెంట పంపవలెనని కోరెను. ఆ వార్త దశరథునకు పిడుగుపాటైనది. అర్థి కోర్కెల నీడేర్పకుండుట రఘువంశమున లేదనియు, అందును విశ్వామిత్రుని వంటి మహర్షి కోర్కెను కాదనుట రఘువంశమునకు కళంకమనియు దశరథుడు వితర్కించుకొని యెట్టకేలకు వామదేవుని ప్రోత్సాహముచే విశ్వామిత్రుని మాహాత్మ్యము మీద నమ్మకముచే శ్రీరాముని మహర్షితో పంపుట కంగీకరించెను. వామదేవుడు రామలక్ష్మణులకు విశ్వామిత్రుని పరిచయము చేసెను. వారు విశ్వామిత్రున కభివాద మొనరించిరి. విశ్వామిత్రుడు వారలను దీవించి దుష్ట రాక్షసులను శిక్షించుటకును, రావణాసుర సంహారమునకును విష్ణువే శ్రీరాముడుగా నవతరించినాడని భావించి తన్మయుడాయెను. దశరథుడు రామ వియోగ భారావనత శిరస్కుడై యుండ వామదేవుడు రామలక్ష్మణులను విశ్వామిత్ర మహర్షి వెంట నంపి వీడ్కోలు వడసి దశరథు నూఱడించుటకై తిరిగి వచ్చెను.

ద్వితీయాంకము :

శ్రీరామచంద్రుని దివ్యతేజముతో అహల్యకు శాపవిమోచనమైనది. కిష్కింధలో జాంబవంతుడు వాలి నతని తండ్రియగు నింద్రునికి శత్రువైన రావణాసురునితో స్నేహము వలదని వారించెను. వాలి జాంబవంతుని మాటలను బెడచెవిని బెట్ట సుగ్రీవ హనుమదాదులు జాంబవంతుని గూడి వారిని వీడి ఋష్యమూకమునకు చేరిరి చారుల వలన సుగ్రీవ విభేదము దెలిసికొన్న రావణుడు వాలి సాహాయ్యార్థమై ఖరదూషణాది రాక్షసులతో గూడిన కొంత సేనను బంపనది సముద్రోత్తర భాగమున విడిసెను. ఆ గుంపు నుండి వేయేనుగుల బలము గల తాటక విడివడి వచ్చి మునీశుల మానసములు తల్లడిల్ల తిరుగుచుండెను. రాక్షస వధార్థమై విశ్వామిత్రుడు శ్రీరామునికి 'బలాతిబలలను శక్తిద్వయమును, దివ్యాస్త్రములను గూడ ధారపోసి యుండెను.

మారీచ సుబాహులతో గూడి ఆశ్రమవాసులను బాధించు తాటకను చంపుమని విశ్వామిత్రుడు రాముని ఆదేశించెను. స్త్రీ వధ యనుచితమని రాముడు సందేహించుచుండ నుచితానుచితములు గురువునకు తెలియును, గనుక గుర్వనుజ్ఞను పాటించుటే కర్తవ్యమని లక్ష్మణుడును రామునకు సూచించెను. రామలక్ష్మణులు మారీచ సుబాహులను తాటకను సంహరించిరి. ముని సమాజము సంతసిల్లెను. స్త్రీ వధ యొనరించినందుకు రాముడు సిగ్గుపడెను. విశ్వామిత్రుడు రామునితో మిథిలానగర ప్రసంగము తెచ్చి, జనకుని చూచు నెపమున రామలక్ష్మణులు వెంట బయలు వెడలి రాగా మిథిలానగరమును ప్రవేశించెను.

తృతీయాంకము :

సీత పరిణయమునకు యుక్తవయస్కురాలయ్యెను. శివధనుర్భంగమును గావింప గలవాడు తన కల్లుడగునని జనకుడు తలంచెను. సీతను తన కిమ్మని యడుగుచు రావణుడు తన పురోహితుడగు శౌష్కలుని జనకుని కడ కంపెను.

రామలక్ష్మణులతో కూడి ఏతెంచిన విశ్వామిత్రుని జనకుడు సాదరముగ నాహ్వానించెను. రామలక్ష్మణులను జనకునకు విశ్వామిత్రుడు పరిచయము గావించెను. వారు తన కల్లుండ్రు గాదగిన వారని జనకుడు భావించెను. ఆ భావమును విశ్వామిత్రుడు పసిగట్టెను. రామలక్ష్మణుల పరాక్రమములను శ్రీరాముని ప్రత్యేక గుణములను వర్ణించెను. విశ్వామిత్రుని యాగరక్షణము గావించిన రామలక్ష్మణు

లను గాంచిన శతానందుడు సీతయు, నూర్మిళయు వారికి తగుదురని పల్కెను. జనకుడు సంతసించెను. శివధనుర్భంగము కావింప రాముడు సమర్థుడే అని విశ్వామిత్ర శతానందులు జనకునకు నమ్మకము గల్గించిరి జనకుడు శివధనుస్సును వారికి జూపెను ఆ సమయమున దశకంఠ పురోహితుడగు శౌష్కలుడు రాజు నాజ్ఞపై సభలోని కరుదెంచెను. తాటకను సంహరించిన రాముని గాంచి ఆతడు క్రుద్ధుడయ్యెను. అతడు రావణుని కొనియాడి, రావణుడు సీతను కోరుచున్నట్లు జనకునికి నివేదించెను. జనకుడు శివధనుర్భంగము కావించిన వానికే సీత దక్కునని చెప్పెను. శౌష్కలుడు, శివభక్తుడైన రావణుడు శివధనుర్భంగము చేయడని తెల్పెను. రాముడు శివధనుస్సు నెక్కిడెను. అందఱును ఆశ్చర్యము నొందిరి. శౌష్కలుడు చింతించెను. జనకుడు సీతను రామునికిచ్చుటతోపాటు ఊర్మిళను లక్ష్మణున కిత్తునని చాటి చెప్పెను. శతానందుని కోర్కెపై మాండవీ శ్రుతకీర్తులను, భరత శత్రుఘ్నుల కిచ్చుటకు జనకుం డంగీకరించెను. దశరథునకు శుభలేఖ పంపబడెను. శౌష్కలుడు జనక విశ్వామిత్రాదులను నిందించి, ఎట్లైన సీత రావణ గృహీత యౌనని పల్కి మిథిలయందలి వృత్తాంతమును రావణున కెఱింగింప వెడలిపోయెను.

చతుర్థాంకము :

రావణుడు సీతాపహరణము చేయ సంకల్పించెను. దానికి ఆతని మంత్రి యగు మాల్యవంతుడు ఉపాయముల నన్వేషించుచుండెను.

జాంబవంతుడు సుగ్రీవకుమారుని రాజుగా చేయదలచి వాలిని నిర్జించుటకు శ్రీరాముని సాహాయ్యము నపేక్షించి, ఒక తంత్రమును జేసెను. రామవనవాసమును కోరుచు, జాంబవంతుడు కైక రచించినట్లు ఒక మాయా లేఖను సృజించి దానిని మంథర శరీరమును దాల్చిన శబరి ద్వారమున పంపెను.

మిథిలా నగరమున దశరథుడును ఆతని బంధుమిత్ర పరివారమును, జనకుడును తత్పరివారమును, సకల ముని జన రాజన్యాది లోకమును రామ లక్ష్మణాదుల వివాహాలోకనానంతరము వేడుకతో నుండ రౌద్రోద్రేకముతో భూపతులు భీతిల్లునట్లుగా పరశురాము దేతెంచి, తన గురుదేవుడైన మహాదేవు విల్లు విఱిచిన రాముని ద్రుంచుట కుద్యమించెను. ఇచట పరశురాముని గుణగణ ప్రశంస చేయబడినది. రాముడు పరశురాముని క్షమింప వేడెను. పరశురాముని

జనక దశరథ మహారాజులు కూడ ప్రార్థించిరి. శతానందుడు పరశురామునికి కోపము తగదని మందలించెను. అయినను పరశురాముడు క్షత్రియజాతిని నిందించుచు తన్నిర్మూలనము కావింతుననెను. లక్ష్మణు డతని ధిక్కరింప రాము డనుజుని శమింపజేసి పరశురాముని శాంతింప గోరెను. పరశురాముడు శాంతింప లేదు. రామ పరశురాములకు సుదీర్ఘమైన సంభాషణ జరిగెను. రాముడు భార్గవునితో యుద్ధమునకు సిద్ధమయ్యెను. అప్పుడు పరశురాముడు రామునితో వైష్ణవ ధనువు నెక్కు పెట్ట రమ్మని పిలిచెను. అంత రాముడు సీతాదులెల్ల సంతసిల్లునట్లు వైష్ణవ చాపము భగ్నమొనరించెను. దశరథుడు పరశురాముని క్షమింప వేడెను. దానికి పరశురాముడు చిరునవ్వుతో 'రాముని దివ్యవైష్ణవ తేజమును గనదలంచి కోపించితిని కాని వేఱుగా'దని తెల్పి ప్రసన్ను డయ్యెను. పరశురాముని జనకాదులు పూజించిరి. పిదప యాజ్ఞవల్క్య జనక దశరథాదు లెల్లరును పరశురాముని వీడ్కొల్పిరి ఎల్లరును రాముని ప్రశంసించిరి. దశరథుడు రామునికి పట్టాభిషేక మొనరించి వానప్రస్థమును స్వీకరింప దలంచెను. అంతలో మంధర లేఖ తెచ్చెనను వార్త వచ్చెను. ఆ లేఖ సారాంశము వినిన జనక దశరథులు మూర్ఛిల్లిరి శైత్యోపచారములచే రాముడు వారిని తేర్చెను. ఆ లేఖను రాముడు కనుల కద్దుకొని సీతా లక్ష్మణ సహితుడై దశరథ జనకాదులు విలపించుచుండ వారికి ప్రదక్షిణము చేసి మిథిలానగరము విడిచి చనెను.

పంచమాంకము :

సీతారామలక్ష్మణులను గుహుడు పడవపై గంగానదిని దాటించి చిత్రకూటమునకు చేర్చెను. దశరథుడు మరణింప నా వార్తను రాముని కెఱిగించుటకై భరతుడు చిత్రకూటమున కరుదెంచి రాముని అయోధ్యను పాలింప రమ్మని వేడెను. రాముడు పితృవాక్య పరిపాలనకై భరతుడే రాజ్యమేల దగునని యతని నూఱడించి పంపెను. భరతుడు జటాధారియై శరభంగముని పంపిన రామపాదుకలను మణిపీఠముపై పెట్టి పూజించుచు తాను నందిగ్రామమున నుండి ప్రజలను పాలించుచుండెను. ఖరారి రాక్షసులు రాముని చంపుటకై విరాధుని పంపనతని రాముడు సంహరించెను. అగస్త్యముని ఆశ్రమమున నున్నప్పుడు సీత స్తనమును పొడిచిన కాకాసురునిపై రాము డస్త్రము ప్రయోగింప వాని కన్నొకటి

ప్రసిద్ధిదయ్యేను. పిదప నగస్త్యాది మును లనుపగా, సీతారామలక్ష్మణులు పంచవటిలో నుండిరి. శూర్పణఖ పంచవటిని చేరి రామునిపై వలపు ప్రకటింప లక్ష్మణుడు దాని ముక్కు చెవులను, మోవిని కోసెను. అంత ఖర దూషణాదులును రామునితో వైరము పూనిరి. రాక్షస వైరముచే రాముడు సుగ్రీవునితో మైత్రికి సిద్ధపడునని జాంబవంతుడు తలంచెను.

జటాయువు తన అన్నయైన సంపాతిని దర్శించి వచ్చుచుండ రావణుడు నీచుడైన మారీచునితో గూడి అరణ్యమున సంచరించుట చూచి వారివలన ఎట్టి ఆపద రాగలదో అని శంకించి ఆ వార్తను రాముని కెఱింగింప పంచవటిని చేరెను. అచట మారీచుడు కనకమృగమై రామలక్ష్మణులను దూరముగా గొనిపోవ రావణుడు భిక్షుకవేషమున జానకికడ కేతెంచి ఆమె మొర సరకు గొనక ఆమెను రథమునం దిడుకొని పోసాగెను. వానిని జటాయు వడ్డగించెను. రావణుడు పక్షీంద్రుని పక్షములను ఛేదించి సీతను గొని వెడలి పోయెను. జటాయువు రామునకు సీతాపహరణ వార్తను తెల్పి మరణించెను. సీతా విరహముచే కుందెడి రాముని లక్ష్మణుడోదార్ప యత్నించెను. అంతలో గుహుడు కబంధునితో పోరుచున్న ట్లతని పల్కుల వలన నెఱింగి రాము డతనికి తోడ్పడుటకై లక్ష్మణుని పంపెను. లక్ష్మణు డచటికి జని కబంధుని సంహరించి గుహునితో రాముని చేరెను. గుహుడు లక్ష్మణుడు వాలి చంపిన దుందుభిశవము నెగ జిమ్మెనని రామునితో చెప్పి యందువలన వాలితో విరోధము కలుగునేమోయని శంకించెను. సీతను రావణుడు కొనిపోవుచుండగా సీత వస్త్రఖండము నాకాశమున కెగసిన దానిని హనుమంతుడు గ్రహించి సుగ్రీవున కిచ్చెననియు, నద్దానినపు డా సుగ్రీవుడు రామునికి కానుకగా పంపెననియు, దానిని తెచ్చుచుండగా కబంధుడు తన్ను నిరోధించెననియు, గుహుడు రామునికి చెప్పి సీతావస్త్రము నొసంగెను. అద్దానిని చూచి రాముడు విచారక్రాంతు డాయెను.

అంత వాలి తన కీర్తికి ప్రతీకయైన దుందుభి శవము నెవ్వడెగజిమ్మెనని వీరాలాపములు పల్కసాగెను. సుగ్రీవుడు తమ కనుకూలుడై యుండుట యెఱింగి, అతనికి విరోధియు, మహాబల గర్వోద్ధతుడునైన వాలిని సంహరించి సుగ్రీవునితో మైత్రిచేసి శత్రువులను నాశమొనర్పవలెనను తన తలంపును రాముడు లక్ష్మణున కెఱింగించెను. దానికి లక్ష్మణు డట్టి వక్ర మార్గము కంటె

వాలితోనే మైత్రి చేసికొనరాదాయని యడిగెను. దానికి రాముడు, వాలి రావణు నవలీలగా జయించిన మహాబల గర్వితుడగుటచే నతడు పరుల మైత్రి నభిలషింప డనియు, సుగ్రీవుడు తమ వంశకర్తయైన సూర్యుని కుమారుడగుచు తన మైత్రి నపేక్షించు వాడు నగుటచే సుగ్రీవమైత్రియే యుపాదేయ మనియు తెల్పెను. వాలి రామ లక్ష్మణుల ఎదుట కేతెంచెను వాలి రాముని చూచి సంతసించి అవక్రపరాక్రముడగు నతనితో యుద్ధమాచరించుటకు నుత్సాహించెను. గుహుడు సుగ్రీవహనుమదాదులతో నేతెంచి వారిని రామలక్ష్మణులకు పరిచయము గావించెను. వెంటనే రాముడు వాలిపై నేసిన బాణము మున్ను వాలి పెకలించిన సప్త తాళములను ఖండించి, వాలి శరీరము చొచ్చి తిరిగి రాముని యంపపొది చేరెను. వాలి మరణమునకు కపిసేన యంతయు సంతసిల్లెను. జాంబవన్నీలాదులు సుగ్రీవుని రాజుగా నభిషేకింప రాము డతని గళమున పొందమ్మి మాల వేసెను. ఇంద్రాదులు రామునిపై పూలవాన గురియిరించిరి.

షష్ఠాంకము :

హనమంతుడు లంకను గాల్చెను. అతడు అక్షకుమారుని సంహరించెను. రావణుని వీడి విభీషణుడు రాము నాశ్రయించెను. వానరసేన వారధి బంధించి లంక ప్రవేశించెను. యుద్ధమున మేఘనాదుడు, కుంభకర్ణుడు సమసిన పిమ్మట క్రుద్ధుడై రావణుడు స్వయముగ రామునితో పోరునకు తలపడెను. రామరావణు లిరువురును పరస్పర ప్రయుక్త శస్త్రాస్త్రములను ఖండించుకొనుచు సమముగా పోరు సల్పిరి. రాముడు రావణుని కొన్ని శిరములను, బాహువులను ఖండింపగా నవి తిరిగి పుట్టుచుండెను. ప్రళయకారులైన దివ్య సాయకములను రాముడు సృష్టించి రావణుని శిరంబుల నన్నింటిని ఆకాశమున కెగుర వేసెను. రావణుని కబంధము ధరణి కూలెను.

సప్తమాంకము :

పరుల యధీనమున నివసించిన నింద తొలగుటకై సీత యగ్ని ప్రవేశించి పరిశుద్ధాత్మ యయ్యెను. చిరవియోగానంతరము సీతను గన్న రాముడు శోకహర్షములచే స్తంభీభూతుడయ్యెను. శ్రీరాముడు సీతాలక్ష్మణ సుగ్రీవాదులతో పుష్పకవిమాన మెక్కి అయోధ్యకు బయలుదేరెను. వారు మార్గమందలి

యనేక పర్వత మహానగరాదులను గురించి ప్రసంగించుచు అయోధ్యను చేరిరి. నగర వాసులు వారిని సాదరముగ నాహ్వానించిరి. రాముడు వశిష్ఠ భరతాదులకు విభీషణ సుగ్రీవాదులను పరిచయము గావించెను. శుభలగ్నమున వశిష్ఠుడు సీతా రాములకు పట్టాభిషేక మహోత్సవమును వైభవముగా జరిపించెను.

అనర్ఘరాఘవము – నామౌచిత్యము :

అనర్ఘమనగా అమూల్యము[14], పూజ్యము, దుర్లభము అను అర్థము లున్నవి. ఈ నాటకమున పరమ పూజ్యుడైన రాముని కథ చెప్పబడినది కావున ఇది అనర్ఘ రాఘవమైనది. రాముని కథ అమూల్యమైనదని మురారి చమత్కార యుతముగ నీ క్రింది శ్లోకమునం దిట్లు చెప్పి యున్నాడు.

"యదిక్షుణ్ణం పూర్వైరితి జహాతి రామస్య చరితం
గుణై రేతావద్భి ర్జగతి పునరన్యో జయతి కః
స్వమాత్మానం తత్తద్గుణ గరిమ గంభీర మధుర
స్ఫురద్వాగ్బ్రహ్మాణః కథ ముపకరిష్యంతి కవయః" 1–8

కవులు రాముని వలె గుణాఢ్యుడైన నాయకుని మఱియొకని గాంచ లేమని, వ్రాసిన యాతని కథనే మరల మరల వ్రాయ నుత్సహింతు రని పై శ్లోకము యొక్క స్థూలభావము.

"అనర్ఘః పూజ్యో రాఘవః యత్ర వర్ణితః తత్ అనర్ఘ రాఘవమ్"

అను విగ్రహముచేత పూజ్యుడైన రాఘవుడు దేనియందు నాయకుడో అది అనర్ఘరాఘవ' మని యర్థము.

"అమూల్యే దృశ్యతే నర్ఘ స్తథా పూజ్యే సుదుర్లభే"

అని నిఘంటువు. ఇట్టి సమాస పదములు ప్రసన్న రాఘవమ్ ఉదాత్త రాఘవమ్ ఉన్మత్త రాఘవమ్ అనునవి సంస్కృతమున గలవు. ఈ నాటకమును బిజ్జల తిమ్మ భూపాలు డిదే నామముతో ప్రబంధీకరించెను.

నాటక పరిశీలనము :

అనర్ఘ రాఘవము ఏడంకముల నాటకము. ఇందలి వస్తువు రామాయణ కథాత్మకము. ప్రఖ్యాతము. నాయకుడు ధీరోదాత్తుడు. రసము వీరము. అద్భుతము అంగము.[15] ఇందలి శైలి ఓజోగుణభరితము.

మురారి యనర్ఘ రాఘవ నాటకమునకు సంస్కృత పండితులలో విశేష గౌరవమున్నది. ఆంధ్రదేశమున నీ నాటకమున కధికమైన ప్రచారము కూడ కలదు. ఈ నాటకము పఠించినగాని సాహిత్య జ్ఞానము సమగ్రము కాదని పలువురు తలంతురు. మురారి యనర్ఘ రాఘవమున శ్లోకముల సంఖ్య హెచ్చు. వానిలో పెక్కు వర్ణనాత్మకము లైనట్టివి. కావ్యముగా దీనికున్నంత వైశిష్ట్యము నాటకముగా లేదని చెప్పవచ్చును. దీనికి ప్రదర్శన యోగ్యత లేదు. దీనిని చదువునపుడొక ప్రౌఢమైన ప్రబంధమును చదువుచున్నట్లుండును.

మురారి నాటకము కవిత్వపరముగనే మిగుల ప్రసిద్ధి చెంది యున్నను, విశ్వామిత్రుడు వచ్చి యజ్ఞ సంరక్షార్థము రాముని కొనిపోవుట మొదలు శ్రీరాముని పట్టాభిషేకము వఱకునుగల విపుల రామాయణకథను అతడు నాటకానుగుణముగ మలచుటలో ఉచితమగు నేర్పును ప్రదర్శించెనని చెప్పనగును. రాముడు వనవాసమున కేగుట సీతాపహరణము మున్నగు ముఖ్య రామాయణ ఘట్టములను నాటకమునందు దనుసంధించిన విధము వినూత్నమై యొప్పుచున్నది. మురారి మూల రామాయణ కథయందొనరించిన మార్పులు రమణీయములై యున్నవి.

## రామాయణ కథకు చేర్చిన నూత్నాంశములు :

1. నాటకమున రావణుడు సీరధ్వజుని యింట పెరుగుచున్న అయోనిజయైన సీతను తన కిమ్మని యడుగుటకై తన పురోహితుడగు శౌష్కలుని జనకుని యొద్దకు పంపును. అంత జనకుడు హరుని విల్లెక్కిడిన వారికే తాను మైథిలి నీయ నిశ్చయించితినని ప్రతివచనము పల్కును. అపుడు, పరమ మహేశ్వరుండగు రావణుడు శివుని విల్లెత్తుట నపచారముగా భావించి శౌష్కలుడు జనకుని వచనములకు కినుక వహించును. ఇంతలో రాముడు అవలీలగా హరుని విల్లు విఱుచును. రాముని పరాక్రమమును చూచి శౌష్కలు డచ్చెరువొంది రామునిచే తాటక వధ చేయించియు శివధనుర్భంగము నొనరింపజేసియు విశ్వామిత్రుడు రావణునికి బద్ధవిరోధియైనాడని తెల్పి జనకునిచే సీతను రావణున కిప్పించి యా తప్పు సవరించుకొనుట కదియే తగిన సమయమని యెఱింగించెను. ఈ వృత్తాంతము నెఱింగిన మాల్యవంతుడు సీత నపహరించు నుపాయమునకై వెదకును. రాముని మిథిలయందు కాని, అయోధ్యలో గాని జయించి సీతను

దెచ్చుట అసంభవము కాన సీతారాము లరణ్యమునకు వచ్చినపుడు రాముని మోసపుచ్చి సీత నపహరింప వచ్చునని నిశ్చయించెను.

రావణుడు సీత కొఱకై శౌష్కలుని జనకుని యొద్దకు పంపుటయను కథాంశమును కల్పించుట ద్వారా మురారి రామరావణ విరోధమున కొక బలమగు ప్రాతిపదిక నేర్పఱిచెను. హరభక్తుడగు రావణుడు శివ చాపము నెక్కిడుట పాపముగా దలంచి, అందులకు విముఖుడు కాగా, తత్కార్యమును రాముడొనరించుట కూడ ఇందులకుపబలక మగుచున్నది. అసాధారణమైన హరచాపము నెక్కిడిన రాముని ఓడించుట సులభము కాదు. కావున, అరణ్యమున పరివారమునకు దూరుడై యున్న అతనిని కపటోపాయమున జయించి సీత నపహరించవలెనను మాల్యవంతుని తలంపు సమంజసముగ నున్నది.

రాముని వనవాసమునకై మురారి కల్పించిన కథకూడ రమణీయముగ నున్నది. కిష్కింధలో వానర నాయకుడగు వాలికిని రాక్షస చక్రవర్తియైన దశకంఠునకును పెరుగుచున్న స్నేహమును గని కోతులకు, నెలుగులకు నాచార్యుడైన జాంబవంతుడు, వాలితో "రాక్షస జాతి మాయలమారి జాతి. రావణుడు నీ తండ్రియైన ఇంద్రుని జయించిన వాడగుటచే నీకు పితృవైరి. అంతేకాక ఆతడు మున్ను నీచే పరిభూతుడైన వాడు. ఆపదల యందు నీకు సాయమొనరింపజాలడు. మఱియు లంకకును, కిష్కింధకును నడుమ సముద్రమున్నది." అని తెల్పి అతనికి రావణ సఖ్యమును వీడుమని ఉపదేశ మొనరించెను. కాని వాలి యందులకు నిరాకరించెను. అంత జాంబవంతు నసుజ్ఞచే హనుమంతుడు సుగ్రీవ కుమారుని ఋశ్యమూకమునకు కొని తెచ్చెను. వాలిచే నిరసింపబడిన క్షీణులు, లుబ్ధులు, పట్టణము నుండి వెడల గొట్టబడినవారు నగు ప్రాకృత జనులు కిష్కింధకు సుగ్రీవ కుమారు నభిషేకింప నుత్సహించుచుండిరి. భరతుని క్షేమమును తెలిసికొనుటకై కైకేయి పంపగా మంథరయను దాసి మిథిలకు జనుచు వడదెబ్బచే మార్గమధ్యమున ప్రాణములను గోల్పోయినదని హనుమంతుడు తెలుపగా నెఱింగిన జాంబవంతుడు మతంగాశ్రమము నందున్న శ్రమణ యను సిద్ధ శబరిని చేరి ఆమెను మంథరా దేహమున ప్రవేశించి రాముని వనవాసమున కంపుటయు, భరతునికి పట్టాభిషేక మొనరించుటయు రెండును తన కోర్కెలుగా కైకేయి దశరథునకు పంపినట్లు తాను సృష్టించిన లేఖను దశరథునకందింపు మని కోరెను. మంథరా దేహమును శబరి వీడునంతవఱకు ఆమె

దేహమును హనుమంతుని రక్షణమున నుంచెను. ఇట్లు జాంబవంతుడు సుగ్రీవుని సింహాసనమున అధిష్ఠింపజేయ దలచి వాలిని నిర్జించుటలో రాముని సాహాయ్యము నపేక్షించి, రాముని అరణ్యమునకు రప్పించుటకై కై కేయి రచించినట్లుగా నొక మాయా లేఖను సృజించెను. దానివలన మిథిల నుండియే రాముడు సీతాలక్ష్మణులతో కూడి వనవాసమున కేగెను. రామాయణమునకు భిన్నముగా మురారి పై వృత్తాంతమును కల్పించుట కథకెంతయో రామణీయకము నాపాదించుచున్నది. జాంబవంతు డిట్టి లేఖను కల్పించుటచే తద్ద్వారమున రాముడు వనవాసమున కేతెంచుననియు, అచట రావణుడు మాయోపాయముచే సీతనపహరింప వచ్చుననియు మాల్యవంతుడు ఆలోచనను చేయుట అతని రాజనీతిజ్ఞతను చక్కగ చాటుచున్నది. తమకు ప్రీతిపాత్రుడైన వానిని రాజుగ చేయవలెనని జాంబవంతుడు గావించిన ప్రయత్నమును, తమ రాజు నభీష్టమును నెఱవేర్పవలెనని మాల్యవంతుడు గావించిన పన్నుగడయు వారి వారి కార్యకుశలత్వమును తెల్పుచున్నవి. దీని మూలమున నాటకకర్త రాజనీతి కుశలుడనియు తెలియవచ్చుచున్నది. భవభూతి విరచిత మహావీర చరితమను నాటకమందు వలెనే యిందు కూడ రామవనవాస ప్రసక్తి మిథిలానగరముననే కొనితేబడినది.

ఇట్లు మురారి రామాయణేతి వృత్తమునకు నాటకీయతను ఆపాదించుటకై గావించిన ప్రయత్నములలో ఈ క్రింది ఘట్టములు కూడ పేర్కొనదగి యున్నవి.

ఈ నాటకము దశరథునికి గురుదేవుడగు వశిష్ఠుడు వామదేవునిచే నాతడు 'అర్థుల కోర్కెలను తప్పక సమకూర్పవలెనని' ఆదేశమిచ్చి పంపుటతో నారంభమగుచున్నది. వశిష్ఠుడు దశరథున కిట్టి ఆదేశము నిచ్చుట విశ్వామిత్రుడు రాముని దశరథుని యొద్ద నుండి తోడ్కొని పోవనేతెంచుచున్నాడను భావి కథార్థమును సూచించుచున్నది. ఇక విశ్వామిత్రు డేతెంచి దశరథునితో రాముని తనతో పంపవలసినదని కోరగా దశరథుడు రాముని పంపుటకు తన చిత్తమంగీకరింపకున్నను "విశ్వామిత్రు నంతటి వాడు వచ్చి యాగరక్షణార్థమై శ్రీరాముని పంపుమని కోరినపుడు నిరాకరించిన, మహర్షి వెడలిపోయి, తన తపోధనము నందలి ఒక అల్పభాగముచే యాగ విఘ్నములను తొలగించుకొని, యజ్ఞమును పూర్తి గావించుకొనును. అంత రఘుకులమున కపకీర్తి వాటిల్లును"[16] అని తన ఉచితజ్ఞతను ప్రకటించి రాముని పంపుట కంగీకరించెను. ఈ ఘట్టము దశరథుని శీలమునకు వన్నె కలిగించుచున్నది.

కవి అహల్యా శాపవిమోచన వృత్తాంతమును విశ్వామిత్ర శిష్యులగు శునశ్శేఫ పశుమేఢ్రులచే హాస్య రసోపేతముగ చెప్పించుట రమ్యముగ నున్నది. అట్లే మూడవ అంకమున కంచుకికిని అంతఃపుర దాసియగు కలహంసికిని జరిగిన సంభాషణము వలన సీత యౌవనవతియైన వృత్తాంతము సరసముగ సూచింపబడినది.

మురారి వాలి వధ వృత్తాంతమును కూడ భిన్న విధమున రచించి రాముని శీలమునకు వన్నె కలిగించెను. రామాయణము నందువలె రాముడు చాటుననుండి బాణము వేసి వాలిని వధించుట యిందు లేదు. జాంబవంతుని పలుకులచే రెచ్చగొట్టబడిన వాలి తనకు తానై వచ్చి రామునితో యుద్ధమునకు తలపడి రాముని ద్వంద్వ యుద్ధము చేయుటకు రమ్మనును. రాముడు వాలిని యుద్ధ మొనరించుటకు తగిన సాధనముతో రమ్మనును. అంత వాలి "వానరులకు ఇనుముతో చేసిన ఆయుధములతో పనిలేదు. అఱచేతులు, పిడికిళ్ళు గోళ్ళు అవియే వారికి సాధనవ్రాతము"లని తెలుపును. వారిరువురకును యుద్ధమారంభ మగును. రాముడు వేసిన బాణము వాలిని దునుమును. ఇందు రాముడు చాటుగా వాలిని వధించెననెడి నింద తొలగినది. వాలి తనకు సాటియగు ప్రతివీరునితో పోరు సల్పవలెనను తలంపుతో రాముని తనకుతానై యుద్ధమునకు ఆహ్వానించుట అతని అకలంక శౌర్యమును చాటుచున్నది.

మురారి దీర్ఘమగు రామాయణ వృత్తమును నాటకేతివృత్తముగా గొనియున్నందున అందు రంగస్థల ప్రయోగ యోగ్యములు గాని పెక్కు ఘట్టములను వివరించుటకై అర్థోపక్షేపకములను కూర్చెను. ప్రథమ సప్తమాంకములందు తప్ప మిగిలిన అంకములన్నిటి యందును విష్కంభకములు ప్రయుక్తములైనవి. అతడు యుద్ధమునంతను హేమాంగదరత్నచూడుల సంభాషణము ద్వారా ప్రకటించెను.

బిజ్జుల తిమ్మ భూపాలుడు :

తిమ్మ భూపాలుడు క్రీ.శ. 17వ శతాబ్దిలో ప్రాకటూరు రాజధానిగా చేసికొని యలంపూరుసీమను పరిపాలించెను. ఇతని యింటిపేరు బిజ్జుల వారు. "కాలచుర్య వంశీయుడైన బిజ్జులరాయడు పశ్చిమ చాళుక్య వంశమునకు చెందిన తైలపదేవుని జయించి కల్యాణి యందు తన విజయధ్వజము స్థాపించెను. తరు

వాత మంత్రియైన బసవేశ్వరుని ప్రేరణచే నతడు శైవమతమును స్వీకరించు టయే కాక దేశము నందంతట నా మతము వ్యాపింప చేయుటకు ప్రయత్నించెను. అనంతరము కలిగిన విప్లవము వలన బిజ్జలుడు రాజధానియందు నిలువ లేకపోయెను. అది కారణముగా కాలచుర్యులు పెక్కు స్థలములు తిరుగుటయే కాక అందినంత వరకు ప్రతి ప్రాంతమునందును శైవమును వ్యాపింపచేసి వానిని తమ యేలుబడి క్రిందికి తీసికొనుచుండిరి. ఆ సందర్భమున వారలంపూర్ ప్రాంతమును గూడ స్వాధీనము చేసికొన్నట్లు శాసనముల వలన తెలియుచున్నది. అలంపూరు నందలి సూర్యనారాయణ స్తంభముమీది బిజ్జలుని కుమారుడైన భుజబల మల్లుని కాలమున నొక వర్తక సంఘము చేసిన దానమును సూచించు నొక శాసనమున్నది. ఈ కారణముచే బిజ్జలుని వంశీయులే కాలక్రమమున బిజ్జులవారై యుందురనియు లేక వీర శైవ మతానుయాయులు కొందఱీ మతమును వ్యాపింప చేసిన వారిలో ముఖ్యుడైన బిజ్జలుని పేరును తమ వంశనామముగా పెట్టుకొని యుందురనియు, అలంపూరు ప్రాంతమునందలి వీరశైవ మతాభిమానులైన రెడ్డి కులజులు కూడ బిజ్జల పదమును గృహనామముగా గ్రహింపగా కాలక్రమమున నిది 'బిజ్జుల' గా మాఱి యుండుననియు, అలంపూర్‌లో నున్న జంగమ మతాధిపతులు బిజ్జలరాయని చిహ్నముగల ఘంటా శంఖములను ధరించి వానికి సంస్కారము చేయవలసి వచ్చినపుడా వంశీయులచేతనే చేయించుకొను చుందురనియు" ననర్ఘ రాఘవమునకు పీఠికను వ్రాసిన శ్రీ కేశవ పంతులవారభిప్రాయపడుచున్నారు.[17]

తిమ్మభూపాలునిది మొటవాడ కులము. దానికి మూలపురుషుడు బిజ్జుల దాదన భూపాలుడు. దాదన కుమారుడు కుప్పవిభుడు. ఈతనికి ఎఱకొండక్ష్మాకాంతమౌళి చెన్న క్షితిపతి యను నిరువురు కుమారులు. వీరిలో ఎఱకొండ భూపాలుడు గ్రంథకర్త ముత్తాత. చెన్నక్షితిపతి మనుమడగు కొండనృపతి గాయగోవాళ, గేయాధిరాయ, గండరాదిత్య, గండభేరుండ, ఖడ్గ నారాయణాది బిరుదములను వహించెను. కర్నూలు నగరమున గల కొండారెడ్డి బురుజీకొండ భూపాలునికి సంబంధించినదై యుండునని విమర్శకుల యూహ.[18] అందుకీ వంశము వారు బిజాపురపు నవాబుల యనుమతిచే నలంపూరు, కర్నూలు మండలముల నేలి యుండుట కారణము.

గ్రంథకర్త తాతయగు పెద్ద తిమ్మభూపాలుడు గొప్ప కీర్తిశాలి ఈ వంశమునకు వెలుగు చూపిన వాడితడు. ఇతనికి 'గండభేరుండ', 'రాయవేశ్యాభుజంగ' యను బిరుదములు గలవు. ఇతడు బిజాపూరు నవాబు మన్నన పొంది యుండెను. వారి యభిమానము సంపాదించి ఇతడు ఆలంపూరు, కందనోలి (కర్నూలు) సీమలను 'సర్‌నాడగౌడు', సర్‌దేశాయి పదవులతో పాలించుచుండెను. పెద్ద తిమ్మభూపాలుడు ఆర్జించిన ఈ పదవులతోడి యధికారము ఆతని కైదుతరముల వఱకును కొనసాగినది. ఈ తిమ్మ భూపాలునికి కృష్ణ భూపాలుడను కుమారు డుదయించెను. ఈతడే అనర్ఘ రాఘవ కృతికర్తకు తండ్రి.

తిమ్మభూపాలుడు మిక్కిలి పరాక్రమవంతుడు. అతడు సిద్ధియంబరు రాహుత్తుల సంహరించెను. తురకలను, ఖానులను, ఆబిసీలను, యవనులను పరిమార్చెను. ఇతడు పికిలి చెన్నధీరు నోడించి విజయలక్ష్మిని పరిగ్రహించెను. ఈ పికిలి చెన్నక్ష్మాపాలుడు విజయనగర రాజుల పక్షమున బిజాపురపు నవాబులతో పోరాటము సలిపిన వారిలో నొకడు.[19] తిమ్మభూవరుని పెద్ద భార్యయగు అక్కమాంబ చింతకుంట ధర్మరాజేంద్రుని కుమార్తె. 'జనుపల్లి వారైన గోపాలుపేట సంస్థానపతుల పాలనము క్రింద నొక చింతకుంట కలదు. రాజా దేవరరావు అనునతడు పానుగల్లు జిల్లామీద నుండినట్లు ఆకాలపు దానపత్రములు తెలుపుచున్నవి. అతని బంధువులలో నెవ్వరైన నీ చింతకుంటలో నుండిరేమో ! చింతకుంటకు పానుగల్లు నాలుగైదు మైళ్ళ దూరము మాత్రమే. చింతకుంటలో ఒక శిథిలమైన బురుజుకోట, పేటయను విభాగములు ఉండుటచేత తిమ్మభూపాలునికి సమకాలికుడై జనుపల్లి వారికి దగ్గర బంధువై ధర్మరాజను పేరుగల ఒక చిన్న భూపతి యుండెనేమో! ఇంతకన్న ఈ చింతకుంట ధర్మరాజును గుఱించి ఎక్కువ తెలియవచ్చుట లేదు. అతని కూతురైన అక్కమాంబను గూర్చి అనర్ఘ రాఘవము గొప్పగా చెప్పుచున్నది.[20] తిమ్మభూపాలుడు తనకు అక్కమాంబ వలన జనించిన కుమారు లిరువురిలో నొకనికి ధర్మభూవరుడని పేరిడుటచే అతనికి అక్కమాంబ యందును, ఆమె తండ్రియందును గల గౌరవము వ్యక్తమగు చున్నది.

**అనర్ఘరాఘవము నందు వివరింపబడిన బిజ్జుల తిమ్మభూపాలుని వంశావళి ఇది :**

- బిజ్జులదాదన
  - కుప్పన
    - ఎఱగొండ
    - పాలుడు (పెద్దమాచమ)
    - చిన్నక్షితిపతి (చినమాచమ)
      - పెదతిమ్మ
      - పాలుడు (కామమాంబ)
        - కృష్ణనరపాలుడు (బచ్చమాం
        - తిమ్మభూపాలుడు భార్యలు
          - అక్కమా
          - పౌరమాంబ
      - చినతిమ్మ భూపాలుడు (భార్య లింగమాంబ
        - ప్పనృపుడు రంగనరేంద్రుడు కొండధరణీకాంతుడు కృష్ణాధిపుడు
        - భార్యలు
          - గోపమ
          - బక్కమ
          - రంగమ
          - జక్కమ

అప్పనరామ-(జక్కాంబ) కృష్ణభూపాలుడు

- యాగభూపాలుడు (అచ్చమ, లక్ష్మాంబ)
  - కృష్ణభూపాలుడు భార్యలు లక్ష్మాంబ, తిమ్మాంబ
  - బచ్చభూపాలుడు
  - లచ్చమ
  - తిమ్మాంబిక
    - జగ్గభూపాలుడు
    - రామనృపతి
- కృష్ణ
- తిమ్మన
- వెంగన

- ధర్మభూపాలుడు శేషమ
- కొండభూపాలుడు (సీతమ, కృష్ణమ
  - వెంకటరమణ భూపాలుడు
  - నారసింహా

ఇంతవఱకు అనర్ఘరాఘ మున వర్ణింపబడిన వంశక్రమము. తరువాత నా వంశ ములో వెలసిన వారి యుదంతము 1565 మార్చి నెలలో వ్రాయబడిన కైఫీ యతు వలన తెలియుచున్నది. అది బిజ్జుల నారసింహరెడ్డి వర్ణనతో నారంభ మగుచున్నది. ఈ నరసింహరెడ్డి తిమ్మభూపాలుని కుమారుడైన నరసభూపా లుడు కాడనియు తిమ్మ భూపాలుని కైదవతరము తరువాత నుండిన వాడనియు శ్రీ గడియారం రామకృష్ణశర్మ గారు అలంపూరు శిథిలములను గ్రంథమున వ్రాసి యున్నారు. ఈ నరసింహారెడ్డికి కొండారెడ్డి యను కుమారుడుండెను. అతనికి అలంపూరు వతన్, అమరాబాద్‌వతన్ అనునవి యనుభవమున నుండెను. కొండారెడ్డి మరణానంతరము అతని భార్యయగు లక్ష్మీదేవమ్మకును, తల్లియగు వెంకమ్మకును, మనఃస్పర్థలు చెలరేగుటచే సర్కారువారి యాజ్ఞ చొప్పున వచ్చిన జాఫ్రాబాద్ మహమ్మద్‌ఖాన్ వెంకమ్మకు అలంపూరు సేరీ భూములు, కరోడ్‌గిరీ సుంకము క్యాతూరు సేరీ, మారాముగాల జాగీరు అనువానిని మాత్రమిచ్చి మిగిలిన జాగీర్లు దేశముఖీ రుసుము మున్నగువాని ఋణము క్రింద తానే గ్రహించెను. అతని పాలనములోనే తాలూకా జాగీరు జరుగుచుండెను. తరువాత సర్కారు వారి యానతిని అమీన్‌సాహెబ్, అరబ్ జమాదార్లు లక్ష్మీదేవమ్మను వెంటబెట్టుకొని వచ్చి వెంకమ్మగారి యనుభవములో నున్నదికాక ఎల్లైపాడు జాగీరును చెరి సగముగా పంచి యిచ్చిరి.

వెంకమ్మ మారాముగాలలోను, లక్ష్మీదేవమ్మ గారు ప్రాగటూరికోను ఉండి తమ తమ భాగముల ననుభవించు చుండిరి. పిమ్మట లక్ష్మీదేవమ్మగారు జ్ఞాతియైన రామారెడ్డి కుమారుని దత్తునిగా గ్రహించి తన యాస్తిసంతను అరబ్ జామేదారు సాహెబుతో సనదు చేయించి వచ్చెను ఆ కుమారుని పేరు నరసింహా రెడ్డి. లక్ష్మీదేవమ్మగారు మరణించిన పిమ్మట మారం రంగయ్య తన పెద్ద కుమార్తె అయిన చిన్నమ్మను నరసింహారెడ్డి కిచ్చి సంస్థాన విషయముల నన్నిం టిని పరిశీలించు చుండెను. పిమ్మట అనారోగ్య జ్ఞాతి వైరములచే నరసింహారెడ్డి మరణించెను. తరువాత సంస్థానపు వ్యయ మధిక మగుటచే మారం రంగయ్య సిబ్బందిని తగ్గించెను. రాణి చిన్నమ్మ రుద్రమదేవి, ఝూన్సీలక్ష్మీబాయి మున్నగు వారివలె మిక్కిలి ధైర్య సాహసోపేతురాలయ్యు జ్ఞాతులును, వారి పక్షము వహించిన ఇతరులును, పెట్టిన కష్టములను భరింపజాలక, చివరకి ప్రాణాపా యము కలుగునన్న భయముచే పతాను స్త్రీ వేషము ధరించి ప్రాగటూరు విడిచి

అప్పటి కర్నూలు నవాబు నాశ్రయించెను. అతడు ఆమెకు న్యాయము చేసెదనని అభయమిచ్చి తుంగభద్రానది ఉత్తర తీరముననగల గ్రామమున సపరివారముగ నివసింపుమని నియోగించెను. ఇంతలో దురదృష్టవశమున ఇంగ్లీషు వారు కర్నూలు నవాబును బందీకృతుని గావించి ఆ పరగణాను స్వాధీనము చేసికొనిరి. చిన్నమ్మ శత్రువులు చంపుదురేమో అని భయపడి గద్వాల సంస్థానమునకు చెందిన అయిజసోంపురమను గ్రామమును చేరి అగ్రహారికులును, రాజా చందూలాల్ బహద్దుర్ వారి గురువులును అయిన గోపాలకృష్ణాచార్యుల వారి రక్షణమున నివసించుచుండెను. గురువు గారి యందలి భక్తిచే చందూలాల్ గారు చిన్నమ్మ వ్యవహారము విచారించి ఆమెయే నిజమైన వారసురాలని తెలిసికొని అలంపూరు తాలూకా దేశముఖీవతను, అమరాబాదు తాలూకా దేశముఖీవతను అనువానిని ఆమెకు సనదు నిచ్చెను. చిన్నమ్మకు వతను స్వాధీనము కాకముందే గోపాలకృష్ణాచార్యుల వారు మరణించుట వలన చిన్నమ్మకు పల్లెపాడు గ్రామమును మఱికొన్ని సేరీలను మాత్రమే దక్కెను. ఆమె తరువాత జటప్రోలు సంస్థానములోని చిన్నమరూరు గ్రామమందలి సగోత్రుడైన ఒక బాలుని దత్తునిగా గ్రహించి అతనికి వేంకట ధర్మారెడ్డి అని పేరు పెట్టెను. తరువాత ప్రభుత్వములో కల్గిన కొన్ని మార్పుల వలన పోయిన సంస్థానము మరల చిన్నమ్మకును ఆమె దత్తపుత్రునకును లభించలేదు. ఆమె పల్లెపాడు గ్రామమునందు భవనమును నిర్మించుకొని దత్తపుత్రునకు వివాహము గావించి అంతటితోనే తృప్తి నొందెను. ధర్మాత్ముడైన వెంకట ధర్మారెడ్డికి నరసింహారెడ్డి, అనంతారెడ్డి అను నిరువురు పుత్రు లుదయించిరి. వీరిలో నరసింహారెడ్డి సౌశీల్యావినయాది గుణముల కాటపట్టు. ఆయన పల్లెపాడు గ్రామమున చెఱువులు త్రవ్వించియు, దేవాలయములు నిర్మించియు, అపారమైన కీర్తి నార్జించెను. ఆయన బాబాసాహెబు పేట యందలి చెన్న కృష్ణారెడ్డి గారి పుత్రికయగు సీతమ్మను వివాహమాడెను. ఆ పుణ్య దంపతులకు చంద్రశేఖరరెడ్డిగా రుదయించిరి. వారు బహుభాషలయందే కాక న్యాయశాస్త్రము నందు కూడ నిష్ణాతులై వనపర్తి సంస్థానమున చాలకాలము మునసబుగా పనిచేసిన లక్ష్మీకాంతరెడ్డి గారి కుమార్తె సరస్వతమ్మ గారిని పెండ్లాడిరి. వారు మిక్కిలి ఉదారులై జాగీరుకు పేరు ప్రతిష్ఠలు సమకూర్చిరి. వారు హైదరాబాదు నందలి రెడ్డి విద్యార్థి వసతి గృహమునకు, మదనపల్లి యందలి థియసాఫికల్ కళాశాలకు గొప్ప విరాళము లొసంగు

టయే కాక పలువురు బ్రాహ్మణులకు భూదానములు గావించిరి. వారే మొట్ట మొదటిసారి 1931 లో అనర్ఘ రాఘవ కావ్యమును ముద్రింపించిరి. వారికి గోవర్థనరెడ్డి, జనార్దనరెడ్డి అను కుమారులును ఇందిరమ్మ అను కుమార్తెయును కలిగిరి చంద్రశేఖరరెడ్డి గారి సవతి తమ్ముడైన రామేశ్వరరెడ్డిగారు పల్లెపాడు లోనే ఉందురు. సంస్థానములును, జాగీరులును, భారత ప్రభుత్వము వశము చేసికొను పఱకును బిజ్జుల వంశము వారు జాగీరుదారులుగను దేశముఖులుగను నుండిరి. ఈ వంశము వారు పలువు రిప్పుడు కూడ విద్యావంతులు, సంఘసేవా పరాయణులునై వంశప్రతిష్ఠను నిలుపుచున్నారు.

అనర్ఘరాఘవ ప్రబంధ ప్రథమ ముద్రణపు ప్రతు లలభ్యమగుటచే, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు మరల దానిని శ్రీ కేశవపంతుల నర సింహశాస్త్రి గారు రచించిన విపుల పీఠికతో ముద్రించి యున్నారు.[21]

కృష్ణకవి :

తిమ్మభూపాలుడు రామేశ్వర స్వామి ఉత్సవమునకు నానాదేశములనుండి అరుదెంచిన విద్వజ్జనాదులకు వివాద శ్రవణముచే కలుగు విసువును తొలగించు టకై రసవంతమైన కావ్యమును వ్రాయ నిశ్చయించి

చ. ఆయతమతి కృష్ణసత్కవి సహాయ కవిత్వమునన్ సమాజ సం
తత భజనాదరుండనగు నాకు నశేష విశేష వైదుషీ
ప్రతిభ కరస్థలామలక భాస్వరమై తనరారుటబ్రమే ? 1-22

అని చెప్పెను. దీనినిబట్టి కృష్ణ సత్కవియను మహాకవి యొకడు కావ్యరచన మున నతనికి సాయమొనరించెనని తెలియుచున్నది. ఈ కృష్ణకవిని గూర్చి విశే షము లంతగా తెలియవు. ఇతని పితామహుడు పేరమహాసత్కవిని తిమ్మ భూపాలుడు వర్ణించి యున్నాడు.[22] ఇతడు ధవళ శంఖముల కాంతియు, పగలు కూడ దివిటీలును వెలుగొందు సాటిలేని సారస్వతమనెడి నిర్మలమగు అమృత ప్రవాహములో విలసిల్లు కెరటములకు సముద్రుడై పండితులచే స్తుతింపబడు చుండెను. 'దీప్త మరీచిన్ బవదంపు గెంపు బవలున్ బంజుల్ వెలుంగొంద' అని తిమ్మభూపాలుడు వ్రాయగా శ్రీ నరసింహశాస్త్రిగారు పగడాల పావుకోళ్ళు కూడ నాతని కుండెనని వ్రాసియున్నారు. ఆ అర్థము వచ్చు పదములీ పద్య మున కనరావు. కృష్ణకవి తండ్రిని గూర్చి కాని కులగోత్ర నివాసాదులను

గూర్చి గాని తిమ్మభూపాలుడేమియు చెప్పియుండలేదు. తిమ్మభూపాలుని కాలమున అలంపూరు, బోరవెల్లి సంస్థానములు కవులకు కాణాచులుగా నుండినట్లు కాణాద పెద్దన, బోర్వెల్లి నరసింహకవి కృష్ణప్ప మొదలైన వారి రచనలవలనను ఇతర కవులు వారని పేర్కొనుట వలనను తెలియుచున్నది.[28] పానుగంటిపురము నేలిన బోయినపల్లి కుమార వెంకట రాయలు, తాను రచించిన ద్రౌపదీ కల్యాణమున, తన గురువైన బోరవెల్లి నరసింహ కవి వంశమును వర్ణించుటయే కాక అతడు సౌపర్ణకాఖ్యానమును రచించి అలంపుర నరసింహస్వామికి అంకితము చేసినట్లు కూడ తెల్పి యున్నాడు. ఈ నరసింహకవి తరిగొప్పుల మల్లన వంశము వాడని కొందఱూహించిరి. మల్లన్న కుమారుని పేరు తెలియరాదు కాని అతని మనుమని యొక్కయు మనుమని కుమారుని యొక్కయు, అతని కుమారుని యొక్కయు నామములు తెలియుచున్నవి.

తరిగొప్పుల మల్లన్న
|
దత్తప్ప
|
కృష్ణప్ప
|
నరసింహకవి

వీరిలో దత్తప్ప శబ్దశాస్త్రము నందు గొప్ప పండితుడు. కృష్ణప్ప యయాతి చరిత్రను రచించెను. అది కాని అతని కుమారుడైన నరసింహ కవి రచించిన సౌపర్ణకాఖ్యానము కాని లభింపక పోవుటచే వారిని గూర్చి విశేషములు తెలిసికొనుట కవకాశము కలుగకున్నది. నరసింహ కవి తండ్రియైన కృష్ణప్పయే తిమ్మభూపాలునికి సాహాయ్య మొనరించిన కృష్ణ సత్కవియని కొందఱి తలంపు. ద్రౌపదీ కల్యాణమున కుమార వెంకట రాయలు, తిమ్మభూపాలుడు మహాకవి యనియు, నిస్సమ సారస్వత నిర్మలామరఝురీ జాగ్రత్తరంగాబ్ధి యనియు, పేర్కొన్న పేర కవిని గూర్చి ఏమియును చెప్పి యుండలేదు. అంత మహాకవిని గూర్చి అతడేమియు చెప్పి యుండక పోవుటచే అతడు తరిగొప్పుల వంశీయుడగునో కాదో నిర్ణయించుటకు వీలులేకున్నది. ద్రౌపదీ కల్యాణము ననుసరించి కృష్ణప్ప తండ్రి దత్తప్ప కృష్ణప్పయే కృష్ణ సత్కవియైనచో నతడే పేరమహాకవియై యుండవలెను. 'కృష్ణ సత్కవి అలంపూరు రాజుల పాల

నమునందే యుండిన బోరవెల్లి గ్రామవాసిగానో, ప్రాగటూరు నగరవాసిగనో, లేక అలంపూరు పరగణాకు చెందిన మఱియొక గ్రామమునకు చెందిన వాడుగనో ఉండి బిజ్జుల వారి మన్ననకు పాత్రుడై యుండునని ఊహింపవచ్చును. మఱియు తిమ్మభూపాలుడు కృష్ణప్ప అని పేర్కొనక కృష్ణ సత్కవి అని పేర్కొని యుండుటచే వారిరువురును భిన్నులై యుందురని అనుమానము కల్గుచున్నది. ఈ కృష్ణసత్కవి తిమ్మభూపాలునికి కావ్యరచనలో నధికముగా తోడ్పడి యుండును. తిమ్మభూపాలు డాతని సాహాయ్యమును కృతజ్ఞతతో స్మరించి యున్నాడు. ఇది ఆ రాజకవి విశాల హృదయమునకు తార్కాణము. అతడు పేర్కొని యుండనిచో కృష్ణకవి మాటయే స్మరించుట కవకాశముండెడిది కాదు. అనర్ఘరాఘవ రచనను బట్టి చూచినచో నీ కృష్ణకవి సామాన్య కవి కాక తర్క వ్యాకరణాలంకార శాస్త్రములను వేదశాస్త్ర రహస్యములను ఎఱింగిన మహాకవిగా కనవచ్చును. బహుశః ఇతడు తిమ్మభూపాలుని ఆస్థానమున కవియై యుండ వచ్చును. పండితైక వేద్యమైన మురారి నాటకమును తెనిగింప బూనుట సామా న్యులకు సాహసకార్య మగును. కృష్ణకవి సాహాయ్యము లభించుటచే తన కది కరతలామలకమని తిమ్మభూపాలుడు భావించుట ఆ మహాకవి అశేష విశేష వైదుషీ ప్రతిభను జెప్పక చెప్పుచున్నది. ఈ కృష్ణ సత్కవి మురారి నాటకము నందలి ప్రతి వాక్యమును ప్రతి శ్లోకమును తిమ్మభూపాలునికి వివరించి చెప్పి యాతనిచే రచన చేయించి తాను దానికి మెఱుగుపెట్టి యుండును. లేదా కావ్య మంతయు తానే రచించి తిమ్మభూపాలుని పేరుపెట్టి యుండును. తిమ్మభూపా లుడే ఈ కావ్యమును స్వయముగా రచించినచో నతడు శ్రీనాథ పెద్దనాదుల కోవకు చెందిన మహాకవి యని చెప్పుటకు సందియము లేదు.

కృతిపతి యభిలాష :

అనర్ఘ రాఘవ కృతిపతి ప్రాగటూరు నందు వెలసిన రామేశ్వరుడు. కృతికర్త యగు తిమ్మభూపాలు డొక పురాతన పుణ్యశ్లోక చరితము నవపద్య పద్య హృద్యాత్మకముగా రచింప దలంచుచుండ (1-12) నొక పుణ్య రాత్ర మున ప్రాగటూరు పురీశుడైన రామేశు డాతనికి కలలో కనవచ్చి "అనఘ భవ త్కృతాంధ్ర కృతి నాద్భుతి మాకిపుడంకితంబుగా నొనరించి ధన్యతం బొరయు మున్వర" (1-15) అని పలికి యంతర్హితుడయ్యెను. తిమ్మభూపాలు డుదయ మున మేల్కాంచి, పేరోలగమున హితబాంధవ మంత్రి పురోహితాదులను

పేక్షించి, రామేశ్వర స్వామి యుత్సవమునకు సమస్త దేశ విద్వత్కవులరు దెంచుట కానంద మొంది, "నానారసోద్యత్ప్రబంధానీకంబు వివాద కంథరతచే నావిష్కరింప" (1-19) విని విసిగిన సభ్యశ్రేణి కిష్టరస భవ్యమైన కావ్యముచే ప్రీతి ఘటింపవలెనని తలచెను. పేరకవి పౌత్రుడును, అఖిల విద్యా నిష్ణాతుడు నైన కృష్ణసత్కవి "సహాయ కవిత్వమునన్ సమాజ సంతత భజనాదరుండ నగు నాకు నశేష విశేష వైదుషీ ప్రతిభ కరస్థలామలక భాస్వరమై తనరారుట బ్రమే" (1-22) యని భావించి సర్వ పురుషార్థ పదము వీరాద్భుత రసమయ మునైన వస్తువుతో కూడిన సందర్భము కోరుచు రామాయణమును తలపోసెను. తరువాత నతడు వాల్మీకి కృత రామాయణము నగ్గించి, బాల వాల్మీకి బిరుద శోభితుడైన మురారి యనర్ఘ రాఘవ నాటకము నాంధ్ర ప్రబంధముగా నొనర్చి సభను సంతోష మొనగూర్ప దలంచెను. పిమ్మట వాల్మీకి మురారుల ప్రశంసించి రామేశ్వరుడు తనకు కలలో కన్పడి యానతిచ్చిన తెలుంగు సభాసదులకు విన్నవించెను. అంత వారాశ్చర్య మొంది యతని యదృష్టము నగ్గించి తద్వంశావతారము వర్ణింప దొడంగిరి. అనంతరము వారా రాజును జూచి "యిట్టి వంశమున బుట్టి పుత్ర పౌత్ర విభవముతో నొప్పారు మీకు కావ్యములు రచించి దేవతల కంకిత మిచ్చుటలో నాశ్చర్యమేమున్న"దని ప్రశంసించి(1-133) అత డొనర్చిన రస భావ భవ్యమగు కావ్యమును రామేశ్వర దేవున కంకితము చేయుట యుక్తమని యుపదేశించిరి. అతడా దేవుని ప్రస్తుతించి కావ్య రచనమున కుపక్రమించెను.

కృత్యారంభము :

అనర్ఘ రాఘవ ప్రబంధము ప్రాగటూరి రామేశ్వరుని స్తుతితో నారంభమగుచున్నది. ఈ ఈశ్వరుని స్తుతి తరువాత భవాని, విష్ణువు, ఇందిర, చతుర్ముఖుడు, వాణి స్తుతింపబడిరి. ఆటుపై గజాననునకు వందనము కావింపబడినది. ఈ స్తుతులలోని మూడు నాల్గు పద్యములు మూల నాటకములోని నాందీ శ్లోకములకు అనువాదములు.

"నిష్ప్రత్యూహ ముపాస్మహే భగవతః కౌమోదకీ లక్ష్మణః
కోక ప్రీతి చకోర పారణ పటు జ్యోతిష్మతీ లోచనే
యాభ్యామర్థ విబోధ ముగ్ధ మధుర శ్రీరర్థ నిద్రాయితో
నాభీ పల్వల పుండరీక ముకులః కమ్బోస్సపత్నీకృతః 1-1

అనున దందలి నాందీ శ్లోకము. సూర్య చంద్రాత్మకములైన యే విష్ణు నేత్రములు వలన పల్వలము వంటి అతని నాభియందలి పద్మము యొక్క మొగ్గ సగము వికసించుటచే అతి మనోహరమైన శోభ కలదియు సగము ముద్రితమైనదియు నయి శంఖ సాదృశ్యమును పొందింపబడినదో భగవంతుడును కౌమోదకి యను గద చిహ్నముగా గలవాడును అగు విష్ణుని కోకములకు ప్రీతిని, చకోర పక్షులకు భోజనమును కలిగించుట యందు సమర్థమైన కాంతులు (సూర్యచంద్రులు) గల ఆ లోచనములను విఘ్నాభావము కొఱకుపాసింతును అని దీని అర్థము. దీనిని తిమ్మభూపాలుడు

ఉ. శ్రీకరమైన నాభి సరసీరుహ మర్ధ వికోధ నార్థము<br>
ద్రా- కరతైక చాతురి దర ప్రతిమానము జేసి నిచ్చలున్<br>
గోక విలోకనోత్సవ చకోరక పారణముల్ ఘటించులో<br>
కైక శరణ్యు కన్నుగవ యావుత మాకు నిరంతరాయమున్ 1-8

అని అనువదించెను. మూలము నందలి కౌమోదకీ లక్ష్మణః జ్యోతిష్మతీ అను పదములను అతడు విడిచివైచెను. కౌమోదకీ లక్ష్మణః అను భగవద్విశేషణము ధృతాస్త్రత్వముచే నతని విఘ్నాప శమన సామర్థ్యమును సూచించుచున్నది. కౌమోదకీ లక్ష్మణః అను దానిని వేఱు విధముగా గ్రహించినచో నిందు లక్ష్మణః అను శబ్దమేర్పడి నాటక పాత్రలలో ప్రముఖుడైన లక్ష్మణుని సూచించుచున్నది. కవి దీనిని విడిచి వేయుటచే పై కావ్యార్థ సూచనము తెలుగు పద్యమున కానవచ్చుట లేదు. మూలమున విష్ణులోచనములు కోక ప్రీతి చకోర పారణ పటువులైన జ్యోతిస్సులు కలవిగా చెప్పబడినవి. ఈ జ్యోతిస్సులు సూర్యచంద్రులు. వీరికే క్రమముగా కోక ప్రీతి చకోర పారణములు ఘటించు సామర్థ్యము కలదు. వట్టి కన్నులకట్టి శక్తి యుండదు. జ్యోతిష్మతీ యను పదము విడువబడుటచే నీ భావమునకు కొంత కొఱత ఏర్పడుచున్నది. మూలమున నాభీపల్వల పుండరీక ముకుళః అని యుండ, ఆంధ్రకవి దీనిని నాభి సరసీరుహమని అనువదించెను. కంబు సాదృశ్యము సరిపడుటకు సరసీజ మనుట కంటె పుండరీక ముకుళమనుటయే యుక్తము. సరసీజము వికసించిన పద్మమగుటచే నందు సగము వికసించుట, సగము ముడుచుకొనుట అనుస్థితి యుండదు... ...

పిమ్మట వాల్మీకి, వ్యాస, కాళిదాస, మయూరాది పురాతన కవుల స్తుతి కావింపబడినది. వారితోపాటు నన్నయ, ఎఱ్ఱన, తిక్కనలకు సన్నుతి యొనర్పబడినది. అటుపై

చ. "ప్రకట జడాశయ స్థితిని భంగము నొందుచు శబ్ద సౌష్ఠవం
బొకయెడ లేక ధీవరుల కల్కుచు నిల్వ కలం క్రియం దలి
ర్పక బహు లక్షణార్థతను రంజిల కాకృతి నల్లనైన య
క్క కవి సమాజముల్ సవతు గొల్పునె సత్కవి కోటితో ధరన్"
[1-11]

అని కుకవి నింద యొనర్పబడినది. ఇందలి శ్లేష ఎన్నదగినది. కవి శబ్దమునకు నీటి కాకి యను అర్థమున్నది. 'లడయోర భేదః' అను సూత్రము ననుసరించి 'జడాశయ' శబ్దము జలాశయమగును. కుకవులు ధీవరులకు భయపడుచు సత్కవి కోటికి సవతు కానట్లు, నీటి కాకులు జలము నందు నివసించుచు అందలి అలలచే దెబ్బలు తినుచు, జాలరులకు భయపడుచు నల్లని ఆకృతితో పరుషమైన కూతలతో, హంసలు మున్నగు సత్కవి కోటికి సవతు గొల్పవని కవి చమత్కరించెను.

కవి తాను కావ్యము రచించిన పరిస్థితులు వివరించెను. కావ్యావతారిక యందు నాటక ప్రస్తావనలో గల, వాల్మీకి వచోవిలాసము, రామాయణ కథా ప్రశంస మున్నగు అంశము లన్నియు కలవు అనంతరము తిమ్మభూపాలుని సభాసదులు వర్ణించిన ఆతని వంశావతార క్రమము సుమారు తొంబది ఎనిమిది (98) పద్యములలో విపులముగా నున్నది. పిమ్మట కృతిని రామేశ్వరున కంకితము చేయుమని సభాసదులు తెల్పుటయు, కవి యా దేవుని స్తుతించుటయు కన వచ్చును. షష్ఠ్యంతముల తరువాత కథారంభము చేయబడినది.

ప్రబంధ కవితా రీతి :

తిమ్మభూపాలుడు తన కావ్యావతారికలో

గీ. "బాల వాల్మీకి బిరుద జృంభన్మురారి
నాటక మనర్ఘ రాఘవ నామకంబు
దాని నాంధ్ర ప్రబంధముగా నొనర్చి
యుదిత సామగ్రి సమ్మదమూను సభకు 1-28

అని తాను మురారి కృతమైన అనర్ఘ రాఘవ నాటకమును ప్రబంధముగా నొనర్ప బూనినట్లు తెలిపి యున్నాడు. కావ్య కథ నారంభించుచు గద్యములో, నా యొనర్పం బూనిన యనర్ఘ రాఘవం బను మహాప్రబంధ నాటకంబునకు గథా

క్రమం బెట్టిదనిన్ అనుచు ఏ తత్కృతిని మహాప్రబంధ నాటకమని పేర్కొని యున్నాడు. ఇతడు మూల నాటక కథను భావములను సన్నిహితముగా ననుసరించి యుండుటచే అట్లు చెప్పి యుండును. ఆశ్వాసాంత గద్యలలో మాత్రము అనర్ఘ రాఘవంబను మహాప్రబంధ" మనియే వ్రాయబడినది.

మురారి నాటకమున బహు వర్ణనము లుండుట వలన అది ఒక ప్రబంధము వలెనే గోచరించును. మూల నాటకమున కన్పట్టెడు నీ శ్రవ్య కావ్యలక్షణ బాహుళ్యము తిమ్మభూపాలు డానాటకమును ప్రబంధముగా మలచుటకు దోహదము కావించి యుండునని తలంపవచ్చును. కొన్నిచోట్ల వర్ణనములకు పెంపు చేకూర్చి తిమ్మభూపాలుడు తన రచనకు ప్రబంధ నామము సార్థకము కావించెను.

సాధారణముగ నితర ప్రబంధముల వలెనే ఈ కావ్యమును పురవర్ణనముతో నారంభ మగుచున్నది. ఇందు అయోధ్యా నగరము నందలి వప్ర పరిఖా కేతనములు, చతుర్వర్ణముల వారు, చతురంగ బలములు, వేశ్యాపుష్పలావికలు, ఉపవనములు మున్నగునవి విపులముగ వర్ణింపబడినవి. కవి, సమయము దొరికినపుడెల్ల ప్రకృతిని వర్ణించి యుండెను. ఇందు ప్రత్యూష, సూర్యోదయ, మధ్యాహ్న, సంధ్యా. అంధకార, చంద్రోదయాది వర్ణనములు ప్రౌఢములుగను భావనిర్భరములుగను సాగినవి.

ప్రభాతమును కవి

మ. బలభిద్దిక్కటికిన్ విభూషణములై ప్రత్యగ్ర దీప్తారుణో
పల నీరాజితముల్ దినేంద్ర కరముల్ పంకేజరాగ ద్యుతిం
జెలగె న్నీడ నెపంబు పెంపున విసర్జించెన్ జగత్పన్నగం
బలఘు ధ్వాంత కరాళ కంచుక భరం బశాళ నాచ్ఛంబుగన్ (231)

అని వర్ణించి యుండెను.

ఇక విశ్వామిత్రుని సిద్ధాశ్రమమును అందలి సాత్త్విక సంపత్తియు మనోహరముగ వర్ణింపబడినవి. ఇందు గల ఇతర వర్ణనములలో తపోవన వర్ణనము, తపోవర్ణనము పంచమాశ్వాసమున గల నదీ పర్వత, మహానగరాదులు మున్నగు వాని వర్ణనములు పేర్కొనదగినవి.

ఈ ప్రబంధమున లాక్షణికులు పేర్కొన్న అష్టాదశ వర్ణనము లన్నియు సమగ్రముగ లేకున్నను, దీనిని వర్ణనా భూయిష్ఠమైన కావ్యమని చెప్పుటకు

శంకింప నవసరము లేదు. ఇందు ప్రబంధానుకూలములగు నాయికా వర్ణనాదికము కాని నాయికా నాయకుల ప్రణయాదికము కాని వివరింపబడి యుండ లేదు. మైథిలిని గుఱించి శ్రీరాముడు విని ఆమె యెడ నభిలాష కలవాడైనట్లు మాత్రము కథ కల్పింపబడినది. ఆ యభిలాష రసోదంచితముగ నిట్లు వెల్లడింపబడినది.

సీ. సమకూరు టెన్నడో జానకీజిత కుంభ
  కుచకుంభ పరిరంభ గుంభనంబు
చేకూడు టెన్నడో సీతావధూ సుధా
  మధురాధరా స్వాద మంగళంబు
సిద్ధించు టెన్నడో క్షితినందినీ కటీ
  తటపటీ కర్షణోదార కేళి
యొనకూడు టెన్నడో యుర్వీసుతాకృతా
  మిజరతాంత నితాంత చతురిమంబు ... (2-319)

పై పద్యమున శబ్దాలంకార సౌభాగ్యము కూడ రమణీయముగ నున్నది.

అట్లే ద్వితీయాశ్వాసము నందలి అహల్యాశాప విమోచన వృత్తాంతము నందు కూడ ఇంద్రుడు అహల్యను మోసగించి చనిన పిమ్మట అహల్య యందుదయించిన సాత్త్వికభావోదయ వర్ణనము ప్రబంధోచితముగ నున్నది.

నాయిక యౌవనావిర్భావము వ్యంగ్య సుందరముగ వర్ణింపబడినది. నాయకుని రూపవిలాసములను కవి

సీ. మొలక నవ్వుల చాయ వెలయు వెన్నెల గాయ
దులకించు మోము చందురుల చేత
శ్రీకారముల జాడ జెలగు వీనుల తోడ
గలసి నర్తిలు కన్న గవల చేత
.... మోహంబు పొడమ కున్నె (2-285)

అని వర్ణించి యున్నాడు.

పై వర్ణనములలో రాముడు సీతా సంయోగ మెన్నడు కల్గునోయని చింతించుట, అహల్యకు పొడమిన శృంగార భావములు, శ్రీరాముని ఆకార వర్ణనాదులు ఆంధ్ర కవి ప్రబంధోచితముగా కల్పించి వ్రాసినట్టివే.

**తిమ్మభూపాలుని అనువాద పద్ధతి :**

మురారి అనర్ఘరాఘవము నందలి భాష మిక్కిలి జటిలము. అట్లే అతని భావములుకూడ క్లిష్టములును, ప్రౌఢములునై అలరారుచుండును. అందుచే దానిని సమర్థతతో ననువదించుట సామాన్యులకు సాధ్యమైన పని కాదు. తిమ్మభూపాలుడు మురారి నాటకము నంతను క్షుణ్ణముగా చదివి అందలి భావములను జీర్ణము చేసికొని ధారాళమును నిర్దుష్టమును అయిన శైలిలో దాని ననువదించుటకు యత్నించి కృతార్థుడయ్యెను. ఇతని అనువాదమును శ్రీనాథుని నైషదానువాదముతో పోల్చవచ్చును. ఇతడు నాటకము నందలి పద్యములను, గద్యభాగములలో పెక్కింటిని పద్యరూపముననే అనువదించెను. అభినయ సూచనలను కూడ పద్యములందే అనువదించెను. కొన్నిచోట్ల ఇరువురు పాత్రల సంభాషణము నంతను ఒకే పద్యము నందిమిడ్చెను. రెండు మూడుచోట్ల మాత్రము మూలమున లేని రమణీయ వర్ణనములను చేర్చి యుండెను. అనువాదమున నీతడెంత శ్రద్ధ వహించినను తెలుగు నందును సంస్కృతము నందును గల కొన్ని వృత్తముల విస్తృతి యందలి భేదముచేతను తెనుగున సంస్కృతమున లేని యతిప్రాస లుండుట చేతను, కొన్నిచోట్ల నాతడు మూల భావమును పెంచుటయు, మూలము నందలి కొన్ని పదములను అనువదింపక విడుచుటయు సంభవించినది. అతడు మూలము నందలి భావమును సరిగ వ్యక్తము గావింపలేని పట్లును, మూల భిన్నముగా అనువదించిన పట్లును లేకపోలేదు. అందులకు మూల గ్రంథము నందలి పాఠాంతరములు కూడ కొంతవరకు కారణములై యుండును. మొత్తము మీద నితని అనువాదము మూలమున కెందును తీసిపోక హృద్యమును నిరవద్యమునై అలరారుచున్నది.

**ఈతడు కావ్య విధానము ననుసరించి
నాటకమునకు గావించిన మార్పులివి :**

ఈతడు మూల నాటకము నందలి కథ నెచటను మార్చి యుండలేదు. కాని ఆశ్వాస విభజనము మాత్రము మూలము నందలి అంకముల క్రమము ననుసరించి చేయలేదు. ఈతడు మూలమునం దేడంకములుండగా, ద్వితీయాశ్వాసమునందే నాటకము నందలి ద్వితీయ తృతీయాంకముల కథను, పంచమ షష్ఠాంకముల కథను చతుర్థాశ్వాసము నందును ఇమిడ్చి, చతుర్థాంక కథను తృతీయాశ్వాసమునను, సప్తమాంక కథను పంచమాశ్వాసమునను పొందుపరిచి,

ప్రబంధమును ఐదాశ్వాసములుగ విభజించెను. ఇతడు నాటకము నందలి పాత్రలను, ఒక ద్వితీయాంకము నందలి శునశ్శేఫ, పశుమేఢ్రుల నామములను కళాధర, సదాచారులుగా మార్చుటతప్ప, ఇంకెచటను మార్చి యుండలేదు.

నాటకము నందలి ప్రస్తావనలోని విషయము నటీ సూత్రధార సంభాషణ రూపమున కాక కవిసోక్తమగు కృత్యవతరణికగా రూపొందింప బడినది. అట్లే నాటకమున, అహల్యా శాప విమోచనము, సేతు బంధనము, వాలి వధ, రామరావణ యుద్ధము మున్నగు నంశములు భిన్న వ్యక్తుల సంభాషణముల ద్వారముననుు, అర్థోపక్షేపాదుల రూపముననుు చెప్పబడి యుండ ఆంధ్ర కవి వానిని ఆఖ్యాన శైలిలోనే వివరించెను.

ఆ నాటకమున పాత్ర ప్రవేశాదులు రంగమున ప్రత్యక్షముగ కన వచ్చును. నాటక రచయిత ఆ పాత్ర ప్రవేశమున అప్పటి వారిస్థితిని సూచ్య మాత్ర మొనరించును. అట్టి వానిని తిమ్మభూపాలుడు ప్రబంధోచితముగ వివరించును. ఒకానొకచో ఆ పాత్ర ప్రవేశమున కనువగు సందర్భమును కల్పించును. నాటక ప్రస్తావనాంతమున దశరథ వామదేవుల ప్రవేశము (తతః ప్రవిశతి యథోపదిష్టోదశరథో వామదేవశ్చ) అని సూచింప బడినది. తిమ్మభూపాలుడు తన కావ్యమున వామదేవుని ప్రవేశమునకు ముందు దశరథుని కొలువును వర్ణించి ఆతడు కొలువుండగా

"దివ్యకూలంకషా తీర్థ సేకంబున
పావనంబగు జటా పటలి వాడు" (1—167)

ఇత్యాదిగా సీస పద్యమున వామదేవుని ప్రవేశమును వర్ణించెను. వామదేవు డనగా శివుడను అర్థము కూడ నున్నది. ఈ పద్యము నందలి నాల్గు సీస పాదములును వామదేవునికి శివునకు కూడ అన్వయించు చున్నవి.

ఆ. ద్వితీయాంకము "అయే ప్రభాతప్రాయైన రజనీ" అను శిష్యుని వాక్యముతో నారంభమగుచున్నది. తిమ్మభూపాలుడు ప్రథమ ద్వితీయాంకములకు సంబంధము కల్పించుటకై ద్వితీయాశ్వాసము నందలి 2, 3, 4 సంఖ్యలు గల పద్య భాగములను కల్పించి వ్రాసెను. విశ్వామిత్రుడు తమ ఆశ్రమము చేరె ననియు, నతని ఆజ్ఞనే శిష్యుడొకడు ప్రాతఃకాలమున కుసుమ సమిదాహరణ మునకై నికటాటవికి జనెననియు, నతడు సమిత్కుశ నికరము గైకొని ప్రభాత

ప్రాయమగు విభావరిని పరికించి దానిని వర్ణింప దొడగెననియు నిందలి సారాంశము. ఇందు "ప్రభాత ప్రాయమగు విభావరిం బరికించి (2-4) అను మాటలు మాత్రమే మూలానుసారులు. ఇదే అంకమున శౌష్కలుని పాత్ర ప్రవేశమును వర్ణించు సందర్భముకూడనిట్టిదే. (2-221 పూర్వార్ధము. వచనము) తృతీయాంకారంభమున కించుక ప్రవేశము (జరావైక్లవ్యవిసంష్ఠులాని కతిచిత్పదాని గత్వా ఆత్మానం ప్రతి సఖేదోపాలంభనం) అని సూచింప బడినది. దీనిని తిమ్మభూపాలుడు ప్రబంధోచితముగ నొక సీసమున విపులముగ వర్ణించెను. (2-225)

ఇ. తృతీయాంకమున విష్కంభానంతరము "తతః ప్రవశతి జనకో విశ్వామిత్ర శతానందౌ రామలక్ష్మణౌచ" అను సూచన కలదు. దీనిని తిమ్మభూపాలుడు విశ్వామిత్రుడు రామలక్ష్మణులు తన వెంటరా జనకాధీశుని హజారమునకు అరుదెంచెననియు (2-265), సతనిని జూచి తమతమ వాహనములు దిగి భయభక్తి సహితులగుచు దొరలు దండము లిడిరనియు (2-266) జనకుడు కర్ణాకర్ణికచే వారి యాగమనము విని యెదురేగి కౌశికుని గాంచెననియు (2-267) నమస్కరించిన జనకుని విశ్వామిత్రు డాశీర్వచన పూర్వకముగా గాఢాలింగన మాచరించి శతానందోపదిష్ట మార్గమున సభాసదనమున కరుదెంచి స్వర్ణపీఠి గూర్చుండి యర్ఘ్యపాద్యాదులచే నభ్యర్చితుడై యా రాజు కుశలం బడిగెననియు (2.268) పెంచి వర్ణించెను.

ఈ. సప్తమాంకమున అగ్ని ప్రవేశము గావించి సీత పాతివ్రత్యము నిరూపించుకొనిన తరువాత రాఘవుడు సతీసమేతముగ లక్ష్మణ సుగ్రీవ విభీషణాదులతో కూడి అయోధ్యకు పయన మగును. నాటకమునందా సందర్భమున (తతః ప్రవిశతి విమానయానేన విజయాభిరామో రామః సీతాలక్ష్మణౌ సుగ్రీవ విభీషణౌ) అని సూచించ బడినది. దీనిని తిమ్మ భూపాలుడిట్లు వివరించెను.

చ. క్రమమున రాఘవుండు కపిరాజ విభీషణు లంటి కొల్వగా
బ్రమదము తోడ దమ్ముడును భార్యయు బార్శ్వ యుగంబు నిండగా
నమర విరోధి మందిర సమాహృత పుష్పక రాజ మెక్కియ
ర్యమకుల వృత్తమేధ్యయగు నట్టి యయోధ్యకు బోదలంపగన్ (5.6)

౨. తిమ్మ భూపాలుడు, నాటకమున పాత్ర ప్రవేశ నిర్గమనాదులకును తదనంతర సన్నివేశములకును సంబంధము కల్పించుటకై కొంత కల్పనము చేయుచుండును.

అ. శూర్పణఖ రాముడు మిథిలకు వచ్చెనని చెప్పి నప్పుడు మాల్యవంతుడు రాముని పరాక్రమాతిశయమును ప్రశంసించి "తదేహి రాజకులమేవ గచ్ఛావః" అని పలికెను. తరువాత వారిరువురును నిష్క్రమించిరి. ఈ సందర్భమున తిమ్మభూపాలుడు ఒక వచనమున (౪.౮౩) కథా సంబంధమును కలుపుటకై శూర్పణఖా మాల్యవంతులు రావణుని ఆస్థానమున కరిగిరని తెలిపి అక్కడ మిథిలానగరమున దశరథుడు వివాహము చూడ నరుదెంచిన యింద్రాది దేవతలను, రాజులను యథోచితముగా సంభావించి విశ్వామిత్ర గౌతమాది మునులును, జనకాది బంధువులును పరివేష్టింప నున్న సమయమున భార్గవ రాముడరుదెంచెనని తెల్పెను. నాటకమున భార్గవ రాముని రాక నేపథ్యమున తెలుప బడినది. (పుట 212)

ఆ. శౌష్కలుడు నేపథ్యాభిముఖుడై రామునుద్దేశించి సీతను పెండ్లాడ వలదని పలికి, సవిమర్శముగా నాత్మగతమున "అహో గంభీర మిద ముపస్థితం వస్తు, తస్మం త్రిణం మాల్యవంత మేవ పురస్కృత్య లంకేశ్వరస్య నివేదయామి' అని నిష్క్రమించినట్లు నాటకమునందున్నది. ఆంధ్రకవి ఇచట "రామా! యీ విశ్వామిత్రుని మాటలు చెవి బెట్టినచో నీకు నకనకలు తప్పవు (2.409) యుద్ధమున నితరులు చంప కుందురని కదా. "బ్రాహ్మణో నహంతవ్య" యన విని యితడు రాజయ్యును బ్రాహ్మణత్వమును పొందెను. (2.140) అని పలికి, ఈ కార్యమును రావణున కెఱింగింప వలయునని తలంచి లంకా నగరమున కరిగి మాల్యవంతునితో గూడ రావణుని దర్శించి తన పోయి వచ్చిన తెఱగు విన్నవించెను. రావణుడు శూర్పణఖను పిలిచి మిథిలా వృత్తాంత మరయ పంచెను. మాల్యవంతుడు సూర్యాస్తమయమైన పిమ్మట విహార మందిరమున విశ్రమించెను. (2.411) కథా వైశద్యము కొఱకై కవి ఈ భాగమును పెంచి వ్రాసెను.

౩. తిమ్మకవి, నాటకమున పాత్రలు మాటాడుటకు ముందు చేయబడు అభినయ సూచనల నొక్కొక్క పద్యమున వివరించి వర్ణించును.

అ. దశరథుడు విశ్వామిత్రుని ప్రశంసించిన పిమ్మట అంజలిం బద్ధ్వ దోసిలి యొగ్గి మఱియేదో నుడివెను. 'అంజలిం బద్ధ్వా' అను సూచనను తిమ్మ భూపాలుడు

క. అని వదనేందుని గని ముడి
గిన తమ్ములనంగ మోడ్పు గేల్గవదనరవ్
జన నాథ తిలకు డిట్లను
ప్రణుత సుధా మధుర చాటు వాచా ప్రౌఢిన్ (1–211)

చంద్రుడు ప్రకాశించు నపుడు పద్మములు ముడుచు కొనును. ముఖ చంద్రుని జూచి ముడుచుకొన్న పద్మములా యనునట్లు చేతుల జంట తనర దశరథుడు అమృతము వలె తియ్యని వాక్కులందలి నేర్పుతో నిట్లనెనని దీని యర్థము. ఇందలి ఉత్ప్రేక్ష అంతయు కవి కల్పనమే.

ఆ. దశరథుడు విశ్వామిత్రుని ఆగమన కారణంబు తెలుపు మని అడుగ నతడు (విహస్య) నవ్వి దశరథున కేదో సమాధానము చెప్పినట్లు కలదు. ఈ విహస్యయను సూచనను తిమ్మ భూపాలుడు, విశ్వామిత్రుడు "మోము నెత్తమ్మి నెలనవ్వు మొలక లెసగ" (1.195) దశరథునకు ప్రతి వచనము పల్కెనని వ్రాసెను.

ఇ. మాల్యవంతు డుదయముననే లేచి పట్టణమును తిలకించి శౌష్కలు దరుదెంచి రాముని వార్త చెప్పినప్పటి నుండియు తన హృదయమున బెడద తోచెనని యను కొనెను. ఈ సందర్భమున "ముహూర్త మనుధ్యాయ" అను సూచన యున్నది.

దీనిని తిమ్మ భూపాలుడు "ఆ పురాభోగ మీక్షించి యలరి యంత" (3.11) అను పద్యమున పెంచి వ్రాసెను.

ఈ. శ్యామ వటమున కందఱును నమస్కరించిన పిమ్మట రాముడు సరయూ నదిని వారికి చూపించెను. అప్పుడు విమాన వేగ నాటిత కేన సహర్షమ్ అను సూచనమున్నది. తిమ్మన దానిని పెంచి (5.219) కంద పద్యముగ వ్రాసెను.

ఉ. విశ్వామిత్రుడు రామలక్ష్మణుల కడ కరుదెంచి యీ యాశ్రమ భూములు మీ కానందము కల్గించుచున్నవా? యని అడుగ రామ లక్ష్మణు లిరు

వురును "సప్రశ్రయం" — వినయముతో నాశ్రమ మతి రమణీయముగా నున్న దని తెల్పిరి. ఇచ్చట తిమ్మ భూపాలుడు

క. "కౌశికుడీ గతి బల్కిన
దాశరధి వినీతి మేను దాల్చెనొ యనగా
బేశలతర నిజవాచా
కౌశల మెనయంగ ముని శిఖామణి కనియెన్. (2.135)

ఈ. నేపథ్యోక్తుల వలన తాటకా గమనమును విని విశ్వామిత్రుడు విల్లు చేపట్టుమని రామునితో చెప్పు సందర్భమున "సాకూతం" అను సూచన యున్నది. తిమ్మ భూపాలుడు దానిని "విని సాకూతముగా దన మనమున నాశ్చర్య మొంది "మనుజాదిని వచ్చినదా" యని మునిపతి యాయిన కులశేఖరుని జూచి యిట్లని పల్కెన్" (2.157) అని పెంచి వ్రాసెను.

4. తిమ్మ భూపాలుడు నాటకము నందలి నేపథ్యోక్తులను, ఆకాశ భాషితములను, ఆత్మగతములను గూడ అఖ్యానాత్మకముగ వివరించును.

అ. విశ్వామిత్రుడు రాముని తనతో పంపుమని అడిగినపుడు దశరధునకు మిక్కిలి క్లేశము కలిగెను. ఈ సందర్భమున మూలమున దశరధునికి (సవిషాదమాత్మగతమ్) అను సూచన కలదు. ఇందలి 'సవిషాదం' అను దానిని తెలుగు కవి

క. ఆ నుడి యుఱుముని పిడుగై
పూని యలరుహాలహలము బుడుగై, పటుదా
వానల కీలల వడుగై
మానవపతి నెమ్మనంబు మలమల మాడ్చెన్. (1.224)

అని వివరించెను. ఇందలి ఉఱుముని పిడుగు హాలహలము బుడుగు, దావానల కీలల వడుగు అనునవి చక్కని పదబంధములు.

ఆ ద్వితీయాంకమున తాటకా గమనము నేపథ్యమున సూచింపబడినది. "నిర్మజ్జచ్చక్షురంతః" (11—54) ఇత్యాది శ్లోక మామె భీకరాకారమును వ్యక్తము చేయుచున్నది. తిమ్మ భూపాలుడీ శ్లోకమును సీస పద్యముగా అనువదించుచు దానిని ప్రబంధోచితముగ పెంచి వ్రాసెను. (2—154)

ఇ. విశ్వామిత్రుడు తాటకను జంపుటకు విల్లు గ్రహింపుమని పలుకగ రాముడు స్త్రీని చంపుటయా యని సందేహించుచున్న సమయమున నేపథ్యమున "అబ్రహ్మణ్యమ బ్రహ్మణ్యంభో స్తాత! విశ్వామిత్ర ... అను సూక్తులు వినబడెను. ఆంధ్రకవి దానిని "చాల కళాధరుండు దితిసంతతి చెయ్వుల జిక్కి-" (2.16) అను పద్యమున విస్తరించి వ్రాసెను.

ఈ. కౌష్కుడు "రావణుని దశమ శిరము సీత నిమ్మని యర్థించు చున్నది. నీ భాగ్యము చెప్ప శక్యమా? యని జనకునితో నముచుండ శతా నందుడు "ఉత్థాయ నేపథ్యానవలోకితేన సహర్షాద్భుతం; పశ్యంతు భవంతః" అని రాముని ప్రశంసించెను. తిమ్మ భూపాలుడిందలి సూచనను

అన శతానందు డమ్మాట జనక విభుని
చెవుల బడనీక కోదండ భవన సవిధ
వివిధ లోకాద్భుత క్రియాన్వితుడైన
రాఘవుని జూచియును ననురాగ మెసగ. (3-376)

అని యన్యవిధముగా వర్ణించెను.

ఉ. శతానందుడు దశరథుని తోడ్కొని వచ్చుట కరిగిన పిమ్మట విశ్వామిత్రుడు హర్షము నభినయించుచు ఆత్మగతమున దశరథ జనక వంశము లందు తన యాశిషము ఫలించెనని సంతోషించినట్లు "విశ్వామిత్రః హర్షం నాటయన్నాత్మగతం" అని కలదు. తిమ్మభూపాలుడు దీనిని పెంచి

"అంత తపోధన రజనీకాంతుడు" (2-398) అను కందమును వ్రాసెను.

ఊ. కౌష్కుల శతానందు లొండొరుల నధిక్షేపించు కొనుచుండ నేపథ్య మున రామునిచే శివధనుస్సు భగ్నముకాగా తచ్ఛబ్దము ఎల్లయెడల వ్యాపించెనని లక్ష్మణుడు వర్ణించినట్లు మూలమున నున్నది. తిమ్మభూపాలుడీ నేపథ్యమును విడిచి అఖ్యానాత్మకముగ పై ఘట్టమును వివరించెను. (2-381)

౬. ఒక్కొక్కప్పుడు తెలుగు కవి అభినయాంశములను అటు తరువాతి సంభాషణమును కలిపి పద్యమును వ్రాయును. మచ్చున కొండు రెండు పద్యములు.

అ. రామ లక్ష్మణులు విశ్వామిత్రుని గూర్చి మాటాడుకొనుచు వచ్చు చుండగా వామదేవుడు (సహర్షం దృష్ట్వా) కథ మాగతోరామ భద్రః అని పలికి విశ్వామిత్రున కాతని నెఱిగించెను.

ఉత్సాహము – అనుచు జేర నేగుదేర నమ్మహానుభావునిన్
బ్రణుత సద్గుణాభిరాము రాము గాంచి నెమ్మదిన్
గనలు సాగ రాగతిలక కుశిక వంశ పద్మినీ
వనజ హేళి కతని జూసి వాసుదేవుడిట్లనెన్. (1-251)

ఆ. శివధనుస్సును విఱిచినవారికే సీత పూర్ణపాత్ర మగునని శతానందుడు పలుక శౌష్కలుడు (విహస్య శాంతం) అహః యుష్మాకమసప్యమూన్యక్ష రాణి" అని పలికెను. తిమ్మభూపాలుడు దానిని

గీ. అనిన శౌష్కలు డమ్మాట కదిరి పడుచు
మాటికి "నమశ్శివాయ నమశ్శివాయ"
యనుచు వీనులు పెస మూసికొనుచు బలికె
నీతి మెఱయంగ గౌతమసూతితోడ (2.358)

7. అ. తిమ్మభూపాలుడు కొన్నిచోట్ల పాత్ర పలికిన వచనమును దాని తరువాత గల శ్లోకమును కలిపి ఒకే పద్యముగా ననువదించును.

విశ్వామిత్ర: (సస్మితమ్) రాజర్షే! మమకారోహి రాజపుత్రేషు రాజ్ఞాముప లాలన క్లేశాయ. ఉపయోగస్తు ప్రజానామ్. యథైతత్

శ్లో. కష్టా వేధవ్యధా కష్టో నిత్యముద్వహన క్లమః
శ్రవణానామలంకారః కపోలస్యతు కుండలమ్. (1–40)

అను గద్య పద్యములను కలిపి తిమ్మ భూపాలుడు

చ. దళితమదారి వీర! తలిదండ్రులకున్ నృపసూతి పోషణా
కులతయు వైభవంబు బ్రజకున్ సమకూర్చు, నిజంబు లేదనా
విలతయు సంభృతి శ్రమము వీనులు పూన నమాన లీల జె
క్కుల నలరించు గాదె మణికుండల మండల ధాళ ధళ్యముల్ 1-228)

అను పద్యముగా ననువదించెను.

ఆ. రాముడు పరశు రాముని మహత్వమును గూర్చి తలంచుచు చెప్పిన "జటాంధ త్తే మూర్ధా" (I—27) అను శ్లోకమును తిమ్మ భూపాలుడు పెంచి "మకుట యోగ్యంబైన మౌళి భాగంబున నిడుద కెంజడ గుంపు ముడిచినాడు" (8 98) అను సీసముగా తెనిగించి ఆ శ్లోకమునకు ముందున్న వచనమునుగూడ గీత పద్యము చివర చేర్చెను.

8. అ. తిమ్మ భూపాలుడొకచో వచనమునకు పద్యము వ్రాయును. ఇట్టి పట్లు పెక్కులున్నవి. వాని యందొకటి.

పరశురాముడు శతానందుని పై కోపించి యాజ్య స్నేహ మీ శతానందుని కలత పెట్టు చున్నదని భావించి రాఘవుల కులమును చలము తీర నాశ మొనర్చి యతనికి మనః ప్రియము కావింతునని పలుక శతానందుడు నేపథ్యము నుండి "ఆః పాప! క్షత్రియాయాః పుత్ర, క్షత్రియభ్రూణహత్యాపాతకిన్ నిసర్గ నిష్ప్రాణం హి ప్రహరణమిక్ష్వాకూనాం బ్రాహ్మణేషు తై ర్యాదృశస్తాదృశోవా సోఢవ్యోఽసి. కథమేవ మతిక్రమిన్ అస్మాకమపి బ్రహ్మవర్చసాన్నబిభేషి" (పు. 283) అని పలికెను.

తిమ్మ భూపాలుడీ వచనమును పెంచి మూడు పద్యములలో (8-134—135.137) విపరించెను.

ఆ. శతానందుని మాటలు విని పరశురాముడు సరోషహాసముగా "అరే బ్రహ్మబంధో! బాంధకినేయ! గౌతమ గోత్ర పాంసన" అని యతనిని సంబోధించి నిందించుచు పలికెను. ఈ సంబోధనలనే పెంచి అనువాద కర్త ఒక పద్యమును వ్రాసెను. (8.137)

9. తిమ్మ భూపాలు డొకప్పుడు నాటకము నందలి ఇరువురి పాత్రల సంభాషణముల నొక్కరన్నట్లే వ్రాయును.

అ. వామదేవుడు దశరథునితో వశిష్ఠ భగవానుడు సర్వ సందేశ సంగ్రహకారియైన కోరికను స్మరింప చేయు చున్నాడని పల్క దశరథుడు సాదరముగా 'అవహితోఽస్మి కి మాజ్ఞపయతి' అని పల్కెను.తిమ్మ భూపాలు డీ రెంటిని కలిపి వామ దేవుడు "సకల సందేశ సంగ్రహ కందంబగు నిక్కందంబు నీ డెందంబునం బొందు పరపుమని ముని పురందరు డానతిచ్చె సావధానుండవై వినుమని ఇట్లని పఠించెను' అని పల్కినట్లు అనువదించెను.

ఆ కలహంసి ప్రవృత్తి విశేషావాప్తిచే ఖేదమనుభవించు హృదయమును పాంచాలికాకేళి వ్యాపారముచే వినోద పఱచు సీతను చూచి కారణము నెఱుంగుటకై వచ్చుచుంటినని పలుక కంచుకి 'వత్సే! కీదృశీ సా ప్రవృత్తిః యా తవ భర్తృ దారికా మపి దుర్మనాయయతి ' యని ప్రశ్నించెను. తిమ్మ భూపాలు డీ ప్రశ్నను తీసి వైచి "ఆ తరుణి సీత కింత వెత సేయు నవ్వార్త యెట్టి దసిన అని ఆ వార్తను కూడ కలహంసియే చెప్పినట్లు వ్రాసెను.

10. అమూలక కల్పనములు :

తిమ్మ భూపాలుడు మూల కథ నంతను అనుసరించి యున్నను, అందు ప్రబంధోచితములగు కొన్ని వర్ణనములను, కొన్ని అమూలక భావములను ప్రవేశ పెట్టెను. ఇందలి కృత్యవతారికలో కృతికర్త వంశ వివరణాత్మక మగు భాగ మంతయు అమూలకమే, అటులే పురవర్ణనము కూడ మూలమున లేనట్టిదే.

తిమ్మ భూపాలుడు సందర్భానుగుణముగ కల్పించిన భాగములు మఱి కొన్ని కూడ కలవు. శునశ్శేఫుడు సమిధలు సేకరించి ఆశ్రమమునకు పోవ నుంకించుచుండగా ఆతని కడకు, భయభ్రాంతుడైన ఒక వటు వేతెంచెను. తిమ్మ భూపాలు డిచట ఆతడు భీతుడై ఏతెంచిన విధమును, ఆతడు చేసిన వెగడు చేష్టలను కలధరు డాతని నోదార్చి హోమభూతి రక్షాతిలకముగా తీర్చిన తెఱంగును ఆఱు పద్యములలో విపులముగా వర్ణించెను. (2-12-17)

అ. అహల్యా వృత్తాంతము నందలి (2-27-34 వఱకు గల) పద్యములు అమూలకములు. ఇంద్రుడు గుఱ్ఱము నెక్కి వచ్చి అహల్యను జూచి కామాంధ కారము కప్పుకొన చీకటి తప్పు చేసి తన కోరిక తీర్చుకొని వెడలి పోవుటయు, గౌతముడాశ్రమమునకు రాగా నతనికి కల్పవృక్ష సుమముల సుగంధము గుప్పున కొట్టుటయు, అహల్య తుచ్ఛ సుఖములకాస చేసి నింద పాలైతినని చింతించు చుండుటయు, గౌతముడామె శరీరమందలి శృంగార చిహ్నములను జూచి కుపితుడై రాయియై పడి యుండుమని శపించుటయు పై పద్యము లందలి సారాంశము.

ఇ. కళాధరుడు వటునికి రామాగమనమునకు కారణము నెఱింగించుచు తెల్పిన వాలి సుగ్రీవ వృత్తాంతమున నింద్రుడు వాలి ప్రాజ్యరాజ్య సంపన్నతయు బాహు బలమును చూచి సంతోషించు చుండెనను పద్యమును (2.48) వాలి

రావణులు మిత్రులై రావణుడు కిష్కింధకును, వాలి లంకకును రాకపోకలు సాగించు చుండిరని చెప్పిన పద్యమును (2.49) అమూలకములు.

ఈ. కలహంసి కంచుకితో సీతావృత్తాంతమును తెలిపి "భవతు తన్న కిమపి యుష్మాభిః శ్రుతం" (దశ గ్రీవ పురోహితు నాగమము మీరు వినలేదా) యని యడిగెను. దానికి కంచుకి "యీ విషయమింకను రాజునకు తెలియ లేదు. తెలిసినను అతడేమి చేయు?" అని పలికెను. తిమ్మ భూపాలుడు "కలహంసి నవ్వియోయనఘ! యిప్పుడేను నేమియు జెప్పలేదవు నేమి వినుట లేదిది యింక నీ మనసులోన మఱవదగు నన్న గంచుకి తెఱవ తోడ" (2—256) "చెలువ నా గుణంబు తెలియ కాడెదవు నీవైన నేమి గోప్యమైన మాట యెడల నోరు లెఱుంగుటది యెట్లు నూతిలో గుండు వైచినట్టులుండ వలదె" (2.257) యని వారికి జరిగిన యొక సంభాషణము వ్రాసెను. ఇది మూలమున లేదు. "తన్న కిమపి యుష్మాభిః శ్రుతమ్" అను మూలమందలి వాక్యమునే తిమ్మ భూపాలుడు కలహంసి నవ్వి ఇత్యాది పద్యమున భిన్నముగ ననువదించినట్లు తోచుచున్నది.

ఉ. మూలమున కంచుకి సీత చేటి యగు కలకంసి నాలోకించి "అయే సీతా పాద మూలోపజీవినీ కలహంసికా" (పుట 129) యని అనుకొనెను. తిమ్మ భూపాలు డిచ్చట

మ కలహంసీ కటి భాగ శోభిత రణత్కాంచీ మణీ కింకిణీ
కలనాదం బిదియంచునెంచగ, ధరా కన్యాపదాంభోజని
ర్మల సేవాచరణై కదాస్యయగు నాచంద్రాస్య యేతెంచిని
ర్మల భక్తి బ్రణమిల్లి యిట్లను సుధామాధుర్య ధుర్యోక్తులన్ (2.281)

ఊ. జాంబవంతుడు, వాలితో, అతనికి రావణునితో మైత్రి కూడదని చెప్పుచు, అతడు వాలికి తండ్రియైన యింద్రునికి కూడ విరోధి యని పల్కి "వనచరోత్తమ నీ యంత తనయుడుండ" (2.52) ఇత్యాదిగా చెప్పిన పద్యమమూలకము. ఇదే సందర్భమున జాంబవంతుడు, రావణాసురుడు సర్వ వైరియై దిక్పాలుర నెల్ల నవమానించిన విధమొక సీసపద్యమున వర్ణింపబడినది. (2.55) ఇది అమూలకము. అట్లే రావణుడు వాలి సాహాయ్యమునకై సముద్రపు ఉత్తర తీరమున కొంత రాక్షస సేన నిలిపెనని కశాధరుడు తెలుప వటుడు రావణ మిత్ర ధర్మమును ప్రశంసించుచు "అంచిత నిజ గుణమణిగణ" (2.67) అని చెప్పిన కంద పద్యమును, తాటక బల విశేషమును వర్ణించు "అనఘ

యోఁతేవింత యద్దిరా, యిటు దాని లావు విన్న గుండె లావులించు" (2.72)
అను పద్యమును అమూలకములు.

ఋ. ద్వితీయాంకమున రామలక్ష్మణుల కడకు దీక్షితవేషుడైన విశ్వామిత్రు డరుదెంచిన సమయమున తిమ్మ భూపాలుడు

"నిరుపమ బ్రహ్మైక నిధి జూపు నంజనం
బన కన్నుదోయి నంజన మెలర్ప (2.127)

ఇత్యాది సీస పద్యమును కల్పించి వ్రాసెను. తాటక యజ్ఞశాల కరుదెంచి విచ్చలవిడిగా తిరుగుటను తిమ్మ భూపాలుడు అయవిభాతిలో (2.155) వర్ణించెను. ఇది కవిస్వకపోల కల్పితము.

ౠ. విశ్వామిత్రుడు రామునకు శివధనుస్సు చూపుమని జనకునితో చెప్పి నప్పుడు రాముడాత్మగతమున "సమకూరుటెన్నడో జానకి జితకుంభ కుచకుంభ పరిరంభ గుంభనంబు" (2.319) ఇత్యాదిగా గల సీస పద్యమున తన శృంగార భావములను వెల్లడించెను. ఇది ప్రబంధోచితమగు కవి కల్పన.

ఎ. జనకుడు దశరథుని పిలుచుకొని వచ్చుటకు శతానందుని పంపుదమని పలుక శతానందుడు లేచి విశ్వామిత్రుని జూచి లేఖ వ్రాయింపుడని కోరెను. అంత నతడు వ్రాయసము వారిని చూచి మీ రాజు పేర దశరథున కుత్తరము వ్రాయుడని ఆదేశించెను. లేఖకుడంత తెల్లని దంతపుటోరలో నున్న గిలకల గంటము చేత గ్రహించి యుత్తరము వ్రాసి చదివెను. (12-393) పద్యమున నా ఉత్తరము ఉన్నది తరువాత గౌతముడా లేఖ గైకొని జనక విశ్వామిత్రులు పంప పల్యంకికారూఢుడై యరిగెను.

ఈ ఉత్తరము సంగతి మూలమున లేదు. దశరథుని తోడ్కొని వచ్చుటకు శతానందుడు పంపబడుగాక యని జనకుడు సూచింపగా విశ్వామిత్రు డంగీకరించెను. శతానందు డంత లేచి ఇంక నేమైనను వాచిక మున్నదా ? యని యడుగ విశ్వామిత్రుడు "నిసృష్టార్థుడవైతివి గదా యరుగు" మని పలికినట్లు మాత్రము మూలమున కలదు.

ఏ. శతానందుడు దశరథుని తోడ్కొని వచ్చుటకై యరిగిన పిమ్మట శౌష్కలుడు విశ్వామిత్రుని జూచి యిప్పటికైనను తాటకావధాపరాధము తొల

గించుకొనుటకు సమయ మతిక్రమింప లేదు అని పలికినట్లు మూలమున నున్నది. తిమ్మభూపాలు డంతతో నూరకుండక

గీ. వెడగు బుద్ధుల నికనైన విడిచి పెట్టి
జనకునకు జెప్పి జానకీ చంద్రవదన
నసుర నాథున కిప్పించి యతని కీవు
చనవరివి గమ్ము త్రిజగముల్ నిను భజింప    2-398

అను నమూలక పద్యమును గూడ వ్రాసెను — జనక విశ్వామిత్రులు రాముని చూచుట కరిగిన పిమ్మట శౌష్కలుడు జనకుని దూషించి నీవు రావణునికి మామవగు భాగ్యము పొందక యిట్లు వ్యతిరేకముగా సంచరించితివి. సీత యెట్లైన రావణ హస్తగృహీత కాక మానదని పలికి

క. అని రాముంజేరి యోరీ!
మనుజార్భక! చివికి పనికి మాలిన యీవి
ల్లు నిమితి నని గర్వింపం
బని లే దిల్లలికి నంత బండుగ యగునే?    2-405

అని నీవు సీతను పెండ్లి యాడకుమని చెప్పెను. ఇది అమూలకము. మూలమున శౌష్కలుడు సాక్షేపముగా నేపథ్యాభిముఖుడై రాముని పెండ్లి యాడకుమని సీతకు చెప్పినట్లు మాత్రము కలదు. తిమ్మ భూపాలుడీ సందర్భమున కుచితముగా పై పద్యమును వ్రాసె. 'యిల్లలికినంత బండుగ యగునే' యను లోకోక్తిని కూడ నందు చొప్పించెను.

ఐ. మాల్యవంతుడు ఉదయముననే లేచి శౌష్కలుడు రాముని వృత్తాంతము చెప్పినప్పటి నుండియు నొక విధమైన కలత నొందుచు

క. మానవు డొకరుడు జిత బహు
దానవుడై హరధనుర్మథన నూత్నభుజ
శ్రీ నలరెడునట! యిక్కథ
వీనులబడ గుండెలవియవే యెవ్వరికిన్    3-18

అని తలంచెను. ఈ పద్య మమూలకము.

ఒ. మాల్యవంతుడు శూర్పణఖ మాటల వలన రాముడు సీతను స్వీకరించెనని తెలిసికొని "కటకటా క్షత్రియ బ్రాహ్మణుండగు కౌశిక హతకుని

చుర్నాటక మిట్టిది కదా" యని వెండియు "కోణప కోటిహోమమునకుం గృత
నిశ్చయుడై" (౪-౨౭) ఇత్యాదిగా ననుకొనినట్లు తిమ్మభూపాలుడు మూలమున
లేని భావముతో నొక పద్యము వ్రాసెను.

ఓ. శూర్పణఖ భుజశక్తిచే ముల్లోకములను గెలిచిన రావణుని గూర్చి
కూడ కాలమహిమచే విచారింప వలసి వచ్చినదని పలికినప్పుడు మాల్యవంతుడు

గీ. "రఘూద్వహు బోటి
మేటి మగ డొకండు నేటిదాక
గలుగ కునికి జంక్తి గను శౌర్యమీదేశె
నెదురు లేనిచోట గదురు వాడి... ౪-౪౫

అని పలికినట్లు కవి ఒక అమూలక పద్యమును రచించెను. "ఎదురులేని చోట
కదురు వాడి" అను లోకోక్తి ఈ సందర్భమున నెంతయు సమంజసముగా
నున్నది.

ఔ. మాల్యవంతుడు శూర్పణఖతో జాంబవంతుడు శబరి తెల్పిన తన
పన్నాగము నిట్లు చెప్పెను. "భరత వార్తాహరణము కొఱకు నయోధ్య నుండి
కైకేయిచే పంపబడిన మంథరయను వృద్ధ దాసి మార్గమధ్యమున నత్యుగ్ర
సూర్యతాప విగతజీవియై మిథిలాభిముఖమైన శూన్యమార్గమున నున్నదని సూర్య
శిష్యుడైన హనుమంతుడు సతీర్థ్యుడైన యాజ్ఞవల్క్యుని సేవించి యిప్పుడేవచ్చి
నాతో చెప్పి యున్నాడు. అందుచే నీ విప్పుడు నీ శరీరమును హనుమంతుని
రక్షణమున నుంచి పరకాయ ప్రవేశ విద్యచే మంథరగా శరీరమును ప్రవేశించి,
మిథిలా నగరమునకేగి రామభద్ర వన ప్రేషణ భరతరాజ్య ప్రదాన రూపమైన
కైకేయి వరద్వయమును దశరథునకు తెలుప గలవు. అంత గురునిదేశముచే
రాముడు భయంకరమైన యడవిని ప్రవేశించి వైదేశికు డగుటచే వాలి వధ
పూర్వకమైన ప్రతీకార సంధిచే సుగ్రీవు నాశ్రయింప గలడు". తిమ్మభూపాలుడీ
వృత్తాంతము నంతను పెంచి తృతీయాశ్వాసమున పది పద్యములలో నిట్లు
రచించెను. జాంబవంతుడు మతంగాశ్రమ వాసినియైన శబరితో "కిష్కింధా
ప్రజలు వాలిచే నవమానితులై సుగ్రీవుని పట్టాభిషిక్తు నొనర్చ రాముని సాహా
య్యము నభిలషించుచుందురని చెప్పుచుండ నాంజనేయు డచటి కరుదెంచి
"సహపాఠి యైన యాజ్ఞవల్క్యుని పాదములు సేవించి నేను తిరిగి వచ్చుచుండ
మిథిలానగర ప్రాంత ప్రదేశమున సూర్యకిరణ తాపవ్యథచే పడియున్న యొక

వృద్ధ వనితను గాంచి నీ వెవ్వరి దానవు ? ఎందుండి వచ్చితివి ? ఏందు బోవల యును ? పేరెయ్యది ? తెలుపుమని యడుగ నామె సన్నని యెలుగుతో 'నాపేరు మంథర, భరతుని యోగక్షేమము లనరయుటకై అయోధ్య నుండి మిథిల కరుగుచు త్రోవ నీళ్ళు లేక పోవ గాళ్ళును రాక ఎండపిడుగు దాకి బెండు పడితి' నని పలికి నోటిమాట నోట నుండగనే ప్రాణములు విడిచెనని చెప్పెను. అంత జాంబవంతుడు తన కార్యము సానుకూల మగుచున్నదని సంశసించి, ఒక పన్నాగము పన్ని కైక వ్రాసినట్లొక లేఖను రచించెను. ఆ లేఖను శబరి కిచ్చి మంథర శరీరమును దాల్చి మిథిలానగరమునకు వెడలుమని ప్రార్థించెను, హనుమంతునికిని మంథరకును జరిగిన సంభాషణమును, జాంబవంతుడు లేఖ వ్రాయుటయు మూలమున లేవు. ఈ సంవిధానక మంతయు జాంబవంతుడు శబరికి కర్ణమున చెప్పినట్లున్నది.

అం. శూర్పణఖ పాలబుగ్గల క్షత్రియ కుమారు నెంత కొనల కెక్కించితి వని పలుక (3-79) మాల్యవంతుడు

క. చంచలలోచన ! యతనిం
గొంచెం బన జనదు దొడ్డ కొంచెంబుల బ్రా
పించునే బంటు తనంబులు
"గొంచెపు బిడుగులకు గాదె కొండలు పగులున్" 3-80

అని పలికెను. (3-78) ఇది అమూలకము. ఇందలి లోకోక్తి హృద్యముగ

అః పరశురాముడు శతానందుని నిందించుచు

క. ఎల్లరు వేల్పులు మును నీ
తల్లి నినుం గనిన యపుడు దరహాసమునన్
దెల్లముగ గుండ శబ్దము
పుల్లింగము సేసి తను చుబొగడరె నిన్నున్ 3-141

అని పలికెను ఇందు తిమ్మ భూపాలుని వ్యాకరణ పాండిత్యము ప్రకటితమగుచున్నది. సంస్కృతమున 'కుండ' శబ్దము పుంలింగ నపుంసక లింగములు రెండింట నున్నది. కుండు దనగా భర్త యుండగనే స్త్రీకి మఱియొకని వలన పుట్టిన కొడుకని యర్థము. పరశురాముడు బహుశః శతానందుడు అహల్యకు ఇంద్రుని వలన పుట్టినవాడని యధిక్షేపించుట కిట్లని యుండును. ఇచట 'పుల్లింగ' శబ్దప్రయోగము విచార్యము.

క. రాముడు మూర్ఛిల్లిన జనక దశరథులకు శైత్యోపచారము లొనరిం
చిన వృత్తాంతమును తిమ్మ భూపాలుడు
"చటుల హాలాహల చిట చిటాత్కృతివిని మైమఱచిన ధాత్ర
మఘవు లనగ" 3-214

ఇత్యాదిగా నొక సీసమున వివరించెను. రాముడు సీతాలక్ష్మణులతో పురము వెల్వడిన వృత్తాంతమును కూడ కవి (3-222) పద్యమున వర్ణించెను. ఈ రెండు పద్యములు నమూలకములే:

ఖ. భరతుడు తండ్రి మరణ వార్త రామున కెఱింగించి "నీవు వచ్చి రఘు రాజ్యము నధిష్ఠింపు" మని కోర రాముడు అనుబంధి (ఆగ్రహపరాయణః) యై సశపథముగా భరతుని నిషేధించెనని శబరి చెప్పినట్లు మూలమున నున్నది (పుట 264). తిమ్మభూపాలుడు రాముడు "తమ్ముని మమత జూచి అలరి నాయాన నీకు నేమనిన నింక తండ్రి యానతి జవదాట దగునె మనకు (4-11).

క. కావున నీవును దశరథ
భూవరు చందమున బ్రజల బోషింపుచు నెం
తే విభవ మలర నీతిం
గావింపుము రాజ్య పాలకత్వము ననఘా ! 4-12

అని చెప్పినట్లు అమూలక పద్యమును వ్రాసెను అనుబంధి యనగా ఆగ్రహపరాయణుడని టీకా కర్త వ్రాసెను. ఇంతకంటె 'మమత చూచి' యనునదే యుచిత తరముగా గన్పించుచున్నది.

గ. జటాయువు రావణుని తాకెనని తెలుపుటతో పంచమాంకము నందలి విష్కంభము ముగియుచున్నది. ఈ సందర్భమున తిమ్మ భూపాలుడు రావణ జటాయువులకు హోరాహోరిగా పోరాటము జరిగెననియు జటాయువు రావణుని తుంగ శతాంగముల నడచి యతని వక్షమును పొడిచెననియు, రావణుడు కోపమున జటాయువు పక్షములను ఛేదించి సీతను గొని వెడలి పోయెననియు (4-45) నొక వచనమున వివరించి కథాసంబంధము నవిచ్ఛిన్నము గావించెను.

వాలి రాముని జూచి "అస్మద్దోర్యుగ్మ కూలంకష ..." 5-50

ఇత్యాది శ్లోకములను పలికినట్లు మూలమున గలదు. (నేను రావణుని గెల్చితిని. కార్తవీర్యుడు కూడ రావణుని గెల్చెను. అందుచే నాయాధిక్య మేమియు లేదు. కార్తవీర్యుని పరశురాముడు జయించెను. పరశురాముని నీ వోడించితివి. నిన్నోడించు వఱకు సంతోషము కలుగదని దాని భావము) తిమ్మ భూపాలుడు దీనికి

ఘన మద్దోర్మ్యాల కూలంకష (4-135)

కినుకంజంక బిగింప పిక్కటిలి (4-136)

అను రెండు పద్యములు వ్రాసెను. ఈ రెండును సమానార్థకములే. మొదటి మహాస్రగ్ధర యందలి పూర్వ భావమున నున్న పెద్ద సమాసము మూలము నందున్నట్టిదే. పాండిత్య ప్రకర్షకై దానినట్లే వ్రాసి తిమ్మభూపాలుడు సులభ మైన పదములతో రెండవ పద్యమును వ్రాసెను. శ్రీనాథుడు కూడ నైషధమున "కమలేందీవర షండ మండిత" అను పద్యము నందలి భావమునే "మృదు రీతిన్ ... ... ... ..." అను పద్యమున మఱల వివరించి యుండెను.

రత్నచూడుడు హేమాంగదునితో "సువినిహిత చంద్రహాస వ్రణ కిణవల యోపహసిత హారేషు" (6-71)

అను శ్లోకమున రాముని బాణ గణములు రావణుని కంఠముల యందు పడు చున్నవని వర్ణించెను. తిమ్మ భూపాలుడీ భావమునే 4-327 – 328 పద్యము లలో రెండు మాఱు లనువదించెను.

ఘ. రావణ మరణానంతరము మండోదరి విలపించు సందర్భము నందలి "అట్టి మయుపట్టి జగజెట్టియైన యట్టి" (4-356) అను ద్విత్వటకార వృత్త్య ప్రాసముతో గూడిన గీత పద్య మమూలకము. మూలము నందలి 'వందారు బృందారకబృం" దేత్యాది పద్యమందలి భావమును పూర్తిగావించుటకై కవి దీనిని కల్పించెను. అట్లే చతుర్థాశ్వాసము నందలి 233, 319 లోని గీత పద్య ములు, అమూలకములు.

చ. రాముడు మాహిష్మతీ నగరమును వర్ణించిన పిమ్మట యమునా నదిని గూర్చి సీతకు చెప్పినట్లు (7-116) మూలమందున్నది. ఈ సందర్భమున ఆంధ్ర కవి అమూలకమైన యొక వచనమును చేర్చెను. (5-198)

తిమ్మభూపాలుడమూలకముగా వ్రాసిన గద్య పద్యములు మఱికొన్ని యిచ్చట సూచింపబడుచున్నవి.

1. వశిష్ఠ మహిమ వర్ణనము 1-183
2. కథా సంబంధము నవిచ్ఛిన్నము చేయు వచనము 1-261
3. రామలక్ష్మణులు విశ్వామిత్రునితో నరుగుచుండ దశరథుడు వేడి నిట్టూర్పులు నిగుడ్చుట 1-270
4. అహల్యా సంక్రందనుల శృంగారము 2-27 నుండి 34 వఱకు
5. జాంబవంతుని మహత్త్వము 2-61
6. వటువులు గోవులను మేపుటకై పడు క్లేశము 2-86
7. రాముడు చీకటిని వర్ణించు సీసము నందలి గీతము 2-150, 151.
8. కంచుకి వర్ణనము 2-225.
9. కలహంసి కంచుకితో పల్కిన పల్కులు 2-242
10. శూర్పణఖ దశరథుడు రాము నడవికి పంపుట మున్నగు ప్రశ్నలు మాల్యవంతు నడుగుట 3-72
11. దశరథుడు పరశురాముని ననునయించుట 3-125
12. పరశురాముడు రాముని నిరసించుట 3-176
13. జనక దశరథుల మూర్ఛను వర్ణించు పద్యములు 3-212 – 213
14. రాముడు సీతాలక్ష్మణులతో మిథిలానగరము వెల్వడుట 3-225

ఆలంకారికమైన పెంపు :

తిమ్మభూపాలుడు మూలమందున్న అలంకారములలో కొన్ని అంశములు లోపించి యున్నప్పుడు వానిని పూరించి సమగ్రత నాపాదించును. మఱికొన్ని చోట్ల అమూలకములగు అలంకారములను చేర్చి భావమునకు సౌందర్యమును కొని తెచ్చును.

అ. విశ్వామిత్రుడు వామదేవునితో, దశరథుని చూడ రాగలుగుటచే తన కన్నుల కానందము కలుగుచున్నదని తెలుపుచు "సఖే! వామదేవ, ఇయ మనేన పీయూషతుపార శీకరసార వర్షిణీ సుజన సంవాద కౌతుక మేఘలేఖా పౌలస్త్యే నేవ మరుతా లోకనాథేన సహస్ర శిఖరే క్రియతే" అని పలికెను (1-25 పుట). అమృతమనెడి హిమాంబు కణముల వర్షమును జిందు సుజన పరస్పరాలాప మందలి ఆనందమనెడి మేఘలేఖ తూర్పుగాలిచే వలె లోకనాథుడైన ఈ రాజుచే విస్తరింప చేయబడుచున్నది అని దీని భావము. తిమ్మభూపాలుడీ వాక్యమును "వయస్యా వామదేవా! మద్భావంబు చాతకంబుగా, జల్లని అమృతంబు చిలుకు సుజన సంవాదాను మోదంబను పయోదంబునకు దూర్పు దెమ్మెర కరణి నిత్తర ణికుల కేతు వళివర్థనహేతువయ్యె" (1-122) అని అనువదించెను. మేఘములు చిందు వాన చినుకులకు చాతకము లెదురు చూచుచుండుట కవి సమయసిద్ధము. దానిని పురస్కరించుకొని కవి మద్భావంబు చాతకంబుగా అను పదములను జేర్చి రూపకాలంకారమును సమగ్రము కావించెను. మఱియు ఇత్తరణికుల కేతు వళివర్ధన హేతు వయ్యెనని శబ్దాలంకారమును గూర్చి కావ్యమున కొక సౌంద ర్యము కలిగించెను.

ప్రకాశ టీకాకారుడు 'పౌలస్త్యేన మరుతా పూర్వదిగ్దేవేన శక్రేణ' అను నర్థము కూడ చెప్పి 'యథా జల శీకరాసార వర్షిణీ ఘనమాలా పౌలస్త్య వాతేన సహస్ర శిఖరతాంప్రాపయ్య విస్తార్యతే తథై వేంద్రేణ దశరథేనసహవార్తాలాన కౌతుకం సహస్ర వర్త్మను విస్తార్యతే. ఇంద్రః సర్వదా దశరథేన సహ వార్తా లాపం కామయతే ఇత్యర్థః"[24] అని వ్రాసి యుండెను. తిమ్మభూపాలుడీ అర్థ మును భావించి యుండలేదు. కాని ఈ సందర్భమున నింద్రుడు దశరథునితో సంభాషణముచేయ కుతూహల పడుచుండు ననుట కంటె విశ్వామిత్రుడే దశర థునితో సంభాషించుటకు కుతూహల పడుచున్నాడని చెప్పుటయే యుక్తతర ముగా నుండును.

ఆ. వశిష్ఠానుశాసనము వినగోరు దశరథుడు వామదేవునితో "వామదేవ! మమహి గురువచన శ్రవణ తృష్ణా మంకుశీ కరోతి శ్రోత్రవృత్తి రింద్రి యాంత రాను సారిణో హృదయ మహాగజస్య" అని పలికెను. నా శ్రవణ వ్యాపారము ఇతరేంద్రియముల ననుసరింప గోరు హృదయరూపమైన ఏనుగునకు గురూపదేశ శ్రవణాభిలాషను అంకుశమువలె చేయుచున్నది అని అర్థము. అనగా నా మన

స్సెప్పుడు విషయాంతర ప్రసక్తమగుటకు కోరునో అప్పుడే దానిని నా శ్రవణ వ్యాపారము గురువచన తృష్ణారూపమైన అంకుశముచే ఆ విషయాంతరము నుండి మరలించుచున్నదని భావము. వ్యాఖ్యాత యిచ్చట మావటీడు మార్గాంతరము ననుసరింప గోరు నేనుగును ఆ కుశముచే మరలించు నట్లని వివరణము గావించెను. తిమ్మ భూపాలుడు కూడ పై వచనమును "మునీంద్రా మదీయ శ్రవణ వృత్తియను మావంతుడు గురువచన తృష్ణాంకుశంబున నింద్రియానుసారి యగు మానసంబను నేనుంగు న్నొునీక మరల్చెడు" (1-174) నని అనువదించి శ్రవణ వృత్తిని మావంతునితో బోల్చి ఇచ్చటి రూపకమును సర్వాంగ సుందర మొనరించెను.

ఇ. ద్వితీయాంకమున శునశ్శేపుడును, వటుడును విశ్రమించిన పిమ్మట వటుడు "దేవేంద్రుడు కూడ విషయాకృష్టుడై యట్టి దుష్క్రియ నేలచేసె" నని యడుగ శునశ్శేపుడు నవ్వి "బాగుగా చెప్పితివి. లోకమల్పబుద్ధి గదా, ఐహిక సుఖప్రాప్తి ప్రయాసమువలన పెక్కు రాత్రులు నశింప జేయబడుచున్నవి. హృదయావర్జకములైన స్త్రీ ధనాదులచే ఆకర్షింపబడు నేత్రద్వయమునకే జనుడు వివేకము నంకుశముగా చేయుటకు శక్తుడు కాకున్నాడు. అట్టియెడ నంత విభవముండగా నయన సహస్రమునకు వేల్పు ఱే డెట్లు చేయనేర్చు" నని పలికెను. తిమ్మ భూపాలుడు దీనిని

కం. మనము హరించు నతాత్విక
ఘన విషయము లనెడు ఘటులు గవయించుకొనం
జను కనుగవ యేనుగునకు
జనుడోపడు తెలివి నంకుశము గావింపన్ 2-42

అని విషయము లందు ఘటత్వము, కనుగవయందు గజత్వమును ఆరోపించి రూపకమును సమగ్రము కావించెను.

ఈ. శూర్పణఖ మాల్యవంతుని జూచి "కథమిహైవాట్టాలక శిఖర ప్రగ్రీవే మాతామహః" అనుకొనెను (పుట 274) తిమ్మ భూపాలుడు దానిని "ఇదె కట్టెదుట నట్టాలక మత్తవారణ మధిష్ఠించి మా కనిష్ఠ మాతామహుండున్నవాడు" (2-24) అని అనువదించెను. మత్తవారణ మనగా ఒఱగుదిండు, మదించిన యేనుగు నను అర్థములున్నవి తిమ్మ భూపాలుడు అట్టాలకమును

మత్తావారణముతో పోల్చి మూలమున లేని అలంకారమును కల్పించెను. ద్వితీయాశ్వాసమున ప్రదోష వర్ణనమునగల వచనము (2-207) చక్కని అనుప్రాసాలంకారములతో కూడి యున్నది.

ఉ. పరశురాముడు రామునిపై నాగ్రహించి "మున్ను కార్తవీర్యార్జునుడు మా తండ్రి హోమధేనువును హరించి నా కోదండము ననేక రాజక వధ స్వాధ్యాయమును పఠింపజేసెను. కార్తవీర్యుని యందలి వైరముచే క్షత్రియుల యందు నేను జూపిన కోపము సామాన్య మైనట్టిది. అది గుణీభూతము. కాని నీయందు నాకు గలిగిన కోపము గురుధనుర్భంగముచే హేతుమ్మంత మైనదని పలికెను" (4-54) ఇందలి ఉత్తర భాగమును తిమ్మ భూపాలుడు "మదితత్ క్రోధ మహాగ్ని మీ యెడ కడున్ సామాన్య మయ్యేన్ బదంబదిగా నేడు వెలింగెడున్, గురుధనుర్భంగాజ్య ధారాహుతిన్ (8-177) అని తెనిగించుచు క్రోధము నందగ్నిత్వమును, గురు ధనుర్భంగమునందాజ్య ధారాహుతిత్వమును నారోపించి అమూలకమైన రూపకమును ప్రవేశపెట్టెను.

ఊ. పంచమాంకమున శబరి కాకాసురునిపై నిషీకాస్త్రమును సంధించి రాముడు అతనిని గ్రుడ్డివానిగా నొనరించెనని "తమ ఙ్గాకాణీచకార" (5-3) అని చెప్పినట్లు మూలమున నున్నది. తిమ్మ భూపాలుడా భావము ననువదించుచు "నేర్పున నయనాంధుజేసె" ననిన పిమ్మట "రఘుపుంగవు కాండము రిత్తవోవునే" (4-21) అను వాక్యమును చేర్చి అర్థాంతరన్యాసమును కల్పించెను.

ఋ. సీత రాముని జూచి "ఆర్యపుత్ర ! కిష్కింధేశ్వర స్కంధావార ధురంధరః రఘుకులకుటుంబ విధుర బంధుః సకుత్ర హనుమాన్" అని యడిగెను (పుట 401) తిమ్మభూపాలుడు దీనిని పెంచి క్షకారవృత్త్యను ప్రాస సమేత గీతముతో గూడిన యొక పెద్ద సీసమును వ్రాసెను. (5-21)

ౠ. సప్తమాంకమున కాశికా పట్టణమును వివరించు సందర్భమున శివునకు బిభ్రద్బ్రహ్మశిరః (7-122) అను విశేషణము వాడబడి యుండ తిమ్మ భూపాలుడు "పంకేజసూతి కపాలంపు హరివాణ మొక్క కేల్దామర నొప్పు చూప" (5-207) అని కపాలమును హరివాణముతో పోల్చి వ్రాసెను.

ఎ. సన్నాహపటము మ్రోయగానే రాక్షస గృహములందు జరిగిన కోలాహలమును రత్నచూడుడు (6-26) శ్లోకమున వర్ణించెను. తిమ్మ భూపాలుడు

దానిని సీస పద్యములోని కనువదించుచు "అసమ సురతరు వికసిత కుసుమ విసర సరస పరిమళ సురభిల శయన శయిత" అను వృత్త్యను ప్రాస సుభగ మగు గీతము నధికముగా వ్రాసెను. (4-225)

## 12. లోకోక్తి పూర్వకమైన పెంపు :

మూలమున లేకున్నను తెలుగు కవి అచ్చటచ్చట దేశమున వాడుకలో నున్న చక్కని లోకోక్తులను చేర్చి పద్యభావములకు పుష్టి కలిగించెను.

అ. వామదేవుడు వశిష్ఠుని మహిమను ప్రశంసించుచు "కౌశిక స్వీకృత స్యాపి" అను శ్లోకమున వశిష్ఠుని యాజ్ఞ నతిక్రమించుట వలన విశ్వామిత్రునిచే స్వీకరింపబడిన వాడైనను త్రిశంకునికి భువిగాని, దివిగాని ఉపభోగార్హము కాక పోయెనని చెప్పి యుండెను. దీనిని తిమ్మ భూపాలుడు

గీ. కౌశికుని పట్టు గలిగియు గాసి నొందె
నజ్జుడై యే తపోధను నాజ్ఞమీఱి
యకట దివియును భువియుగానక త్రిశంకు
భూవరుడు రెంటికిని జెడ్డ రేవ డగుచు 1-182

అని అనువదించెను. పై అమూలక లోకోక్తి వలన భావమునకు పుష్టి కలుగు చున్నది. ఈ పద్యమున చేయబడిన విశ్వామిత్ర ప్రశస్తి తరువాత జరుగు విశ్వా మిత్ర ప్రవేశమును సూచించుచున్నది.

ఆ. శౌష్కలుడు రామలక్ష్మణులను జూచి క్రోధ శోకములతో "హాపత్నే! సుకేతునందిని! తాటకే! కథ మీదృశాన్ మనుష్యడింభాత్తా దృశః దైవ దుర్వి పాకస్తే సంవృత్తః" (పుట 165) అని అనుకొనెను. తిమ్మ భూపాలుడు దానిని

ఆ. హా సుకేతుపుత్రి, యక్క జంబగు సీదు
లావు పెంపు దక్కె దైవ వశత
నొక్క నరుని వలన నుక్కడగితి వెటు
తగరు దాక గొండ పగిలినట్లు 2-386

అను నపమాన పూర్వకమైన లోకోక్తి నుపయోగించెను.

ఇ. శౌష్కలుడు శతానందు నధిక్షేపించుచు నహల్యాసంక్రందనుల ప్రణయ వృత్తాంతము పెంచి

గీ. ఆయహల్యకు బుట్టిన యట్టి నీకు
దలప వేరొక గుణమేల కలుగ నేర్చు
దల్లి బడిపిల్ల యను మాట యెల్ల జనులు
పలుకుదురు కాదె లోకటిపాట గాగ 2-369

ఇందలి భావము అమూలకము. సందర్భోచితముగా నిచట "తల్లి బడి పిల్ల" యను లోకోక్తి వాడబడినది.

ఈ. మాల్యవంతుడు శూర్పణఖతో రాముడు స్వభావ మధురుడయ్యు త్రిజాతికుడైన విశ్వామిత్రుని వలన కృతాధ్యయను డగుటచే నిందితాచారు డగు నని తెలిపి "భవతు కి మతి క్రాంతోప వర్ణనేన" అని పలికెను. తిమ్మభూపాలుడు దీనిని

కం. అంగన యింకిట వర్తిం
పం గారణమేమి ? యైన పనులై పోనీ
మ్రింగిన కదులకు జవులడు
గంగా నేమిటికి మీది కార్యము వినుమా" 3-87

అని యనువదించెను. ఇందలి లోకోక్తి కవి కల్పితము,

ఉ. పరశురాముడు 'విశ్వామిత్రునిచే గొన్న నీఘనశస్త్రాస్త్రములు ధరింపు'మని విశ్వామిత్రుని కూడ లక్ష్యము చేయకుండ పలుక రాముడు "అయే! భగవంతం విశ్వామిత్ర మపి స్పృశతి" అని అనుకొనెను. తిమ్మ భూపాలుడు దానిని

ఉత్సాహ — అనుడు నెంత నెత్తుకొనియె నౌర యితఁడు గాధినం
దనుని మోవ నాడెనైన దానికేమి యాడనీ
కనలి "త్రుళ్ళు నెద్దుగాదె గంత మోయు" నంచనె
మ్మనమునం దలంచి నృపతి మౌనితోడ నిట్లనున్ 3-116

అని ఉచితమగు లోకోక్తిని ప్రవేశ పెట్టెను.

ఊ. జనకుడు మము బోటి శాంతులను గూడ క్రుద్ధులను గావించి ధను ర్గ్రహణమునకు ప్రేరేపించుచున్నాడని పరశురామునితో పలుక నతడు

క. ఉలికి పడి షౌని ఇట్లను
బళిరోరి ! విదేహ వంశ పాంసన ! నీవుం
బలు పోటరి వలె వెఱవక
పలికెద విటు, వెన్న కౌర పండులు వచ్చెన్. 3-132

అని పలికెను. ఇందలి సామెతకు సాధువులు, నసమర్థులు నైన వారు కూడ ఎదురు తిరుగుచున్నారని భావము.

ఋ. లక్ష్మణుడు పరశురామునితో దురుసుగా మాటలాడుటను జూచి రాము డతనిని నివారించెను. లక్ష్మణు డంత శాంతించి రామాజ్ఞాయంత్రితుడగు తాను శాంతింపవలసి వచ్చెనని పలికెను. అంత పరశురాముడు రామునితో

ఆహవ వ్యగ్రమగు మదీయాగ్రహంబు
వాయదీ మంచి మాటల "బాము కాటు
చీరదుడిచిన జనునె యే సీమ నైన" 3-155

అని పలికెను. ఇచటి లోకోక్తి సందర్భమున కనుగుణమై చక్కగా నున్నది.

ౠ. మాల్యవంతుడు అంగదుని సుగ్రీవుని పక్షమునుండి విడదీయుట మంచి యుపాయమని సూచింప సారణు డది సాగదని తెల్పి

గీ. ఎద్ది సమ్మత మది సేయు డిపుడు మీరు
దినములున్నవె దండ నీతి ప్రయోగ
మునకు, "జిచ్చైన వేళ నెవ్వని తరంబు
బావి ద్రవ్వంగ" నని పల్కి వాడు మఱియు 4-190

అని చక్కని లోకోక్తిని చేర్చెను.

**13.** పద్యపాద విస్తరణాత్మకమైన పెంపు :

తిమ్మ భూపాలుడు మూలమునందలి శ్లోకములను అనువదించుపట్ల నొక్కొక్కప్పుడు సీసపద్యము గ్రహించును. అప్పుడు శ్లోక భావానువాదము పూర్తియైనను సీసపద్యము పూర్తికాదు. అట్టి సందర్భములందు సందర్భాను గుణముగా స్వీయభావములతో, మిగిలిన పద్యపాదములను పూరించుచుండును. అట్టి సందర్భములు కొన్ని యీ క్రింద నీయబడుచున్నవి.

అ. విశ్వామిత్రుడు తనతో రాముని పంపుమని దశరథు నడుగునపుడు

సీ॥ శరదంబు మాటుగా జలరాశి తన నీట
ధరణీతలంబెల్ల దనుపురీతి
వరుణుండు చాటుగా నాత్మీయ కరరేఖ
ధరణి చీకటుల బోదరుము కరణి
పనటి యద్దంబుగాననలు డన్నమునై జ
శిఖలచే పక్వంబు జేయు మాడ్కి
గరువలి మరువుగా గస్తూరి దశదిశల్
స్వీయ వాసనల వాసించు పగిది
నీవు శ్రీరాము ముఖమున నీ ప్రతాప
వైభవము మీఱ బ్రోవు మావంటి ప్రజల
నధిప ! మీ వంటి పరపురుషార్థ పరుల
కిదియు నొక శిలమౌగద ! మద దలంప 1-220

అని పలికెను. పై సీసపద్య మందలి 3,4 పాదము లందలి భావ మమూలకము తిమ్మ భూపాలుడా రెండు పాదములను సందర్భానుగుణముగా కల్పించి వ్రాసెను.

ఆ. ద్వితీయాంకమున తాటకాగమనము నేపథ్యమున సూచింపబడినది. "నిర్యజ్జచ్ఛుకరంతః ... .... ..." (2-54) ఇత్యాది శ్లోకము ఆమె భీకరాకారమును వ్యక్తము చేయుచున్నవి. తిమ్మభూపాలు డీశ్లోకమును సీసపద్యముగా ననువదించుచు సందర్భోచితముగా

పునుకకంచమున నించిన క్రొత్తనెత్తురుల్
జుట్టు జుట్టున సారె జుట్టుకొనుచు
నవతంసగత శోణితామ్ల గంధమునకై
నురియు నీగల బాఱజోపి కొనుచు 2-154

నని 3, 4 పాదములను పెంచి వ్రాసెను.

ఇ. రెండవ యంకమందలి 75వ శ్లోకము నీదలను వర్ణించుచున్నది. తిమ్మభూపాలుడు దానిని సీస పద్య రూపమున పెంచి వర్ణించెను (2-195). సీసమందలి 2, 4 పాదములును, గీతమందలి పూర్వార్ధమును నమూలకములై నట్టివి.

ఈ. జనకుడు "మీ రాక్షస రాజునకు సేమంబే కదా" యని శౌష్కలు నడిగి "యధర్మోపాయ విదులు మీరుండగా రావణునికి శుభములు ప్రాపించుట యడుగ నేల ?" యని పలుక శౌష్కలుడు నవ్వి "రావణున కప లాపదలు కలిగిన కదా ! మా మంత్రములును గింత్రములును" అని పలికి యాతని పరాక్రమమును

సహరించె నెవ్వాడు జయలక్ష్మి పటుభుజా
ప్రగ్రీవ సుభగ సౌధాగ్ర సీమ 2-343

అను సీసమున వర్ణించెను. ఇందలి 1, 4 సీస పాదములును, గీతమందలి పూర్వార్ధమును ఆమూలకము లైనట్టివి.

ఉ. చతుర్థాంకము ప్రభాత వర్ణనముతో నారంభించుచున్నది. "స్తోకో నిద్ర నిదాఘదీధితి ... ... ..." (4-1) అను శ్లోకమందలి భావమును (3-3) సీస పద్యమందలి 1, 2 పాదములందు తెలిపి తిమ్మ భూపాలుడు మిగిలిన పద్యమునంతను స్వీయ భావములతో పెంచి వ్రాసెను.

ఊ. మాల్యవంతుడు నీతియుక్తుడైన జనకుడిట్టి యకార్యమెట్లు గావించెనని తలపోసి

ప్రపితామహుండైన పంకేరుహాసను
దనలోన జీటికి గొనకయున్న 3-19

ఇత్యాదిగా గల సీసమున తన చింతను ప్రకటించెను. ఇందు 1, 3, 4 సీసపాదములు కవి సందర్భోచితముగా కల్పించినవి.

ఋ. మూర్ఛిల్లిన జనకుడు తెప్పిరిల్లి కైకేయి నుద్దేశించి "అహహ !"

పాణి గృహీతో రఘుపుంగవేన దేవః పురాణః
శ్వశురోవివస్వాన్ ।
పితాస్వయం కేకయ చక్రవర్తీ కర్మేద మేతాదృశ
మాః కిమేతత్ ॥" 4-67

అని పలికినట్లు మూలమున నున్నది. తిమ్మ భూపాలుడు దీనిని

త్రిభువన ఖ్యాత కీర్తి కలాపుడైన కే
కయ చక్రవర్తి నీ కన్న తండ్రి 3-216

అను సీస పద్యమును పెంచి వ్రాసెను. "దేవః వివస్వాన్ పురాణః శ్వశురః" అని మూలమున నుండ తిమ్మ భూపాలుడు "కైరవారి నీశ్వశురాన్వయంబు కర్త" యని వివరించెను. "అభియాతి నృప సేవితాంఘ్రినరోజుడై యలరిన యజుడు నీయనుగుమామ" అను పాద మమూలకమైనట్టిది.

బూ. గుహుడు మతంగాశ్రమమునకు త్రోవ చూప నందఱు నట్లరుగు చుండిరి. అతడు 4-80 వ సీసమున వింధ్య వనరేఖలను వర్ణించెను. వింధ్య రేఖలకు "ఫల పులకిత జంబూకుంజ కూజ త్కపోతప్రియశబర పురంధ్రీ బంధవః" అని మూలకర్త విశేషణమును వేసెను. ఫలములతో నిండిన జంబూ కాననము నందు కూయుకపోతముల యందు ప్రీతిగల శబర స్త్రీలకు మిత్రము లని దీని కర్థము. తిమ్మభూపాలుడు దీనిని

లలిత ఫలావళీ పులకిత జంబూని
కుంజ కూజ త్కీరకోటివలన
శబర పురంధ్రికా సంతోషకర హుంకృ
త స్వనాంచిత కపోతములవలన 4-80

అని మూలమున లేని కీరములను క్రొత్తగా ప్రవేశపెట్టెను. జంబూ ఫలములను తిను స్వభావము కపోతములకు గాక కీరముల కుండునని యతడు భావించి యుండుసు. మూలమున వింధ్య రేఖలు శబరస్త్రీలకు బంధువులని వర్ణింపబడినవి. తిమ్మ భూపాలుడు కపోతముల స్వనములు శబర పురంధ్రికా సంతోషకరము లని వర్ణించెను. ఇట్లే నాల్గవ పాదమునందలి చాతకముల వర్ణనముకూడ అమూలక మైనట్టిది.

ఎ. రాముడు గంగను వర్ణించిన 6-203 వ సీసమున 2, 3, 4 పాద ములను కవి కల్పించి గంగావతరణ క్రమమును సూచించెను. కాని "సేయం మౌళి విభూషణం భగవతోభర్గస్య" (7-119) అను పాదమునేలొకో విడిచి వైచెను.

ఏ. వశిష్ఠుడు రాముని ప్రశంసించుచు చెప్పిన సీసమున (?-255)

తార భూధర సముద్ధరణ ప్రచండిమో
ద్దండ పాండితిమించె దశముఖుండు

అను మొదటి పాదము కవి కల్పితము. ఇది రావణుని పరాక్రమమును సూచించు చునే రాముని శౌర్యమును ద్విగుణీకరింప జేయుచున్నది.

ఐ. 7-152వ శ్లోకము భరత వాక్యమున దగియున్నది. తిమ్మ భూపాలుడు దీని ననువదించుచు

ధర్మదేవత నాల్గు పాదముల నిలువ
బహుల సస్య సమృద్ధిచే బ్రజయెసంగ
వితత రాజన్వతీ సంజ్ఞ వెలసి ధరణి
తనరుగావుత మాచంద్ర తారకముగ 5-285

అను గీతమును పెంచి వ్రాసి భూమికిని ప్రజలకును మేలు కలుగు గావుతమని శుభాశంసనము కావించెను.

## 14. మూలమునకు మెఱుగులు దిద్దుటకై కావించిన విస్తరణము :

అనువాదకర్త ఒకానొకచో మూలమున లేని అంశములను చేర్చి భావమునకు రామణీయకము నాపాదించును. కొన్నిచోట్ల మూలమున సంగ్రహముగనున్న వాక్యములను విస్తరించి వానిని ప్రబంధోచితముగ తీర్చిదిద్దును.

విశ్వామిత్రుడు రాముని తనతో పంపుమన్నప్పుడు దశరథుడు మొదట కొంత సంశయించి తరువాత వశిష్ఠుని ఆదేశము జ్ఞప్తికి రాగ నిట్లు తలంచెను. "విహాస్యకాగతిః"

కూర్మరాజ భుజగాధిప గోత్ర గ్రావదిక్కరిభి రేకధు రీణః
మాం ప్రసూయ కథ మస్తు నిగీతో-హా పరార్థ విముఖో రఘువంశః
[1-39]

(నవ్వి) ఏమిగతి! ఆది కూర్మము, సర్పరాజైన శేషుడు, దిగ్గజములు అనువానితో సమాన దురంధరమైన రఘువంశము నన్నుగని యే విధముగా పరార్థ విముఖమై నిందితము కాజాలునో అని దీని అర్థము. ఇచ్చట నిజమునకు నవ్వుటకెట్టి అవకాశమును లేదు. అందుచే తిమ్మ భూపాలుడు విహాస్య అనుదానిని విడిచి పై శ్లోకమును

మ. ప్రకట ప్రౌఢిమ గూర్మరాజ భుజగేంద్ర స్తబ్ధ రోమాధినా
యక దిక్కుంభి కులాచ లాధిపులతో నానంగ బెన్నుద్దియై
సకలోర్వీ భరమున్ వహించు రఘువంశంబే జనింపంగనే
దకటా! నిందితమై పరార్థ విముఖంబైనన్ జనుల్ నవ్వరే 1-228

అని తెనిగించెను. ఇందు 'స్తబ్ధరోమాధి నాయక' అను పదము అమూలకము, దానికి 'ఆదికిరి' అని అర్థము. భూమిని వహించు వానిలో నాది వరాహమును గూడ చేర్చుట సంప్రదాయమగుటచే తిమ్మ భూపాలుడు దానిని కూడ చేర్చెను. "జనుల్ నవ్వరే" అనునది కూడ మూలమున లేదు. రాముని పంపుటకు వెను దీసినవో జనులు తన్ను చూచి నవ్వుదురని దశరథుని అభిప్రాయము.

ఆ. జనశ్శేముడు భయ కారణ మడుగగా పశుమేధ్రుడు "అద్య రామ ఇతి కోపి క్షత్రియ కుమార ఆగత ఇతి శ్రుత్వా కుతూహలేన ధావతః తపో వన పర్యంత పరిస్థితా ప్రస్తర పుత్రికా సత్యా మానుషీ భూయ మమైవ సముఖం పరాపతితా. తాం ప్రేక్ష్య ఉత్తరా సంగపల్కల మప్యుజ్ఝిత్వా పలాయితోస్మి" (పుట 62) (నేడు రాముడను నొక క్షత్రియ కుమారు దరుదెంచెనన విని కుతూ హలముతో పరుగిడుచుండ తపోవన సమీపవర్తిని యైన రాతిబొమ్మ నిజమైన యాడుదియై నా కెదురుగా వచ్చినది. దానిని చూచి ఉత్తరీయముగా ధరించిన వల్కలమును గూడ విడిచి పాఱి వచ్చితినని పలికెను) ఈ విషయము మూల మున సంగ్రహముగా నున్నది. తిమ్మ భూపాలుడు దానినించుక పెంచి

సీ. వినవయ్య యిన వంశ వనరాశి చంద్రుండు
  రామచంద్రుండను రాకుమారు
డొకడిపు డేతెంచి యున్నవా డనవిని
  వేడుక తోడ నే జూడ బోవ
బెనుకాలమున నుండి మనయాశ్రమ ప్రాంత
  భూతలంబున నున్న జాతి ప్రతిమ
నిక్కంపు టాడుదై నీటున గను పట్టి
  యెదుటుమై నడిచె నాకెదురు గాగ

గీ. నిట్లు నడతెంచు దని యుద్వృత్తి గాంచి
గుండె వగిలిన బైగప్పు కొన్న నార
పంచె గుడ్డయు నచటనే పాఱవైచి
చావు పరుగున వచ్చితినో వయస్య ! 2-20

అని అనువదించెను. ఈ యనువాదము మిక్కిలి సుందరముగా నున్నది. ఇందు 'ఇన వంశ వనరాశి చంద్రుండు', "పెనుగాలమున నుండి" "నీటున గనుపట్టి"

"అదుటుమై" "ఇట్లు నడతెంచు దాని యుద్వృత్తిగాంచి" "గుండె పగిలిన" 'చావు పరుగున' అను పదములు అమూల్యకములు. చావుపరుగున అనునది చక్కని జాతీయము. అది ఈ సందర్భమున అర్థ గంభీరముగ వాడబడినది.

వటువు తన భయకారణమైన విషయమును తెలుపగా శునశ్శేపుడు నవ్వి "సఖే సాధు కృతం దిష్ట్యాహి జీవతః పునరావృత్తిః" అని పలికెను. దానిని తిమ్మభూపాలుడు

గీ. మేలు మేలు వయస్య! యమ్మృత్యుయువతి
బారి బడియును మఱి ప్రాణ భయములేక
మఱుకి వచ్చిన నిను గంటి, జగతి నోము
లెన్ని నోచెనో మున్ను నాకన్ను దోయి 2-22

అని సరసముగా అనువదించెను.

ఇ. ద్వితీయాంకమున జాంబవంతుడు వాలికి రావణుని తోడి మైత్రి యనుపకారిణి యని తెలుపుచు దానికి శంకరుడే ఉదాహరణమని యీ శ్లోకము చెప్పెను.

ఉక్షా రథో భూషణ మస్థి మాలా
భస్మాంగ రాగో గజచర్మ వాసః
ఏ కాలయస్తేపి ధనాధి నాథే
సఖ్యా దశేయ త్రి పురాంతకస్య 2-7

వృషభము రథము, ఎముకల పేరు భూషణము, విభూతి యనులేపనము, గజ చర్మము వసనము, ధనాధినాథుడైన కుబేరుడు ఏ కాలయవాసుడైన మిత్రుడై నప్పటికిని శివుని పరిస్థితి యీ విధముగా నున్నది). తిమ్మభూపాలుడీ భాగమును

సీ॥ ముది గోదయే కాక మదికి ముచ్చటయైన
నెక్క గల్గెనె బక్క జక్కి నైన 2-58

అను పద్యమున తెలుగు జాతీయములతో విస్తరించి వ్రాసి దానిని రమణీయ మొనరించెను.

ఈ. విశ్వామిత్రుడు రామలక్ష్మణులను జూచి నవ్వి "వత్సౌ సమంతా దుప శిలితోయం సన్నివేశః కచ్చిదస్మదీయా స్తపోవన భూమయః రమయంతి

హాం ఉప స్నేహయతి వా గార్హస్థ్య మృషీణాం'' (వత్సలార ! ఈ ఋష్యా వాస భూమి యంతయు చూచినారా, మాతపోవన భూములు మీ హృదయముల నాకర్షించుచున్నవా ? ఇచ్చటి ఋషుల గార్హస్థ్యము మీకు ప్రీతి కల్గించుచున్నదా) అని అడిగెను. ఈ సందర్భమున తిమ్మ భూపాలుడు ఆశ్రమము నందలి జంతువులను వర్ణించుచు నొక సీస పద్యమును, ఋషులను వర్ణించు నొక సీసమును విస్తరించి వ్రాసి (2-182, 183) ఆ ఘట్టమును ప్రబంధోచితము గావించెను.

ఉ. విశ్వామిత్రుడు రాముని గూర్చి తెలుపగా శతానందుడు లక్ష్మణుని నిర్దేశించి ''అయం చాపరో లక్ష్మణః దిష్ట్యా భగవద్వశిష్ఠ ప్రసూతం క్షత్రకుల మృధ్యతే'' అని పలికెను. ఈ వచనమును తిమ్మ భూపాలుడు పెంచి యమకాలంకారముతో గూడిన కందముతో చక్కగ ననువదించెను.

కం. విని లక్ష్మణుడో యితడన
మనమున నమ్ముని వశిష్ఠ మహనీయ తపో
ఘనతర మహిమను మహిమా
మనువంశము మిగుల సంభ్రమంబున బొదలెన్ 2-300

ఊ. జనకుడు విశ్వామిత్రునితో శివధనుర్మాహాత్మ్యమును వర్ణించి చెప్పుచు 'గిరీశే నారాద్ధం త్రిజగదవి జైత్రం దివిషదా ముపాదాయ స్ఫరసిరుహ జన్మా యదసృజత్'' శివునిచే నారాధింపబడి బ్రహ్మ. దేవతల తేజస్సును సమీకరించి జగత్త్రియ ధ్వంసకరమైన యేధనుస్సును నిర్మించెనో' యని దీని అర్థము. అనువాదకర్త దీనిని

'ఏకార్ముకంబున కింద కోటిరుండు
దక్షాధ్వర ధ్వంసి ధన్వి యయ్యె 2-526

అని యథేచ్ఛముగా అనువదించి గీతమున 'అఖిల విబుధ నికర తేజః ప్రచండ' మని మాత్రము సూచించి ఇతర విశేషములను పెంచి వ్రాసెను.

ఋ. శూర్పణఖ రాత్రి నిదుర లేక యాపులించుచు కూర్చున్న మాల్యవంతుని జూచి ''అథవా సామాన్యోపి గురుకో మంత్రి భావః. విశేషేణ సాహసైక రస వ్యవసాయ స్య చండ చరితస్య అస్మాకం స్వామినో రావణస్య''అని తలంచెను. తిమ్మ భూపాలుడు దీనిని విస్తరించి ''అదిగాక సామాన్యుడగు ధరాధీశుని

సచివ భావంబైన సకల కార్య
నిర్ణయ నైపుణ్య నిర్వాహ సామర్థ్య
బహుతర క్లాంతిచే భారమగు, వి
శేషించి యీత దశేష సాహసరసై
క వ్యవసాయ విఖ్యాతి జంద
చారిత్రుడైనట్టి మా రావణున కమా
త్యుండట ! యే మన నున్నదింక ! 8-28

అని విస్తరించి అనువదించెను.

ఋ. శూర్పణఖ జనకజాసంప్రాప్తికి బలిమి తప్ప వేరొండుపాయము లేదని నప్పుడు మాల్యవంతుడు "వక్ష్యే మామైవం" అని పలికినట్లు కలదు. దానిని తిమ్మ భూపాలుడు 'అకట ! యిట్టి యుకటవికటంపు మాటలు నాతి నీకు బలుకనీతి గాదు" (8-29) అని వివరించెను.

ఎ. మాల్యవంతుడు మహా పరాక్రమశాలియైన రాముని ఎదుట మన దుష్కార్మములు చెల్లునే యనగా శూర్పణఖ "అవును ! నిజమే వివాహ సమయ ముననే నంతయు ప్రత్యక్షముగా జూచితి" ననెను. అపుడు మాల్యవంతుడు "తదేవ మేకలోష్టవధః స్యాత్" అనినట్లు మూలము నందున్నది. తిమ్మ భూపాలుడు దీనిని

క. అన నత డిట్లను వీఱిడి
తనమున బనలేని పనికి దాబోయినచో
మనపతికి నిక నవశ్యము
వనితామణి, యేక లోష్టవధ సేకూరున్ 3-48

అని పెంచి అనువదించెను, మూలమున నున్న ఏకలోష్ట వధ శబ్దమునే తిమ్మ భూపాలుడు కూడ వాడెను. లోష్టమనగా "మృత్తికా ఖండము" లోష్టద్వయా స్ఫాలనముచే నొండొకటి బ్రద్దలగును. రావణుడు మిథిల నుండి సీత నపహరించినచో రామరావణులకు సంఘర్షణము కలుగును. అందులో రాముడో రావణుడో మరణించునని యర్థము.

ఏ. తృతీయాశ్వాసము నందు పరశురాముడు యముడంతకు మున్నే యుద్ధ రసికులైన రాజులనెల్ల భుజించి యుండుటచే నింక యుద్ధములు ప్రవర్తి

ల్లని కతమున "నిటి వేకిలేని లంఘనములు వాటిల్లె గటగటా నారదునకు" (87) అని వ్రాసెను. ఈ చివరి వాక్యము అమూలకము. ఇందలి 'వేకిలేని లంఘనము' అనుమాట జాతీయమై రమణీయముగా నున్నది.

౮. పరశురాముడు సప్త ద్వీపకుల పర్వత వరులైన రాజులను సంబోధించి హెచ్చరింప రాముడు "శివుని విల్లు బాలక్రీడగా విఱిచిన నేను ముందుండ పరోక్ష స్థితులైన రాజులను నిందించెద వేల ? అహంకారియైన కార్తవీర్యార్జునుని భుజములను ఛేదించు కళచే జ్ఞాతసారమైన నీ బాహువేది నన్ను ప్రహరించునో చెప్పు'' (4-53) మని పలికెను. తిమ్మ భూపాలుడు దీనిని

సీ॥ అనరాముడద్దితో ''యయ్యకుసివమెత్తె''
నన నవ్వి యిట్లను నతని జూచి

'నీ బాహు వెద్ది పోరుగా కది నేడేమి కూరగోయ బోయెనే'

అను సందర్భోచితములగు వాక్యములతో పెంచి రచించెను.

౯. భరతుడు రాముని జూచి తండ్రి మరణవార్త దెలుప చిత్రకూటమున కేతెంచినపుడు ''రఘురాము జూచి నేత్రజల ప్రవాహముల్ గురియ పాదంబు'' ల కెఱగి కొంత తడవున కయ్యుదంతంబు గద్గద స్వరమున నెఱిగింప రాముడును శోక మూర్ఛితుడై ధైర్యమున నంత తెలివొంద'' (4-11) నని శబరి జాంబవతునితో చెప్పినట్లు తిమ్మ భూపాలుడు వ్రాసెను. మూలమున భరతుడు రామునితో ''లోకమున కేకయ వంశ్యులకు ఆ ప్రళయ ముందు అనల్పమైన యకీర్తి స్తంభమును నిల్పనెంచిన యొకనిచే తండ్రి వంచితుడయ్యె'' వని చెప్పినట్లు మాత్రము కలదు. భరతుని శీలమును పోషించుటకు కాబోలును దీని ననువాదకర్త విడిచివైచి పై విధమున భరతుడు విచారించుచు తండ్రి మరణవార్తను దెల్పినట్లును, రాముడు మూర్ఛితుడైనట్లును వ్రాసెను.

౧౦. విభీషణుడు సీతను రామున కిచ్చివేయుమని రావణునకు తెలుప నాతడేమి చేసెనని సారణుడు మాల్యవంతు నడిగెను. మాల్యవంతుడు రోషాంధతమమున మునుగు రాక్షసరాజు విభీషణు డేవిధమున శత్రువునైన నాశ్రయించునో యా విధమున నొనరించెనని పలికెను. తిమ్మ భూపాలుడు దానిని పెంచి

"ఆడరానట్టి దుర్భాషలాడి యతని వెడల ద్రోయించె మనమదోద్వృత్తు డగుచు" (4-78) అని వివరించి వ్రాసెను.

15. అమూలకములగు విశేషణములతో కావించిన విస్తరణము :

అ. రాముడు పరశురాముని సమీపింపగనే పరశురాము డితని చూచి 'కథమయ మసౌ శ్రూయమాణ గుణాను కల్పితాకార సంవాదీ దాశరథిః" అని పల్కినట్లు మూలమున నున్నది. తిమ్మ భూపాలు డిచ్చట మూలము నందలి సమానమునే యథాతథముగ ప్రవేశపెట్టినను అంతకు ముందు, "అని చేర నేతెంచు నవ్వంచనా చుంచువుం గనుంగొని" (4-102) అని రామునకు మూల మునలేని 'వంచనాచుంచు' నను విశేషణమును చేర్చెను.

ఆ. జనకు డుత్తరము పఠింపగనే రాముడు దానిని తలదాల్చి లక్ష్మణు నితో "వత్స లక్ష్మణ ! నిజా మస్మ దారాధన సహాధ్యాయినీం ప్రజావతీ మాదాయ పురోభవ" (పుట 8525) అని పలికినట్లు మూలము నందున్నది. తిమ్మ భూపాలు డిచ్చట సీతకు రెండు మూడు విశేషణముల నధికముగా చేర్చి యుండెను. "అన్న ! లక్ష్మణ ! శుభలక్షణాఢ్యయు, అయోనిజయు, నస్మదారా ధన సబ్రహ్మచారిణియు నగు నీ వదినం దరలించుక గమనోచితోద్యోగంబున నతివేగంబున బురోభాగంబున వసించి యుండుము" (8-215) నిజాం అనుచోట 'అయోనిజాం' అని యే ప్రతిలోనైన నున్నదేమో 'ప్రజావతి' యనగా వదినె.

ఇ. రాముడు సీరధ్వజు డెవరని యడుగ విశ్వామిత్రుడు "వత్స ! శ్రుణోసి. విదేహేషు మిథిలాం నామ నగరీం" అని చెప్పుట మొదలు పెట్టెను. తిమ్మ భూపాలుడు దీనిని విశేషణములతో పెంచి పై వచనమును

"వినరా రాఘవ ! దైనం
దిన శుభ శుంభత్ విదేహ దేశములోనన్
ఘన దాన ధురీయుతకుం
భి నిరాకృత నీలగిరిని మిథిలా నగరిన్" 2-215

అని కందముగా అనువదించెను.

ఈ. రత్నచూడుడు హేమాంగదునితో "సఖేకిముచ్యతే మహాతామ ప్యుపరి కిమప్యయం రావణః" అని రావణుని ప్రశంసించెను. తిమ్మ భూపాలుడు దానిని తెనిగించుచు.

"ప్రఖ్యత నిధినాథ సఖుని సీ పంక్తి ముఖుని" 4.247
అను విశేషణమును పాదపూరణకై పెంచి వ్రాసెను.

ఉ. మూలమున రాముడు పుష్పకముతో నయోధ్య కరుదెంచుచున్నాడని యున్నది (7-8) తిమ్మ భూపాలుడు

"అమరవిరోధి మందిర సమాహృత (పుష్పకరాజ మెక్కి)"

అను విశేషణము నధికముగా వాడెను. ఇట్లే ఆంధ్రకవి సువేల పాదమునకు విశేషణమైన" మృగాళీలస్వనోద్భేదమున్ (6-17) అని వ్రాయుట కూడ అమూలకమే,

ఊ. రాముడు సీతకు చంద్రుని వర్ణించి చెప్పుచు "నేత్రానాం మధుపర్క సత్రమ్" (లోక లోచనములకు దధిఘృత మధు ప్రస్తుత సర్వ వస్తు యజ్ఞము) అనియు "శృంగారస్య రసాయన" మ్మనియు తెలిపెను (7-67) అనువాదకర్త ఈ రెండు విశేషణములను పెంచి" నిఖిల లోకానీక నేత్ర పంక్తికి నెల్ల మధుపర్క సత్ర సామ్యంబుగాంచె. కామినీ కాముక కామిత శృంగారమునకు రసాయనంబన దనర్చి" యనియు రచించెను. (6-118)

ఋ. రాముడు కుండిన నగరమును వర్ణించుచు ఇదిగో ముందు మహారాష్ట్రమండలైక మండనమైన కుండిన నగరమని పల్కెను. తిమ్మ భూపాలుడు "నర్మదా తరంగ నిజహేమ కేతు సంరంభ" మను విశేషణమును సందర్భోచితముగ దీనికి చేర్చెను.

సంగ్రహీకరణము :

అ. దశరథుడు విశ్వామిత్రుని ఆగమన కారణమడుగు సందర్భమున "యదియం త్వదుపస్థాన సులభసంభావ నాతి ప్రసంగ సంగీత నర్తకీ మే చిత్త వృత్తిః నియోగానుగ్రహాయ స్పృహయతి" (పు. 38) అని పలికెను. అనగా "స్వయముగా వచ్చుటచే మీరు చూపిన ఆదరాతిశయము కీర్తించుట యందు నటియైన నా చిత్తవృత్తి ఆజ్ఞా ప్రధాన రూపమైన మీ అనుగ్రహమును కోరుచున్న" దని అర్థము. ఇచట చిత్తవృత్తి నర్తకితో పోల్చబడినది. తిమ్మ భూపాలుడా పోలికలను విడిచి వైచి

క. కావున భవదాగమ సం
భావనచే నలరు నాదు మది గోరెడు నో
దేవ నియోగానుగ్రహ
మీ వేళం గరుణ నాకతీవే యనుడున్ 1-213

అని అనువదించెను. కీర్తించునది గాయని కాని సర్తకి కాదు. అందుచే నతడు దానిని విడిచి యుండును.

అ. రామలక్ష్మణులు విశ్వామిత్రునితో నరుగు సందర్భమున వైతాళికుడు మధ్యాహ్న కాలమును సూచించుచు దశరథు నిట్లు ప్రశంసించెను. "అపిచే దానీం పటీర తరు కోటర కుటీర మధ్యా సీనః

శ్లో. ప్రత్యక్షర స్రుత సుధారస నిర్విషాభిః
ఆ శీర్భిరభ్యధిక భూషిత భోగ భాజః
గాయంతి కంచుక విసిహ్నుత లోమహర్ష
స్వేదోర్మయ స్తవ గుణా నురగేంద్ర కన్యాః 1-55

అనగా "ఇప్పుడు చందన వృక్షముల తొఱ్ఱలనెడి కుటీరములందు కూర్చున్నవారై ప్రత్యక్షరము నందును స్రవించుచున్న అమృతముచే విషశూన్యములైన దంష్ట్రలచే మిక్కిలి అలంకరింపబడిన ఫణాభాగములు కలవారును, కుబుసములచే కప్పబడిన గాన రసాస్వాద జన్యమైన రోమాంచనములును, స్వేదోర్ములును గలవారును అగు నాగకన్యలు నీ గుణములు గానము చేయుచున్నా" రని అర్థము. దీనిని

చం నెలకొని వేడ్కఁ బాడెదరు నీ గుణముల్ ఫణముల్ గదల్చుచున్
బులక విభిన్న కంచుక సముద్గత సమ్మద ఘర్మ పూరలై
కలరసనాయుగాన్విత ముఖ స్ఖలితాక్షర యుక్తి రక్తి పా
టిలగ బటీరకోటర కుటీరములన్ ఫణిరాజకన్యకల్ 1-267

అని అనువదించెను. మూలము నందలి "ప్రత్యక్షర స్రుతి ... ... భూషిత భోగభాజః" అను విశేషణము నందలి భావమును తిమ్మ భూపాలుడు విడిచివైచి ఫణముల్ కదల్చుచున్ అని మాత్రము వ్రాసెను. కలరసనా యుగాన్విత ముఖ స్ఖలితాక్షర యుక్తి అను భావము మూలమునందు లేదు. మూలమున కంచుకములచే కప్పబడిన పులకాంకురములును, స్వేదోర్ములును కలవారని

యుండ తిమ్మ భూపాలుడు "పులకములచే ప్రిదలిన కంచుకముల నుండి బయ ల్వెడిన సమ్మదఘర్మపూరములు కఱవారని అనువదించెను.

ఇ. విశ్వామిత్రుడు "సఖే దశరథ! ప్రియమపి తథ్యమాహ వైతాళికః" అని పిమ్మట "మందోద్ధూతైః" (1-68) అను శ్లోకమును చెప్పెను. తిమ్మ భూపాలుడు,

క. ఈ లీల విన్నవింపగ
నాలించుచు వామదేవు డనియెన్ మేలో
భూలోకనాథ! యీ వై
తాళికుడు ప్రియంబె సంగ దత్త్వమెపాడెన్ 1-268

అని విశ్వామిత్రుడన్న వచనమును వామదేవు డన్నట్లు కంద పద్యమును వ్రాసి తరువాతి "ఆనిన రత్న భారమున" (1-269) అను పద్యమును కూడ వామ దేవుడే చెప్పినట్లు వ్రాసెను. వైతాళిక గీత పద్యమునగల "కల రసనా యుగా న్వితముఖ స్ఖలితాక్షర యుక్తి" (1-267) అను సమాసమునకు, పై శ్లోకము నందలి "జిహ్వాయుగ్మభి పూర్ణానన విషమ సముద్గీర్ణ వర్ణాభిరామమ్" అనునది మూలముగా కన్పించుచున్నది. ఈ విధముగా తెలుగు కవి 267, 269 పద్యము లందలి సందర్భము ఒకటే అగుటచే తరువాత విశ్వామిత్రుడన్న శ్లోకము నందలి ఒక భావమును వైతాళికుడు పలికిన పద్యము నే చేర్చెను.

ఈ. ప్రథమాంకము చివర వామదేవుడు "నిర్మల స్వభావులు నిర్మల ప్రకృతి గల జనుల ఎడ అకారణ స్నేహమును కలిగి యుందు" రని పలుక దశరథుడు "రత్నాకరో జనయితా" అను శ్లోకమున (1-69) "సముద్రుడుత్పా దకుడు, అమృత కౌస్తుభ పారిజాతములు సోదర వర్గము. వారి విషయమేమి చెప్పవలయును? జగమున ప్రేమ బీజ మచింత్యమైనది. అది తత్త్వాంతరాశ్రి తమై యుండును. అనగా జన్య జనక భావ సమాన గర్భ జాతత్వాదుల కంటె నన్యమై యుండును. (కిం తైరచింత్యో మిహ తత్ పున రన్య దేవ తత్వాంత రమ్) అందువేతనే చంద్రుడు కుముద బంధువని చెప్పబడుచున్నాడు." అని పల్కెను. దీనిని తిమ్మభూపాలుడు "ఆ పయోధి తండ్రి, కౌస్తుభ పారిజాత ములు సుధయు సనూజ సముదయమైన నేమగును దాస, తుహిన కిరణుండు కుముద బంధుంటె నిజము" (1-276) అని అనువదించెను. అనువాదమున

"ప్రేమ బీజమచింత్యము. అది తత్స్వాంత రాశ్రితమై యుండును." అను భావము వదలి వేయబడినది. మూలమందు చెప్పబడిన చంద్రుడు కుముదముల యెడ స్నేహము కలిగి యుండుటకు కారణము తెలుగున లోపించినది.

ఉ. చీకటి వచ్చుటచే మాదజాలని నేత్రములకు మఱల చూచు శక్తి నొసంగు నమృత కిరణుడు సూర్యాస్తమయ కాలమున అతిథియై రాగా పద్మములు విముఖత్వమును పొందినవి. అందుచే చంద్రుడు తన పాపమును వాని కొసంగి వానినుండి సుందరీ వదన సాదృశ్య పుణ్యమును గ్రహించినాడు అను నర్థము గల (11-32) శ్లోకమును తిమ్మ భూపాలుడు ""జనులు సుధాకరుండన విశాల తమః పటలంబు గ్రమ్మి చూపెనయని కన్నుదమ్ములకు దృష్టి యొసంగు ద్విజేంద్రు డర్థియై చన (2-208) ఇత్యాదిగా అనువదించెను. ఇందు తిమ్మ భూపాలుడు మూలము నందలి "సూర్యోఢే" (అస్తమిత సూర్య కాలాగతే) అను మాటను విడిచి వైచెను. ఇది చాల ముఖ్యమైనది.

అతిధిర్యస్య భగ్నాశో గృహాత్ ప్రతినివర్తతే
సతస్మై దుష్కృతం దత్వాపుణ్యమాదాయ గచ్ఛతి
అతిధౌ విముఖే ప్రోక్తం గతం యత్ పాతకం నృణాం
తదేవాష్ట గుణం ప్రోక్తం సూర్యోఢే విముఖే గతే

అని ధర్మశాస్త్రము - అతిథి ఎవని గృహము నుండి భగ్నాశుడై యరుగునో వానికి తన పాపము నొసంగి వారి పుణ్యము గ్రహించి యరుగును. అతిథి విముఖుడై పోయినచో మానవుల కెంత పాపము కలుగునో సూర్యోఢ కాలమున విముఖుడై యరిగినచో నాపాప మెనిమిదింతలగు" నని దాని యర్థము. అందుచే 'సూర్యోఢే' అను పదమును కూడ అనువదింపవలసినది.

ఊ. శబరి జాంబవంతునికి "రాముడు విరాధుని జంపెనని చెప్పు సందర్భమున

క. అంత విరాధుని రాఘవు
డంతకపురి కనిచి సంభ్రమాతిశయం బా
శ్యాంతరమున బెనగొన న
త్యంతత్వర నుత్తర క్రియలు దీర్చె దగన్ 4-18

అను పద్యమును తిమ్మ భూపాలుడు వ్రాసెను. రాముడు విరాధునికే ఉత్తర క్రియలు దీర్చెనను భావము పై పద్యమున స్ఫురించుచున్నది. ఇచట తండ్రికి నని చేర్చిన నుచితతరముగా నుండెడిది. మూలమున "పితుః క్రియామతి వాహ్య" (పు-౩౮౭) అని యున్నది.

ఋ. రత్నచూడుడు కపి రాక్షసుల యుద్ధమును వర్ణించుచు "పరాజయముచే వినశ్వరమైన కాంతి గల యీ రాక్షసులు తమ విస్తృతములైన కాయములచే నసమయము నందే రాత్రిని గల్పించుచు తమ దేహకాంతులచే నాకాశమును దీర్ఘదివసము గలదానిగా చేయుచు భూమిపై ప్రకాశించు వానరులనెడి యగ్నుల ధూమకాంతిని ధరించుచున్నా" రని పలికెను (౬-౩౫) తిమ్మ భూపాలుడు దీనిని

గీ. "ఎఱుపుమై చాయచే బగలెక్కుడైన
రీతి గనవచ్చు దివి సెప్వరి తనువు లధి
క తిమిరముజించు దత్కపి కఠిన వహ్ని
కడను దద్దైత్యులను ధూమమడరె నిపుడు 4-257

అని గీత పద్యమున ననువదించెను. పద్యము చిన్నదగుటచే నతడు "కాయాభోగైః అఖండ తమస్వినీం విదధతః ఛిదుర శ్రియః" అని మూలమున వేయబడిన విశేషణములను విడిచి వైచెను.

ౠ. విభీషణుడు అర్ధనారీశ్వర మూర్తిని "స్త్రీ నపుంసక పదవ్యతిలంఘినీ చతుర్థీ ప్రకృతిః" (7-3౫) అని వర్ణించెను. అమూర్తి కేవల స్త్రీ కాదు. స్త్రీ పుంస వ్యతికరత్వముచే నపుంసక ప్రకృతియు గాదు. అందుచే చతుర్థ ప్రకృతి యని మూలకారుడు తెలిపెను. తిమ్మభూపాలుడు స్త్రీ పున్నపుంసక పదపర ప్రకృతిని దగు శంభు మే" నని యనువదించెను. చతుర్థ ప్రకృతి అను పదము విడిచి వైచుటచే మూలము నందలి సౌందర్యము లోపించినది.

అనువదింపక విడిచిన భాగములు :

అ. జనక విశ్వామిత్రులు సూర్య వంశమును గూర్చియు, శివుని విల్లు విఱుచుట యను శుల్కమును గూర్చియు సంభాషించుకొను చుండ రామలక్ష్మణులు సవిమర్శముగా "కథమస్మదీయాః కథాః ప్రస్తూయంతే" యని పల్కినట్లు మూలము నందున్నది. తిమ్మభూపాలుడు దీనిని వదలి వైచెను.

ఆ. ఇతర రాజులు రామునికీడుకారని విశ్వామిత్రుడు పలుక లక్ష్మణు డాత్మగతమున నేను చెప్పదలచినదే ఉపాధ్యాయుడు చెప్పినాడని యనుకొనెను. (పుట 100) తిమ్మభూపాలుడు దీనిని గూడ విడిచి వైచెను.

ఇ. శ్రవణ గుహుని దగ్గఱకు పోయెదనని జాంబవంతునితో పలికి వెడలిన పిమ్మట నేపథ్యమున లక్ష్మణునకును భిక్షుక వేషముననున్న రావణునకును జరిగిన సంభాషణ మున్నది. దానిని తిమ్మ భూపాలుడు విడిచి వైచెను. దాని వలన రావణుడు వేషధారియై పంచవటి కరుదెంచుట తెలియ వచ్చునని మూల కవి భావము.

ఈ. గుహుడు సీత యుత్తరీయమును రామున కిచ్చిన పిమ్మట రాముడు సీతను స్మరించి దుఃఖించి "రావణుడు శివు నర్చించుటకై చంద్రహాసముచే తన తలలు తఱుగుకొనెను.నా యస్త్రము లిప్పుడా చంద్రహాస హతకత్తుణ్ణ మార్గము నే యనుసరింపవలసి వచ్చుచున్నవి గదా" యని యనుకొనెను. (5-26) దీని తరువాత లక్ష్మణుడు వనౌకసులు కూడ మన యందు సద్భావము నపేక్షించుటకు కారణమేమని రాము నడిగెను. అంత రాముడు మన వంశమునకు మూల పురుషుడైన సూర్యుడే సుగ్రీవునికి తండ్రి. అందుచే నతడు మనకు సనాభియని పలికి యుత్తరీయమును జూచి "సుగ్రీవ హనుమంతులను దర్శింపగోరుచున్నాను. ఋశ్యమూక మార్గమును జూపు"మని యడిగినట్లు మూలమున నున్నది. దీనిని ఆంధ్రకవి వదలి వైచెను.

ఉ. ద్వితీయాంకమున రామలక్ష్మణులు మాటాడుకొనుచుండగా దీక్షిత వేషుడైన విశ్వామిత్రు డచటికి వచ్చెను. అపుడు రాము డాతనిని చూచి లక్ష్మణునితో

> కర్మణః శ్రూయమానస్య వ్యంజనైః అధికోజ్జ్వలాం
> తపస్తేజోమయీం లక్ష్మీ మద్య పుష్ణాతి మేగురుః 2-౩8

అని పలికెను. తిమ్మభూపాలు డేలకో ఈ శ్లోకము ననువదింపక వదలెను.

ఊ. మేఘనాదుడు మరణించిన వార్త విన్న పిమ్మట శుకుడు పైకి చూచి విమాన పంక్తులు దిఙ్ముఖములందెల్లెడ పర్యటించుచుండుటచే దుర్వార కోప బాడబానల నిపీయమాన శోక సముద్రుడగు రావణుడు దాశరథి విజయ

మునకై సన్నద్ధుడగు చున్నాడని పలికెను. ఇచట దాశరథి విజయమనగా రాముని జయించుట కనియు, రాముని విజయమున కనియు, షష్ఠీ సమాసము కర్తృకర్మములు రెండింట నన్వయించుచున్నది. అందుచే సారణు డది విని "కష్టం కథం దాశరథి విజయా యేతి అవిశిష్టోప పత్తిక కర్తృ కర్మ కార్థ విషయం మయస్య వచన" మ్మని పల్కెను. (పుట 844) అనుకర్త దీని నను వదింప లేదు

ఋ. చంద్రుని యందలి మచ్చను వర్ణించుచు మూలమున "తరుణ తమాల కోమల మలీమస మేత దయం కలయతి చంద్రమాః కిల కళంక మితి బ్రువతే (2-79) అను శ్లోకమున్నది. ప్రౌఢమైన తమాల వృక్షమువలె కోమల మును శ్యామలమునైన చిహ్నమును చంద్రుడు ధరించుచున్నాడు. దానిని లోకులు కళంకమని చెప్పుచున్నారు. అనిపై శ్లోక పూర్వార్థము యొక్క అర్థము. తిమ్మ భూపాలుడు దీనిని వదలి ఉత్తరార్ధము ననువదించి "లోకులాడుటలు కావని చీకటి గాక యీ సుధా ఘుటికకు మంచు మించు దొరకుం బరికింప కళంక మున్నదే" యను భాగమును క్రొత్తగా చేర్చెను.

అన్యథాకరణము :

తిమ్మభూపాలు డౌచిత్యమునకై కొన్నిచోట్ల మూలము నన్యథాకరించు చుండును. వామదేవుడు దశరథునికి వశిష్ఠుని సందేశమును తెలుపుచు "ఇమాంచ సర్వ సందేశ సంగ్రహకారికామ్ కారికా మతి ప్రయత్నేన భగవాన్ భవంతమను స్మారయతి" అని పలికెను. ఇచట కారిక అనగా శ్లోకమని అర్థము. తెలుగున శ్లోకము లుండవు కావున తిమ్మ భూపాలుడు "సకల సందేశ సంగ్రహ కందం బగు నిక్కందంబు నీ డెందమునం బొందు పఱుపుమని ముని పురందరు డాన తిచ్చె" నని కారికా పదము స్థానమున కందమను పదము నుపయోగించి తత్ప వాతి శ్లోకమును కంద పద్య రూపముననే తెనిగించెను.

ఆ. ప్రతీహారి కౌశికాగమనమును తెలిపినంతనే వామదేవుడు "సేనాతని సమీపించి శ్రౌత విధిచే పురస్కరించి లోనికి ప్రవేశ పెట్టెద" నని పలికి ప్రతీహారితో కలిసి నిష్క్రమించినట్లు మూలమున నున్నది. తిమ్మ భూపాలుడు దశరథు "డగ్గాధినందను తోడ్తెరగ వామదేవు ననిచెన్ హర్షప్రకర్షంబునన్" (1-164) అని దశరథుడే వామదేవుని పంపినట్లు వ్రాసి యుండెను. ఇది దశ రథునికి మునుల యెడ గల గౌరవమును సూచించుచున్నది.

౩. దశరథుడు విశ్వామిత్రునితో

శ్లో॥ త్వం చేద్దీక్షమాణో యత్ రామభద్రం ప్రతీక్షసే
తన్నః పతివ్రతావృత్తి మియం చరతుమేదినీ

అని పల్కెను. "మునిచంద్రా! యాగ దీక్ష గ్రహించు నిచ్ఛగల నీవు రామ భద్రుని యాగ రక్షణకై తీసికొని పోవ గోరుచో మాయీ భూమి మాలిన్యాది ప్రోషిత భర్తృక వధూ చిహ్నమైన పాతివ్రత్య చరితము నాచరించు" నని యర్థము. ఇచట ప్రకాశటీక ఇట్లు వ్రాయుచున్నది. "తదా నః అస్మాకమియం మేదినీ ధరా, పతివ్రతా వృత్తం మాలిన్యాది ప్రోషిత భర్తృ వధూ చిహ్నమ్, చరతు కరోతు" రాముఁడే ఈ భూమికి రాజు. అతడు నీచే తీసికొని పోబడినచో భూమి ప్రోషిత భర్తృకయై మాలిన్యమును వహించును. దీనివలన రాముడచిర కాలముననే తిరిగి రావలయునన్నది సూచితమగుచున్నది.

తిమ్మ భూపాలుడు పై శ్లోకము నందలి రెండవ పాదమునకు భిన్నమైన అర్థము గ్రహించెను.

"ముని సంక్రందన : గాధినందన ; మఖంబున్ జేయ నూహించి రా
ముని గాంక్షించితి రేని నీతి చతురంభోరాశి సంభూత మే
దిని మాపట్టున నింక గైకొనెడు బాతివ్రత్య సాంగత్యమున్" 1-241

అని వ్రాసెను. "యాగరక్షణకై మీరు రాముని తీసికొని పోయినచో భూదేవి మా యెడ పాతివ్రత్యముతో గూడి యుండు" నని భావము అనగా మా రాజ త్వము స్థిరముగా నుండునని యభిప్రాయము. వ్యాఖ్యానమున కించుక భిన్న ముగా నున్నను ఈ అభిప్రాయము గూడ సమంజసముగానే యున్నది.

ఈ. రాక్షసు లరుదెంచు వేళయైనది కావున విశ్వామిత్రుడు రమ్మని శున శ్శేపుని ద్వారా కబురు పంపినాడని లక్ష్మణుడు పలుక రాముడు "వసుమతీం నిరాక్షసాం కర్తుం మే ధనుః పుణ్యాహమంగళ మాదధాతు" అని పలికెను. తిమ్మ భూపాలుడు దానిని "మత్పటుచాపంబు జగం బరాక్షస మొనర్పం బూని మౌర్వీపరిస్ఫుట టంకార మిషంబునం దొరకొనుం బుణ్యాహమంత్రావళుల్" అని యనువదించెను. ధనుస్సు పుణ్యాహ మంగళ మొనర్చుననుట కంటె నది మౌర్వీ పరిస్ఫుట టంకార మిషంబున బుణ్యాహ మంత్రముల నారంభించునని చెప్పుట యెక్కువ యౌచిత్య శోభితమై యున్నది.

ఉ. వామదేవుడు విశ్వామిత్రునికి రాము నెఱింగించిన విమ్మట విశ్వామిత్రుడు దశరథుని, విభాండకుని పుత్రవంతులలో శ్రేష్ఠులని ప్రశంసించెను. అంత దశరథుడు "భగవన్! ఏవమేవైతత్" అని పలికెను. కొన్ని ప్రతులలో ఏవమేవైతత్ అను దానిని వామదేవుడన్నట్లున్నది. తిమ్మ భూపాలుడా పద్ధతినే గ్రహించెను.

చం. తమకు వశిష్ఠసంయమి ప్రధాన గురుండౌ. భవాదృశుల్ సమ
స్తము వెలయించు వారలుగ ధార్మికులౌ మను వంశ పార్థివో
త్తములకు నెల్ల నీ దశరథ ప్రభుడెల్ల, నిజం బినాన్వయ
ప్రముఖులు రాఘవుల్ ధర విభాండక సూను తపః ప్రభావముల్
1—225

అని పల్కెను. ఈ పద్యమునకు మూలమైన

శ్లో. యేమైత్రావరుణిం పురోహితవతో వంశే మనోః జజ్ఞిరే 1-51
అను శ్లోకమును మూలమున దశరథు డన్నట్లున్నది కాని దానిని విశ్వామిత్రుడు వామదేవునితో నన్నట్లు వ్రాయుటయే సముచితముగా నున్నది.

ఊ. రావణుడు సీతను తనకిచ్చి వివాహము చేయుమని యడుగుటకై పంపెనని శౌష్కలుడు తెలుప జనకుడే సమాధానమును చెప్పక యూరకుండెను. అంత శౌష్కలుడు రావణునంత వాడు సీత నిమ్మని యడుగుచుండగా "తత్కిం మూఢవదీక్షసే" (3-44) (మూఢుని వలె చూచెద వేల?) యని పలికెను. సభలో నిట్లు రాజును బలుకుట యనుచిత మగుటచే తిమ్మభూపాలుడు దానిని మార్చి "అందుకీయకొకీవిధి నూరకుండ దగవే తగవేది" అని చక్కగా ననువదించెను.

ఋ. శౌష్కలుడు దశగ్రీవుడు మాహేశ్వరుడు. ఇతర రాజులు క్షుద్రులు. (క్షుద్రాశ్చాన్యేమహీభుజః) శివ ధనురారోపము శుల్కము. సీతా! ఏమగుదువో గదా. (హా సీతే! కిం భవిష్యసి) అని పలికెను. దానిని తిమ్మ భూపాలుడు

పరమ శైవ శిఖామణి పంక్తి ముఖుడు
జమ్ము దూలమ్ము లన్య రాజన్య కోటు
లజగవారోపణము శుల్కమట్లు గాన
నెట్టులున్నదో నీ పూజ యిక మహీజ! 2-365

అని అనువదించెను. క్షుద్రులనుటకు జమ్ము దూలము లనియు, సీతా నీవే మగు దువో యనుటకు నెట్టులున్నదో నీ పూజ యిక మహీజ! యనియు ననుట జాతీ యోక్తులతో గూడి రమణీయముగా నున్నది.

ఋ. రాముడు శివధనుస్సును విఱిచినప్పుడు కలిగిన శబ్దము బ్రాహ్మ ణుల ముఖమున సీతాపాణి గ్రహణమును సూచించు యజుస్సూక్తమును, స్త్రీల గండ ప్రదేశమున మాంగలికమైన ఉలూలు ధ్వనియు, నభోమధ్యమున శత్రువు లను ఖండించు నపశ్రుతి శతమును నయ్యెనని శతానందుడు వర్ణించెను. తిమ్మ భూపాలుడు దీని ననువదించుచు

క్షితి దేవ ప్రకారాననాంబుజములన్ సీతా వివాహోత్సవ
శ్రుతి మంత్రావళియై వధూముఖములన్ శోభానెయై, వింటనా
యత రక్షోహతికై యుప శ్రుతి శతంబై, దోచె దద్రామదోః
ప్రతిభాకృష్ట త్రుటద్వృషధ్వజ ధనుర్దండోత్థనిధ్వానముల్  2-381

అని యనువదించెను 'ఉలూలు ధ్వనిః' అను దానిని 'శోభానె' యని యనువ దించుట యౌచిత్య శోభితమై యున్నది. శోభానె యనగా పెండ్లిలో స్త్రీలు పాడు నొక రకమైన పాట. 'కపోల కందళతలే' యను దానిని "ముఖములన్" అని యనువదించుటయు నుచితముగనే నున్నది. కపోలతలముల నులూలు ధ్వనిగా తోచుట కంటె ముఖము లందు తోచె ననుట యెక్కువ సమంజసముగా నున్నది. "ఉపశ్రుతిశతం" అను మాటకు ప్రకాశ టీకాకారుడు "శ్రవణేంద్రియ శత సమీ వేషు" అని అర్థము వ్రాసెను. మింట నాయత రక్షోహతికై యుపశ్రుతి శతంబై తోచెనను ననువాదమే యుక్తతరముగా నున్నది. ఉపశ్రుతి యనగా భవిష్యద్విష యము సూచన. ఈ పద్య మనువాదమున శతానందుడు చెప్పినట్లు కాక కవి చెప్పినట్లే యున్నది.

ఎ. "ప్రభాత కాలమున నీ నవోఢ సిగ్గుచే వంచుకొన్న ముఖము కలదై రహస్య వృత్తాంతము నడుగుచున్న సఖులను ఆనందింప జేయుట లేదు. కాని ఆమె కుచముల యందలి చమత్కారము అనిశమును మకరికాది పత్రముల లిఖించు సహచరులకు గూఢముగా నఖక్షతమును ప్రకటించుచున్నది" (4-6) తిమ్మ భూపాలుడు దీనిని "కోడె మిటారి చన్నుగవ కుంకుమ పత్రకముల్ రచింప చేకూడి తదీయ చిత్కృతి నిగాఢ నఖాంకము దెల్పువారికిన్" పై శ్లోకము నందలి "చమత్కారః" అను పదమునకు 'విచిత్రతా' యను నర్థమును ప్రకాశ

టీకాకారుడు తెల్పెను. తిమ్మ భూపాలుడు దానిని చీత్కృతి యని యనువదిం చెను. అనువాదమే యెక్కువ రమ్యముగా నున్నది.

ఏ. జాంబవంతుడు శబరితో వాలి దౌర్జన్యముచే క్షీణులైన ప్రకృతులు కిష్కింధ యందు సుగ్రీవు నభిషేకింప గోరి రాముని సాహాయ్య మపేక్షింతు రని చెప్పినట్లు మాల్యవంతుడు శూర్పణఖతో తెలుప "కథం క్షత్రియ పోతకో వాలి నిగ్రహేపి సహాయస్సమీహ్యతే" అని యడిగెను. (ఈ క్షత్రియ కుమారుడు వాలి నిగ్రహమున కూడ సహాయుడుగా కోరబడుచున్నాడా ?) తిమ్మ భూపా లుడు దీనిని జాంబవంతుడు శబరితో తాను జెప్పవలసిన దంతయు జెప్పిన పిమ్మట

ఈ నృపపోతము వాలి న
హీన భుజాశాలి దునుమ నెదురే యితరుల్
దీనికి భువి గుడి మ్రింగెడు
వానికి గుడి లింగ ము్రటవడియము గాదే ! 3-60

అని యనువదించెను. భావ మొక్కటే యైనను మూలమునకును ననువాదము నకును గొంత భేదమున్నది. వాలి నిగ్రహమున గూడ సహాయుడుగా కోరబడు నంతటి పరాక్రమవంతుడా ! యని శూర్పణఖ యడిగినట్లు మూలకర్త భావము. మహాపరాక్రమ శాలియైన వాలినే యీ నృప కుమారుడు దునుమ నితరులు వీని కెదురా ! యని యనువాద మందలి భావము. రాము డింకను వాలిని దునుమ లేదు. అందుచే మూలకర్త భావముచితతరముగా నున్నది. అనువాదకర్త యిచట సందర్భోచితముగా గుడి మ్రింగెడు వాని ... ... అను లోకోక్తిని ప్రవేశ పెట్టెను.

ఐ. పరశురాముడు శివధనుర్భంజన సమయమున తన్ను గణింప కుండుట కాగ్రహించి "మహాసేనోయస్య ప్రమద యమదంష్ట్రాసహచరైః శరై ర్ముక్తో జీవన్ ద్విగివ శరజన్మా సమభవతే (4-32)" (యమ దంష్ట్ర సోదర ములైన నా శరముల నుండి ముక్తుడై బ్రతుకుచు కుమారస్వామి రెండు సారులు శర జన్ముడయ్యెను) అని పలికెను. 'ప్రమద' యనునది రామునికి సంబోధ నము. కొందఱు దానిని మిక్కిలి మదించిన యమునికి విశేషణముగా చేసినట్లు కాన్పించును. ఈ శ్లోకమున శరజన్మ పదము ముఖ్యమైనది. అది పరివృత్తిని సహింపదు. అందుచేతనే తిమ్మ భూపాలుడు "శరజిన్మంబినుమాఱు గాంచె"

(౩-108) అని పద్యమును మొదలుపెట్టి మూల భావమును నిపుణముగా ప్రకటించెను.

౭. చతుర్థాంకము చివర రాముడు సీతాలక్ష్మణులతో వెడలిపోవుచు జనకు నుద్దేశించి "యథాసుస్థం తాతం శృణోమితథా భవతా విధాతవ్యమ్" అని పలికి నిష్క్రమించినట్లున్నది. 'సుస్థం' అనగా 'ప్రాప్తసుస్థభావం ప్రసన్నం' అని వ్యాఖ్యాత యర్థమును వ్రాసెను. తిమ్మ భూపాలుడు దీనిని 'మద్గురుండు స్వస్థుండై యుండె ననుచు నే వినునట్లుగా ననఘ నడిపింపవలయు' (౩-221) అని యనువదించెను. స్వస్థుడనగా సుఖముగా నున్నవాడు, స్వర్గమున నున్న వాడు (మరణించిన వాడు) అను రెండర్థములు నున్నవి. దశరథుడు తరువాత మరణించును గాన తిమ్మభూపాలు డిచ్చట స్వస్థుడని వర్ణించుట భావ్యర్థమును ధ్వనింప జేయుచు నౌచిత్య శోభితమై యున్నది. మూల వాక్యమున నీ ధ్వని లేదు.

౮. హనుమంతుడు లంకాపురమును గాల్చినప్పుడు మాల్యవంతుడు అగ్నికిరణములు నిమ్నోన్నతములను తొలగించుచున్నవనియు, మణిభవనము లందు కృశాను జ్వాలలు ఫలముచేతనే (దాహభస్మాది కార్య వశముననే) యను మానింప బడుచున్నవనియు తెలిపెను (౬-2). దానినే తిమ్మభూపాలుడు "హుతాశనామితపరీతశిఖాళి నెఱుంగలేరు మేనులు చురుకన్న దాకను జనుల్ మది నెంతయు నూహ చేసినన్ (4-154) అని వ్రాసి భావమును విశదము కావించెను.

౯. లక్ష్మణుడు మాల్యవంతమును వర్ణించుచు వనాంతములు గుహల యందు విహరించు భల్లూకముల హిక్కా ధ్వనులచే భయపడిన కిరాతులనుండి జారిన శస్త్రములు గలవని వర్ణించెను. కిరాతులు భల్లూక హిక్కా ధ్వనులచే భయపడుట యంత యుచితముగా లేదని తిమ్మ భూపాలుడు "భీతిని చెంచుభామలస్త్రముల్ విడుతు" రని (4-63) కిరాతుల స్థానమున కిరాత స్త్రీలను ప్రవేశ పెట్టెను.

౧౦. సారణుడు మేఘనాదుడు కుంభకర్ణుని పురస్కరించుకొని శత్రు సమ్ముఖమున కరుదెంచెనని పలుక మాల్యవంతుడు "స్వస్తి విజయేతాం రామ లక్షణౌ కుంభకర్ణ మేఘనాదౌ" అని పలికెను. (పుట ౩౩౯) ఈ వాక్యమునకు కుంభ కర్ణ మేఘనాదులు రామలక్ష్మణులను జయింతురనియు, రామలక్ష్మణులు కుంభకర్ణ మేఘనాదులను జయింతురనియు రెండర్థములును వచ్చుచున్నవి.

ప్రథమాద్వితీయా విభక్తులు ద్వివచనము నందొకే రూపమున నుండుటయే యందుకు కారణము తిమ్మ భూపాలుడు పై వచనమును "రామలక్ష్మణులను రాగరసము పొదల గలన గూల్తురు మన కుంభ కర్ణ మేఘనాదులను మానమిక నేల నయ చరిత్ర" (4-218) అని రెండర్థములు వచ్చునట్లు చక్కగా ననువదించెను. రామలక్ష్మణులు+అనురాగ రసము; రామలక్ష్మణులను రసము; కుంభకర్ణ మేఘనాదులు+అనుమానము; కుంభకర్ణ మేఘనాదులను+మానము అని రెండు రీతుల విడదీయుట కవకాశమున్నది.

ఆ. 7-12వ శ్లోకమున 'యాదః' అను పదము వాడబడినది. యాదస్ శబ్దమునకు జల జంతువని యర్థము. లక్ష్మియు, చంద్రుడును సాగరమున జల జంతు సాధారణ్యముచే వసించువారని మూలకర్త యభిప్రాయము. తిమ్మ భూపాలుడించుక మార్చి "ఈ వనరాశి పుత్రిసిరి ...... మఱి పుత్రుడైన రాజీవ విరోధి" యని వ్రాయుట యౌచిత్యవంతముగా నున్నది.

క. విభీషణుడు "కైలాస పర్వతమును వర్ణించుచు నందు సమీపమున వర్తించు సూర్యుని చెంత నున్న పద్మమునకు కూడ శివుని శిరస్సు నందుండు చంద్రుని కిరణములు (ముద్రాం) సంకోచము నొసంగుచున్న" వని పల్కెను. (7-45) తిమ్మ భూపాలుడు "ప్రాంత స్ఫురద్భానుహస్త తలాంభోరుహ మర్ధ మీలనము గాంచంజేయు (5-86) నని యనువదించెను. సూర్యుడును చంద్రుడును నుండుటచే పద్మములు సంపూర్ణ సంకోచమును గాక యర్ధ మీలనము నొందుచున్న వనుట యుచితముగనే యున్నది.

ఖ. విభీషణుడు చంద్రుని వర్ణించుచు "ప్రాణాయామోపదేష్టా సరసిరుహ వనే" అని చెప్పినట్లు మూలమున నున్నది. తిమ్మ భూపాలుడు "తోయజమునికి ప్రాణాయామకరణోపదేశం బానంగెడు దేశికు" డని యనువదించెను. "సరసిరుహమునేః" అను పాఠము గూడ నున్నది కాబోలును మునికి ప్రాణాయామ ముపదేశించుట యౌచిత్య శోభితము. ఇచట ప్రాణాయామోపదేష్ట యనగా నిమీలనకరుడని యర్థము.

క. రాముడు ప్రతి పచ్చంద్రుని ...

"విశ్వోన్మాథపటుతాశనస్య అలాతలేఖాలవః"

అనియు "కకుభాముద్ఘాటనీకుంచికా" అనియు వర్ణించినట్లు మూలమందున్నది. (7-88) తిమ్మభూపాలుడు విశ్వమునకు బదులు అధ్వనీన శబ్దము వాడెను.

అధ్వనీనులనగా బాటసారులు, ప్రవాసులు. అట్టి వారిని బాధించునది కామాగ్ని. కుకుభాందిక్కులకు అని మూలమున నుండ నతడు "ప్రకటతమఃపుంజముకు శిత విష్టప" మని అనువదించెను. ఈ రెండును ఔచిత్యపోషకములుగా నున్నవి.

1౭. తిమ్మ భూపాలుడు కొన్నిచోట్ల మూలము నందలి భావమును సరిగా గ్రహింపక భిన్న విధమున ననువాదము సాగించి యుండెను.

అ. మూలము నందలి

"విరమతి మహాకల్పేనాభిపథైక నికేతనః
త్రిభువన పురః శిల్పీ యస్య ప్రతిక్షణ మాత్మభూః
కిమధికరణం కీదృక్కస్య వ్యవస్థితి రిత్యసా
వుదరమవిశ ద్ద్రష్టుం తస్మై జగన్నిధయేనమః

అను రెండవ నాందీ రూపకమైన శ్లోకమును

అలసర సీజ గర్భుడు మహాప్రళయాపగమంబునన్ జగం
బులు సృజియింప బూని తగ బుట్టి చరాచర కారణ స్థితుల్
దెలియగ నాభి పంకరుహ దీప్త బిసాంతర బుద్ధి దూరునే
యేఁటని కుక్షి మాటికిని నట్టి జగన్నిధి నాశ్రయించెదన్.

అని అనువదించెను. నాభిపథైక నికేతనః అనగా నాభి యనెడి మార్గమే అద్వితీయమైన వాస స్థానము గలవాడని యర్థము. ఇది బ్రహ్మకు విశేషణము. దీనిని ఆంధ్రకవి "నాభి పంకరుహ దీప్త బిసాంతరబుద్ధిన్" "అనగా నాభిపద్మము నందు ప్రకాశించు తామర తూడు లోపలి భాగమను తలంపుతో" అని అనువదించెను. ఇది మూలమునకు భిన్నముగా నున్నది. కిమధికరణం కీదృక్కస్య వ్యవస్థితిః — అనగా నేవస్తువున కెట్టి వ్యవస్థ కలదు, ఏ ఆధారమున నే వస్తువే రూపమున నున్నది అని తెలిసికొనుటకని యర్థము. దీనినంతను తిమ్మ భూపాలుడు 'చరాచర కారణ స్థితుల్ దెలియగ' అని యనువదించెను. అధికరణ మనగా ఆధారముగాని కారణము గాదు. ఈ అనువాదము మూలభావమును సరిగా తెలుపుట లేదు.

ఆ. వామదేవుడు దశరధునితో మధుకైటభ దానవుల వస యొక్క ప్రవాహరూప శరణముచే ఆమగంధియై విషమమైన భూమిని రాజులు తమ

కీర్తులచే సురభీకరించి చిరకాల మనుభవించుచున్నా" రని పలికెను. దీనిని తిమ్మభూపాలుడు.

'మేదురతర మధుకైటభమేదో విస్రామిషంబు మేదిని దానిం
బాదుకొనం భుజియింత్రు ప్రసీదన్నిజకీర్తి సురభి చేసిన నృపతుల్
1-169

అని అనువదించెను. మూలమున మేదఃప్లవ విస్రావిషమమేదిని అని యున్నది అనగా మధుకైటభ రాక్షసుల వస యొక్క ప్రవాహరూపమైన క్షరణముచే ఆమగంధవతియైన మేదిని విషమ దుర్భోగ్య అయినదని అర్థము. దీనిని తిమ్మభూపాలుడు "మేదుర తర మధు కైటభమేదో విస్రామిషంబు మేదిని" అని భిన్నముగా ననువదించెను. ఆతడు చూచిన ప్రతిలో నీ యర్థమిచ్చు పాఠాంతర మున్నదేమో తెలియదు.

ఇ. విశ్వామిత్రుడు వామదేవునితో "సఖే! వామదేవ! చిరేణ దశరథో ద్రష్టవ్యయితి సర్వమనోరథానా ముపరివర్తా మహే" అని పలికెను. అనగా నేను చిరకాలమునకు దశరథుని చూడ గల్గుటచే సర్వాభిలాషములకు నతీతుడ నైతిని" అనగా నా కోరికలన్నియు సిద్ధించినవి అని భావము. ఇచ్చట వ్యాఖ్యాత "సర్వాభిలషణీయానాం ఉపరివర్తామహే, సర్వేపి నః కామాః సిద్ధాః ఇతి భావః" అని వ్రాసెను. తిమ్మ భూపాలుడు దీనిని "నా మనంబున చాల దినాల నుండి దశరథ క్షోణీ నాథ సందర్శ నేచ్ఛ యెల్ల కోరికలకు మీద నుల్లసిల్లు" (1-187) అని అనువదించెను. దశరథుని చూడవలెనను కోరిక అన్ని కోరికల కంటె అగ్రగణ్యమై యున్నదని దీని భావము. దశరథుని చూచుటకు వచ్చుచున్నాననగనే నా కోరికలన్నియు సిద్ధించినవని మూలము నందలి భావము. మూలభావమే మిక్కిలి గంభీరమును ఔచిత్యవంతమునునయి దశరథుని గొప్పతనమును చక్కగా వ్యక్తము చేయుచున్నది.

ఈ. ద్వితీయాంకమున శునశ్శేపు డహల్యా వృత్తాంతము చెప్పిన పిమ్మట వటువు "నీ యనుగ్రహముచే నేను చచ్చియు బ్రతికిన వాడనైతిని. అయినను శంకా జ్వరము నన్ను విడుచుట లేదు. అందుచే కొంత సేపు విశ్రమింపవలె"నని పలుక శునశ్శేపుడు "సఖే! భయమితి కిమేతత్ బ్రాహ్మణస్య, తత్ పర్యవస్థాపయాత్మానం" (మిత్రమా! బ్రాహ్మణునికి భయమన నేమి? అందుచే నీ యాత్మను స్తిమిత పఱుచుకొను) మని తెలిపెను. ఇచట తిమ్మ భూపాలుడు

"భయమితికిమేతత్ బ్రాహ్మణస్య" అను దానిని "వయస్యా! విప్రసమాజంబు నకు భయంబు నైజంబుకగా!" అని మూల భిన్నముగా ననువదించెను.

ఉ. రాము డుభయసంధ్య లందగ్ని హోత్రమును వ్రేల్చు మునులను గూర్చి చెప్పుచు లక్ష్మణునితో

తపః కృశతరై రంగైః
స్రష్టుమాకారితై రివ
సాయం ప్రాతరమీ పుణ్య
మగ్నిహోత్రం ప్రయుంజతే 2-19

సృజించుటకు కల్పితాకారులా యన్నట్లు తపస్సుచే మిక్కిలి కృశించిన యంగములతో నీ ఋషులు సాయం ప్రాతఃకాలము లందు పుణ్యమైన యగ్నిహోత్రము నొనరించుచున్నారు – అని పలికెను. తిమ్మ భూపాలు డీశ్లోకమందలి పూర్వ భాగమును – జలజ సూతి పురాసృష్టి కొఱవులిట్లు చేసి యుంచిన కైవడి జెలగుచుండు (2-92) అని అనువదించెను. చిత్రలేఖనము వ్రాయు వారు మొదట రేఖలు గీచి తరువాత రంగులు పూయుదురు. అట్లే బ్రహ్మదేవుడు సృష్టింపదలచి ముందు రేఖలను మాత్రము రచించెనా యను నట్లున్నారు తపః కృశాంగులైన మునులని యర్థము. తిమ్మభూపాలుని యనువాద మీ భావము నొసంగుట లేదు.

ఊ. ద్వితీయాంకమున సూర్యాస్తమయమును వర్ణించు సందర్భమున లక్ష్మణుడు "తేజోమయం తమోమయ మన్యతరస్యాంతదేవ దిక్చక్రం. కిమపి విచిత్రా ధాత్రా సృష్టిరియం భువనకోశస్య" (11-50) ఒకే దిఙ్మండలము పశ్చిమమున తేజోమయమును ప్రాచ్యాద్యన్య దిక్కుల యందు తమోమయమునై కనవచ్చుచున్నది. బ్రహ్మచే చేయబడిన యీ భువన కోశ సృష్టి విచిత్రము గదా! అని పలికెను తిమ్మ భూపాలుడీ శ్లోకమును "మునుమును తేజోమయమయి కనుపట్టినయట్టి దిశలు క్రమ్మఱ జూడందనరె దమోమయమై మది గను గొన నజు భువన సృష్టి కడు వింత గదా!" (2-148) అని యనువదించెను. ఒక దిక్కు ప్రకాశవంతమై యుండ మిగిలిన దిక్కులు తమోమయమై యుండుట వింత యని మూలము చెప్పుచుండ ననువాదము దిక్కులు ముందు తేజోమయమై తరువాత తమోమయము లగుట వింతయని తెల్పుచున్నది. మూలము నందలి భావమే రమ్యతరముగా నున్నది. మూలమున నిది లక్ష్మణుడు చెప్పినట్లుండ తిమ్మ భూపాలుడు దానిని రాముడు చెప్పినట్లు వ్రాసెను.

ఋ. నేపథ్యమున శునశ్శేఫాదులు పల్కిన భయోక్తులాలించి రాముడు వారి నోదార్చుచు "అలంక్లిశిత్వాగురుమల్పకో యం" (2-57) ఇచట 'క్లిశిత్వా' యనగా క్లేశ పెట్టియని యర్థము. "గురుం విశ్వామిత్రం క్లిశిత్వా అలం, వృథా గురుర్న క్లేశనీయః ఇత్యర్థః" అని వ్యాఖ్య. తిమ్మ భూపాలుడు దానిని 'గురు నింగూరిచి యింత క్లేశ పడుచుం గూయంగ నేలా!' అని వారే క్లేశపడుచున్నట్లు వ్రాసెను.

ౠ. మూలమున 69వ శ్లోకము (స్ఫురతి) 72వ శ్లోకము (కాశ్మీరేణ) చంద్రోదయమును వర్ణించుచున్నవి. ఈ రెండింటికి నడుమ మఱి రెండు శ్లోకములున్నవి. తిమ్మభూపాలుడు పై రెండు శ్లోకముల భావములను కలిపి ఒక సీస పద్యమును రచించెను. రెండు శ్లోకములు కలుపుటచే చోటుచాలక పోవుటచే కాబోలును 'వామభ్రువామానన ద్వైరాజ్యం విదధానం' అను భావమును విడిచి వైచెను.

'స్ఫురతి పురతః మాద్యన్మాద్యత్ చకోర విలోచన ప్రకర కిరణ శ్రేణీ దత్త స్వహ స్తఘనంమహః' (2-68) (మిక్కిలి హర్షించుచున్న చకోరముల నేత్రముల సముదాయముల మయూఖనిచయములచే నీయబడిన హస్తావలంబనముచే సాంద్రమైన చంద్రుని తేజస్సని దీని యర్థము) చంద్రోదయ సమయమున చంద్రునిపై దృష్టులను ప్రసరింప జేయుచున్న చకోరముల నేత్రముల కాంతులచే చంద్రుని తేజస్సు మిక్కిలి ప్రకాశించుచున్నదని భావము. ప్రకాశ టీక యిట్లీ యర్థము చెప్పుచున్నది. తిమ్మభూపాలు డట్లు గాక 'తన కరోత్కరము మాద్యచ్చకోరవిలోక మండలంబునకు కైదండగాగ' యని చంద్రకాంతియే చకోరములకు హస్తావలంబన మొసరించుచున్నదని వ్రాసెను.

ఎ. కలహంసిక రామలక్ష్మణు లిప్పుడెక్కడ నున్నారని యడుగ కంచుకి వారు దేవతాగార వేదిక యందు "కౌశిక వైదేహ గౌతములను మునుల నారాధించుచున్నారని పలికెను" (3-8) తిమ్మభూపాలుడు ఏ లకో వైదేహ గౌతములను విడిచి వైచి 'ఆ రమణీయ మూర్తులు ప్రాంచద్వనీ వీథి సంయమి సంక్రందను గాంధి నందను సముద్యద్భక్తి సేవించుచున్ బ్రమదం బొప్పగ నున్న వారు (2-263)" అని యొక్క విశ్వామిత్రుని సేవించుచున్నట్లే యనువదించెను. మఱియు మూలమున దేవతాగార వేదికాయాం" అని యుండగా నతడు "ప్రాంచద్వనీ వీథి" యని చెప్పి యుండెను.

ఏ. జనకుడు రామలక్ష్మణులను గూర్చి శతానందునితో "భవతిన తేజసా నో: శిష్యే గురౌరసతోనచ స్వయమపి మునౌ విశ్వామిత్రే గృహానధితిష్ఠతి. దశరథ సుతావేతౌ దృష్ట్వా యథోచ్ఛ్వసితం మన: శిథిలయతి మే ప్రత్య గ్జ్యోతి: ప్రబోధ సుఖాసికాం (3-23)" అని చెప్పినట్లు మూలమున నున్నది. "దశరథ సుతులైన యీ రామలక్ష్మణులను జూచి ఉల్లసితమైన నా మనస్సు పరమాత్మ ప్రబోధ జ్ఞానము వలన కలుగు సుఖస్థితి నెట్లు శిథిలీకరించుచున్నదో యట్లు శిష్యుని యందలి యనురాగముచే నా భవనము నధిష్ఠించు గురుడైన యాజ్ఞవల్క్యుని యందు గాని ఇప్పుడు స్వయముగా మా గృహమున కరుదెంచిన విశ్వామిత్రుని యందు గాని నా మనస్సుచ్ఛ్వసితమై పరమాత్మ ప్రబోధ జాతా నందమును శిథిలీకరించుట లే" దని దీని యర్థము. తిమ్మభూపాలుడు దీనిని

ఉ. కౌశికమౌని రాకయు జగన్నుత బోధ విభూతి మించు మ
ద్దేశికు సన్నిధానము నతి ప్రమదోన్నతి జేయు బ్రహ్మ వి
ద్యా శిథిలాను భూతి యును నాత్మకొసంగ విధం వసుంధరా
ధీశకుమారక ద్వయ నిరీక్షణ సౌఖ్య శతాంశ మేనియున్ 2-304

అని యనువదించెను. రాజకుమారులను జూచుట వలన తన మనస్సు బ్రహ్మ జ్ఞాన జనితానందమును శిథిలీకరించుచున్నదనియు, అట్లు కౌశికుని రాకయు యాజ్ఞవల్క్యుని సన్నిధానమును తన కానందము కల్గించుట లేదనియు జనకు డన్నట్లు మూలము చెప్పుచున్నది. తిమ్మభూపాలుడు కౌశికుని రాక, దేశికుని సన్నిధానము, బ్రహ్మ విద్యా శిథిలానుభూతి, రామలక్ష్మణ నిరీక్షణ సౌఖ్యము నందలి శతాంశ మేనియు కలిగించుట లేదని వర్ణించి యున్నాడు.

ఐ. మాల్యవంతుడు రాముని వార్త వినియు రావణుడు తన పూర్వ చరి తములను మానలేదని తలంచి "శ్రుత్వాదుశ్శ్రవమద్భుతంచ మిథిలా వృత్తాంత మంత: ఒత చ్చింతాపహ్నవ సావహిత్థ వదనత్వ గ్విప్రకీర్ణ స్మిత:" (4-8) ఇత్యాదిగా తలపోసెను. "వినదగనిదియు, నాశ్చర్యజనకమునైన మిథిలా వృత్తాంతమును విని మనసున కల్గుచున్న చింతను కప్పి పుచ్చుటచే ఆకార గోపన చిహ్నములతో గూడిన ముఖముల చర్మములపై వికీర్ణమైన చిఱునవ్వులు కలవాడై యని యర్థము. రావణుడు మిథిలా నగరమున రాముడు శివుని విల్లు విఱిచి సీతను పెండ్లాడు చున్నాడను వృత్తాంతమును విని లోన కల్గుచున్న

చింతను కప్పిపుచ్చుచు తన ముఖముల యందు స్మితములను విస్తరింప జేయు చున్నాడని భావము. తిమ్మభూపాలుడు దీనిని

"జనక పురంబు వార్త మది జాలి ఘటింపగ తద్విచారమున్
మనమున మాటి కూర్చు చిఱునవ్వు తదీయదిశన్... 3-15

"కూర్చు చిఱునవ్వు తదీయ దిశన్" అనునది మూలానుగుణముగా లేదు.

ఒ. శూర్పణఖ వచ్చి నమస్కరింపగనే మాల్యవంతుడు "వత్సే! కళ్యాణి నీ భూయాః" అని యాశీర్వదించెను. ప్రకాశ టీకాకారుడు 'కల్యాణి నీ' యనగా 'కుశలినీ' యని యర్థము వ్రాసెను. తిమ్మ భూపాలుడు

"పెండ్లి కూతురవు గమ్మనుచు దీవెననిడి"

యనుచు ననువదించెను. ఇది సహజముగనే యున్నది. కాని వ్యాఖ్యకు భిన్నముగా నున్నది.

ఓ. శూర్పణఖ "దశరథుడు రాగానే కుమారులకు గోదాన మంగళము జరుగ నేను మిథిలా నగరమున కరిగితి" నని మాల్యవంతున కెఱింగించెను. అంత మాల్యవంతుడు నిట్టూర్చి "అతి ప్రకాశో యమర్థః యథాని వృత్త స్వీకరణా జానకీతి" జానకిని రాముడు స్వీకరించెనను నర్థము తేటతెల్లమగుచునే యున్నదని పల్కెను. తిమ్మభూపాలుడు "మాల్యవంతుడు నిట్టూర్పు నిగిడించి విన్ననైయో కన్నియ! రామునకు మున్న పరిణయము గాక తమ్ములకు వివాహ మహోత్సవము ప్రవర్తిల్లదు గదా! ధరాకుమారి యా దశరథాధిప మౌళికి పెద్ద కోడలగుట నీ మాట సూటి దప్పెనని కొండొక విచారించి" (3-29) అని మూల భిన్నముగా ననువాదము సాగించెను.

ఔ. చతుర్థాంకమున విష్కంభానంతరము పరశురాముడు ప్రవేశించి "యముడు యుద్ధ రసికులైన రాజుల నందఱిని భక్షించి యుండుటచే నప్పుడు శస్త్రాశస్త్రి కదనము గగనారవింద సంకాశమయ్యె" నని తలంచెను. నాల్గవ యంక మందలి యిరువదవ శ్లోకము దీనికి మూలము "శస్త్రాశస్త్రి కథైవకా" ... ఇత్యాది. ఈ శ్లోకమందలి యుత్తర భాగము ఇట్లున్నది.

"లక్ష్మీరప్యరవింద సౌధవలక్షీనిర్వ్యూహపర్యంకికా
విశ్రాంతై రలిభిః సకుంజర ఘటాగండోద్గతైర్మోదతే"

యని యున్నది లక్ష్మి కూడ యుద్ధ గజముల గండభాగముల నుండి నిర్గత ములై పద్మమనెడి హర్మ్య శిరో గృహము నందలి హస్తిదంత నిర్మిత పర్యంక మందు విశ్రమించిన తుమ్మెదలచే ప్రీతి నొందకున్నదని దీని భావము. అనగా గజ గండముల నుండి యెగిరివచ్చి తుమ్మెదలు పద్మములందు వ్రాలుటచే పద్మ స్థితయైన లక్ష్మి కందు సుఖము కలుగుట లేదని తాత్పర్యము. తిమ్మభూపాలుడు దీనిని "పద్మ పద్మాంతర భవనంబులనె గాని కరిఘటాకటముల నెఱుగదయ్యె" (8-87) అని యనువదించెను. ఇందు భావము విస్పష్టముగా లేదు. అదిగాక యిది మూలమునకు భిన్నముగా నున్నది.

అం. రాముడు వైష్ణవ ధనువు నెక్కుపెట్టి శరముచే భార్గవ గతిచ్ఛేద మొనరించెను. ఈ విషయము మూలమున నేపథ్యమున చెప్పబడినది (4-57). ఈ శ్లోకము యొక్క పూర్వ భాగమిట్లున్నది "కన్యాకాచి దిహాపి కర్మణి పణః స్యాదిత్యసూయావలత్ సీతాపాంగమయూఖ మాంసల ముఖ జ్యోత్స్నా విలిప్తీం దివం కుర్వాణేవ రఘూద్వహేన (పుట 248) (వైష్ణవ ధనుర్భంగ రూపమగు కర్మ మందు కూడ నింకెవతెయైన కన్య శుల్కమగునేమో యని సాపత్న్య సంభావనా జన్యమైన యసూయచే చలించు సీత కడకంటి కిరణము లచే ప్రభూతత్వమును బొందిన ముఖ జ్యోత్స్నచే నాకాశమును లిప్త మొనరించు చున్న రామునిచే అని దీని యర్థము) ఇచ్చట వ్యాఖ్యాకారుడు "యద్యత్రాపి కర్మణి కాచిత్ కన్యాపణః స్యాత్తదామమ సపత్నీ భవిష్యతీతి సపత్నీర్ష్య యా సీతయా కూనిత త్రిభాగ యాదృశా దృశ్యమానోరామః స్వముఖ ప్రతిఫలత్ సీతానయన మయూఖైః సమేధిత కాంతి ముఖం నిజం వ్యోమ నిక్షిపన్ దివం తత్కాంతి లిప్తాంకరోతి" అని రాముడు సీతచే నీర్ష్యచే చూడబడుచు తన ముఖ మందు ప్రతిఫలించు సీతా నేత్రకాంతులచే పెంపొందిన కాంతి గల తన ముఖ మును మింట ప్రసరింప జేయుచు నాకాశమును తత్ కాంతిలిప్త మొనర్చుచున్నా డని వ్రాసెను. తిమ్మభూపాలు డట్లుగాక

ఉ. కన్నియ యొర్తు పన్నిదము గల్గునొ యిందుకు నంచు ఖిన్నతన్
మిన్నక చూచు సీత ముఖనీరజ పాండిమ మాకసంబునన్
వెన్నెల గాయ ... ... ... 8-184

నని సీత ముఖ పాండిమము చేతనే యాకసము తెల్లపడినట్లు వ్రాసెను. 'సీతా పాంగమయూఖ మాంసల" మను సమాసము సీత ననువదింపక విడిచి "సీత ముఖ నీరజ పాండిమమును" క్రొత్తగా జేర్చెను.

అః. యాజ్ఞవల్క్యుడు పరశురాముని నాశీర్వదించుచు "శివాస్తే పంథానః వ్రజనిజగృహేభ్యో నిజ గృహాన్" అని పలికినట్లు మూలమున నున్నది. వ్యాఖ్యాత "నిజగృహేభ్యః నిజానాం స్వజనానాం అస్మాకం, గృహేభ్యః నిజ గృహాన్ స్వీయాన్ ఆశ్రమాన్ వ్రజ గచ్ఛ" అని వివరించెను. (పుట 252) తిమ్మభూపాలుడు దానిని

అగునీకు స్వీజయంబు, పామ్మఖిల గేహంబుల్ భవద్గేహముల్ 3-193

అని యనువదించెను. నీ మార్గములు కల్యాణమయములగు గాక ! యని మూల మున నుండ తిమ్మ భూపాలుడు 'అగు నీకు న్విజయం' బని యనువదించెను. "నిజగృహేభ్యో నిజగృహాన్" అనగా ఇదియు నీ గృహమే నీ యాశ్రమమును నీ గృహమేయని భావించి తిమ్మ భూపాలుడు 'అఖిల గేహంబుల్ భవద్గేహ ముల్' అని అనువదించినట్లు కనిపించును.

క. పంచమాంకము నందలి రెండవ శ్లోకము రాముడు గంగానదినిదాటి నావికుడైన గుహునికి సౌమిత్రి మైత్రీమయమైన యాతరమును (ఆతరం తర పణ్యంస్యాత్) ఒసంగెనని చెప్పబడినది. తెలుగున 'ఆ నావికున్ సౌమిత్రి ప్రియ బంధు తాదరము చే సంప్రీతు గావింపుచున్ (4-7) అని ముద్రింపబడినది. 'ఆతర' శబ్దము నర్థము తెలియక ముద్రాపకులు 'ఆదర' మని మార్చియుండిరి.

ఖ. రాము డగస్త్య శాసనమున పంచవటిలో నివసించెనని తెలుప జాంబవంతుడు సంతోషముతో 'తర్హి హస్త గత ఏవ అస్మాకం' అని పలికి నట్లు మూలమున నున్నది. అనగా రాముడు మనకు చాల దగ్గఱగా నున్నాడని భావము. తిమ్మభూపాలుడు దీనిని 'అట్లయేని మేలగు జనస్థానోర్వికి ఋశ్య మూక నగంబుం దవ్వు లేదు చేతెడెయనన్ (4-24)' అని తెనిగించెను. 'హస్త గత' యనుటకు 'చేతెడె' యనునది చాల చక్కగా నున్నది. కాని మూలం భిన్న ముగా నున్నది.

గ. లక్ష్మణుడు శూర్పణఖ కర్ణనాసోష్ఠములను కోసి పైచెనను విష యమును మూలకారుడు శూర్పణఖ లక్ష్మణ రోషాగ్ని యందు తన కర్ణనా

సౌష్ఠమయములైన మూడాహుతులచే ప్రాయశ్చిత్త మాచరించెనని వ్రాసెను. తిమ్మ భూపాలుడీ క్లిష్టతను తొలగించి "ప్రాయశ్చిత్తయాంచక్రే" అను మాటను (పుట 269) విడిచి లక్ష్మణుడు ముక్కును జెవులు గెమ్మోవియు గోసి యాహుతులుగా క్రోధాగ్ని నొనర వ్రేల్చె (4-26) అని లక్ష్మణుడే యాపని చేసినట్లు వ్రాసెను.

ఘ. లక్ష్మణుడు గుహుని ద్వారా అంజనేయుని గూర్చి విని "బ్రహ్మ శాప సంక్లిష్ట స్వవీర్యజ్ఞాన యంత్రితః అన్యైరపిభువం వీరైః కీర్యమాణా ముపేక్షతే (6-61)" బ్రహ్మ శాపముచే వ్యాహృతమైన తన శౌర్యజ్ఞానముచే నవరుద్ధుడై యన్యవీరుల చేత వ్యాప్తమైన భూమిని జూచుచు కూడ నిత డుపేక్షించుచున్నా" డని దీని భావము. తిమ్మ భూపాలుడు దీనిని "ఇతడెకద భూమి సుర శాపవృత నిజ ప్రతాప విజ్ఞానబద్ధుడై ధరణి నితర వీరులు రహింప జూచుచు నూరకుండె నటుల గాకున్న భువిన సాధ్యంబు గలదె" (4-138). అని యనువదించెను. బ్రహ్మ శాపమనగా భూమి సుర శాపమని చెప్పవచ్చును. కాని వ్యాఖ్యాత "బ్రహ్మణః శాపేన" — బ్రహ్మయొక్క శాపముచే నని వివరించి పూర్వగాథను గూడ వ్రాసెను. శ్లోకము యొక్క ఉత్తర భాగమునకు అన్య వీరులు భూమి నాక్రమించుచుండగా నితడూర కున్నాడని భావము. అట్లూరకుండుటకు బ్రహ్మ శాపముచే నతడు స్వవీర్యము నెఱుగమి కారణము. తిమ్మ భూపాలుడు వీరులు ప్రకాశించుచుండగా చూచుచు హనుమంతు డూరకున్నా డనియు, నట్లుగానిచో భూమిపై నతని కసాధ్య ముండదనియు వివరించెను.

ఙ సారణుడు తాను వానరమూర్తి ధరించి తిరుగుచు మహారాజ ణునిచే గుర్తింపబడి రాముని కడకు తీసికొని పోబడెనని తెల్పెను. "మహారాజ విభీషణేన" యని యర్థోక్తిలో భయముతో "ఆర్య! చిర సంవాసేన రామ రాజధానీ ప్రవాదోమామను బధ్నాతి" (పుట 323) యని పలికెను. అనగా వానర రూపము ధరించి రామ కటకమున నివసించుటచే విభీషణునకు మహారాజ విశేషణము నుపయోగించితి నని చెప్పెను. తిమ్మభూపాలుడు దీనిని విడిచి వైచెను.

చ. హేమాంగదుడు ఇంద్రకవచములను చేత దాల్చిన మాతలిని జూచి వివిధ మణికాంతులచే ననేక సుర చాప సహస్రముల సమావేశములతో గూడి

నట్లున్న విమానము నందు దేవేంద్రుడు తన కార్ముకముచే కాక కవచమును గూడ పంపెనని పలికెను. (6-50) తిమ్మ భూపాలుడు

"హరి ... ... రథ సీమనిచ్చి చాపంబు"
సంగర రంగస్థలి గంటి నంచు చెవి యొగ్గన్ 4-289

అని భిన్నముగా ననువదించెను.

ఛ. రావణ ప్రతీహారి మాతలితో సురాసుర చమూదోఃకాండ కండూ విష జ్వాలా జాంగలికుడైన రావణునిచే నీ గర్వము శమింపబడ జేయ లేదు. ఏలయన, నీవు ఇంద్రుని రథమును, కవచమును రామునికి తెచ్చి యిచ్చితివి. ఈ విధముగా రాజ ద్రోహమును చేసి యింద్రుడిం కెట్లు జీవించు నని పలికెను. (6-55) తిమ్మ భూపాలుడు చివరి వాక్యమును భిన్నముగా ననువదించెను. "జాలే యీరఘుడింభు బేర్చితిగ దాయా యింద్రుమైమరువ్వ తేరే లాగాతనిక్షి క్షణంబె యిపి యెంతే వింతలై సూలినన్ (4-290)" ఇందలి చివరి పంక్తికిని మూలమునకును నేమియు సంబంధము లేదు.

పై శ్లోకము నందలి "సురాసురచమూ ... ... ... ఇత్యాది సమాసము మూలము నుండి యథాతథముగా గ్రహింపబడినది.

జ. హేమాంగదుడు రావణుని కబంధము భూమిపై బడినపుడు తద్భార విశేషముచే వాసుకి క్రుంగిపోగా భూమి కొంత క్రిందికి దిగెననియు, అప్పుడు కులపర్వతము లించుక పైకి లేచెననియు, నటి మహీవలయము నతదర్థ కుండలిత విగ్రహము నాధారముగా గల పడగలచే మోయుచున్నాడనియు చెప్పెను. తిమ్మభూపాలుడు "గురుదైత్యేశకబంధ భారమునతాగ్రుంగంగ వేలాధరాధర మత్యున్నమితాంగరాగ భుజగేంద్రస్వామి —" (4-345) ఇత్యాదిగా వేలా ధరము క్రుంగె ననియు భుజగేంద్రస్వామి అత్యున్నమితాంగరాగు డయ్యె ననియు మూల విరుద్ధముగా ననువదించెను.

ఝ. సీత విభీషణుని హిమవంతుని గూర్చి "కపిషకల్పానల జ్వాలా కలా పక్వధ్యమాన జలనిధి లవణస్తబక నిర్మలాభ్రంలిహశిఖర సహస్ర మధురోమహీధరః ప్రలోక్యతే (పుట 414) అని అడిగెను. తిమ్మ భూపాలుడు దీనిని "యుగాంతని బిడ వహ్నిహేతి పరితప్త పయోనిధి ఫేనరాశి బాగున"

(5-54) అని అనువదించెను. లవణ స్తబకము సీతడు ఫేనరాశిగా మార్చెను. అగ్నితప్తమైన సముద్రము లవణమగుటయే యుక్తము.

ఞ. శివుడు పార్వతి శరీరమందలి యర్ధభాగముతో తన మేని సగమును కూర్చి యర్ధనారీశ్వరుడు కాగా పార్వతి చెలులు వేళాకోళముగా మిగిలిన రెండర్ధములను గూర్చి మఱియొక యర్ధనారీశ్వరు నొనర్చిరని రాముడు తెలిపినట్లు మూలమున నున్నది. (7-86) దానిని తిమ్మ భూపాలుడు

తన సగంబున ప్రియ సగంబుననిటునటు
న భవు డర్ధనారీశ్వరుండైన కడమ
యర్ధముల నటు నిటు గూర్చి యగజ చెలులు
మఱియు నొక యర్ధనారి నమర్చిన గిరి 5-70

అని యనువదించెను. మూలము నందలి 'సప్రహసన' మ్మను దానియందలి భావమును కవి 'నగిరి' యను క్రియ యందిమిడ్చెను. కాని మూలమున 'అన్యః అర్ధనారీశ్వరః' అని యుండగా "మఱియొక యర్థ నారినమర్చి" రని వ్రాసెను.

ట. విభీషణు డింద్రుడు కైలాసమున నున్న శివునకు నమస్కరించు నపుడు ఆతని వేయి కన్నులు నీలోత్పల మయమైన దండ నర్పించుచుండగా క్రీడాపరుడైన కుమారు డది చూచి నీలోత్పల భ్రాంతిచే వానిని గ్రహింప నిచ్ఛింప గణములతో గూడ శివుడు నవ్వెనని మూలమున నున్నది. (7-49) సహగణైః అను దానిని తిమ్మభూపాలుడు కుమారునితో నన్వయించి "గణాను గతవర్తకు షణ్ముఖు జూచి" యని యనువదించెను. (5-92)

ఠ. సప్తమాంకమున 55, 56 శ్లోకములు మేరుపర్వత వర్ణనమునకు సంబంధించినవి. ఈ రెండును మూలమున లక్ష్మణ ప్రోక్తములుగా నున్నవి. తిమ్మభూపాలుడు (భూమేః స్వర్ణతయా) అను 56వ శ్లోకమును విభీషణు డన్నట్లు అనువదించెను.

డ. విభీషణుడు సీతకు చంద్రుని వర్ణించి చెప్పుచు 'త్రిభువనవనితా నేత్రయోః ప్రాతరాశః' అని చెప్పినట్లు మూలమునందున్నది. (7-62) అనగా మూడు లోకము లందలి స్త్రీల నేత్రములకు ప్రాతర్భోజనమని యర్థము. వ్యాఖ్యాత దీనికి 'సాదరదర్శన విషయః' అని వివరణము వ్రాసెను. తిమ్మ

భూపాలుడు దీనిని "లోకత్రయాంగనా లోకలోచన పంక్తి కాయితంబగు మధు రాంగరాజి" అని యనువదించెను. ఇది మూలమునకు భిన్నముగ నున్నది.

ఢ. 5-118 వ పద్యము నందలి "కర సంజాతంబులన్" అను దానిని "కరకంజాతంబులన్" అని దిద్దుకొనవలెను.

ణ. రాముడు "చంద్రుడు దక్షిణం లోకచక్షుః" అని వర్ణించి చెప్పెను. అనగా ప్రీతిప్రదమైన లోక నేత్రమని యర్థము. తిమ్మ భూపాలుడు దీనిని శశి తృతీయాక్షియై మించె జగతి కతివ! (5-122) అని యనువదించెను. ఇది కూడ నుచితముగనే యున్నను మూల భిన్నము.

త. 7.86 వ శ్లోకమున మరుః = మరుభూమి (ఎడారి) వర్ణింపబడినది. తిమ్మ భూపాలుడు మరుత్ అనుకొని గాడ్పు (5-150) అని అనువదించెను. మరుః అనునదే సరియైన పాఠము.

థ. 5-156 పద్యమున తిమ్మభూపాలు డభిసారికలు చకోరపాళికి భయంబిడుచున్నట్లు వ్రాసెను. చకోరోడ్డీనములచే జనాగమనము నూహ చేసి అభిసారికలే భయపడుచు త్వరితముగా వెనుదిరిగి పోవుచున్నారని మూలకర్త వ్రాసినట్లు వ్యాఖ్యాత వివరించి యున్నాడు.

ద. రాముడు తామ్రపర్ణిని వర్ణించుచు శుక్తి గర్భ సంబంధముచే స్తంభితములై వారి బిందువులు - తామ్రపర్ణినదీ ప్రసూతలైన ముత్యములు - స్త్రీల అంకము నుండి అంకమునకు భ్రమించుచున్నవని తెల్పెను. (7-91) ప్రసూతయః అనుటచే క్రొత్తగా నెవ్వరైన ప్రసవించిన ఆ బిడ్డను స్త్రీ లొక్కొక్క రెట్లంకము లందుంచుకొని ఉపలాలింతురో ఆ విధముగా నీ ముత్యములను కూడ స్త్రీలంకము నుండి అంకమునకు చేర్చుకొనుచున్నారని వివరణము. తిమ్మభూపాలుడు 'వారి కణాళి శుక్తి పుటవాసత బూదియగట్టి అంగనావార విభూషణాకృతుల వాటిలు కంఠమునందు నెల్లెడన్ (5-157) అని అనువదించెను. మూలము నందలి ధ్వని యిందు రాలేదు.

న. 5-182 తత్ప్రసవమున్ కాదు. తత్ప్రసరమున్ అని యుండవలెను. 7-112.

య. 5-212 పద్యమున తిమ్మభూపాలు డప్రధాన విషయమునకు ప్రాధాన్య మొసంగెను. యష్టిస్థమైన దీపముకుశము వర్తిని దహించి మల్లికా తైలమున ప్రకాశించుచుండ నాభిదఘ్నమైన తమము వ్యాపించునప్పుడు స్త్రీలు తమ రతి పాటవమును చూపుదురని మూలము (7-124)

తిమ్మభూపాలుడు అన్నులు మంతనపు నేర్పులు తెల్పి నశ్యద్దశంబుల్ వెలుంగనిచో బొక్కిటి బంటి చీకటు లొగిం గప్పున్ నివాసంబులన్ (5-212) అని మూలమును కొంత తగ్గించి వ్యత్యస్తముగా ననువదించెను. చివరి శ్లోకమున 7-152 వీర యశో రసాయన మధుస్యందమైనదియు శ్రుతి శష్కులిచే వేష్టిత మైన ఆకాశము నవగాహించునదియునగు కవుల గుణము (శబ్దము) గంగాజల ధారలు లోకమును పవిత్రము చేయునంత దనుక వర్తించు గాక అని యున్నది. తిమ్మభూపాలుడు దీనిని వీర యశస్సుధాసార నిష్యందములు శ్రవణాగ్రగుణ ములై ప్రబలుగాత అని అనువదించెను. (5-262)

వీర యశో వర్ణన మొనర్చు కవుల రచనా గుణము శ్రవణాకాశమున వర్తిల్లు గాక అని వ్యాఖ్యాత. తిమ్మభూపాలుడు కవుల గుణము అనగా శబ్దము లేక రచన అను కర్తృ పదమునే విడిచి వైచి తద్విశేషణమును మాత్రము అను వదించెను. అట్లే అతడు శబ్దముతో సంబంధము గల ఆకాశమను మాట కూడ విడిచి వైచెను.

## 20. యథాతథముగా అనువదించుట :

చాలచోట్ల తిమ్మ భూపాలుడు మూల భాగములను యథాతథముగా అను వదించుటయే కాక మూలము నందలి కొన్ని పదములను కూడ యథాతథముగా గ్రహించి యుండెను. దీనికి గ్రంథమంతయు ఉదాహరణమే. కొన్ని ముఖ్యోదా హరణములు మాత్ర మీయబడుచున్నవి.

అ. దశరథుడు వామదేవునితో వశిష్ఠునికి తన ఎడగల పక్షపాతము నెఱి గించుచు

తస్యాజ్ఞయైవ పరిపాలయతః ప్రజాం మే
కర్ణోపకంఠ పలితంకరణీ జరేయమ్
యద్గర్భ రూపమివ మా మనుశాస్తి సర్వ
మద్యాపి తన్మయి గురుః గురు పక్షపాతః 1-15

అని పలికెను. (ఈ వశిష్ఠుని ఆజ్ఞానుసారమే ప్రజను పరిపాలించుచున్న నాకు కర్ణపార్శ్వమున కేశములు నరయు నట్లొనరించు ముసలితనము వచ్చినది. అయినను గురువైన వశిష్ఠుడు బాలునికి వలె సర్వ కర్తవ్య సముదాయము నుప దేశించు చున్నాడు. అందుకు ఆతనికి నాపై గల అధికమైన పక్షపాతమే కారణము) అని అర్థము. తిమ్మ భూపాలుడీ శ్లోకమును

ఉ. ఆయత భక్తి యుక్తి దన యాజ్ఞ శిరంబున దాల్చి రాజ్యమే
జేయుచు నుండ నిట్లు జరచే నరసెన్ జెవిచెంత, నిప్పుడుం
బాయని కూర్మి సర్వమును బాలునకుం బలె నాకు దెల్పెడిన్
నాయెడ బక్షపాతము ఘనంబు గురూత్తము నెమ్మనంబునన్ 1-171

అని యథామూలముగా అనువదించెను.

ఆ. వామదేవుడు 'మహారాజ! కిముచ్యతే, సమాన వృత్తే రపి క్వచి దేవకస్యచిత్ తారామైత్రకమ్' అని పలికెను. ఈ వాక్యము తెలుగున

గీ. అనిన వామదేవుడనియె నోరాజన్య
తిలక యరుదు గాగ బలికెదేల
యెట్టి సర్వసముల కేని తారామైత్రి
యెంచి చూడ నొక్క యెడన కాదె 1-172

అని అనువదించెను. ఈ అనువాదము యథామూలముగ నుండుటయే కాక మూలము నందలి 'తారామైత్రకం' అను పదమును కూడ యథాతథముగా గ్రహించినది. తారామైత్రక మనగా చక్షూరాగము. ఇచ్చట స్నేహాతిశయమని భావము.

ఇ. విశ్వామిత్రుడు దశరథుని రాముని తన యాశ్రమ రక్షణార్థమై పంపుమని యడుగుచు

ద్రష్టః సాక్షాదసుర విజయీ నాకినాం చక్రవర్తీ
మాత్స్యో న్యాయః కథయతి యథా వారుణీ దండనీతిః 1-33

ఇత్యాదిగా పలికెను. తిమ్మ భూపాలుడు పై రెండు శ్లోక పాదములను

క. హరి సాక్షాదసుర విజయి
వరుణనయము మాత్స్య నీతి వక్కాణించున్ 1-222

అని అనువదించెను. మూలము నందలి మాత్స్య న్యాయః అను శబ్దమును తిమ్మ భూపాలుడు మాత్స్య నీతి యని చెప్పెను పెద్ద చేపలు సజాతీయములైన చిన్న చేపలను తినుచుండుట మాత్స్యనీతి. అల్ప సామర్థ్యము కలవారికి అధిక బలము కలవారిచే నిగ్రహము కలుగుచుండుట అని అర్థము.

శ్లో. అద్రౌ ద్వితీయాంశమున సూర్యాతపమును వర్ణించు
ఉద్దామద్యుమణిద్యుతి వ్యతికర ప్రక్రీడ దక్షోపల
జ్వాలాజాల జటాల జాంగల తటీని ష్కూజకోయష్టయః 11-30

అను శ్లోకమును

మ. పరుషోద్యద్ద్యుమణి ద్యుతి వ్యతికర ప్రక్రీడదరోపలాం
కురిత జ్వాల జటాల జాంగల రటత్కోయష్టులై ... 2-111

అని ఆంధ్రీకరించెను. తిమ్మ భూపాలుడీ పద్యమున యతిప్రాసల కొఱకు రెండు పదములను చేర్చినను మూలము నందలి పూర్వార్ధమున గల సమాసమును యథాతథముగా ప్రవేశపెట్టి యుండెను. మూలమున 'నిష్కూజ' యనగా వ్యాఖ్యాత 'అశబ్దాః' అని వ్రాసి యుండెను అనగా కూయక మౌనము ధరించిన యని యర్థము. తిమ్మభూపాలుడు దానికి బదులు 'రటత్' - (కూయుచున్న) అను పదమును చేర్చి యుండెను. మూలమున మధ్యాహ్న శూన్యములైన దిశలు "దృశోః అవిష్కర్మ సమాపయంతి - దృక్ శక్తిం ప్రతి బధ్నంతి" అనగా వీక్షణశక్తి నడ్డగించుచున్నవి యని కలదు. తిమ్మభూపాలుడు దానిని నేత్రతామరసంబుల్ దరికొల్పెడు - నేత్రపద్మముల నేర్చుచున్నవి యని అనువదించెను.

ఉ. మూలమున రాముడు ఆశ్రమమును వర్ణించుచు తపోధన గృహములు "శ్వస్సంచీవర యిష్యమాణ వటుక వ్యాధూత శుష్యత్త్వచః" అని పలికెను. అనగా మరుసటి రోజున ధరింపబడ బోవునవియు, బ్రహ్మచారులచే కంపితములై యెండుచున్నవియునగు వల్కలములు కలవని యర్థము. తిమ్మ భూపాలుడీ పాదమును "శ్వస్సంచీవర యిష్యమాణవటు కవ్యాధౌత వల్కంబులు" అని యథాతథముగా గ్రహించెను. 'శుష్యత్త్వ'ను పదమును విడిచి వైచెను. వ్యాధూత అను పాఠము కంటె వ్యాధౌత అనునదియే ఉచితతరముగా నున్నది.

ఊ. పరశురాముడు మిథిల కరుదెంచెనని శూర్పణఖ తెలుప మాల్యవంతు డది యుక్తమే అయినను 'అనే నాపి సకల మూర్ధాభిషిక్త కంఠ కాండ రుధిరావసేక పంకిల కుఠారేణ దురభిభవో దాశరధిః' అని పలికెను. తిమ్మభూపాలుడీ సమాసమునే కొంచెము మార్చి

గీ. ఐన గానిమ్ము సకల మూర్ధాభిషిక్త
కంధరా బంధురా స్రావగాహగూఢ
పంకిల కఠోరతర కుఠారాంకుడైన
యతనికేని నజేయుడీ యధిప సుతుడు ౬-18

అని రచించెను. ఇదే సందర్భమున శూర్పణఖ 'అహో దుగ్ధముఖే తస్మిన్ క్షత్రియ వటుకే ఏవం సంభావయతి మాతామహః' (211 పుట) అని పల్కెను. దానిని అనువాదకుడు

పాల బుగ్గల యీ రాచ బాలునెంత
గౌనం నెక్కించి పలికెద' 3-7౪

వని చక్కని జాతీయముతో అనువదించెను.

ఋ. అగస్త్య వర్ణనముతో కూడిన సీస పద్యమున (4-20) 'చతుష్పాథోధి ముష్టింధయుండు (చతుస్సముద్ర ముష్టింధయేన) వింధ్య భూధర చాపలారంభ ఘాతియై (వింధ్యాచల చాపలారంభ విస్రబ్ధ ఘాతినా) వాతాపిదానవాపార్య నిద్రాపూర్ణ మంగళకలశమై (వాతాపి దానవ దీర్ఘ యాత్రా మంగళ కలశేన) అను పదములు మూలమునుండి యథాతథముగా గ్రహింపబడినవి.

ౠ. ఇట్లే హేమాంగదుడు రావణుడు మరణించిన పిమ్మట "భిన్నై రావణ గంధ సింధుర ...... తుభ్యంనమః" (6-78) అని చెప్పిన శ్లోకము నందలి సమాసముల నించుక మార్పుతో గ్రహించి తిమ్మభూపాలుడు "గురు దైత్యేశకబంధ భారమున దా గ్రుంగంగ" (4-348) అను పద్యమును రచించెను.

కవి (7-64) శ్లోకము నందలి "అను మాస నవ్యఘటనా నిస్పంధిబంధం వపుః" అను సమాసమును "ప్రతి మాస నవ్య ఘటనా నిస్పంధి బంధతపాపర గాత్రం" అని యథాతథముగా అనువదించెను.

ఎ. విభీషణుడు మృగతృష్ణామయమైన మరుభూమిని వర్ణించిన "జ్యేష్ఠా మూలీయ" (7-38) అను శ్లోకము నందలి పదములను గ్రహించి ఆంధ్ర కవి జ్యేష్ఠామూలీయ 5-150 అను పద్యమును రచించెను.

మఱికొన్ని యుదాహరణములు

| శ్లోకము | పద్యము |
|---|---|
| 11 - 11 పిత్ర్యాత్పృశం | 2- 82 జలరుహకోరక |
| 11 - 45 పూర్ణ పాత్రమియం | 3-357 శూలాయుధ కోదండము |
| 111- 48 అంగిరాశ్చపుల స్త్యశ్చ | 2-361 అనుడు నవ్వుచు |
| 1v - 26 జేతారందశకంధరస్య | 3- 96 అలఘుస్ఫూర్తి |
| 1V -140 జయలక్ష్మీ పరిగ్రహ యౌతుకే | 4-142 ఏతద్విజయలక్ష్మీ పరిగ్రహ యౌతుకంబైన |

21. రసపోషణ :

మురారి అనర్ఘ రాఘవ నాటకము నందలి రసమును గూర్చి చెప్పుచు "తస్మై వీరాద్భుతారమ్భ గంభీరోదాత్త వస్తవే' (1-8) అని వీరాద్భుత రసములను ప్రధానముగా పేర్కొనెను. తిమ్మ భూపాలుడు కావ్యావతారికలో

"అద్భుతము మించ శృంగార మతిశయింప
వీరము రహింప భావముల్ విశ్రమింప" 1-27

అని శృంగారమును కూడ నందు చేర్చి ఆ యా సందర్భములందు మూలాతిరిక్తముగా శృంగార రసమును కూడ పోషించెను.

అనర్ఘ రాఘవము నందలి ప్రధాన రసము వీరము; అద్భుత, శృంగారములు అంగములు. ఇందలి అంగిరసము ఆద్యంతము హృద్యముగ పోషింపబడినది. ఈ కావ్యము నందలి నాయకుడైన రాముడు వీర రసమూర్తి. ప్రతినాయకులైన పరశురాముని, వాలిని, రావణుని నిర్జించుటలో నాతడు ప్రదర్శించిన యుత్సాహ మప్రతిమానము పరశురాముడు.

(70)

ఉ. భావజ సంహరుండు బహుభంగుల నెక్కిడ వీతసారమై
యీ విలు మున్న నొప్పెఁ గదిరి యందుకు నీవు నిమిత్తమాత్ర మీ
కావర మేటికిన్, నృపతి ఖండన చండమదీయ సాధనం
బీవిలు దైత్యవైరి దిది యెక్కిడుమా భుజదర్పమేర్పడన్ 3-1 0

పరమ శివుడు బహు పర్యాయము లెక్కుపెట్టుట చేత సారహీనమై యుండిన శివధనుస్సు విఱుగుటకు నీవు నిమిత్తమాత్రుడవు, ఆ మాత్రమున కింత కావర మెందుకు, ఈ మదీయ ధనుస్సు దైత్యవైరిది. నృపతి ఖండన చండమైన దీనిని ఎక్కిడుము చూతము నీ భుజదర్పము" అని రామునకు వైష్ణవధనుస్సు నొసంగి తాను కుఠారమును ధరించెను. వారిరువురును సంగ్రామమున కుచిత స్థలమున కేగిరి. అంత "చక్రధరు విల్లరివోసి శరంబు గూర్చి, విచ్ఛిన్నముగాఁగ నేసె రఘుసింహుడు భార్గవు దివ్య మార్గమున్" (3-184) రాముడు చక్రధరుని విల్లును అరివోసి భార్గవుని మార్గమును విచ్ఛిన్నము గావించెను.

వాలి, తనకు సాటి ప్రతి వీరుడు లోకమున లేడనిపించుకొనుటకై స్వయముగ రామునితో ద్వంద్వ యుద్ధమునకు తలపడెను. అంత రాముడొక్క బాణమును వేయగా అది సప్తసాలములను, వాలిని కూల్చి వేసెను.

రావణుడు:

మ. భళిరా ! క్షత్రియడింభ ! రౌప్యగిరి నుత్పాటించి, వేనాటివ
ర్తిలు నాబాహు విలాస మద్ధరణి పుత్రిం గోరి యీశానచా
పలతన్ ద్రుంపక మానెకాక, సురరాడ్భద్రేభదానాంబుని
శ్చలదౌర్జన్యభిదుగ్రజాగర మదస్త్రి శ్రేణి నివ్వొప్పునే 4- 88

గీ. భళిర యోరోరి క్షత్రియ బ్రహ్మచారి
భూరి వాచాట నేడీ వపూర్వ శిల్పి
వలె దశానన సత్కీర్తి వారిజారి
యెడ కళంకంబు వ్రాసెద వాడలు మఱచి · 4-808

అని వీరాలాపము లొనరించెను. రామ రావణ యుద్ధము ఆలంకారికులు అనన్వయాలంకారమున కిచ్చిన ఉదాహరణ శ్లోకార్థమునకు తగినట్లు 'రామ రావణ యోర్యుద్ధం రామరావణ యోరివ' అనినట్లుగనే జరిగినది. తుదకు

'రామాశుగ యోగ పీఠ విహితోద్యద్బ్రహ్మ శక్తి క్షతిన్
దెగి దైత్యేంద్ర కబంధ మిత్తఱిని చెందన్ వీరశయ్యాస్థలిన్' 4-344

అని గంధర్వులు వర్ణించిన రీతి, శ్రీరాముని బాణము నందుంచబడిన బ్రహ్మ శక్తిచే రావణుడు వీరశయ్య నలంకరించెను.

శ్రీరాముడు శివుని విల్లెక్కిడినపు డుప్పతిల్లిన ధ్వని 'బధిరత్వ మొనరించె భాషా నితంబినీ ప్రాణేశు నెనిమిది వీనులకును' (2-372) అని వర్ణింపబడినది. ఇతర వీరు లొండొరులతో పోరిన సందర్భమును గంధర్వులు వర్ణించునప్పుడు కూడ వీరరౌద్రములు పోషింపబడినవి.

కలహంసి కంచుకితో సీతా యౌవనావిర్భావమును (2-292) వ్యంగ్యముగ వెల్లడించుటలోను, రాముడు సీతా సంయోగమెన్నడు సాధ్యమగునో యని చింతించునపుడును (2-319) అహల్యా వృత్తాంతమునందును శృంగారము వ్యక్తమగుచున్నది. ఈ నాటకమున రాముడు సీతానియోగమున తాపమొందునపుడు విప్రలంభ శృంగారము గోచరించును. అతడు సీతను పలు విధముల స్మరించుచు శోకించుచుండ లక్ష్మణుడును, గుహుడును ఓదార్తురు. విశ్వామిత్రు డొనరించు మఖమును ధ్వంస మొనరింప తాటక వీతెంచు ఘట్టము (2-155) బీభత్సమునకును, పరశురాముడు క్రోధావిష్టుడై యేతెంచు ఘట్టము రౌద్రమునకును (3-91) ఆలవాలములై యున్నవి. ద్వితీయాశ్వాసము నందలి, వటుక, కళాధరుల సంభాషణమున హాస్యమును, పరశురాముడు రామునిచే నిర్జింపబడి శాంతుడై "నవ్వుచు నీ యెడ దప్పు లేదు వత్సా! వివరించెదన్ వినుము. తావక వైష్ణవ దివ్యతేజమే నీ విధి జూడ గోరి కినియించి తదున్నతి గాంచితి" (3-188) నని పల్కినపుడు శాంతమును కననచ్చును. మొత్తము మీద మూల నాటకము నందువలెనే ప్రబంధమందును రసపోషణము కంటె రచనా ప్రౌఢియే సహృదయుల నెక్కువ యాకర్షించును.

## భాష, శైలి, ఛందో విశేషములు :

బిజ్జుల తిమ్మ భూపాలుడు పేర సత్కవి పౌత్రుడైన కృష్ణ సత్కవి సహాయ కవిత్వమున తాననర్ఘ రాఘవ ప్రబంధము రచించినట్లును, తన కశేష విశేషవైదుషీ ప్రతిభ కరతలామలకమై భాసించినట్లును చెప్పుకొని యుండెను.

(32 వ పద్యము) కృష్ణకవి తనకు సహాయుడగుటకు తన న్యాయ మార్గైక వృత్తియే కారణమని తెల్పుచు నతడు మురారి నాటక ప్రస్తావన యందలి "యాంతి న్యాయ ప్రవృత్తస్య తిర్యంచోపి సహాయతాం" అను శ్లోకము నను వదించి యుండెను. కృష్ణ కవి తిమ్మ భూపాలున కొనరించిన సాహాయ్య మెట్టిదో తెలిసికొనుట కవకాశము లేవు. కవి కృతజ్ఞతాపూర్వకముగ కృష్ణకవి పే రుటంకించి యుండుటచే నత డతనికి కావ్యరచనమున కొంత తోడ్పడి యుండె ననియు, నతనికి గురువై యుండియో మురారి నాటకమును సమగ్రముగ బోధించియో గొప్ప పాండిత్యమును కల్గించెననియు, నూహింపవచ్చును. ఈ ప్రబంధమును రచించిన వారెవ్వరైనను. గొప్ప ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములు కల మహాకవులని చెప్పుటకు సందేహింప నక్కఱలేదు. అతిప్రౌఢమైన మురారి నాటకమును వారు ప్రౌఢ గంభీరమైన శైలిలో, మూలమునకే విధముగను తక్కువకాని విధమున, ననువదించుటయే యందుకు నిదర్శనము.

అనర్ఘ రాఘవ ప్రబంధమందలి శైలిని. పద్యరచనా విధానమును, శ్రీనాథుని శృంగార నైషధము నందలి వానితో పోల్చవచ్చును. శ్రీనాధుని వలెనే తిమ్మ భూపాలుడు కూడ సంస్కృత సమాస ప్రయోగము నందెక్కువ మక్కువ ప్రదర్శించి యుండెను. మూలమున సమాసములున్న చోట్లనెల్ల నీతడు సమాసములను వాడి యుండెను. ఇందలి ప్రధాన రసము వీరమగుటచే శైలి తదనుగుణముగ ఓజోభరితమై యున్నది. కపి సేనకును రాక్షస సేనకును జరిగిన యుద్ధమును హేమాంగద రత్నచూడులు వర్ణించునపుడును, పుష్పక విమానము నధిరోహించి రామాదులు అయోధ్యకు తిరిగి వచ్చునప్పుడును కావింపబడిన వర్ణనములును, కావ్యమున నాయా సందర్భముల గోచరించు ప్రాతస్సాయంకాల. చంద్రోదయ, సూర్యోదయ వర్ణనలును, ప్రౌఢ సమాస భూయిష్ఠములై కవి పాండితీ విశేషమును సూచించుచున్నవి.

ఇతని రచన శబ్దార్థాలంకారాదులతో కూడి ప్రౌఢమై గంభీర భావ సమన్వితమై, మూలానుగుణమయ్యును, స్వతంత్రప్రాయమై యలరారుచున్నది.

ఈ కవి సంస్కృత సమాస ప్రయోగ ప్రియత్వమునకు గ్రంథమంతయు తార్కాణమే.

ఆ పురి నింపు నింపు మలయాచల చంచల కుంజ పుంజర
ధ్యాపర ఖిల్ల పల్లవ పదాస్తన శస్త నవాంకసాంకవ

శ్రీ పరిణీత శీతల ఝరీ తతరంగ తరంగ రంగ సం
దీపిత కంజ గుంజ దళిసీరవ సారవ వాతపోతముల్ 1-164

బల సంక్షోభితలోక దారుణ కకుప్సంచార వేళా చలా ... 4-350

సురనాథోపనివేద్య నందనవనీ సూనా శీ తోరణ ... 4-282

మున్నగు పద్యములు మూడు మాత్రమే యిచ్చట నుదాహరణముగ నీయబడినవి. పెక్కు సీస పద్యములం దీతడు ఒక్కొక్క పాదము నొక్కొక్క సమాసముగా వాడి యుండెను.

బహు నవా నూప నీప ప్రహనన సహ
చర్యా నటత్ కేకి చయము వలన 4-80

మంథాన కుధర నిర్మథితాబ్ది ఘుమ ఘుమ
స్వన నిభ దుందుభిధ్వనులు మ్రోయు 4-147

మున్నగు పద్యము లిందుకు తార్కాణములు. విశ్వామిత్రుడు ప్రథమాశ్వాసమున దశరథు నాశీర్వదించునప్పుడు "సపరివారాయభూప! తేస్వస్తి" యనియు ద్వితీయాశ్వాసమున జనకు నాశీర్వదించు సందర్భమున "శంకర చాపారోపవిశంకట చాతుర్య ధుర్య జామాతృ నిరాటంకాయమాన మానిత సంకల్పోద్భవ" అనియు సంస్కృత వాక్యములే వాడబడినవి. తిమ్మభూపాలుడు తారామైత్రి (1-172) మాత్స్యనీతి (1-222) పూర్ణ పాత్రము (2-357) ఏకలోష్టవధ (3-48) పుత్రభాండము (3-126) మున్నగు పదములను సంస్కృత నాటకము నుండి గ్రహించి యథాతథముగా వాడి యుండెను. అట్లే యితడు మూలము నందలి ఉదరంభరులు, దౌర్భాగినేయుడు, అపత్యప్రత్యయప్రాప్తి, శ్వస్సంభీవరయిష్యమాణ పటుక వ్యాధౌత వల్కంబులు మున్నగు ప్రౌఢ ప్రయోగములను కూడ యథాతథముగా గ్రహించెను. ఇతడు చక్కని తెలుగు పదములతో వ్రాసిన పద్యములు కూడ నక్కడక్కడ కనిపించును. కాని వాని సంఖ్య సంస్కృత పద భూయిష్ఠములైన పద్యములతో పోల్చి చూచినచో తక్కువ యనియే చెప్పవలయును.

జొట జొట జెమటలు వడియగ
దట తటమని గుండె యదర దగ నిగుడ హుటా

హాటి నచ్చటి కరుదెంచెన్
జటలూడగ నొక్క వటువు సంత్రాసమునన్ 2-12

పలుమాఱు బిలిచిన బ్రత్యుత్తరం బీక
వెడ వెడ గడునేడ్చు వెక్కి వెక్కి 2-14

పెనుజట్టు నఱికిన దన ధార యుడివోని
బలుసంకి మొల వంక నలవరించి 2-37

ముదిగోదయే కాక మదికి ముచ్చటయైన
నెక్క గట్టినే జక్క జక్కనైన 2-58

తలపొలంబున కేగి దగడప్పలకు నోర్చి
గాసిల్లి కపవులు గోసి కోసి 2-86

మున్నగు పద్యము లతని తెలుగు పదములతో కూడిన రచనకు నిదర్శనములు. ఇతడా యా సందర్భములందు తెలుగు జాతీయములను, పలుకుబళ్ళను, లోకోక్తులను కోకొల్లలుగా వాడి యున్నాడు. వానిలో ముఖ్యములైనవి క్రింద నొసంగబడుచున్నవి. మాదల వసంతంబులాడ [1-48] చెంప గొట్టుచున్ [1-144] రెంటికిని జెడ్డ రేవడగను [1-182] ఉఱుమని పిడుగై [1-224] చావు పరుగున [2-20] జగతి నోములెన్ని నోచెనో మున్ను నా కన్నుదోయి [2-22] చీకటి తప్పు [2-27] దుమ్ము దులుపు కొనుచుం జనియెన్ [2-28] వ్రేలు నాకి ఉపాసంబు గోలుపోయి [2-31] మ్రింగిన కడులకు జవులడుగంగా నేమిటికి [2-37] వితావితలగుచున్ [2-41] మూపులు మూడై చూచు [2-48] వెన్నుబలముగ [2-66] కంచు మించుగావె [2-72] ఒళ్ళెఱుంగకింత త్రుళ్ళిపడియె [2-137] పాము కాటు చీర దడిచిన జనునె ఏ సీమనైన [2-156] నూతిలో గుండు వైచినట్లుండ వలదె [2-257] తగరుదాక గొంప వగిలినట్లు [2-336] జమ్ము దూలమ్ములు అన్యరాజన్యకోటులు [2-368] తల్లిబడిపిల్ల [2-369] దేవయోగ్యంబైన జీవరత్నము ద్రోచి జేగురు గైకొన్న చెనటి కరణి [2-363] ఇల్లలికినంత బండుగ యగునే [2-405] పిలువని పేరంటము [3-3] ఎదురు లేనిచోట గదురు వాడి [3-4] నోటి మాటయును నోట నుండ [3-57] గుడి మ్రింగెడు వానికి గుడి లింగ మొట్టవడియము గాదే [3-62] కొంచెపు బిడుగులకు గాదె కొండలు పగులున్ [3-80] వేకిలేని

లంఘనములు వాటిల్లె కటకట [8-87] వెన్న కౌరపండులు వచ్చెన్ [8-132] అయ్యకు సివమెత్తె [3-172] చిచ్చుఱిన వేళ నెవ్వని తరంబు బావి ద్రవ్వంగ [4-190] కరస్థలామలక భాస్వరమై [1-23] భ్రమరకీటనయంబు [1-150] ప్రాహుణిక కరాభిరచిత ఫణి మారణము (అతిథి చేతం బాము జంపించు క్రియ) [2-78] తిలతండులితమయె; [3-193] గగనారవింద సంకాశము [3-86] ఇట్టి జాతీయములను సామెతలను వాడు విషయమున నితని రచనకును నాచన సోమన, పింగళి సూరన రచనలకును పోలిక గానవచ్చును. ఈ కావ్యమున అచ్చ తెలుగు కావ్యములలో కనవచ్చు సుందరములైన సమాసములు కొన్ని కనవచ్చుచున్నవి. మంచు మించు దొర (చంద్రుడు) [2-200] ఘోల దిండి పాదుషా — రాక్షసరాజు [2-66] జడదారి బొబ్బమెకము — ముని శార్దూలము [2—82] వినుద్రోవరి దొర — వియచ్చర విభుడు [2-48] వెన్నెలరాయడు, పడమర పడంతి, బేరజంపురాచ మిణుగురు; రేగామ్మ చుట్టింపు రేక, పాపరాజ న్నిదము కోడెమిటారి చన్నుగవ, జిగికుంకుమపు నల్లు పసిమి, నును జాళువా జన్నిదములు, ప్రొద్దు వంగడంపు రాచ పెండ్లికుమారులు మున్నగున విందుకు దృష్టాంతములు. ఇవి సంస్కృత సమాసములకు తెలుగు సేతలు.

తిమ్మ భూపాలుడు శబ్దాలంకారములను, అర్థాలంకారములను, విరివిగా వాడి యుండెను. ఈ కావ్యము నందలి వచనములలో వృత్త్యనుప్రాసము లేని దొక్కటియు కానరాదు.

అట్టిమయము పట్టి జగజెట్టియైన యట్టి
దిట్టరాకాసిరా చెట్ట బట్టి యిట్టి 4-356

సాక్ష రక్షః కులాధ్యక్ష శిక్షణాతి
దక్ష రూక్షేక్షణాక్షయ లక్షణాఢ్య 6అ-21

మున్నగునవి వృత్త్యనుప్రాసమునకు తార్కాణములు.

"కాళిదాస, మయూర సత్కవులం, దీప్తిరవుల సజ్జన నిర్జరగవుల, ధీమహత్త్వ
నీరేజభవులం, నేనభినుతింతు" 1-9

"తదీయ సుభాషితాకార సీవి, నివిడమై నించు జుంటి తేనియల బావి, లలిత
భావ ధ్వని వ్యంగ్యములకు దీవి, తీవినేమని వర్ణింతు ?" 1-26

"ఆ కృపాగుణ పారీణు, నా ప్రవీణు" ... 1-54

"వరియించె ముఖజితై౦దవ బింబన్, భూరి కరుణావలంబన్, శ్రీ రాజిత గుణ కదంబ, శ్రీ జక్కాంబన్" 1-60

"అతడు వరించె శేషమ, కృపాన్విత బాంధవ మిత్రపోష" 1-111

"అతడు రంగమ వలన నెయ్యమున గాంచె కీర్తి వర్ధిష్ణు మాఱట కృష్ణు" 1-69

"ఆ పెద్ద తిమ్మ భూమి విభుదర్థి వరించెను కామమాంబ" 1-82

"భువన విస్ఫూర్తి సత్య సంపూర్తి" 1-85 మున్నగునవి

అంత్యానుప్రాసములకు నిదర్శనములు. ఇట్టి వానిని రచించుటలో నితడు పోతన ననుకరించినట్లు కనిపించును.

దాదన భూమి పాలుడు సదా దనరారెడు నీవితీవకుం
బాదన, నాజిభూచకిత పాద నమద్రిపు రక్షణంబునన్ సాదన 1—87

"వశిష్ఠ మహనీయ తపో ఘన తర మహిమను, మహిమను, మనువంశము మిగుల సంభ్రమంబున బొదలెన్" అనునవి యమకాలంకారమునకు తార్కాణములు.

మొలక నవ్వుల చాయ వెలయు వెన్నెల గాయ
దులకించు మోము చందురుల చేత
శ్రీకారముల తోడ జెలగు పీనుల తోడ
గలసి నర్తించు గన్దవల తోడ 2—282

ఆ నుడి ఉఱుమని పిడుగై, పూని యలరు హాలాహలము బుడుగై 1—224

మున్నగునవి ఛేకానుప్రాసమునకు నిదర్శనములు.

జాహ్నవికై వడి సంతతాశ్రిత కవిశ్రేణి సంరక్షించు శేషమాంబ 1-112

ఇచ్చట కవి శ్రేణి యనగా కవుల యొక్క సమూహమని ఒక యర్థము నీటి పక్షుల సమూహమని రెండవ యర్థము.

రాజశేఖరుదన రంజిల్లు నితనికి శాశ్వతైశ్వర్య మాశ్చర్యమగునె!
[1—128]

ఇచ్చట రాజశేఖరు డనగా రాజశ్రేష్ఠుడని ఒక యర్థము. చంద్ర శేఖరుడైన శివుడని మఱొక యర్థము. ఇట్టిచోట్ల శ్లేషాలంకారము కలదు.

అప్పుగాకియ్య దెంతైన పర్ణమ్ముండు [1-117]

అను పద్యమున అప్పు (నీరు - ఋణము); పూట (దిన భాగము - జామీను) పత్రము (ఆకు - ప్రోనోటు) అడుగు (అడుగుట - పాదము) మున్నగు శబ్దములు రెండర్థముల నిచ్చుచు సాభిప్రాయములై యున్నవి.

తలయేఱుగల్గి నిచ్చలు గండములు సెంది [1-92]

అను పద్యమున తలయేఱు (శిఖరము నందలి నది - తలనొప్పి) గండములు (గండ శిలలు - ఆపదలు) మున్నగు పదములు శ్లిష్టములును, అర్థగంభీరములునై యున్నవి.

కృతి కర్తృ వంశావతార వర్ణనమున శ్లిష్ట పదములతో కూడిన పద్యము లెన్నో యున్నవి.

పలుకు దొయ్యలి కొప్పు వట్టి, ధవళాబ్జాతాళులన్
మెట్టి, ద్యోతిల కల్లోలవతీ తరంగ
చర కాదంబచ్ఛటల్ ముట్టి యగ్గలికన్
శారద సీర దౌఘ పదమాకం బెట్టి ధట్టించె 1-115

ఈ పద్యమున కవి పట్టి, మెట్టి, ముట్టి పెట్టి అను క్త్వార్థక క్రియలను శ్రవణ పేయమగు ధ్వని యుప్పతిల్లునట్లుగా వాడి యున్నాడు.

తిమ్మ భూపాలుడు తన ప్రబంధమును ప్రాగటూరు నగరము నందలి రామేశ్వరున కంకితము చేసెను. ఆశ్వాసాంత పద్యములందు అతడు ముక్తపద గ్రస్తమును వ్రాసి యుండెను.

రజతోర్వీధర వాస, వాసవ ముఖ ప్రస్తుత్య బాణావిత త్రిజగచ్ఛైత్యా శరాస ... 1-279

రామా రామాంగ శ్రీ
వామా, వామాంధకాది వారణ చణ దో
ర్ధామా, ధామాధః కృత
సోమా, సోమాది మిత్ర శోక విరామా ! 1-28)

అనునవి దృష్టాంతములు. ఆశ్వాసాంత పద్యములందే కాక కథా భాగమునకూడ అతడు ఒండు రెండు చోట్ల ముక్త పద గ్రస్తములను వాడి యుండెను.

పవన విఘ్న క్రియా శాంతికై దశరథ
క్షితి నాథు బొడ గాంచి సుతుని వేడి,
వేడి తోడ్కొని పోయి విమత భీకర భంగి
దివ్యాస్త్ర మంత్రోపదేశ మొసగె,

నొసగి, (3-81) అను పద్యము, మాల్యవంతుడు విశ్వామిత్రుడు చేయు కార్యములను స్మరించు సందర్భము లోనిది ...

కమనీయ వాగ్విలాసమున బన్నగ రాజు
నగరాజు ధృతి ధురంధరనిరూఢి 1-41

అను పద్యము చెన్నభూపతిని వర్ణించు సందర్భములోనిది.

తిమ్మభూపాలుడు. ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకము, శ్లేష, ప్రతివస్తూపమ అర్థాంతర న్యాసము, అపహ్నవము, ఉల్లేఖము, మున్నగు సర్థాలంకారములను కూడ విరివిగా వాడి యున్నాడు.

అరయ రఘుకుల సామాన్య గురుడతండు
నిక్కమట్లయ్యు నీయందె నెమ్మి ఘనము
సకల జన మోదకరుడైన చంద్రునకు గు
ముదము దలపంగ దా బ్రాణ పదముగాదె 1-179

విలసల్లీల మహాసభాంతరములన్ విద్యా ప్రసంగంబు శిష్యులు గావింప (2-79) అను పద్యములందు ప్రతి వస్తూపమాలంకార మున్నది.

అని వదనేందుని గని ముది
గిన తమ్ములనంగ మోడ్పు గేల్గవ దనరన్ 1-211

ఈ పద్యమున రూపకోత్ప్రేక్షాలంకారములు రెండును కలవు.

హరిణాంక వ్యసనోదయ క్రమము ... నిరుపాధిప్రణయుల్
విశుద్ధుల యెడన్ నిక్కంబు శుద్ధాత్మకుల్ 1-275

అను పద్యమున నర్థాంతర న్యాసాలంకార మున్నది.

వననిధి గ్రుంకసొరకర వర్గము నొక్కటి మూడు ....
క్రమ్మరనెన్న బూనెనో యనసవి విప్పుచున్న దిపుడబ్జిని యారయథాక్రమంబునన్ [2—9]

ఈ పద్యమున ఉత్ప్రేక్షాలంకార మున్నది.

మనము హరింప సతాత్విక
ఘన విషయములనెడు భటులు గవయించుకొనం
జనుగనుగవ ఏనుగునకు
జనుడోపడు తెలివి నంకుశము గావింపన్ 2-42

ఇందు రూపకాలంకార మున్నది.

దివ్యకూలంకషా తీర్థ సేకంబున
బావనంబగు జటా పటలివాడు 1-167

అను పద్యమున శ్లేషాలంకార మున్నది. ఇందలి విశేషణములు వామదేవమునికిని, శివునికిని గూడ అన్వయించును.

అట్లే

సమద సారంగ విభ్రమ లీల విలసిల్లి
ధారాలహరులచే దార సిల్లి 1—147

అను పద్యమున అయోధ్యాపురము "అల్లు దామర కొలనునా నతిశయిల్లె" నని చెప్పి కవి శ్లేషాలంకారమును, ఉత్ప్రేక్షాలంకారమును కూడ ఉపయోగించి యుండెను

జలరుహగర్భు పేరి యగసాల నభంబను మూష తారకా
వలి నిగుడించి సాంధ్య రుచి వహ్ని శిఖం కరగించి చేసెనో
చెలగి సుధాంశు 2—202

ఫణి కులాకులమైన పాతాళమున కేగు
వేగ బ్రుంగుచు గాంగ వేణి సరణి

అను సీస పద్యమున కృష్ణరాయేంద్రు కీర్తి ఏ విధముగ సంచరించునో వర్ణింపబడినది. ఇందలి ఉపమానములు కవి లోకపరిశీలమును, భావనాశక్తిని చాటుచున్నవి. పంచమాశ్వాసము నందలి 112 వ సీసపద్యమున చంద్రుడు

దేశికుడుగ పీఠమర్ధకుడుగ, ధన్యమూర్తిగ, శుంభద్విలాసిగ పేర్కొనబడి యున్నాడు ఇందు ఉల్లేఖాలంకారము కలదు.

తిమ్మభూపాలుని శైలి శబ్దార్థాలంకార సంభృతము సమాసభూయిష్ఠమునునై యున్నను ధారాశుద్ధి శోభితమై యలరారును. అతని రచన శ్రీనాథుడు, నాచన సోమన, భట్టుమూర్తి మున్నగు మహాకవుల రచనలను పోలి యుండును. అతడీ కావ్యమున పెద్దన శ్రీనాథాదుల ననుకరించి వ్రాసిన పద్యము లనేకములు కలవు.

కామారి ప్రియమౌళి మాల్యమగు గంగన్దాటి
... వ్యోమగ్రాహ్య కుచాలసల్, శబరకాంతల్
వేడ్కమై వెంటరా ...  4—7
దురవగాహ గభీరతర చతుష్పాదోధి
ముష్టింధయుండయి మునయు మేటి

మున్నగు పద్యములు తిమ్మభూపాలునికి శ్రీనాథుని రచనపై గల అభిమానమును చాటుచున్నవి.

ఓ కుశికాన్వవాయ కలశోదధి పూర్ణ సుధామయూఖ ! 2—269
వారలిందరు లోకోపకారమునకు

శ్రుతులు స్మరియింత్రు వీరి సన్నుతులొనర్చి
ఖ్యాతి గందుము వీరల యధిక మహిమ
వీరలె యెఱుంగుదురు మనకెఱుగతరమె. 2—288

మున్నగు సీస పద్యములలో అల్లసాని పెద్దన రచనా విధానము గోచరించుచున్నది.

ఆ పెదతిమ్మభూమి విభుడర్థి వరించెను గామమాంబ హ్రా
త్ప్రాపిత విష్ణు సద్గుణ కదంబ లసత్కరుణావలంబ 1—82

వంటి అంత్యానుప్రాసముతో కూడిన పద్యములలో పోతన పద్యముల అనుకరణము గోచరించుచున్నది.

పాపం బెక్కడ దేవదానవ దురాపంబైన యేతన్మహా
చాపం బెక్కడ ... (2-320) అను పద్యము కూడ పోతన రచనను స్మరణకు తెచ్చుచున్నది.

చినరాజు వనరాజు ధనరాజు నిరసించు
శౌర్యగాంభీర్యతౌదర్య కళన ....

అను సీసమును, కృతికర్త వంశ వర్ణనము నందలి పెక్కితర సీస పద్యములును, భట్టుమూర్తి పద్యముల కన్నదమ్ముల వలె నున్నవి. గంభీరతౌదార్య కలన అని యుండనగును. ఇట్లే ఇత డచ్చటచ్చట నాచన సోమన, ఎఱ్ఱాప్రగ్గడ, కృష్ణదేవరాయలు, తెనాలి రామకృష్ణుడు మున్నగు పూర్వాంధ్ర మహాకవులను కూడ ననుకరించిన చోట్లు కొన్ని కలవు.

తిమ్మభూపాలుని రచనలో ఛందోవైవిధ్య మంతగా కానరాదు. అతడు సాధారణ వృత్తములను జాత్యుపజాతులను మాత్రమే ఎక్కువగా వాడి యుండెను. సీస పద్య రచన యందీతడు కృతహస్తుడు. ఆశ్వాసాంత పద్యములలో కవిరాజ విరాజితము (1—230) కందగర్భితమణిగణ నికరము (2-411) మాలిని, (3—229) భుజంగ ప్రయాతము (4—365) పంచ చామరము [5—268] అనువృత్తము లను వాడి యుండెను.

కావ్యమునందు ఉత్సాహము, (1—251, 3—116) భుజంగ ప్రయాతము (2—38) లయ విభాతి (2—155) తరళ (2—330) స్రగ్ధర (3—121); (5—150) మహాస్రగ్ధర (1—26); (1—135) అను వానిని వాడి యుండెను

రెండు మూడు చోట్ల, యతి దోషము కనబడుచున్నది.

రౌద్రాక్ష వలయంబు దాల్చినాడు (3—101) అవి ప్రమాద పతితములని పరిష్కర్తలు సూచించి యున్నారు.

తిమ్మభూపాలుడు సంస్కృతాంధ్రములు రెండింట గొప్ప పండితుడౌటచేనా రెండు భాషలయందును పెక్కు ప్రౌఢములైన ప్రయోగములు కావించి యున్నాడు. మురారి నాటకమున తనకుగల సంస్కృత వ్యాకరణ పాండిత్యము వెల్లడి యగునట్లుగా విశిష్టములైన ప్రయోగములు కావించుటయేకాక యెడనెడ వ్యాకరణ పరిభాషా పదములను కూడ ప్రవేశపెట్టి యుండెను. తిమ్మభూపాలుడు వానినెల్ల మూలానుగుణముగా ననువదించి యున్నాడు.

రమణీయ తపోమహిమన్
రమణీ! యమ్మునికి నొదవు బ్రాహ్మణ్యాదే

శమ క త్త్రి కార్యమున్ విడు
వమి నైజము కాదె స్థానివద్భావమునన్ 3-83

వత్సే! తపోభిరస్య బ్రాహ్మణాదేశోపిస్థానివద్భావేన క్షత్ర కార్యం నజహాతి 4 అంక. పుట 199 అనునది పై పద్యమునకు మూలము. "స్థానివదాదేశో నల్విధే" సూత్రేణహన్తే: స్థానే జాయమాన: కోప్యన్య ఆదేశ: స్థాని ప్రయుక్త మపికార్యం కరోతి. తద్వతీ తపస్వయా బ్రాహ్మణత్వం ప్రాప్తోప్యయం ప్రాక్తనం క్షత్రియ సంస్కారం తత్ప్రియుక్తాం హింసాది ప్రవృత్తించ నజహాతీత్యర్థ:; వ్యాఖ్య 199 పుట. ఇచట ఆదేశము, స్థానివద్భావము అనునవి వ్యాకరణ పరిభాషా పదములు.

ఎల్లరు వేల్పులు-మును నీ తల్లి ... కుంద శబ్దము పుల్లింగము
సేసితనుచు పొగడరె నిన్నున్ 3-141

వత్స! ఈ ప్రకారంబున వడి ప్రకృష్ట
కర్త్రభీష్టక్రియా ఫలోత్కరము లగుచు 2-212

అను పద్యములందు కూడ మూలము నందువలెనే వ్యాకరణ సంబంధము కలదు.

ఇనదబ్జంబు, ధనంజయచ్ఛరము, వాణీశద్గిరీశమ్ము, కో
కనదత్ కైరవ, మబ్జరాగ దురరాట్కాంతమ్ము, కాశ్మీరజ
ఘనసారంబు, సురాలయద్రజత గోత్రంబయ్యె బ్రహ్మాండము 1-58

అను పద్యమున తిమ్మభూపాలుని పూర్వుడైన కొండారెడ్డి ప్రతాపము వర్ణింపబడినది. ప్రతాపము అరుణ వర్ణముగా నుండునని చెప్పుట కవి సమయము. కొండారెడ్డి ప్రతాపముచే బ్రహ్మాండమంతయు నెఱ్ఱబాఱినదని చెప్పుచు కవి, తన కల్పనా సామర్థ్యమునకు సంస్కృత వ్యాకరణ పాండిత్యమును జతచేసి ఈ పద్యమును రచించెను. సంస్కృతమున నామ వాచకమునకు "క్విప్" ప్రత్యయమును చేర్చినచో అది క్రియా పదముగా మారును. పిమ్మట దానిపై ధాతువునకు వచ్చునట్టి ప్రత్యయములను చేర్చవచ్చును. ఇచ్చట ఇన:, ధనంజయ:, వాణీశ: మున్నగు నామవాచకములకు "క్విప్" ప్రత్యయము చేర్చగా ఇనతి, ధనంజయతి వాణీశతి, అను క్రియా రూపము లేర్పడును. ఇనతి అనగా ఇన: ఇవ ఆచరతి అని అర్థము. ఇన అను నామ ధాతువునకు అత్ అను శతృప్రత్యయము చేర్చగా,

ఇనత్, అను రూప మేర్పడును. ఇనత్ అనగా సూర్యునివలె ఆచరించుచున్న అని అర్థము. ఇట్టి ప్రౌఢ ప్రయోగములు కావ్యమున నింకను కలవు.

స్వర్గాపవర్గ మార్గానర్గళ సంసర్గ మార్గణన్మునివర్గా 2—411

కల్పకలతికా రాజీకుసుమత్కార కేళా 5—1

పై పద్యము నందలి మార్గణత్, కుసుమత్ అను రూపములు కూడ నామ ధాతువులకు అత్ చేర్పగా వచ్చిన శత్రంత రూపములే.

దాక్షిణాత్యులకు తద్ధితములు ప్రియమను అభియుక్తోక్తి కలదు. మురారి అట్టి తద్ధిత ప్రయోగములను సంస్కృత నాటకమున చేసి యుండెను. తిమ్మ భూపాలుడు కూడ ఐంద్రా బార్హస్పత్య చరువర ప్రతిభ 5—255

ఐక్ష్వాకవ స్వచ్ఛకీర్తి 5—246

దంభ మాస్కరిక వేష ప్రౌఢి 5—167

మున్నగు తద్ధితాంతములను వాడి యున్నాడు.

ద్వితీయాశ్వాసము నందలి 210 వ పద్యము చివర "అతివేడ్కన్" అను ప్రయోగమున్నది. వేడ్క అనునది తెలుగు పదము, అతి సంస్కృత పదము. ఈ రెండింటిని సమాసమున కూర్పరాదు. మహాపండితుడైన ఈ కవి ఇట్లెందుకు ప్రయోగించెనో తెలియదు. లేక యిది లేఖక ప్రమాదమై యుండ వచ్చును. ఈ గ్రంథము నందలి వ్యాకరణ విశేషములతో కూడిన కొన్ని ప్రయోగములీ క్రింద నొసంగ బడుచున్నవి.

ఉండుండి — ఉలికి పాటొందవ నుండుండి దిగ్గున లేచి (2—14)

ఉండి + ఉండి — ఉండి యుండి కావలయును. కాని కవి యిచ్చట క్త్వార్థకేకారమునకు సంధి చేసినాడు.

ధాతువునకు డు ప్రత్యయము చేర్చగా అనంతర్యార్థక మేర్పడును. ఇది ద్రుతప్రకృతికము దీనికి అచ్చు పరమగునపుడు "ఇకాదులకు తప్ప ద్రుత ప్రకృతికములకు" సంధి లేదు కావున సంధి చేయరాదు. కాని కవి "నావు దతడు" (2—245) అని సంధి చేసి యున్నాడు. ఈ అనంతర్యార్థక "డు"

ప్రత్యయమునకు ముందు ఈ గ్రంథము నందు పెక్కుచోట్ల అర్ధానుస్వారము చేయబడినది. ఇది ప్రామాదికము.

ధాతువునకు "అక" చేర్పగా వ్యతిరేక క్త్వార్థక రూపమేర్పడును. ఇది కళయే కాని ద్రుతప్రకృతికము కాదు. కవి పెక్కుచోట్ల వ్యతిరేక క్త్వార్థము లను, ద్రుత ప్రకృతికములుగా వాడి యున్నాడు.

ఉపేక్ష సేయకన్ (2-58) బెదరకను (2-162) కాకనతని (4-38) కాకన్ (4-24) కాకన్ (5-40) త్రోయకన్ (5-50) అట్లే మిక్కిలి అను నవ్యయమను కూడ నితడు ద్రుతాంతముగ వాడి యున్నాడు. మిక్కిలిన్ — (2-227) ఇట్టి వానిని ప్రౌఢ వ్యాకరణము నందలి సర్వనామంబులకును కళ లగు నవ్యయంబులకును గడపల సముచ్చయార్థ విశేషపాద పూరణములందును శబ్దంబు తఱుచుగ నగునను సూత్రముచే సమర్థింపవచ్చును. (5-198)

తుమర్థ రూపములకు ఇమ్మ చేరినపుడు, మ్మ లోపించుటయు, పూర్వ కారమునకు దీర్ఘము వచ్చుటయు సంభవించును కవి ఐదారుచోట్ల ఇట్టి ప్రయో గములు కావించి యున్నాడు. పోనీ 3-87 "కానీ" (5-139) మాననీ; నిందిం చనీ; అననీ (2-143)

ధాతువున కాత్మనే పదార్థమున "కొను" అను ధాతువను ప్రయుక్త మగును. దానికి క్త్వార్థక రూపము కొని; వాడుకలో దీనికి, క, కు, అనునవి ఆదేశములుగా వచ్చుచుండును. ఉత్తరస్యకొనోః ధాతోః కం బుధాః కేచి దూచిరే అని అధర్వణుడు. తిమ్మభూపాలుడు కొని అనుదానికి కాదేశను వచ్చిన ప్రయోగములు పెక్కు కావించి యున్నాడు. కన్నులు మూసుక యున్న (2-167) మూసికొని యున్న యని అర్థము. వేలు విప్పుకపడ (2-181) ఉంచుక (4-691) విడిపించుక (4-276) ఇతడు కొన్నిచోట్ల "ఇకార సంధి" చేసినాడు. ఎప్పటట్లు (ఎప్పటి + అట్ల) (4-3) తెలివొంద (4-11) అంబలైన (2-58). చిన్నయ సూరి చేతురు, కోతురు, ఇత్యాదులు అసాధువులని వ్రాసెను, కాని పలువురు కవులు ఈ ప్రయోగములను కావించి యుండిరి. ఏమి సేతు (3-16) చేయి శబ్దము ఔపవిభక్తికము. దానికి మానార్థకమైన ఎడుప్రత్య యము చేరగా చేతెడు అను రూపమేర్పడును. దవుకేదు చేతెడెయనన్ (4-24) 5వ ఆశ్వాసము నందలి 17వ పద్యమున "చెలువా అల్లదె చూడు దక్షిణమునన్

జేతెంటి' అని "జేతెంట" అను ప్రయోగ మున్నది. సందర్భమును బట్టి ఇచ్చట "చేతివెంట" అను అర్థము స్ఫురించును. తళుకున్ వెన్నెల (5-110) అరమోడ్పున్ రెక్కలన్ (?-155) మంథనపున్ నేర్పులు (5-213) ఇచ్చట "గరువవున్ మురువు" అనుచోట వలె స్త్రీ సమంబులకును, పు, ంపులకును స్థిరములు పరమైనపుడు కూడ "ను" గాగమంబు వచ్చినది. 4వ అశ్వాసము 131 వ పద్యమున "గురుదోశ్శాలురకు" అను ప్రయోగమున్నది. "దోశ్శాలి" అనునది ఏక వచన రూపము. ఇది దీర్ఘ పూర్వలోపధమును, మహద్వాచకమును, ఐనను, నకారాంత మగుటచే నిచ్చట బహువచన "ల" కారమునకు రేఫము రాదు. ఇది లేఖక ప్రమాదమై యుండవచ్చును. ప్రథమాశ్వాసము 133 వ పద్యమున "ఊన్పుట" అను ప్రయోగమున్నది. ఊను ప్రేరణార్థకము "ఊన్చు". దీనికి భావార్థక "ట" ప్రత్యయము చేర్చగ "ఊన్చుట" కావలయును, ఆగమ "చ" కారంబునకు ముత్తు పరంబైనపుడు మాత్రమే "ప" వర్ణము వచ్చును.

సావధానుండై వినుము (1-174) ఆయుష్మంతులు గండు (1-257) సావధానుండు అయుష్మంతుడు అనునవిచ్చట యుష్మదిన్వేశేణములు. సావధానుండవై వినుము. ఆయుష్మంతులరు గండు అని యుండవలయును. ప్రాయిక గ్రహణముచే, వు, రు, అను నాగమము లిచ్చట రాలేదు.

పద్నాలుగు (3-59) ఇది పదునాలుగు యొక్క రూపాంతరము. దు అనుదాని యందలి ఉకారము లోపించినది.

దున్నకము – దున్ను ధాతువు నుండి యేర్పడిన కృదంత రూపము.

కాణయాచి – కాణాచికి రూపాంతరము.

తిమ్మభూపాలుడు ఖానులు, వజీరులు, ఉరుసు, అబిసీలు, మసూదుఖాను, సిద్ధియంబరు, సురుమాలు, నామజాదు అను పారశీక పదముల నుచిత స్థలముల యందు వాడి యుండెను. నామజాము అనునది నామ్‌జద్ అనుదాని తెలుగు రూపము. కేటాయించి యిచ్చుట అని దానికర్థము.

అలవాలికిని వెన్ను బలముగా పొల దిండి
పాదుషా వెసనామజాదు వనుప 2–63

నానా వజీరులు — అనుచోట వజీరు అను అన్య దేశ్య పదమునకు నానా అను సంస్కృత పదముతో సమాసము కూర్పబడినది.

ఈ విధముగా తిమ్మభూపాలుడు మూలమునకు విధేయుడై అనువాదము సాగించుచునే యీ కావ్యమున భావప్రకటనమునందును, పదప్రయోగము నందును అపారమైన ప్రతిభ ప్రకటించి యున్నాడు. "సంస్కృత నాటకము నందలి సంభాషణములను కూడ విడువక వానిని సీస గీత కంద పద్యములలో కొంచెము సులభ శైలిలో అనువదించి మురారి వాగ్గుంభనలతో విరాజిల్లునట్టి శ్లోకములను చక్కగా నర్థము చేసికొని, భావములను జీర్ణించుకొని, మూలము నకు సంబంధించిన ప్రౌఢిని శైలీ విశేషమును, పద బంధముల సొంపును,శాస్త్ర విశేషముల సంబంధమును సాకల్యముగా నెఱింగి, మూలమునకు లోపము రానీ యక, కొన్నిచోట్ల మూలాధిక సౌందర్యము విలసిల్లునట్లుగా కూడ తిమ్మ భూపాలుడు ఈ కావ్యమును రచించి ఉత్తమ శ్రేణికి చెందిన పూర్వాంధ్ర కవు లలో విశిష్టమైన స్థానము నాక్రమించుచున్నాడు. అనువాద భాగమునందే కాక తాను స్వయముగా రచించిన కావ్యాదిలోని పీఠికా భాగమున కూడ తన యశేష విశేష వైదుషీ ప్రతిభలను జూపినాడు. సంస్కృతాంధ్ర భాషలలోని సారస్వత సారము సంపూర్ణముగా నెఱింగిన దిట్ట. సంస్కృత సమాసములు కాని, తెలుగు సమాసములు కాని, విశిష్ట పద బంధములను కాని, అచ్చ తెనుగు పదములను కాని, అన్య దేశ్య పదములను కాని వాడునపుడు శైలి ఏ మాత్రము కుంటుపడ కుండునట్లు నడపగల ప్రతిభాశాలి. పూర్వ ప్రబంధముల పోకడలన్నింటిని ఎఱింగిన కవి." పీఠిక 30, 31.

**ఉపయుక్త గ్రంథ నిర్దేశము :**

1. అయంతు ప్రాచేతసీయం కథా వస్తు బహుభిః ప్రణీతమపి ప్రయుంజా నోనాపరాధ్యతి శ్రోత్రియ పుత్రిః" ప్రస్తావన 1 అం. పి 21
2. అనర్ఘ రాఘవమ్. వ్యాఖ్యానము పుట 2
3. సంస్కృత నాటకము - కీత్ పుట 226
4. విభీషణః (దక్షిణతోదర్శయన్) దేవప్రణమ్యతామయమస్త్రి విషయ

లక్ష్మ్యాః స ప్త గోదావరీ హార కలాపైక నా యకో భగవాన్ భీమేశ్వరః"
ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము సంపు 2 పుట 25, 26

5. అనర్ఘ రాఘవమ్ 1 అం. 68 శ్లో

6. రత్నాకరుడు అవంతి వర్మ ఆస్థానము నందున్నట్లు రాజతరంగిణి యందలి యొకానొక శ్లోకము వలన తెలియవచ్చును.

శ్లో. ముక్తాకణః శివస్వామీ కవి రానందవర్ధన
ప్రథాం రత్నాకర శ్చాగాత్ సామ్రాజ్యేవ న్తివర్మణః
రాజ. త. 5 త. 34 శ్లో

7. సంస్కృత నాటకము పుట 225

8. ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు. అనర్ఘ రాఘవ-అవతారిక. అనువాదము సత్యవోలు కామేశ్వరరాయ కవి.

9. అనర్ఘ - అంక 7 శ్లో 114

10. "History of Sanskrit literature" Page 920

11. Journal of oriental Research Vol. II Part 3 to 4 July to october 1928. Madras P. 266, 78

12. పీఠిక పుట 5

13. అనర్ఘ. నిర్ణయసాగర్ ముద్రణ వ్యాఖ్యానము పుట 24

14. అనర్ఘ రాఘవము, ప్రబంధము, పరిష్కరణ, శేశవపంతుల నరసింహ శాస్త్రి పుట 3

15. తస్మై వీరాద్భుతారంభ గంభీరోదా త్తవ స్తవే
జగదానంద కందాయ సందర్భాయ త్వరామహే 1-6

అ. వీరోదా త్త గుణో త్తరో రముపతిః 1-8

16. క్రియాణాం రక్షాయై దశరథ ముపస్థాయ విముఖే
మునౌ విశ్వామిత్రే భగవతి గతే సంప్రతి గృహాన్
తపోవేశ క్లేశా దుపశమిత విఘ్న ప్రతిభయే
ప్రవృత్తే యష్టుంవా రఘుకుల కథై వా స్తమయతే" 1-45

17. అనర్ఘ రాఘవ ప్రబంధము పీఠిక పుట 14

18. పీఠిక పుట 15

19. పీఠిక పుట 18

20. తిమ్మభూపాలుని తరువాత వంశమును కొనసాగించిన వారి వివరము లన్నియు పై పీఠిక నుండి గ్రహింపబడినవి.

21. కమనీయ స్థితి జెంగటన్ ధవళ శంఖ స్ఫూర్తి రాజింప దీ
ప్త మరీచిన్ బవడంపు గెంపు బవలున్ బంజుల్ వెలుంగొంద ని
స్సమ సారస్వత నిర్మలా మృత ఝరీ జాగ్ర త్తరంగాబ్ధిపే
ర మహా సత్కవి తేజరిల్లె విబుధ ప్రస్తూయ మానోద్ధతిన్

22. పీఠిక పుట 14

23. అనర్ఘ రాఘవ ప్రకాశ టీక పుట 1-25



# 7. ప్రభావతీ ప్రద్యుమ్నము

—పింగళి సూరన

సంస్కృత మూలము : రవివర్మ భూపాలుని ప్రద్యుమ్నాభ్యుదయము

పింగళి సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్న ప్రబంధమునకును, సంస్కృతమున రవివర్మ భూపాలుడు రచించిన ప్రద్యుమ్నాభ్యుదయ నాటకమునకును హరివంశోత్తర భాగమున విష్ణుపర్వమునందు 91 వ అధ్యాయము నుండి 97వ అధ్యాయము వఱకును ఏడధ్యాయములలో విపులముగానున్న 'వజ్రనాభ వధ' యను కథ మూలము.

హరి వంశమునందీ కథ ఇట్లున్నది. 'నికుంభవధ ప్రస్తావమున చెప్పబడిన వజ్రనాభవధ'ను విపులముగా వినగోరుచున్నాను' అని జనమేజయుడు వైశంపాయనుని ప్రార్థింపగా వైశంపాయనుడు తద్వృత్తాంతమును, ఆ సందర్భమున ప్రద్యుమ్న విజయమును, సాంబుని విజయమును కూడ చెప్ప మొదలిడెను.

పూర్వము వజ్రనాభుడను రాక్షసుడు మేరు తటమున చిరకాలము తపస్సు చేసి బ్రహ్మ వలన వరములను బడసి అజేయుడై త్రిలోకములను బాధింప దొడగెను. అత డొకప్పుడు ఇంద్రుని కడకేగి కాశ్యప పుత్రులకు త్రిలోకాధిపత్యము సమాన భోగ్యము కావున తదాధిపత్యమును తన కిమ్మని అడిగి అట్లిచ్చుట కిష్టము లేనిచో యుద్ధమునకు రమ్మనెను. ఇంద్రుడు బృహస్పతితో నాలోచించి తమ తండ్రియగు కశ్యపుడు చేయు యాగము పూర్తియైన పిమ్మట అతడు తమకు న్యాయము చెప్పగలడని తెల్పి పంపెను. వజ్రనాభుడు కశ్యపుని కడకేగి, ఆతని చేత కూడ నట్లే అనిపించుకొని నిజపురమున కరిగెను.

వజ్రనాభుని వలన రానున్న ఆపద నెఱింగిన ఇంద్రుడు కృష్ణుని కడకేగి తన దీనస్థితి విన్నవించెను. కృష్ణుడు తన తండ్రియగు వసుదేవు డాచరింపనున్న హయమేధము ముగిసిన పిమ్మట వజ్రనాభుని సంహరింతుననియు వజ్రనాభుడు వసించు వజ్రపురము గాలికైన చొరనశక్యము కావున తత్పురమును చొచ్చుటకు తగిన ఉపాయము నాలోచింపవలె ననియు పల్కెను.

వసుదేవు డాచరించు యజ్ఞమున భద్రుడను నటు డొకడేతెంచి తన నాట్య కళా విన్యాసముచే అచటి మునులను మెప్పించి వారివలన కామ గమనము, జరా రోగరాహిత్యము, సర్వానుకరణ కౌశలము మున్నగు కొన్ని అపూర్వములగు వరములను బడసి ద్వారకకు వచ్చుచు పోవు చుండెను. వజ్రపురమున ప్రవేశింప గలుగుటకు తగిన ఉపాయము వెదకుచున్న ఇంద్రుడు స్వర్గము నందున్న హంసలను రావించి అవి తనకొక ఉపకారము సేయవలెననియు, హంసలకు చొరరాని తావుండదు కావున అవి వజ్రపురమునకు పోయి తదంతఃపుర దీర్ఘికల యందు వాసము చేయుచు, వజ్రనాభుని కుమార్తెయగు ప్రభావతి కడ, యదు కుమారుడగు ప్రద్యుమ్నుని రూప గుణ కీర్తనము గావించి ఆమె కాతని యందనురాగము కలిగించి, వారి వివాహ పర్యంతము యత్నింపవలె ననియు, ప్రద్యుమ్నుడు భద్రుని వేషమున వజ్రపురము ప్రవేశించి వజ్రనాభుని సంహరింప గలడనియు పల్కెను.

ఇంద్రుని ఆదేశానుసారము హంసలు వజ్రపురాంతఃపుర దీర్ఘికల యందు విడిది చేసి తమ మధురములగు సంభాషణములతో నచటి కాంతల నలరించు చుండెను. వజ్రనాభుడును వానిని చూచి సంతసించి అవి అచట స్వగృహమున వలెనే సంచరింప వచ్చునని అనుమతించెను. ప్రభావతి శుచిముఖి యను హంసిని తన చెలిని గావించుకొనెను. శుచిముఖి ప్రభావతితో సమయానుగుణముగ పెక్కు సంభాషణములు కావించుచు ప్రద్యుమ్నుని గుణరూపాతిశయములను పొగడెను. శంబరాసురభంజకుడగు ప్రద్యుమ్నునిపై చిత్తము నిల్పియున్న ప్రభావతి, శుచిముఖి పలుకులకు మిగుల ప్రీతి చెంది, తనకు ప్రద్యుమ్నునితో సమాగమ మొనగూడుటకు దౌత్యము చేయుమని దానిని ప్రార్థించెను. శుచిముఖి ఆమె కభీష్ట సిద్ధి కల్గింప నంగీకరించెను.

ప్రభావతి వలన శుచిముఖి కథా కుశలయని ఎఱింగిన వజ్రనాభుడా హంసిని రావించి అది చూచిన విశేషముల నుగ్గడింపు మని యడిగెను. అంత నది భద్రనటుని నటనా కౌశలము నొక వింతగా ఆతని కెఱింగించెను. వజ్రనాభుడా భద్రుని నాట్య విన్యాసమును చూడ దలంచి, వానిని తన పురికి రప్పించు నుపాయము చేయుమని హంసిని కోరెను శుచిముఖి ఈ సంగతులెల్ల కృష్ణునకు, ఇంద్రునకు విన్నవించెను. అంత కృష్ణుడు ప్రద్యుమ్నునితో ప్రభావతిని పరిణయ మాడి, వజ్రనాభుని సంహరింపుమని తెల్పి ఆతని నటునిగను, గద, సాంబులను

పారిపార్శ్వక విదూషకులుగను. కొందఱు వారి ముఖ్యులను నటీమణులుగను వర్తింప నాదేశించి వారికి భద్రుని నాట్య సామగ్రి వంటి సామగ్రి నంతను సమకూర్చి పంపెను.

ప్రద్యుమ్నుడు తన పరివారముతో వజ్రపుర శాఖా నగరములందున్న రాక్షస గణము నెల్ల రంజింప జేసెను. భద్రుని ఆగమన వార్త విని వజ్రనాభుడు వారిని వజ్రపురమున కాహ్వానించి ఘనముగ సన్మానించెను. ప్రద్యుమ్నుడు వజ్ర నాభునకును తత్పరిజనమునకును మోదము కల్గు నటుల "రంభాభిసరణ" మను నాటకము నభినయించెను.

శుచిముఖి ప్రభావతికి ప్రద్యుమ్నుడామెకడకు రానున్నాడని తెలిపెను. ప్రద్యుమ్నుడు ప్రభావతికై కొనిపోబడుచున్న భ్రమరావృతమగు పూదండను గాంచి తానందొక భ్రమరమై దాగి ఆమెను ఛేరెను. ప్రద్యుమ్నుడు తన రాకకై నిరీక్షించెడి ప్రభావతి హృదయ తాపమును ప్రత్యక్షముగ కనుగొని నిజరూప మున నామె యెదుట ప్రత్యక్షమై ఆమెను గాంధర్వమున చేపట్టెను.

ఇట్లు కాశ్యపుని యజ్ఞము ముగియు నంతకును ప్రద్యుమ్నుడు నట వేష మున వజ్రపురము నందుండి, ప్రభావతితో రహస్యముగ విహరించుచుండెను. ఇట్లుండ ఒకనాడు ప్రభావతి మోము చూచి, వజ్రనాభుని తమ్ముని కూతులగు చంద్రవతీ, గుణవతు లామెకు పతి సమాగమ సౌభాగ్య మెట్లబ్బెనని ప్రశ్నించిరి. అంత ప్రభావతి అది అంతయు దుర్వాస మహర్షి మంత్ర ప్రభావమని వారికి తెల్పి వారును దానిని స్వీకరించిన ప్రియ సమాగమము నొంద గలరని చెప్పెను. అంత వారామంత్రమును తలంప, గద, సాంబులు ప్రద్యుమ్నుని సాయమున ప్రచ్ఛన్నులై ఏతెంచి, చంద్రవతీ గుణవతులను చేపట్టిరి.

కశ్యపుని యజ్ఞావసానమున వజ్రనాభు డాతని కడకేగగా, కశ్యపుడు ఇంద్ర కేశవుల ఔన్నత్యమును తెల్పి, వారి నలిగించుట ఉచితము కాదని చెప్పి ఆతనిని వజ్రపురమున కేగి సౌఖ్యముగ నుండుమని బోధించెను. కాని వజ్రనా భుడు ముని మాటలు సరకుగొనక అమరావతిపై దండెత్తెను. అంత ఇంద్ర కేశ వులు వజ్రనాభుని వధింప సమయ మాసన్నమైనదని యదుకుమారునకు హంసల ద్వారా వార్త నంపిరి.

ప్రభావతికిని, చంద్రవతీ గుణవతులకును ఇంద్ర కేశవుల ఆశీర్వాదమున సద్యోయౌవనులును, సకల శాస్త్ర వేద వేదాంగ పారంగతులునైన కుమారు లుద్భవించిరి. వారు నిర్భయముగ హర్మ్యములందు విహరించుచుండ, అంతః పుర రక్షకులు వారిని గాంచి, ఆ విషయమును వజ్రనాభున కెఱింగించిరి. అంత వజ్రనాభుడు వారిని బంధింపుడని భటుల కాజ్ఞాపించెను.

ప్రభావతి తండ్రియగు వజ్రనాభునితో పోరనున్న ప్రద్యుమ్నుడు సమర విషయమై, కర్తవ్యమును బోధింపుమని ప్రభావతి నడుగ నామె శస్త్రమును ప్రద్యుమ్నుని చేతికిచ్చి తన తండ్రితోను, బంధువులతోను యుద్ధ మొనర్చుట కంగీకారమును తెల్పెను.

ప్రద్యుమ్నుడును, గద, సాంబులును, రాక్షస గణముపై విజృంభించిరి. ప్రద్యుమ్నునకు వజ్రనాభుని తోడి పోరు క్లేశకరమని ఎంచి, అతనికి తోడ్పడు టకై ఇంద్రుడు జయంతుని పంపెను. ఆతడు మాతలి పుత్రుడగు సువర్చుడు సారథిగాగల రథము గదునకును, ప్రవరాధిష్ఠితమైన ఐరావతమును సాంబున కును పంపెను. ఇంద్ర కేశవులు పరోక్షముగ నందదండలై యుండ ప్రద్యు మ్నుడు వజ్రనాభునితో ఘోరముగ పోరు సల్పి సుదర్శనముతో నా రక్కసుని చంపెను. గదుడు సునాభుని సంహరించెను. సాంబుడు పలువురు రాక్షస వీరు లను చంపెను. వజ్రనాభుని సోదరుడగు నికుంభుడు నారాయణునకు భయపడి షట్పురమున దాగెను.

వజ్రనాభుడు హతుడైన పిమ్మట ఇంద్ర కేశవులు వజ్రపురమును జొచ్చి అందలి యావత్సంపదను నాల్గు భాగములుగ నొనరించి, జయంతాదులగు పుత్రులు నల్వురకును సమానముగా నిచ్చి, వారి నభిషేకించిరి. ప్రద్యుమ్నాదు లచట ఆఱు నెలలుండి రాజ్యము స్థిరపడిన పిమ్మట ద్వారక కరిగిరి. మౌసల మగు యుద్ధమున వృష్ణులెల్ల నాకమున కరిగిన పిమ్మట కూడ వారు వజ్రపుర మున కేగి దేవపురికి వచ్చుచుండిరి.[1]

రవివర్మ భూపాలుడు :

ప్రద్యుమ్నాభ్యుదయమును వీరరస ప్రధానమగు నైదంకముల నాటక మును రచించిన రవివర్మ భూపాలుడు కేరళ దేశాంతర్గతమగు కోలంబ పురాధి పతి. ఈతడు వీర కేరళ బిరుదాంకితుడైన జయసింహ భూపాలునకును, ఉమా

దేనికిని 1266-67 ప్రాంతమున జన్మించెను. ఇతడు స్వయముగ కవియే కాక పెక్కురు విద్వాంసులను పోషించి దక్షిణ భోజుడను ప్రసిద్ధి వడసెను. "అలంకార సర్వస్వము" నకు వ్యాఖ్య రచించిన సముద్రబంధు డితని ఆస్థాన కవి. రవివర్మ భూపాలుడు సంగ్రామ ధీరుడని కీర్తి గడించెను. ఈతడు పాండ్య చోళ దేశాధిపతియగు వీర పాండ్యుని రణమునం దోడించి అతని రాజ్యముతో పాటు తత్పుత్రికను కూడ గ్రహించి వేగవతీ తటమునందున్న కాంచీపురమున సింహాసన మధిష్ఠించి 1312-1313 ప్రాంతమున రాజ్యపాలనము కావించెను.[2] ఈతని ఆరాధ్య దైవతము పద్మనాభ స్వామి. ఈ నాటక ప్రస్తావనమునందీ నాటకము పద్మనాభదేవుని యాత్రోత్సవమున ప్రయోగించుటకై నియుక్తమైనట్లు చెప్పబడినది.

ప్రథమాంకము నాటకము నందలి కథ :

వజ్రనాభుడను రాక్షసరాజు మేరు తటమున చిరకాలము తపస్సుచేసి బ్రహ్మ వలన వరములను పొంది ముల్లోకములను బాధింప దొడంగెను. అంత నారదు డాదుష్టుని సంహరింప వలెనని కృష్ణునకు విన్నవించెను. వజ్రనాభుని చరితము నంతకు మున్నే ఇంద్రుని వలన వినిన కృష్ణుడు, తన తండ్రియగు వసుదేవు డొనరించు యాగము ముగిసిన పిమ్మట, ఆ దానవుని జీవితమును కూడ ముగింప నిశ్చయించి తన కుమారుడగు ప్రద్యుమ్ను డాతని కూల్పగలడని తెల్పెను. అంత నారదుడు వజ్రనాభుని కుమార్తెయు, అసాధారణ లావణ్యవతియు, అద్రిసుతా వరప్రసాదలబ్ధయు, నగు ప్రభావతిని గూర్చి యెఱింగించి ప్రభావతి యపుడు తలిదండ్రులచే స్వయంవర నియుక్తయై వచ్చిన రాకుమారుల నెల్ల తిరస్కరించుచుండె ననియు ప్రద్యుమ్నుడు వజ్రపురమున కరిగిన ఆమె ఆతనిని తప్పక వరింపగలదనియు చెప్పెను. కృష్ణుడు వజ్రపురము దుష్ప్రవేశము కావున, అచట భద్రనటుని ద్వారమున నటవేషధారులగు ప్రద్యుమ్నాదులను ప్రవేశపెట్టి వారిచే రాక్షసుని హతము గావించెను.

ద్వితీయాంకము :

భద్రనటుడు వజ్రపురమున ప్రద్యుమ్నాదులతో చేరి నాట్య నైపుణ్యమున వజ్రనాభుని మెప్పించి, ఆతని పుత్రిక యగు ప్రభావతికి నాట్యాచార్యుడై

మెలగు చుండెను. ఆతడు ప్రద్యుమ్నుని చిత్తరువును వ్రాసి దానిని ప్రభావతి చెలి చూచునట్లుగా చేసెను. ఆ చెలి ఆ చిత్తరువును కొనిపోయి ప్రభావతికి చూపెను. ప్రభావతి ఆ చిత్తరువు నందలి మోహనాంగుని రూపమును గాంచి ప్రీతి చెంది, భద్రుని రావించి తద్విషయము ప్రస్తావింప ఆ నటుడు ప్రద్యుమ్నుని రూప బల శౌర్యాదుల నామె ఎదుట పొగడి ఆమె నాతని యందనురక్తను కావించెను.

### తృతీయాంకము :

తరువాత భద్రనటుడు రంభాభిసరణమను నాటకమున ప్రద్యుమ్నునిచే నలకూబర వేషమును ధరింపజేసి, తాను విదూషకుడుగా నుండెను. నాట్య సందర్భమున ప్రద్యుమ్నుడు ప్రభావతిని చూచెను.

### చతుర్థాంకము :

మదనోత్సవ దర్శనమునకై బాహ్యోద్యానమున కేగిన ప్రభావతీప్రద్యుమ్నులు పరస్పర దర్శనమున గాఢానురాగ వశులై విరహ వేదన ననుభవించిరి. తరువాత వారిరువురును ప్రమదవనమున కలిసి కొనిరి.

### పంచమాంకము :

ప్రభావతీ సాహాయ్యమున చంద్రవతీ గుణవతులకు గద సాంబులతో సమాగమ మయ్యెను. సురలోక విజయ యాత్రా సముద్యోగి యగు వజ్రనాభుని సంహరింప నెంచిన ప్రద్యుమ్నుడు ఆయుధధారియై బహిరంగముగ సంచరింప సాగెను. ప్రద్యుమ్నునకు వజ్రనాభునితో ఘోరముగ యుద్ధము జరిగెను. తుదకు వజ్రనాభుడు ప్రద్యుమ్నునిచే నిహతుడాయెను. గదుడు సునాభుని సంహరించెను. ప్రభావతికిని చంద్రవతీ గుణవతులకును పుత్రు లుదయించిరి. కుమార విజయ మును గాంచిన కృష్ణుడు సంతసించి ప్రద్యుమ్నుని వజ్రపురాధిష్ఠితుని గావించెను.

రవివర్మ భూపాలుడు హరివంశము నందలి ప్రభావతీ ప్రద్యుమ్నుల కథను నాటకానుగుణముగ మలచుటకై అందు కొన్ని మార్పులను కావించెను.

1. ప్రభావతీ ప్రద్యుమ్నుల కథయందు శుచిముఖి నిర్వహించిన పాత్ర ప్రధానమైనది. కాని రంగస్థలమున పక్షి ప్రవేశార్హమగు పాత్ర కాదు. కావున

నాటక కర్త నాటకమున శుచిముఖి పాత్రను తొలగించెను. ఇక శుచిముఖి ప్రభావతికి, ప్రద్యుమ్నుని రూపాదికములను చెప్పి ఆమె యందు అతని ఎడ అనురాగమును పెంపొందించుట, వారిరువురకును సమాగమము కల్పించుట, మున్నగు కథా కార్యములు భద్రుడను నటుని వలనను, కొంత ప్రభావతికి చేటిగా కల్పింపబడిన కలహంసికా పాత్ర మూలముననను, కొలదిగా నారదుని వలనను నిర్వర్తింపబడినవి.

2. ఇంద్రుని పాత్రను కవి నాటకము నందెచటను ప్రత్యక్షముగ ప్రవేశ పెట్టి యుండలేదు. నాటకమున నారదు దేతెంచి కృష్ణునితో, వజ్రనాభుని దుశ్చరిత్రమును విన్నవించగా. కృష్ణుడు తానావృత్తాంతము నంతకు మునుపే ఇంద్రుని వలన విని యున్నట్లు దెల్పెను. ఇట్లు ఇంద్రుడు స్వయముగ కృష్ణుని యొద్దకు వచ్చి తన దైన్యమును వెల్లడించుటను పరిహరించుటకు "కవి తాను స్వయముగ మహారాజగుటచే త్రిలోకాధిపతియగు ఇంద్రుని, నరరూపుడగు శ్రీకృష్ణుని యొద్ద దీనునిగ చిత్రించుట కిష్టపడకుండుటయే" కారణమని శి. విమర్శకులు తలంచిరి. పంచమాంకమున యుద్ధ ఘట్టమునందు కూడ కవి ఇంద్రుని ప్రవేశమును పరిహరించెను.

ఇట్లు నాటకకర్త హరివంశము నందు గల ఇంద్రశుచిముఖుల పాత్రములను నాటకమున తొలంగించెను. మూలమున శుచిముఖి పాత్ర ప్రవేశము ఇంద్రుని మూలముననే జరిగినది. ఇంద్రుడు వజ్రపుర ప్రవేశమున కొక ఉపాయము నాలోచించి శుచిముఖి వలన తన ప్రయోజనమును సాధించుకొనెను. శుచిముఖి వలననే మూలమున ఇంద్రుని పాత్రకు ప్రాధాన్యము కల్గినది. నాటకమున శుచిముఖి లేనిచో ఇంద్రుని వ్యూహమునకు ప్రాముఖ్య ముండదు. కావుననే కవి శుచిముఖితోపాటు ఇంద్రుని పాత్రను కూడ పరిహరించెను.

రవివర్మ భూపాలుడు నాటకమున రసోచితముగ కావించిన కల్పనలు మనోహరములుగ నున్నవి:

1. మూలకథ యందు శుచిముఖి ప్రభావతికి మనోహరములగు కథలను చెప్పు సందర్భమున ప్రద్యుమ్నుని రూపాదికములను వర్ణించి ఆమె యందనురాగమును పెంపొందించి నట్లున్నది. నాటకమున శుచిముఖి పాత్ర లేదు. తత్పాత్రము నిర్వహించవలసిన కృత్యము అధికముగా భద్రుడను నటుడు నిర్వహించెను. పురుష డొకడు యౌవనవతియగు కన్యతో పరపురుషుని గుణకీర్త

నము కావించుట రసౌచితికి భంగము. కావున నాటకకర్త ఒక చక్కని సన్నివేశమును కల్పించెను. భద్రుడు ప్రద్యుమ్నుని చిత్రమును వ్రాసి దానిని ప్రభావతి చెలియగు కలహంసి చూచు నట్లుంచెను. ఆ పటమును కాంచిన ఆ చెలి దానిని కొంపోయి ప్రభావతికి చూపెను. ఆ పటము నందలి యువకుని రూపముచే నాకర్షింపబడిన ప్రభావతి భద్రుని పిల్చి ఆ చిత్రపట విషయము ప్రస్తావింపగా నతడు ప్రసంగవశమున ప్రద్యుమ్నుని గుణకీర్తన మొనరించి ప్రభావతి యందనురాగమును కల్పించెను. ప్రద్యుమ్నుని గుణాదికములను విని ఆతని యందంతకు ముందే అనురాగము కల్గియున్న ప్రభావతి కీ చిత్రపట దర్శనము ద్వారా అది స్థిరరూపము దాల్చినది. ఇట్లా చిత్రపటము కల్పించుట నాయిక యందభిలాష నెలకొనుటకును, ఆమె వియోగమున తపించుటకును కారణమై రసపోషణమునకు దోహద మొనంగుచున్నది.

2. నాటక తృతీయాంకమున అంతర్నాటకమును కల్పించుట – ఈ అంతర్నాటకము మూలమున నాయకునకు, నాయికను సందర్శించెడు నవకాశము కల్గినది. ఇట్లు నాయకుడు తనయం దనురాగబద్ధయగు నాయికను సందర్శించుట, ఆతని యందు నాయికా కరగ్రహణ వాంఛను స్థిర మొనరించినది. ఉద్యానవనమున సంఘటిల్లిన నాయికానాయికుల సమాగమము శృంగారరసానుగుణముగ నున్నది. వారి ప్రేమ క్రమ వికసితమై ఫలోన్ముఖమై యున్న తఱిని, కంచుకి అంతరాయముగ ప్రవేశించి వారి సమాగమమును విఘటన మొనరించుట పాఠకుల యందుత్కంఠను రేకెత్తించుచున్నది.

నాటకమున ప్రధాన రసమగు వీరమును కవి అత్యంతము సామర్థ్యముతో పోషించెను. నాటక ప్రథమాంకముననే కృష్ణుడు

> "తేజస్వినే కుమారాయ ప్రద్యుమ్నాయ జగత్పతే
> కథమస్మైనతిష్ఠేత దానవేంద్రస్తమోమయః" 1-26

"ప్రద్యుమ్నుడు తేజస్వి; దానవుడు తమోమయుడు. తేజము ముందు చీకటి నిలువజాలనట్లు ప్రద్యుమ్నుని ముందు దానవుడు నిలువజాలడు" అని ప్రద్యుమ్నుని గూర్చి పల్కు మాటలలో వీరమునకు స్థాయియైన ఉత్సాహము నిరూపింపబడినది. ఈ ఉత్సాహము ప్రద్యుమ్నుడు వజ్రనాభ పుత్రిని పరిణయమాడి నిర్భయముగ బహిరంగముగ సంచరించుట యందును, వజ్రనాభునితో ఘోర

మగు పోరు నల్పుట యందును వ్యక్తమగుచు నాయకుని కంఠమున అఖండ విజయమును కల్పించినది.

పింగళి సూరన :

పింగళి సూరన పదునారవ శతాబ్ది యందలి వాడు. ఈతని నైసర్గిక ప్రతిభ కితని కావ్యములే సాక్ష్యములు. సూరన రచించిన రాఘవ పాండవీయము ద్వ్యర్థి కావ్యము. కళాపూర్ణోదయము కథాకల్పనా సామర్థ్యమునకు నిదర్శనము. ప్రభావతీ ప్రద్యుమ్నము స్పష్టమగు నాటకీయతా ముద్రను కల్గిన కావ్యము. ఇందుల కిందలి కథ సంభాషణా సంవిధానమున కొనసాగుటయే తార్కాణము.

ప్రభావతీ ప్రద్యుమ్నమునకు కూడ మూలము హరివంశము నందలి కథయే. కాని సూరన కావ్యశైలి దానిని అపూర్వ మొనరించినది. ఇందలి కథ ద్వారకా నగర వర్ణనముతో నారంభమగును. ఇంద్రుడు వజ్రనాభుని ఆగడములను శ్రీకృష్ణునకు విన్నవించుటకై రథసారథియగు మాతలితో గూడి ద్వారకకు పయనమగును. ఆకసము నుండి వారికి కనుపించెడి ఆ నగర శోభ అత్యంత రమణీయముగ వర్ణింపబడినది. ఇట్లు ఆరంభముననే సహృదయుల యనముల నాకట్టుకొనిన కల్పన సూరనార్యుడు మూలకథయందు గావించెను.

ప్రభావతీ ప్రద్యుమ్నమున శుచిముఖియే కీలక పాత్రము. ఇంద్రుడు దివ్య హంసలను రావించినపుడు, వజ్రనాభుని రాజ్యావసానమును తన భార్య వలన విని యుంటినని శుచిముఖి మగడు చెప్పెను. అంత ఇంద్రు డా హంసిని పిలిపించెను. ఇచట శుచిముఖి ఇంద్రునితో నెంతయో ఉదాత్తముగ సంభాషించెను. ఆ హంసియే ప్రభావతి జన్మ వృత్తాంతమును, ప్రభావతికి గౌరీదేవి కలలో కన్పించి, ప్రద్యుమ్నుని చిత్తరువిచ్చి అతడే ఆమెకు భర్త కాగలడని చెప్పిన ట్లును తెల్పెను. శుచిముఖి ఇంద్రుని పనుపున ఈ వృత్తాంతమును ద్వారక యందున్న కృష్ణునకు విన్నవించెను. భద్రనటుని కొందఱు విప్రకుమారులు అధిక్షేపించుట విని వజ్రపురమునకు భద్రుని వేషమున నెవ్వరిని పంపవలెనా అని ఆలోచించుచున్న 'కంజదళాక్షుడు వజ్రనాభవధ ధూర్వహా డిపు డేర్పడియె' అని సంతసించెను. శుచిముఖి ప్రద్యుమ్నుని కడకు పోయి మిక్కిలి బెట్టుగ మాటాడుచు అతని యందుత్కంఠ కల్గించుచు ప్రభావతి సౌందర్యమును విపుల

ముగ వర్ణించెను. ప్రభావతితో అతినిపుణముగ పరిచయము కావించుకొని, ప్రద్యుమ్నుని శౌర్య ధైర్య రూప రేఖాది విశేషములను వర్ణించి చెప్పెను.

సూరనార్యుడు ప్రభావతీ ప్రణయ వృత్తాంతముతో పాటు చంద్రవతీ గుణవతుల ప్రేమ వృత్తాంతమును కూడ మూల భిన్నముగ రసోదంచితముగ పోషించెను. ఈతడు చిలుక రాయబారము నొకదాని నిందులకై కల్పించి అటు నాయకులందును ఇటు నాయికలందును సమముగ రతిని పోషించెను. ఈ శుక సందేశము మూలమున ఈ ఉపకథ రమ్యమై ఒప్పినది.

ప్రభావతీ ప్రద్యుమ్నము శృంగార ప్రధానమగు నైదాఖ్యాసముల కావ్యము. మూలమున "వజ్రనాభ వధ" అని పేర్కొనబడిన కథను "ప్రభావతీ ప్రద్యుమ్నమను" పేర రచించుటయే యిందలి శృంగార ప్రాధాన్యమును చాటు చున్నది. ఇట్టి శృంగార కథను రమణీయ కావ్య శిల్పముతో తీర్చిదిద్దిన సూరనార్యుని రచనా వైదగ్ధ్యము నిరుపమానము.

సూరనార్యుని ప్రభావతీ ప్రద్యుమ్నమునకు హరివంశమే కాక సంస్కృత నాటకమైన ప్రద్యుమ్నాభ్యుదయము కూడ మూలము గావోపునని శ్రీ పింగళి లక్ష్మీకాంతము గారు తమ 'గౌతమ వ్యాసములు' అను గ్రంథము నందలి ప్రభావతీ ప్రద్యుమ్న విమర్శనమున పేర్కొని యున్నారు.

కళాపూర్ణోదయమున మణికంధరుని తీర్థ యాత్రా విశేషములను వర్ణించు సందర్భమున "సూరన కవికి వివిధ దేశములతో గల పరిచయము వెల్లడి యగు చున్నది. కావున కేరళ దేశస్థుడగు రవివర్మ భూపాలుని నాటకముతో నితనికి పరిచయ ముండుననుకొనుట అసంభవము కాదు."

రవివర్మ భూపాలుడు నాటకమున, భద్రనటుడు ప్రద్యుమ్నుని చిత్ర మును రచించి, దానిని ప్రభావతి కందునట్లు చేసి అతనిపై ఆమె కనురాగము కల్పించి నట్లొక సన్నివేశమును సృజించెను. ప్రభావతీ ప్రద్యుమ్నమున ప్రభావ తికి గౌరి కలయందు సాక్షాత్కరించి ప్రద్యుమ్నుని చిత్రపటమును వ్రాసి యిచ్చి అతడే ఆమెకు భర్త కాగలడని చెప్పినట్లున్నది. ఇట్టి చిత్రపటమును కల్పించుట వలన నాటకమున అంతవఱకును శ్రవణ మూలమున ప్రద్యుమ్నుని ఎడల ప్రభావతికి ఏర్పడిన అనురాగము అతని రూప దర్శనముచే స్థిరరూప మొంది

నది. కావ్యము నందు చిత్రపటముచే ప్రభావతి యందురాగాంకురము ధృడముగ నాటబడినది. గౌరి ప్రభావతికి ప్రద్యుమ్నుడే భర్త కాగలడని నుడివి యుండుట వలన నాటబడిన ఆ అనురాగ బీజము మొలకెత్తి అంత కంతకు విస్తృతమైనది. ఈ చిత్రపట వృత్తాంత కల్పనమును సూరన నాటకమునుండియే గ్రహించి దానిని సుందరతరముగ తీర్చిదిద్దె ననుకొనవచ్చును.

ఇక నాటకము నందు గల నారదాది పాత్రములు కావ్యము నందు కూడ నున్నను కావ్యము నందలి ప్రధాన పాత్రయగు శుచిముఖి నాటకమున లేనే లేదు. తదితర సన్నివేశములకును సామ్యము కనుపట్టదు. కావున సూరనార్యుడు హరివంశము నందలి కథనే కావ్యమునకు మాతృకగా గ్రహించి స్వకపోల కల్పనములతో దానిని తీర్చిదిద్దెననుట ఉచితము. నాటకము నీతడు చూచి యుండు ననుకొనుటలో దొసగు లేదు.

ఉపయుక్త గ్రంథ నిర్దేశము :


1. పై కథ శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారి వ్యాఖ్యానముతో ప్రభావతీ ప్రద్యుమ్న పీఠిక నుండి గ్రహింపబడినది.
   పుట — 9-17 వఱకు. వెంకట్రామ గ్రంథమాల ప్రచురణ 1962.
2. M. Krishnamachariar. History of sanskrit literature P. 648
3. వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి. ఆంధ్ర ప్రద్యుమ్నాభ్యుదయము నివేదన — పుట 11
4. కళాపూర్ణోదయము ఆ. 2 118 – 164

# 8. శ్రీ వాసవదత్తా వత్సరాజము

—శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రి

సంస్కృత మూలములు :

1. భాసుని ప్రతిజ్ఞా యౌగంధరాయణము
2. భాసుని స్వప్న వాసవదత్తము

శ్రీ వాసవదత్తా వత్సరాజమను ఆధునిక ప్రబంధమును రచించిన వారు శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు.[1] వీరు, భాసుని ప్రతిజ్ఞా యౌగంధరాయణము, స్వప్నవాసవదత్తము అను రెండు నాటకములను మూలముగా గ్రహించి యీ ప్రబంధము రచించియున్నారు.

సంస్కృత మూలములు :

సంస్కృత నాటక రచయితలలో భాసు డగ్రగణ్యుడు. భాసుని నాటక చక్రముగా పేర్కొనబడుచున్న పదుమూడు నాటకములును ప్రసిద్ధములే అయ్యును వానిలో స్వప్న వాసవదత్తము విశిష్టమైనదిగా నెన్నబడుచున్నది. భాసుని ప్రతిజ్ఞా యౌగంధరాయణ స్వప్నవాసవదత్తములందు వత్సరాజగు ఉదయనుడే నాయకుడు. అతని కథ మనోజ్ఞమైనది అందుచేతనే లోకే హారిచ వత్స రాజ చరితమ్" అని హర్షుడు చెప్పి యున్నాడు.

ప్రతిజ్ఞా యౌగంధరాయణము యౌగంధరాయణుని ప్రతిజ్ఞ నధికరించి వ్రాయబడిన నాటకము. కౌశాంబీ నగరమును పాలించు ఉదయన నృపాలుడు మృగయా వినోదమునకై నాగవనమున కరిగెను. అచట నాతడు కపట గజమును చూచి ఆకృష్టుడై దాని వెంటబడి వైరులచే పట్టువడెను. ఇట్లాతని మోసగించినది ఉజ్జయినీ రాజగు మహాసేనుడు. ఉదయనుడు బందీకృతుడైన వార్త విని ఆతని మంత్రి యౌగంధరాయణుడు, తాను ప్రాణములను బణముగా నొడ్డియైనను ప్రభువును విడిపింతునని ఉదయనుని తల్లికి ధైర్యము చెప్పుచు ప్రతిన చేసెను. మహాసేనుని కుమార్తెయగు వాసవదత్తపై ఉదయనుడు అనురాగము

కలిగి యున్నాడనియు, వాసవదత్త లేకుండ తమ ప్రభువు బంధమోక్షమున కిచ్చగింపడనియు ఎఱింగిన యౌగంధరాయణుడు తమ స్వామిని వాసవదత్తా సహితముగ గొని తెచ్చుటకు నిశ్చయించెను. అతడు వైరుల యుక్తికి ప్రతియుక్తి చేసి తన ప్రతినను నెఱవేర్చెను.

స్వప్న వాసవదత్తము, స్వప్న దృష్టయగు వాసవదత్త నధికరించి రచింపబడిన నాటకము. ఈ స్వప్న వృత్తాంతము భాసుడు కల్పించినది. ఇందు వత్సరాజగు ఉదయనుడు దర్శక మహారాజ సోదరి యగు పద్మావతిని పరిణయమాడిన కథ గలదు.

భాసుని ప్రతిజ్ఞా యౌగంధరాయణ స్వప్నవాసవదత్త నాటకములకు మూలము బృహత్కథ. ఈ రెండు నాటకములును కథాంశమునందు పరస్పర సాపేక్షములై ఒకే నాటకమువలె నుండును. ప్రతిజ్ఞా నాటకమున సూచ్యప్రాయముగా నున్న వాసవదత్తా వత్సరాజుల ప్రణయ గాథ స్వప్న వాసవదత్త నాటకమునం దతి రమణీయముగా వివరింపబడినది. ప్రతిజ్ఞా నాటకము నందలి తృతీయాంకమున వసంతకుడాడు మాటలను బట్టి వత్సరాజు వాసవదత్తను తొలిసారిగా చూచి ఆమెపై మరులు గొనినాడని తెలియనగును. నాల్గవ యంకమున భరతరోహకుని భాషితములచే వాసవదత్త అగ్నిసాక్షికముగా ఉదయనునకు శిష్యురాలుగా సమర్పిపబడినదియు అటుపై ఆమెను ఉదయనుడు హరించెననియు తెలియనగును. స్వప్నవాసవత్తమున నాయకుని మాటలలో, అతని యెడ నాయికకు గల ప్రణయ మిట్లు వివరింపబడినది.

బహుశోఽప్యుపదేశేషు యథా మామీక్షమాణయా
హస్తేన స్రస్త కోణేన కృత మాకాశ వాదితమ్ 5-6

వీణ నేర్చెడు వేళలందు, వాసవదత్త, ఉదయనుని మోమును జూచుచు వివశయై వాద్యకోణములను విడిచి, వట్టి బయలున వాయించు చుండెడిదట. ఉదయనునితో తా నేగుచున్నప్పుడు వాసవదత్త స్వజన విరహక్లేశము నొందినది.

స్మరా మ్యవంత్యాధి పతేః సుతాయాః
ప్రస్థాన కాలే స్వజనం స్మరంత్యాః

బాష్పం ప్రవృత్తం నయనాంత లగ్నం
స్నేహాన్మమై వోరసి పాతయంత్యాః 5—5

ప్రతిజ్ఞ యందలి ఉదయనుని ప్రేమకథ ఇట్లు స్వప్న నాటకమున రస వత్తరమైనది. ఇక ప్రతిజ్ఞా యౌగంధరాయణమున, వాసవదత్తా వత్సరాజుల చిత్రఫలకములకు వివాహము జరిపించుట యొక్క ప్రయోజనము స్వప్న వాసవదత్తమున సిద్ధించినది. ఆ చిత్ర పటమునందలి వాసవదత్త రూపము, తన కడ న్యాసముగా నుంచబడిన అవంతికను బోలుటనుబట్టి పద్మావతి వాసవ దత్తయే అవంతిక అని అనుమానించినది. పిమ్మట ఉదయనుడు వాసవదత్తా యౌగంధరాయణులను కలసికొనెను.

భాసుని నాటక రచనా శిల్పము సాటిలేనిది. మాళవికాగ్ని మిత్రమున కాళిదాసు కూడ నీతని పేర్కొని యుండెను. ఈతడు తన నాటక కథలను బృహత్కథ నుండి గ్రహించియు, వానిలో నాటకోచితములగు పెక్కు మార్పు లను గావించెను. ప్రతిజ్ఞా నాటకము భాసుని వస్తు సంవిధాన వైదగ్ధ్యమును చాటుచుండ. స్వప్న వాసవదత్తము అతని సన్నివేశ కల్పనా సమర్థతను, మృదు మధుర సంభాషణ రచనా కౌశలమును, ఉత్తమ కవితాశక్తిని చాటు చున్నది.

ప్రతిజ్ఞా నాటకమున నాయికా నాయకులగు వాసవదత్తా వత్సరాజులు రంగమున కందెచటను కానరారు. కాని వారి గుణశీలాదులు రూప లావణ్యాదులు, భాసుని ప్రతిభ మూలమున, కనుల ముందు ప్రత్యక్షములై వారియందు ఆత్మీ యతా భావము నేర్పఱుచును. ఇందలి యౌగంధరాయణ పాత్రమును ఈతడు తీర్చిదిద్దిన తెఱంగు అద్వితీయము. స్వప్న వాసవదత్తములోని స్వప్నసన్నివేశ కల్పన మాతని కీర్తికి పతాకవంటిది. దీనివలన కథా ప్రయోజన మన్నివిధముల సిద్ధించినది. వాసవదత్త జీవించియే యుండునని, ఉదయనుని హృదయాంత రాంతరములం దెచటనో యున్న ఆశ ఈ స్వప్న ఘట్టముచే చిగిరించినది. ఈ యాదృచ్ఛిక ఘటనమున వాసవదత్తకు ప్రియదర్శన స్పర్శన భాగ్యము కలుగు టయేకాక పద్మావతీ పరిణయముచే, భర్తకు తనపై అనురాగము తగ్గలేదని కూడ ప్రత్యక్షముగ బోధపడినది అమె ప్రవాస క్లేశమంతయు అపుడు ఫల వంతమైనది. ఈ నాటకమునందు ముఖ్యపాత్రములైన పద్మావతీ వాసవదత్త లకు ప్రణయ కారణమున నెట్టి విరోధమును ఏర్పడి యుండలేదు. ఉదయనుడు

వాసవదత్తను అనుక్షణము స్మరించుచునే పద్మావతిని గూడ గారవించెను. వాసవదత్త ఉదయనుడు పద్మావతిని పెండ్లాడినందున వాసవదత్త ఎట్టి మాత్సర్యమును పొందలేదు. కాని తన మగనికి తనపై ప్రేముడి కలదో లేదో అను శంకతో నిజమును పరీక్షించుచునే యుండినది. భర్త వాసవదత్త పైనే అనురాగము కలిగిన వాడేమో యని నడుమ నడుమ సందేహించునట్టి దయ్యును పద్మావతి, వాసవదత్త సుగుణ సంపదను స్మరించుచు ఆమెను సమ్మానించినది. ఇట్టి నాటకీయతా కౌశలము భాసుని కొక్కనికే అబ్బినదని చెప్పుటలో అతిశయోక్తి లేదు. ఈ నాటకమున వాసవదత్తాపాత్ర పోషణము ప్రశంసాపాత్రము.

శ్రీ వాసవదత్తా వత్సరాజము నాంధ్ర కావ్యమున తొమ్మిది సర్గము లున్నవి. ఈ కావ్యము నిర్వచనము దీనిని కవి తనకు గురు సదృశులగు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవుల కంకితము చేసెను. కవి పూర్వ కవిస్మరణమున కాళిదాసాది సంస్కృత కవులకును, నన్నయాద్యాంధ్ర కవులకును మ్రొక్కుచు, వారితోపాటు ఆంగ్లకవి షేక్స్పియరును గూడ పేర్కొని తన యాధునికతను చాటెను.

అనువాద పద్ధతి :

కవి తన కావ్యమునకు మూలమును, తన రచనా పద్ధతిని, పీఠికలో నిట్లు పేర్కొనెను.

ఉ. "భాసుని నాటకద్వయ ప్రవర్తిత గాథను స్వీకరించి, చే
తో[2] సముదంచితంబగు మృదూక్తుల నూతన కల్పనంబులం
జేసి రచించి నాడ రస చింతన యోగ్యులు మోదమందగా
[3]వాసవదత్త వత్సనరపాలుర జీవితగాథ నెంతయున్".

పై పద్యమున కవి పేర్కొనిన విధముగా ఈ కావ్యమున నూతన కల్పనము అధికముగా గోచరించును. దీని నొక స్వతంత్ర కావ్యమని చెప్పినను దోసంగు లేదు. కవి మూల భాషానుసరణమునకు ప్రాధాన్యమీయ లేదు. కథలను మాత్రము సూత్ర ప్రాయముగ గ్రహించుచు తన్నిర్వహణమున స్వేచ్ఛావృత్తి వహించి, సంప్రదాయానుగుణముగ ఈ ప్రబంధమును రచించెను.

ఈ ప్రబంధమున గల తొమ్మిది సర్గములలో మొదటి ఆరు సర్గముల యందును ప్రతిజ్ఞా యౌగంధరాయణము నందలి కథయు మిగిలిన మూడు సర్గ

ములలో స్వప్న వాసవదత్తము నందలి కథయు ననుసరింపబడినవి. స్వప్న వాసవదత్తము నందలి కథ ననుసరించుటలో కంటె ప్రతిజ్ఞా నాటకకథ ననుస రించుటలో కవి పెక్కు వర్ణనములను, కల్పనములను చేర్చి యుండెను, స్వప్న వాసవదత్త నాటక కథలోని ముఖ్యాంశములను మాత్రమే గ్రహించి కవి వానిని విస్తరించెను.

అమూలక కల్పనలు ;

ఈ కావ్యమునందలి ప్రథమ సర్గమును, తృతీయ, చతుర్థ, నవమ సర్గ ములను పూర్తిగా కవి కల్పితములే అని చెప్పనగును. ప్రథమ సర్గమున శిల్పి వృత్తాంతమును, ఆతడు వాసవదత్త ప్రతిమను జేసి ఉదయనుని కడకు తెచ్చుట అను ఘట్టమును అమూలకములు. ఈ కల్పనము వలన రాజునకు వాసవదత్తపై, ఆమెను ప్రత్యక్షముగ జూడక మునుపే అనురాగము పొడమినది. అతని హృద యమున పొడమిన యీ అనురాగబీజము చతుర్ధ సర్గమున ఫలవంతమైనది. పట్టువడిన వత్సరాజు యోగక్షేమము లరయుటకు ప్రద్యోతనుడు వాసవదత్త అనుంగు చెలియగు కాంచనమాలను నియోగించుట, ఆమె వత్సరాజునకు నచ్చ జెప్పి వాసవదత్తను శిష్యురాలుగా గ్రహించునట్లు చేయుట, భద్రవతి విజృంభింప ప్రద్యోతనుడు దాని నంకుశవశ్యను గావించిన వానికి తన కొమార్తె నిచ్చెదనని పల్కుట, మున్నగు కల్పనము లు ప్రబంధోచితములై ఒప్పుచున్నవి.

విస్తరణము :

మూలమున సంక్షిప్తములై, కథలో ప్రాధాన్యముకల అంశములకు కవి కావ్యానుకూలములగు పెక్కు వర్ణనములను జోడించి, తన వర్ణనాభినివేశమును జాటుకొనెను. ఈ కావ్యము నందలి నవమ సర్గమునకు కథతో నెట్టి సంబంధ మును లేదు. ఇందు యౌగంధరాయణుడు ఉదయనునకు జ్ఞానోపదేశము నొసంగు వృత్తాంతము గలదు. కవి తన ప్రబంధమును నాయక గుణ వర్ణన ముతో నారంభించెను. గజముల వేటకాడొక దేతెంచి నాగవనము నందలి గజ ముల విభవమును గూర్చి ఉదయనునకు చెప్పి అతనిలో మృగయోత్కంఠ జనింపజేయుట, మృగయాసంరంభము, వేట వర్ణనము, ఈ కవిపై పూర్వ ప్రబంధ కవుల ప్రభావమును జాటుచున్నవి. ప్రథమ సర్గము నందలి శిల్ప సుందరి వర్ణనము, చతుర్థసర్గము నందుగల వాసవదత్తా వత్సరాజుల శృంగార

ముతో గూడిన శైషోపాద్యాయిక, సప్తమ సర్గము నందలి సంభోగ వర్ణనము, అదే సర్గలో ఇరువది నాల్గుమొదలు నలువది మూడవ పద్యము వఱకు సాగిన నాయక విప్రలంభము, మున్నగునవి కవి కావించిన వర్ణనములలో నెన్నదగినవి. అతడు కేవల వర్ణనా కౌతుకమున గావించిన వర్ణనములలో షష్ఠసర్గమున మహా సేనుడు రాణికి బోధించిన అనునయ వాక్యములు అష్టమ సర్గమునందలి తిరుపతి యాత్ర మున్నగునవి ఉదాహరణములు.

మార్పులు :

ఈ కవి మూలకథకు కొన్ని మార్పులను చేసెను. అవి కథా ప్రయోజనమును సిద్ధింపజేయునట్టివి కాకున్నను ప్రబంధమునకు నవ్యత్వమును సంతరించుచు కవి ఉచితజ్ఞతను చాటుచున్నవి. మూలమున ప్రతిజ్ఞా నాటకమున ఉదయనుడు ఉజ్జయినీ సైనికులతో పోరి మూర్ఛ నొంది, ప్రత్యాగత చైతన్యుడైన పిదప. ఆతనిని మంత్రి శాలంకాయనుడు మేనాలో కూర్చుండబెట్టి, ఉజ్జయినికి కొనిపోయినట్లు కలదు. ప్రబంధమున రాజు మూర్ఛితుడై యుండగా మహాసేనుని భటులాతనిని కొనిపోవుట ఉచితతరమై నాయకుని ధీరోదాత్తతను పోషించుచున్నది. నాటకమున, ఉదయనుని పట్టి తెచ్చుటలో మహాసేనునకు గల ఆశయము, ఆతని మదిలోనే గుప్తముగ నుండెను. ప్రబంధమున ఉదయనుడు పట్టువడినాడనిన వార్త వినినంతనే మహాసేనుడు,

"ప్రతిన నెఱవేర్చి కోరిన వరుని దెచ్చె।
భరతరోహకామాత్య శేఖరుడు బలిమి"

అని పొంగి పోయెను. ప్రబంధమున, వాసవదత్తా వృత్తాంతమును సర్వమును ఎఱింగియే దర్శకుడు ఉదయనునకు తన సోదరి నిచ్చినట్లు గలదు. (vii–45)

కవి విడిచిన సన్నివేశములు :

నాటకమున కపట గజవృత్తాంతమును యౌగంధరాయణుడెఱిగి, ఉదయనుని రక్షింప యత్నించును. ఆ వృత్తాంతము తెలుగు కావ్యమున లేదు. ఇందుదయనుని బంధించుటలో శాలంకాయనుని ప్రసక్తి లేదు. యౌగంధరాయణుడు వ్యాసభట్టారకా దేశమున ఉన్మత్త వేషము గ్రహించుట యిందు పరిహరింపబడినది. రాజును కపట గజము వెంట ఒంటరిగా పోరాదని, మంత్రి

రుమణ్వంతుడు ప్రార్థించుట ఇందు లేదు. వేటకు వెడలినపుడు రుమణ్వంతుడు రాజు ననుసరించినట్లు పేర్కొనబడలేదు, యౌగంధరాయణుడు ఉదయన బంధవిముక్తికై రుమణ్వద్విదూషకులతో పన్నిన వ్యూహము చెప్పబడలేదు. ప్రతిజ్ఞా నాటకము నందలి విదూషకుడు ప్రబంధమున లేడు. అతడు స్వప్న నాటకానుసరణమున, ఒకే ఒక పర్యాయము పేర్కొనబడినాడు. ఇంకను పెక్కు మూల పాత్రములు తెలుగున విడువబడినవి. కవి మూలము లందలి పెక్కు రమణీయ ఘట్టములను సైతము విడిచి వైచెను. అందుచేతనే నాటకములలోని, ముఖ్యముగా స్వప్న నాటకములోని సౌందర్యము కావ్యమున లోపించినట్లు కొనవచ్చును. ప్రథమాంకమున వత్సరాజుపై ఉజ్జయినీ సైనికులు దౌర్జన్యము గావించు నంశమును వదలి వైచుటకూడ ఉచితముగా నున్నది.

కవి మూలభావము ననుసరించిన పట్లు స్వల్పములు. ఆ సందర్భము లందు అనువాద మిట్లు సాగినది.

"ఏవం రుధిరదగ్ధాంగం వైరం నియమ మాస్థితమ్" 4-15

(వైరంనియమం=వీర సంబంధి సముదాచారమును; గురోః
అవజితం=జనకు నవమానించిన వానిని; ద్రౌణిం=అశ్వత్థామను)

తే. అనుడు యౌగంధరాయడు వినిచె "కనవొ
శాత్రవుల నెల్ల పరిమార్చి సమర మందు
ప్రతిన నెఱవేర్చి కొన్నట్టి ద్రౌణి వోలె
మున్న రక్త సిక్తాంగుని నన్ను" ననగ 6-22

భరతానాం కులే జాతో వత్సానామూర్జితః పతిః
అకృత్వా దారనిర్దేశ ముపదేశం నకరిష్యతి 4-17

(భరత కులమున జనించినవాడును, వత్సదేశమునకు రాజును అయిన ఉదయనుడు భార్యగా గ్రహింపకుండ కన్యకుపదేశ మొనరింపడు)

తే. భరత వంశాబ్ధి జాతుడై వన్నెకెక్కి
కలుకు లేత వయసు దాని కోమలాంగి
రాజకన్యకా మణి పాణిగ్రహణ మగుచు
దేవిగ గ్రహింప కెటు లుపదేశ మిడును. 6-27

ఇట్లు ప్రతిజ్ఞా నాటకము నందలి చతుర్థాంకమున గల యౌగంధరాయణ భరతరోహక సచివవర్యుల సంభాషణమును అనుసరించుచు కవి మూలభావము లను గూడ కొన్నిటిని గ్రహించెను. స్వప్న వాసవదత్తము నందలి ప్రథమాంక మున బ్రహ్మచారి ముఖమున చెప్పబడిన ఉదయన విలాపమును కవి స్వతం త్రముగ విస్తరించి వ్రాసెను.

బ్రహ్మచారి :

"ఇహ తయా సహ హసితమ్, ఇహ తయాసహ కథితమ్. ఇహ తయా సహ పర్యుషితమ్. ఇహ తయా సహ కుపితమ్. ఇహ తయా సహ శయితమ్" ఇత్యేవం తం విలపంతం రాజాన మమాత్యై ర్మహతా యత్నేన తస్మాద్ గ్రామాద్ గృహీ త్వాప క్రాంతమ్"

ఉ. ఇచ్చట జూద మాడితి మృగేక్షణతో నిట విశ్రమించితిన్
ముచ్చట లాడి యిచ్చటనె ముద్దుల గొంటిని, కౌగిలించి, నే
నచ్చపలాక్షి తోడన విహారము సల్పితి వేడ్క మీరగా
నిచ్చలు మీర నిచ్చట భుజించితి షడ్రసపాయసంబుతో.

స్వతంత్రములగు పెక్కు కల్పనములతో గూడిన ఈ ప్రబంధము పూర్వ నాటక కథా రామణీయకమును నిలుపుచునే కవి కావ్య నిర్మాణ సామర్థ్యమును చాటుచున్నది. ఇందలి శైలి సరళమును, సుబోధమునై యున్నది. ఇందు తత్సమ పద ప్రయోగ మధికముగా కనవచ్చును. కవి, సాధ్యమైనంతవఱకు తన కావ్యమును నీతి బోధకము కావింప దలచి పెక్కు సుభాషితములను జొప్పించెను. ఇందచ్చ టచ్చట సంధి సమాస దోషములు కనవచ్చు చున్నవి. మెచ్చంనెల్లరున్ (7- 8) రుమణ్వంతాది (7—23) (రుమణ్వాదాది) ప్రద్యోతన మహిపాలుడు (8-45) ఇచ్చట ప్రలమవుగా భావింపబడినది. కాంతివంతులే (3-55) మున్నగునవి యుదాహరణములు.

ఉపయుక్త గ్రంథ నిర్దేశము :

1. వీరు మద్రాసు విశ్వకళా పరిషత్తున ఆంధ్ర శాఖాధ్యక్షులుగా పనిచేసి పదవీ విరమణము కావించిన వారు. శ్రీ వాసవదత్తా వత్సరాజము యొక్క ముద్రణకాలము ఆగష్టు 1973
2. చేతస్సముదంచితమనియు
3. వాసవదత్త వత్సనలపాలుర అనియు చూడదగును.

# ఉ ప సం హా ర ము

సంస్కృతమున నాటక రచనాకళ పరాకాష్ఠ నొందినది. కాళిదాస భవభూత్యాదుల నాటక నిర్మాణ కౌశలము పాశ్చాత్య విమర్శకులకు కూడ నచ్చెరువు కల్గించినది. ఆంధ్ర వాఙ్మయము తొలుత సంస్కృత గ్రంథానువాదములతోనే ఆరంభించినది. నన్నయ తిక్కనాది పూర్వాంధ్ర మహాకవులు కావ్యములలో నాటకమునకున్న విశిష్టతను ఎఱింగిన వారయ్యును సంస్కృత నాటకాంధ్రీకరణమునకు పూనుకొని యుండలేదు. అందు కానాడు తెలుగున నాటకములను ప్రదర్శించుటకు గాని, వ్రాయుటకుగాని తగిన యవకాశములు లేకుండెనేమో అను సందేహము పొడమక మానదు. ఈ కారణముచే తెలుగున క్రీ.శ. 19వ శతాబ్ది మధ్యభాగము వఱకును నిజమైన నాటకము రూపొందకుండుట సంభవించెను.

దక్షిణాంధ్ర యుగమున యక్షగానము లనబడు దేశీయ రూపకము లసంఖ్యాకములుగా రచింపబడినవి కాని వానికిని సంస్కృత నాటకములకును ఎట్టి సాదృశ్యము కనబడదు. అవి సంస్కృత నాటకముల ప్రభావమున రచింపబడినవి కావనుటలో విప్రతిపత్తి లేదు. పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో నాటక ప్రసక్తి తెచ్చెను కాని ఆతడు పేర్కొన్న యా నాటకము లెట్టివో, యెట్లు ప్రదర్శింపబడెనో తెలిసికొనుట కాధారములు లేవు. శ్రీనాథుడు రచించిన క్రీడాభిరామమునకు వీథి నాటకమను పేరున్నది. అతడు దానిని సంస్కృతమున రావిపాటి త్రిపురాంతకుడు రచించిన ప్రేమాభిరామము ననుసరించి వ్రాసెనని విమర్శకులు చెప్పుదురు. ప్రేమాభిరామము లభ్యము కానందున ఆ రెంటికిని గల సంబంధము తెలిసికొనుటకు వీలులేకపోయినది. ఆ సంబంధ మెట్టిదైనను క్రీడాభిరామము శ్రవ్యరూపముననే రచింపబడినది.

శ్రీనాథునికి ముందును వెనుకను గూడ కొందఱాంధ్ర కవులు సంస్కృత నాటకము లందలి సౌందర్యముచే నాకర్షింపబడి వానిలో కొన్నిటి నాంధ్రమునకు తెచ్చుటకై యత్నించిరి. ఆ యత్నములో వారు సంస్కృత నాటకముల రూపమును మార్చి తమ రచనలకు ప్రబంధరూపము నొసంగి యుండిరి. వారట్లెందుకు చేసిరా యని మన కిప్పు డాశ్చర్యము కల్గును. ఆ కాలమున నాటకమును నాటకముగా వ్రాయుటకు దగిన అవకాశమును, ప్రయోజనమును లేకపోవుట చేతనే వారట్లు కావించి యుండిరి. మఱియు సంస్కృతము నందలి నాటకములు

కొన్ని నాటక రూపమున వ్రాయబడినను ప్రయోగమున కనువైనవి కావు. పద్యముల బాహుళ్యము చేతను, ప్రౌఢమైన శైలిచేతను, అవి రూపమున నాటకములే అయ్యును స్వభావముచే శ్రవ్యముల వలెనే కన్పించును. ఈ పరిస్థితికూడ, కొందఱు నాటకములను ప్రబంధములుగా వ్రాయుటకు ప్రేరణ కల్గించి యుండును. ప్రబోధ చంద్రోదయము, అనర్ఘ రాఘవము, ప్రసన్న రాఘవము, విద్ధ సాలభంజిక, సాహిత్య దృష్టితో పరికించినపుడు మహత్తరములైనను, ప్రయోగానుకూలములైన దృశ్యకావ్యములుగా వానికెట్టి ప్రాముఖ్యమును లేదు. మూలములు కూడ చదువునప్పుడు శ్రవ్యకావ్యము లేమో అను భ్రాంతిని కల్గించును. పిల్లలమఱ్ఱి పినవీర భద్రుడొక్కడు మాత్రము శృంగార శాకుంతలమున అభిజ్ఞాన శాకుంతలము నందలి కొన్ని శ్లోకముల ననువదించినను, దానినంతను యథాతథముగా అనుసరించి యుండలేదు. పైగా శాకుంతలమునకు ప్రయోగానుకూల్యము లేదని చెప్పుట సాహసము. అందుచే అత డందలి కొన్ని సన్నివేశములను శ్లోకభావములను గ్రహించుటకు వానియందలి మనోజ్ఞతయే కారణమని భావింపవలెను. మంచన కేయూర బాహుచరిత్రమున పాత్రల నామములు మార్చుటయే కాక పంచతంత్ర హితోపదేశాదుల నుండి కొన్ని కథలను గూడ గ్రహించి అందెడనెడ చొప్పించి యుండెను దీనినిబట్టి అతనికి శ్రవ్య ప్రబంధమును వ్రాయవలెనను అభిలాషయే ఎక్కువగా నుండెనని భావింపవలసి వచ్చెను.

సంస్కృత నాటకములను ప్రబంధ రూపమున రచించిన పై కవులు తమ రచనలలో నెట్టి మార్పులు కావించిరో, అనువాదవిధానమున, మార్పు చేర్పు లెచ్చటెచ్చట కలిగించిరో పరిశీలించుట ఈ సిద్ధాంతవ్యాసము యొక్క ముఖ్యోద్దేశము, ప్రబంధ (కావ్య) రూపము నొందిన అట్టి రచనలను మూలములతో పోల్చుటకును, ఆ యా కవుల రచనా విధానములను పరిశీలించుటకును నిందు ప్రయత్నము చేయబడినది.

పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నమున దృశ్యకావ్యరీతుల నెన్నింటినో ప్రదర్శించి యుండెను. ఆ ప్రబంధ రచనమున సంస్కృతమున రవివర్మ భూపాలుడు రచించిన ప్రద్యుమ్నాభ్యుదయ నాటకము యొక్క ప్రభావము కొంత కలదని విమర్శకు లూహించిరి. కాని ఆ ప్రభావము అత్యల్పము. ఇరు

వుర కవులును హరివంశము నుండియే కథను గ్రహించి ఇచ్ఛ వచ్చినట్లుగా తమ రచనలను సాగించిరి.

ఆధునికులు కూడ కొందఱు సంస్కృత నాటకములను ప్రబంధములుగా రచించుటకు ప్రయత్నించిరి. అట్టివారు ఇరువురు, మూవురు కంటె నెక్కువ లేరు. నిజముగ నాధునిక కాలమున నాటకములను నాటకముగనే వ్రాయ వచ్చును. వారు మూల గ్రంథముల రూపమును మార్చుటకు కారణము కన్పట్టదు. అందుచే వారు సంస్కృత నాటకము లందలి కథను, భావములను గ్రహించి యున్నను, శ్రవ్య కావ్యమును రచింపవలెనను సంకల్పము తోడనే అట్లు కావించిరని తలంపవలయును.

నాటకము 'సమాహార కళ' యని చెప్పుదురు. అందు లలితకళ లన్నింటి యంశములును కానబడును. రూప ప్రయోజనము లెట్లున్నను నాటకములు కూడ సాహిత్యము నందలి ప్రక్రియలే. వానికిని శ్రవ్య కావ్యములకును, కొన్ని భేదములున్నను, సామ్యములు కూడ లేకపోలేదు. అందుచే నాసిద్ధాంత వ్యాసము ప్రథమ భాగమున నాటకములకును ప్రబంధములకును గల సామ్య వైషమ్యములు, నాట్యోత్పత్తి, శ్రవ్య కావ్యములందలి నాటకీయత మున్నగు విషయములు ఉపోద్ఘాత రూపమున వ్రాయబడినవి. కొందఱు కవులు నాటకముల రూపమును మార్చినను వానిని పూర్తిగా అనువదించి యుండుటచే ఆంధ్రము నందలి అనువాద పద్ధతులు కూడ సంగ్రహముగా పరిశీలింపబడినవి. కొన్ని సంస్కృత నాటకములు ప్రబంధ రూపమును పొందింపబడి యుండిన కారణమున సంస్కృత నాటక వాఙ్మయమున ప్రసిద్ధులైన నాటక కర్తలను గూర్చియు వారి రచనలును గూర్చియు కూడ నొక అధ్యాయమున వ్రాయబడినది. మొదటి భాగమంతియు నుపోద్ఘాత రూపము. రెండవ భాగము సిద్ధాంతవ్యాసము నందలి ప్రధాన విషయము. నేను తలపెట్టిన ఈ కార్యమున నెంతవఱకు కృతార్థత నొంద జాలితి ననుట విషయమునకు సహృదయులైన పండితులే ప్రమాణము. అధ్యాయము లన్నింటి చివరను వానిని రచించుటలో పరిశీలింపబడిన సంస్కృతాంధ్రాంగ్ల గ్రంథముల నామము లొసంగబడినవి.

## ఉపయుక్త గ్రంథ సూచి :


1. అనర్ఘరాఘవము - పరిష్కర్త, కేశవపంతుల నరసింహశాస్త్రి 1977
2. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము సంపుటములు 2, 6, 7
తెలుగు భాషా సమితి - 1960-62
3. ఆంధ్ర కవితరంగిణి 11 సంపుటములు 1947-58
4. ఆంధ్రకవుల చరిత్రము - 3 భాగములు కె. వీరేశలింగంపంతులు 1898
5. ఆంధ్రవాఙ్మయ చరిత్ర - దివాకర్ల వెంకటావధాని 1972
6. ఆంధ్ర నాటక పితామహుడు - దివాకర్ల వెంకటావధాని 1972
7. ఆంధ్ర డ్రామాటిక్ ఆర్ట్ - శిష్ట్లా రామకృష్ణశాస్త్రి
8. ఆంధ్ర సాహిత్య సంగ్రహ చరిత్ర-వారణాసి వెంకటేశ్వర్లు
9. ఆంధ్ర సాహిత్య చరిత్ర - పింగళి లక్ష్మీకాంతం 1974
10. ఆంధ్ర సాహిత్య దర్పణము - వేదము వెంకటరాయశాస్త్రి 1985
11. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము - చెలమచెర్ల రంగాచార్యులు 1944
12. ఆంధ్ర నాటకరంగ చరిత్ర - మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి 1969
13. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము సంపుటి 2 - కొమఱ్ఱాజు లక్ష్మణరావు 1916
14. అప్పకవీయ భావప్రకాశిక - రావూరి దొరస్వామిశర్మ 1967
15. ఆంధ్ర మహాభారతము-ఆది అరణ్య విరాటపర్వములు -
ఆంధ్ర సాహిత్య అకాడమి
16. ఆంధ్ర దశరూపకము - మల్లాది సూర్యనారాయణశాస్త్రి 1967
17. ఆంధ్ర ప్రద్యుమ్నాభ్యుదయము - పీసుపాటి విశ్వేశ్వర శాస్త్రి
18. అద్వైత కావ్యములు -- ఎ. పరబ్రహ్మ శాస్త్రి; అముద్రితము

ఉషఃకిరణాలు - యండమూరి సత్యనారాయణ 1960
ఉత్తర హరివంశము - వేటూరి ప్రభాకర శాస్త్రి-పీఠిక
కావ్యాలంకార సంగ్రహము - సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి 1965
కేయూరబాహు చరిత్ర - సంపా. గడియారము రామకృష్ణ శర్మ 1966
కేయూరబాహు చరిత్ర - కొచ్చెర్లకోట వెంకట రామకృష్ణారావు 1902
కేయూరబాహు చరిత్ర - ఆచార్య పి. కోదండరామయ్య 1960
కొందఱు తంజావూరు తెలుగు పండితులు - కురుగంటి సీతారామయ్య
క్రీడాభిరామము - వేటూరి ప్రభాకర శాస్త్రి-పీఠిక 1928

కేయూరబాహు చరిత్ర - వేదము వెంకటరాయ శాస్త్రి
క్రీడాభిరామము - ఎమెస్కో 1972
కళాపూర్ణోదయము - వావిళ్ళ 1968
కవిరాజ శిఖామణి - సంపా. ఆచార్య టి. కోదండరామయ్య 1960
కుమార సంభవము - వావిళ్ళ 1969
గౌతమ వ్యాసములు - పింగళి లక్ష్మీకాంతం 1964
కేతన - డా. శివకుమార్
కర్ణాటకాంధ్ర సాహిత్య చరిత్ర - ఆర్. ఎస్. ఎన్. రాజు 1976
చాటుపద్య మణిమంజరి - వేటూరి ప్రభాకర శాస్త్రి
తెలుగు నాటక వికాసము - పోణంగి శ్రీరామ అప్పారావు 1967
నాట్య శాస్త్రము - పోణంగి శ్రీరామ అప్పారావు, విళంబి పుష్యము
నాట్యవేదము - జమ్ములమడక మాధవరాయ శర్మ 1879 శాలి
నృసింహ పురాణము - ఆం. ప్ర సా. అ.
నన్నెచోడుని కవిత్వము - వేదము వెంకట్రాయ శాస్త్రి 1959
ప్రసన్నరాఘవ నాట్యప్రబంధము - సంపా. డా. బి. రామరాజు 1962
ప్రభావతీ ప్రద్యుమ్నము - ఎమెస్కో 1970
ప్రభావతీ ప్రద్యుమ్నము - పీఠిక-వెంపరాల సూర్యనారయణ శాస్త్రి 1962
ప్రభావతీ ప్రద్యుమ్నము - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి 1966
ప్రబోధ చంద్రోదయము - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి 1976
ప్రబోధ చంద్రోదయము - చింతామణి ముద్రాక్షర శాల 1900
ప్రబోధ చంద్రోదయ ఆంధ్రీకరణము - వద్దాది సుబ్బారాయుడు
ప్రబోధ చంద్రోదయ ఆంధ్రీకరణము - గట్టి లక్ష్మీనరసింహ శాస్త్రి
ప్రబంధ వాఙ్మయ వికాసము - పల్లా దుర్గయ్య 1978
పిల్లలమర్రి పినవీరభద్రకవి - పల్లా దుర్గయ్య
పోతన - నిడదవోలు వెంకటరావు
భరతాభ్యుదయము - మాడభూషి వేంకటాచార్యులు 1891
భీమేశ్వర పురాణము - వావిళ్ల 1967
భారతీయ తత్త్వశాస్త్రము (Indian Philosophy)-బులుసు వెంకటేశ్వర్లు 1954
వాసవదత్తా వత్సరాజము - శిష్టా రామకృష్ణ శాస్త్రి 1978
విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయ చరిత్ర- దేవుమళ్ల అచ్యుతరావు

